ఆంధ్రగ్రంథమాల : ౨౨

# AUTOBIOGRAPHY:

R. Venkata Sivudu, M. A., L. T.,
GUNTUR



# ఆత్మచరిత్రము

గ్రంథకర్త:

రాయసము వెంకటశివుఁడు, యం. ఏ., యల్. టి.,

గుంటూరు.

ఆంధ్రపత్రికా ముద్రాలయము : మద్రాసు

౧౯33

 [వెల ౧ రూపాయి

ఆంధ్రగ్రంథమాల : ౨౨

# AUTOBIOGRAPHY:

R. Venkata Sivudu, M. A., L. T.,
GUNTUR



# ఆత్మచరిత్రము

గ్రంథకర్త:

రాయసము వెంకటశివుఁడు, యం. ఏ., యల్. టి.,

గుంటూరు.

ఆంధ్రపత్రికా ముద్రాలయము : మద్రాసు

౧౯33

 [వెల ౧ రూపాయి

# అంకితము

కష్ట సుఖములందు ♦ కలిమిలేములయందు
మించు నెయ్యమునను ♦ మెలఁగుచుండి,
పగలు రేయి యనక ♦ బ్రదుకు చావు ననక
మఱపులేని ప్రేమఁ ♦ బఱపుచుండి;
అవనిసుఖము కొంద ♦ ఱందుచు నున్నారు,
కొంద ఱమిత బాల్య♦మందె చనిరి;
అట్టి నాయనుజుల ♦ కనుఁగుఁజెల్లెండ్రకు
నంకితంబు సేతు ♦ నధిక ప్రేమ.



౧౯33. రాయసం వెంకటశివుడు, రత్నమ్మయును

# ప రి చ య వా క్య ము

ఆత్మచరిత్రలు, ఆత్మకథలు, స్వీయచరిత్రలు సకల జనులకును సహజములు. జీవయాత్ర మానవులకు పురుషార్థసిద్ధికి సాధనము. జీవయాత్రయందు జన్మసంస్కారము కర్మసంస్కారమూలమునను, ధర్మసంస్కారసాధనమునను పరిపక్వము నొందుచు, పురుషార్థమునకు సాధనమగుచున్నది. ప్రపంచమునందు కులీనులు, శ్రీమంతులు, బలవంతులు, పండితులు, వీరులు, శాస్త్రజ్ఞులు, మతాచార్యులు స్వీయచరిత్రకథనమున కధికారులుగ పరిగణింపబడుచున్నారు. జీవయాత్రయందు సుఖదుఃఖములు, లాభనష్టములు, జయాపజయములు, రాగద్వేషములు, జాతి కుల మత దశాభేదములును లేక సకలజనులకును సంభవములు. జీవయాత్రయందు సుఖదుఃఖములు, లాభనష్టములు, హెచ్చుతగ్గులు, ప్రియాప్రియములు, జయాపజయములు, ఆనందవిషాదములును, పండితపామరులకు, ధనినిర్ధనులకు, సవర్ణావర్ణులకు, గురుశిష్యులకు, స్వామిభృత్యులకు, స్త్రీపురుషులకు, బాలవృద్ధులకును సహజావస్థలు. సకలజనులును స్వకర్మనిరతు

లై సంసిద్ధిని బడయుట కవకాశములను నధికారమును గలిగియున్నారు.

పరమాణువునుండి పరబ్రహ్మమువరకును వ్యాప్తమైన విశ్వమంతయును విశ్వపరిణామమునకు వినియోగపడుచున్నది. మహాపురుషులజీవితములవలె సామాన్యులజీవితములును విశ్వకల్యాణమునకు మంగళహారతులను సమర్పించుచు విశ్వవికాసమునకు వినియోగపడుచున్నవి. విశ్వయాత్రయందు వ్యక్తులజీవయాత్ర లన్యోన్యాశ్రయములై వికాసమును బొందుచున్నవి.

జీవయాత్రల యుపయోగానుపయోగములు, గుణావగుణములు, మహత్త్వాల్పత్వములును, సాపేక్షములు కాని నిరపేక్షములు కావు. బుద్ధివైభవమునందును, ధైర్యసాహసములందును, గుణశీలములందును, దానధర్మములందును, దైవభక్తియందును, సిరిసంపదలందును, విద్యావినయములందును, ప్రవృత్తినివృత్తిమార్గములందును మానవులకుగల భేదములు సాపేక్షములు. మహాపురుషుల జీవితములందువలె సామాన్యజనుల జీవితములందును సుగుణవిశేషములు సహజములు.

అవకాశాధికారములుగల జనులు వారి జీవిత విశేషములను లోకమునకు విశదపరచుట పురుషలక్ష

ణము. స్వీయచరిత్రకథన మాత్మోద్ధరణమునకువలె పరోద్ధరణమునకును వినియోగపడుచున్నది. సత్యార్థ ప్రకాశమునకును, దురభిమాన దురహంకార నిరసనమునకును, ఆత్మచరిత్రలు కథకులకును, పాఠకులకును సాధనములుగ నున్నవి. విద్యావంతుల చరిత్రములును సత్పురుషుల చరిత్రములును ధర్మాత్ముల చరిత్రములును నధికతరముగ నుపయోగపడినను, సామాన్యులచరిత్రలును నాత్మోద్ధరణమున కుపయోగపడగలవు. శ్రీయుత రాయసం వేంకటశివుడుగా రాత్మచరిత్రారంభమునందు నంతమందును వారి యాత్మచరిత్రయొక్క ప్రయోజనము నిట్లు వ్యక్తముచేసిరి :

"గ్రంథకర్త యేపుస్తకము వ్రాసినను, అది యాతని యాత్మచరిత్రమె యగునని యొక సుప్రసిద్ధ రచయిత నుడివెను. మన రచనములు అద్దములవలె మన యభిప్రాయములను ప్రతిఫలనము చేయుచుండును. మన కాంకిగీతలెల్ల మన జీవితకథనే గీయుచున్నవు, ఎంతజాగ్రత్తతోఁ జిత్రించిన జీవితచరిత్రమునందును, కొంకర గీతలు గానిపించుచునే యుండును! ఇతర రచనములందుకంటె నాత్మకథాసంవిధానమున భ్రమప్రమాదముల తావు దధికముగఁ గానవచ్చును. పరులరూపమును జిత్రించుపట్ల నెంతో నిపుణతచూపు మనవ్రేళ్లు, సొంత ప్రతిమను గీయునపుడు వణకఁజొచ్చును! అహంభావము, పక్షపాతబుద్ధి మున్నగు దుర్లక్షణములు మనల నావేశించి, సత్యపథమునుండి యొక్కొకసారి మనపాదములను పెడదారులఁ బట్టించుచుండును. ఐనను, కోటిలోఁ దల దూర్చినవాఁడు రోఁకటి

పోటులకు వెఱచునా ? తన జీవితకథను ధారాళముగ వినిపింపసాహ సించిన కథకునికి, చిన్నకల్లలచేఁ దన నెరసులు కప్పి పుచ్చనెంచుట సిగ్గులచేటుగదా !

" సత్యప్రకటనమె ముఖ్యావధిగఁ జేకొనిననేను, కీర్తిధనాదుల మీఁదఁ గన్నువేసి, యీ పుస్తకరచనమునకుఁ బూనుకొనలేదు. ఇదివఱలో నాత్మచరిత్రము నాంధ్రమునఁ బ్రచురించిన మద్గురు వర్యులగు కీ. శే. కందుకూరి వీరేశలింగముపంతులుగారి " స్వీయచరిత్ర ము "ను, గాంధీమహాత్ముని " ఆత్మకథ "ను మించనెంచి నే నీ పుస్తకమును వ్రాయలేదు. ఆ గ్రంథకర్తలు మహామహులు నాదర్శపురుషులును. ఒకొ్కకప్పుడు నాబోటి సర్వసామాన్యుని చరిత్రముకూడ సంసారయాత్ర గడపుటయందు కొందఱికి సహాయ కారి కావచ్చుననియె నాయాశయము."

*　　*　　*　　*

" ఇవ్విధమున నా జీవితముగడచిపోయెను. నాకన్నులకె మిగుల లోపభూయిష్ఠముగ నున్న యీ జీవితము, స్వచ్ఛమును నాదర్శ ప్రాయము నని నే నెట్లు మురియఁగలను ? ఐన నీకథ యెవరి కేమాత్ర ముగ నుపకరించినను, నేను ధన్యుఁడను. ముందును దయామయుఁడగు పరాత్పరుని ప్రాఁపె జీవితయాత్రయందు నాకుఁ జేయూఁత యగుఁ గాత !"

పూర్వోదాహృతము లైన భావములు వేంకట శివుడుగారి సౌజన్యమునకును, వినయవివేకములకును నిదర్శనము లైనను, గుణావగుణములనిర్ణయమునకు ప్రమా ణములు కావని ఆత్మచరిత్రము విశదముచేయుచున్నది.

శ్రీయుత రాయసం వేంకట శివుడుగా రాజువేల నియోగిబ్రాహ్మణులు. తండ్రి సుబ్బారాయుడుగారు. తల్లి సీతమ్మగారు. ప్రమోదూత సం. ఆషాఢ బ. ౧౦ శనివారము, కన్యాలగ్నమున, ౧౮౭౦ సంవత్సరము జూలయి ౨౩ తేదిని వేలివెన్నునందు జన్మించిరి. వీరి ౬౩ ఏండ్ల ఆత్మానుభవకథనము పాఠకులకు జీవయాత్రాసేవనమునం దుపచరింపగలదు. గ్రంథకర్త ౬౫౨ పుటలందును విశదపఱచిన ఆత్మోదంత మాంధ్రావనియందును, హిందూస్థానమునందును, ప్రపంచమునందును సంప్రాప్తమగుచున్న భావక్రియా పరివర్తనమును సింహావలోకనము చేయుచు, ధీమంతులకు కర్తవ్యము నుపదేశించుచున్నది. గతించిన రెండు పురుషాంతరములందును నాంధ్రావనియందు సంప్రాప్తమైన సంస్కారాభ్యుదయమును వేంకటశివుడుగారి ఆత్మచరిత్రము సింహావలోకనము చేయుటకు వినియోగపడుచున్నది.

రాజమహేంద్రవర మాంగ్లసామ్రాజ్యస్థాపనానంతర మాంధ్రావనియం దారంభమునందు సాహిత్యవిజ్ఞాన సంస్కారవికాసమునకు కేంద్రస్థానముగ వెలసినది. ఆంగ్ల సంస్కారము ప్రాచీన భారతసంస్కారమును శిథిలము చేసినది. చిరకాలానుగతము లైన మతాచారములు, సాంఘికవ్యవస్థలు, సాహిత్యరచనలు, విద్యావిధానములు,

ఆర్థిక ప్రయోజనములు, రాజ్యాంగనిర్మాణములు శిథిలములై, జీవయాత్రయందు నవీనాదర్శప్రయోజనము లుదయించినవి. దేశమునందు ప్రార్థనాసమాజములు, స్త్రీపునర్వివాహములు, పత్రికాప్రచురణములు, నూతనసాహిత్యరచనలు, ఆంగ్లవిద్యాలయములు, రాజకీయోద్యోగములు, నవీనవృత్తులు, పాశ్చాత్యవిజ్ఞానాభిమానమును నవజీవన నిర్మాణమున కుత్తేజమును గలుగజేసినవి. దేశావ్యాప్తమైన సంస్కారపరివర్తనమునకు శ్రీయుత వీరేశలింగము పంతులుగారి జీవితచరిత్రము ప్రమాణముగ నున్నది. వేంకటశివుడుగారి జీవయాత్రానుసంధానమునకు, కాలమహిమకుతోడు, రాజమహేంద్రనివాసము, విద్యాభ్యాసము, వీరేశలింగము పంతులుగారి సాహచర్యసాంగత్యములు వినియోగపడినవిధమును ఆత్మచరిత్రాంతము విశదముచేయుచున్నది. జీవయాత్రయందాత్మోపలబ్ధికి గృహారంగము బీజము; విద్యారంగము శక్తి; విశ్వారంగము కీలకము. మహాత్ములకువలె సామాన్యులకును నీరంగములు పురుషార్థసిద్ధికి వినియోగపడగల విధమును జీవితచరిత్రములందాత్మచరిత్రము బోధించుచున్నది.

గృహారంగము:—ఆత్మచరిత్రములకు గృహారంగములు సుక్షేత్రములు. బాల్యమునందు గృహక్షేత్రము

లందు సుప్రతిష్ఠితములైన గుణశీలములు కాలక్రమ మున పల్లవించి పుష్పించి ఫలించుచున్నవి. బాల్యము నందలి యభ్యాసములు సామాన్యముగ జీవితయాత్రను నిరూపించుచుండును. కోమలహృదయములందు ముద్రి తములైన గుణశీలములు జీవయాత్రను ఫలప్రదముచేయ గల విధము నాత్మచరిత్రము వివిధ సందర్భములందు ప్రత్యక్షము చేయుచున్నది. గృహారంగములందు బాల్యదశ యందు తల్లికిని సోదరీసోదరులకును బంధుమిత్రాదులకును పరిచర్యలు చేయగల స్వభావము పరోపకారశీలమునకు సాధనం బగుచున్నది. వేంకటశివుడుగారు తల్లికి గృహ కృత్యములందును సోదరీసోదరుల కవసరసమయములందును చేసిన పరిచర్యలు వారి స్వయంసహాయస్వభావమునకును, పరహితపరాయణత్వశీలమునకును, ఆత్మవిశ్వాసమున కును నిదర్శనములు. కుటుంబమునకు సంప్రాప్తమైన సుఖ దుఃఖము లానందవిషాదములకు మూలములై, ఆత్మో ద్ధరణమునకు వినియోగపడగలవిధము నాత్మచరిత్రము విశదము చేయుచున్నది. గృహారంగములం దభ్యస్తము లైన గుణావగుణములు, రాగద్వేషములు, భయ భక్తులు, సాంఖ్యయోగములును, విద్యారంగమునందును, విశ్వరంగమునందును పరిపక్వములై జీవయాత్రయందు పరిస్ఫుటము లగుచున్నవి.

విద్యారంగము:—విద్యారంగము జీవయాత్రకు సత్త్వాశ్రయము. పరిమితమైన గృహారంగమును విద్యారంగము విశాలము చేయుచు, జీవనప్రవాహమున కుత్తేజమును గలుగజేయుచున్నది. ఉపాధ్యాయులబోధలు, విద్యావ్యాసంగము, యువజనసాహచర్య సాంగత్యసంభాషణములు, ప్రాపంచిక వ్యవహారములును జీవయాత్రయందు సంఘర్షణమునకును, విషాదానందములకును మూలము లగుచున్నవి. గృహారంగమునకును, విద్యారంగమునకును నిత్యజీవనమునందు సంయోగసాహచర్యములు దుర్లభము లైనపుడు, సంఘర్షణము దుస్సహ మగుచున్నది. ఆత్మసంస్కారవిరహితమైనవిద్యావిధానము, జీవయాత్రయందు గృహావిద్యారంగములకు సన్నిహితసాహచర్యము దుర్లభము చేసినవిధమును, ఆత్మచరిత్ర యందలి ఘట్టములు విశదము చేయుచున్నవి. తండ్రీకొడుకుల దీర్ఘసంభాషణములసారాంశ మిటులు వారి ౧౯౦౦ ఏప్రిలు దినచర్యపుస్తకమునందు గలదు :—

"మా జనకుఁడు జనాభిప్రాయమును శిరసావహించెడి భీరుఁడు; నే నన్ననో, స్వబుద్ధి సూచించినసత్యపథమునఁ బోయెడి ధీరుఁడను. ఆయన, పామరజనాచారములను గౌరవించి యనుసరించువాఁడు; నేను, వానిని నిరసించి నిగ్రహించెడివాఁడను. నే యేల, మా నాయన పూర్వాచారపరాయణుఁడు; నేను నవనవోన్మేషదీధి

తుల నొప్పెడి సంస్కారప్రియుఁడను!" పాఠకులు నా యౌవనము నాఁటి యహంభావమునకు వెల గంద కుందురు గాక!;"

జననీజనకులతో గలిగిన సంఘర్షణము బంధుమిత్రులతోను, సంఘముతోను సహజముగ గలిగినది. ముత్తుస్వామిశాస్త్రి విపరీతవిధానము, జనకుని విచిత్ర చిత్తవృత్తులు, మొదలగు ఘట్టములు విద్యారంగము నందు గలిగిన సంఘర్షణమునకు నిదర్శనములు. వేంకట శివుడుగారి దినచర్యలు వారినియమ జీవయాత్రకు నిదర్శనములు. వారి ౨౦-వ ఏటను వ్రాసిన ౧-౧-౧౯౯౦ దినచర్యయం దిట్లు గలదు.

"౧-౧-౯౦:—'సర్వసమర్థుఁడా! నాశత్రువులనుండి నన్ను రక్షింప నీవే యోపుదువు గాని, కడు దుర్బలుఁడ నగు నేను గాను సుమీ!'.........౧. శరీరసాధకమును గూర్చి ముఖ్యముగ శ్రద్ధ వహింపవలెను. ౨. కోపము, గర్వము, అసూయ, లోభము—వీని నదుపులో నుంచవలెను. ౩. ప్రేమ, మతోత్సాహము మున్నగు వానిపట్ల మితి మీఱరాదు. ౪. నిరర్థకవిషయములనుగుఱించి కాలము వ్యర్థపుచ్చఁగూడదు. ౫. ఏపరిస్థితులందును పరనింద చేయరాదు. ౬. మంచిసంగతి నైనను, అధికవ్యామోహమునఁ జింతింపఁరాదు. ౧౦. పరీక్షలో నఖండవిజయమున కైన నారోగ్యముఁ గోలుపోవ రాదు. ౧౧. ఈ విధులను జెల్లించుచు, దుస్సహవాసములు, దుస్సంకల్పములు, దుష్టదృశ్యములు—వీనిని త్యజింపవలయును."

విద్యారంగము సంరంభమునకు మూలమైనను, జీవయాత్రకు శక్తిని గలుగజేయుచున్నది. నవయౌవనో

త్సాహ మభిమానావృతమయ్యును జీవితపరిణామమునకు సాధనభూత మగుచున్నది. వేంకటశివుడుగారు విద్యార్థి దశయందు నిర్వహించిన సత్యసంవర్ధనీపత్రిక, ప్రార్థనా సమాజము, సాహిత్యరచనలు, విద్యావ్యాసంగము మొదలగునవి వారి భావిజీవితపరిణామమునకు నిదర్శనములు. వేంకటశివుడుగారు యథార్థమైన విద్యార్థులైన విధమును వారి సంతతవిద్యావ్యాసంగము, ఆత్మజిజ్ఞాస, దైవభక్తి, సంస్కారప్రియత్వమును విశదము చేయుచున్నవి. విద్యారంగమునందలి యభ్యాసాదర్శములు విశ్వరంగమునందు సఫలముగా గల విధమున కాత్మచరిత్రలు ప్రమాణములు.

విశ్వరంగము :— గృహారంగమునం దభ్యస్తములైన ప్రేమభక్తులు, విద్యారంగమునందు సముపార్జితమైన కళాజ్ఞానమును విశ్వరంగమునందు యోగరూపమున నాత్మోపలబ్ధికి వినియోగపడుచున్నవి. సాంఖ్యము వృత్తిసాధనమున యోగరూపమును దాల్చుచున్నది. జీవయాత్రయందు వృత్తులందు భేదము లున్నను, ధర్మలక్ష్యమునందు భేదము లేదు. ధర్మార్థకామమోక్షములను సమకూర్చుటకు స్వధర్మనిర్వహణము ప్రమాణము కాని, వృత్తులు ప్రమాణములు కావు. ఆత్మచరిత్ర యీ పరమార్థము ననేకసందర్భములయందు బోధించుచున్నది.

వేంకటశివుడుగా రాత్మచరిత్రమునందు ౭౩ ఏండ్ల యను భవానంతరము వ్రాసిన భావములు పండితపామరులకు మననార్హములు :

"చిన్ననాఁడు నే ననుకొనినట్టుగ పాఠశాలావరణమునకు వెలుపలి ప్రదేశము పాపభూమి కాదనియు, వృత్తులందు పవిత్రత్వాపవిత్రత్వములు నియతములు కావనియు, సంకల్పశుద్ధియె సామాన్యముగ నేకార్యప్రాశస్త్యమును గాని నిర్ణయించు ననియు నానాఁట నాకు నచ్చెను. లోకములోవలెనే బోధకలోకమందును మేఁకవన్నెపులులు లేకపోలేదు. కాని, పరుల సంకుచితాశయములు పామరకృత్యములు నేరవడిగఁ గైకొనవలఁ దని సదా నేను మానసబోధ గావించుకొను వాఁడను. కీర్తిధనాదులను పరమావధిగ నెంచక, వృత్తి నిర్వహణమె ధర్మనిర్వహణముగఁ జేకొని మఱి విద్యాబోధన మొనరింపఁ బ్రయత్నించుచు వచ్చితిని. జ్ఞానస్వీకారమున నుత్తేజిత చేతస్కులగు శిష్యుల ముఖావలోకనము నిరతము నాకుఁ గనులపండువుగ నుండెడిది. కాని, యిది రానురాను క్రమశిక్షణధర్మనిర్వహణములకు భంగకరమగు సుఖలోలత్వవ్యసనముగఁ బరిణమించిన తరుణము వృత్తివిరామమున కద నని గ్రహించి, విశ్రాంతి చేకొంటిని."

సుబోధకుడు :— విద్యార్థిదశయందు మిత్రాదులు "సుబోధకుడు" అని వేంకటశివుడుగారికి చేసిన నామకరణము జీవయాత్రయం దారూఢమైనది. వారు విజయవాడయం దుపాధ్యాయవృత్తి నుపక్రమించి, నెల్లూరునందు విరమించిరి. విజయవాడ,

మద్రాసు, పర్లాకిమిడి, విజయనగరము, గుంటూరు, నెల్లూరుపురములందు విద్యాబోధకవృత్తియందు వారు చేసిన పరిశ్రమ ఆంధ్రావనియం దంతటను వారి శిష్య ప్రశిష్యుల జీవితములయందు ప్రత్యక్ష మగుచున్నది. వేంకటశివుడుగారి సుబోధకత్వము విద్యాబోధకవృత్తి యందే కాక వారివ్యాసములయందును, రచనముల యందును, దినచర్యలయందును, మతానుష్ఠానమునందును, జీవయాత్రయందును, జీవితపరమార్థమైన ఆత్మచరిత్ర మందును గోచరం బగుచున్నది.

ఆత్మచరిత్రను సింహావలోకనము చేయునపుడు, వేంకటశివుడుగారు వారి జీవయాత్రను నిత్యమైన ఆత్మ యాత్రను చేయుటకు చేసిన సంతతపరిశ్రమము పొడ గట్టుచున్నది. జీవయాత్రను సంకుచితమైన ఆచారా వరణమునుండి విశాలమైన ధర్మావరణమునందు ప్రవ హింపజేయుటకు విశ్వ మనుభవించిన దుఃఖవేదనను విశ్వ జీవయాత్ర యనంతముఖములను బోధించుచున్నది.

"కాలు కదపక, కలము సాగింపక, మనస్సు పరిశ్రమింపక యుండు నిర్భంగవిపరీతవిశ్రమ మెవరికైన శాంతి సౌఖ్యము లొసఁ గూర్చినఁ గూర్చుఁగాక. నాకుమాత్ర మది కేవలదుర్భర దుస్థితియే!"

ఆచారావరణమునందు సంకుచితమైన జీవయా త్రను జ్ఞానావరణమునందు విశాలముచేయుట జీవ

యాత్రకు పరమార్థము. ఆచారావరణబద్ధమైన జీవ యాత్రను ఆత్మావరణమునందు విశాలము చేయగల విధము నాత్మచరిత్రము బోధించుచున్నది. జీవ మాచారావరణము నతిక్రమించి ఆత్మావరణమునందు విహరించుట కభ్యాసయోగము సాధనముగనున్నది. సంసారమునందును, వృత్తివిధానమునందును, సంఘజీవనమునందును, సాహిత్యోపాసనమునందును, దైవారాధనమునందును ఆత్మోపలబ్ధిని బడయుటకు వేంకటశివుడుగారు చేసిన పరిశ్రమను ఆత్మచరిత్రను తెలుపుచున్నది.

వేంకటశివుడుగారు సంసారయాత్రను సరళముగా ౬౩ ఏండ్లు చేసిరి; విద్యావృత్తియందు జీవితమును సౌఖ్యముగ గడపిరి; సంఘసంస్కారమునకై విద్యా వివేకములను వినియోగించిరి. సత్యసంవర్ధనీ జనానాపత్రికలను నిర్వహించియును, పత్రికలకు వ్యాసములను వ్రాసియును, హిందూసుందరీమణులు, చిత్రకథామంజరి, మొదలగు గ్రంథములను రచియించియును సాహిత్యోపాసనము జేసిరి; నియతముగ దైవసంపదల యారాధనము, ఆస్తికమతారాధనమును జేసిరి. జీవయాత్రయందు దాత్మానాత్మల సంరంభమునందాత్మోద్ధరణమునకై చేసిన ప్రయత్నముల నాత్మచరిత్రము సుగమము చేయుచున్నది.

ఆత్మచరిత్రము, గతించిన యేబదేండ్ల ఆంధ్రాభ్యుదయమును సింహావలోకనముచేయుటకును, భావ్యభ్యుదయమునకును, సాధనముగనున్నది; వీరేశలింగము పంతులు, వేంకటరత్నమునాయఁడు, కనకరాజు, రామమూర్తి, పాపయ్య, రంగనాయకులు నాయఁడుగార్ల పవిత్రజీవితముల సంస్మరణమునకును, ఆత్మసంస్మరణమునకును సాధనంబుగ నున్నది; సాహిత్యరచనలందును సాంఘికవ్యవస్థలందును, మతాచారములందును, నిత్యజీవనమునందును సంప్రాప్తమైన భావక్రియాపరివర్తనమును గ్రహించుటకు వినియోగపడుచున్నది. కథకులు మతవిశ్వాసములందు గలిగిన పరివర్తనసందర్భముల తెలిపినభావము లాత్మచరిత్రయం దాత్మవిజయమును ప్రకటించుచున్నవి.

"వయోవిద్యానుభవములతో నాగుణశీలముల కెట్టి పరిణామము గలిగెనో చదువరులు గమనించియున్నారు. అన్నిటికంటెను నామతవిశ్వాసములందలి పరివర్తనమె మిగుల స్ఫుటముగఁ దోఁచును. బాల్యకాలమునందలి వైష్ణవశైవ స్తవవిశ్వాసములు యౌవనమున బ్రాహ్మప్రార్థనసమాజాదర్శరూపము దాల్చినను, పూర్వవాసనలు పిమ్మట పూర్తిగ వీడెనని కాని, పరిణామకార్య మింతతో నిలిచిపోయె నని కాని చెప్ప వలనుపడదు. లోకానుభవము హెచ్చినకొలఁది, బ్రాహ్మమతోద్బోధకమగు పరిశుద్ధాస్తికాదర్శముల పొడలు, బ్రాహ్మ

సమాజమునం దెకాక, మాతృసంఘమునందును నాకనులకు గోచరించెను. ఇంతియకాదు. కొన్ని సమయములందు క్రొత్తగ వెలసిన సమాజములలో నూతనాశయములు వేవేగమె వన్నెవాయుటయు, మాతృసంఘమె యుదారనవీనభావములతో భాసిల్లుటయు మనము కాంచుచున్నాము. కావుననే, హిందూమతముపట్ల యౌవనమున నాకుఁ గలిగిన నిరసనము నానాఁట తొలఁగిపోయి, అందలి యుత్కృష్టాదర్శములు హృద్యము లయ్యెను. భగవంతునిప్రాపున సంసారయాత్రయందు ధన్యులు కాఁగోరువారు, నామరూపముల విషయమై లేనిపోని దురభిమానములకు లోనుగాక, సర్వమతధర్మములను సాధనములుగఁ జేకొని సత్యము గ్రహింపవచ్చునని నేను దలంచితిని.”

ఆత్మచరిత్రము, గృహావిద్యావిశ్వరంగములయందు, భక్తి జ్ఞానకర్మయోగముల సాధనమునను పూర్ణమైన ఆత్మయోగాభ్యాసమునకు సకలజనులకును వారి సంస్కారమున కనురూపముగను వినియోగపడుచున్నది. జీవయాత్రయం దనిత్యములైన నామరూపావరణము లంతరించి నిత్యమైన యాత్మావరణము జీవిత పరిణామమునందు సార్థకమగుచున్నది. పాఠకమహాశయులు దీర్ఘమైనను భావగర్భితమైన ఆత్మచరిత్రమును చదివి పరిశోధించి ఆత్మచరిత్రమును సార్థకము చేయుదురుగాత. ఈ కృతికి పరిచయవాక్యములను వ్రాయుట కవకాశ

ములను గల్పించి గౌరవించినందులకును, ఆంధ్ర గ్రంథమాలయందు ఆత్మచరిత్రమును ఇరువదిరెండవ కుసుమముగ జేర్చినందులకును, వేంకటశివుడుగారికి కృతజ్ఞుడను.

శ్రీముఖ సం. శ్రావణ శు.
సప్తమి, శనివారము. } కా. నాగేశ్వరరావు.

---

# ఉపోద్ఘాతము.

గ్రంథకర్త యేపుస్తకము వ్రాసినను, అది యాతని యాత్మచరిత్రమె యగునని యొక సుప్రసిద్ధ రచయిత నుడివెను. మనరచనములు అద్దములవలె మనయభిప్రాయములను ప్రతిఫలనము చేయుచుండును. మన కొంకిగీఁతలెల్ల మన జీవితకథనే గీయుచున్నను, ఎంతజాగ్రత్తతోఁ జిత్రించిన జీవితచిత్రమునందును, కొంకరగీఁతలు గానిపించుచునే యుండును! ఇతర రచనములందుకంటె నాత్మకథాసంవిధానమున భ్రమప్రమాదముల తాఁకు డధికముగఁ గానవచ్చును. పరులరూపమును జిత్రించుపట్ల నెంతో నిపుణతచూపు మనవ్రేళ్లు, సొంత ప్రతిమను గీయునపుడు వణఁకఁజొచ్చును! అహంభావము, పక్షపాతబుద్ధి మున్నగు దుర్లక్షణములు మనల నావేశించి, సత్యపథమునుండి యొక్కొకసారి మనపాదములను పెడదారులఁ బట్టించుచుండును. ఐనను, రోటిలోఁ దల దూర్చినవాఁడు రోఁకటిపోటులకు వెఱచునా? తన జీవితకథను ధారాళముగ వినిపింపసాహసించిన కథకునికి, చిన్నకల్లలచేఁ దన నెరసులు కప్పిపుచ్చ నెంచుట సిగ్గుచేటుగదా!

సత్యప్రకటనమె ముఖ్యావధిగఁ జేకొనిననేను, కీర్తిధనాదుల మీఁదఁ గన్నువేసి, యీ పుస్తకరచనమునకుఁ బూనుకొనలేదు. ఇదివఱలో నాత్మచరిత్రము నాంధ్రమునఁ బ్రచురించిన మద్గురువర్యులగు కీ. శే. కందుకూరి వీరేశలింగముపంతులుగారి "స్వీయచరిత్రము"ను, గాంధిమహాత్ముని "ఆత్మకథ"ను మించనెంచి నే నీపుస్తకమును వ్రాయలేదు. ఆగ్రంథకర్తలు మహామహులు, నాదర్శ

పురుషులును. ఐన నొకొక్కప్పుడు నాబోటి సర్వసామాన్యుని చరిత్రముకూడ సంసారయాత్ర గడపుటయందు కొందఱికి సాహాయ్యకారి కావచ్చుననియె నాయాశయము.

ఈపుస్తకరచనాసందర్భమునుగూర్చియు, దీని యాధారములను గుఱించియు నొకింత చెప్పెదను. నేను ౧౮౮౮-వ సంవత్సరమధ్యము నుండి ౧౯౦౨-వ సంవత్సరారంభమువఱకును విడువకుండఁగను, పిమ్మట చాలకాల మప్పుడప్పుడును, దినచర్యపుస్తకములు వ్రాయుచు వచ్చితిని. ఆకాలమందలి నాయాశయాలోచనములు, నే జదివిన పుస్తకములలోనివిషయములు, చేసినపనులు మున్నగునవి యందు వర్ణింపఁబడియున్నవి. వీనికిఁ దోడుగ ౧౮౯౧-వ సంవత్సరము జులై నుండి యేడెనిమిది సంవత్సరములు "సత్యసంవర్ధని"ని, ౧౮౯౪-వ జులై నుండి ౧౯౦౬ వఱకు "తెలుఁగు జనానాపత్రిక"ను బ్రచురించితిని. ఆకాలమందును, పిమ్మటను కొన్ని తెలుఁగుపుస్తకములు రచియించితిని. వీనియన్నిటిప్రతులును, నే నితరపత్రికలకు వ్రాసిన వ్యాసాదులు, చేసిన యుపన్యాసములును నాముందటఁ గలవు. ఇవిగాక, నే నుంచుచువచ్చిన యింటిలెక్కలపుస్తకములు, నాకు వచ్చిన యుత్తరములు మొదలగు ప్రాఁతకాగితములును చాల గలవు. ఇవి యన్నియు నాజ్ఞాపకశక్తి కాధారముగఁ జేసికొని, ౧౯౩౦-వ సంవత్సరాంతమున "శ్రీ వీరేశలింగ సంస్మృతి" ని రచించితిని. వీనిసాయమున నే ౧౯౩౧-వ సం. అక్టోబరులో నా "ఆత్మచరిత్ర" ప్రథమభాగమును వ్రాసి, నా సోదరీసోదరుల కది చూపించి, తక్కినభాగములు వెనువెంట నే లిఖించితిని.

ఈగ్రంథరచనాపద్ధతిని గుఱించి యొకింత ప్రస్తావించెదను. పూర్వకాలమున పరిస్థితు లెట్లు నామనసునకుఁ దట్టెనో, ఆకాలమున నా యూహాప్రపంచ మెటు లుండెనో చదువరులు గ్రహింపఁగోరెదరు

గాన, అపుడు నాదినచర్యపుస్తకములలో నింగ్లీషున నేను లిఖించిన సంగతులు లిఖించినరీతినె నేను సామాన్యముగ నిందు తెలుఁగున వ్రాసితిని. నావ్యాసాదులలోని సంగతులు కొన్ని యిటఁ జేర్చితిని. నా కితరులు వ్రాసిన జాబులలోని విషయములు కొన్ని ప్రకటించితిని. నేను తెలుఁగున వ్రాసిన వ్యాసాదులు నే నాకాలమునఁ బ్రకటించిన నాపత్రికలలోను, ఇతరపత్రికలలోను, నా తెలుఁగు పుస్తకములలోను నున్నవిగాన, వానినంత విపులముగ నిచటఁ దెలుపక, నాయింగ్లీషురచనముల ముఖ్యభాగముల యాంధ్రానువాదమె యిం దచ్చటచ్చట ముద్రించితిని.

నా విద్యార్థిదశనుగూర్చిన చరిత్రభాగము, పిమ్మట జరిగిన నా యెనిమిది సంవత్సరముల యుపాధ్యాయదశాకథాభాగమంతటి దీర్ఘతను గాంచియుండుటయు, ఇటీవలి ముప్పదిసంవత్సరముల యుపన్యాసకదశాచరిత్రము కడు కుఱుచగ నుండుటయు, చదువరుల కొకింత వింతగఁ దోఁపవచ్చును. దీనికిఁ గారణము లేకపోలేదు. మొదటి రెండుదశలందును నేను దినచర్యపుస్తకములు సరిగ నుంచుచువచ్చితిని. కళాశాలాదినములందలి నాదీర్ఘ దినచర్యపుస్తకములందలి వ్రాఁతలు, ఆకాలమందలి నాయధికభావోద్రేకమునకును, నిరోధ మెఱుఁగని నా చిత్తవృత్తులకును అద్దములవంటివి. ఉపన్యాసకదశయందలి నా దినచర్యపుస్తకములు వట్టి తెల్లకాగితపుఁబుటలనె ప్రదర్శించుచున్నవి. వ్యక్తిసంబంధమగు కార్యావళియె యాకాలమందలి నా దినచర్యయంతయు.

జీవితమందు నా కధికప్రేమాస్పదులయి, వివిధపరిస్థితులందు నాకుఁ జేదోడువాదోడుగనుండు నా యిరువురు తమ్ములకును చెల్లెలికి నే కాక, తమయకాలమరణమున నాహృదయమును దుఃఖజలధిని ముంచి వైచి దివికేగిన తక్కిన సోదరీసోదరులకును నే నీపుస్తకమును కృతి యొసంగి, కొంత మనశ్శాంతి నొందుచున్నాను.

ఈపుస్తకమును దమ యమూల్యగ్రంథమాల కొకనూతన కుసుమముగఁ గైకొని, దీనికిఁ దొలిపలుకు వ్రాసి, నన్ను గౌరవించిన శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారికి నాకృతజ్ఞతాపూర్వక నమస్కృతులు సమర్పించుచున్నాను. ఈపుస్తకముద్రణమునందు నాకు వలసిన సౌకర్యము లొనఁగూర్చిన ఆంధ్రపత్రికాముద్రాక్షరశాలవారికి వందనము లర్పించుచున్నాను.

ఈపుస్తకము వ్రాయునపుడు నాకుఁ గలిగిన పెక్కు సందియములను నివారణముచేసి, మంచిసూచనలు చేసిన నా పూర్వశిష్యులు మిత్రులునగు శ్రీకొలచెలమ కృష్ణసోమయాజులు గారికిని, అక్కడక్కడ కొన్ని మంచిమార్పులు సూచించిన శ్రీయుత చన్నాప్రెగడ భానుమూర్తిగారికిని వందనము లర్పించుచున్నాను.

ఇందులోఁ జేర్చినపట్టికలో తప్పొప్పులలో ముఖ్యములగునవి కొన్ని చూపింపఁబడినవి.

పుస్తకమందలి కథ వేవేగముగ సాగిపోవుటకు ప్రతిబంధకములును, సామాన్యపాఠకుల కంతగ రుచింపక యనగత్యముగఁ దోఁచునవియునగు కొన్ని విషయములు పుస్తకముచివరను అనుబంధరూపమునఁ దెలుపఁబడినవి.

పాఠకమహాశయు లీగ్రంథమందలి లోపములు క్షమింపవలెనని వేఁడుచున్నాను. ఈపుస్తకపఠనమువలన నెవరి కేమాత్రము లాభము చేకూరినను, నే నమితానంద మందెదను; ఎవరిమనస్సునకు నొప్పికలిగినను, మిక్కిలి విచారమందెదను.

జూను, 1933. రాయసం వెంకటశివుఁడు.

# విషయసూచిక

| ప్రకరణ సంఖ్య | విషయము | పుట నుండి | పుట వఱకు |
|---|---|---|---|
| ౧౮ | నూతన దృక్పథము | ౬౭ | ౭౩ |
| ౧౯ | సంఘసంస్కరణసమాజము | ౭౩ | ౭౮ |
| ౨౦ | జననీజనకులతోడి సంఘర్షణము | ౭౮ | ౮౨ |
| ౨౧ | ముత్తుస్వామిశాస్త్రి విపరీతవిధానము | ౮౨ | ౮౪ |
| ౨౨ | జనకుని విచిత్ర చిత్తవృత్తులు | ౮౪ | ౮౭ |
| ౨౩ | వెంకటరావు సాహసము | ౮౭ | ౯౧ |
| ౨౪ | కమలామనోహరులు | ౯౧ | ౯౮ |
| ౨౫ | ఏకాంతజీవితము | ౯౮ | ౧౦౮ |
| ౨౬ | పరీక్షాపూర్వదినములు | ౧౦౮ | ౧౧౬ |
| ౨౭ | పరీక్షలు | ౧౧౬ | ౧౨౧ |
| ౨౮ | పరీక్షావిజయము | ౧౨౨ | ౧౨౭ |
| ౨౯ | చెన్నపురి ప్రయాణము | ౧౨౭ | ౧౩౨ |
| ౩౦ | జనకుని వ్యవహారదక్షత, శకటవ్యాపార ఫలితము | ౧౩౩ | ౧౩౬ |
| ౩౧ | రచనావ్యాసంగము | ౧౩౬ | ౧౪౦ |
| ౩౨ | పత్రికాస్థాపనము | ౧౪౦ | ౧౪౬ |
| ౩౩ | క్రొత్తకోడలు, క్లిష్టపరిస్థితులు | ౧౪౬ | ౧౫౧ |
| ౩౪ | పెద్దపలుకులు | ౧౫౧ | ౧౫౩ |
| ౩౫ | రంగనాయకులు నాయఁడుగారు | ౧౫౩ | ౧౫౬ |
| ౩౬ | సత్యసంవర్థని | ౧౫౭ | ౧౬౧ |
| ౩౭ | చెన్నపురి స్నేహితులు | ౧౬౧ | ౧౬౫ |
| ౩౮ | సంరంభము | ౧౬౫ | ౧౭౦ |
| ౩౯ | స్నేహభాగ్యము | ౧౭౧ | ౧౭౫ |

## తృతీయభాగము : ఉపన్యాసకదశ

# ఆత్మచరిత్రము

—:(౦):—

## ప్రథమ భాగము: విద్యార్థిదశ

## ౧. బాల్యము

నా బాల్యదినముల సంగతులు కొన్ని నాకు జ్ఞప్తియందుఁ గలవు. మా తండ్రితో మధ్యాహ్న భోజనమునకుఁ గూర్చుండునపుడు నాకు నచ్చిన విస్తరాకు సమకూరుట దుర్ఘటమగుచువచ్చెను. అరఁటితోఁటలకు ప్రఖ్యాతినొందిన ఖండవల్లిలోనే యిట్లు జరుగుచువచ్చెను! అచట మా తండ్రి సర్వేయుద్యోగి. తోఁటలలోనుండి యరఁటాకుల కట్ట లెన్నియో యనుదినమును మా యింటికి వచ్చుచుండినను, ఏ కట్ట విప్పినప్పుడును నా కంటికి సరిపడు మంచి యాకందు దొరకకుండెడిది. ఆకు చివర గాలితాఁకుడువలన సామాన్యముగఁ గొంచెము చినుఁగుచుండును. ఏమాత్రము చినిఁగినను, కుపితుఁడనై, ఆకును చేతులతో నులిమి పారవైతును! ఉసులుమఱ్ఱుగ్రామములో జరిగిన యొకసంగతి నాకు జ్ఞాపకము. మా తండ్రి నాకొక రుమాలు కొనిపెట్టెను. అది బుజముమీఁద వేసికొని, నాకంటె పెద్దవాఁడగు నొక సావాసునితో చుట్టుపట్టుల కేగుచుండువాఁడను. బాజాలు మోపింతు నని శుభకార్యములు జరుగుచోట్లకు నన్నాతఁడు కొని

పోయి, నేను ఉద్యోగస్థుని తనయుఁ నని చెప్పి, కొంచె మెక్కువగ నాకు వా రిచ్చిన సంభావనను దానే స్వీకరించుచుండువాఁడు! అజ్ఞానదశలో నిది మఱచిపోయి, బాజాలు చూచినందుకే సామాన్యముగ నేను సంతసించుచుండినను, నా చేతిలోని డబ్బు చెలికాని వశమయ్యె నని యొక్కొకతఱి నిలు సేరువఱకును విలపించుచుందుఁ. రాజమహేంద్రవరమున గుండువారి రేవునందలి పెద్దటపాలకచేరి మేడమీఁద నొకనాఁడు జరిగిన సంగతి నాకు జ్ఞాపకము. అచ్చటి యుద్యోగీయులనో, మఱి యెవరినో యడిగి, మా తండ్రి యుత్తరము వ్రాసికొనుట కొకసిరాబుడ్డి తెచ్చుకొనెను. తాను వ్రాసిన జాబు మా నాయన చదువుకొనుచుండఁగా, నేను మెల్లఁగ సిరాబుడ్డి తీసి, క్రిందికి దొరలించి, 'టంటమ్మ' ని యది మెట్లమీఁదినుండి జారిపడుచుండఁగ వినోదమునఁ గాంచుచుంటిని! అది యందుకొనఁబోయి నేనును పడిపోవుదు నని మా తండ్రి నన్నంత చేరఁదీసెను. ఆత్మవినోదమునకై సిరా వ్యర్థము చేయుటకు జీవితమున నిదియే మొదటిసారి యగుటచే గాఁబోలు, నా మనోఫలకమునం దీచిన్న సంగతి చిత్రితమై నేటికిని నిలిచియున్నది.

నా యైదవయేట మా తాతగారు నా కక్షరాభ్యాసము చేసిరి. అప్పటినుండియు నేను బడికిఁ బోయి వచ్చుచుండుట నాకుఁ గొంత జ్ఞప్తి. నా జన్మస్థలమును మాతామహు నివాసస్థానమును నగు వేలివెన్నులోను, పితృనివాసస్థలమగు రేలంగిలోను, నేను సహచరులతోఁ గలసి, పల్లెబడులకును, పాఠశాలలకును బోవుచుండు దినముల జాడలు నా మనస్సీమ నిప్పటికిని గన్పట్టుచున్నవి. మా తల్లియు పినతల్లియు మేనమామలును, మా మాతామహులను, 'నాన్న' 'అమ్మ' యని సంబోధించుచుండుటచే నేనును వారి నట్లులే పిలుచుచుందును. ఇంతియకాక, మా

పెన్నిని చిన్ని మేనమామ లిరువురిని జూచి, మా తల్లిని 'అప్ప' యనుచుందును. జ్యేష్ఠుఁడ నగు నన్నుఁ జూచి, పిమ్మట నా తమ్ములు చెల్లెండ్రును, మా అమ్మను అప్ప యనియు, అమ్మమ్మను అమ్మ యనియును బిలుచుచువచ్చిరి. మా తాతగారు మాత్రము తన వరుసను శాశ్వతముగ గోలుపోకుండుటకుఁ గలసందర్భ మొకింత వివరించెదను. ఒకానొకప్పుడు నేను జదివెడి రేలంగిపాఠశాలకుఁ బరీక్షాధికారి వచ్చినప్పుడు, నా పేరు జనకుని పేరును పాఠశాలపట్టికలో స్పష్టముగఁ గానఁబడక పోవుటచే, ఆయన నన్నుఁ బిలిచి, "నీ పే రేమి? మీ నాన్న పే రేమి?" అని గ్రుచ్చిగ్రుచ్చి యడిగెను. "నాకు పేరు పెట్టలేదు, మాకు 'వేలివెన్ను నాన్నా', 'రేలంగినాన్నా' ఉన్నారు" అని నేను ప్రత్యుత్తర మిచ్చి, ఆయనసందేహములను మఱింత పెంచివేసితిని! "ఈ బాలు నింటికిఁ గొనిపోయి సరియైన జవాబు తెప్పించుఁ"డని యా యుద్యోగి యాగ్రహపడఁగా, ఉపాధ్యాయుల యాజ్ఞచొప్పున చెలికాండ్రు నన్ను మా యింటికిఁ గొనిపోయి, నిజము తెలిసికొని వచ్చిరి. అప్పటినుండియు మా తాతయగు రామన్నగారిని, తండ్రియగు సుబ్బారాయుఁడుగారిని, సరియైన వరుసను నేను బిలువఁజొచ్చితిని. ఇంక నా పేరును గుఱించిన చిక్కు విడఁదీయవలెను. తొలిచూలి పిల్లవాఁడ నగుటచే బాల్యమున నాకు నామకరణము కాలేదు. తన ప్రియదైవతమగు వెంకటేశ్వరుని పేరును, అప్పటికిఁ గొలఁదికాలముక్రిందటనే కాలగతినొందిన తన పెద్దయన్న పేరును, గలసివచ్చునట్టుగ 'వెంకటాచల' మని, మా యమ్మ నాకుఁ బేరిడ నేర్పఱచుకొనెను. మా తండ్రి కిది యిష్టము లేదు. తన కభీష్టదైవమగు శివుని పేరు నా కాయన పెట్టఁగోరెను. అంత నా కీయుభయదైవముల పేళ్లను గలసి 'వెంకటశివుఁ' డను పేరు వచ్చెను.

విద్యాప్రారంభ మైనదిమొదలు మా తల్లితో పలుమాఱు నేను రేలంగి వేలివెన్ను గ్రామములమధ్య రాకపోకలు సల్పుచుండుటచేత, నే నా రెండుగ్రామములందలి ప్రాఁతబడులు క్రొత్తపాఠశాలలు ననేకములు త్రొక్కి చూచితిని. తాటియాకులపుస్తకములు చేతఁబట్టి, చిన్ని చదురులు వెంటఁ గొనిపోయి, అమర బాలరామాయణములు పఠించి, ఎక్కములు మున్నగునవి విద్యార్థులు గట్టిగ వల్లించెడి బడులకును, కాకితపుఁబుస్తకములు కలము సిరాబుడ్లును, పాఠపుస్తకములు పలకబలపములును, జదువరులు వాడుక చేయుపాఠశాలలకును, గల వ్యత్యాసము నా కనుభవగోచర మయ్యెను. ఏదేని నూతన విద్యాశాలలోఁ బ్రవేశించిన క్రొత్తజీకమున దిన మొకయేడుగఁ దోఁచినను, గురువుస్వభావము కనిపెట్టి సహపాఠుల సావాసము మరగినకొలఁది నా కమితసౌఖ్యము గలుగుచుండెను. అర్థజ్ఞానము లేని యతిబాల్యదశయందుండుటచేత, వల్లె వేయు వాక్యావళియందుకంటె పుస్తకాదుల రూపాదులమీఁదనే నా కెక్కువ మక్కువ యుండెడిది. నే జదివినను జదువకున్నను, నా చేతులలో జిరిగిన 'బాలబోధ' ల ప్రతులకు లెక్క లేదు. ఆకాలమున చిన్నపరీక్షాధికారి గ్రామపాఠశాలను జూడవచ్చినపు డెల్ల, పాఠ్యపుస్తకములు తనవెంటఁ గొనివచ్చి, యమ్ముచుండువాఁడు. అంచులు మణఁగి పుటలు చినిఁగిపోయిన ప్రాఁతపుస్తకము నంతట మూలఁ ద్రోచివైచి, క్రొత్తది కొనినరోజు నాకు పండుగయె! అట్టమీఁదిరంగు చూచియె పుస్తకమును గొనుట చిన్ననాఁడు నా కెంతో ముచ్చట! అన్నిరంగులలోను ఎఱుపు నాకుఁ బ్రియమైనది. అకుపచ్చ మన్యస్థము. నలుపు, పసుపు, గోధుమ వన్నెలు నాకుఁ గిట్టవు. నల్లయట్టపుస్తకము నా కంటఁగట్టిరని కోపించి, ఒకప్పుడు నేను జదువుమీఁద సమ్మెకట్టితిని!

నా కీరంగుభేదములను గూర్చి కల విపరీతపుఁబట్టుదల, చదువు పుస్తకములు మొదలు వేసికొను వలువలు, ఆడుకొను వస్తువుల వఱకును, బాల్యమున వ్యాపించియుండెను! ఎఱ్ఱనిచేలములు నాకుఁ బ్రియములు, శోణకుసుమము లత్యంతమనోహరములు. రంగులందువలెనే, రుచులందును నాకు గట్టిపట్టుదల యుండెను. కమ్మనికూరలు తియ్యనిఫలములు నాకు రుచ్యములు. పులుపు ఆగర్భశత్రువు. కారము మధ్యస్థము.

## ౨. గోపాలపురము

వెనుకటి ప్రకరణమునందలి సంగతులు, ఐదారేండ్ల వయసునను, అంతకుఁ బూర్వమందును సంభవించి నాకు జ్ఞప్తి నున్న ప్రత్యేకానుభవములు. సూత్రమునఁ గట్టిన పుస్తకమురీతిని, జలపూరితమగు నదీప్రవాహముఁబోలెను, నా కింకను జీవితము స్థాయిభావము నొందిన యనుభవసముదాయము గాకుండెను.

మా తండ్రి సర్వేశాఖలో మరల నుద్యోగము సంపాదించి, ఈమాఱు అమలాపురము తాలూకా గ్రామములలో నివసించెను. అందలి చిన్నగ్రామములలో 'ఈతకోట' యొకటి. ఈమధ్య నే నచటికిఁ బోయి చూడఁగా, అది చిట్టి కుగ్రామముగఁ గ్రుంగిపోవుటకును, చిన్ననాఁటి నా యాటపట్టు లన్నియు స్వల్పప్రదేశములుగ సంకుచితము లగుటకును, విస్మయవిషాదముల నొందితిని! నా యాఱవయేట, గొన్ని నెలలు మే మచట నుంటిమి. అప్పటికి నా తమ్ముఁడు వెంకటరామయ్య రెండుసంవత్సరములవాఁడు. మా యింటిముందలి చావడిలోనే గ్రామపాఠశాల యుండెను. అందు చేరి నేను రెండవపాఠపుస్తకము చదువుచుంటిని. ఆ పాఠములందలి ప్రకృతివర్ణనావైచి

త్ర్యము, శైలిసౌకుమార్యమును నా మనస్సున కమితానందము గొలిపెను. నా సహపాఠులగు బాలకులు నన్ను దమయిండ్లకుఁ గొనిపోయి, నాకు 'పెప్పరుమింటు' బిళ్లలు సూడిద లిడుచుండువారు. ఈ నూతనోపహారవస్తువులలోఁగూడ నా బుద్ధికి విపరీతభేదములు పరికల్పితములయ్యెను. గాటుగానుండు తెల్లని బిళ్లలకంటె, చక్కెఱపాలధికమై కంటికింపగు నెఱ్ఱనిరూపమునను, ఇంచుక గులాబితావితోను నొప్పారెడి రంగుబిళ్లలే నాకు రుచ్యములుగ నుండెను!

అది వేసవికాల మగుటచేత, అచట మామిడిపండ్లు ముమ్మరముగ నుండెను. ఉద్యోగవ్యాజమున మా తండ్రికిఁ గానుకలుగ సమర్పింపఁబడిన ఫలాదు లన్నియు నొకచీఁకటిగదిలోఁ జేర్పఁబడుచుండెను. గదితలుపు తీయునప్పటికి, పండ్ల నెత్తావులమొత్తము నాసికను మొత్తుచుండెడిది. రాత్రి భోజనానంతరమున మా తండ్రికోరిక చొప్పున పొరుగుబ్రాహ్మణుఁ డొకఁడు పనసపండ్లు కోసి తొనలు విడఁదీయుచుండును. మా తలిదండ్రు లవి యచట నుండువారికిఁ బంచి పెట్టుచుందురు. మా మాతామహునకుఁ బుత్రవత్సలతయు మధురఫలాపేక్షయు మిక్కుటము. నన్నుఁ జూచిపో వచ్చినయాయన, ఇరువురు మనుమలమీఁది ప్రేమమాధుర్యమునకును, మిగుల మాగినపండ్ల తియ్యఁదనమునకును జొక్కి, యా వేసవి మా చెంతనే గడపివైచెను!

ఈతకోటలో నా యనుభవమున ముఖ్యముగ రెండుసంగతులు కన్పట్టెను. అచట నొకగృహస్థునికి భార్యయు పుత్రుఁడును గలరు. తండ్రి మిగుల పొడుగుగను, తల్లియు తనయుఁడును కడు కుఱుచగను నుండుట నా కెంతో చోద్యముగ నుండెను. మా తల్లి కీసంగతి పలుమా రాశ్చర్యమునఁ జెప్పుచుండువాఁడను. మా పొరుగున నొకబీదవాని కుటీరము గలదు. ఆతని కొక కుంటికూఁతురు తప్ప మఱి యెవ్వ

రును లేరు. పాప మెంతో భయభక్తులతో బగ లెల్ల పరిచర్యలు చేసి యలసిన యాబాలికను,ఏదో మిష పెట్టి తండ్రి రాత్రులు మోదు చుండును! అంత వినువారి గుండె లవియునట్టుగ బాలిక రోదనము చేయుచుండును. లోక మనఁగ నిట్టి విపరీతవైషమ్యములతో నిండి యుండునట్టిదియే కాఁబోలని తలపోసి, రాత్రి పానుపు చేరి, నా విస్మయవిషాదములను గాఢసుషుప్తియందు విస్మరించుచుండువాఁడను!

అచ్చటినుండి మా తండ్రి నరేంద్రపురమునకు మార్పఁబడెను. మే మక్కడకుఁ బోయిన కొలఁదిదినములకే జరిగిన యొకయుత్సవ సందర్భమున నచటివారును పొరుగూళ్ల వారును "ప్రభలు" గట్టి రాత్రి యూరేగించిరి. ఆ యూరను చుట్టుప్రక్కలను ద్రావిడులు మెండుగ గలరు.

అచ్చట నొకచావడిలో జరుగు పాఠశాలలో నేను జేరి, మూఁడవపాఠపుస్తకము చేతఁ బట్టితిని. ఆ పుస్తకమందలి "శ్రీరామ పట్టాభిషేకవర్ణనము" మిగుల మనోహరముగ నుండెను. నా సహచరులలో సూర్యచంద్రు లను నిరువురు సోదరులు గలరు. చంద్రుఁడు తన కాంతితో విలసిల్లెడి సుందరాకారుఁడె కాని, సూర్యునిమోము కాలమేఘము లావరించిన సూర్యబింబమె! వారు నివసించు నింటి యజమానునికి కురూపి యగు నేకపుత్రుఁడు కలఁడు. ఆ యువకుని సతి యన్ననో చక్కనిచుక్క. మగనిచెంత మసలెడి యా మగువ, కాలు మబ్బునడుమ తళుకొత్తు మెఱుఁపుదీఁగయె! ఇట్టి విపర్యయముల కాశ్చర్యపడియెడి నా కప్పటి కాఱుసంవత్సరములు పూర్తి గాకుండెను.

౧౮౭౭ వ సంవత్సరపు వేసవిని నా రెండవ తమ్ముఁడు కృష్ణమూర్తి మా యిరువురివలెనే వేలివెన్నులో జననమయ్యెను. మే మంతట గోపాలపురము వెళ్లితిమి. అచట జరిగినసంగతులు నా మనో

వీథిని మఱింత స్ఫుటముగ గోచరించుచున్నవి. మొదట నే నందు పల్లెబడులలో గాలము గడిపి, పిమ్మట పాఠశాలఁ బ్రవేశించితిని. మూఁడవపాఠపుస్తకము మరల నా కరము లలంకరించెను. నా కిచటఁ గొందఱు బాలురు నెచ్చెలు లైరి. గోదావరీనదీగర్భమందలి రెల్లు దుబ్బులు నిసుకతిన్నెలును మిత్రులతోఁ జుట్టివచ్చుచును, వరదకాలమున నొడ్డువఱకును వ్యాపించిన యేటి పోటుపాటులను దమకమునఁ గనుగొంచును, నేను బ్రొద్దు పుచ్చుచుండువాఁడను. ఆ సంవత్సరమున వరదలు మిక్కుటముగ నుండెను. మేము నివసించెడి యింటి చుట్టు గోడదగ్గఱ పోఁతగట్టు నానుకొనియె దినములకొలఁది గౌతమీనది భయంకరాకారమునఁ బ్రవహించుచుండెను. ఏటఁ గొట్టుకొనివచ్చిన యొకమొసలి యా గ్రామమున కనతిదూరమున నివాస మేర్పఱచుకొని, నీళ్లు చొచ్చిన మేఁకలను దూడలను వేఁటాడుచుండెను. ఒకయడవి పందిని అప్పుడే తెగటార్చిన యచ్చటి రాజకుమారుఁడు, ఒకనాఁడా మకరిని బట్టి వధించి తెచ్చెను. అంత దానిపొట్టఁ గోసి చూడఁగా, ఉంగరములు, బంగారుపోగులు నందు గానవయ్యెను. అవి, రెండు రోజులక్రిందటనే ప్రమాదవశమున దానినోటఁ బడిన పసులకాపరి యగు నొకయర్భకునివి! పుత్రశోకార్త యైన వానితల్లి యవి చూచి గోలుగోలున నేడ్చెను.

ఏడవయేటనుండియే నాకు నెచ్చెలుల సావాసము మరగి మనుట యలవా టయ్యెను. నాయీడు బాలురు మా యింట నెవరును లేరు. నా రెండవతమ్ముఁడు పట్టిశిశువు. పెద్దవాఁడగు వెంకటరామయ్య మూఁడేండ్లు వయస్సు కలవాఁడు. ఐనను, వచ్చియురాని మాటలతో నుండి, తప్పటడుగులు వేయుచుండెడి యా పసివానికిని, సతతము స్నేహితులతోడి సుఖసంభాషణములకుఁ జెవి కోసికొనుచు, ఇంటఁ

గాలు నిలువక చెంగుచెంగునఁ బెత్తనములకుఁ బరుగు లిడు నాకును సఖ్యము సమకూరకుండుటచే, బయటిసావాసులే నాకు శరణ మగుచుండిరి. ఎప్పుడును ఏవింతలో చూచుచును, ఏవార్తలో వినుచును, ఏపనియో చేయుచును నుండినఁగాని నాకుఁ బ్రొద్దు పోయెడిదికాదు. సుజనులో దుర్జనులో సావాసులతో నుండుటయె నా కప్పటి యభ్యాసము! చెలికాండ్ర చెలిమి గోరువారికి విరోధులతోడి వైరము కూడ నేర్పడుచుండును. ఇదిగాక, సదా మిత్రులతోఁ గలసిమెలసి యుండువాఁడు, సమయానుగుణ్యముగఁ దాను వారిని నాలుగు కొట్టుటయు, వారిచే నాలుగు పడుటయును సామాన్యముగ సంభవించుచుండును. శైశవదశ నుండు నా పెద్దతమ్ముని కీ స్నేహసారస్య మేమియెఱుక? చీటికి మాటికి నేను జేయు చిన్నదండయాత్రలలో నన్ను వాఁడు చేరఁగోరి, వల్లె యనినను వల దనినను నాపాలిఁటి విధి దేవతవలె నన్నె వెన్నాడుచు, సమీపించినచోఁ దన్నిపోవుదు నను భయమున దూరమున నుండియే వాఁడు మా చిన్నకలహముల నుపలక్షించి, నా యుద్ధకౌశల మావంతయు మెచ్చుకొనక, నా జయాపజయము లైన బాగుగఁ బరిశీలింపక, నాయువేగమున నింటికిఁ జని, మహాప్రసాద మని యా వార్త తలిదండ్రులకు నివేదించుచుండువాఁడు! అంత మా నాయన యింట నుండినచో, నా కానాఁ డేదియో మూఁడినదే! శత్రుని పిడికిలి పోటులు శరీరమున శమింపకమున్నె, పండ్లు కొఱికి వచ్చెడి పితరుని తాడనపీడకు మరల నా దేహము తావలము గావలసినదే! ఒక్కొక్కప్పుడు పలాయితు లగు శత్రుమిత్రులును నా వలెనే మా జనకుని యాగ్రహానలమున కాహుతి యగుచుండురు.

నా కానాఁడు లభించిన యొక సావాసుని గుఱించి యిట నొకింత ప్రస్తావింపక తీరదు. అతఁడు నాకంటె నైదాఱేండ్లు

పెద్దయై, పొడుగుగ నుండెడివాఁడు. ఆ గ్రామనివాసియు ననుభవశాలియు నగు వానివాక్కులు నాకు వ్యాసప్రోక్తములు! నీట రాళ్లు రువ్వి కప్పగంతులు వేయించుట, కొయ్యతెరచాప లమర్చిన కాకియోడలను ప్రవాహమున కెదురుగ నడిపించుట, మా పెంపుడుకుక్కను రాజుగారి సీమకుక్కమీఁద కుసికొలిపి దానిని గఱపించుట,—ఇవి నా కనులు మిఱుమిట్లుగొనునట్టుగ నా మహనీయుఁడు దినదినమును ప్రదర్శించెడి విచిత్రవ్యాయామములు! అట్టి మేటినాయకుని నూఁతగఁగొని, వాని యడుగుజాడలనే నడువఁబూనుటయం దేమి యాశ్చర్యము? నేను విశ్వసించెడి రామరావణులు వట్టి క్షుద్రు లనియు, వీరికి మిన్న యగు వేలుపు గలఁ డనియు నతఁడు సూచించి, నాచెవులు చిల్లులు పడునట్టుగ నతనిపేరు "అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుఁ" డని నుడివినపుడు, నే నెట్లు వానిని గౌరవింపకుందును? ఇతఁడు వేవేగనే నాకు మార్గప్రదర్శకుఁడును నయ్యెను! పొగచుట్టయొక్క ప్రాశస్త్యవర్ణన మాయనయొద్ద నేను విని, అద్దాని కర్మకాండవిషయమై యాతనియొద్దనే మంత్రోపదేశముఁ గైకొంటిని. అంత మూఁడుదినముల వఱకును నే నేమి తినినను త్రాగినను, వమనము చేసికొనుచు వచ్చితిని. ఇట్టికష్టముల కోర్చి పట్టువిడువక యలవాటు చేసికొనినచో, చుట్టకాల్చుటయందు తనవలెనే నే నాఱితేఱి సుఖింతు నని యతఁడు నా కుద్బోధించెను. కాని నా యీ నూతనవిద్యారహస్యము, మా తమ్మునివలన విని, మా తల్లి యానాఁడు త్రాటితోఁ గొట్టిన దెబ్బలు, అర్ధశతాబ్దము గడచినవెనుకఁగూడ నా వీపున చుఱ్ఱు మనుచునే యున్నవి. చుట్టగాని, దాని చిన్నిచుట్టము లెవ్వి గాని పిమ్మట నెప్పుడును నా దరి చేరకుండుట యందలి రహస్యము, బాల్యమునం దానాఁడు మా జనని ప్రయోగించిన దివ్యౌషధప్రభావమె యని నేను బలుమారు తలపోసితిని!

# 3. బంధువియోగము

గోపాలపురమున బాలభోగములందు లగ్నమానసుఁడనై నే నుండునపుడు, పిడుగువంటివార్త యొకటి మాకు వినవచ్చెను. మా పెద్దమేనమామ శాస్త్రి వెంకటరత్నముగారు కడచిన వేసవి తుది దినములందు కలపవర్తకమునకు భద్రాచలపరిసరములకుఁ బయనము గట్టెను. ఒకసాహుకారునొద్ద రాజమహేంద్రవరమున గుమాస్తాగా నుండి, ఆతనితో నిపుడు కలపవర్తకమున భాగస్వామియై యెక్కువగ డబ్బు సంపాదింపఁగోరి, బంధుమిత్రులు వల దని వారించినను వినక మన్యప్రదేశముల కాయన ప్రయాణ మయ్యెను. కాని, గమ్యస్థానము చేరిన కొలఁదిదినములకే యాయన జ్వరపీడితుఁడై, ఉద్యమము విరమించుకొని యింటిమొగము పట్టెను. రాజమంద్రియందలి ఘనవైద్యు లెవరుగాని యాయనకు దేహస్వాస్థ్యముఁ గలిగింప నేరకుండిరి. ఇపు డాయన ప్రాణావశిష్టుఁ డయ్యె నని మాకు జాబు వచ్చెను. ఆ వానకాలమున మా తల్లిని మువ్వురు బిడ్డలను దీసికొని మా నాయన పడవలో బయలుదేరెను. అపుడే బొబ్బరలంకలాకు తెగిపోవుటచేత, ఈవలిపడవ లావలకుఁ బోవుట లేదు. మా తండ్రి మమ్మందఱిని యావలి పడవలో నెక్కించి, తాను వెనుకకు మరలెను. మిక్కిలి యలజడితో మే మంతట రాజమంద్రి చేరి, మా మేనమామ యదివఱ కొకటిరెండు దినములక్రిందటనే చనిపోయె నను దుఃఖవార్త వింటిమి. మా తల్లివిచారమునకు మేర లేకుండెను. మా మువ్వురు మేనమామలలోను ఈయనయే జ్యేష్ఠుఁడును ప్రయోజకుఁడును. కోపస్వభావుఁ డయ్యును, ఆయన కోమలహృదయము గల సత్పురుషుఁడు. చదువుకొనక దుస్సహవాసముల మరగి కాలము వ్యర్థపుచ్చెడి మా మాఁ

ఆత్మచరిత్రము

డవ మేనమామయగు వెంకయ్యగారిమీఁదఁ గోపించునపు డెల్ల నేనును భీతిల్లుచుండినను, నన్నాయన గారాబముతోఁ జూచుచుండువాఁడు. మా తల్లితోఁ గలసి వెళ్లి రాజమంద్రిలో వారియింటనే నుండినరోజులలో, నన్నాయన పెద్దబజారున నుండు తన కొట్టునొద్దకుఁ గొని పోయి, తనకు నాచేత మా తల్లి వ్రాయించిన యుత్తరములు పొరుగు వారలకుఁ జూపించి, నా విద్యాకౌశలమును వారికి వర్ణించి చెప్పుచు, ఎఱ్ఱనిపంచెలు చిలుకల రుమాళ్లును నాకుఁ గొనిపెట్టుచుండువాఁడు. సాయంకాల మాయన యింటికి వచ్చునపుడు పిల్లలమగు మాకు మిఠాయిపొట్లములు తెచ్చి యిచ్చుచుండును. శ్యామలదేహవర్ణముతోను, చంచలవిశాలనేత్రములతోను నొప్పుచుండి, ఆయన మా జననిని మిక్కిలి పోలియుండెను. ఆయన యకాలమరణము మ మ్మందఱిని దుఃఖార్ణవమున ముంచివేసెను.

కొన్ని దినములు రాజమంద్రిలో నుండి పిమ్మట గోపాలపురము వెడలిపోయినమేము, ఐదాఱునెలలలోనే మరల నచ్చటికి రావలసి వచ్చెను. పుత్రశోకార్తుఁడైన మా మాతామహుఁడు మనోవ్యథచే శీఘ్రకాలములోనే మంచ మెక్కెను. మేము వచ్చినప్పుడు, ఆ వృద్ధుఁడు మాట పడిపోయి యుండినను, మా మాటలు వినునపుడు ఆయనకు స్పృహవచ్చెను. చిన్నపిల్లలమగు మమ్మును గౌఁగలించుకొని, కన్నుల నీరు విడిచెను. తన పేరిఁటివాఁడును, ప్రియపౌత్రుఁడును నగు మా తమ్ముఁడు వెంకటరామయ్య నాయన యక్కున నదిమినపుడు, దుఃఖోద్రేకమున నపుడే యాయనప్రాణము లెగిరిపోవు నని యందఱు భీతిల్లిరి. ఒకటిరెండుదినములలో మా తాత కాలగతి నొందఁగా, ఇంట నందఱును దుఃఖవిహ్వలులైరి.

మా తాతగారు వేలివెన్నులో నివాస మేర్పఱచుకొని, క్రోశ దూరమందలి సత్యవాడ కనుగినయును కరిణీకపుఁబనులమీఁదఁ బోవుచుండెడివారు. ఆయనకు చాప లల్లుట, విసనకఱ్ఱలు కట్టుట మొదలగు చిన్నపనులయం దాసక్తి. ఈ పనులు నెరవేర్చుచు, ఆయన నాకును మా పిన్నికిని పద్యపాఠములు చెప్పుచుండువాఁడు. పసివాఁ డగు మా తమ్ముఁడు వెంకటరామయ్యకును ఆయన దాశరథీశతకములోని పద్యములు నేర్పెను. ఇట్టి ప్రియబాంధవుని వియోగము మాకు కడు దుస్సహముగ నుండెను.

## ౮. రేలంగి

నా యేనిమిదవయేట అనఁగా ౧౮౭౮–౯ సంవత్సరమున, మా తండ్రి యుద్యోగము చాలించుకొని స్వస్థలమగు రేలంగి చేరెను. రేలంగి రెండేండ్లక్రితమువఱకును మేము నివసించిన గ్రామమైనను, ఇపు డది నాకన్నులకుఁ గ్రొత్తగ గానిపించెను. అచట మా పెద్దపెత్తండ్రి గంగన్నగారిపుత్రికలు, పుత్రుఁడు వీరభద్రుఁడును నా కిపుడు సావాసులైరి. వీరిలో పెద్దది యగు రత్నమ్మ నాకంటె పదియేండ్లు పెద్దదియై, తాను నేర్చిన "లంకాయాగము" రాత్రిపూట శ్రావ్యముగఁ బాడి, నా కానందము గలిపించుచుండును. నా కీరీతిని రామాయణకథ విపులముగఁ దెలిసి, నా మనోవీథిని గొప్పయాశయములు పొడమెను. రెండవది యగు చిట్టెమ్మ నాకంటె కొంచెము పెద్దది యై, గ్రామమందలి మాయీడు బాలబాలికలతోడి యాటపాటలకు నన్నుఁ గొనిపోవుచు వచ్చెడిది. వీరభద్రుఁడు నా పెద్దతమ్మునికంటె కొంచెము పెద్దవాఁడై, వాని కీడుజోడై యుండెను.

రాత్రి భోజనానంతరమున నొక్కొక్కప్పుడు, మా పెదతండ్రి గారి కుటుంబమును మేమును నొకచోటఁ జేరి, తంపటపెట్టిన తేగలో, అనపకాయలో తినుచు, ఉబుసుపోకకు లోకాభిరామాయణము చెప్పుకొనుచుందుము. మా పెత్తండ్రి మిగుల పొట్టిగను చూచుటకుఁ గొంత భయంకరముగను నుండినను, కుటుంబసంభాషణములం దమితచతురతను బ్రదర్శించుచుండువాఁడు. ఆయన హాస్యోక్తులు పిల్లలకు పెద్దలకును మిక్కిలి నవ్వు పుట్టించెడివి. మా కుటుంబపూర్వచరిత్ర మాయన కన్నులార చూచినట్టుగ వర్ణించి చెప్పుచుండువాఁడు. మా తండ్రి, తాను ఉద్యోగకార్యములలోఁ దిరిగిన వివిధాంధ్రమండలముల యాచారసమాచారములను, అచటి తన యనుభవములును వివరింపుచుండు వాఁడు. పిల్లల మగు మాకుఁ దోఁచిన వ్యాఖ్యలు మేమును జేయుచుండెడివారము. సత్యకాలపు ముత్తైదువయగు మా పెత్తల్లి యచ్చమ్మ, ఏ వెఱ్ఱిమొఱ్ఱి ప్రశ్న వేసియో, చేతకాని పని చేయఁజూచియో, అందఱి పరియాచకములకుఁ బాత్ర యగుచుండును.

ఒకటి రెండు సంవత్సరములలో మా రెండవ పెత్తండ్రి, మూఁడవ పెత్తండ్రియు రేలంగి చేరిరి. వీరిలో మొదటివారగు వెంకటరత్నముగారు మాపూర్వుల నివాసస్థల మగు గోటేరులో నింతకాలము నుండి, యిపు డచట నొంటరిగ నుండలేక రేలంగి వచ్చిరి. ఉపాధ్యాయుఁడుగ నుండిన పద్మరాజుగారు తాను చిరకాలము నివసించిన దేవరపల్లి విడిచి, సోదరులతోఁ గలసి యుండుటకై రేలంగి ప్రవేశించెను. అందువలన పూర్వపుపెంకుటిల్లు మూఁడు చీలికలై మా ముగ్వురు పెత్తండ్రులకు నిపుడు నివాసస్థల మయ్యెను. మా జనకుఁడు నిర్మించిన పర్ణకుటీరమున మేము కాపుర ముంటిమి.

## ౭. రేలంగి

మా పెత్తండ్రులలో జ్యేష్ఠులగు గంగన్నగారితో పాఠకుల కిది వఱకే కొంత పరిచితి కలిగినది. ఆయన లౌక్యవ్యాపారములందును ముఖ్యముగ న్యాయసభలందలి వ్యాజ్యెములందును, ఎంతయో యభిరుచి గలిగి, వానియం దమితానుభవము నలవఱుచుకొని యుండెను. ఆ ప్రాంతమందలి మొఖాసాదారులగు క్షత్రియ ప్రముఖు లాయన యనుచరులు. ఆయన మంచి ధనార్జనపరుఁడు. వెంకటరత్నముగారు గోటేరు మున్నగు గ్రామములందు రాజులపక్షమున కరిణీకము చేయుచువచ్చెను గాని, ఆయన యభిమానవిద్య యాంధ్రసాహిత్యము. పద్మరాజుగారు చిరకాలము ఉపాధ్యాయుఁడై యుండినను, ధన సంపాదనమున తన రెండవయన్నవలెనే కొంత వెనుకఁబడి, ఆయన వలెనే సాహిత్యవిషయములం దభిరుచి గలిగి యుండెను. మా తండ్రి పెద్దయన్నకుఁ గల లౌకికకార్యదక్షతకును, ద్వితీయ తృతీయసోదరుల సాహితీపాండిత్యమునకును నోఁచుకొనక, బాల్యముననే సర్వేశాఖలో నుద్యోగము సంపాదించి, మధ్యమధ్య పని విరమించుకొని యిలు సేరుచుండినను, ఆశాఖలోనే మరలమరల నుద్యోగము చేయుచువచ్చెను. ఇట్లు వివిధమండలములం దాయన సంచారము చేసి సంపాదించిన సొమ్మును సమష్టికుటుంబ పోషణమునకై పెద్దయన్నకుఁ బంపించుచు వచ్చెను. గంగన్నగారు ద్రవ్యమును జాగ్రతపఱచుచు తణుకు తాలూకాలోని కొన్ని గ్రామములలో మంచిభూములు కుటుంబోప యోగార్థమై కొనఁగలిగిరి.

నా పదియవ సంవత్సరమున నేను రేలంగిలోని పాఠశాలలో నాంగ్లేయభాషాభ్యాస మారంభించితి నని జ్ఞప్తి. మా ప్రధానోపాధ్యాయుఁడు చామర్తి అన్నమరాజుగారు. ఆయన ప్రవేశపరీక్షవఱకును జదివినవారు. వేలుపూరులో నివాసమేర్పఱచుకొని, అనుదినమును

వేకువనే రేలంగి నడిచి వచ్చి, పాఠశాల నదుపుచుండెడివారు. పెద్ద తరగతులపాఠములు, ముఖ్యముగ నింగ్లీషుభాషయు, ఈయన బోధించుచుండెడివారు. రేలంగినివాసులగు కందిమళ్ల సుబ్బారాయుఁడు గారు సహోపాధ్యాయులు. వీరు ఖచితముగ నాంధ్రము గఱపుటయందును, శిష్యుల నదుపులో నుంచుటయందును ప్రసిద్ధి నొందిరి. ఉపాధ్యాయు లిరువురును సామాన్యముగ నొకరితో నొకరు సంప్రదించి సంభాషింప కుండెడి సఖ్యవిశేషమున నొప్పుచుండువారలు. ఆప్రదేశమందలి నా సహాధ్యాయులను గూర్చియు వారి చర్యలనుగుఱించియు కొంత చెప్పవలయును. దేశమున నింగ్లీషువిద్య యంత ప్రాచుర్యము కాని యాకాలమున, పాఠశాలలో నాంగ్లేయభాష నేర్చుచుండుటకే మిడిసిపడుచుండెడివారము. ఐనను, వేషభాషలందును, అభిరుచులందును మేము వట్టి జానపదులవలెనే సంచరించెడివారము. ఆటపాటలవిషయమున పట్టణములఁగల సౌకర్యములు మాకు లేకపోవుటవలన, ఉప్పట్లు, చెడుగుడి, దూళిబంతి, గూటీబిళ్ల మొదలగు ప్రాఁతయాటలనే మే మంటిపెట్టుకొని యుంటిమి. సెలవుదినములలో మే మొకచోటఁ జేరి, యుద్యోగస్థులవేషములు వేసి నాటకము లాడి, వినోదింతుము. ఒక్కొకతఱి పొలములలోనికిఁ బోయి, సేరెడుచెట్లెక్కి, నల్లనిపండ్లు కోసి, యింటినుండి తెచ్చినయుప్పుకారములపొడిలో నవి యద్ది భుజింతుము. మే మెంత జాగ్రతపడినను, నాలుక నల్లబడి గొంతుకు బొంగుపోయి, కొన్నిదినములవఱకును దగ్గుపడిసెములకు లోనై, మేము తలిదండ్రుల తిట్లకు తల లొగ్గుచుందుము. అప్పుడప్పుడు వీథులలో నాడెడి భాగవతము, జలక్రీడలు, తోలుబొమ్మలును, మా కమితాహ్లాదకరములుగ నుండి, కొన్నాళ్లవఱకును మా చిన్నియాటల కొరవడు లగుచుండును. మా రెండవ

పెదతండ్రికుమారుఁడు కృష్ణమూర్తి, తాటియాకులతో చిన్నబొమ్మలు చేసి, గుడ్డతెర మీఁద వాని నాడించుట మా చిన్నికన్నులకుఁ గడు చోద్యముగ నుండెను!

ఇప్పుడు నాకు ౧౧ సంవత్సరముల వయస్సు. విద్యాభిరతియు స్నేహాభిలాషయు నాకు మిక్కుటముగ నున్నను, గృహకృత్యనిర్వహణ మనిన నేను బెడమొగము పెట్టువాఁడను కాను. మా తల్లి కడు బలహీనురాలు. కని పెంచెడి పిల్లల సంఖ్య పెరిగి కుటుంబభార మధికమైనకొలఁది, ఆమె నిస్సహాయత యినుమడించెను. శైశవదశలో నే నెంత వ్యాధిపీడితుఁడనై జననీజనకుల నలజడిపాలు చేసినను, నాలుగైదేండ్లు వచ్చినప్పటినుండియు శరీరసౌష్ఠవ మేర్పడి, నాయంతట నే నాఁడుకొనుచు వచ్చితి ననియు, తన కమిత సాహాయ్యము చేయుచు వచ్చితి ననియును మా యమ్మ మురియుచుండెడిది. ఆయిల్లా లంతగ గడుసుఁదన మెఱుఁగని పూర్వకాలపు స్త్రీ. కుటుంబనిర్వాహకమునందు తగిన జాగ్రత లేకుండె నని మొదటిదినములలో మా తండ్రి యామెను బాధించుచుండెడివాఁడఁట. కాని, నాకు ప్రాజ్ఞత వచ్చినది మొద లాయన యిట్టికార్యములు కట్టిపెట్టవలసివచ్చెను. మా తల్లిని దూషణోక్తు లాడి హింసింపఁబూనునపుడు, నే నాయన తల కెగఁబ్రాకి, జుట్టుపట్టి వంచి, వీపుమీఁదఁ గొట్టుచుండెడి బాల్య దినములు నాకు బాగుగ జ్ఞాపకము. రేలంగి కాపురఁపు తుది దినములలో మాతల్లి సంతానము నలుగురు కుమారులు నొకకొమార్తెయు. మా జనని యొక్కతెయె యింటిపనులు జరుపుకొనవలసివచ్చెడిది. తల్లి కష్టము లూరక చూచుచుండ నోర్వలేక, నే నామెకుఁ దోడుపడెడివాఁడను. పాఠశాలనుండి వచ్చినతోడనే, పుస్తకము లొకమూల వైచి, కాలు చేతులు గడిగికొని, ఏడ్చెడి శిశువు నెత్తికొని యాడించుచు, నే నామెకు

సాయము చేయుచుండువాఁడను. ఆమె యింట లేనపుడు నేనే మడిగట్టి, నా వచ్చియురాని వంటతో సోదరులకు భోజనము సమకూర్చుచుందును. రాజమంద్రి వెళ్లినపిమ్మట పాఠశాలలోని చదువునకు నే నెక్కువ శ్రద్ధ వహింపవలసిన కాలమందును, ఇంటఁ దల్లికిఁ దోడుపడుట నా కార్యక్రమమున నంతర్భాగ మయ్యెను. దీనికి బంధువులు సహచరులు న న్నొక్కొక్కమాఱు గేలి చేసినను, జననీసేవయు సోదరపరిపోషణమును నవమానకరమని తలంపక, విద్యానిరతికిని గృహకృత్యనిర్వహణమునకును ఆవంతయు విరోధము లేదని బాగుగ గుర్తెఱిఁగి మెలఁగితిని.

## ౫. దు ష్కా ర్య ము.

నేను ౧౧-వ యేటఁ జేసిన యొక దుష్కార్యమువలన నామనస్సు మెరమెరలాడు చుండును. నాలుగవతరగతి పఠనీయపుస్తకములలోని "ఆసియాభూగోళము" నాకు లేదు. ఎన్నిసారులు కొను మని వేడినను మాతండ్రి యాపుస్తకము నాకుఁ గొనిపెట్టలేదు. మాసహపాఠకులలో అచ్యుతరామయ్య యనువాఁడు కారణాంతరములచేతఁ జదువు మానివేసి, నాకుఁ దనపుస్తక మమ్మఁజూపెను. దానివెల నాలుగణాలు. తరువాత డబ్బిచ్చెద ననఁగా, నా కాతఁడు పుస్తక మిచ్చివేసెను.

ఆతఁ డెన్నిసారులు తన డబ్బడిగినను, నే నేదో మిష చెప్పి తప్పించుకొనువాఁడను. ఒకనాఁ డతఁడు పాఠశాలకు వచ్చి, సొమ్మీయుమని గట్టిగ నడిగి, "నా పావులా యిచ్చువఱకును నీపుస్తకము లీయ" నని చెప్పి, నాపుస్తకములబొత్తి లాగివైచెను. పుస్తకములకై మే మిద్దఱము పెనఁగులాడినప్పుడు, అవి క్రిందఁ బడిపోయెను. అందఱిలో న న్నితఁ డవమానము చేయుటకు నేను కోపించి, వాని మీఁదఁ గసి తీర్చుకొన

నొకయుపాయము చేసితిని. నాఁడు ప్రొద్దున నే నడుగఁగా మాతండ్రి పుస్తకము ఖరీదు నా కిచ్చివేసె ననియు, అది యాతని కొసంగుటకై యొక పుస్తకములో నుంచితి ననియు, అచ్యుతరామయ్య నాపుస్తకములు చిందరవందరగఁ జేసినపు డాపావులా యెక్కడనో పడిపోయె ననియును నే నంటిని! తనమూలముననే పావులా పోవుటవలన నాతఁడె నష్టపడవలె నని నావాదము. ఈయొక పన్నుగడమూలమున రెండుపనులు సమకూరు నని నాయాలోచన,—ప్రాఁతయప్పు తీఱి పోవుట యొకటి, పరాభవము చేసినవానిమీఁదఁ బగ సాధించుట మఱియొకటి!

మొదట నేను బరియాచకమునకె యిట్లనుచుంటినని యచ్యుతరామయ్య తలంచెను. కాని, మొగము ముడిఁచి, మాటిమాటికి పుస్తకములో పావులా యుంచితి నని చెప్పుచుండుటచేత, నామాట లాతఁడును దగ్గఱవారును నమ్మి, నాపుస్తకములు పలుమాఱు తిరుగవేసి చూచిరి. క్రిందిదుమ్ములో వెదకిరి. ఎక్కడను పావులా కానఁబడ లేదు. పావులా నే నింటియొద్దనుండి తెచ్చుటయె నిజ మైనచో, తన మూలముననె యది పోయెను గావున, తానె యానష్టము వహింతు నని యచ్యుతరామయ్య చెప్పివేసెను.

ఐన నింత సులభముగ నీయుదంతము సాంతము కాలేదు. ఆప్రొద్దున మాతండ్రి నాచేతికి పావులా యిచ్చివేసె నని స్పష్టపడవలెను. కావున నచ్యుతరామయ్య నన్ను బ్రమాణము చేయు మనెను. ఒకయబద్ధ మాడువాఁడు తనమాట నిలువఁబెట్టుకొనుటకు పెక్కులసత్యములు పలుకవలెను. నే నపు డెన్ని యొట్టులో పెట్టుకొంటిని; ఎన్ని ప్రమాణములో చేసితిని! నాయసత్యతములు పెరుఁగుచుండ[illegible]

మనస్సున వెత నొందుచున్నను, డబ్బుమీఁదఁ గన్నువేసి, అన్నమాట పోవునను భయమున, నే నెన్నిబాసలకును వెఱవలేదు! నా స్థిరత్వము నా సత్యవాదిత్వమున కమోఘనిదర్శనమని యచట నందఱును రూఢిచేసికొనిరి. ఈసిద్ధాంతమును స్థిరపఱచుట కింకొకసంగతియు కావలెను. అది మా తండ్రి సాక్ష్యము. కాని, దానినిగూర్చి నా కేమియు భయము లేదు. పిమ్మట నేను నెమ్మదిగ మానాయనతో మాటాడి లాభకరమగు నామాటను సమర్థించునటు లాయన నెటులో యొడఁబఱుపఁగల నని నాయాశయము! కావున నే నీరుజువునకును సమ్మతించి ధైర్యమున నుంటిని.

కాకతాళన్యాయముగ మా తండ్రి యపుడె యాదారిని బోవుచుండెను. అచ్యుతరామయ్య యాయనను గలసికొని, తనపుస్తకపుబాకి నిప్పింపు డని మెల్లగ నడిగెను. ఒకటిరెండు రోజులలో తప్పక యిచ్చివేయుదు నని మానాయన పలికి, అచ్యుతరామయ్య ప్రశ్నింపఁగా, తా నాప్రొద్దున నాచేతికి డబ్బేమియు నీయలే దని చెప్పివేసెను!

పరిభవభారమున నాశిర మంత నేల కొరగిపోయెను! పిమ్మట నేనుగనఁబడినపు డెల్ల, అచ్యుతరామయ్య నన్ను దెప్పుచు, నాయొట్టిబాసలు నాకు జ్ఞప్తికిఁ దెచ్చి, నామనస్సునందలిపుండును రేఁపుచుండువాఁడు! కొంతకాలమువఱకును సహచరులమోములు చూచుటకు నేను సిగ్గుపడుచుండువాఁడను. జరిగిపోయినది మాపుట దుస్సాధ్య మైనను, ముం దెట్టియసత్యములకును మోసపుఁబనులకును బాల్పడ నని మనోనిశ్చయము చేసికొంటిని!

## ౬. రాజమహేంద్రవరము

రేలంగి పాఠశాలలోని మిక్కిలి పెద్దతరగతిపరీక్షలో జయమంది, నేనును మఱికొందఱు విద్యార్థులును మా ప్రథమోపాధ్యాయు వొద్ద ప్రత్యేకముగ నింగ్లీషు మూఁడవపాఠపుస్తకము చదువ నారంభించితిమి. ఇట్టి యసంపూర్ణ ప్రయత్నములవలన నంతగ లాభము లేదని గ్రహించి, మాతలిదండ్రులు మాయున్నతవిద్యాభివృద్ధికై మమ్ము రాజమండ్రి కొనిపోఁదలఁచిరి. మా రెండవ పెత్తండ్రి పెద్దకొడుకు నాగరాజు, వయస్సున నాకంటె నైదారేండ్లు పెద్దవాఁడు, ఆంగ్లవిద్యానిమిత్తమై రాజమండ్రి యంతకుమునుపే వెడలిపోయెను. దేశమంతయు తిరిగి, ఇంగ్లీషువిద్య నేర్చినవారికే యెల్లెడల నున్నతపదవులు లభించుట కనిపెట్టిన మాజనకుఁడు, మే మింక స్వగ్రామమున నుండుట ప్రయోజనకారి కాదనియు, కుటుంబమును పట్టణమునకుఁ జేర్చినచో మరల తన కుద్యోగసంపాదనమును మావిద్యాపరిపోషణమును గలుగు నని యెంచి, ౧౮౮౨ సం. జూలై నెలలో మ మ్మందఱిని రాజమండ్రికిఁ గొనిపోయెను. ఇన్నిసుపేటలోని గొట్టుముక్కలవారి యింటిలోని మొదటిభాగము, పూర్వము మా మేనమామలు నివసించియుండునది. మే మిప్పుడు నెల కొకరూపాయ యద్దెకుఁ బుచ్చుకొంటిమి. ఇప్పటివలె నింటిమీఁద నిల్లుండి, దోమలకును దుర్వాసనలకును తావలము గాక, ఆకాలమం దాపేట యుద్యానవనమువలెఁ జెన్నొందుచుండెను. మే మున్నయింటిపెరడు విశాలముగ నుండి, చూతనారికేళాదిఫలవృక్షముల కాకరమై, కోనసీమతోఁటవలెఁ జెలువారుచుండెను. పేటమధ్యమున పండ్లయంగడులు కాయగూరలదుకాణములు తదితరవస్తువిక్రయశాలలు నొప్పారుచుండెను. పెద్దవీథి కిరుకెలంకులందును, పలురకముల పూలచెట్లు వెలసియుండెను. ఈదృశ్యములు మాచిన్ని

కన్నుల కద్భుతామోదములు గొలుపుచు, స్వర్గలోక సౌందర్యముల స్ఫురింపఁజేయుచుండెను.

౧౮౭౨ వ సంవత్సరమున రాజమండ్రిలో "దేశాభిమాని పాఠశాలా" ధికారి సాహాయ్యమున వారిపాఠశాలలో ప్రవేశించి, ఆఱునెలలుమాత్రమే చదివి, ఆసంవత్సరాంతమున నేను వెంకటరామయ్యయును వరుసగా ౩, ౧ తరగతులపరీక్షల నిచ్చితిమి. మరుసటిసంవత్సరమున దానికంటె చేరువను క్రమముగ జరుగుచుండెడి "ఇన్నీసుపేట పాఠశాల"లో మే మిరువురమును జేరితిమి. ౧౮౭౩-వ సంవత్సరాంతమున "తారతమ్యపరీక్ష"లోను, మరుసటి సంవత్సరమున "మాధ్యమికపరీక్ష"లోను, నేను కృతార్థుఁడ నైతిని. నావలెనే మాతమ్ముఁడును విద్యాభివృద్ధిఁ గాంచుచుండెను.

రాజమండ్రిలో మావిద్యావిషయమై మా జననీజనకులు పూనిన శ్రద్ధనుగుఱించి యొక్కింత ప్రస్తావింపవలెను. మా చదువుసాములు క్రమముగ నెరవేరుటకై మాతండ్రి మరల సర్వే యుద్యోగములోఁ జేరి సాధారణముగఁ బరదేశమున నుండెడివాఁడు. తా నెన్నికడగండ్లు పడి యెట్టిశోధనలకు గుఱి యయ్యును, మా విద్యాభివృద్ధికిని కుటుంబపరిపోషణమునకును వలయుధనము నాయన సముపార్జనము చేసి మాకుఁ బంపుచుండువాఁడు. ఈసొమ్ముతో మాతల్లి యిల్లు నడుపుచు, మాచదువులు సాగించుచువచ్చెను. తండ్రి యింట లేని బాలకులు, దుస్సహవాసముల మరగి, దుష్ప్రవర్తనలకు దిగి, కాలము దుర్వినియోగము చేసెద రను గట్టినమ్మకమున నామె, పాఠశాలకును బజారు వెచ్చములకును బోవునపుడు తప్ప తక్కినకాలమందు, మమ్ము గడపదాటనీయకుండెడిది! ఇది మాస్వేచ్ఛ కమితప్రతిబంధకమై

కుఱ్ఱవాండ్రము సణుఁగుకొనుచుండెడివారము. మా రెండవ పెద్దతండ్రి కుమాళ్లు, తలిదండ్రులను లెక్కసేయక, మాముందే స్వేచ్ఛావిహారములు సలుపుచుండుటకు మా కనులు మఱింత కుట్టెను.

గృహపాలనమున మాజనని పూనిన కఠినపద్ధతివలనఁ గొంత చెఱుపు కలిగె నని చెప్పక తప్పదు. తిరిగెడి కాలునకును చూచెడి కనులకును అడ్డంకి కలిగినచో, దేహమనశ్శక్తులు గిడసఁబాఱు ననవచ్చును. కూపస్థమండూకములవలె నిరతము నింటి నంటిపెట్టుకొనుటచే, తోడి బాలురకుండు గడుసుఁదనము లేక మేము లోకజ్ఞానవిషయమునఁ గొంతవఱకు వెనుకఁబడి యుంటిమి.

ఐనను, తల్లి యదుపులో నుండుటచే మొత్తముమీఁద మాకు మేలె చేకూరెను. ఆయిల్లాలిమాట జవదాటకుండుటవలననే, క్రొత్త ప్రదేశమందలి దుశ్శోధనములకును దురభ్యాసములకును మేము లోను గాకుండుటయు, మంచినియమములు కొన్ని మేము బాల్యమందె నేర్చుకొనుటయును సంభవించెను. రాజమండ్రి వచ్చిన క్రొత్తఱికమున మాతమ్ముఁడు వెంకటరామయ్య బడికిఁబోవుటయందుఁ గొంత కొంటెతన మగఁబఱచెను. ఇంటినుండి వాఁడు నాతో బయలుదేఱినను, కొంతదూరము వచ్చినపిమ్మట మెల్లగ వెనుకఁబడి, ఏసందుగొందుల లోనో దాగియుండి, నేను బడినుండి మరలి వచ్చుసమయమున ముందుగ నడుగు లిడి యిలు సేరుచుండును! నావిద్యాధోరణినే యుండిన నే నీసంగతి కొన్నిదినములవఱకును గమనింపక, పిమ్మట వానిమీఁద ననుమానము కలిగి, వానితరగతివారి నడిగి వాని టక్కరితనము తెలిసికొని, ఈసమాచారము మాయమ్మ కొకనాఁడు చెప్పివేసితిని. అపుడామె పెరుగు చిలుకుచుండెను. మాతమ్ముని నంతట ప్రశ్నించి, తగినసమాధానము వాఁ డీయ నేరకుండుటచేత, కవ్వపుఁ

ద్రాటితో వాని నామె చిదుకఁగొట్టెను. నాఁటినుండియు మే మెవ్వరమును బొంగులకును బడిదొంగతనములకును బాల్పడువారము కాము!

మా పెదతండ్రికొడుకులు స్వయముగ ధనికుల నాశ్రయించి విద్యాసంపాదనము చేయుచుండుటకు సంతసించి, జననీజనకులు వారిజోలి కెపుడును బోకుండిరి. అందువలన నాపిల్లవాండ్రు, ఇచ్చవచ్చినపోకడలు పోయి, నాటకసమాజములఁ జేరి, తుదకు ఆయురారోగ్యములకే ముప్పు తెచ్చుకొనిరి. మమ్ముఁ జూచినపు డెల్ల లౌకికజ్ఞానవిషయమందు మేము వెనుకఁబడియుండుటకు వారు విచారించుచు, ఊరక మమ్ము నాటకములకుఁ గొనిపోవుదు మనియు, ఉత్సవాదులు చూపింతు మనియు జెప్పి మమ్ము శోధించుచువచ్చిరి. మేము వారివలలోఁ బడక, చీటికి మాటికిని వారు పలుకు చిన్నకల్లల కచ్చెరు వొందుచుందుము. అంత వ్యాధిగ్రస్తుఁడై ప్రవేశపరీక్ష తరగతిలోనే పెద్దవాఁడును, పిమ్మట కొంతకాలమునకు రెండవవాఁడును, అకాల మరణమువాతఁ బడిరి.

మాతల్లి మమ్ము రాత్రులు నాటకాదులకే కాక, పగలు చదువుకొనుటకు సావాసులయిండ్లకును బోనీయకుండును! ఈకఠిన నియమము మాకును మిత్రులకును మొదట మిగులఁ గష్టముగఁ దోఁచినను, పిమ్మట నెంతో శ్రేయోదాయక మయ్యెను. స్వయంకృషిచేఁ జదువుకొనుటకు మాకు మహావకాశము లొదవెను. చదువుకొనునంత సేపును చదువుకొని, సోదరులము మాలో మేమే యాఁడుకొనుచుందుము. విద్యార్థుల కతిసూక్ష్మముగఁ బట్టుపడు బూతులు బాసలు నందువలన మాకు దూరీకృతము లయ్యెను. చదువుకొనుటకు మమ్ము రాత్రులు సహపాఠులయిండ్ల కెన్నఁడును ఆమె పోనీయదు. వారితోఁగలసి చదువుకొనుట మాకంతగ నావశ్యకమయ్యె నేని, వారినే మాయింటి

కాహ్వానము చేయుఁ డని యామె చెప్పి, చదువుకొనుటకు మాకు సదుపాయములు గల్పించును. వారిమాటలు చేష్టలును బరిశీలించి, సుగుణదుర్గుణములు గనిపెట్టి, దుస్సహవాసుల బారినుండి మ మ్మామె తొలఁగించుచుండును.

పిల్లకాలము మావిద్యాసౌశీల్య పరిపోషణకార్యమందు మా యమ్మ మఱి వెఱుంగని యట్టితీక్ష్ణ జాగరూకతను జూపఁగలిగె నని నే జెప్పఁజాలను. సంతానము పెరిఁగి యోపిక తగ్గినకొలఁది, పిల్లల చదువుసాముల పెంపునుగూర్చి యామె వెనుకవలె శ్రద్ధ వహించుటకు సాధ్యపడలేదు. అద్దాని యావశ్యకమును పిమ్మట లేదయ్యెను. ౧౮౮౪ వ సంవత్సరమునుండి మాతండ్రి యుద్యోగము చాలించుకొని, సామాన్యముగ నింటనే విడిసియుండెను. నేనును నాతరువాతివాఁడగు వెంకటరామయ్యయును, పెద్దతరగతులకు వచ్చువఱకును మాయమ్మ మమ్ముఁ గనిపెట్టి కాపాడెను. చిరకాలాభ్యాసమున సోదరుల మిరువురమును సాధువర్తనము వీడక, విద్యయం దభివృద్ధి నొందుటయే, తక్కినవారికి మార్గప్రదర్శకమయ్యెను. బాల్యదశలో జనని యాజ్ఞానుసరణమువలెనే, యౌవనమున జనకుని ప్రేమానుభవమే, మమ్ము న్యాయమార్గమును వీడకుండునట్లు చేసెను.

## ౭. అల్లరిచేష్టలు

మాధ్యమికపరీక్షలో జయమంది నేను ౧౮౮౫-వ సంవత్సరారంభమున నైదవ తరగతిలోఁ జేరితిని. నావలెనే యా పరీక్షలోఁ గృతార్థులై సంతోషమున మున్నందు మిత్రబృందముతోఁ గలసి నేను వినోదించుచుండువాఁడను. మాకు గణిత ప్రకృతిశాస్త్ర

ములు బోధించుటకు శర్మగారను నొక నూతనోపాధ్యాయుఁడు చెన్నపురినుండి వచ్చెను. ఆయన యెంతో బుద్ధికుశలతయు నుత్సాహమును గలవాఁడె కాని, శిష్యులయెడ కాఠిన్యముఁ బూనుచుండెడివాఁడు. మా చిన్నలోపములకుఁ బెద్దశిక్షల నొసఁగుచుండును. పాఠశాలలో నింకే యుపాధ్యాయుఁడు నిట్లు మమ్ముఁ బీడించువాఁడు కాఁడు. పట్టణమునుండి యేతెంచిన తాను తక్కిన యుపాధ్యాయులకంటె ప్రజ్ఞావంతుఁడ ననియు, పెద్దజీతకాఁడ ననియు శర్మ విఱ్ఱవీగుచుండువాఁడు. ఈతని తలబిరుసుతన మెటు లణఁగునా యని తక్కిన యుపాధ్యాయులు తలపోయుచుండిరి.

పదిమంది సహపాఠుల మంతఁ గూడి, పాఠశాలాధికారి కొక విజ్ఞాపనము వ్రాసికొంటిమి. శర్మచర్యలు శర్మచేష్టలును వేరొక్కని, యీ నిరంకుశాధికారియుపాధ్యాయత్వమునుండి మమ్ముఁ దప్పించి, పాఠశాల మంచిపేరు నిలుపుకొనుఁడని మేము ప్రార్థించితిమి. కాని, యెన్ని దినములకును మా మొఱ లాలకింపఁబడలేదు. మా 'యర్జీ బుట్టదాఖ' లయిన దని మే మంత తలపోసి, అధికారులకు మా సంగతి నచ్చఁజెప్పుటకై పాఠశాలకుఁ బోకుండ మేము సమ్మెగట్టితిమి! పుస్తకములు చేతఁబట్టుకొని పాఠశాలకుఁ జేరువనుండు నొక సావాసునిగదిలో మేము చేరి, మాసమ్మెను గూర్చినమాటలతో దినమంతయుఁ గడపి, సాయంకాలమం దింటికిఁ బోవుచుండుటచేత, పెద్దవారలకు మాసమ్మెనుగూర్చి యంతగఁ దెలియలేదు. సహపాఠులంత మాగదిలోనికి వచ్చి, మమ్మునుగూర్చి శర్మ తరగతిలోఁ బలికెడి కటువుపదములు, తక్కినయుపాధ్యాయుల సానుభూతివాక్యములును, మాకుఁ దెలుపుచుండువారు. మాసమ్మెమూలమున పట్టణమందలి విద్యార్థిలోకమున నెంతయో కలవరము గలిగెను.

## ౭. అల్లరిచేష్టలు

అందఱికంటె నా కెక్కువగా భావోద్రేకము గలిగెను కొంతకాలముక్రిందట రాజమహేంద్రవరమునొద్ద గోదావరిలో పడవ యొకటి మునిఁగిపోయి, జనులనేకులు చనిపోయిరి. ఆ విపత్తును గుఱించి యాంగ్లమున నే నొకపద్యమాల రచియించితిని. ఇపుడీ పాఠశాలలోని యుదంతమునుగుఱించికూడ నింగ్లీషున నొకగీతమాల కల్పించితిని. మాయాగ్రహమునకుఁ బాత్రుఁడైన యుపాధ్యాయుని చేష్టలు గుణములును వేరొక్కని, పేరు మార్చి, దుర్గుణములు పెంచి, కథానాయకుని వర్ణించితిని!

ఎట్టకేలకు మావిజ్ఞాపనవిషయమును విమర్శించుటకై పాఠశాలాధికారి పార్లి శ్రీనివాసరావుగారు విద్యాశాలకు వచ్చిరి. పిలుపు రాఁగా, సమ్మెదారుల మండలమును తరగతిలోఁ బ్రవేశించితిమి. మావృత్తాంతము వారడుగఁగా, ఎవరికిఁ దోఁచినమాటలు వారము చెప్పివేసితిమి. నావాదమున నుత్ప్రేక్ష లుండుట నాకుఁ దెలియును. మా గురువు క్రూరుఁ డనియు, కఠినచిత్తుఁ డనియు, స్థిరపఱచుటయే నాయుద్దేశ్యము!

మాసాక్ష్యము విని, విజ్ఞాపనవిషయములు విమర్శించుచు, విద్యార్థు లిట్టిఫిర్యాదులలోను, తిరుగుబాటులలోను నుండుట కడు విచారకర మని యధికారి తలంచి, అర్జీదారులనే దోషు లని నిర్ధారణ చేసిరి. మావాదమును బట్టి మాలో మిగుల పొడుగుగా నుండెడివాఁడును, మిగుల పొట్టివాఁడును, మొనగాండ్రని యాయన పలికెను. పొడుగాటివాఁడు తణుకు చలపతి; పొట్టివాఁడను నేను. అంతట మేము చేతులు చాఁచి బెత్తపు దెబ్బలు తింటిమి. కాని, యనతికాలములోనే శర్మగారు మహరాసు పయనము గట్టిరి!

ఇది జరిగిన చిరకాలమునకుఁ బిమ్మట శర్మగారును నేనును రైలులోఁ గలసికొంటిమి. అప్పుడాయన మద్రాసులో న్యాయవాదిగను, నేను బెజవాడలో నుపాధ్యాయునిగను నుంటిమి. "మీ ప్రస్తుతానుభవమునుబట్టి మీచిన్ననాఁటిచర్య వట్టి యల్లరిచేష్ట యని మీరంగీకరింపరా?" యని యాయన యడిగినప్పుడు, మే మిరువురమును నవ్వుకొని, లోకవిశేషములు మాటాడుకొంటిమి!

## ౮. స్నేహ సహవాసములు

మేము రాజమండ్రి చేరిన కొంతకాలమునుండి ౧౮౮౭-వ సంవత్సరము వఱకును, అప్పుడప్పుడు ఏకొలఁదిమాసములో తప్ప తక్కినకాలమంతయును, మాతండ్రి యుద్యోగఁపుఁబనుల మీఁద విదేశమున నుండుచువచ్చెను. మా రెండవ మేనమామ తఱచుగ రాజమండ్రి వచ్చి, బజారునుండి వస్తువులు కొని తెచ్చి మా కిచ్చి స్వగ్రామము వెడలిపోవుచుండువాఁడు. కావున సంసారము నడిపి మా చదువుసాములు సాగించు భారమంతయు మాతల్లి మీఁదనే పడెను. పిల్లలలో నెవరికైన జబ్బు చేసినయెడల, ఆమె రాత్రి నిద్దుర మాని కూర్చుండును. ఇరుగుపొరుగున దొంగలు పడినయెడల, రాత్రు లామెకు కనుకు పట్టనేపట్టదు! ఇట్టిబాధలు ౧౮౮౭-వ సంవత్సరము వేసవికాలమున మిక్కుటమయ్యెను. రాజమండ్రి వేసవిగడుపుట కనువగు ప్రదేశము కానే కాదు. దీనికిఁ దోడుగ, ఆయేఁట నెండ లతిశయించియుండెను. పట్టణమున మశూచి ప్రబలెను. మేము భయపడినట్టుగనే, స్ఫోటకదేవత శీఘ్రమే మాయింట పీఠము వేసికొనెను. నాకుఁ జిన్ననాఁటనే మశూచకము గానిపించెనఁట. వెంకటరామయ్య తప్ప తక్కినపిల్లలంద ఱికి నిపుడు స్ఫోటకము సోఁకెను. పాపెక్కువయై కొందఱు మిగుల

బాధపడిరి. రోఁతవిసువులు వీడి నేను దల్లితోపాటు పిల్లలకుఁ బరిచర్యలు చేసితిని. వెలివెన్ను పోయి మాయమ్మమ్మను పట్టణమునకుఁ గొనివచ్చితిని. దైవానుగ్రహమున పిల్ల లందఱును కాలక్రమమున నారోగ్యస్నానము చేసి సుఖముగ నుండిరి.

మే ముండునింటికిఁ జేరువ మమ్మెఱిఁగినవారును బంధువులును నంతగ లేనందున, ౧౮౮౬-వ సంవత్సరమున మా పెద్దతండ్రిగారును, ఇంకఁ గొందఱు కావలసినవారును నివసించెడి రాఘవయ్యగారి కొట్లలోనికి మేము వెడలిపోయితిమి. అందువలన నొంటరిగ నుండవలసిన కష్టము నాకుఁ గొంతవఱకుఁ దొలఁగిపోయెను.

ఆ సంవత్సరముననే మా సోదరులలో నాలుగవవాఁ డగు సాంబయ్యను మా మేనమామలు తమ గ్రామమునకుఁ దీసికొని పోఁగా, అచ్చట పొంగు చూపి వాఁడు చనిపోయెను. అందఱిలోను వాఁడు మిగుల నీరసుఁడు. ముద్దుమోమున నుండెడి యాబాలకుని మరణము మమ్మందఱిని దుఃఖాబ్ధిని ముంచివైచెను. ఇదివఱకు పుత్రశోక మెఱుఁగని మాతల్లి యిట్టిదుఃఖమున వేఁగెను. ఆ మఱుసటి సంవత్సరమున మా కుటుంబమున నింకొకమరణము తటస్థించెను. మా రెండవ పెద్దతండ్రికుమారుఁడు, నాగరాజు, నావలెనే ప్రవేశపరీక్షకుఁ జదువుచుండెను. అతని కప్పుడు వ్యాధి యంకురించి, కొలఁదిదినములలోనె వానియసువులను గొనిపోయెను. పాప మాతఁడు విద్యాస్వీకారమునకై గంపెడాసతో రాజమండ్రి కేతెంచి, పడరానిపాట్లు పడి, విఫలమనోరథుఁడై, తుద కకాలమృత్యువువాతఁ బడెను! కొలఁదికాలము క్రిందటనే యాతని భార్య కాపురమునకు వచ్చియుండెను.

జ్యేష్ఠపుత్రుని మరణమున కోపక, తీర్పరాని మనోవ్యాధకు లోనైన మా పెదతండ్రి కంతట రాచకురుపు వేసి, ౧౮౮౭-వ సంవ

త్సరారంభమున నాయనజీవములఁ గొనిపోయెను. అన్నవ్యాధిసమాచా రమును సకాలమున నేను దెలుపకుండిన హేతువున, కన్నులార నాయనను గడసారి చూడలేకుంటి నని మాతండ్రి మిగుల వగచెను.

రాజమండ్రి పోయినది మొదలు ఉన్నతపాఠశాలలో నేను జదువు పూర్తిచేసిన యైదు సంవత్సరములలోను, నేను దమ్ము లును బయటి సహవాసుల నంతగ సెఱుఁగమనియే చెప్పవచ్చును! ఇంట మాతమ్ములు చెల్లెండ్రు, పాఠశాలలో సహపాఠులును, మా ముఖ్యసహవాసులు. నేను మాధ్యమికపరీక్షతరగతిలోఁ జదువున పుడు, అనఁగా ౧౮౮౭-వ సంవత్సరమున, మా తరగతిలోని నా పరి చితులలో కూనపులి కొండయ్యశాస్త్రి ముఖ్యుఁడు. తరగతిలోఁ దెలివి గలవారలలో శాస్త్రి యొకఁడు. అచిరకాలములోనే నే నీతనిని మించి మొదటివాఁడ నైతిని. అప్పటినుండియు నా కితఁడు సహవాసుఁ డయ్యెను. ప్రభుత్వమువారి మాధ్యమికపరీక్షలో మాపాఠశాలలో మొదటితరగతిని జయము నొందిన నలుగురిలోనే నొకఁడను. కొండయ్య శాస్త్రి మాత్రము మూఁడవతరగతి నైనఁ దేఱక, మరలమరల క్రింది తరగతియందే కాలము గడుపుచుండెను. ఈతఁడు నావలెనే ఇన్నీసు పేటలో నివసించెడివాఁడు. సాయంకాలమునను, సెలవు దినములం దును, శాస్త్రి మాయింటికి వచ్చి, నన్ను షికారునకుఁ గొనిపోవుచుం డును. నా వెనుకటి సహపాఠియు, మొగమెఱిఁగిన విద్యార్థియు నగు టచేత, నే నాతని సావాసమున నుండుటకు మాతల్లి యభ్యంతరము పెట్టెడిది కాదు. లోకవిషయములు నాకుఁ దెలుపుచు, పాఠ్యగ్రంథ ములందు నిమగ్నమైన నామనస్సునకు, శాస్త్రి కొంత విరామము గలిగించుచుండువాఁడు. సాహిత్యవిషయములందు తనకుఁగల యభి రుచి నాకును గలిపింప నితఁడు ప్రయత్నించుచుండువాఁడు. ఇతనిసం

భాషణ మతిశయోక్తులతోఁ గూడియును, మొత్తముమీఁద జ్ఞానదాయకముగను సంతోషకరముగను నుండెడిది.

నా రెండవమిత్రుఁడు బంధకవి వెంకటరావు. రాజమంద్రిలో మొదటినుండియు నా కితఁడు సహాధ్యాయుఁడు. పరిస్థితుల వైపరీత్యమున నితఁ డిటీవల విద్యాభ్యాసమున నంతగ శ్రద్ధ వహింపకుండినను, తరగతిలోఁ దెలివిగలవారలలో నొకఁడు. నాతోఁ జెలిమి చేసి చదివినచో, తన కడగండ్లు కొంత మఱచిపోయి, తాను పరీక్షలో సులభముగ జయ మందఁగల నని యాతనియాశయము. అందుచేత నీతఁడు నేనును మా యింటికిఁ జేరువ నొకగది పుచ్చుకొని, ప్రవేశపరీక్ష తరగతిలోఁ గొంతకాలము చదివితిమి. ఆసంవత్సరము వెంకటరావు పరీక్షలోఁ దప్పిపోయినను, నన్నుఁ బలుమారు గలిసికొనుచు, నాతో సుఖసంభాషణములు సలుపుచుండువాఁడు.

ఈ యిరువురు మిత్రులును నాకంటె వయస్సునఁ గొంత పెద్దలై, ఎక్కువ లోకానుభవము సంపాదించినవారలు. అంతకంతకు వారలను నేనును, నన్ను వారును విడువనొల్లని ప్రాణమిత్రుల మైతిమి. వారలలో నొకరి కొకరికి మాత్రము సరిపడియెడిది కాదు! నన్నుగుఱించి వా రేకసమయమున వచ్చి యొకరి నొకరు కలిసికొనినపుడు, ఒకరి కొకరు ప్రేమభావము చూపక, వట్టి ముఖపరిచితులుగ మాత్రమే మెలంగుచువచ్చిరి! ఇంతియు కాదు. నేను మూర్ఖుఁడనై, కన్నులు మూసికొని, వారలలో నొకని సహవాసము చేయుచుంటి నని రెండవవాఁడు కొన్నిసమయముల నన్నుఁ బరియాచకము చేయుచుండును! స్థిరచిత్తుఁడు గాఁడనియు, నియమమూరుఁ డనియు నొకనినిగుఱించి యొకఁడు మొఱ పెట్టుచుండువాఁడు! ఐనను నేను వారిలో నెవ్వనిఁగాని రెండవవానియొద్ద నిందింపక,

నా మిత్రు లిద్దఱును సజ్జను లే యని నమ్ముచుండువాఁడను. నిజమునకు, మేము మువ్వురమును ఉదారాశయములతో నొప్పియుండియు, అనుభవలేశము లేని వట్టి విద్యార్థులమె! మాలో నెవ్వనికిఁ గాని యింకను శీలబలము, చిత్తస్థైర్యము నేర్పడలేదు. ఐనను, కొలఁదికాలములోనే, పరిస్థితులప్రభావమున, మాయభిప్రాయములందును, నీతినియమాదులందును గొంత పృథక్త్వ మేర్పడెను. ఈసంగతి ముందలి ప్రకరణములయందుఁ దేటపడఁగలదు.

## ౯. కళాశాలలో ప్రథమవత్సరము

౧౮౮౪-వ సంవత్సరము జనవరి నెలలో నేను రాజమంద్రియందలి ప్రభుత్వకళాశాలలో ప్రథమశాస్త్ర పరీక్షతరగతిలోఁ బ్రవేశించితిని. నా సహపాఠి ముఖ్యప్రాణరావు నేనును ఆమండలమున ప్రవేశపరీక్షలో నుత్తీర్ణు లైనవారిలో ప్రథమతరగతియం దుండుటచేత, మాకిరువురకును విద్యార్థివేతన మీయఁబడెను. ముఖ్యప్రాణరావు కడచిన నాలుగు సంవత్సరముల నుండియు, మాపాఠశాలలోనే నా సహాధ్యాయుఁడు. ఆతనినమ్రతను, కుశాగ్రబుద్ధిని మెచ్చనివారు లేరు. విద్యాభ్యాసమే జీవితనియమముగఁ గైకొనిన విద్యార్థి యాతఁడు. పాఠము చదువక యాతఁడు బడికి వచ్చినరోజు గాని, అపజయమందిన పరీక్ష గాని, లేదనియె చెప్పవచ్చును. ఆతని జ్ఞాపకశక్తి యత్యద్భుతము. ఒకసారి చదివినతోడనే యాతని కెంత కఠినపాఠమైనను ముఖస్థమయ్యెడిది. కావుననే యతఁడు ప్రతితరగతియందును, ప్రతిపరీక్షయందును, ప్రథమస్థాన మలంకరించి యుండెడివాఁడు. అతనిని విద్యావిషయమున మించుట యటుండఁగా, సమీపించుట కైన నేసహపాఠికిని వలను గాకుండెను. ఆసంవత్సరము రాజమంద్రిలో ప్రవేశపరీక్ష

యందు ప్రథమతరగతిలో జయ మందినది మే మిద్దఱమే. కాని, అత నికి నాకును పెక్కుస్థానముల యంతరము గలదని, యిప్పటివఱకును నాకు జ్ఞాపకము!

ముఖ్యప్రాణరావు బుద్ధివైశద్యమున నసమానుఁడని లోక మెఱుఁగునుగాని, ఏ తద్విద్యాపరిశ్రమమునకై దేహారోగ్యమును యౌవనముననే ధారవోసిన దురదృష్టవంతుఁడని యెవరికిని దెలి యదు. కళాశాలలో నొకవత్సరము చదువకమునుపే, ఆ సుకుమార శరీరుఁడు అనివార్యరోగపీడితుఁడై మృత్యువువాతఁ బడెను. వానితో సరిసమానమగు మేధాశక్తి గల రామయ్య యను మా యింకొక సహపాఠిని గూడ, ఆదినములలోనే మృత్యుదేవత తనపొట్టఁ బెట్టుకొనెను. ఈ యనుంగునేస్తుల యకాలమరణముఁ గాంచి నే నతివ్యాకులచిత్తుఁడ నైతిని. ప్రజ్ఞాన్వితు లగు నిట్టి ప్రియమిత్రులను బాసి, పాడువడిన యీపుడమిని దినములు గడుపుట దుస్సహముగఁ దోఁచెను.

ఇట్లు తోఁచినది నా కొక్కనికే కాదు. నా మిత్రవర్గమున నందఱు దుర్భరవిషాదమునకు లోనయిరి. నన్నుఁ బొడగాంచిన సహ వాసులు, "రామయ్యముఖ్యప్రాణుల సంగతి చూచితివిగదా. నీరస స్థితిలో నున్న నీ వారోగ్యమును గాపాడుకొననిచో, వారివలెనే చేటు తెచ్చుకొనెదవుసుమీ!" యని యాత్రమున నన్ను హెచ్చరించుచుం డువారు. నిజముగ, కళాశాలఁ జేరిననాఁటనుండియును దేహమున నాకు సరిగా లేదు. ఉష్ణాధికతచేతను, పైత్యప్రకోపమువలనను, తఱ చుగ నాకుఁ దలనొప్పులు వచ్చుచుండును. ఉన్నటులుండి యాకస్మిక ముగఁ గనులు చీఁకటులు గ్రమ్మును. లోక మంతయుఁ దిర్దిరఁ దిరుగునట్లు దోఁచును. తోడనే తలనొప్పి తలచూపి, దిన మంతయు నన్ను వేధిం చును. కడుపులో వికారముగ నుండును. ఇవి యన్నియు ధాతుదౌర్బ

ల్యలక్షణము ,లని వైద్యులు చెప్పెడివారు. నాయీడునఁ దాను నిట్టిబాధలకు లోనైతి నని మాయమ్మ చెప్పెడి మాటలు, నా కోదార్పుగలిగించుటకు మాఱుగ, మఱింత భీతిని బెంచుచుండెను! స్వాభావికముగనే నేను దుర్బలశరీరుఁడను. ఆసమయమున నాకుఁ గొంచెము శరీరాస్వస్థత యేర్పడెననుట సత్యము. కాని, మాటి మాటికి నేను మననము చేయుచుండుటచేతను, చెలికాండ్రు సదా స్ఫురింపఁజేయుచుండుట వలనను, నా నీరసము గోరంతలు కొండంత లయ్యెను! కావున, తగిన జాగ్రతతో నౌషధసేవ చేయక వ్యాధిని ముదురఁబెట్టినచో, నాకును మిత్రులు రామయ్యాముఖ్యప్రాణాల గతియే నిజముగఁ గలుగు నని నమ్మి నేను భీతిల్లితిని.

ఇట్లు భయమున నెతనొందెడి నాచికిత్సకై ౧౮౮౪-వ సంవత్సరమున మాతండ్రి పడిన శ్రమకు మేర లేదు. రాజమహేంద్రవరమునఁగల వైద్యశిఖామణులయొద్దకు నన్నాయన కొనిపోయి, నా చేయి చూపించి, యాలోచన లడుగుచుండువాఁడు. నానిమిత్త మాయన గ్రహింపని కూరగాయవైద్యములు, తెలిసికొనని 'గోసాయిచిట్కాలు' లే వని చెప్పవచ్చును. ఐన నేను సేవించిన యౌషధముల వలన నా కించుకంతయు లాభము సమకూరదయ్యెను.

ఎట్టకేలకు కళాశాలయందు మొదటివత్సరము గడచిపోయెను. సంవత్సరపరీక్షలో ప్రథమస్థానమున నుత్తీర్ణ మగుట యేవిద్యార్థికైన హర్షదాయకముగ నుండును గాని, నామనస్సు నది మఱింత విచారతోయముల ముంచివైచెను! నా యీకడపటి విజయమే కడపటి విజయముగఁ బరిణమించు నేమోగదా! ఇపుడైన నేను మృత్యుముఖమునుండి తప్పించుకొనుటకై యారోగ్యాన్వేషణము చేయవలదా? నామిత్రుఁడు వెంకటరావు ప్రవేశపరీక్షలో నపజయము గాంచి,

తాను ముందు కళాశాలలోఁ జేరునప్పటికిఁ దనసహపాఠులుగ బ్రాఁత నేస్తు లెవ్వ రుందురా యని చూచుచుండెను. నే నిపు డాతనిఁ గలసి కొనఁగా, "ఒరే, నీ వొకయేఁడు చదువు మానివేయరా. దానితో అన్ని జబ్బులును చక్కబడతవి!" అని యతఁడు పలికెను. ఈతని యాలోచన కేవల పరోపకారబుద్ధిచే జనించినది కాదుగదా!

తలిదండ్రులతో నెమ్మదిగ నాలోచింపక, వారలకు నాయుద్దేశమైన సూచింపక, నేను కళాశాలాధ్యక్షునియొద్దకు రివ్వునఁ జని, నా విపరీతవ్యాధివృత్తాంత మెఱిఁగించి, ఒకవత్సరము విద్య విరమింప ననుజ్ఞ వేడితిని! మెట్కాఫుదొరకు నాయం దమితానురాగము. నా ముఖ మంతఁగ రోగకళంకితము గాదని పలికి, మండలవైద్యాధికారికి 'సిఫార్సు' చేసి నాకు మంచిమందిప్పించెద నని యాయన ధైర్యము చెప్పెను. ప్రాతఃస్నానములు, శీతలోపచారములును జేసిన సులువుగ నాకుఁ బునరారోగ్యము గలుగు నని యాయన యూరడించెను. కాని, ఆయన హితబోధనము లెంతసేపటికిని నాతల కెక్కలేదు. అంతట ఆయన, "అట్లైన మంచిది. నీ వొకసంవత్సరము పోయిగఁ దిరిగి, శరీరము నెమ్మదిపడి రా. మరల నాసాయమున విద్యాభివృద్ధి గాంతువులే!" అమవచనములతో నావీపు తట్టి, కళాశాలనుండి నాకు వీడ్కో లొసంగెను.

## ౧౦. స్వైరవిహారము

నిజ మారసినచో, నాశరీర మంతగ వ్యాధిపీడితము గాకుండినను, విరామము లేని చదువనిన నేను విసిగి వేసారితి నని తేలక మానదు. ఒకసంవత్సరము కాలు సాగునట్లు నేను సంచారము చేసినచో, దేహమున కారోగ్యము, మనస్సునకు నెమ్మదియుఁ జేకూరఁగల

వని నే నాశించితిని. జరుగుచదువున కంతరాయము గలుగుట తలిదండ్రులకు మొదట దుస్సహ మైనను, అచిరకాలముననే నే నారోగ్యవంతుఁడనై, వచ్చిననష్టమును వేగమె కూడఁదీయఁగలనని వారు నమ్మియుండిరి. ౧౮౮౮-వ సంవత్సరము ఫిబ్రవరి ౧౮-వ తేదీని నేను కళాశాల మానుకొంటిని. ఆనెల ౨౨-వ తేదీని మమ్మఁ జూచిపోవచ్చిన మా రెండవ మేనమామతో, నన్ను వారి గ్రామ మంపి, అచట నాకు సదుపాయములు చేయింపు మని మాయమ్మ తనతమ్ముని మఱిమఱి వేడెను. అంతఁ గొంతకాలము నే నాగ్రామమున నివసించితిని. ఆదినములలో వేలివె న్ననిన మేము ఉవ్విళ్లూరుచుండెడివారము. అది మాసోదరులలో ముగ్వురికి జన్మస్థానము. మా ముత్తవతల్లి, మేనమామలు మున్నగు బంధువర్గము నివసించు ప్రదేశము. పట్టణము విడిచి పల్లెయం దుండుట మొదట కొన్నిదినములవఱకు నాకుఁ గడు సంతోషముగ నుండినను, వేవేగమె గ్రామనివాసము నాకు మొగముమొత్తెను. ప్రాతస్సాయంకాలములందు నేను కాలువగట్టుమీఁద విహారము సలుపుచుండువాఁడను. కాని, తక్కినకాలము గడచు టెట్లు? పట్టణమందలి స్నేహసహవాసములు, వార్తాపత్రికలు, బహిరంగసభలు, ఇక్కడెట్లు సమకూరును? అహర్నిశమును నాతో నుండు తమ్ములు చెల్లెండ్రు నిచట లేరుగదా! పీల్చుటకు నిర్మలవాయువు, త్రావుటకు శుద్ధోదకము మున్నగునవి వలసినంత యిచట నుండుట వాస్తవమె. కాని, సుఖించునది మనస్సును విడిచిన శరీరముకాదు గదా! కుగ్రామనివాసముమీఁద విసువుఁ జెందినపుడెల్ల నేను పట్టణము వచ్చి, తలిదండ్రులను సోదరీసోదరులను జూచిపోవుచుంటిని. తోడి విద్యార్థియువకులు కళాశాలయందు విద్యాభివృద్ధి నొందుచుండఁగా, ఆరోగ్యాన్వేషణమునకనియును, హాయి

ననుభవింతుననియును, నేను బడి యెగవైచి, పల్లెటూళ్లయందు వ్యర్థ కాలక్షేపము చేయుచుంటి నని నే నంత గ్రహించి విచారించితిని. స్వయంకృతాపరాధమునకు పరిహార మేమి గలదు? నాపూర్వ సహపాఠి యగు పాపయ్యశాస్త్రి సహవాసము మరగి, రాజమంద్రిలో నపుడపుడు నేను దినములు వెళ్లబుచ్చుచుండువాఁడను. స్వస్థలమగు కోనసీమకుఁ దాను బోయెద ననియు, వలసినచో నన్నుఁ గొనిపోయి యందలి దర్శనీయములగు తావులు చూపింతు ననియు నాతఁ డొకనాఁడు నాతో ననెను. ఇపుడు నేను గోరుచుండినదే యిట్టివార్త. మార్గమందు మా మేనత్తగారి నివాసస్థల మగు అమలాపురము ఉండుట చేత, అచటికిఁ బోయి నేను కొన్నిరోజులు నివసించుటకు మా తలిదండ్రులు సమ్మతించిరి. అంత ౧౯-వ ఏప్రిలున సహచర సమేతముగ నేను ప్రయాణ మైతిని.

అప్పటి కప్పుడె అమలాపురపు కాలువ కట్టివేయుటచే, మేము ధవళేశ్వరము పోయి, అచటినుండి పడవప్రయాణము చేసి, మఱునాఁడు దాక్షారామము చేరితిమి. శ్రీనాథుని "భీమఖండము" నేను జదువకున్నను, ఆంధ్రకావ్యములందు మక్కువగలిగి, నాతో "విజయవిలాస" "పారిజాతాపహరణము" లు గొనిపోయితిని. ప్రయాణమున నా కివియె నిత్యపారాయణగ్రంథము లయ్యెను. కాని, నాచెలికాఁడు రసజ్ఞత లేని రసికుఁడు. నూతనప్రదేశముల రామణీయకమును, ప్రాచీనదేవాలయముల పూర్వవాసనలును నా మనసు నమితముగ నాకర్షించెను. అచటనుండి కోటిపల్లి, ముక్తేశ్వరము మున్నగు క్షేత్రములు దర్శించి, ౨౧-వ తేదీని మేము అమలాపురము చేరితిమి.

ఆపట్టణమున కనతిదూరమందలి యీదరపల్లి మా మేనత్తగారినివాసస్థలము. కొన్ని దినములవఱకును వారియిల్లు నావిడిది

యయ్యెను. ఆ మిత్రుఁడు అమలాపురమున బసచేసి, నన్నుఁ జూచుట కీగ్రామము వచ్చుచుండువాఁడు. నా కిచ్చట సావాసులు లేని లోపము లేదు గాని, సత్సాంగత్యమె సమకూరకుండెను. నా సహచరుఁడు ప్రవేశపరీక్షలోఁ దప్పుచుండెడి ప్రాఁతకాలపు విద్యార్థి. చప్పనిపాఠ్యపుస్తకములచవియె కాని, సాహిత్యగ్రంథరుచి యాతఁ డెఱుఁగఁడు! ప్రకృతియందలి సుందరదృశ్యములు, గానకళాదుల రామణీయకమును, వానికి హృదయాకర్షక విషయములు గావు. స్నేహపాత్రతాదిగుణములు కొన్ని గలిగియుండియును, ఈతఁడు, అనుభవరహితులగు నాబోఁటిచిన్నవారల కాదర్శప్రాయుఁడగుసుశీలుఁడు గాఁడు. నీళ్లు నమల నేల? నామమాత్రావశిష్టుఁడగు బ్రహ్మచారియె యీతఁడు! రచ్చ కెక్కిన జారుఁడు గాకున్నను, శీలసౌష్ఠవము గోలు పోయి, తనప్రకృతలోపములకు, తనయేకాకిత్వమును విషమపరిస్థితు లను ముడివెట్టి మనసు సరిపెట్టుకొనినసరసుఁడు! ఇట్టియువకుల వలపుపలుకులు, రసికత్వపుఁబోకడలును లోకానుభవము లేని పసివార లకు విపరీతకామోద్రేకము గలిగింపఁజాలియుండును. ఈతని సహవాస సంభాషణములు నా భావపవిత్రతకు భంగము గలిగించి, నీతినియమ ములను నీటఁ గలుపుటకు సంసిద్ధము లయ్యె నని నే నపుడు గ్రహించితిని!

౮-వ మెయి తేదీని కోనసీమసంచారము ముగించి, రాజమండ్రి చేరితిమి. మా తలిదండ్రులకు నా నేస్తకానిని గుఱించిన నిజము తెలిసిన యెడల, ఆగ్రహమున వారు నన్ను మ్రింగివేసియుందురు! ఐన నీసహ వాసుని దురాకర్షణమహిమమునను, అతని దుష్ప్రసంగశ్రవణాసక్తి చేతను, ఇంకఁ గొంత కాలము నేను వానినే యంటిపెట్టుకొనియుంటిని. నాచిత్తపారిశుద్ధ్యమునకుఁ గలిగిన చెఱుపు, క్రియారూపముగఁ బరిణ

మించి, నూఁకటి వేళ్లవఱకును శీలమున వ్యాపించెడిదియె. కాని, దైవానుగ్రహమునను, చిరకాలాభ్యస్త సన్నియమప్రభావమునను, ఇతరస్నేహితుల సహవాసభాగ్యమునను, ఆచెడుగంతటితో నిలిచిపోయె నని నాకు స్పష్టపడెను!

కళాశాలావిద్యాభ్యాస మిఁకఁ గట్టిపెట్టి,వృత్తిస్వీకారమున కనుకూలించుచదువు చదువుటకు నేను న్యాయశాస్త్రపుస్తకములు కొన్ని కొని ముందువేసికొని కొన్ని దినములు కూర్చుంటిని. కాని, నామనస్సున కవి వెగటయ్యెను. ఇంతలో పూర్వపరిచితుఁ డొకఁడు ధవళేశ్వరమునఁ దాను జరుపు మాధ్యమికపాఠశాలలో నొకనెల నన్ను ప్రథమోపాధ్యాయుఁడుగ నుండు మని కోరఁగా, వేతనము స్వల్ప మైనను, నే నందుల కియ్యకొంటిని. నా కీయవలసినజీతమైన నాతఁడు సరిగా నీయకుండినను, నేనొకమాసము ఉపాధ్యాయపదవి నుండి, శిష్యుల యనురాగము వడసి, మనస్సునకుఁ గొంత వ్యాపృతి గలిపించుకొంటిని. ఇంకొకనెల యొకవిద్యార్థికిఁ జదువు చెప్పితిని. ఇట్లు, విద్యాశాలను వీడినఁగాని పరిపూర్ణారోగ్యసౌఖ్య మందఁజాల నని యెంచి, చదువునకు స్వస్తి చెప్పి, తుదకు మొదటికే మోసము తెచ్చుకొనసిద్ధపడి, ఎటులో తప్పించుకొని తెలిసినిబడి, పరిపూర్ణారోగ్యభాగ్య మందుటకు చదువు సాగించుకొనుటయె మంచిసాధన మని నిర్ధారణచేసికొని, నేను, ౧౯౧౮ వ సంవత్సరారంభమున మరల కళాశాల చేర నుద్యమించితిని

## ౧౧. పునర్విమర్శనము

౧౯౧౮—వ సంవత్సర దినచర్య పుస్తకాంతమున నాజీవితములో నది యుత్తమదశ యని - లిఖియించితిని. దీనియందుఁ గొంత సత్యము లేకపోలేదు. గతవత్సరమున నాశీలము కలువ భూయిష్ఠమై, కష్టశోధనలకు గుఱి యయ్యెను. నన్ను గాసిపెట్టిన దేహ మనశ్శ్రమ

వులమీఁద నిపుడు సంపూర్ణవిజయము సంపాదింప సమకట్టితిని. నా యాత్మరామాయణమున నారణ్యకాండకథ సంపూర్తి కాఁగా, యుద్ధకాండవిధాన మంత నారంభమయ్యెను!

భూతకాల కార్యకారణపరిశీలనమున నొకప్పుడు మన కనులు చెదరిపోవుచుండును. మన దుర్గుణదురభ్యాసములను బరులసహవాసమున కారోపించువిషయమున మన మప్రమత్తత నూనవలెను. దుష్టులనియెడి యొక ప్రత్యేకస్థాయిసంఘ మెందును లేదు! నేఁటి కోరికలు రేపు క్రియ లగుచున్నవి. నిజ దుస్సంకల్పములను కార్యగతము చేయఁ గోరి, తదనుగుణ్యమగు సహవాసము చేసి, మన శీలమున కపు డాపాదించిన నైతికకళంకమును మనము సహచరులమీఁదఁ బడవేయుచుందుము! ఇట్లు చేయుట న్యాయసత్యములకు దూర మైనను, మన యహంభావమున కమితశమనము గలిగించుచుండును. పరస్పరసఖ్యమున సంక్రమించు సుగుణదుర్గుణములకు నుభయ సహవాసులును సమానభాగస్వాములె. పరులచెలిమివలనఁ దమశీలసౌష్ఠవము చెడె నని మొఱలిడువారు, తమసావాసమున నితరుల కటులె చెడుగు సోఁకియుండు ననియును తమ దుశ్చింతలె పరులమనములందు దుష్టబీజములను వెదజల్లి నారు పెంచియుండవచ్చు ననియును జ్ఞప్తి నుంచుకొనవలెను. "మనబంగారము మంచిదైన కమసాలి యేమి చేయును?" అను సామెత నీసందర్భమున మఱవఁగూడదు. పరుల దుస్సహవాసమున మనము చెడితి మనుకొనుటకంటె, మన దురుద్దేశములె తోడి దుశ్శీలురను తోడితెచ్చె ననుటలోనె సత్యసారస్యము లెక్కువగఁ గలవు. ఇట్లు తలపోయుట, మానసబోధ గలిగి ఆత్మపరిపాక మందుటకు సహకారముకూడ నగును. అట్లు తలంపకుండుట, నొప్పి యొక చోట నుండఁగా, వాఁత వేఱొకచోటఁ బెట్టిన ట్లగును!

## ౧౧. పునర్విమర్శనము

ఇదిగాక, నాతో కోనసీమకు వచ్చిన మిత్రుఁ డొక్కఁడే ౧౮౭౭-వ సంవత్సరమున నాకు సావాసుఁ డనియు, ఇతరస్నేహితు లందఱు నాశ్రేయస్సును గోరిన విశుద్ధప్రవర్తను లయ్యును ఆతరుణమున నాకు మార్గస్థు లైరనియును, జెప్ప వలనుపడదు. అప్పుడును శాస్త్రి వెంకటరావు లిరువురును నాయాంతరంగిక మిత్రులె. పాపయ్యశాస్త్రితోకంటె వారితోనె నాకుఁ బ్రకృతమునను జనవెక్కువ. వారి సంభాషణములుఁగూడ నొక్కొక్కతఱి కామోద్రేక జనకములుగ నుండెడివి. ఆకాలపు విద్యార్థులును "కొక్కోకము", "లండను నగరరహస్యములు" మున్నగు నిషిద్ధపుస్తకపఠనము చేయుటకు వెను దీయకుండెడివారలె.

ఆసంవత్సరమున నాశీలమునకుఁ గలిగినశోధన, అవాంతరముగ నాపాదించిన యనర్థ మని చెప్ప వలనుపడదు. ఏండ్లకొలఁది జననీజనకులయదుపులో నుండి, సంతతవిద్యాభ్యాసమున కలవాటుపడి, యౌవనప్రాదుర్భావమున నిపు డొకసారిగ స్వేచ్ఛావిహారమును జవిచూచిన యొకయువకుఁడు, దినములకొలఁది కట్టుఁగొయ్యనఁ బడియుండి మెడకొలికి సడలినపశువువలెఁ జెంగుచెంగునఁ బరువు లిడుచు, మితిమీఱిన స్వచ్ఛందవర్తనమున మెలంగ నపేక్షించుట స్వాభావికమె. సంకల్పరూపమున నిదివఱకె కణఁగియుండిన వాంఛాబీజములు, ఇపు డవకాశము దొరకినకారణమున మొలకలెత్తి విజృంభింపసాగును. దీని కొకరి ననవలసినపని లేదు. ఇట్టిపరిస్థితులలో పరులదుస్సహవాసము కేవల నిమిత్తమాత్రమె. కఠినశోధనల కెల్ల వేరువిత్తగు నాంతరంగిక దుస్సంకల్పముల నరికట్టలేక, పాపభారమును పరులబుజములమీఁదఁ బడవేయుట, ఇంటిదొంగను విడిచిపెట్టి బైటిదొంగకై పరుగులిడుటవలె నుండును!

ఈసందర్భమున నింకొకసంగతికూడ గమనింపవలెను. లోకమున బాహాటముగ నలుగురిలోఁ దిరుగ నారంభించినపుడే, మానవశీలము వికాసము నొందఁగలదు. వివిధపరిస్థితులశోధనకు లోనగునపుడే, మనప్రవర్తన దృఢపడుట కవకాశ మేర్పడును. నీరు చొరని యీఁత దుస్సాధ్యము. లోఁతునీటఁ బడి మునుకలు వేసి కాలుసేతులు కొట్టి తేలి తప్పించుకొనునపుడె యీఁతలోఁ బ్రవీణుల మయ్యెదము. నీతినియమములు లోకానుభవపుఁదాఁకుడునకు నిలిచి గట్టిపడినపుడె శీలసౌష్ఠవముగఁ బరిణమింపఁగలవు.

శూన్యము ప్రకృతివిరుద్ధ మని యాంగ్లలోకోక్తి. తగినంత వ్యాపృతి యుండినఁగాని మనస్సునకు స్వాస్థ్యసౌఖ్యము లనుభావ్యములు గావు. సంపూర్ణస్వేచ్ఛయు, స్వచ్ఛందగమనమును చేతస్సున కానందదాయకము లనుకొనుట వట్టివెఱ్ఱి! ఏదో యొకసత్పథము త్రొక్కి, కార్యనిమగ్నత నొందునపుడె, మనస్సునకు నిజమగు హాయియు నెమ్మదియుఁ జేకూరఁగలవు. కార్యభరమున నుండువ్యక్తి నుండియె పాపచింతనలు పలాయిత మగుచుండును. ఇదియె యీలోకమున శాంతిసౌఖ్యములకుఁ గొనిపోవు ఘంటాపథము. తక్కినవి పెడదారులు, ముండ్లత్రోవలును.

గతసంవత్సరవిశ్రాంతివలన తల బొప్పిగట్టి, ౧౮౯౯ వ సంవత్సరారంభమున కళాశాలాశాంతిభవనమునే మరల నేను శరణుఁ జొచ్చితిని. శరీరమును రోగమునుండియు, మనస్సు నొడిదుడుకులనుండియుఁ దప్పించుకొనుటకుఁ బరిపూర్ణవిశ్రాంతి సాధనము గా దనియు, నియమపూర్వకవిద్యాభ్యాసము, నియమబద్ధజీవితమును పరమసాధనము లనియు నే నిపుడు గనుగొంటిని.

# ౧౨. చర్వితచర్వణము

నా పూర్వగురువులగు మల్లాదివెంకటరత్నముగారిని గతసంవత్సరమున నపుడపుడు కలసికొనుచు, నా యారోగ్యమునుగుఱించి యాలోచనలు గైకొనుచువచ్చితిని. ప్రాతఃకాలవ్యాయామము, శీతలోదక స్నానము, గోక్షీరపానమును, ఆరోగ్యప్రదము లని యాయన బోధించెను. ఆ డిశంబరు ౨౬-వ తేదీని మా మామగారిసాయమున బొమ్మూరులో నొకయావును కొంటిమి. అది పూట కొకసేరు చిక్కని కమ్మని పా లిచ్చుచుండెడిది. స్నానపానాది దినకృత్యములు క్రమముగ జరుపుకొనుచు, ౧౯-వ సంవత్సరారంభము నుండియు నేను మరల విద్యాభిముఖుఁడ నైతిని. జనవరిమూఁడవతేదీని నేను పుస్తకములు సవరించుకొని, చదువుసన్నాహము చేసితిని. ఇదివఱకే ప్రథమతరగతి పరీక్ష నిచ్చితిని గాన, జనవరి ౨౧-వ తేదీనుండి రెండవ తరగతిలోనికిఁ బోయి కూర్చుండుచువచ్చితిని. గణితశాస్త్రాధ్యాపకులగు తంజావూరు సుబ్బారావు పంతులుగారు శిష్యులను పరియాచకము చేయు నభ్యాసము గలవారు. ఆయన నామీఁద ధ్వజ మెత్తినట్లు నా కిపుడగఁబడెను! ఇదివఱకు విచ్చలవిడిగా వీధులఁ గ్రుమ్మరుచుంటి ననియో, ఒకప్పుడు నేను తమ్మను వెక్కిరించితి ననియో, ఆయన నాపని నిపుడు పట్టించెను! దేహస్వాస్థ్య మింకను గుదురక తికమకలఁ బడియెడి నాకిది "పులిమీఁద పుట్ర" యయ్యెను. ఈయనదాడినుండి తప్పించుకొనుటకు నా కంత నొకయుపాయము తోఁచెను. కళాశాల మొదటితరగతి కీయనజోక్యము లేదు. మరల నే నందేల చేరరాదు? అట్లు చేసినచో, కొంతకాలము వీరిపోరు తప్పుటయెకాక, వెనుకఁబడి యుండిన ప్రాఁతనేస్తులతోఁ గలసి చదువు భాగ్యము గలిగి, తొందరలేనిచదువులో హాయిగ నింకొకయేఁడు గడిపి, యారోగ్యము చక్క

బలిచుకొనవచ్చునని తలంచితిని. ఇది మంచిపనియె యని వెంకటరత్నముగా రనిరి. వెంకటరా విది విని యెగిరి గంతిడెను. అతఁ డిప్పు డీ తరగతిలోనే చేరనుండెను. కావున నేను ౧౦వ ఫిబ్రవరి తేదీని మా తండ్రిని వెంకటరత్నముగారి యొద్దకుఁ గొనిపోయి, నేను క్రిందితరగతిలోనే చేరుట కర్తవ్య మని యాయనచేఁ జెప్పించితిని ఆయనయెదుట మాతండ్రి సరే యన్నను, ఇంటికి వచ్చి మాతల్లితో నిది చెప్పి, నా మీఁదఁ గోపపడెను. ఇదివఱకే యొకయేఁడు నేను బడి యెగురఁగొట్టి, కొంటెతనమున మరల చదువులో వెనుకంజ వేయఁజూచుటకు వారు నన్ను నిందించిరి. నే నిట్టి కుతంత్రములు పన్నినచో, కుటుంబమును స్వగ్రామమునకుఁ దరలింతు నని మాతండ్రి చెప్పివేసెను!

కాని, నేను గట్టిపట్టు పట్టితిని. కళాశాలాధ్యక్షునియొద్దకు నేను జని, నా దేహస్థితి వారికి విన్నవించి, మరల మొదటితరగతిలోఁ జేరుదు నంటిని. గతసంవత్సరము నేను విద్య విరమించుటకె యచ్చెరు వొంది యసమ్మతిఁ జూపిన మెట్కాఫుదొర, నా క్రొత్తరాకడకు మఱింత విస్మయ మందెను. కాని, నాయనారోగ్యమునుగుఱించి మరల నే నొత్తిపలుకుటచేత, ఆయన తుట్టతుదకు, "వెంకటశివుఁడా! నీవు నాశిష్యులలో తెలివిగలవాళ్లలో నొకఁడ వని నే నెఱుఁగుదును. ఏదో కష్టము లేనిచో నీవంటివాఁడు క్రిందితరగతిలోఁ గూర్చుండుట యందలి నష్టావమానముల కొడంబడఁడు. నాకళాశాలలో నీయిష్టము వచ్చినతరగతిలో నీవు కూర్చుండవచ్చును. జీత మీయనక్కఱలేదు. ఇంకఁ బోయిరా!" అని చిఱునవ్వుతో నాకుఁ గళాశాలకుఁ బునస్స్వాగత మిచ్చెను!

నే నంత మొదటితరగతిలోఁ దిరిగి చేరితిని. కొలఁదిదినముల లోనె యింటను విద్యాలయమునను నావింతపనిని గుఱించిన విస్మయ

మణఁగిపోయెను. కళాశాలకుఁ బ్రాఁతకాఁపు నగుటచేత నన్ను తరగతికిఁ బెద్దగ నియమించిరి. ప్రాఁతమిత్రులను గుశలప్రశ్న చేయుచును, క్రొత్తవారి పరిచయభాగ్య మందుచును, నేను కళాశాలలో సుఖముగ నుంటిని.

ప్రవేశతరగతి యింకను దాటని కొండయ్యశాస్త్రి నా కిపుడును నిత్యసహవాసుఁడు. వెంకటరావు నాతరగతిలోనె యుండువాఁడు కావున, తఱచుగ నాతో నిష్టాగోష్ఠి నుండును. క్రొత్తగ స్నేహము కలిసినవారిలో ముఖ్యులు, పోలవరము జమీందారు రాజా కొచ్చెర్లకోట వెంకటకృష్ణారావుగారు, మహమ్మదు బజులుల్లాసాహెబుగారును. ఆవేసవి సెలవులలో, బజులుల్లా వెంకటరావులు నావలెనే రాజమంద్రిలో నుండి, మేము క్రొత్తగాఁ గొనినస్థలములో వేసిన కుటీరమున నన్నుఁ గలసికొనుచుండువారు. ఏదో సాహిత్యవిషయమును గూర్చి మేము ప్రసంగించుచుండెడివారము. బజులుల్లాకు సాహిత్యాభిమానము మెండు. ఉర్దూభాషలోఁ దాను పద్యరచన చేయుచుండునని మాకుఁ జెప్పెడివాఁడు. ఇంగ్లీషులో నావలెనే యనేకపుస్తకములు చదివియుండెను. అతనికి డిక్కెన్సీయం దమితప్రీతి. అతనిప్రేరణముననే నే నపుడు ఆ రచయిత గ్రంథరాజమగు "నల్లమందుభాయి" యను పుస్తకమును వినోదమునఁ జదివితిని. కవులు కవిత్వము ననిన నాతఁడు చెవి కోసికొనువాఁడు. నే నావేసవిని డ్రైడను కోలిరిడ్జి కవుల పద్యకావ్యములు, మూరుని "లాలారూకు" యును జదివితిని.

అప్పుడప్పుడు మేము షికారుపోవుచుండువారము. బొమ్మూరుకొండదగ్గఱకుఁ గాని, ధవళేశ్వరము ఆనకట్టయొద్దకుఁ గాని మేము నడచిపోయి, సృష్టివైచిత్ర్యములను కనులకఱవు దీఱునట్లుగ వీక్షించుచుండువారము.

నే నిట్లు మరల పాఠశాలలోఁ బ్రవేశించి, విద్యాధోరణిని బడి, నాశరీరదౌర్బల్యమును మఱచిపోఁజూచుచుంటిని. సహపాఠుల స్నేహ సహవాసముల మరగి, లోకము పాపభూయిష్ఠ మని విస్మరించెడి వాఁడను. కళాశాలలో నే నిపుడు వ్యాయామము నేర్చుచు, కసరతు చేయుచు, సెలవురోజులలో షికారుపోవుచు, శరీరవ్యాయామమును గుఱించి యెక్కువగ శ్రద్ధ వహించియుంటిని. తల్లి యింట నాకుఁ బ్రత్యేకముగ భోజన సౌకర్యము లొనఁగూర్చుచుండెడిది. సద్గోష్ఠి సత్సహవాసములకుఁ దోడు నే నీకాలమున ననుదిన ప్రార్థనములు చేయుట కభ్యాసపడితిని. ఇట్లిన్ని విధముల నాయారోగ్య సౌఖ్యములు పెంపొందుటకు సాధనకలాప మేర్పడియుండెను.

## ౧౩. నియమబద్ధజీవితము

౧౮౮౫ వ సంవత్సరము జూలై ౨౮ వ తేదీని నా ప్రియమిత్రుఁడు కొండయ్యశాస్త్రితోఁ గూడి నేను టాడు విరచితమగు "యువజనహితోపదేశము" అనునొక యాంగ్లపుస్తకమును మిగుల తమకమునఁ జదివితిని. మాబోటి విద్యార్థుల కుపయుక్తములగు ననేకయంశము లిందుఁగలవు. వానిచొప్పున వర్తనప్రణాళిక నేర్పఱచుకొని యాచరణమునకుఁ గడంగినచో, సర్వానర్థకములకును మూలకందమగు ప్రాలుమాలికను పారఁద్రోలి, పాటుపడుట కలవాటుపడి, శ్లాఘనీయముగ జీవిక గడపవచ్చు నని నాకు స్పష్టపడెను. నాఁటినుండియే యేతద్గ్రంథబోధన మనుసరింప నిర్ధారణము చేసికొంటిని. విధికార్య నిర్వహణమందు కాలనియమమును ఖచితముగఁ బాటింపవలయు ననియే యందలి ముఖ్యవిధానము. మఱునాఁడు చేయవలసినపను లీనాఁడే నిశ్చయించుకొని, ఒకచిన్న పుస్తకమునం దవి యుదహరించి, సమయాను

గుణ్యముగ వానిచొప్పున నాచరించి, యింక నెన్ని మిగిలెనో పిమ్మట సరిచూచుకొనవలెను. క్రమముగ నిత్యవిధు లివ్విధమున నెరవేర్చు చుండినచో, సచ్ఛీలత దానియంత నదియే యలవడు నని యిందలి ముఖ్యోపదేశము.

అదివఱకే, అనఁగా ౧౮౮౫ వ సంవత్సరారంభమునుండియు, "దినచర్య"పుస్తకము లుంచుట నభ్యాసము చేసికొంటిని. ఏనాఁడు చేసిన పనులు, తలంచినతలంపులు, తటస్థించిన మేలుకీడులును, ఆనాఁటి రాత్రియే యాపుస్తకములందు సంగ్రహముగ లిఖియింపఁబడుచుండెను. దైవప్రార్థన, ప్రాతఃకాలస్నానము, శరీరవ్యాయామము మొదలగు నల వాటులు చేసికొంటిని. పూర్వోదాహృతపుస్తకపఠన మప్పటినుండియు, నే నదివఱ కవలంబించినపద్ధతి మఱింత కట్టుదిట్టములతోఁ గూడుకొని జరుగుచుండెను. అందువలన నాకిపుడు నియమానుసారజీవిత మేర్పడెను.

ఆదినములలో నానిత్యకర్మానుష్ఠాన మీవిధముగ నుండెను:— ప్రాతఃకాలముననే, స్నానవ్యాయామములైనపిదప, నేను ప్రార్థన సలుపుచుందును. అంత "బైబిలు- నూతననిబంధన"లోని మూఁడు నాలుగధ్యాయములు పారాయణము చేయుచుందును. దినపాఠము లన్నియుఁ జదివి, కళాశాల కేగి విద్య గఱచి, అచటనే సాయంకాలము వ్యాయామము నేర్చుచుందును. శరీరసాధకము చాలనిచో, డంబెల్సుతో కసరతు చేసి, అవశ్యమగు నింటిపని చక్కబెట్టుకొని, రమ్యప్రదేశ మేదేని సందర్శించియో, ఉద్గ్రంథపఠనము చేసియో, సాయంప్రార్థనముతో దినకృత్యములు ముగించుచుందును.

ఇట్లు నేను ౪౯-వ జూలైనుండి ౧౭-వ అక్టోబరువఱకును ఏర్పఱుచుకొనిన నిత్యకర్మానుక్రమణపట్టికలు నా రెండవ దినచర్య

పుస్తకమునఁ గలవు. ఈ కడపటి తేదీనుండి యీపుస్తకమునం దివి యాగిపోవుటకుఁ గారణము, పుస్తకము రెండవవైపునుండి లిఖించిన దినచర్య భాగము అక్కడవఱకును వ్యాపించి యుండుటయే. మచ్చునకు వానిలో రెండుదినముల కార్యక్రమము నిట నుల్లేఖించెదను:—

౩-వ ఆగస్టు ౧౮౮౮

* ౧. స్నానవ్యాయామానంతరమున దైవప్రార్థన.

* ౨. చలిదిపిమ్మట, తెలుఁగు: ప్రాతకవులు ముగ్గురు.

* ౩. ౧–౩ గంటలమధ్య—ప్రార్థనసమాజకార్యము.

౪. ఇంగ్లీషుపద్యకావ్యము: ఆర్కేడీసులో ౩౦, ఇల్ పెన్సిరోజోలో ౧౦, లల్లీగ్రోలో ౨౦ పంక్తులు.

* ౫. విద్యార్థిసమాజసభ: అచట నెవనిమనస్సు నొప్పింపక మెలంగుట.

* ౬. శరీరవ్యాయామము.

౭. ప్రార్థన.

౬-వ అక్టోబరు

* ౧. ప్రార్థన.

* ౨. బ్లాకీనుండి వ్రాయుట.

౩. చరిత్రము.

౪. గణితము.

౫. మిల్టనులో కొంత.

* ౬. ప్రార్థనసమాజసభ.

౭. వీలైనయెడల, వీరేశలింగముగారి ప్రార్థనసభ కేగుట.

౫. మిత్రసందర్శనము.

*౬. ప్రార్థన.

(షరా:—*అనుసర్తుగల విషయములు, ఆచరింపఁబడినవనుట).

ఇట్లు నే ననుసరింపవలసిన కార్యక్రమము ముందుగ నేర్పఱచికొని, ఆప్రకారము నెరవేర్చితినో లేదో నాఁటిరాత్రియే చూచికొని, వలసినచో, చేయనిపనులు కొన్ని మఱునాఁటి ప్రణాళికలోఁ జేర్చుచుండుటవలన, స్వేచ్ఛావిహారవిషయమున నాపాదములకు నేనే సంకెలలు తగిలించుకొనుటయై, నాకు గట్టిబాధ్యతయు జాగ్రతయుఁ బట్టుపడెను! శరీరవిధులు, పాఠశాలలోని పనులును ఎప్పటి వప్పుడే నెరవేర్చుచుండుటచే, నామనస్సునకు హాయి గలిగెను. నా శీలప్రవర్తనములనుగుఱించిన సంగతులు దినచర్య దిన ప్రణాళికలయందు ఎప్పటి వప్పుడే లిఖింపఁబడుచుండుటవలన, అకార్యకరణమునకు సామాన్యముగ నా కరము లూనుచుండెడివి కావు. ఏనాఁటి లోప పాపము లానాఁటిప్రార్థనయందును దినచర్యపుస్తకములందును సూచింపఁబడుచుండుటచేత, మనస్సునకు మంచి ప్రబోధమును, న్యాయమార్గానుసరణమున కమితప్రోత్సాహమును జేకూరెను.

## ౧౪. వైష్ణవక్రైస్తవమతములు

ఎవని మతవిశ్వాసచరిత్రము వాఁడు విమర్శించుకొనునపుడు హృదయ మాశ్చర్యప్రమోదములకుఁ దావల మగుచుండును! ఏడవ సంవత్సరమునకుఁ బూర్వము దేవునిగుఱించి నాయూహ లెటు లుండెడివో నాకు జ్ఞప్తిలేదు. ఆసంవత్సరమున గోపాలపురమున మేము బసయుండునింటఁ గొంతకాలము అధ్యాత్మరామాయణపారాయణము జరిగెను. శ్రీరాముని వనవాసకథ యాసమయమున నావీనులఁ బడెను.

రాక్షసు లనిన భయము, రామలక్ష్మణులయందు ప్రేమమును నా హృదయమున నంకురించెను. ఆమఱుసటియేఁట రేలంగిలో చెలికాండ్ర సహవాసమహిమమున కృష్ణుఁడు నా కిష్టదైవత మయ్యెను. మాతల్లికి రామునియందు భక్తి. మాతండ్రి శివభక్తుఁ డయ్యెను, ఒకటిరెండుమాఱులు నాచేత భాగవతములోని 'బాణాసురకథ' చదివించి, నా కర్థము చెప్పెను. అందలి విష్ణుని యుత్కర్ష నాబాల్యవైష్ణవమును ముదురఁబెట్టెను! తదాదిగ, ౧౮౮౭-వ సంవత్సర మధ్యకాలమువఱకును, శివకేశవులలో కేశవు నధికునిగ నెంచి, నేను భారతభాగవతాది గ్రంథములు చదువుచు, నారాయణభక్తిపరుఁడ నై యుంటిని.

ఇటీవల కొంతకాలమునుండి నేను జదువు బైబిలుగ్రంథము, చేయు క్రైస్తవస్నేహితుల సహవాసమును, నాకు క్రైస్తవమతాభిమున ముదయింపఁజేసెను. ఆసంవత్సరము అగష్టు ౭-వ తేదీదినచర్యయందు, "ఆపరమపవిత్రప్రవక్త యగుయేసుక్రీస్తును గుఱించి చదివితిని" అని యున్నది. ౯-వ తేదీపుటలో, "భగవంతుఁడా! ఐహిక విషయములను గుఱించి నామనస్సును కళవళపడనీయకుము. నే ననవరతము నీప్రేమామృతమును గ్రోలనిమ్ము. ఎపుడును నిన్ను ప్రార్థింతునుగాక!" అని లిఖింపఁబడెను. అప్పటినుండియు కష్ట మావహిల్లినపు డెల్ల, భగవన్నామచింతనము నాదినచర్యయందు సూచింపఁబడుచుండెను. అక్టోబరు ౨౫-వ తేదీని, "క్రైస్తవదేవాలయమునకు వెళ్లితిని" అని యుండెను. మఱునాఁటిదినచర్యయందు, నేను కొలఁదికాలములో మృత్యుముఖముఁ జొచ్చుట నిశ్చయ మని యెంచి నే గావించిన యొకదీర్ఘప్రార్థనము గానఁబడుచున్నది. అందు, నేను పాపి ననియు, తలంపులందు కలుషితుఁడ ననియు, నాదుశ్చింతలే యాత్మశాంతిని బాఱఁద్రోలి శరీరమును మనస్సును గాఱుచేసి నా నీతికుసుమ

మును ముకుళింపఁజేసె ననియు, నేను వగచితిని. ఆజన్మము మనోవా
క్కర్మలందు పవిత్రత ననుభవించినను, గత యేప్రిలు మధ్యకాలము
నుండి నేను దుశ్చింతల పాలైతి నని నే మొఱపెట్టి, లజ్జావిరహిత
మగు నాహృదయమును భగవంతుని హస్తగతము చేయుచు, శీఘ్రమే
తనసన్నిధానమున నన్నుఁ జేర్చుకొనుఁ డని నేను దేవుని ప్రార్థించితిని!

౧౯౯౪ వ సంవత్సరము జనవరి మొదటి తేదీదినచర్య బైబిలు
నందలి "ప్రభువుప్రార్థనము"తో ప్రారంభ మయ్యెను. ఆసంవత్సరము
మేనెల మొదటి తేదీనికూడ ప్రభువుప్రార్థన పూర్తిగ లిఖింపఁబడెను.
నాదుశ్చింతల నరికట్టుమని దేవుని వేడుకొనుట అప్పుడప్పుడు కాన
వచ్చుచున్నది. మే ౧౫ వ తేదీని ప్రార్థన మిటు లున్నది:—"దయా
మయా! నీతనయులము అవివేకమున పాపకృత్యములకుఁ గడంగు
చున్నాము. కాన నీవు మావర్తనము గాపాడి, కరుణాళు వగు జనకుని
వలె మాతప్పులు సైరింపవలయును." ఈ మేనెలనుండి నవంబరువఱ
కును వరుసగ ప్రతి యాంగ్లేయమాసారంభ దినచర్యయు ప్రభువుప్రార్థన
ముతో ప్రారంభమగుచుండెను. అప్పుడప్పు డొకానొకదినమున నిటులే
యాప్రార్థన ముల్లేఖిత మగుచుండెను.

జూలై ౧౯ వ తేదీని, దసరాసందర్భమున వ్రాయఁబడిన
ప్రార్థనము లిచట వివరింపవలసియున్నది:—"పరమపితా! నీయెడ
నాకుఁగల గాఢానురాగము అనిర్వచనీయము. ఈదుర్బలునికి నీమృదు
కరస్పర్శసుఖ మొకింత యొసంగుము***ద్రోహకౌటిల్యములు ప్రబలిన
యీలోకమున నెట్టిసజ్జనుఁడును సైతానుప్రేరణమునకు లోనగు
చున్నాఁడు. పావనచరితా, నాహృదయము బలవత్తరమగు దృఢ
దుస్సంకల్పముల కిరవు గానున్నను, ఒక్కొకతఱిని, అసూయా గర్వము

మోహము మున్నగు హేయభావములకు గుఱియగుచున్నది. దీనిలో మొదటిది కడపటిదియు నాపరమశత్రువులు. ఈశత్రులబారినుండి నన్నుఁ దప్పింపుమని వినయాతిశయమున వేడుకొనుచున్నాను."

"భగవానుఁడా! రాఁబోవు సంవత్సరము దసరానాఁటికి నే నెటు లుందునో తెలియదు. గతదసరాకును ఇప్పటికిని నాలో నెంతయో మార్పు కానుపించుచున్నది. ముఖ్యముగ పవిత్రుఁడగు జీససుప్రభువుమూలమున నే నిపుడు సత్యదైవభక్తుఁడ నైతిని. లోక మునుగుఱించి నాయభిప్రాయము లిపుడు గంభీరములు నాగరికములునై విరాజిల్లుచున్నయవి. ఇపుడు నేను పూర్వమువలె గాక నీతిపరుఁడను, ఆరోగ్యవంతుఁడను !"

పైన నుల్లేఖింపఁబడిన దినచర్యభాగములనుబట్టి, నామనసున కిపుడు క్రైస్తవమత సంపర్కము కొంత సోఁకినట్టు తేటపడఁ గలదు. కాని, యెపుడైన నేను సంపూర్ణక్రైస్తవమత విశ్వాసి నైన టుల నాకు జ్ఞప్తిలేదు. ఆ మతగ్రంథములఁ గల భక్తిపోషకములగు ప్రార్థనాదుల పోకడలుమాత్రము కొన్ని నే నిపుడు బాహాటముగఁ గైకొంటిని. జీససుమహాశయుఁడు చూపిన రాజమార్గమున నడచుటకు నాభక్తి యిపు డభ్యాసపడెను. ఇదివఱకు వైష్ణవమువలెనే, ఇపుడు క్రైస్తవముకూడ, నాభక్తికాంత ధరించిన వస్త్రవిశేషముమాత్రమె. క్రైస్తవమతాభిమానము నాకు పట్టుపడుటకుఁగల సందర్భము నొకింత నిచట ప్రస్తావించెదను.

నేను రాజమంద్రికళాశాలలోఁ జేరినది మొదలు, అందలి యుపాధ్యాయులలో నెల్ల శ్రీమల్లాదివెంకటరత్నముగారు నాకుఁ

ప్రియగురువు లైరి. మే మపుడు నివసించుకొట్టుదగ్గఱ నొకగృహమున వారు కాపుర ముండుటచేత, తఱచుగ నేను వారిని సందర్శించుచు వచ్చితిని. క్రైస్తవుఁడగు నాయన, ఏతన్మతప్రాశస్త్యమునుగూర్చియు బైబిలునుగుఱించియు నాతోఁ బ్రసంగించుచుండువాఁడు. నావిద్యారోగ్యాభివృద్ధులనుగూర్చి యాయన పలుమారు సదాలోచనలు చెప్పెడివారు. క్రైస్తవమతస్వీకారము చేయుమని మాత్ర మెన్నఁడును వారు నాకు బోధింపలేదు. అంతియ కాదు. కొన్నిసమయములందు క్రైస్తవమతస్వీకారావశ్యకతనుగూర్చి నేను గ్రుచ్చిగ్రుచ్చి యడుగఁగా, పరమాత్ముఁడు కోరునది హృదయపవిత్రతయేగాని, బాహ్యవేషాదులు గావని యాయన నన్ను హెచ్చరించుచుండువాఁడు. గతవత్సరమున నాతో కోనసీమ కేతెంచినస్నేహితుఁడు కారణాంతరములచే క్రైస్తవమతస్వీకారము చేసెద నని నన్ను వేధింపఁగా, నేను ౨౮వ ఆగస్టుతారీఖున వెంకటరత్నముగారియొద్ద కాతనిని గొనిపోయితిని. ఈవిషయమై వారియమూల్యాలోచన లడుగఁగా, ఆయువకుఁడు క్రైస్తవమతస్వీకారము చేయుట కాయన సమ్మతింపలేదు. అంత నేను క్రైస్తవమతమునుగుఱించి నాయభిమానమును మాగురువునకుఁ దెలిపితిని. నేను నిత్యమును బైబిలుపారాయణ చేయుచు, జీసను బోధన ననుసరించి దైవప్రార్థనలు సలుపుచుంటి నని చెప్పినప్పుడు, అట్టివారలే నిజమైనక్రైస్తవు లని నన్ను వెంకటరత్నముగారు అభినందించి, నా కమితోత్సాహము గలిగించిరి.

నే నిట్లు క్రైస్తవమతావలంబకుఁడను గాకున్నను, క్రైస్తవారాధనయు క్రైస్తవాచార సాంప్రదాయములును నా కెంతో రుచికరము లయ్యెను. ప్రపంచమున విస్తరిల్లెడి ప్రకృతిశాస్త్రజ్ఞానాదిశుభముల కెల్ల క్రైస్తవమతమే మూలాధార మని నేను నమ్మి

ఏతన్మతస్వీకారము చేసి క్రైస్తవాచారముల ననుసరించినఁ గాని మనదేశమున నైహికాముష్మికములు లే వని విశ్వసించెడివాఁడను! ఇట్టియూహలలోఁ గొంత సత్య మున్నను, ఇదియే యమోఘసత్యము గా దని నేను గ్రహించి, మతవిషయమై నామనస్సున మఱి కొంత మార్పు నొందినసందర్భ మిఁకఁ దెలిపెదను.

## ౧౫. రామభజనసమాజ సంస్కరణము

౧౮౮౮ - వ సంవత్సరాంతమున మాతండ్రి ఇన్నిసుపేట మధ్యభాగమున నొకచిన్న యిల్లు స్థలమును గొనెను. మఱుసటి సంవత్సరారంభమున మే మచటికిఁ బోయి, దాని కెదురుగ నున్న దేవరకొండవారియింటఁ గాపుర ముంటిమి. చెంతనుండు నొకయింట ప్రతి శనివారమురాత్రియుఁ గొందఱు యువకులు చేరి, రామభజన జరుపుచుండి, నన్ను తమసమాజమున కధ్యక్షునిఁ జేసిరి. రాత్రులు చాలసేపు ఎలుగెత్తి వారు గీతములు పాడుటవలన నిరుగుపొరుగువారల నిద్రకు నెమ్మదికిని భంగము గలుగుచుండెడిది. మాయింట రెండవ భాగమునఁ గాపురముండు నొకయుద్యోగి యొక నాఁడు, "ఈ రామభజన కడు బాధాకరముగా నున్నదే!" యని మొఱపెట్టఁగా, నే నాయనతో వాదమునకు డీకొని, బాలపామరుల కట్టి భజన లాభదాయక మని చెప్పివేసితిని. ఒకటి రెండుమాఱులు మా తండ్రియును రామభజనసమాజమువారిని గుఱించి విసిగికొని, వారితో జోక్యము కలుగఁజేసికొన వలదని నన్ను మందలించెను. అంతకంతకు రామభజనసమాజమువారి పోకడలు నాకును దుస్సహము లయ్యెను. ప్రార్థన సమయమున వారు రామునిపటమును ముందుంచుకొని, దానికి ధూపదీపనైవేద్యములు సమర్పించెడివారు. క్రీస్తుబోధనానుసారముగ మాను

సికారాధన చేయ నభ్యాసపడినసే నంత రామభజనసమాజ ప్రణాళికను సంస్కరింప నుద్యమించితిని.

ఈవిషయమును జర్చించుటకై "రామభజనసమాజ" ప్రత్యేక సభ ౨౪ వ అక్టోబరున జరిపితిమి. నా పూర్వసహపాఠి క్రొవ్విడి జగన్నాధరావు ఆసభ కగ్రాసనాధిపత్యము వహించెను. సంకుచితమగు పౌరాణికభజనము గాక, సర్వజనీనమును విశాలభావోపేతమునునగు మానసికారాధనము సలుపుటయె కర్తవ్య మని నే నానాఁడు దీర్ఘోప న్యాసము చేసితిని. పొరుగుననుండు పద్మనాభి మనువిద్యార్థి వ్యతి రేకాభిప్రాయుఁడై, నాప్రతిపాదనమును ప్రతిఘటించెను. ఇరుకక్షుల వారు నుద్రేకభావపూరితహృదయు లైరి. రెండుసమ్మతు లధికముగ వచ్చుటచేత నాతీర్మానము సభలో నంగీకరింపఁబడెను. నేను దిగ్విజ యము చేసితి ననుకొంటిని. మఱునాఁటినుండియె మేము సమాజ పునరుద్ధారణమునకుఁ బూనితిమి. సత్యదైవమును నమ్మిన మాకూట మునకు "ప్రార్థనసమాజ" మని పే రిడితిమి. ఈ నూతనసమాజములో నాతో మిగుల తీవ్రముగఁ బనిచేసినవారు జగన్నాధరావు రాజగో పాలరావులు. పూర్వపు రామభజనసమాజమునకై వసూలు చేయఁబడిన సొమ్ము వారి కిచ్చివేయుటకు మేము సమ్మతింపలేదు. అందువలన నిరుకక్షులవారికిని పోరు ఘోర మయ్యెను. ఒకరిమనోభావముల నొకరు గేలి చేయసాగిరి.

మా నూతనసమాజవిధానమునుగుఱించి మే మంత తలపోయ సాగితిమి. నామిత్రుఁడు జగన్నాధరావు నన్నొక యాదివారమున కందుకూరి వీరేశలింగముగారు జరుపుచుండెడి ప్రార్థనసమాజసభకుఁ గొనిపోయెను. ప్రార్థనసమయమున నచట శ్రీ వడ్డాది సుబ్బారాయ కవికృత భగవత్కీర్తనములును, చెన్నపురి బ్రాహ్మసమాజమువారి

గీతములును పాడుచుండిరి. ఆపుస్తకప్రతులు కొన్ని తెచ్చి మేము నుపయోగించుకొంటిమి. మాయింట్లకుఁ జేరువనుండు మాధ్యమిక పాఠశాలాగృహమున మా సమాజప్రార్థనలు జరుపుకొనుచువచ్చితిమి.

నా కిపుడు సంఘసంస్కరణమే ప్రధానాశయ మయ్యెను. మిత్రులఁ గలసికొనినపుడు, వారలతో సంస్కరణావశ్యకత నగుఱించి యుద్రిక్తభావమునఁ బ్రసంగించు చుందును. నా దృష్టిపథమున సంస్కరణాభిముఖులు సజ్జనులు; తద్వ్యతిరేకులు కాపురుషులు, సంకుచితస్వభావులును! నానాఁట నాసంస్కరణాభిమానము పలుకులు ప్రసంగములును దాటి క్రియాసోపానముఁ జేరెను. సంస్కరణపరాయణులు స్వేచ్ఛానువర్తనులుగ నుండవలయును. ప్రథమమున స్వగృహముననే వారు అనుష్ఠానమునకుఁ గడంగవలయును. ప్రకృతకాలమున పాఠశాలావిద్యార్థులలోఁ బలువురు కత్తిరించిన జుట్లతో నుండుట యాచారము. ఆకాలమున నగ్రవర్ణములం దిట్టిపని కడు గర్హితము! ఐనను, నాబోటి సంస్కరణాభిమాని జనాభిప్రాయములను లెక్కగొనక, ధైర్యమున నూతనపథము త్రొక్కవలదా? తలనొప్పులు కనుల మంటలు నా కాకాలమున సన్నిహితబంధువులే! కత్తితో క్షౌరమువలన నాకు నెత్తి మండుచుండెడిది. పుణ్యాపురుషార్థము లిట్లు కలసిరాఁగా, నేను తలముందలి వెండ్రుకలు కత్తిరించుకొనుట కలవాటు చేసికొంటిని. క్రైస్తవులవలె నే నిట్లు తల పెంచుకొని, యింటను బైటను మనుజుల విపరీతవ్యాఖ్యానములకు గుఱి యైతిని. తల్లికి, తమ్ములకు, నౌకరులకు, కుటుంబ క్షురకర్మ చేయు మంగలికిని, నాచర్యలు విడ్డూరముగఁ దోఁచెను! కాని, నేను స్థైర్యముఁ బూనియే యుంటిని.

## ౧౬. హిందూధర్మమా, బ్రాహ్మమతమా ?

రామభజనసమాజము విడిచిపెట్టిన మొదటిదినములలో నాకు ప్రార్థనసమాజ మూలసిద్ధాంతములను గుఱించి యంతగాఁ దెలియదు. హిందూసంఘదాస్య మొకింత తొలఁగించుకొని సంస్కరణాభిమానుల సహవాసభాగ్య మలవఱుచుకొనినచో, నేను పరిపూర్ణ స్వేచ్ఛాస్వాతంత్ర్యముల ననుభవింతు ననియు, నాకుఁ బ్రియమగు క్రీస్తుసందేశములచొప్పున నప్పటినుండియు నడుచుకొనవచ్చు ననియు, నేను దలపోసితిని! అంతియ కాని, ప్రార్థనసమాజాదర్శములకును క్రైస్తవమత విశ్వాసములకును, ఉత్తరదక్షిణ ధ్రువముల కుండెడియంతరము గల దని కలనైన నే ననుకొనలేదు! అక్టోబరు ౨౬-వ తేది సాయంకాలము, ప్రార్థనసమాజసభయందు వీరేశలింగముగారు "ఈశ్వరదత్తపుస్తకములను" గూర్చి యుపన్యాస మొసంగిరి. హిందూమతాభిప్రాయములనే యాయన నిరసించు నని నే నిదివఱ కెంచుచుంటిని. ఆయన నా కిష్టమగు బైబిలు, క్రైస్తవమతముల మీఁదఁగూడ నిపుడు దాడి వెడలుటకు మొదట మిగుల కంటగించితిని. కాని, అంతకంతకు నేను ప్రార్థనసమాజసిద్ధాంతముల కఱకుఁదనమున కభ్యాసపడితిని.

కొన్ని నెలలనుండి ప్రతి మాసారంభమునను, క్రీస్తు ప్రబోధించిన "ప్రభుప్రార్థన"ను నాదినచర్యపుస్తకమునఁ బూర్తిగా వ్రాయ నభ్యాసపడితి నని యిదివఱకే చెప్పితిని. ఇపు డీనవంబరు మొదటి తేదీని లిఖింపఁబడిన ప్రార్థన మిట్లుండెను:—"భగవానుఁడా! నీవు నానీతిప్రవర్తనమును గాపాడి, నాశీలపవిత్రతను సంరక్షించితివి. దేహమనశ్శక్తులందు వట్టిదుర్బలుఁడ నగునేను గతమాసమున నావర్తన నైర్మల్యమును నీకృపాసాహాయ్యమువలనే నిలుపఁబెట్టుకొనఁగల్గితిని."

అక్టోబరు నెలలో నాకుఁ దటస్థించిన క్లిష్టశోధనము నా మతాభిప్రాయములలోఁ గలిగిన కలవరమే. నాభక్తి కత్యంతావశ్యకము లని నే నదివఱకు నమ్మిన క్రైస్తవవైష్ణవసిద్ధాంత సాంప్రదాయములు అనగత్యములని నే నిపుడు విడనాడితిని. ప్రార్థనసమాజ మతసూత్రములే నా కింతటినుండి రుచిరము లయ్యెను. కావున నే నాదినచర్యాపత్రములనుండి క్రైస్తవమతవాసనలు అప్పటినుండియు నదృశ్యమగుచున్నవి. ఈ నూతనసమాజాదర్శములు తగినంత దృఢముగ నుండెనో లేదో యిఁకఁ జూడవలసియున్నది.

విశాఖపట్టణవాస్తవ్యులగు మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులుగారు రాజమండ్రి వచ్చి యుపన్యాసములు చేయనున్నా రని మాపట్టణమునఁ గొంతకాలమునుండి వదంతులు గలవు. పాండిత్య వాగ్ధోరణులయందు ఆచార్యులవారు అసమానప్రతిభాన్వితులని జనుల నిశ్చితాభిప్రాయము. నవంబరు మూఁడవ తేదీని విజయనగర మహారాజుగారి బాలికా పాఠశాలలో రంగాచార్యులవారు చేసిన యుపన్యాసము నేను వింటిని. హిందూదేశమునందు ప్రబలిన వివిధ మతములనుగూర్చి వారతిహృద్యముగఁ బ్రసంగించిరి. రంగాచార్యులవారి యుపన్యాసము వినినవారలకు మతవిషయములనుగుఱించి మనస్సున గొప్పసంచలన ముద్భవించెను. మఱునాఁడే నామిత్రులగు రాజాకృష్ణారావుపంతులుగారితో కళాశాలలో మాటాడుచు, ప్రాచీన హిందూమతాదర్శము లున్నతమైన వయ్యును, గురువుల సంకుచిత భావములవలన మతమున కప్రతిష్ఠయు దేశమున కనర్థమును వాటిల్లుచున్నవని నేను నొక్కి చెప్పితిని. ఆయన నాకు పూర్తిగ సానుభూతిఁ జూపెను. హిందూమతసౌష్ఠవమును గాపాడవలె ననినచో, శంకరాచార్యులు మున్నగు పీఠాధికారుల నిరంకుశాధికారము నరికట్టి,

# ౧౬. హిందూధర్మమా, బ్రాహ్మమతమా?

శాస్త్రగ్రంథపరిశోధనము గావించి, అందలి యథార్థ్యసత్యములను ప్రజలకు బోధించుట విద్యాధికుల కర్తవ్య మని నాకుఁ దోఁచెను. ఇట్టి స్వచ్ఛందప్రచారకులలోఁ జేరుటకు నే నువ్విళు లూరితిని.

ఆనాఁడు సాయంకాలము రంగాచార్యులుగారింకొక యుపన్యాస మొసంగిరి. ఇట్టియభిప్రాయమే ఆయనయు తన యుపన్యాసమున వ్యక్తపఱచిరి. మహారాష్ట్రపాఠశాలాధ్యక్షుఁడగు ముత్తుస్వామి శాస్త్రిగారి సభలో, తన కిదివఱకుఁగల క్రైస్తవమతవిశ్వాసములను పరిత్యజించి, హిందూమతసీమకు పునరాగమనముఁ జేయుచుంటి నని చెప్పివేసిరి! నాసహాధ్యాయుఁ డొకఁ డంత లేచి, విద్యార్థులనీతి మతోద్ధరణమునకై పెద్దలు గట్టి కృషి సలుపవలె నని కోరెను. మఱునాఁటియుదయమున కళాశాలలో మిత్రులు నేనును మతసంస్కరణ మునుగుఱించి ప్రసంగించితిమి. ఆసాయంకాలము రాజా కృష్ణారావుగారియింట మేము మరల కలసికొని యీవిషయమునుగుఱించి చర్చించితిమి. హిందూమతదౌర్బల్యమునకు ముఖ్యహేతువు, హిందూసంఘము శాఖోపశాఖలుగఁ జీలిపోవుటయే. కావున ప్రప్రథమమున చాతుర్వర్ణములలోఁగల యుపజాతులు తమతమ యంతర్భేదములను బాపుకొని యేకీభవించినచో, వేగమె దేశమున నైకమత్య మేర్పడఁగలదు. ఈసంగతిని మఱునాఁడు కళాశాలలోఁ జర్చింప మేము నిశ్చయించుకొంటిమి.

౭వ తేదీని రంగాచార్యులుగారు కర్మనుగుఱించి చేసినప్రసంగధోరణి నా కింపుగ లేదు. మఱునాఁడు మాతరగతిలోని విద్యార్థులమందఱము కళాశాలలో సభ చేసి, చాతుర్వర్ణ్యములోని యుపశాఖల సమ్మేళన మె ట్లొనఁగూడునా యని యాలోచించితిమి. మనలో నీసంఘీభావ మేర్పడెనేని, భారతీయు లందఱును సోదరబృందముగఁ

బరిణమించి పరమేశ్వరుని పరమహితగఁ జేకొందు రని రాజాగారు నేనును నొక్కి చెప్పితిమి. అగ్రాసనాధిపతియగు వెంకటరావు తన యుపన్యాసమున నిట్లు నుడివెను:—"మన మొనరింపఁబూనిన యీ సంస్కరణ మత్యంతలాభప్రద మైనదియే. కాని, మున్ముందుగ మనము మతగ్రంథములను పఠియించి, తోడిమతములగు క్రైస్తవమహమ్మదీయమతములను బరిశోధించి, సమన్వయమునఁ దేలిన సత్యసిద్ధాంతములను జనులకు బోధింప నుపదేశకులను దేశమున పల్లెపల్లెకును, పట్టణపట్టణమునకును బంపినచో, హిందూమతపునరుద్ధరణము లెస్సగ జరుగఁగలదు." ఈమతప్రచారకార్యము తాను నేనును ప్రారంభింప విధినోదిత మని యాతఁడు చెప్పినప్పుడు, నేనానందపరవశుఁడ నైతిని!

ఇట్లు రాజమహేంద్రవరమున రంగాచార్యులవారియుపన్యాసముల ఫలితముగ, విద్యార్థులమగు మామనస్సులు అత్యంతోద్రేకపూరితము లయ్యెను. కృష్ణారావు, వెంకటరావు నేనును మతసంస్కరణాభినివేశ మను సుడిగుండమున నిపుడు పడిపోయితిమి. మా కిపుడు రేయింబవళ్లు సంస్కరణమునుగూర్చిన యాలోచనలతోనే కాలము గడచిపోయెను. నవ లేదీని మేము మువ్వురమును పాఠశాలకుఁ బోవుట మానివైచి, పోలవరముజమీందారుగారి మేడలోఁ గూడి, సంస్కరణ సంగతులు చర్చించితిమి. "మేము ప్రథమమున వేదములు మొదలగు హిందూమతగ్రంథములును, ముఖ్యపరమతగ్రంథములును నాలుగైదేండ్లు చదివి, మతవిషయములందు నిపుణులమై, అంతట రాజమండ్రినివాసుల కైకీభావము గలిగించి, యచట సత్యమతమునకు శంకుస్థాపన మొనరించెదము. ఇచటనుండి చుట్టుపట్టులనుండు ప్రదేశముల కంత దేవునిసువార్త వెదజల్లి దేశోద్ధరణముఁ గావించెదము!" అని మేము నిర్ధారణ చేసికొంటిమి.

## ౧౬. హిందూధర్మమా, బ్రాహ్మమతమా?

మా సహపాఠి బజులుల్లాసాహేబు, మాముగ్గురికిని మనసు గలిసినమిత్రుఁ డయ్యెను. అన్యమతస్థుఁ డగుటచేత, తగిన సానుభూతి చూపింపనేరక, మానవస్తాప మంతయు వట్టితాత్కాలికోద్రేక మని భావించి, మమ్ము పరిహసించుచు నొకచిన్న యాంగ్లేయ ప్రహసన మాదినములలోఁ గలిపించెను. భూమినుండి చంద్రునివఱకు నొకపెద్దవంతెన కట్టవలె నని యోజించెడి ముగ్గురు ఉన్మత్తులతో మమ్మతఁడు పోల్చెను. పిచ్చియాలోచనలు చేయుచుండెడ నని రాజా కృష్ణారావునకు సత్యకాలప్రభు వనియు, చలచిత్తుఁ డని వెంకటరావునకు గాలిచక్ర మనియు, ఆవేశపూరితుఁడ నని నాకు భావోద్రేక మనియుఁ బేరులు పెట్టి, మాముగ్గురిని తనప్రహసనమునఁ బాత్రలుగఁ జేసి యతఁడు వినోదించెను!

నా కీసమయమున సంఘసంస్కరణాభిమానులగు మిత్రు లిఁకఁ గొందఱు లభించిరి. వీరిలో నొకఁడు గోటేటి కనకరాజు. ఇతఁ డా సంవత్సరము ప్రథమశాస్త్రపరీక్షకుఁ బోయెడి విద్యార్థి. రాఁబోవు సంవత్సరమునందు ఉపాధ్యాయవృత్తిలోఁ బ్రవేశించి, తనహృదయమున కానందదాయకమగు ప్రార్థనసమాజాదేశముల చొప్పున ఋజువర్తనమున జీవితము నడపుకొనుట కితఁ డుద్దేశించెను. ఇతనికంటె నధికాశాపరుఁ డగు వాఁడు ముత్తుస్వామిశాస్త్రి. ఈయన పట్టపరీక్ష నిచ్చి, మహారాష్ట్రపాఠశాలను నడుపుచుండెడి విద్యాధికుఁడు. పెక్కుగ్రంథములను జదివి కొంత లోకానుభవము సమకూర్చుకొనిన ప్రజ్ఞావంతుఁడు. కాని, తాత్కాలికభావోద్రేకమునఁ గార్యరంగమునకు దుమికెడి వేగిరపాటువాఁ డనియు, చీటికి మాటికి మతము మార్చుకొనుచుండెడి చంచలచిత్తుఁ డనియు, నీతనిని జనులు పరిహసించుచుండిరి. ఇందుఁ జాల సత్యము గల దని నాకును ద్యోతక మయ్యెను.

ఆ దినములలో నేను క్రైస్తవమతప్రచారసంఘమువారి ప్రచురణమగు "మతసంస్కరణము" నుగూర్చిన పుస్తకములు అత్యంతతమకమునఁ జదివితిని. క్రైస్తవుఁ డగుగ్రంథకర్త పక్షపాతబుద్ధి పుస్తకములలోని పత్రపత్రమునను నుబుకుచున్నను, హిందూమతమును గూర్చియు, సంస్కరణసంస్థలగు నార్యబ్రాహ్మమతములను గుఱించియు నా కిపుడు కొన్ని యమూల్యాంశములు బోధపడినవి. అన్నిటికంటెను బ్రాహ్మమతధర్మములె నాకు యోగ్యములుఁగ గానఁబడినవి. నవంబరు ౨౯-వ తేదీని నేను కళాశాలలో వీరేశలింగముగారితో బ్రాహ్మసమాజమునుగూర్చి ప్రసంగించితిని. ఆయన నాయభిప్రాయములను దృఢపఱిచెను. కావున నే నిపుడు పరిశుద్ధాస్తికమత మవలంబనీయ మని విశ్వసించి, స్నేహితుల కది ప్రబోధింప మొదలిడితిని. కనకరాజు, జగన్నాథరావుల కిది ప్రీతికరమె గాని, కొండయ్యశాస్త్రి మున్నగు వారలకుఁ గంటకసదృశముగ నుండెను!

కొంతకాలమునుండి రేలంగిలో శరీరస్వాస్థ్యము తప్పియుండి యిపుడు నెమ్మదిపడిన మాతండ్రిని, డిశెంబరు రెండవవారమున మా తల్లియు తమ్ములును రాజమండ్రి తీసికొనివచ్చిరి. నాప్రకృతవిపరీతచర్యలు కనిపెట్టి యాయన యుగ్రుఁ డయ్యెను. ఇటీవల నే నవలంబించిన సంస్కరణపద్ధతులకథన మాయన కిపుడు వినవచ్చెను. రాజమండ్రిలో సకుటుంబముగ నివసించుచుండెడి నా మామగారు మఱి కొందఱును నా వికారపుచేష్టలను మాజనకుని కెఱిఁగించిరి. నేను క్రైస్తవునివలె జుట్టు పెంచితి ననియు, బొట్టుపెట్టక, మడి గట్టక, భుజించుచుంటి ననియు, జందెము తీసివైచి నాస్తికుల సావాసము చేయుచుంటి ననియు, నామీఁద నేరారోపణములు చేయఁబడెను!

కాని, నేను శాంతము వహింపవలె ననియు, పూర్వాచారపరాయణులగు తలిదండ్రులపోషణమున నుండెడి యీ విద్యాభ్యాసకాలమున, బొట్టు జుట్టు మొదలగు బాహ్యవిషయములను గుఱించి యనగత్యముగ నేటి కెదురీదవల దనియు, సంస్కారప్రియులగు స్నేహితులు నాకు హితోపదేశము చేసిరి. అంతటినుండి యీవిషయములందు నే నెంతో జాగ్రతతో మెలంగితిని. కాని, నాకుఁ బ్రియతరములగు మతవిషయిక గ్రంథములు మనసార పఠించి, నాయభిప్రాయముల నితరులకు బాహాటముగఁ దెలుపుటకు పరిపూర్ణావకాశ ముండుటవలన, నేను వెనుకటికంటె నధికోత్సాహమున బ్రాహ్మమతగ్రంథములు చదివితిని. ఇంతియ కాదు. మిత్రులు కనకరాజు జగన్నాథరావు నేనును బ్రాహ్మసమాజ ముఖ్యసూత్రములు విశ్వసించితి మని ప్రతిజ్ఞ చేసికొంటిమి మావలెనే యింకఁ గొందఱు మిత్రులును మమ్ముఁ జేరినచో, మేము రాజమండ్రిలో బ్రాహ్మసమాజము నెలకొలుప నుద్యమించితిమి !

## ౧౭. సోదరీనిర్యాణము

చిన్నితమ్ములను చెల్లెండ్రను ఎత్తికొని యాడించుట చిన్ననాఁటనుండియు నా కెంతో ముచ్చట. ఏడ్చుచుండెడి నెలగ్రుడ్డులను సైతము శమింపఁజేయురహస్యము బాల్యముననే నాకుఁ బట్టుపడినటు లుండెను. శిశువులను శాంతింపఁజేయ నేను బడెడి శ్రమను జూచి, మా పెద్దపెదతల్లి నన్ను "పెంపుడుతల్లీ !"యని నవ్వుల కనుచుండెడిది. పాలు ద్రావునపుడును భుజించునపుడును దక్క మిగతకాలము, చిన్నితమ్ములు చెల్లెండ్రును సామాన్యముగ నాచెంతనే గడపెడివారు. వారి నెటుల లాలింపవలయునో బుజ్జగింపవలయునో, మాయమ్మకు వలెనే నాకును దెలిసియుండెను. బాల్యమందు వారలకు నే నిడిన

ముద్దుపేళ్లకును, ఉల్లాసము గలుగునట్టుగ వారితో నేను భాషించెడి చిన్నిపలుకులకును, మితి లేకుండెను. కావుననే నాయెడల వారలకును, మించిన ప్రేమానురాగము లుండెడివి.

౧౯౩౩ వ సంవత్సరము అగష్టు ౨౮ వ తేదీని జన్మించిన మాచిన్నిచెలియాలు లక్ష్మమ్మ అను వెంకటరత్నమ్మ నాకు బహిఃప్రాణమె! చామనచాయమేనితో నొప్పి, బక్కపలుచనియాకారము గల యాబాలిక, శైశవముననే తనసోగకనులతో ననుఁ జూచుచు, తన నెత్తికొనుమని నామీఁదికి వ్రాలుచుండును. నాకుఁ జేత నెంతపని యుండినను, చెల్లెలిని దీసి యాడించుచుందును. తనతో నే నాడెడి ముద్దుపలుకులయర్థము తాను గ్రహించినట్టుగనే, ఆశిశువు, మృదుమందహాసము చేయుచు, తనచిన్నిచేతులతో నామొగము నిమురుచుండును. దానికి నాకును భావనపేక్షింపని వింతప్రేమ మమరియుండెను. దూరమున నామాట వినఁబడఁగనే యాబాలిక, తనమోమెత్తి, నన్నుఁ జూచి, నాముద్దులు గైకొనుట కాయత్తపడుచుండును!

౧౯౩౪ వ సంవత్సరము వేసవికాలమునకుఁ బూర్వమె దాని శరీరమున విషవ్యాధి యంకురితమయ్యెను. చూచుచుండఁగనే శిశువు కృశించి, మూలుగ నారంభించెను. నే నిలు సేరి యెదుట నిలిచి నపుడు, నన్నుఁ దన నిడుద కనులెత్తి చూచి, తన నెత్తుకొమ్మని చేతులు నాదెసఁ జాచుచుండును. తా నమితవేదనకు లోనయ్యును, నాచేతుల నుండు నించుకసేపును హాయిగ నుండునట్లు కానఁబడు చుండును.

ఏమందులు నెట్టిచికిత్సలును ఆశిశువుపట్ల నిష్ప్రయోజనము లయ్యెను. వేసవివడ సోఁకిన చిగురుటాకువలె ననివారిత వ్యాధిపీడిత

రైన యీ బాలిక కమలిపోయెను. బాలికకు మృత్యు వాసన్నమయ్యె ననియె గాక, దాని యపారవేదన కొంకింతయైన నుపశమనము గావింప నేరకుంటి మనియు మేము దుర్భర మనోవ్యథకు లోనైతిమి.

మెల్లగ లేఁజివురు వెట్టుచుండు నాయాత్మ కీసందర్భమునఁ గలిగిన కఠినశోధనమునుగూర్చి యొకింత ప్రస్తావించెదను. అగస్టు ౧౪ వ తేదీని నాదినచర్యపుస్తకమున లిఖితమైనవాక్యము లిచట నుల్లేఖించుచున్నాను:—

"నేఁడు మధ్యాహ్నము నేను కళాశాలనుండి యింటికి వచ్చునప్పటికి, ఇంట నెవరును లేకుండిరి. మాసొంతపెరటిలోనికిఁ బోయి చూడఁగా, అతిఘోరదృశ్యము నాకుఁ గానవచ్చెను. చనిపోవుచుండు మాకడగొట్టుచెల్లెలిచుట్టును మాతల్లి తమ్ములు చెల్లెండ్రును జేరి విలపించుచుండిరి. శుష్కించిపోయిన యీబాలిక శరీరమునుండి చిన్నదీపకళికవలె ప్రాణము రెపరెప మని యారిపోవుచుండెను! ఆ కళేబరమునుండి యుచ్ఛ్వాస మొకటిరెండుసారులు వింటిమి. తుదిమరణవేదన ననుభవించి, అశ్రుపూరితములగు మాకనులయెదుటనె యీ చిన్నిప్రాణ మంత నస్తమించెను.

"దుఃఖ మేమియో యెఱుంగని మా చిన్నితమ్ముఁడు సూర్యనారాయణ, మే మందఱము విలపించునంతసేపును మారమున నూరక చూచుచుండి, శవము గొనిపోఁబడునపుడు అకస్మాత్తుగ నేడువసాగెను!

"ఇపుడు మృత్యువునోటఁ బడిన మాముద్దుచెలియలు సరిగా నొకవత్సరమె యీభూలోకజీవిత మనుభవించెను.

"కుటుంబమున తలిదండ్రులకును గొమరితకును, అన్నయక్కలకును జెల్లెలికిని, ఎడఁబాటు కలిపించిన యీదిన మెంతటికఠిన

దుర్దినము! హృదయశల్యమగు నిట్టి కష్ట మాపాదించిన యీ నికృష్ట దినము నా కెన్నటికైన మఱపువచ్చునా?

“విపత్తు సంభవించిన నాఁటిరాత్రియే నా యాంతరంగికమిత్ర మగు నీదినచర్యపుస్తకమునకు నామనోవేదనను వినుపించుచున్నాఁడను. నేను సంతాపనిమగ్నుఁడనై యున్నాను. దుఃఖాతిరేకముననె నాహృదయము మొద్దువాఱియున్నది. నే నెవరినో నాకుఁ దెలియదు! నేఁడు మధ్యాహ్నము మాకు సంభవించిన కష్టమున కర్థము గ్రహింపనేరకున్నాను. చెల్లెలి చావనఁగ నేమి? నాకన్నులు పొడివాఱిపోయినవి. ఇందువలన నాహృదయము దుఃఖార్ద్రము గా దనుకొనకుమీ! గాఢ సంతాపానలమె నానయనముల తేమ నార్చివైచినది! కాన, నాగుండియ రాతిగుండె యైపోయినది.

“ముద్దులచెలియలా! నీ వెచటి కేఁగితివి? జ్ఞానప్రసారకములగు నీకనుఁగలువలు, నీవిశాలవదనకమలము, నీసుకుమారశరీరకోరకమును — ఆహా, ఐదునెలలనుండి నిను వేఁచినవ్యాధివలన నెట్లు కమలిపోయినవి! ఇప్పటికి నీవెతలు పరిసమాప్తి నొందినవి. ఆహా! చిరంజీవిని వైన నీ వెంతటికీర్తి గడించియుందువోగదా! అయ్యో, ఇది యెంత రిత్తకోరిక!

“సశరీరులైన మానవులకు అశరీరులగు జీవులతోఁ బ్రస్తావింప సాధ్య మయ్యెనేని, ప్రియసోదరీ, ఈతరుణమున నిన్నొకింత ప్రశ్నింపఁ గాంక్షించుచున్నాఁడను. అతిబాల్యముననె ప్రేమాతిరేకమున నీవు నన్ను ‘అన్నా’ యని పిలిచెడిదానవు. చెల్లీ! దుఃఖభూయిష్ఠ మగు నీభూలోకమున నీ వేల యావిర్భవించితివి? నీ విపుడు మృత్యువువాతఁబడి మటుమాయ మైపోయితివిగదా. విఫల మనోరథుఁడనగు

నాకు నీయెడఁగల ప్రేమాతిశయము నెట్లు నీ కింక వ్యక్తపఱుపఁ గలను? ఎవ్విధమున నీస్మారకచిహ్న మిచట నెలకొల్పవసును?"

## ౧౮. నూతన దృక్పథము

నూతన మతాన్వేషణమునుగుఱించి ౧౮౮౯ వ సంవత్సరమధ్యమున నాకుఁ గలిగిన యుత్సాహోద్రేకములు, ఆ సంవత్సరానంతరము వఱకును నా మనస్సును గలఁచివైచినవి. ఇదమిద్ధమని నేను నమ్మవలసినది వైష్ణవమా క్రైస్తవమా, సంస్కరింపఁబడిన హిందూమతధర్మములా, ప్రార్థనసమాజవిధులా;—యని నే నా యాఱునెలలును తల్లడిల్లితిని. ఈవిషయమై సత్యనిరూపణము చేసికొనుటకు స్నేహితులతోఁ జెలిమి చేసితిని, సావాసులతోఁ జర్చలు సలిపితిని, సభలలో నుపన్యాసములు వింటిని, సద్గ్రంథపఠనముఁ గావించితిని. వీనియన్నిటి పర్యవసానము, ఆ సంవత్సరాంతమున నేను బ్రాహ్మమతధర్మవిశ్వాసమలవఱుచుకొంటిని. అప్పటినుండియు నేను మతాన్వేషణమునకై మరల తత్తరపడలేదు. ఉన్నతపర్వతాగ్రమున నిర్మితమగు గృహరాజమువలె, నామతవిశ్వాసము లింతటినుండి స్థిరములు సుందరములునై విరాజిల్లెను. మతగ్రంథపఠన మతపరిశోధనములు చేయుచుకును, ఆత్మాభివృద్ధి ఆత్మపారిశుద్ధ్యములు గాంచుటకును వలసిన పరిశ్రమము ఇంతటితో నంతరించిన దని నేను జెప్పుటలేదు. వీని యన్నిటికిని మఱింత యనుకూల మగు నావరణ మేర్పఱిచెడి దృఢత్వ స్థిరత్వములు నా మతవిశ్వాసముల కిపుడు లభ్యమయ్యెననియే నేను జెప్పుచున్నాను.

నా దృష్టిపథమునఁ గలిగిన యీ పెద్దమార్పు, ౧౮౮౯ డిసెంబరు ౩౧, ౧౮౯౦ జనవరి ౧వ తేదీలదినచర్యలలో స్పష్టముగ వివరింపఁబడెను. అందలి ముఖ్యభాగము లిచట నుల్లేఖించుచున్నాను:—

"౩౧-౧౨-౯౯:—దయామయుఁడవగు తండ్రీ! నేను ఈ సంవత్సరారంభమున, స్థిరసంకల్పము గాని, దృఢవిశ్వాసము గాని లేకుండెడియువకుఁడను. ఇపు డేస్థితిలో నున్నాను? అజ్ఞానతిమిరము నుండి నీ జ్యోతిర్మయమండలముపైపున కొక యంజ వేసితిని. ఈ వత్సరమున శరీరమందును, మనస్సునందును, ముఖ్యముగ నీతివిషయమునను, నే నెన్నియో మార్పులు చెందినాఁడను. సత్ప్రవర్తనమున నే నీ వత్సరమున నుచ్చదశ ననుభవించితిని. మనుజుని సచ్ఛీలతా సత్ప్రవర్తనములు దేవదేవునికిఁ బ్రియతమము లని తుదకు నే గనుగొంటిని." ****

"౧-౧-౯౦:—'సర్వసమర్థుఁడా! నాశత్రువులనుండి నన్ను రక్షింప నీవే యోపుదువుగాని, కడు దుర్బలుఁడ నగు నేను గానుసుమీ!', యని ప్రారంభప్రార్థన సలిపి, నూతనసంవత్సరమున నేను జెల్లింపవలసిన విధులనుగూర్చి యోజించితిని. ప్రథమశాస్త్రపరీక్షకు బాగుగఁ జదువవలె ననియు, తమ్ములయొక్కయు చెల్లెండ్రయొక్కయు విద్యాపరిపోషణముఁ గావింపవలె ననియు, పరిశుద్ధాస్తికమతప్రచారము సలుపవలె ననియు, నేను కృతనిశ్చయుఁడ నైతిని. విధికార్య నిర్వహణవిషయమున నే జేసికొనిననియమములఁ గొన్ని యిచట నుదాహరించుచున్నాను:—

౧. శరీరసాధకమునుగూర్చి ముఖ్యముగ శ్రద్ధ వహింపవలెను.

౨. కోపము, గర్వము, అసూయ, లోభము—వీని నడుపులో నుంచవలెను.

3. ప్రేమ, మతోత్సాహము మున్నగువానిపట్ల మితి మీఱరాదు.

౮. నిరర్థకవిషయములనుగుఱించి కాలము వ్యర్థపుచ్చఁగూడదు.

౫. ఏపరిస్థితులందును పరనింద చేయరాదు.

౬. మంచిసంగతి నైనను, అధికవ్యామోహమునఁ జింతింపరాదు.

*　　*　　*　　*

౧౦. పరీక్షలలో నఖండవిజయమున కైన నారోగ్యముఁ గోలు పోవరాదు.

౧౧. ఈవిధులను జెల్లించుచు, దుస్సహవాసములు, దుస్సంకల్పములు, దుష్టదృశ్యములు—వీనిని త్యజింపవలయును."

మతములలో నెల్ల నాకు బ్రాహ్మధర్మము రుచిరముగ నుండెను. బ్రాహ్మసమాజశాఖలు మూఁడింటిలో నాకు సాధారణ బ్రాహ్మసమాజము ప్రియతమ మయ్యెను. నే నిపుడు కళాశాలలోఁ జదువు ప్రాచీనగ్రీసుచరిత్రములోఁ గన్పట్టెడి రెండు రాజకీయపక్షములలోను, ప్రజాయత్తపరిపాలనాపక్షమే నా కిష్ట మయ్యెను. ప్రభుపక్షమువారగు స్పార్టనులు నా కాజన్మశత్రువు లనియు, ప్రజాస్వామిక పరిపాలకులగు అథీనియనులు పరమమిత్రు లనియు నే నెంచువాఁడను. అదేరీతిని, ఆంగ్లేయరాజ్యతంత్రమునఁగల పూర్వాచారపరులు సంస్కారప్రియులును వరుసగా నాకు శత్రుమిత్రకోటిలోనివారైరి! ఈతత్కారణముననే నేను హిందూసంఘమునఁగల పూర్వాచార పరులను నిరసించుచు, సంస్కర్త లనిన సంతసించువాఁడను. ఆంధ్ర దేశమున నాకు నచ్చిన సంస్కర్త మాగురూత్తములగు వీరేశలింగము పంతులే. ఆయన సంస్కారప్రియత్వము, ఒకసాంఘికపథముననే గాక, మతరాజకీయాదివిషయములకును వ్యాపించియుండెను. కావున నే నాయన నత్యంతగౌరవమునఁ జూచుచుండెడివాఁడను.

కాని, ఆయనతో నేను పలుసారులు సంభాషించుట కిపుడు వలనుపడెడిదికాదు. ఆయన పరీక్షాపత్రములు దిద్దునప్పుడు ఒకనెలమే మాయనతోఁ బ్రసంగింపరాదు. ఇదిగాక, ఆకాలమం దాయన ఏలూరి లక్ష్మీనరసింహముగారి యభియోగములలోఁ జిక్కుకొనియుండుటచేత, పలుమాఱు న్యాయవాదులతో మాటాడుచును, న్యాయసభల కేగుచును నుండెడివాఁడు. పంతులవంటి సంస్కర్త, సమదర్శి, సత్యసంధుఁడును, సామాన్యజనుల వగపువెఱపులకు లోనగుచు, వ్యక్తిగతకక్షలు సాధించుటకై న్యాయస్థానముల కెక్కుచుండుట, నాకే కాదు, సంస్కారప్రియులగు నామిత్రులకును సెంతయు నసమంజసముగఁ దోఁచెను! నా స్నేహితులలో నొకఁడు, తానే పంతులవలె సంస్కర్తయై తనమీఁద వ్యాజ్యెము వచ్చినచో, ఆయనవలె న్యాయసభలు చొచ్చి, అందు న్యాయముఁ బడయఁగోర ననియు, న్యాయాధిపతి తనకు విధించునన్యాయమగు దండనమే మౌనమున నంగీకరించి వలసినచో, కారాగారమున కేగెద ననియును, పలుకుచుండెడివాఁడు! ఇట్టితలంపులలోఁ గొంత పటుత్వము లేకపోలే దని మే మనుకొనెడివారము! ఆ ఫిబ్రవరి ౧౧వ తేదీని, నేను వెంకటరావు మాటాడుకొనుచు, వీరేశలింగమహాశయుని సమకాలికులముగ నుండుభాగ్యమనుభవించు చుండుమేము, వారిజీవితమునుగుఱించిన యమూల్యసత్యములను సంపాదించి, ఆ యుదారపురుషునిచరిత్రము లోకమునకుఁ బ్రకటితము మొనరించుట మా ముఖ్యధర్మ మని తలంచితిమి. ఆనెల ౧౬వ తేదీని నేను నా పూర్వస్నేహితుఁడగు శ్రీ తోలేటి వెంకటసుబ్బారావుగారిని సందర్శించితిని. వీరేశలింగముగారిచరిత్రము తాను వ్రాయుచుంటి నని యాయన చెప్పెను. నా కిది మిగుల విపరీతముగఁ దోఁచెను. కొలఁదిదినములక్రిందటనే యీసంగతినిగుఱించి వెంకట

రావుతో మాటాడునప్పుడు, ఇట్టి జీవితచరిత్రములలో సత్యము ప్రధాన మని తలంచితినిగదా. ఈ చరిత్రకారుఁడు లోఁతుచూరని వికటకవి యని నా యప్పటితలంపు. దైవసహాయ మున్నచో, వీరేశలింగముగారిజీవితచరిత్రమును మెకాలెవలె సంగ్రహవ్యాసరూపమున నేను రచింప నుద్దేశించితిని. నాయాశ్చర్య మే మని చెప్పను? ఆమఱుసటిదిన మే కాంతయ్యగారిని నేను గలసికొనినప్పుడు, పంతులుగారికిని, గౌరరాజు లక్ష్మీనరసింహముగార్లకును గలభేదములనుగూర్చి యాయన నాతో ముచ్చటించెను. వీరిలోఁ గడపటివారు మొదట వితంతూద్వాహపక్షపువా రయ్యును, పంతులుగారియెడ మనస్పర్థలూని తనపేరునకుఁ గళంకము తెచ్చుకొనె నని చెప్పెను. పంతులుగారి శీలమునఁగల కొఱంతలను కొన్ని యాయన సూచించెను.

మతవిశ్వాసములందు నా కిపుడు కొంత స్థిరత్వము గలిగినను, హిందూసంఘమున నల్లిబిల్లిగ నల్లుకొని, జనులయభ్యుదయ మరికట్టెడి దురాచారప్రాబల్యము కనిపెట్టినపు డెల్ల నాడెందమున నాగ్రహముప్పొంగెడిది! పూర్వాచారపరాయణత్వము నా ప్రబలవిరోధి యని పరిగణించువాఁడను. ఆజనవరి 3 వ తేదీని, మాతల్లి వలదని ఘోషించుచుండినను, నాచెవిపోగులు తీయించివైచి, దిగ్విజయము చేసితి ననుకొంటిని! ఆమార్చి ౨౧ వ తేది సంవత్సరాదిపండుగనాఁడు, అభ్యంగనము మానివైచి, పూర్వాచారధిక్కారము చేసితినని యుప్పొంగితిని! ప్రాఁతనేస్తుల సావాసము నా కిపుడు నప్రియమయ్యెను, వారిలో పూర్వాచారపరాయణులగు కొండయ్యశాస్త్రి వంటివారిమీఁద కొంత "మోజు" తగ్గెను. వెంకటరావు నా కాంతరంగికమిత్రుఁ డయ్యెను. మతవిశ్వాసములందు భిన్నాభిప్రాయుఁ డయ్యెను, సంఘదురాచారనిరసనమున నా కాతఁడు పరిపూర్ణసాను

భూతిఁ జూపుచువచ్చెను. కాని, యాచారసంస్కరణవిషయమై శాంతమార్గ మవలంబనీయ మని నా కాతఁడు హితవు చెప్పుచుండెడి వాఁడు. దురాచారములను అగర్భశత్రువుగఁ జూచుచుండెడివాఁడను నేను. ఎట్టిదురాచారనిరసనమందైన, మనశ్శాంతిని గోలుపోక, కుటుంబ సౌఖ్యమును, సాంఘికసామరస్యమును జెండాడవల దని బోధించు చుండువాఁ డాతఁడు. మాయాసంస్కరణవ్యాసంగమునఁబడి యారోగ్యముఁ బోగొట్టుకొనుచుంటి నని శాస్త్రి మున్నగు స్నేహితులు నన్నుఁ బలుమాఱు హెచ్చరించిరి. మాపెద్దతమ్మునిపెండ్లి మాట లిపుడు జరుగుచుండెను. ఇపుడు వివాహము వలదని నే నింట తలిదండ్రులతో మిక్కిలి పట్టుదలతో వాదించుచుంటిని. నా తీవ్రవాదన యర్థము సరిగా లోకులు గ్రహింపక, లేనిపోనియుద్దేశములు నా కారోపింతు రనియు, కాన, నేను గడుసుఁడనమున మితభాషిత్వ మూనుటయె శ్రేయ మనియు వెంకటరావు నాకు బోధనఁజేసెను.

30-3-౯౦ తేదీన సంస్కరణవిషయమై ముత్తుస్వామిశాస్త్రికిని నాకును దీర్ఘసంభాషణము జరిగెను. సంస్కరణముల నాచరణమునఁ బెట్టుటయందు భార్యసానుభూతిసాహాయ్యము లత్యంతావశ్యకము లని యతఁడు చెప్పెను. హిందూయువతులకు పాతివ్రత్య మను నది యమూల్యాభరణము. దాని నూఁతగాఁ గొని, పురుషుఁడు స్త్రీపై నిరంకుశాధికారము చెల్లింపవచ్చును. క్రొత్తగఁ గాపురమునకు వచ్చిన భార్య నొకసారిగాఁ దనసంస్కరణమహార్ణవమున ముంపఁబూనక, సంస్కరణపక్షమునం దామె కభిరుచి పుట్టించుటకై సంస్కర్త మెల్లమెల్లగ ప్రబోధము గావించుచుండవలెను. తలిదండ్రులయెదుట నైనను మన సంస్కరణతీవ్రతను జూపింపక, విచారపూరితమగు మన మౌన మితభాషిత్వములుమాచి వారు ప్రశ్నింపఁగా, అపుడు

మాత్రమే, హిందూసంఘవృక్షమునకు వేరుపురుగులగు దురాచారముల సంగతి వారికి మనము సూచింపవలె ననియు శాస్త్రి నాకు బోధించెను. వేగిరపాటు నైజగుణముగఁగల నాకీ సామపద్ధతి సంకెలవలెఁ దోఁచెను! సంఘసంస్కర్త సమష్టికుటుంబజీవితమును త్యజించినఁగాని, అతనికి సతికిని బొత్తు గలియ దనియు, భార్యాభర్తలకు బాహాటముగా సంభాషణములు జరుపుట కవకాశ మేర్పడినఁగాని సంస్కరణవిషయము లందు పత్ని కామోదము గలుగ దనియు, నానిశ్చితాభిప్రాయము. ఐనను, మిత్రులయాలోచనలలోఁగల యమూల్యసత్యములనుమాత్రము నేను గ్రహించుచుండువాఁడను.

## ౧౯. సంఘసంస్కరణసమాజము

౧౯౦౦ మార్చిమాసారంభమునుండి సంఘసంస్కరణ విషయమున నా యుత్సాహము కడు తీవ్రముగ నుండెను. సహపాఠియగు చెన్నాప్రగడ నరసింహము నేనును ఆనెల మొదటితేదీని మాటాడుకొనుచు, సంస్కరణోద్యమవిధుల ననుసరించి నడువఁగోరితిమేని హిందూసంఘ దురాచారముల కెల్ల మూలకందమగు సమష్టికుటుంబ జీవితమున కొడంబడక, భార్య కాపురమునకు వచ్చినది మొదలు వేరుగ నుండుట ప్రథమకర్తవ్య మని మేము నిర్ధారించుకొంటిమి. ఆమఱునాఁడు వెంకటరావు, ఇంకొకస్నేహితుఁడు నేనును సంస్కరణవిషయమై ప్రసంగించితిమి ఉద్రిక్తచేతస్కుఁడనగు నాకుఁ గల కార్యతీవ్రత తనకు లేమింజేసి, జీవితమున నా నాయకత్వ మనుసరించి, నిరతము నా యడుగుజాడల నడచుచు, నా యుద్వేగమును తగ్గింపవలసినపు డెల్ల నన్ను దా వెనుకకు లాగుచుందు నని వెంకటరావు చెప్పినప్పుడు, అహంభావమున నేను మిన్ను ముట్టితిని. ఆ యేడవతేది రాత్రి కనకరాజు వెంకటరావు నేనును గలసికొని,

సంస్కరణోద్యమమును కార్యాచరణమునకుఁ గొనివచ్చుటనుగూర్చి ముచ్చటించితిమి. మా ముప్వురిలోను గృహస్థాశ్రమానుభవము గలవాఁడు కనకరాజొక్కఁడే. విద్యాగంధ మెఱుఁగని భార్యయు, పూర్వాచారపరాయణ యగు పినతల్లియు, తన సంస్కరణనిరతికి విముఖులై తనకు గుదిబండలుగ నున్నారని యాతనిమొఱ! జనాభిప్రాయభీతిచే నామిత్రునిమనస్సు మిగుల తల్లడిల్లుచుండెను.

ఆతని యూహలలోఁగల సత్యము మాకును నచ్చెను. బ్రాహ్మమతస్వీకారఫలితముగ హిందూసంఘమును పూర్తిగ త్యజించుటకుఁ బూర్వము, స్నేహితుల మండలము నొకకూటముగ నేర్పడి, యేతన్మత గ్రంథములను జదివి, చిత్తబలిమిని సంపాదించుచుండుట కర్తవ్య మని మాకుఁ దోఁచెను. ఇంతలో మా స్నేహబృందమునఁ గొన్నిమార్పులు గలిగెను. వెంకటరావు చదువు మానుకొని, ఆరోగ్యాన్వేషణమునకై స్వగ్రామమునకు వెడలిపోయెను. ౧౨-వ తేదీని కనకరాజు నాతో మాటాడుచు, మాకళాశాలలో పట్టపరీక్ష మొదటితరగతిలోఁ జదువు నొక యోఢ్రయువకుఁడు తనతీవ్రసంస్కారాపేక్షచే సంఘబహిష్కృతుఁ డయ్యె ననువార్త చెప్పెను. మా కిపుడు కావలసినదే యిట్టివారల సావాసము! నాఁటిసాయంకాలమే గంగరాజు కనకరాజు నేనును, రాజగురు వనుపేరుగల యావిద్యార్థిని గలసికొని, మతసాంఘికవిషయములను గుఱించి మాటాడుకొంటిమి. నాఁడే వీరేశలింగముగారి యింటికిఁ బోయి, సంస్కరణోద్యమమును గుఱించి వారితో రాత్రి యెనిమిదిగంటలవఱకును చర్చ సలిపితిమి. విద్యాపరిపూర్తియై స్వతంత్రుల మైనపిమ్మట, మేము జాతిభేదములను త్యజించి యభీష్టమార్గ మవలంబింపవచ్చు ననియు, ఈమధ్యగ మే మండలము

నొకసంఘముగ నేర్పఱిచి, సంస్కరణమునుగూర్చి జనులలో సంచలనము గావింపవలె ననియును మేము నిర్ణయించుకొంటిమి.

నా సంస్కారప్రియులగు మిత్రులలో మఱికొందఱినిగుఱించి యిచటఁ జెప్పవలయును. తాడినాడ గంగరాజు కళాశాలలో ప్రథమ వత్సరముననే నా సహపాఠి. నరసాపురనివాసి యగుటచే నితఁడు కనకరాజున కిదివఱకే స్నేహితుఁడు. ప్రప్రథమమున నీతఁడు మత విశ్వాసము లేనివాఁ డైనను, సంఘసంస్కరణ మనిన నావలెనే చెవి గోసికొనువాఁడు. హిందూదేశమందలి ప్రస్తుత పరిస్థితులనుబట్టి, ఆస్తికులు గానివారు సంస్కరణోద్యమమును జనరంజకముగఁ జేయఁ జాల రని మిత్రులము బోధించుటచేత, క్రమముగ నీతనికి బ్రాహ్మమత విశ్వాస మంకురించెను. పర్లాకిమిడి వాస్తవ్యుఁడగు రాజగురువు, బ్రాహ్మమతవిశ్వాసి యైనను గాకున్నను, దానియం దధికాభిమానము గలవాఁడు. సంఘసంస్కరణమునందు మా కెవరికిని దీసిపోని పట్టుదల గలిగి, వాక్కర్మలం దేమాత్రమును వేగిరపాటు లేక మెలఁగ నేర్చిన వాఁడు. మంచి యొడ్డుపొడుగు కలిగి, వట్టి విద్యార్థివలెఁ గాక యే యుద్యోగివలెనో యితఁడు గానఁబడుటచేత, నిదానమున నీతఁడు చెప్పుమాటలు శాంతమూర్తి యగు ననుభవశాలినోటినుండి వెడలు హిత వాక్కులవలె వినవచ్చుచుండెను. మితవాది యగు నిట్టివాఁడు మధ్యవర్తిగ నుండుట మంచి దని తలంచి, మాసభలకు దఱచుగ నీతని నగ్రాసనాధిపతిగ నెన్నుకొనుచుందుము.

సత్తిరాజు మృత్యుంజయరావు పట్టపరీక్షయం దొక శాఖలో గెలుపొంది, సంఘసంస్కరణముపట్ల నమితాభిమానము గలిగియుండు వాఁడు. ఇతనిసోదరు లిరువురు నాకు సహపాఠు లైనను, వారలతో కంటె నీతనితోనే నాకు చనవెక్కువ.

పతితలకు ముత్తుస్వామిశాస్త్రి పరిచయ మిదివఱకే కలిగినది. ఇతఁడు మాయందఱివలెనే మతవిషయములందు పెక్కు మార్పులు చెందినను, వానిని వెనువెంటనే లోకమునకుఁ బ్రచురింప వేగిరపడు చుండుటవలన, నిలుకడ లేనివాఁడని పేరుపడెను. ఐనను, అప్పటి కప్పుడే యుద్యోగి గృహస్థుఁడు నైన సంస్కారప్రియుఁ డగుటం జేసి, ఈతఁడు వయోవిద్యాదులందు వెనుకఁబడియుండు మాయందఱకు నాదర్శప్రాయుఁడగు నాయకుఁడు గాకున్నను, అనుభవజ్ఞుఁడును ఆలోచనాపరుఁడునునగు సహాయకుఁ డయ్యెను. వట్టి విద్యార్థుల మగు మాకు సంస్కరణమహావిషయములందు దోఁపని యాలోచనలు చెప్పుచు, మాభావములకు దోహదములు గలిపించుటయం దాతఁడు చక్కని నైపుణ్యమును జూపుచుండువాఁడు.

ఇట్టి సంఘసంస్కారప్రియు లందఱికి నేకీభావము నొదఁ గూర్చి, వారలను కార్యరంగమునకు దింపఁగల సాధనమునకై మే మిన్నాళ్లును యోజించితిమి. తుట్టతుదకు, సంఘసంస్కరణ సమాజ స్థాపనార్థమై ౧౫ వ మార్చి తేదీని మేము సభ చేసితిమి. నూతన సమాజోద్దేశములనుగుఱించి ప్రసంగించుచు నేను, "తమ హృదయము లందు మతాభినివేశమును, ప్రజాక్షేమాభిలాషయుఁ గలిగి, స్వార్థ త్యాగమున కాయత్తులగువారలే యీ సమాజసభ్యత్వమున కర్హు"లని యుద్రేకమునఁ బలికినపుడు, మొదటనే యిట్టి తీవ్రనియమాచరణ మున కెవరును సమకట్టరని కొందఱు చెప్పివేసిరి. ఎట్టకేలకు సంఘ సంస్కరణసమాజము స్థాపిత మయ్యెను.

ఆనెల ౨౧ వ తేది సంవత్సరాదిపండుగనాఁడు, ఏతత్సమాజ విధుల నేర్పఱచుటకు బాలికాపాఠశాలలో సభ కూడెను. ముత్తుస్వామి శాస్త్రి అగ్రాసనాధిపుఁడు. "సంఘసంస్కరణసమాజ మను పెద్ద

పేరు పెట్టుకొనుటవలన ముందుగనే మనము జనుల యసూయాగ్రహముల కనవసరముగ గుఱి కావలసివచ్చును. మన సమాజసభ్యులలోఁ బలువురు విద్యార్థులే. కావున నట్టివారు మున్ముందుగనే తమ తలిదండ్రులద్వేషమున కాహుతియై తమ చదువునకు స్వస్తి చెప్పవలసివచ్చును. కావున మనము సాధువులగు నామవేషములు దాల్చి శాంతముగఁ బనులు చక్కపెట్టుకొనుట శ్రేయము." అని యాయన యోజన చెప్పెను. రాజగురువున కీ 'రాజీ' సూత్రము రుచింపక, "అయ్యా, మన కీవిషయములందు సరళప్రవర్తనమే శ్రేయోదాయకము. గూఢవర్తనము ముమ్మాటికిని బనికిరాదు!" అని యతఁడు చెప్పివేసెను. నే నంత లేచి, "ఈసమస్యకుఁగల రెండు దృక్పథములును మన కిపుడు గోచరించినవి. అతివాదులకు సంఘసంస్కరణసమాజమనుపేరు నిలుపుకొనవలె ననియు, మితవాదుల కందు మార్పు చేసికొనవలె ననియు సంకల్పము. మన మిది పర్యాలోచింపవలెను. పేరునందు మార్పు అగత్యమా? ఉన్నపేరు తీసివేసి యింకొకటి గైకొనినంత మాత్రమున, విధాన మేమియు మారదుగదా? కావున బొత్తిగ నంధప్రాయులు కానిచో, ఏదేని యొక సంస్థను జనులు దాని పేరును బట్టి గాక, దాని గుణకర్మలనుబట్టియే విమర్శింతురు. కావున ప్రస్తుతనామము ప్రజల యాగ్రహమును బురికొల్పు ననుమాట వట్టిది. * * *" అని ప్రసంగించితిని.

అపుడు స్థాపితమైన మాసంఘసంస్కరణసమాజము వారమువారమును బాలికాపాఠశాలలోఁ గూడెడిది. ఆభవనమునందే ప్రార్థనసమాజసభయును ప్రతివారము జరుగుచుండెడిది. రెండు సమాజముల సభ్యులు సామాన్యముగ నొక్కరే యగుటచేత, ఒకరిచర్యల కొకరు బాధ్యత వహింపవలసివచ్చెడిది. ఇపు డీ ప్రార్థనసమాజకార్యక్రమ

మున జరిగిన యొకయుదంతమునుగూర్చి చెప్పవలెను. ఆదినములలోనే ప్రార్థనసమాజవార్షికోత్సవము జరిగెను. ఉత్సవపుఁ గడపటినాఁడు, సభికులు పట్టణమున కనతి దూరమందలి సారంగధరపర్వతమునకుఁ బోయి, ఆ నిశ్శబ్దస్థలమున, ప్రార్థనానంతరమున, తమసమాజ సౌభ్రాతృత్వమునకు సూచకముగఁ, గలసి ఫలాహారములు చేయుట యాచార మయ్యెను. ఇది గర్హ్యమని హిందూసంఘమువా రెంచి, యిట్టి సంఘ సభ్యులను బహిష్కృతులను గావించుటకు గుసగుసలు సలుపుచుండిరి. ఆనెల ౨౨ వ తేదీని ప్రార్థనసామాజికులము సారంగధరుని మెట్టకుఁ బోయితిమి. ఫలాహారము చేసినవారికి సంఘబహిష్కార మగు నని మాకుఁ దెలిసెను. ఇట్టిబెదరింపులకు భయపడవల దనియును, కష్ట నష్టము లాపాదించినచో సహనబుద్ధితో మెలంగుట సంస్కరణ పరాయణులకర్తవ్య మనియును నేను జెప్పితిని. కనకరాజున కీ మాటలు కోపము కలిగించెను. తనపాద కిట్టనిచో, మాకు ప్రతిబంధకము గాక, తాను వెడలిపోయెద నని యాతఁడు చెప్పివేసెను! ఎట్టకేల కాతనిని శాంతింపఁజేసి కొండమీఁదికిఁ గొనిపోయితిమి. ప్రార్థన ఫలాహారము లైనపిమ్మట, పర్వతము దిగి, ముత్తుస్వామి శాస్త్రి బ్యాండుస్వరము పాడుచుండఁగ, మేమందఱము, సైనికనికాయము వలె పదతాడనము చేసి నడుచుచు, బాలికాపాఠశాలయొద్ద విడిపోయి, యెవరియిండ్లకు వారు వెడలిపోయితిమి.

## ౧౧. జననీజనకులతోడి సంఘర్షణము

నేను సంఘసంస్కరణమును గుఱించి తీవ్రాభిప్రాయములు గలిగి, నిర్భయముగ వానిని వెల్లడి చేయుచుండుటచేత, నా కెల్లెడలను విరోధు లేర్పడిరి. ఇంటను, బయటను సంస్కరణమును గుఱించి నిరతము ప్రసంగించుటయె నా కపుడు ముక్తిమోక్షము లయ్యెను!

## ౨౦. జననీజనకులతోడి సంఘర్షణము

దీనిపర్యవసానము, సమాజమిత్రులు నన్ను 'సుబోధకుఁ' డని పిలువసాగిరి! రాజగురువు నన్ను 'పవిత్రగురువు' అని సంబోధించుచుండు వాఁడు! హాస్యార్థమే వారు నా కిడినయీకితాబులకు నేను గులుకుచుండు వాఁడను! అతిమితభాషి నని నన్నిదివఱకు గేలి చేసినబంధుమిత్రులు, వాచాలుఁడ నని నన్నిపుడు దిసంకులు గొట్టిరి! సంస్కరణాభిలాషను మనసున కెంత హాయిగ నున్నను, ఒక్కొక్కప్పుడదియె నన్ను జిక్కులలో ముంచి, వ్యాకులతపాలు చేసెను. దీనికప్పటిసంగతులు రెండు ఉదాహరణము లిచ్చుచున్నాను.

మా మేనత్తకుమారుఁడు మంత్రిరావు నరసయ్యగారు, తన పెద్దకుమార్తెను మాతమ్ముఁడు వెంకటరామయ్య కిచ్చి వివాహము చేయ నిశ్చయించుకొనిరి. దీనికి మా తలిదండ్రులు సమ్మతించిరి. నాకుమాత్ర మిది బొత్తిగ నిష్టము లేదు. నాయసమ్మతికిఁ గారణము నాసంస్కరణాభిమానమే గాని, వ్యక్తిగతమైన యాక్షేపణ మేదియుఁ గాదు. వధూవరు లిదివఱకె దగ్గఱబంధువులై బాల్యదశయం దుండుట నాయాక్షేపణమునకు విషయము. మార్చి ౧౬ వ తేదీని యీసంగతిని గుఱించి మాతమ్మునితో మాటాడితిని. విద్యాస్వీకారము చేయుచుండెడి యాతఁడు నాయాలోచన విని, సంస్కరణపక్ష మవలంబించుట న్యాయ మని వక్కాణించితిని. నేను జెప్పినదాని కాతఁడు సమ్మతించెను గాని, తలిదండ్రులు పట్టుపట్టిన నేమిచేతు నని యడిగెను. విద్యాప్రాజ్ఞతలు గల వరుని కిష్టము లేని వివాహము జరుగ దనియె నేను జెప్పితిని. తన కెప్పటికిని పరిణయ మసమ్మత మని యాతఁడు పలికినపుడు, విద్యాపరిపూర్తి యైన యౌవనసమయమున విద్యావతిని వివాహమాడుట తనవిధి యని యంటిని. సోదరున కిట్టిబోధన చేయుట యందుకాలుష్య మేకోశమందైన దాఁగొనియెనా యని నేను హృదయ

పరిశోధనము గావించుకొని, నాసంస్కారాభిమానమే దీనికిఁ గారణ మని స్పష్టపఱచుకొంటిని! నే నింతటితో నూరకుండక, వధువు సోదరుఁడును, కళాశాలాసహవాసుఁడును నగు వెంకటరత్నముతో నీ సంగతిని గూర్చి మాటాడి, యీ బాల్యవివాహమున కడ్డుపడు మని వానికిని బోధించితిని. అతఁడు సమ్మతించినను, తనకుఁగూడ వివాహము చేయఁ బూనిన తండ్రి, తనమాటలు వినకుండు నేమో యని భీతిల్లెను.

అంతటఁ గొన్ని దినములకు నరసయ్యగారు మాయింటికి వచ్చి, మాజనకుఁడు గ్రామాంతరమున నుండుటచేత, తాను సంకల్పించుకొనిన యీవివాహమును గుఱించి నా యభిప్రాయ మడిగిరి. ఆయనతో ధారాళముగ మాటాడ నోల్లక, నాబోటిపసివారు అభిప్రాయ మీయఁ దగ రని చెప్పివేసి యూరకుంటిని! నాయసమ్మతిని మితభాషిత్వమున మాటుపఱిచి, గర్వమునఁ గులుకుచుంటి నని నన్నాతఁ డెత్తిపొడువఁగా, వివాహమును గుఱించి వరుఁడె పలుకవలయును గాని, యితరుల యూహ లేమిప్రయోజన మని యంటిని. అంత టాయన, "వరుఁడు బాలుఁడు కావున, నతనిసమ్మతితో మనకు ప్రసక్తి లేదు. నాకుమారునిసంగతి చూడు! ఈసమయమందే వానివివాహమును గనా. పెండ్లిని గుఱించి ప్రస్తావము వచ్చినపు డెల్ల, వాఁడు తల వాల్చియుండును. కాఁబట్టి యిట్టిబాలుర విషయములో పెద్దవాళ్లె యోచింపవలెను" అని పలుకఁగా, నేను, "కావుననే పిల్లలమగు మ మ్మాలోచన లడుగక, పెద్దలగు మీరును, మాతండ్రియును మీచిత్తము వచ్చినట్టె చేయరాదా?" అని రోషముతోఁ బ్రత్యుత్తర మిచ్చితిని.

రెండవసంగతి, యిటీవల జరిగిన ప్రార్థనసమాజ వార్షికోత్సవ సందర్భమునఁ గలిగిన యాందోళనము. కళాశాలలో పండితులగు కస్తూరి శివశంకరశాస్త్రిగారు పూర్వాచారపరాయణత్వమునకుఁ బట్టు

గొమ్మ. మొన్నటి ఫలాహారములకై ప్రార్థనసామాజికులకు సంఘబహిష్కారము మగు నని యాయన కొందఱితో ననెను. ఇది తెలిసి మా తలిదండ్రు లలజడి నొందిరి. ఆనెల ౨౭-వ తేదీని ప్రొద్దున నేను భోజనము చేయుచుండఁగా, మాతల్లి నాతో, "నాయనా! మనది పెద్ద కుటుంబము. పిల్ల లకందరికీ పెండ్లిండ్లు పేరంటములు కావలసియున్నవి. మ మ్మందరినీ చిక్కులపాలు చేయదలచుకొన్నావా యేమి?" అనినపుడు, "ఏమి టిది? నే నేమిచేసినానో చెప్పితే సమాధానము చెప్పుతాను!" అని పైకి గంభీరముగఁ బలికితినే గాని, మాతమ్మునికి వెంకటరత్నమునకును వివాహ మాడవల దని నే జేసిన రహస్యబోధన వారిచెవులఁ బడినదా యని లోన నేను భీతిల్లితిని! మాతల్లి సూచించినసంగతి యిది గాక, మొన్న సారంగధరుని మెట్టమీఁది ఫలాహారముల యాందోళన మని తెలిసి, తల తడివి చూచుకొని, "దాని కేమిలే! కిట్టనివాళ్లు పరిపరివిధముల చెప్పుకుంటారు-వీరేశలింగముగారి యింట తయారైన ఫలాహారములు పుచ్చుకొనేవెట్టివారము కామలే! మాతో పాటు కచేరీగుమస్తా లనేకులు ఫలాహారములు చేసినారులే!" అని నేను సమాధానము చెప్పితిని.

ఉదంతము లింత సులభముగా నంతమొందినవి గావు. కొన్ని దినములపిమ్మట, రాత్రి భోజనసమయమున, మాతండ్రి నాతో మతమునుగురించి సంభాషించుచు, "భగవంతుఁడు హృదయాలయమందే దర్శింపఁదగినవాఁ డనుట వాస్తవమే. కాని మనము జనాభిప్రాయమునకు వెరవక తప్పదు జాతిమతభ్రష్టులై పోయిన క్రైస్తవులపాట్లు దేవునికి తెలుసును" అని పలికెను. నేనుమాత్ర మిది యొప్పుకొనక, సత్య మని నమ్మినచొప్పున నడుచుకొనెడివారిని దురదృష్టవంతు లన వీలు లే దనియు, బుద్ధిపూర్వకముగ స్వీకరించిన మార్గమునఁ గలిగిన

కష్టసుఖములను సమత్వమున వా రనుభవించుట న్యాయ మనియును నేను జెప్పివేసితిని.

మా దీర్ఘసంభాషణ ఫలితముగఁ దేలినసంగతులు నేను దినచర్యా పుస్తకమున నిట్లు విమర్శించితిని:—"మా జనకుఁడు జనాభిప్రాయ మును శిరసావహించెడిభీరుఁడు; నే నన్ననో, స్వబుద్ధి సూచించిన సత్యపథమునఁ బోయెడిధీరుఁడను. ఆయన, పామరజనాచారములను గౌరవించి యనుసరించువాఁడు; నేను, వానిని నిరసించి నిగ్రహించెడి వాఁడను. వే యేల, మా నాయన పూర్వాచారపరాయణుఁడు; నేను నవనవోన్మేషదీధితుల నొప్పెడి సంస్కారప్రియుఁడను!" పాఠకులు నా యౌవనమునాఁటి యహంభావమునకు వెఱగంద కుందురు గాక!

## ౨౧. ముత్తుస్వామిశాస్త్రి విపరీతవిధానము

ముత్తుస్వామిశాస్త్రి నాసహవాసు లందఱిలోను విద్యాధికుఁ డును, మేధాశక్తిసంపన్నుఁడును. ఒక్కొకపరి యాతఁడు సంఘ సంస్కారవిషయములందు చోద్యములగు సూత్రములు సిద్ధపఱుచు చుండువాఁడు. ఆయేప్రిలు ౧౦ వ తేదీని నేను మృత్యుంజయరావుతోఁ గలసి, శాస్త్రిదర్శనమున కార్యాపుర మేగితిని. మే మనేకసంగతులను గుఱించి మాటాడుకొంటిమి. అంత మాసంభాషణము సంస్కరణ ములదెసకు మరలెను. "ఏటి కెదు రీదినంతమాత్రమున మనము సంస్కా రులము కాఁజాలము. పూర్వాచారపరాయణులవలెనే మనమును కర్మ కలాపమును విసర్జింపక, నిరర్థక మని నమ్మినయాచారకాండ ననుష్ఠా నమునకుఁ దెచ్చి, సంఘమును మెల్ల మెల్లగ మనవైపునకుఁ ద్రిప్పుకొన వలెను." అనునాతనిమాటలు మాకు హాస్యాస్పదములుగఁ దోఁచెను.

## ౨౧. ముత్తుస్వామిశాస్త్రి విపరీతవిధానము

"ఈపద్ధతి నవలంబించినచో, జనులలో నిరసించెడి కాపట్యమును మనమె పూనుచుండుటలేదా?" అని నే నడిగితిని. అట్లు కాదని యాతఁడు సమాధానము చెప్పుచు, "పూర్వాచారపరులకంటె మనమె మంత్రతంత్రములు బాగుగ పఠించి, కర్మకాండ జరుపుటయందు ప్రవీణుల మైతిమేని, ఇపుడు వారిదెసకుఁ బ్రవహించెడి ద్రవ్యవాహినిని మనవైపునకు మరలించుకొనవచ్చును. ఇట్లు మనము జనులను సంతృప్తిపఱచి, సంస్కరణపథమునకు మెల్లగ వారిచిత్తములఁ ద్రిప్పవచ్చును" అని శాస్త్రి బోధించెను. ఇట్లు పైకెంతో మంచివిగఁ దోఁచెడియెత్తు లాతఁడు వేయుచుండువాఁడు. పిమ్మట నేను వీరేశలింగముపంతులుగారితో నీసంగతి ప్రస్తావింపఁగా, "శాస్త్రిప్రణాళిక నవలంబించినయెడల, ఇప్పటి వైదికబృందమువలెనే మనమును తిండిపోతులముగను కుక్షింభరులముగను బరిణమించి, పట్టి భ్రష్టుల మైపోయెదము!" అని యాయన వక్కాణించెను.

మే మాతనిని గలసికొని మాటాడినపు డెల్ల, శాస్త్రిలో నేదో యొకవింతమార్పును గనిపెట్టుచుండెడివారము! భూపతనము నొందు పాదరసమువలెను, సంగీతపాటకునినోట 'సరిగమపదనిసల'వలెను, ఆతని మనస్సు సదా పలుపోకలు పోవుచుండెడిది! ఉచితజ్ఞత యనునది యాతనిలో లేనేలేదు! ఊహకు నూహకును గల పరస్పరసంబంధము కనిపెట్టి మఱి మాటాడుట కతని కోపికయె లేదు. కావుననే, స్థిరత్వము లేని చపలస్వభావుఁ డను నపయశస్సు ఆతని కావహిల్లెను. వివిధములు పరస్పరవిరుద్ధములు నగు విధానములఁ బన్నఁగలట్టియు, ఒరులనవ్వులు దుమదుమలును లెక్కసేయక తన విపరీతభావసందోహమును సమర్థింపఁగలట్టియు శక్తి శాస్త్రియందు మూర్తీభవించెను! కాని, ఆతనియాలోచనలు మామిత్రుల కావశ్యకము లయ్యెను. దైవము గలఁ

డని యొకమాఱును లేఁ డని యొకమాఱును సిద్ధాంతరాద్ధాంతము లతోఁ గూడిన హేతువాదనలతో నాతఁడు మాయెదుట వాదించు చుండును! గట్టిప్రయత్నములు చేసి దేశక్షేమంకరములగు సంస్కార ములు నెలకొల్పుట విద్యాధికులధర్మ మని యొకతఱియును, మానవ ప్రయత్నము నిష్ప్రయోజన మనియు, కాలప్రవాహమునఁ బడి లోకము శక్తిహీనమై కొట్టుకొనిపోవుచున్న దని యొకతఱియును, అతఁడు వాదించుచుండును! వీనిలో ప్రతియొకవాదనయు సహేతుక ముగఁ గానవచ్చినను, ఇట్టి వన్నియు నొకపుఱ్ఱెలోనే పుట్టి, ఒక నోటనె బయలువెడలుట గాంచిన యువకుల మగు మేము విభ్రాంత చేతస్కుల మగుచుందుము!

## ౨౨. జనకుని విచిత్ర చిత్తవృత్తులు

ఇంతలో కళాశాలకు వేసవికాలపు సెలవు లిచ్చిరి. విద్యార్థులగు హితు లెవరిగ్రామమునకు వారు వెడలిపోయిరి. మాకుటుంబముకూడ రాజమంద్రి విడిచెను. మా తమ్మునివివాహ మిపుడు నిశ్చయమయ్యెను గాన, మేము ముందుగ వేలివెన్ను పోయి, అచటినుండి రేలంగి వెళ్లి తిమి. అక్కడనుండియె మేము పెండ్లికి తరలిపోవలెను. వివాహము నకు వలయుసన్నాహ మంతయు జరుగుచుండెను.

వివాహమునకు ముందలిదినములలో నింట మాతండ్రి వెనుకటి వలెనే సంస్కరణవిషయములనుగూర్చి నాతోఁ జర్చలు సలుపుచుం డెడివాఁడు. ౨౨ వ ఏప్రిలురాత్రి భోజనసమయమున మా తండ్రి మాటాడుచు, పోలవరముజమీందారు క్రైస్తవుఁ డయ్యె నని మాకు వినవచ్చినవార్తమీఁద వ్యాఖ్య చేసి, మతభ్రష్టత్వమును గర్హించి మితి మీఱిన క్రోధావేశము గనఁబఱచెను. "జాతిబాహ్యుఁడై పోకుండ

నెవఁడుగాని సంఘములో నిలిచియో తన యిచ్ఛవచ్చినట్టుగ నీశ్వరుని ధ్యానింపఁగూడదా ?" అని యాయన ప్రశ్నము. మా నాయన యెపుడు నిట్లు పూర్వాచారపరాఙ్ముఖతయె గనఁబఱచినను కొంత మేలే! కాని, ఆయన స్థిరత్వము లేక, ఒకప్పు డొకవిధముగను, ఇం కొకసారి యింకొకరీతిని మాటాడుచుండువాఁడు. అందువలన నే నాయనను గపటి యని తలంచువాఁడను. దీనికిఁ దగినంత కారణము లేకపోలేదు.

౧. "బ్రాహ్మణులు మహిమాన్వితులు, బ్రహ్మవర్చస్సున తేజరిల్లుమహానుభావులు. వారిని నిరసించి పరాభవించువారికి పుట్టగతులు లే" వని యొకమాఱును, "బ్రాహ్మణులు మనుష్యులు! వారిని గర్హింపవలెను" అని యింకొకమాఱును

౨. జాతినిగుఱించి మాటాడుచు, "అగ్రవర్ణమున నుంకుటయె బ్రాహ్మణునిగౌరవము తెల్పుచున్నది. స్వజాత్యాభిమానము మన ముఖ్యధర్మము" అని యొకప్పుడును, "అన్ని జాతులు నొకటియె. భోజనసమయమున బ్రాహ్మణేతరులను జూచుటకు బ్రాహ్మణులు సంకోచపడ నక్కఱలేదు. బొంబాయి ప్రాంతములందలి బ్రాహ్మణులు మనవలె దృష్టిదోషమును పాటింపరు." అని యొకప్పుడును

3. వేదములనుగూర్చి ప్రసంగించుచు, "వేదములు దేవదత్తములు. వేదాధ్యయనసంపన్నుఁడైన బ్రాహ్మణుఁడు దైవసమానుఁడు. పాముమంత్రమునకు దయ్యముమంత్రమునకును పటిమ యుండఁగా, వేదమంత్రములకు మహత్తు లేకుండునా ? విగ్రహములకు మహిమ లేక పోలేదు." అని యొకప్పుడును, "విగ్రహము లనిన నాకు తలనొప్పి. హృదయమే యీశ్వరాలయము. పూజల కని నేను బ్రాహ్మణులను

ప్రార్థింపను." అని యొకప్పుడును మాతండ్రి పలుకుచుండువాఁడు! ఆయనకుఁ గల యిట్టి పరస్పరవిరుద్ధభావములు చూచినపుడు ఆశ్చర్య మంది, ఆయన కీవిషయములందు కాపట్య మారోపించి నేను గొంత వఱకు నేరమేఱుచుందును!

దినదినమును మా తండ్రిచర్యల వైపరీత్య మతిశయించుచుండి నట్లు నాకుఁ గనఁబడెను. రేలంగిలో నొకనాఁటిరాత్రి మా పురో హితునితో మాటాడుచు, మాజనకుఁడు నన్నుఁ జూపించి, "మతమును గుఱించి చర్చ చేయుటకు మావాఁడు మిక్కిలి సమర్థుఁడు. మొన్న రాజమండ్రిలో వీడు వీనిస్నేహితులును ఒకస్వాములవారితో వేదములు మొదలగువాటినిగుఱించి చర్చ చేసి జయించిరి. దేవు డొక్కఁడే యనిన్ని, మనుష్యు లందరు సమాను లనిన్ని మావాడు వాదింపగలడు" అని ఆయనతోఁ జెప్పివేసెను!

దీనినిఁబట్టి మాతండ్రి నాయభిప్రాయములను బాగుగ గుర్తెఱిఁగియే యుండె నని నేను స్పష్టపఱుచుకొంటిని.

ఇది జరిగిన కొలఁదిదినములకు నే నొకప్రొద్దున, "సంస్కార ణావశ్యకత" ను గూర్చి తెలుఁగున నొకవ్యాసము వ్రాయుచుంటిని. అప్పుడప్పుడు నాదగ్గఱకు వచ్చి మాతండ్రి నావ్రాఁత కనిపెట్టు చుండెను. రాత్రి భోజనానంతరమున నేను జదువుకొనుచుండఁగా, ఆయన మాపురోహితుని మఱికొందఱిని వెంటఁబెట్టుకొని నాదగ్గఱకు వచ్చి, ప్రొద్దున వ్రాసినకాగితము చదువు మని నన్నుఁ గోరెను. "మా వాడు రాజమండ్రిలో ఒక మతసభకు కార్యదర్శి. జాతు లన్నియు నొక్కటె యని యతనిమతము. మతవిషయములగుఱించి మీలో నెవరితోనైనను వీడు వాదించగలడు! మావాఁడు యింగ్లీషున వేద

ములు చదివినాడు" అను నతిశయోక్తులు పలికి, మాతండ్రి నావ్యాస మును వినఁగోరెను. నే నేమి చేతును? బెదరు తీఱి నావ్యాసము చదివి, సంతోషభరితుఁడ నైతిని. భవిష్యత్తున నేను మహావక్తనై యుపన్యాసములు గావించెద నని యుప్పొంగిపోతిని. ఒకటిమాత్రము నా కింతట స్పష్ట మయ్యెను. సంస్కరణమందు నాకుఁగల గట్టిపట్టు దల మానాయనకు ద్యోతక మయ్యెను. కాని, నాయాశయము లెన్నటి కిని కార్యరూపముఁ దాల్పక, కేవల సంకల్పదశయందె యుండు నని మా తండ్రివాంచ కాఁబోలు!

## ౨౩. వెంకటరావు సావాసము

నా పూర్వమిత్రుఁడగు వెంకటరావు, ఆదినములో తన యారోగ్యమునిమిత్తము రేలంగి వచ్చెను. అతనిమామగారు అక్కడనే జమిందారీయుద్యోగియై, కుటుంబముతో నుండెను. వేసవిసెలవులు నేనును రేలంగిలోనే గడుపుటచేత, నాస్నేహితునిఁ దఱచుగఁ గలసికొనుచు వచ్చితిని. వ్యాధిప్రకోపమువలన నాస్నేహితునిదేహము మిక్కిలి శుష్కించిపోయెను. ఆనవాలు పట్టలేని రీతిని శరీరము చిక్కియున్నను, అతని మాటలు, అతనివైఖరియును, వెనుకటివలెనే ఝుంకరించుచుండెను! అతఁడు రాజమండ్రి విడిచి వచ్చినపిమ్మట నచ్చటి సమచారములు, సంఘసంస్కరణసమాజస్థాపనము, సారంగధరునిమెట్టమీఁది మాఫలాహారములు, అదికారణముగ బయలువెడలిన మాబహిష్కార వృత్తాంతములు, ఇవియన్నియు సమగ్రముగ నేను వినిపించి, సంస్కరణము పట్ల నతని సాహాయ్యసానుభూతులు స్నేహితుల మాశించుచుంటి మని పలికితిని. తా నెన్నఁడును తలంపనివిధమున మేము పట్టణమునఁ గార్యసాధనము చేయుచుండుట కాతఁడు ముదమంది, నే నభివృద్ధి నొందుట కభినందించెను.

ఆ మేనెల 3-వ తేదీని మొగల్లులో మాతమ్మునియొక్కయు, పెత్తండ్రికుమారునియొక్కయు వివాహములు జరిగెను. శుభకార్యానంతరమున మేము రేలంగి వచ్చితిమి.

నా కీ గ్రామమున ప్రాంతనేస్తుని సావాసము మరల లభించినదని చెప్పితిని. వెంకటరావు నేనును మా యాశయముల గుఱించి దీర్ఘ సంభాషణములు చేయుచువచ్చితిమి. అద్దమున ముఖము గోచరించువిధమున, స్నేహితునిభావమునందు మనశీలము ప్రతిబింబితమగుచుండును. మనసిచ్చి నెచ్చెలులతో మాటాడునప్పుడు, మన యాంతరంగికరహస్యములు బయటపడుచుండును. మిత్రునిచేష్టలు మన కనులకు గోచరించునట్లె, మనచర్య లాతనికిని గానుపించి, యాతనివ్యాఖ్యానములకుఁ దావల మగుచుండును. వెంకటరావుసహవాసమున నా శీలపరిశీలనముఁ జేసికొనవచ్చు, మిత్రునిగుణావగుణములను గ్రహించుటకు నా కవకాశము గలిగెను.

౧౧-వ మే తేదీని నేను వెంకటరావును జూచుటకు వారింటికేగితిని. అపు డతఁడు స్త్రీలచేఁ బరివేష్టితుఁడై, వారితో సరససల్లాపములు చేయుచుండెను. నా కిది మిగుల జుగుప్సావహముగ నుండెను. ఆఁడుపటాలము వెడలిపోయిన వెంటనే, చెలికానిని దల వాచునట్టుగఁ జీవాట్లు పెట్టితిని. అంగనల సరసను గూర్చుండి, అతఁడు కామోద్రేకప్రసంగములఁ గాలము గడుపుట చింతనీయ మని నే జెప్పివేసితిని! సుదతులతోడి సద్గోష్ఠి సమంజసమే. కాని, వారు చెంత నుండినపుడు మృదువు మీఱినపలుకులు పురుషులపెదవులనుండి వెడలినచో, రాను రాను స్త్రీలును తమ నైసర్గికమగు సిగ్గును విడనాడి, వెలయాండ్రవలె వలపుగొలుపు పలుకులు వచించుటకు వెనుదీయరు! సద్భావపూరితుఁడగు నా స్నేహితునివంటి సంస్కారప్రియుఁడే, సంఘముయొక్క

## ౨౩. వెంకటరావు సావాసము

నైతికస్థితి నుద్ధరించుటకు మాఱుగా పామరజనపద్ధతులనే యవలంబించినచో, విద్యాధికులకంటె కపటనటు లెవరుందు రని నేను గట్టిగ నడిగివేసితిని !

రేలంగిలో నున్న దినములలోనే వెంకటరావునకు పునస్సంధానము జరిగెను. జీవితమునందలి తన యున్నతాశయములనుగుఱించి తన చిన్నిభార్యతో నపుడె ప్రస్తావించితి ననియు, ఆమె విద్యాభివృద్ధి గావించుకొనినచో, స్వచ్ఛమగు పతిప్రేమముతోఁబాటు స్వాతంత్ర్యము నాసుదతి పడయఁగలదనియు, నామిత్రుఁడు నుడివె నఁట.

ఆ జూను 3 వ తేదిని నేను వెంకటరావును గలసికొనుటకు వారింటి కేగితిని. ప్రాఁతనేస్తుల మపుడా సాయంకాలమున మా వెనుకటిచరిత్రమును సింహావలోకనము చేసితిమి. తనసంగతి ముందతఁడు ప్రస్తావించెను. తా నెన్నియో బాధలకు శోధనలకును దావలమైతి నని నా మిత్రుఁడు పలికెను. దుష్టులలో నెల్ల దుష్టులతోను, శిష్టులలో శిష్టులతోడను తాను జెలిమిచేసి, తనవర్తననైర్మల్యమును గోలుపోకుంటి నని నాస్నేహితుఁడు నుడివెను. పలుమారు తాను నుడిగుండములఁ బడినను, ఆర్తరక్షకుని కృపామహిమమున శీలసౌష్ఠవమనుభవించుచుంటి నని నాచెలికాఁడు చెప్పినప్పుడు, హర్ష పులకాంకితుఁడ నైతిని !

అంత నేను నాసంగతి విప్పితిని. మిత్రునకంటె దుర్బలశరీరుఁడ నైనను, దైవానుగ్రహమునను, సత్సహవాసమహిమమునను, నా శీలపవిత్రత సురక్షిత మని నా యుపోద్ఘాతము. కొలఁదికాలము క్రిందటనే, అనఁగా ౧౮౮౫ వ వత్సరమధ్యమున, నొక చెలికాని సహవాసఫలితముగ నేనును 'సైతాను' తాఁకునకు వశము కాలేదా ?

గతసంవత్సరము వఱకును హిందూక్రైస్తవబ్రాహ్మమతాదులనుగుఱించి నాకుఁ దెలియనే తెలియదు. ఇపు డట్లు కాదు. నీతి మతసంఘ సంస్కరణములనుగూర్చి నా కిపుడు కొంత తెలిసియున్నది.

నే నొకఁడ నన నేల? నా మిత్రబృందమును మంచిప్రబోధము గలిగియుండిరి. గతసంవత్సరమున చివరభాగమున, పరిస్థితుల ప్రభావమున నా మనస్సున భక్తిబీజములు పడి, సంస్కరణావేశమను మొలక లెత్తినవి. నా సావాసు లందఱు మంచి యభివృద్ధిఁ గాంచిరి. నా చెలికాండ్రందఱికిని నా కభిమతమగు సంస్కరణోద్యమము హృద్య మగుట కడు చోద్యము! ఈమార్పు రాజమంద్రిలోని సదావరణప్రభావమున ప్రభవించినను, మఱియేకారణమున నుద్భవించినను, ఇపుడు నాసుహృదు లందఱును సంస్కారప్రియులై యుండి రనుట స్పష్టము!

ఇంక వెంకటరావునుగుఱించి: అతఁడు మంచివాఁ డనియె నానమ్మిక. కాని, దుశ్శీలుఁ డని యపవాదము లాసమయమున ప్రబలియుండెను. దీనినిగుఱించి నేను ప్రశ్నింపఁగా, నాకువలెనే తనకును వితంతువివాహసంస్కరణ మామోద మగుటచేత, ఎన్నికడగండ్లకో యోర్చుచుండెడి యొకబాలవితంతువుదెస తాను సానుభూతి గనఁబఱిచిన తప్పిదమున తాను నిందలపాలైతి నని చెప్పి నా మిత్రుఁడు కన్నీరు తెచ్చుకొనియెను! మానవహృదయావలోకనము చేయఁగల పరమాత్మునకె యిందలిసత్య మవగాహన కాగల దని నమ్మి, నా మనస్సును సమాధానపఱుచుకొంటిని.

ఇది జరిగిన కొన్నిదినములకుఁ గలసికొనినపుడు, మేమిరువురము నా భావిజీవితమునుగుఱించి తలపోసితిమి. పరమజ్యోతిష్కుని

వలె వెంకటరావు నన్నుగుఱించి యిట్లు చెప్పెను:—"నీ వీసంవత్సరము పరీక్షలో జయ మందెదవు. రాఁబోవువత్సరారంభమున గృహస్థాశ్రమమునఁ బ్రవేశింతువు. సంస్కరణోద్యమము కొనసాగించుటకు చెన్నపురి పోలేక, రాజమండ్రిలోనే నీవు పట్టపరీక్షకుఁ జదివెదవు. ఒకటి రెండు వత్సరములలో నీకు సంతానప్రాప్తియుఁ గలుగును. గృహభారము శిరమునఁ బడిన నీభార్య విద్యాభివృద్ధి నొనరించుకొన నేరదు. సంస్కారావేశము గలుగునపు డెల్ల, కావింపనేరని సంస్కారములనుగూర్చి నీవు పరితపించుచుందువు! ఐదాఱువత్సరములలో నీవు ప్రభుత్వోద్యోగ మనువెరను బడి సంస్కరణాపేక్షను పూర్తిగ మఱచిపోయి, మీఁదు మిక్కిలి నీతినియమములకే మోసము తెచ్చుకొందువుసుమీ!"

చెలికానిజోస్యమె నిజ మయినచో, జీవితమునకంటె మరణమే వేయిమడుంగులు మేలుగ నాకుఁ దోఁచెను! ఉన్నతాదర్శపూరిత హృదయము సతతము నాకు దయచేయు మని దయామయుని వేడుకొంటిని.

## ౨౮. కమలామనోహరులు

స్వకుటుంబములోనే బాల్యవివాహముల నిరోధింపలేక యూరక చూచుచుండు నామనస్సున వివాహసంస్కరణాగ్ని మఱింత తీవ్రముగ వెలుఁగఁజొచ్చెను. ఆ జూను మొదటి తేదీ సాయంత్రము నేను రేలంగిలో కాలువగట్టున షికారు పోవుచు, నాకుఁ బ్రియమగు నీవివాహసంస్కరణవిషయమునుగుఱించి తలపోసితిని. మలయమారుతము వీచుచుండెను. కోకిలకూజితము శ్రవణానందకరముగ నుండెను. అయినను, వీనివలన నాహృదయవేదన యుపశమింపకుండెను. ఉష్ణ

బిందువులు కనులనుండి జలజల రాలెను. నా మనస్తాపము భావో ద్రేకముగఁ బరిణమిల్లెను. అంత నేను సంస్కరణవిషయిక మగు కథ నొకటి కల్పించుకొని వినోదించితిని. రాత్రి యంతయు కథావిమ ర్శనమునఁ గడపుటచేత కంటికిఁ గూర్కు రాలేదు. మఱునాఁటి దినచర్యపత్రములం దాకథ నింగ్లీషున లిఖించి, భావికాలమున దానిని తెలుఁగున పద్యరూపమునఁ గూర్ప నాశించితిని. ఈజన్మమున నా కిఁక కవిత్వభాగ్య మబ్బుట కవకాశము లేమింజేసి, దాని నాంధ్రమున ననువదించి, "కమలామనోహరులు" అనుశీర్షికతో "ఆంధ్రపత్రిక" లో 18-1-1930 తేదీని ఇట్లు ప్రచురించితిని:—

(౧)

నలువది సంవత్సరముల క్రిందట వసంతపురమున నొకబాలుఁడు నొకబాలయుఁ గలరు. సమానప్రాయముగల వా రిరువురును, గ్రామ మున నొకశ్రేణినె కాపురమున్న భిన్నశాఖలకుఁ జెందిన సాధు విప్ర కుటుంబములలో జన్మించిరి. కమలామనోహరు లాజన్మమిత్రులు. వీరి స్నేహ సౌహార్దములు పూర్వజన్మఁపునాఁటివే యని లోకు లనుకొను చుందురు! ఆట పాట లందును, విద్యాలయమునను నా రొకరి నొకరు విడిచియుండువారు కారు. దేహములు వేరైనను, ప్రాణములు వారి కొకటియె! ఒక్కొకతఱి వారు అనతిదూరమందలి సెలయేటి యొడ్డున కేగి, పెద్దరాతిపలకమీఁదఁ గూర్చుండి, భూమ్యాకాశములు తిలకించి, సుఖసంభాషణములు జరుపుచుందురు.

లోకమున సౌఖ్యకాల మెంత త్వరితగతి నంతరించుచున్నది! బాల్యవివాహాచారబద్ధు లగు జననీజనకులు, కమలను పండ్రెండు వత్సరములకె పాతికయేండ్లు నిండునట్లు భావించి, కొమార్తె వివాహ

మేర్పఱిచిరి. కమలపెండ్లి మిత్రు లందఱికీవలెనే మనోహరమునకు నానందదాయక మయ్యెను. ఏకారణముననో కాని, పెండ్లికూఁతునకే సంతోషావహముగ లేదు. పురుషునికంటె స్త్రీకి, భవిష్యద్దాంపత్య జీవితరహస్యము, అతివేగముగను, స్ఫుటముగను బోడకట్టుచుండును. తన కీపెండ్లి యక్కఱలేదను కమల పలుకులు, అబద్ధమని నిరసించుటకుఁగాని, నిజమని నమ్ముటకుఁగాని తలిదండ్రులకుఁ దోఁపకుండెను. పసిరిక మొగ్గవంటి బాలికమాటలు చెవియొగ్గి వినుటయే వెఱ్ఱియని తుదకు తలిదండ్రులు తలపోసి, కమలను తమబంధువులలో నొకని కిచ్చి పరిణయము గావించిరి.

పూర్వదిశాంగనాముఖము, ప్రాతస్సమయమున నొక్కొక్కపరి పలువన్నెల మబ్బులచే మాటుపడియు, భానూదయకాంతుల ప్రథమస్పర్శముననె వికాసముఁ జెందుచుండును. పెండ్లిపీటలమీఁద నుండునపుడు, కమల వదనబింబ మొకించుక విచారమేఘావృత మయ్యెను, తలఁబ్రాల సమయమునకు కళంకరహిత మయ్యెను. బాల్యదశయందు సుఖదుఃఖములు స్వల్పనిమిత్తములకు వశవర్తు లగుచుండును. కాని, బాల్యకాలపు టూహలు నుద్దేశములు నొక్కొక్కప్పుడు, జీవితభూమిని వేళ్లువాఱి, ఆమరణమును పెకలింప నసాధ్య మగుచుండును!

(౨)

అది ప్రాతఃకాలము. వసంతభానుఁ డింక నుదయాద్రి నధిష్ఠింపలేదు. గృహారామమున చూత నారికేళాదివృక్షములు, పూవులమొలకలును, గుబురుగఁ బెరుఁగుచున్నవి. విరుల నెత్తావులు గాలి యంతటను ప్రసరించియున్నవి. లేఁజివురులు మెసవుచు కోకిల

శ్రావ్యనాపములతో జనలోకమునకు స్వాగతగీతము లర్పించుచున్నది. జగమెల్లయు నరుణోదయచ్ఛాయల నలరుచు, ఆనందవీచికల నోల లాడుచుండెను.

కమల నిషేకముహూర్త మీదినముననె జరుగవలసియున్నది. నీలాలకములు గప్పిన సుందరవదనమును వంచి, చెట్టుక్రిందఁ గూర్చుండి, తనయశ్రుజలముతోఁ జెంతప్రవహించు చిన్నకాలువ పొంగునట్టుగ, దైన్యమున విలపించెడి యీసుందరి యెవరు? లోక మెల్ల నానందమున నోలలాడెడి యీసుఖసమయమున నీకోమలి యిట్లు కుందుటకుఁ గారణ మేమి? సమీపమున నాసీనుఁడగు నీయువకుఁ డెవఁడు? వారు ప్రేయసీప్రియులవలెఁ గానిపించు చున్నారు. అంత తనదుఃఖ మొకింత త్రోసివైచి యాతరుణి, "జీవితేశ్వరుఁడవగు మనోహరా! నేఁటితో మనస్నేహవృక్షమున కాయువు చెల్లిపోయెనుగదా!" యని పలికి, హృదయము శోకపర వశము కాఁగా, మౌనముద్ర నూనియుండెను.

మనోహర మా మానిని నిటు లోదార్చెను: "కమలా, ప్రాణ సఖీ! ఏల నీవు విచారమునఁ గ్రుంగుచున్నావు? నీసంతుష్టవదన సందర్శనమును, నిష్కల్మషహృదయసూచకము లగు లోచనవిలోకన మును గనుల పండువుగఁ జేకొనినమిత్రు నేల దుఃఖాతిరేకమున వెత నొందించెదవు? ఓహో, జ్ఞాపకము వచ్చినది! మన ప్రేమసఖ్యముల కీనాఁడు ప్రబలవిరోధిగ పరిణమించిన ప్రపంచమునుజూచి యిన్నాళ్లు నెట్లు భ్రమపడితిమి!" అని పలుకుచు మనోహరము, ప్రేయసిని దుఃఖానలమునుండి తొలఁగింపఁబూని తానే సంతాపమున కుమిలి పోయెను!

## ౨౮. కమలా మనోహరులు.

ఆయువతీయువకు లెంత సేపు దుఃఖతోయములఁ దోఁగు చుండిరో తెలియదు. బాలసూర్యుని యరుణకిరణములు తన శోక తిమిరమును దొలఁగించినట్లుగఁదోఁచి, గమల కనులువిప్పి చూచునప్పటికి, మనోహర మెచ్చటను గానరాకుండెను!

సూర్యబింబము సువర్ణకాంతులతో వియత్పథమున వెలుఁగుచున్నను, కమల కన్నుల కాదివసము కాఱుమబ్బులు గ్రమ్మిన కేవల దుర్దిన మయ్యెను! ఆసాయంకాలము చెలికత్తెలు శుభకార్యమున కనువగు నలంకారములు తనకుఁ జేయునపుడు, చుక్కల నడుమనుండు చందురునివలె కమల వారలమధ్యఁ గొమరారుచుండెను. అపుడె యింటి కేతెంచిన యెఱుకతచేఁ జేయి చూపించుకొనుమని యామెచెలులు పట్టు పట్టిరి. తమగతి తమ కెఱుకపడినవారి కెఱుకలు జోస్యములు నేల? ఐనను, నెచ్చెలుల కోరిక చొప్పున కమల చేయిచాచెను. కన్నులు కరమం దున్నను, ఎఱుకత కెపుడును, మనస్సు ముఖమున నెదవిలీయుండును! అది యిట్లు లోనఁ దలపోసెను: "ఈ శుభసమయమున సొబ గొందవలసిన యీసుందరి ముఖపద్మ మేల ముకుళించియున్నది? ఎందుల కీ సోగకనులు సోలియున్నవి? ఈమె హృదయము వ్యాకులితమై యుండవలెను. ఇది గుప్తముగ నే గనిపెట్టెదను!" ఐనను, కుతూహల లగు నా కోమలులఁ దనియింపఁబూని యెఱుకత, "ఈ ముద్దరాలి కడుపున పదిమంది పుత్రులు పుట్టెదరు." అని పలికి, చెలులందఱు సంతోషకోలాహలమున నుండునపుడు, నాఁటిరాత్రి యొకసారి తోఁటలోనికి రమ్మని కమలకు మెల్లగఁ జెప్పి ..డలిపోయెను.

పిమ్మట తోఁటలో నెఱుకత కమల కిట్లనెను: "నీచేయి చూచి సమయమున కేదో కల్ల బొల్లి కల్పించితినిగాని, నీమనసున్న

విచార మున్నట్లు కానఁబడెను. ఆరహస్యము తెలిపితివేని, నీ యభీష్టము నెరవేర్చి, బాధ తొలఁగించెదను. నిజము చెప్పు. నీ హృదయము పరపురుషునిమీఁద......................”

కమల దాని నోరణఁచునట్లుగ నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను: “తల్లీ! నీవు నా హృదయశల్యమును పెకలింప పాల్పడినందుకు సంతోషమె. కాని, యటుచేయుట కదను తప్పినది. రానున్నది నాకుఁ దెలిసియె యున్నది. ఇంక మన మిచట మసలఁగూడదు. అదిగో పురోహితుఁడు నారాక కెదురుచూచుచున్నాఁడు. నన్నుఁ గొనిపోవుట కిదిగో మాయమ్మ వచ్చుచున్నది!” అనిపలికి, దానిచేత నొక్కింత రాలిచి పొమ్మనెను. ఆ సుశీలమీఁది జాలిచే కంట నీరు గ్రమ్మి, యొఱుకత వెడలిపోయెను

(3)

మఱునాఁడు వసంతపురమున కమల యకాలమరణమునకు విలపింపని మనుజులు లేరు. “ఏమి యీ సౌభాగ్యలక్ష్మికి శుభదినమె తుదిదిన మయ్యెనే!” యని కొందఱును, “పూవు పుట్టఁగనే పురుగు నోటవేసికొనెనే!” యని కొందఱును, కమల మృతినిగూర్చి చెప్పుకొనసాగిరి. “మానవజన్మము బుద్బుదప్రాయముగదా!” యని ప్రజలు వైరాగ్యవచనములు చెప్పుకొనిరి.

కమల యవసానకాలమును గుఱించి పెండ్లికుమారుఁ డిట్లు చెప్పెను:—“నిన్నరాత్రి తలుపు మూయఁగనే, కమల శయ్యయొద్ద నిలిచి, నన్నుద్దేశించి ‘అయ్యా! నన్ను విధి తఱుముకొని వచ్చుచున్నది! కాని నేను త్వరితముగ మీతో కొన్నిమాటలు చెప్పవలెను. వివాహ బంధమువలన మన మిద్దఱము భార్యాభర్తల మైతిమని లోక

మెంచుచున్నను, చిన్ననాఁటనుండియు నామనస్సు మనోహరము మీఁదనే యున్నది. అతఁడే నా హృదయాధినాథుఁడు. భూలోక కిల్బిషము లెవ్వియు సోఁకకుండ దైవము మా ప్రేమలత నిన్నాళ్లను బ్రోచుచుండెను. అట్టి పవిత్రప్రేమ కాధారమగు ప్రియుని వదలి పరపురుషుని జేపట్ట నొల్లకున్నను, ఇంతవఱకు నా నిజాభిప్రాయము వెల్లడింపమికి ప్రాణత్యాగమే ప్రాయశ్చిత్తముగఁ జేకొనుచున్నాను! నా తుదితలంపులు దెలుపు లేఖను మనోహరమున కందఁజేయ మిమ్ము వేఁడుచున్నాను!' అని యాయువతి, కలము కాకితమును గైకొని యీ రెండు కమ్మలును వ్రాసెను. ఇవి లిఖించినపుడా తరుణి ముఖబింబమున తాండవించిన తేజోవిశేషమేమని వర్ణింతును? ఆ సుందరవదనమున ప్రస్ఫుటమైన యాత్మవికాసము భూలోక సంబంధమైనది గాక, ఏ దివ్యలోకమునుండియో దిగి మరల నా భవ్యలోకమును వేవేగమె పొంద కాంక్షించునట్టిదిగఁ దోఁచెను! రెండవలేఖ పూర్తి గాకమునుపె, ఆ చెలువ చిన్నివేళ్లనుండి కలము పట్టుతప్పెను! ప్రచండవాయుచలనమున నేలపాలగు చూతలతవలె నాలతాంగి పుడమిమీఁద కొరగిల్లి పడిపోయెను!

"ఆ సుందరి వ్రాసియుంచిన కమ్మలివె!" అని యా పెండ్లికుమారుఁడు జేబునుండి యవి తీసియిచ్చెను. అందొకటి తలిదండ్రులకును రెండవది మనోహరమునకును కమల వ్రాసెను.

మనోహరుని కమ్మలో నిటులుండెను :—"ప్రియసఖా! ఇది నా తుది యుత్తరము. ప్రేమబంధమున మన జీవితము లొక్కటియగుననినేను మొదటినుండియు నువ్విళ్లూరుచుండుదానను. కాని, నే నిష్టపడకున్నను, తలిదండ్రులు చిన్ననాఁడె నాకుఁ బరిణయము చేసిరి.

స్వేచ్ఛయుండిన నెవరిని జెట్టవట్టియుందునో చెప్పవలెనా! పరిస్థితులు సవ్యముగనె యుండినచో మనోహరుఁడె నాకుఁ బతియై యుండెడివాఁడు! ఐనను, నిరపరాధు లగు తలిదండ్రులను నేను నిందింపను. హృదయంగతమగు కోరికలు తెలుప మనసెంత తహతహపడుచున్నను, లజ్జాతిరేకమున పెదవి మెదలుపనేరకున్న పసిబాలికమాటలు, జననీజనకులు బాగుగ గ్రహింపనేర్తురా? గ్రహించియు, పూర్వాచారపరాయణు లగు తలిదండ్రులు శాఖాభేదములు పరిగణింపక మన కిద్దఱి కానాఁడు పెండ్లిచేయుదురా? కాన, నా కకాలమరణ మవశ్యమని గుర్తెఱిఁగియె కాలము గడిపితిని. ఇప్పటికి గడువు సమీపించినది. నేను పరలోకయాత్రకు వెడలిపోవుచున్నాను. శాఖాభేదములు పాటించి, ఆచారమును శిరసావహించి, వధూవరుల యభీష్టము నారయక జనులు జరిపెడి యీ యతిబాల్యవివాహము లచిరకాలమున నె యంతరించుఁగాక! బలవత్తరమైన యాచారపిశాచమునకు బలియై యబలను నేను గతించినను, సుగుణములకాకరమును, మహదాశయములకుఁ దావలమును నగు నీవు సత్కార్యసాఫల్యమున ధన్యుఁడవై చిరకాలజీవివై, వర్ధిల్లెదవుగాక!'

## ౨౫. ఏకాంతజీవితము

స్నేహితులతో నే నాకాలమునఁ జర్చింపని రహస్య మేమియును లేదు. నేను రేలంగిలో నున్న రోజులలో పలుమారు వెంకటరావును జూచి, అతనితో లోకాభిరామాయణమే గాక, సంస్కరణోద్యమమునుగూర్చియును బ్రసంగించుచుండెడివాఁడను. నేను వ్రాసిన 'కమలామనోహరుల' కథ నాతనికి వినిపించితిని. కథలోఁ గొన్ని పట్టులఁ దగినచతురతఁ గనపడుచ లేదని యతఁ డసంతృప్తిఁ జెందెను.

అనగత్యముగను, అకస్మాత్తుగను నేను కొన్నియుదంతముల నందుఁ జొప్పించితి ననియు, ప్రేమాకుసుమమును పాంకముగఁ జిత్రింపలే దనియును, అతఁడు చిఱాకుపడెను. నా కథయందు వర్ణనములకుఁ దావు లేదనియు, ముందు రచించెడి కథాసంగ్రహమే నే నిందు సూచించితిననియు, నా సమాధానము. అచటనచట సొంపులు లేక పోలేదని యతఁడు పలికెను.

మరల రాజమంద్రి చేరినపిమ్మట మే మిరువురమును విచిత్ర లేఖలు కొన్ని వ్రాసి, ఒకస్త్రీ వ్రాయునట్టుగా వానిని "వివేకవర్ధని"లోఁ బ్రచురింప నుద్యమించితిమి. ౧౩ వ జూన్ తేదీని వెంకటరావు నేనును, "వీరేశలింగముపంతులు నిజమైన సంస్కర్తయేనా ?" యను విషయమునుగుఱించి చర్చించుకొంటిమి. మతసాంఘికవిషయములందు సంస్కర్తకర్తవ్య మేమి ? లోకముదెస నాతనివర్తన వ్యవహారములు నిష్కళంకములుగ నుండవలయును. అతనికి శత్రువులు, ముఖ్యముగ వ్యక్తిసంబంధమగు శత్రువులు, నుండరాదు. వీరేశలింగము పంతులు కోపస్వభావులై, కక్షలకుఁ గడంగి రని మే మనుకొంటిమి. ఏకైకస్నేహితుఁడగు గవరరాజుగారు అకాలమరణము నొందుటచేత, కలసి పని చేయుట కెవరును తోడు లేక, ఏకాకియై పంతు లిపుడు దినములు గడుపుచున్నాఁడు. వితంతూద్వాహపక్షమువారు, వీరేశలింగముగారిని విడిచి, ఆయనపలుకులకు క్రియలకు వికటవ్యాఖ్యలు సలుపుచుండు నొకప్రబుద్ధుని యందఁజేరి రని మేము చెప్పి పంతులను వారింప నుద్యమించితిమి.

౧౨వ తేదీని నేను వెంకటరావును గలసికొంటిని. అతఁడు స్త్రీలోలత్వమునుగుఱించి ప్రసంగింపఁబూనఁగ, అది గర్హ్యామని నేను బలికితిని. తుంటరులనుగుఱించి యతఁ డంత ప్రస్తావించెను.

చెడుగును గుఱించి వచించుట కాతఁడు వెనుదీయకుండుటయు, ఎందును తన ప్రాముఖ్యముఁ దెలుపుచు మాటాడుటయు, నా కాతనిసంభాషణమునకు ముఖ్యచిహ్నములుగఁ దోఁచెను. అతిశయోక్తులతో నుపన్యసించుటయు నతని కభ్యాసము. సహచరునియలవాటు పట్టుపడి, అపుడపుడు సంభాషణమున నతిశయోక్తులు చొప్పింప నేనును వెఱువకుండెడి వాఁడను!

కళాశాల తీయు దినములు సమీపించుటచే నేను, తమ్ముఁ డిద్దఱును రాజమండ్రి పయనము కావలసివచ్చెను. నేను వెంకటరావునొద్ద వీడ్కోలు గొంటిని. మరల వానినిఁ గలసికొనకయె నేను మృత్యువువాతఁ బడినచో, నన్ను గుఱించియైన నాకుఁ బ్రియమగు సంస్కరణపక్ష మవలంబింపు మని వానినిఁ గోరితిని. ౧౭ వ జూన్ మధ్యాహ్నమున తమ్ముఁ డిద్దఱితో నేను బయలుదేఱితిని. రేలంగి యిల్లు 'మరమ్మతు' అగుచుండుటచేత, మా తలిదండ్రులు, చిన్నపిల్లలును మాతో రాలేకపోయిరి. మరల విద్యాశాలఁ జేరవలె ననెడి యాశ మమ్ము వేగిరపెట్టగ, వర్షములోనే మేము నడచిపోవ సమకట్టితిమి. రెండుపెద్దమూటలు మేము మోయవలసి వచ్చెను. దారిలో వాన హెచ్చినను రాత్రికి వేలివెన్ను చేరవలె ననెడియాశచే మేము బురదలోనే పయనము చేసితిమి. ఎట్టకేలకు కాల్ధరికాలువగట్టు చేరితిమి. కాలువ పూర్తిగఁ బ్రవహించుచుండెను. దాటుటకు బల్లకట్టు లేదు. ప్రవాహమును దాటింపుఁ డని ఆవలియొడ్డున బట్ట లుదుకుకొను వ్యవసాయదారులను వేడితిమి. వారు సాయపడక, చిన్నతమ్ముని పెద్దవార మిరువురము చేతులు పట్టుకొని నీట నడిపించినచో, కాలువ దాటవచ్చు నని యాలోచన చెప్పిరి. కాఱుమబ్బుచే నల్లబడిన యాకాశము ప్రతిఫలించి, యిపుడు భయంకరాకృతిఁ దాల్చిన కాలువనీట

మే మంత చోరఁబడితిమి. కొంత నడచునప్పటికి, నీటి లోతు హెచ్చి, నేను మాచిన్నితమ్మునిచేయి యట్టె వదలివేసితిని! వెంకటరామయ్యమాత్రము పిల్లవాని చేతిపట్టు విడువలేదు. అంత మేము మువ్వురము వెనుక మొగము పట్టి, మాకుఁ దోడ్పడుఁ డని మరల నా మనుష్యులను వేడితిమి. వారిలో నొకఁ డంత నీదుకొని వచ్చి, ఒక్కొక్కరినే మ మ్మవలియొడ్డు చేర్చెను. పిల్లవానిని నిష్కారణముగఁ జంపివేసియుందు రని యచటివారు మమ్ము నిందించిరి. మా మేనమామలయిల్లు చేరి, బందుగులకు మా ప్రయాణవృత్తాంత మెఱిఁగించితిమి. నాఁడా గ్రామమందలి బాలికలు బొమ్మలపెండిండ్లు చేసికొనుచుండిరి. వారిలో నాభార్యయు, నా పెద్దచెల్లెలు నుండిరి.

మఱునాఁడే మేము రాజమంద్రి పయన మయితిమి. వాయు వతితీవ్రముగ వీచుచుండెను. ఒక్కొక్కప్పుడు గాలి తాఁకునకు సత్తి మూటలతో మేము తూలిపోవుచుంటిమి. ఎటులో విజయేశ్వరముఁ జేరితిమి. ఆనాఁడు స్టీమరు రా దని తెలిసెను. ఆపెనుగాలిలో పడవ లేవియు నీటిమీఁదిపయనమునకు సాహసింపలేదు. ఇంతలో వాడపల్లిరేవున నొక రహదారీపడవ మునిఁగె ననియు, కొందఱుప్రయాణికులు చనిపోయి రనియు, మాకు వినవచ్చెను. మేము వాడపల్లికి నడచిపోయితిమి. మునిఁగిపోయినపడవ యొడ్డున కొకింత దూరమునఁ దేలుచుండెను. చనిపోయినవారినిగూర్చి యేమియుఁ దెలియదు. రాజమంద్రినుండి యంత నొకస్టీమరు వచ్చి యెంత ప్రయత్నించియును, బోరగిలినపడవను తిరుగఁదీయ లేకపోయెను. ఇపుడు చీఁకటి పడుచుండుటచేత, రాత్రిభోజనమునకు మేము వెనుకకుఁ బోయి, విజయేశ్వరము సత్రమున బస చేసితిమి.

మఱునాఁడు (౨౦వ తేది) మేము విజయేశ్వరమునుండి మరల వాడపల్లి పోయితిమి. ఏదైన పడవమీఁద ధవళేశ్వరము చేరుదమా యనుకొనుచుండఁగనే, రేవుస్టీమరు వచ్చెను. ఇపు డది మునిఁగిన పడవను తిరుగఁదీయఁగా పడవగదిలో నిరుకుకొని చనిపోయిన యొకస్త్రీ, ఆమెకొడుకు కూఁతురు నందు గానవచ్చిరి! ఆశవములు చూచి యందఱమును దైన్యము నొందితిమి. మే మంత స్టీమరుమీఁద రాజమంద్రి వెళ్లితిమి.

ప్రియపట్టణమగు రాజమంద్రిని నేను మరల సందర్శించుట కమితానందభరితుఁడనైతిని. సంస్కారప్రియుఁడగు మిత్రుఁడు రాజ గోపాలరావు నన్నుఁ జూచుటకు స్వగ్రామమునుండి యిక్కడకు వచ్చియుండెను. చెలికాఁడు కొండయ్యశాస్త్రికూడ నిచట నుండెను. ఆతఁ డీమాఱు సంఘసంస్కరణమునెడల సానుభూతి గనపఱుచునట్లు తోఁచెను. వేంకటరావును గుఱించి మాటాడుకొంటిమి. ఆతనికి నియమానుసరణమునకంటె సమయానుకూలవర్తనమే ప్రియతరమైన దని సిద్ధాంతపఱుచుకొంటిమి. ఆదినములలో వీరేశలింగముగారు కట్టించుచుండెడి పురమందిరము వీక్షింపఁబోయితిమి. ఆ సంస్కర్తనుగుఱించి యచటివా రెవరో పరిహాసముగఁ బలుకఁగా నేను జిన్నపోయితిని. సమాజమిత్రుఁడు, సచ్ఛీలుఁడునగు పాపయ్యగారు, "క్రైస్తవ మత బోధకులవలె శాంతమతితో మనము కష్టములకుఁ గటువుపదములకు నోర్చుకొనుచు, పట్టుదలతోఁ బనులు చేసినచో, మనకు విజయము చేకూరును" అని పలికి న న్నోదార్చెను.

జూలై ౧ వ తేదీన మా యనుంగుమిత్రుఁడు లక్ష్మీనారాయణ గారు రాజమంద్రి వచ్చి, సంఘసంస్కరణవిషయమున నా కృషిని గూర్చి తాను మిత్రులవలన వింటి నని చెప్పి, న న్నభినందించెను

అయినను, నాకుఁ బ్రియమగు స్త్రీ స్వాతంత్ర్యము నాయన పరిహ సించి, స్త్రీలను మఱింత బంధింపవలె నని చెప్పి, సంస్కరణనిరస నము చేసినపుడు నా కధికవిచారము గలిగెను. బంధువును, మిత్రుఁ డును నగు కొండయ్యశాస్త్రి యొక్క విపరీత ప్రాఁతమతాభిప్రాయ ముల నీతఁడు సమర్థించునటు లగఁబడెడివాఁడు! కాని, యీయన చిత్తవృత్తి యపు డేకవిధమున నుండెడిది కాదు. కేశవచంద్రసేనుల యాంగ్లేయోపన్యాసముల నత్యుత్సాహమున మా కీయన చదివి విని పించి, ఉద్రేకము గలిగించుచుండెడివాఁడు. ఆకాలమున నా సహ చరులలో నొకరగు శ్రీ ఆసూరి కాంతయ్యగారినిగూర్చి కొంత చెప్ప వలెను. పూర్వము తాను సంస్కరణములయం దమితాభినివేశము గలిగియుండెడివాఁడ ననియు, కాని యావిషయమునఁ దా నిపుడు కాఁగి చల్లారిన పాలవలె తటస్థుఁడ నైతి ననియు, ఆయన పలుకుచుం డెడివాఁడు. చాత్తాద వైష్ణవుఁ డయ్యును, ఆయన సామాన్య బ్రాహ్మణయువకులందుఁ బొడఁగట్టని పారిశుద్ధ్య మనోనిగ్రహములచే నొప్పెడివాఁడు. సాధువర్తన మితభాషిత్వము లాయన సొమ్మగు నటు లుండెడివి! ఆసమయమున పట్టపరీక్ష రెండవశాఖకుఁ జదువుచు, తర్కమనశ్శాస్త్రములు అభిమానవిద్యగాఁ గైకొని, నీతిశాస్త్ర మందలి మంచికథపట్టులు మాకు వినిపించుచుండెడివాఁడు. ఆ సంగ తులు మిగుల చిత్తాకర్షకములుగ నుండి, పట్టపరీక్షకుఁ జదివినచో, ఆశాస్త్రపఠనమే చేయ నాకు సంకల్పము గలిగెను.

మా తలిదండ్రు లింకను రేలంగిలో నుండుటచేత, సోదరులు మువ్వురము రాజమండ్రిలో నొంటరిగ నుండి, మావంట మేమే చేసి కొనుచువచ్చెడివారము. పెద్దవాఁడనగు నామీఁద సామాన్యముగ వంట పని పడుచువచ్చెను. ప్రొద్దున పదిగంటలకే మేము మువ్వురము వంట

చేసికొని భోజనము చేసి పాఠశాల కేగవలసివచ్చుటచేత, మా కెంతో కష్టముగ నుండెడిది. వీనికిఁదోడు, సంస్కారప్రియులగు మిత్రుల సందర్శనసంభాషణములు నా నిత్యానుష్ఠానములో నంతర్భాగములై! ఇంట పాఠములు దిట్టము చేసికొనుటకే మాకు వ్యవధి చాలకుండెను. ఈమధ్యగ భోజనసదుపాయము లేమింజేసి మాతమ్ముఁడు కృష్ణ మూర్తి జబ్బుపడియుండెను. ఆసమయమందు మా యలజడి మఱింత హెచ్చియుండెను. మా స్నేహితు లా దినములలో సంస్కరణము పట్ల చూపిన యశ్రద్ధ మిగుల నిరుత్సాహకరముగ నుండెను. అద్దానిని గుఱించి రాజగురునితో నేను మొఱపెట్టఁగా, దీనివిషయమై మా సంస్కరణసభలో నొకనాఁ డాతఁడు తీవ్రముగ మాటాడెను. కనక రాజు ఆమాటలకుఁ గుపితుఁడయ్యెను. పాపయ్యగారు పలికిన చల్లని పలుకులును, వీరేశలింగముగారి సంస్కరణోపన్యాసమును అతని కోపము నొకింత చల్లార్చెను.

సంస్కరణసమాజకార్యక్రమమే నా యసంతుష్టికి హేతు వయ్యెను! ఈసమాజమున కాస్తికమతముతో సన్నిహితసంబంధము గలసినఁగాని దీనికి మోక్షము లేదని నానిశ్చితాభిప్రాయము! 27 వ జూలై తేదీని జరిగిన సంస్కరణసభకు లక్ష్మీనారాయణగా రగ్రాస నాధిపతి. సంఘసంస్కరణమునుగుఱించి కష్టపడి వ్రాసినవ్యాసము నేను జదివితిని. భీమశంకరము వ్యతిరేకాభిప్రాయ మిచ్చినను, కనక రాజు నాకు సానుభూతిఁ జూపెను. 3 వ ఆగష్టున జరిగినసభకు నే నగ్రాసనాధిపతిని. వివాహమునుగుఱించి కృష్ణమయ్యంగారు వ్యాసము చదివిరి. మిక్కుటమగు సభాకంపమునకు లోనైనను, నే నెటులో నావిధులు నిర్వర్తించితిని. మాటలకొఱకు నేను తడవికొనుచువచ్చితిని. నా యుపన్యాస మతిదీర్ఘముగ నుండెను. అంత్యోపన్యాసము ముగించి

నేను గూర్చుండుసమయమున శంభుశాస్త్రిగారు లేచి, కొన్ని మితసంస్కరణములు సూచించి, అవి మాసంఘమువా రవలంబించుట మంచిదని చెప్పెను. అంత నేను మరల లేచి, యీ సాంఘికవ్యాధికి బాల్యవివాహనిర్మూలనమే తగినచికిత్స యని వక్కాణించితిని. నాయీ తీవ్రసంస్కార పద్ధతి యావక్తను మరలమరల మాటాడ నుద్రేకింపఁగా నేనును సముచితప్రత్యుత్తరము లిచ్చుచువచ్చితిని. అంతట పాపయ్య గారు లేచి కొన్ని సామవచనములు చెప్పినమీఁదట, ఇంకొకవారమునకు సభ నిలిపివేసితిమి. పిమ్మట జరిగిన ప్రార్థనసమాజసభలో తమయధ్యక్షోపన్యాసమున వివాహసంస్కరణావశ్యకతను గూర్చి చెప్పుచు, వీరేశలింగముపంతులుగారు నా యభిప్రాయములను సమర్థించిరి. సభికు లందఱే మన్ననలకుఁ బాత్రమైన యగ్రపీఠము నధిష్ఠించినందు కెంతయు ముద మందితిని. నా పరిచితు లనేకు లానాఁడు సభ కేతెంచిరి. మధ్యమధ్య నాంగ్లేయపదములు పడి నేను గొంత చుట్టుత్రోవఁ ద్రొక్కినను, నాయుపన్యాసము నా నిశ్చితాభిప్రాయములను స్పష్టీకరించెను. నిజముగా నేను కీర్తి కెక్కుచుంటినా యని సంప్రశ్నించుకొంటిని!

౪ వ అగష్టు మధ్యాహ్నము పాఠశాలనుండి యింటికివచ్చినతోడనే, రేలంగినుండి యపుడె వచ్చిన మాతల్లిదండ్రులు తమ్ములు చెల్లెండ్రును గానఁబడి మోదమున మేము మిన్నందితిమి. ఇన్నాళ్లనుండియు ముప్వురు సోదరులమును ఇంటిపను లన్ని విసిగియుంటిమి. చదువుకొనుటకు వ్యవధాన మేమియు లేదు. ఇంకముందు మా భారమంతయు తల్లిదండ్రులె వహింతురు గాన, క్రమముగఁ జదువుకొన వచ్చునని మేము సంతసిల్లితిమి. రాఁబోవు డిసెంబరులోనే నేను ప్రథమశాస్త్రపరీక్షకును, నాతమ్ముఁడు ప్రవేశపరీక్షకును బోవలయును గావున,

కాలము వ్యర్థముచేయక, పెక్కు భోజనసదుపాయములకై తల్లిని వేధింపక, విద్యాపరిశ్రమముఁజేయ నిశ్చయించుకొంటిమి. ఆదినమే మిత్రుఁడు వెంకటరావు వచ్చికలసికొనుటచే నాయానందమునకు మితి లేకుండెను. నాఁడు నలుగురు స్నేహితులము నడిరేయివఱకును సంభాషణలతోఁ బ్రొద్దు పుచ్చితిమి. నా స్నేహితుఁడు కొండయ్యశాస్త్రి తాను జదువుకొనుటకు మా కావలివీథినున్న యొకయింట చిన్నగది యొకటి యద్దెకు పుచ్చుకొనెను. ఇపుడు నేను మాతమ్ముఁడును, దానికెదురుగ నున్న గదిలోఁ బ్రవేశించి చదువనారంభించితిమి. ఆకాలమున బాడుగలు మిగుల స్వల్పము. మాగది యద్దె పావలామాత్రమే!

౧౫ వ తేది ప్రొద్దున నాగదిలో మూఁడునాలుగు గంటలు చదివినపిమ్మట నింటికి భోజనమునకు వచ్చితిని. ఆఁకలిచేత నాకుఁ బ్రాణములు కడఁబట్టుచుండెను! ఆ యసమయమున మా యమ్మ ప్రశాంతమనమున నొకకందమొలకకుఁ బూజలొనర్చుచుండెను! నే నేమిచేతును? గోరుచుట్టుమీఁద రోకలిపోటనునట్టు, నాయాఁకలి బాధకు నాప్రబలవిరోధియగు విగ్రహపూజా సందర్శనము తోడై, నా కోపవహ్నిని రగులుకొలిపెను. దేవదేవునికిఁ జెల్లింపవలసిన పూజాపురస్కారము లీక్షుద్రవస్తువున కేల సమర్పించితి వని మా తల్లి మీఁద మండిపడి, నోటికి వచ్చిన వాక్కులు ప్రయోగించితిని! కాని, కొంతసేపటికి చిత్తనిరోధము చేసి, శాంతించి, "సదుద్దేశమున నీ యిల్లాలు చేసెడిపూజల కేల నేను నొచ్చుకొనవలెను? సాధువాక్యములతోనే సత్యదేవునివైపున కామెమనసును మరల్పుట కర్తవ్యము కదా!" అని నన్ను నేను సంప్రశ్నించుకొంటిని. హిందూ స్త్రీల మూఢత్వమునకై దైన్యమునఁ గన్నీరు విడిచితిని. తాము చేయు

పనుల యర్థము గ్రహింపని భారతనారుల దుస్థితిని తొలఁగింపు మని దయామయుఁడగు దేవదేవుని వేడికొంటిని.

మఱుసటినెల ౨౦ వ తేదిని రాజగురు మృత్యుంజయరావులు నన్నుఁ గలసికొని, మిత్రులందఱమును గూడి చదువుకొనుట కొక పఠనాలయము స్థాపించుటనుగూర్చి నాయభిప్రాయము తెలుపుమనిరి. నేను సమ్మతింపక, దీనికి బదులుగా చందాలు వేసికొని బీదలకు సాయము చేయుట మేలని చెప్పితిని. నన్ను తమవైపునకుఁ ద్రిప్పు కొన పరిపరివిధముల వారు ప్రయత్నించినను, వారికి సాధ్యము కాలేదు. తమ మురిపఁపుపేళ్లతో నన్ను వారు నిందించినను నేను నాపట్టు విడువలేదు. అంతట రాజగురువు, "నీబోటివారికి నైదు గురు దొరికిరేని, రాజమంద్రి నంతటి నొక్కపట్టున సంస్కరణ వాహినియందు ముంపఁగలను!" అని చెప్పివేసెను. అతని యర్థము నాకు బాగుగ వ్యక్తము గాకున్నను, నా కధిక నైతికధైర్యము గలదని పలికినట్లు నమ్మితిని. నాకు ధైర్యసాహసము లింకను ప్రసాదింపు మని భగవానుని వేడుకొంటిని.

30 వ సెప్టెంబరున నాకు శరీరమునందు నీరసము, కనుల బలహీనతయు నేర్పడుటచేత రాత్రి చదువు మానితిని. ఆనాఁడె కళాశాలలో అధ్యక్షుఁడగు మెట్కాఫ్‌దొర నన్నుగుఱించి మాటాడుచు, భాషాభాగమున నాచదువు బాగుగనున్నను, గణితమున మంచి కృషి చేసినఁగాని పరీక్షలో తప్పిపోవుదు వని నన్ను హెచ్చరించెను. ఆరాత్రి ప్రార్థనసమయమున నే నిట్లు తలపోసితిని :—

"ప్రభువా! తన నియమితకార్యము సగము కొనసాగించిన పిమ్మట నే మిల్టనుకవి కంధత్వము సంప్రాప్తమయ్యెను. నాకర్తవ్య మొకిం

తయెుఁ జేయకమునుపే, జీవిత ప్రథమ సోపానముననే, నా దేహము వ్యాధిపా లగుచున్నది! నా విధికృత్యములు నెరవేర్పఁబూనినచో, ఈ దుర్బలశరీరము తుత్తునియ లైపోవునేమో గదా! పరిశుద్ధవర్తనము పీడకుండ జరుపుకొనునటుల నా కనుగ్రహింపుము!"

## ౧౬. పరీక్షాపూర్వదినములు

౧౮౦౦ అక్టోబరునెలలో ప్రథమశాస్త్రపరీక్షకుఁ బోవువారిని నిర్ణయించుటకు జరిగిన కళాశాలాపరీక్షలో, ఇంగ్లీషులో నేను బాగుగ వ్రాసినను, లెక్కలలో గుణములు నాకు కనీస మైనను రా లేదు. బజులుల్లాసాహేబు నాకంటెను తగ్గియుండెను. గణితమున తరగతిలో మే మిరువురము నధమాధములము! అయినను క్రిందటి సంవత్సరపు పరీక్షలో నాతఁడు నేనును తరగతిలో క్రమముగ ప్రథమ ద్వితీయస్థానములం దుండుటచేతను, ఇప్పటిపరీక్షలోఁ దక్కిన యన్ని పాఠములందు మేము సరిగా నుండుటచేతను, మమ్ముఁగూడ పరీక్ష కంపిరి. అప్పటినుండియు నేను మఱింత శ్రద్ధతోఁ జదువుచుంటిని. నా నిత్యకార్యక్రమము వెనుకటివలెనే జరుగుచుండెను. వ్యాయామము, ప్రాతఃస్నానము, ప్రార్థనము, మిత్రులతోడి గోష్ఠి.—ఇవి కొన్నిమార్పులతో నిపుడును నా దినచర్యలోని యంతర్భాగములే. పరీక్ష సమీపించినకొలఁది చదువునకు ప్రాముఖ్య మిచ్చితిని.

కాని, నా శరీరారోగ్యము అసంతృప్తికరముగనే యుండెను. నే నెంత జాగ్రత్తతో నుండినను, అనుదినము నేదోబాధ వచ్చి మూలుగుచుందును. తలనొప్పి, నీరసము, అత్యుష్ణము, పైత్యప్రకోపము, మున్నగు బాధలు నాకు సన్నిహితబంధువులె! వీని పీడఁ బడుచుండు నేనాకాలమున నెట్లు చదువు సాగించికొనుచు, సభల కేగుచు,

మిత్రులతో సంభాషణలు సలుపుచునుంటినో యని నా కాశ్చర్యము గలుగుచున్నది !

ఒకానొకనాఁడు ఆత్మపరిశోధనసమయమున నే నిట్లు తలపోసితిని :—

"పరాత్పరా ! సాహసమున ని న్నీరీతిని సంప్రశ్నించుచున్నందుకు నన్ను మన్నింపుము. ఇంత దుర్బలశరీరముతోపాటు నా కిట్టి యున్నతాశయము లిచ్చుటయందు నీయుద్దేశ మేమి ? ఈశరీర మనతికాలములోనే కృశించి నశించిపోవనున్నది. ప్రబలమేధాశక్తికిఁగాకున్న నపార పరోపకార చింతనమునకుఁ దావలమగు నామనస్సు, దుర్బలశరీరమున కిట్లు బంధింపఁబడి యేమిచేయఁగలదు ? పాపమను పెనురక్కసిచే నావహింపఁబడిన యీహృదయమున కేల యిట్టి పరహితైకబుద్ధియు పరార్థప్రాపకత్వమును ? అకాలమరణమే నీ వాసన్నము చేయ నుద్యమించినచో, వెనువెంటనే నా కది ప్రసాదింపక, జా గేల చేసెదవు ?"

ఆసమయమున వీరేశలింగముగారికిని ఏలూరి లక్ష్మీనరసింహము గారికిని జరిగెడి యభియోగముల విచారణ మగుచుండెను. విద్యార్థుల మగు మేము తీఱికసమయములం దావివాదవిషయములు వినుటకు న్యాయసభల కేగుచుండెడివారము. మాలోఁ గొందఱు వాదిపక్షమును, కొందఱు ప్రతివాదిపక్షమును గైకొనుచుండువారు !

౧౩-వ అక్టోబరున గంగరాజు నేనును షికారుపోయి సంస్కారములనుగుఱించి మాటాడుకొంటిమి. తన భవిష్యత్తునుగుఱించి చెప్పుచు నతఁడు, విద్యాపరిపూర్తి యైనపిమ్మట తాను న్యాయవాదియై, దురాచారములు నిరసించి, సంస్కరణపక్ష మవలంబించి, సత్యమతమును

జేకొందు నని చెప్పెను. నాసంగతియు నేను ప్రస్తావించితిని-సంస్క రణోద్యమవిజయమునకై నేను జీవితము ధారవోయ నిశ్చయించితి ననియు, నాతో మనసుగలసి పనిచేసెడి సెయ్యునికొఱకు నేను వెద కుచుంటి ననియుఁ జెప్పితిని. అంత, గంగరాజు తను నట్టిచెలికానిగా నేను జేకొనవచ్చు ననియు, వలసినచో నాకుఁ దాను ధనసాహాయ్య మును జేయుచుందు ననియు నుడివెను. తాను బోషింపవలసిన సోదర రాదుల్లెంపటో యున్నను, తాను జేపట్టిన యుద్యమమునకు సంపూర్ణ విజయము చేకూర్చితీరెద నని వక్కాణించెను. నామీఁద గంగరాజు నకుఁ గల యనురాగమునకు నా కృతజ్ఞతను దెలిపి, రాఁబోవు వత్సర మున నేను వేటేంటికాఁపురము పెట్టినప్పుడు, నాకు సాయము చేయు వా రొకరైన నుండుటకు సంతసించితిని.

ఆమఱునాఁడు నేను కాంతయ్య కొంపయ్యశాస్త్రి లక్ష్మీ నారాయణగార్లను గలసి ముచ్చటించుకొనుచు, షికారుపోయితిమి. కాంతయ్యగారు వేదాంతోన్మాదమునకు లోనైనట్లు గానవచ్చెను! శాస్త్రి లక్ష్మీనారాయణగార్లు మిత్రుఁడు వచించినదాని కెల్ల తా ళము వైచుచు, యోగమహిమను గూర్చి తమసుముఖత్వమును దెలిపిరి! ఆరాత్రి నే నిట్లు తలపోసితిని :— " నా మిత్రులజీవితమువలన మాన వహృదయముయొక్క దౌర్బల్యచాంచల్యములు నే నొకింత గ్రహిం చితిని. కొమ్మనుండి కొమ్మకెగురుపక్షివలె నా హృదయము మతము నుండి మతమునకు గంతు లిడకుండును గాక! నేను నిరతము ఆస్తిక బుద్ధి గలిగి, మానవసేవాతత్పరుఁడనై, వలసినచో నాయాశయములకై యసువుల నర్పింతును గాక!"

౨౨ వ తేదీని వెంకటరావు కుటుంబముతోఁ గాఁపుర ముండు టకు రాజమంద్రి వచ్చెను. మఱునాఁడు రాజమంద్రి పురమందిరప్రవేశ

మహోత్సవము జరిగెను. ప్రాతఃకాలమున ప్రార్థన జరిగెను. "ప్రార్థన యొక్క యావశ్యకత "ను గుఱించి వీరేశలింగముగారు మంచియుపన్యాసము చేసిరి. సాయంకాలము బహిరంగసభ జరిగెను. పరీక్షాధికారి నాగోజీరావు పంతులుగారు అధ్యక్షత వహించి, సద్భావమున పౌరుల యుపయోగార్థమై కట్టించిన మందిరమునకు పంతులనభినందించిరి. యమ్. రంగాచార్యులవారు ఉపన్యాసము చేయుచు, వీరేశలింగముగారు చేసినభాషాసేవ సుగ్గడించుచు, ఆమహామహుఁడు జనుల నైతిక సాంఘిక పరిస్థితులయభ్యున్నతికొఱకై పరోపకారబుద్ధితోఁ గావించిన సత్కార్యముల నాయన ప్రశంసించెను. వాసుదేవశాస్త్రిగారి పద్యము లైనపిమ్మట కాల్పఁబడిన బాణసంచావెలుఁగున నూతన మందిరము సౌందర్యమునఁ జెలువారుచుండెను.

ఆరాత్రి నిద్రపోవుటకు ముందుగ, వీరేశలింగముగారికి కుడి బుజమై నిలిచి, త్యాగబుద్ధితోఁ గార్యసాధనము చేయు పాపయ్యగారినిగుఱించి నే నిట్లు తలపోసితిని:—"ఈపురుషుఁ డెట్టిసహృదయుఁడు, సచ్చారిత్రుఁడు! తా నెపుడును వెనుక నే నిలిచి యుండఁ గోరెడి యీాయన వినమ్రత యెంత శ్లాఘనీయము! ఈయనకు నాకు నెంతి యంతరము గలదు! మహాగర్వి నైననే నీసత్పురుషుని గోటి నైనను పోలఁగలనా ?"

౩౦ వ తేదీని వీథులలో నొక వింతసాటింపు వింటిని. దొండపూడికి వేలకొలఁది ప్రజలు వచ్చుచుండుటచేత అక్కడ విశూచి యంకురించె ననియు, జనులు రావల దనియు సర్కారు వారు సాటింపు చేయించిరి. ఆగ్రామములో నొకవైద్యుని పేరిమధ్య పైకి వచ్చెను. అతఁడు జనుల రోగములను సులభముగ నివారణ చేయుచుండె నని ప్రతీతి గలిగెను. అందువలన నచటికి తండోప

తండములుగ రోగులు వచ్చుచుండిరి. రోగి నొకచోట స్నానము చేయించి, "నీ రోగనివారణ మైనది, పో! ఇది దేవునియాజ్ఞ!" అని వైద్యుఁడు పలుకుచుండునఁట! దీనినిగుఱించి జనులలోఁ గొంత చర్చ జరిగెను.

ఈ వైద్యరహస్యము నా కపుడు తెలిసినది. ఆగ్రామమందలి చెఱువునీటిలో లోహద్రవ్యములు గలసియున్నవి. దీనివలననే జనుల కుపశమనము గలుఁగుచున్నది గాని, వైద్యునిమహిమమునఁ గాదు!. మాతండ్రికిఁగూడ దొండపూఁడివైద్యుని మాహాత్మ్యమును గుఱించి నమ్మకము లేదు.

మఱునాఁడు కాంతయ్యగారితో నేను వాదమునకు డీకొంటిని. అనర్థదాయకమగు దురాచారముల నైన నీయన యిపుడు బాహాటముగ సమర్థించుచుండెను! వేశ్యజాతివలన హిందూసంఘము నకుఁ గలుగులాభము లీయన పేర్కొనఁజొచ్చెను! ఇపు డీయన విగ్రహారాధనాతత్పరుఁ డయ్యెను! అయ్యో, యీతఁడు నేర్చిన తర్క వేదాంతములపర్యవసాన మిదియేనా?

దారిద్ర్యదేవత తాండవ మాడెడి మా సంసార పరిస్థితులఁ దలపోసి, 3 వ నవంబరున నే నిట్లు వెతనొందితిని:—"ఓ దారిద్ర్యమా! నా బోటియువకులు నిర్మించెడి యాకాశహర్మ్యములను నీ వెల్లు గాల్చి వేయుచున్నావు! ఉన్నతోద్యమములకును ఉదార భావములకును నీవు ప్రబలవిరోధివి. మాగృహమునుండి ని న్నెటులు తఱిమివేయఁ గలను? నీ విచట నివాస మేర్పఱుచుకొని, నా విశాలాశయముల యసువులఁ దీసివైచుచున్నావు! నీప్రేరణకు లోఁబడి, ప్రేమాస్పద మైన యాదర్శములను త్యజింపనా? నా సౌశీల్యమును నీకు ధారవోసి,

నా నియమానుసార జీవితమును నీకొఱకు నీటఁగలుపనా? నే నట్లు చేయను. సర్వసమర్థుఁడును, దయాసముద్రుఁడును నగు దేవదేవుఁడే నాకు శరణ్యము!"

కొలఁదిదినములలో కలకత్తాలోని "సాధారణ బ్రాహ్మసమాజ" ప్రచారకుఁడగు పండిత శివనాథశాస్త్రి యిచ్చటికి రానున్నాఁ డని మా కిపుడు తెలిసెను. ఆరాత్రి నే నింట మాటాడుచు, వీరినిగుఱించి ప్రస్తావించితిని. బ్రాహ్మమతమునుగుఱించి మావాళ్లతో నేను బ్రసంగించితిని. అపుడు మా నాయనయు, పెద్దతమ్ముఁడును నన్ను ముట్టడించిరి. "హిందూమతము ఈశ్వరు నొప్పుచుండఁగా, నీ కేల దూరపు బ్రాహ్మమతము గతి యయ్యె?" నని మాతండ్రి న న్నెత్తిపొడిచెను. ప్రసంగవశమున మాతమ్ముఁడు నాస్తికతను సమర్థించెను! అలయుచు డయ్యుచు నే నంత నాపక్షమును నిలువఁబెట్టుకొనఁ బ్రయత్నించితిని.

ఆరాత్రి నాప్రార్థనమం దిటు లుండెను:—"ఓ భగవంతుఁడా! నీ పుత్రకు లెంతటి మూఢత్వమున మునిఁగియున్నారు! నీ భక్తు లెట్లు బద్ధజిహ్వులై వారిమధ్య మసలుచున్నారు! మతమునకు మానవహృదయమునకు సంబంధము లే దనియు, వర్ణభేదముల పట్టింపులు, వట్టి బాహ్యపటాటోపములును మాత్రమే మతసార మనియు వా రనుకొనుచున్నారు! నీ సత్యస్వభావము వా రెప్పటికి గుర్తెఱుంగఁ గలరు?"

౧౧వ నవంబరున నలుగురు స్నేహితులమును షికారుపోయితిమి. మాసంభాషణమునందు, కాంతయ్య లక్ష్మీనారాయణ కొండయ్యశాస్త్రిగార్లు మువ్వురును దివ్యజ్ఞానవిశ్వాసకు లని నా కీనాఁడు స్పష్టపడినది! కావుననే వా రెపుడును మతోన్మాదమూఢాచారము

లను సమర్థించుచు, సంఘసంస్కరణవిముఖు లైయున్నారు. ఇట్టి యసభ్యస్నేహితులసహవాసమున నాయుత్తమాదర్శములు రిత్తవోవు నని నేను వెతనొందితిని !

౧౫వ తేదీని ఉదయమున పండితశివనాథశాస్త్రిగారు రాజమంద్రి వచ్చిరి. ప్రార్థనసామాజికులము వారికి సుస్వాగత మిచ్చితిమి. ఆయన సాధురూపము మృదువచనములు మాహృదయములను జూరగొనెను. ఆసాయంకాలమున పండితుఁడు పురమందిరమున "నూతన భారతదేశము, అందలి నూతనాశయములు" అనువిషయమునుగుఱించి యుపన్యాసము చేసెను. వారిప్రసంగమున నవీనభావములు వెల్లివిరిసి ప్రవహించెను. భావోద్రేకమున నాకును గంగరాజునకు నాతరుణమున చక్షువులనుండి బాష్పజలము స్రవంతియై పాఱెను. సభానంతరమున గంగరాజు నన్నుఁ గౌఁగిలించుకొని, తన యభిప్రాయభేదములను నీటఁగలిపి కార్యసాధనమున నాతోఁ గలసివచ్చెదనని చెప్పివేసెను ; మే మిరువురము నానందపరవశుల మైతిమి.

మఱునాఁడు కొందఱు స్నేహితులము శివనాథపండితుని సందర్శించి, పెక్కువిషయములను గుఱించి యాయనతో సంభాషించితిమి. ఆసాయంకాలము బ్రాహ్మసమాజవిధులను గుఱించి శాస్త్రిగారుపన్యసించిరి. పురమందిర మానాఁడు ప్రేక్షకులతోఁ గిటకిటమనుచుండెను. శివనాథపండితుని యుపన్యాస మతితీవ్రముగను చిత్తాకర్షకముగను నుండెను. అప్పుడు ముత్తుస్వామిశాస్త్రి భావోద్రేకపూరితుఁడై పండితునికిఁ బ్రణమిల్లి, తా నీమాఱు బ్రాహ్మమత మవలంబించితి నని చెప్పివేసెను !

## ౧౬. పరీక్షాపూర్వదినములు

నే నింటికి రాఁగా నే తండ్రియుఁ దమ్ముఁడును నాతో వాదమునకు దిగి, శివనాథపండితుఁడు వట్టి జడుఁ డనియు మూర్ఖుఁ డనియును బలికి, నా కమిత హృదయవేదనమును గలిగించిరి.

౧౪-వ తేదీని, ప్రాతఃస్నానానంతరమున నేను కనకరాజు గంగరాజుగార్లతోఁ గూడి, వీరేశలింగముగారి యింటికి వెళ్లి, వారి మేడగదిలో నున్న శివనాథశాస్త్రిగారిని సందర్శించితిని. సంస్కరణముల ననుష్ఠానమునఁ బెట్టువిషయమున మే మాయన యాలోచన యడిగితిమి. శాస్త్రిగారు తన జీవితమును గుఱించి ప్రస్తావించిరి. దృఢసంకల్పుఁడగు తండ్రివలన తనకుఁ గలిగినయిక్కట్లు, విద్యార్థిదశ యందె తన యుపదేశానుసారముగ నొకవితంతువును బరిణయ మాడిన స్నేహితునికష్టములు, ఆతనికిఁ దోడ్పడుటయందుఁ దాను జూపిన స్వార్థత్యాగము, ప్రథమశాస్త్ర పరీక్షాదినము లందలి తన యధిక పరిశ్రమము, తన యుద్యమవిజయము, ఈశ్వరవిశ్వాసము, మున్నగు స్వవిషయములను శాస్త్రిగారు మాకుఁ బూసగ్రుచ్చినట్లు వినిపించిరి. అంత మాకోరికమీఁదఁ గొన్ని సదుపదేశము లాయన మాకుఁ జేసిరి.

ఆయన సెలవు గైకొని మే మిండ్లకు వెడలిపోయితిమి. అందఱము నమితానంద పరవశుల మైతిమి. నా జీవితమునం దెపుడు నింత సంతోష మనుభవింపలేదని నే ననుకొంటిని. నాగురువు, ప్రవక్త, మార్గదర్శియు శివనాథమహాశయుఁడే యని నేను విశ్వసించితిని. ఇంత కంటె నాకుఁ గావలసినయానంద మేది, భాగ్యవిశేష మేమి?

అమితభావోద్రేకమున నాఁ డంతయు నే నేదో విచిత్రలోకమున నుండునట్లు తోఁచెను. శివనాథుని సుస్వరూపము నాకనుల యెదుట నృత్యము సలుపుచుండెను! ఇట్టి మహాత్మునికిఁగల శీల

సంపద, దైవభక్తియు నే నెపుడైన ననుభవింతునా ? ఈయనవలె నీశ్వరసంసేవనార్థమై ప్రచారము సలుపుటకు నోఁచుకొందునా యని నన్ను నే సంప్రశ్నించుకొంటిని.

## ౨౭. ప రీ క్ష లు

౨౩ వ తేదీని వెంకటరావు వ్యాధిగ్రస్తుఁ డయ్యె నని విని యాతనిఁ జూచుటకుఁ బోయితిని. అతఁ డిపుడు పడకనుండి లేవనే లేఁడు! తీవ్ర ధాతుదౌర్బల్యమునఁ బడిపోయియుండెను. ఒక గొప్ప మహమ్మదీయవైద్యుఁడు మం దిచ్చుచుండెను. వ్యాధి నెమ్మదిపడు ననెడి యాశ లేకున్నను శక్తివంచన లేక తాను మం దిచ్చెద ననియు, రోగి దైవముమీఁదనే భారము వేయవలె ననియు, వైద్యుని యభిప్రాయ మని. నామిత్రుఁడు హీనస్వరమునఁ బలికెను. దైవమును నమ్ముకొనినయెడల, అతనికి రోగనివారణ మగు నని ధైర్యము చెప్పితిని. కాని, తా నిపుడు సేవించు మందువలెనే నా మాటలును, వెగటు కాఁగా, వెంకటరావు:—"మిత్రుఁడా, న న్నీసంగతిలో బాధింపకండి. దేవుఁడు గీవుఁడు అనెడి అసత్యానగత్య విషయము లన్ని బైటనే పెట్టి, మరీ గదిలోకి రం డని వేఁడుకుంటున్నాను. నిజమైన యే యిహలోకవిషయమును గురించి యైన నాతో మాటాడ రాదా ? దైవమునుగురించి అప్రస్తుతప్రశంస చేసి, నా మనశ్శాంతికి భంగము కలిగింప వద్దని, నీకు, నీ దైవమునకు నమస్కారాలు చేస్తాను!" అని చెప్పివేసెను.

ఇంతకంటె విషాదకర మైనసంగతి యేది ? ఐనను, మన మేమియుఁ జేయలేని యిట్టివిషయములోను పేక్షయే యుత్తమముగదా.

వెంకటరావువంటివారల యజ్ఞాన నాస్తికత లెట్లు పాయునా యని నేను విచారించితిని.

ఆ రోజులలో నే నొకప్పుడు షికారు పోవుచుండఁగా, పెద్దాడ సాంబశివరావు నాకుఁ గానఁబడి, మీ పను లెట్లు సాగుచున్న వని యడిగెను. అంత మే మిరువురమును పోతగట్టుమీఁదికిఁ బోయి కూర్చుండి మాటాడుకొంటిమి. అదివఱ కతఁడు సంఘసంస్కరణ సమాజసభ్యుఁ డైనను, విగ్రహారాధన, జన్మాంతరము మొదలగువాని యందు విశ్వాసము గలిగియుండువాఁడు. పండిత శివనాథశాస్త్రి యిక్కడకు వచ్చి యుపన్యాసము లిచ్చుతరుణమునఁ దన సందియము లన్నియు నివారణ మయ్యె ననియును, తన కిపుడు ప్రార్థన సమాజసిద్ధాంతములందు నమ్మిక గలుగుచున్న దనియు నాతఁడు చెప్పెను. నా మాటలందు గౌరవము చూపిన యాతని మనస్సునకు నచ్చునట్టుగ నే నిట్లు పలికితిని:—"అన్ని సంస్కరణములకును ప్రార్థనయే మూలకందము. భగవంతుని నిష్కల్మష హృదయమున ప్రార్థించి, ఆయన యొసఁగిన జ్ఞానజ్యోతిసాహాయ్యమున మన విధుల నెఱవేర్పవలెను."

పిమ్మట నేను గంగరాజు గదిలోఁ బ్రవేశించితిని. శివనాథ శాస్త్రి వీరేశలింగముగార్లను గుఱించి మేము చెప్పుకొంటిమి. ఈమధ్య నే వీరేశలింగముపంతులు శాస్త్రిగారితో మాటాడుచు, తన కేమి తటస్థించినను లెక్క సేయ నని పలికెనట! పంతులచిత్తస్థైర్యమును నేను గొనియాడితిని. ఈఘను లిరువురు నిశ్చలభక్తిపరులు. కావున నే జనుఁ భూషణదూషణములను పాటింపక, తమ యుద్యమనిర్వహణమును వారు కొనసాగింపఁగలిగి రని నే జెప్పి. "మిత్రమా, మన జీవితావధి

సమీపించుచున్నది. ఇంతవఱకు మన మేకార్యమును జేయలేదు. ముందును విద్యయందే మన మనస్సులు లగ్నమైయున్నచో, జీవితారంభదశనే మన మీలోకమును వీడవలసియుండు నేమో!" యని నే నంటిని.

౩౦ వ తేది సాయంకాలమున నేను షికారుపోవుచు, చీఁకటి పడుచుండుటచే మార్కండేయాలయము చొచ్చి యొకవేదికపైఁ గూర్చుండి, యందలి సందడిని గనిపట్టుచుంటిని. కోమట్లు కర్షకులు నసేకులు గుడిలోనికి వచ్చి గంట కొట్టి దేవునికిఁ బ్రణమిల్లుచుండిరి. విద్యార్థులును నచటఁ గలరు. వారిపూజలు నేను నిరసింపక, యేమియు లేనిదానికంటె నీమాత్రము భక్తి మంచిదిగదా యని తలపోసితిని. దేవాలయప్రవేశము, విభూతిధారణము, జేగంటకొట్టి నందికి నమస్కరించుట, కనులు మూసి యొకింతసేపు దేవుని స్మరించుట, పూజారిచే శఠగోపము పెట్టించుకొని వానిచేతఁ గొంతరాలిపి బిల్వపత్రము లందుకొనుట,—ఇదియే యచట జరిగెడి కార్యప్రణాళిక!

హృదయాంతర్యామి యగు పరమాత్ముని మదిలో దర్శించి, విశుద్ధప్రవర్తన మూని యుండుట పరమార్థ మని ప్రజ లెపుడు గ్రహింతురా యని నేను బరితపించితిని.

౧ వ నవంబరు:—ఈదిన మంతియు దేహమున సరిగాలేదు. పరీక్షలోని యేవిషయమును నేను బాగుగఁ జదువకుండుటచే, అందు జయ మందుదు నను ఆశ యంతరించిపోయినది. ఎక్కువగఁ జదివి యారోగ్యము చెడఁగొట్టుకొనుటకు నేనిపుడు సమకట్టలేదు. పిలిచినచో నాదేహమునుండి రోగము పలుకుచున్నటు లుండెను! పెందలకడనే పుస్తకము మూసివైచి, వ్యాయామమున కేగితిని. కాని, చారిలో చెలి

కాంద్రుడు కానఁబడినందున, షికారు మాని సంభాషణమునఁ బాల్గొంటిని.

రాత్రి, సంభాషణసందర్భమున కొండయ్యశాస్త్రి, వీరేశ లింగముగారి పాండిత్యప్రకర్ష మును నిరసించెను. ఓపికతో నే నూఁకొట్టుచుంటిని. అంతకంత కాతనిప్రల్లదము హెచ్చుపెరిఁగి, "ఇతనికంటె దుర్నీతిపరు లెవరు?" అని శాస్త్రి వదరెను! నే నిఁక పట్టలేక, "ఈ మహాసంస్కర్తను గూర్చి నీ విట్లు కాఱులు ప్రేలి, నీ యవివేకము నవినీతియు వెల్లడించుకొనుచున్నావు! నోటికిఁ గొంత బుద్ధి చెప్పుము!" అని వానిని వారించితిని. అంత శాస్త్రి, "వీరేశలింగము చేసిన భ్రష్టులేకఁదా యీ విద్యార్థిలోకము! ఎంతమందిబాలు రీతని యుసురు పోసికొని యధమగతిపాలైరి! ఇం తేల? సంస్కరణములను పేరుతో నీవు నమ్మెడి వంకరటింకర సూత్రములకు ఈదుష్టగ్రహ మే కారకుఁడుగదా!" అని రోషావేశమునఁ బలికి, యీసంస్కర్తప్రహసనాదులందు తమ ప్రవర్తనమును వెల్లడించి వెక్కిరించుటచేత జీవితములను గోలుపోయిన కొందఱు సజ్జనులను గుఱించి శాస్త్రి పెద్ద. సోదె చెప్పుకొనివచ్చెను!

నాకు తీవ్రమైన యాగ్రహము జనించినను, శాంతించి, నే నిట్లు తలపోసితిని:— "దైవమా! పంతులవంటి గొప్పవారిని పామరజనులే కాక, శాస్త్రివంటి విద్యాధికులుగూడ నెట్లు దురభిప్రాయులై దూషించుచున్నారు! ఇంక వారి కేది శరణ్యము!"

శాస్త్రితలంపులు వికృతములు విపరీతములును! అంతరంగ మెంత కలుషిత మైనను, మందహాససుందరవదనమున భాసిల్లి,

సంస్కృతభాషాపాండిత్యము, పూర్వాచార పరాయణత్వమును సమృద్ధిగగలవారే శాస్త్రి మెప్పు వడయువారలు !

ఈ యన్నిటియందును శాస్త్రికి నాకును చుక్కయెదురే ! కాని, ఈ సమయమున, మా సామరస్యమును భంగపఱిచెడి చర్య లెవ్వియు నే నవలంబింపరాదు. నే నిట్లు తలపోసితిని :— "ఇంట నే నిపుడు తటస్థముగ నుండి, యెట్టిచర్యలలోను పాల్గొనక, కాలమును శక్తియుక్తులను నిక్షేపించుకొనుచున్నాను. శాస్త్రివంటి మహత్త్వము గలవారితోఁగూడ వాగ్వాదములు పెట్టుకొనన నిది యదను గాదు. దైవానుగ్రహ మున్నచో, పిమ్మట నిట్టివారలకుఁ దగు సమాధానము చెప్పితీరెదను. ఇదిగాక, సగము మతి చెడి దివ్యజ్ఞానవిశ్వాసకు లైన కాంతయ్య లక్ష్మీనారాయణగార్ల కీతఁడు మారిమి నెయ్యుఁడే కదా."

తన సమాచార మిట్టి దయ్యును, శాస్త్రి యూరకుండు వాఁడు కాఁడు. అపుడపు డతఁడు సంస్కారప్రియత్వమును సూచించుమాటలు మాటాడి, తాను విశాలమనస్కునివలెఁ బ్రసంగింపనెనుదీయఁడు. కాని, యొక్కొకతఱి నీతఁడు, అగ్నిపర్వతమువలె సంస్కర్తలమీఁద నిప్పులు గ్రక్కుచుండును. !

డిశంబరు ౫, ౬ తేదీలందు, అధికముగఁ జదువుటవలన నేను శ్రమఁ జెందితిని. పెందలకడనే పుస్తకములు మూలఁ ద్రోచి, ధవళేశ్వరమువైపునకు గోదావరియొడ్డున నేను షికారుపోయితిని. పచ్చనిచెట్లు, పండఁబాఱిన సస్యములును జూచి నా కనులు సేదదేఱెను. కొమ్మలమీఁది పక్షులరుతములు, సేద్యగాండ్ర మానరాగములు, నా వీనులకు శ్రావ్యసంగీతనాదము లయ్యెను. వ్యవసాయకుల

కేక లిడుచున్నను, జొన్నకంకులమీఁదఁ జివాలున వాలి, చంచు వులతో గింజ లందుకొని చతురతతోఁ బరుగులిడు పక్షుల నవలోకించుచు, నే సాగిపోయితిని. ఆహా! శీతకాలవాయువు లెంత సుఖదాయకములు! తన్నుఁ బరిశీలించెడివారి శ్రమకు ప్రకృతికాంత యెంతయుదారహృదయమునఁ బారితోషిక మొసంగుచున్నది!

౧౫ వ తేదీనుండి మద్రాసు సర్వకళాశాలాపరీక్షలు ప్రారంభమయ్యెను. ఎంత ప్రయత్నించినను కొన్ని రాత్రులు నాకంటికిఁ గూర్కు రాకుండుటవలన, పరీక్షాదినములలో నా దేహము మిగుల నిస్సత్తువఁ జెందియుండెను. నే నెటులో ప్రశ్నపత్రములకు సమాధానములు వ్రాసితిని. నే ననుకొనినంత బాగుగఁ గాకున్నను పరీక్షలో జయ మందుటకుఁ జాలినట్టుగ వ్రాసితి నని తలంచితిని. గణితమునందు నాకు గండము తప్పవలెను! ఎటులో జయింపవచ్చు నని యోఁచించి యూరడిల్లితిని.

౧౯ వ తేదీతో మాపరీక్షలు పూర్తియయ్యెను. మఱునాఁడె నాకు జ్వరము సోఁకెను. శాస్త్రిమున్నగు స్నేహితులు నన్నుఁ జూడవచ్చి, మంచిమందు పుచ్చుకొమ్మని చెప్పిరి కాని, గోల్డుస్మిత్తువలె నేను సొంతవైద్యము చేసికొనఁగోరితిని! ఈ జ్వరము నాలుగైదు రోజులలో నెమ్మదించినను, నాకనుల కిపు డొక క్రొత్తరోగము ప్రాప్తించినటు లుండెను. కన్నులయెదుట ముత్యాలసరమువంటి చిన్న చుక్కలబారు కనపడ నారంభించెను! కంటివైద్యము చేయించుకొన నే నపుడు వేగిరపడితిని.

## ౨౮. పరీక్షావిజయము

౧౮౮౯, ౯౧-వ సంవత్సరములమధ్య నా జీవితమునఁ గలిగినంత గొప్పపరిణామము, అంతకుఁ బూర్వమునఁ గాని, పిమ్మటఁగాని యింతస్వల్పకాలమున సంభవింపలేదని చెప్పవచ్చును! ఇష్టవిహారము, నియమానుకూల్యజీవితము, ఆస్తికమతావలంబనము, సంస్కరణాభిరతి, మొదలగు దోహదవిశేషములచే నావ్యక్తిలతిక వర్ధిల్లి వికసించెను. ఆయాపరస్థితుల ననుసరించి నాశరీరమనశ్శక్తులు, ఒకప్పుడు కష్టములఁ గ్రుంగుచు, ఒకప్పుడు సంతోషమునఁ బొంగుచును, మెల్ల మెల్లఁగ నభ్యున్నతి గాంచుచుండెను. నా శీలప్రవర్తనములు వివిధశోధనలకుఁ దావలమై, క్రమక్రమముగ క్రమమార్గానుసరణమున ప్రవర్ధమాన మగుచుండెను. ఇపుడు నా మతవిశ్వాసములందు సుస్థిరతాదృఢత్వములు, ప్రవర్తనమున నిశ్చిత నీతిపథానుసరణమును, స్పష్టముగఁ గానవచ్చెను. ఈ నూతనవత్సరమున విద్యాభివృద్ధి, దేశాటనము, గృహస్థాశ్రమారంభము, వార్తాపత్రికాస్థాపనముల మూలమున నా లోకానుభవమునకు విశాలత సమకూడి, నా సంస్కరణాభినివేశము నవీనములును క్రియాపూర్వకములు నగుదారులు త్రొక్కుట కనకాశము గలిగెను.

౧౮౯౧-వ జనవరి ౧-వ తేదీని, నూతనవత్సరప్రార్థనసమయమందు నే నిట్లు తలపోసితిని:— "భగవానుఁడా! నిరుడీనాఁడు నే జేసికొనిన నియమముల నేఁడాదిపొడుగునను నే నంతగ ననుసరింపనందుకు వగచుచున్నాను. ఈ క్రొత్త సంవత్సరమున నీ యీ నిబంధనల నవలంబింతు నని ప్రగల్భములు పలుకక, నీ పాదకమలసేవయే చేతు నని నేను నిర్ధారించుకొనుచున్నాను."

## ౨౮. పరీక్షావిజయము

అంత నూతన సంవత్సరకార్యవిధాన మిట్లు సూచించితిని :—

“౧. పరీక్షలో జయమందినచో పట్టపరీక్షకును, లేనిచో మరల నీ పరీక్షకును, జదివెదను.

౨. విజయము చేకూరునట్టుగ క్రమపద్ధతిని జదువు సాగింతును.

౩. ఆరోగ్యమును గుఱించియు, ముఖ్యముగ నేత్రముల గుఱించియు శ్రద్ధఁ బూనెదను.

౪. నా యుద్యమసాఫల్య విషయమై, సమత్వకార్యవాదిత్వములతోఁ గృషి చేసెదను.”

అంత నే నిట్లు ప్రార్థన సలిపితిని :— “ అనంతా! ఈ దుర్బలశరీరముతో, నీకును, నీ సంతతియగు మానవకోటికిని నా వివిధవిధుల నెట్లు నేరవేర్పఁగలను? పరిశ్రమ యనఁగనే దుర్బలతచే నా మేను కంపించుచున్నది! ఐనను, ఒడలు దాచుకొనుట భావ్యము కాదు. నీ వొసఁగినగడువు మీఱకమున్నె, నావిధులు చెల్లించి, నీదయకుఁ బాత్రుఁడ నయ్యెదనుగాక!”

పరీక్షలు జరిగినపిమ్మట, నాసహపాఠి మిత్రులు తమ నెలవులకు వెడలిపోయిరి. అందుచేత రాజమంద్రిలో నే నేకాకిగ నుండవలసి వచ్చెను. జనవరి మొదటి తేదీని వెంకటరావు బసకుఁ బోయి, యాతనిఁ జూచితిని. తండ్రి తనమీఁదఁ గోపించె నని యతఁడు ఖిన్నుఁడయ్యెను, నన్నుఁ జూచి కొంత సేదదేఱెను. రాత్రివఱకు నే నచటనే నిలిచి, యూరట గలిగించితిని.

నేఁడు మే మొక వింతసాటింపు వింటిమి. కొందఱు దుష్టులు శిశువులను దొంగిలించి, యిపుడు బెజవాడదగ్గఱఁ గట్టెడి యేటివంతె

నపని జయప్రదముగ జరుగుటకై కృష్ణానదీదేవతకు బలి యిచ్చుటకు వారి నచటి కెగుమతి చేయుచున్నా రని వదంతులు ప్రబలెను! కావున జనులు తమపిల్లల నింటియొద్ద జాగ్రత్తపెట్టుకొనవలె నని సర్కారు వా రిపుడు చాటింపించిరి. మా కుటుంబ స్థితిగతు లిపుడు విషాదకరముగ నుండెను. ౧౩౦౦ రూపాయలయప్పు పెరిఁగెను. పాపము, నిరుద్యోగి యగు మాతండ్రి యిది యెట్లు తీర్పఁగలఁడు? నే నన్ననో, ముక్కుచు మూలుగుచు నున్నాఁడను. కనులకుఁగూడ నేదియో మూఁడినది! ఇంక పరీక్షలో నపజయ మాపాదించె నేని, నాయదృష్టము పరిపూర్తి యగును! తమ్ముఁడు వెంకటరామయ్య ప్రవేశపరీక్షకుఁ బోయియుండెను. అతఁడు క్రమక్రమముగ బుద్ధిమంతుఁ డయ్యెను కాని, కృష్ణమూర్తి యింట నవిధేయతఁ గనఁబఱుచుచు, చదువునందు శ్రద్ధ లేకయుండువాఁడు. అతనిని, తక్కిన పిల్లలలోఁ గొందఱిని నదుపులో నుంచుట మాకుఁ గష్టముగ నుండెను! విషమపరిస్థితులలో నేను ధైర్యము విడువక, ఈశ్వరపాదకమల స్మరణమే సర్వానర్థహర మని నమ్మియుంటిని.

జనవరి ౨౧వ తేదీని లక్ష్మీనారాయణగారితో నేను షికారు బయలుదేఱి, మండలవైద్యాధికారియగు కరూథర్సు డాక్టరును జూడఁ బోయితిని. కచేరీగదియందుఁగాక, నేను లోపలిగదియొద్దకుఁ బోయి తనను జూచినందు కాయన నామీఁద మండిపడెను! యూరోపువారి యాచారపద్ధతులు నాకుఁ దెలియమియే దీనికిఁ గారణ మని నే జెప్పుటచేత, ఆయన నాతప్పు సైరించి, మఱునాఁడు నాకనులు పరీక్షించెను. రెండుకన్నులలోను చిన్నచుక్క లున్న వనియు, ముం దవి యెట్లు పరిణమించునో తెలియ దనియు, అవి పువ్వులక్రింద నేర్పడి నేత్రదృష్టి పూర్తిగఁ దొలఁగినపుడు శస్త్రము చేయవచ్చు నని

యును, ఆయన చెప్పెను. అంతవఱకును నేను సులోచనములు పెట్టు కొనవలెనఁట! చెన్నపురి వెళ్లి, సర్కారు నేత్రవైద్యాలయమందలి నిపుణులచే వైద్యము చేయించుకొనుట మంచిదని స్నేహితులు చెప్పిరి. ఈసంవత్సరము జరుగనున్న జనాభాపనులలో నేను స్వచ్ఛంద సేవకునిగఁ బని చేతు నని పురపాలకసంఘమువారికి మాట యిచ్చి యుంటిని. నాబదు లెవరును పనిచేయ నొప్పకుండినందున, వెను వెంటనే నేను చెన్నపురి పోవుటకు వలనుగాకుండెను. నా నేత్ర రోగమును గుఱించి తలిదండ్రులు సోదరులును మిగుల ఖిన్నులైరి.

ప్రతియేఁడును జనవరిలోనే ప్రథమశాస్త్ర పరీక్షాఫలితములు తెలియుచుండెను. స్నేహితుఁడు కాంతయ్యగారిపుడు తమ పట్టపరీక్షార్థమై చెన్నపురికిఁ బోయియుండిరి. ముందుగనే నాసంగతి తెలియఁబఱతు నని యాయన నన్ను నమ్మించినను, అట్లు జరుగనందున నాయలజడి హెచ్చెను. మద్రాసులో పరీక్షాపర్యవసానము ప్రచురమయ్యె నని విని నేను రెండవ ఫిబ్రవరిని రిజిష్ట్రారునకు తంతి నంపితిని. జవాబు లేదు! మఱునాఁడు నే నింట వ్రాసికొనుచుండఁగా, వెంకటరత్నము వచ్చి నా విజయవార్త నెలుఁగెత్తి చెప్పెను. ఆనాఁడెల్ల మా యానందమునకు మేర లేకుండెను! మిత్రులు పరిచితులును నన్నభినందనములలో ముంచివైచిరి! కనకరాజు గంగరాజు లపజయ మందుటవలన నాముఖ మంత తేటగ లేకుండెను.

రాజమంద్రి కళాశాలలో నేను జేరి పట్టపరీక్షకుఁ జదువవలె నని మా తలిదండ్రులయుద్దేశము. కాని, నే నొకసంవత్సరము విద్య విరమించినచో, నేత్రదృష్టియు దేహారోగ్యమును చక్కపడు నని వెంకటరావు మున్నగు మిత్రుల యభిప్రాయము. రాజమంద్రిలోనె చదువుటకును, రాఁబోవు వేసవిలో చెన్నపురి పోయి నేత్రవైద్యము చేయిం

చుకొనుటకును, నే నంతట నిశ్చయించుకొంటిని. పరీక్షలో తిరిగి యపజయమందిన మిత్రులగు కనకరాజును గంగరాజును పరామర్శ చేయుటకు నేను నర్సాపురము పోయి వచ్చితిని. మార్గమధ్యమున నేలి వెన్నులో నే నొకదినము నిలిచియుండఁగా, అచటి బంధువులు నా పరీక్షావిజయవార్త తెలిసి యానందమందిరి. నే నిఁకఁ జదువు చాలించి యుద్యోగము చేతు నని కొందఱును, న్యాయవాది నయ్యెద నని కొందఱును, అచటఁ జెప్పుకొనిరి. వారికి నాయూహలతోను, ఆశయములతోను ప్రసక్తియె లేదు!

కొలఁది రోజులలో ప్రవేశపరీక్షా ఫలితములును దెలిసినవి. తమ్ముఁడు వెంకటరామయ్య జయమందెను. కొండయ్యశాస్త్రి మరల తప్పెను. సోదరుల మిరువురము పరీక్షల నిచ్చి, కళాశాలలో నున్నతవిద్య నభ్యసింప నున్నందుకు నే నానందనిమగ్నుఁడ నైతిని. మా విద్యాపరిపోషణము చేయవలసిన జననీజనకుల బాధ్యతాభారము మాత్ర మతిశయించుచుండెను!

నేను వెంకటరావును జూచుటకు ౧౩-వ తేదీని పోయినప్పుడు, పాపము, అతఁ డవసానదశయం దుండెను! అపుడును న న్నాతఁ డానవాలు పట్టెను. వెంటనే వైద్యుని బిలువు మనియు, తనదేహమున నిముసనిముసమును ఉబుకుచుండెడి నీటియూటను దోడివేయించి తన జీవములను గావు మనియును, రోగి యాత్రమున నన్ను వేఁడుకొ నెను! నే నచట నిలువలేక పోయితిని. వైద్యుఁడు శక్తివంచనలేక పని చేయుచుండినను, నీటిపొంగు నరికట్టుట దుస్సాధ్య మని యచట నుండువారు నాకుఁ జెప్పివేసిరి! దైన్యమున నే నింటికి వెడలి పోయితిని. మఱునాఁడు నాతఁ డట్లె యుండెను. అంతకంతకును రోగికి దాహ మతిశయించెను. ఆ మఱుసటి దినమున వెంకటరావు

మృత్యుగర్భము సొచ్చెను! ఆ బాల్యస్నేహితుని యకాలమరణము నాహృదయనౌకను దుఃఖజలధిని ముంచివైచెను. ఓ మరణదేవతా! నీచేష్టల నిరోధించు సాధనకలాప మీభూలోకమున నెచటను లేనేలేదా?

## ౨౯. చెన్నపురిప్రయాణము

రాజమంద్రికళాశాలలో పట్టపరీక్షతరగతిలో నేనును, ప్రథమశాస్త్రపరీక్షతరగతిలో మాతమ్ముఁడును జేరి చదువుచుంటిమి. మా స్నేహితులు కనకరాజు గంగరాజులు తిరిగి రాజమంద్రి వచ్చి ప్రథమశాస్త్రపరీక్షకును, కొండయ్యశాస్త్రి ప్రవేశపరీక్షకును మరలఁ జదువుచుండిరి. అంతకంతకు సంఘసంస్కారప్రియుల సావాసము మరగి, శాస్త్రి మున్నగు పూర్వాచారపరులతోడి సంసర్గము నేను విరమించు కొంటెని.

సంఘసంస్కారణసమాజము వెనుకటివలెనే పనిచేయుచున్నను, క్రమక్రమముగ దానిప్రాశస్త్య మణఁగిపోయి, ప్రార్థనసమాజప్రాముఖ్యము హెచ్చెను. నిజమునకు రెండుసమాజముల సభ్యులు నొకకూటమువారే. చర్చనీయాంశముల విషయనవీనత నానాటికి వన్నెవాసి, చేయుపని యంతగఁ జేతులకు లేకపోవుటచే, సంస్కారణసమాజవ్యాపనము ప్రార్థనసమాజకార్యక్రమమున నంతర్లీనమై, కాలక్రమమున నేతత్సమాజము ప్రత్యేకవ్యక్తిత్వమును గోలుపోయెను! ఇట్లగుటవలన, సంస్కారణాభిమానము సభ్యుల మనస్సీమనుండి వీసమంతయుఁ దొలఁగె నని తలంపఁగూడదు. ప్రార్థనసమాజసభ్యత్వము సంస్కారణాభిమానమునకుఁ బర్యాయపద మగుటచేత, ఏకోద్దేశమున రెండుసభలు జరుపుట యనగత్యమై, ప్రార్థనసమాజము పేరిటనే

మత సంఘ సంస్కరణవిషయముల ప్రసంగప్రణాళిక యంతయు నింతటినుండి జరిగెను.

ఇవి ప్రార్థనసమాజ వార్షికోత్సవదినములు. మద్రాసునివాసులు, సంఘసంస్కారులు నగు మన్నవ బుచ్చయ్యపంతులుగారు రిపుడు కొన్ని దినములనుండి రాజమండ్రిలో వీరేశలింగముగారియింట బసచేసి యుండిరి. ఏప్రిల్ ౯-వ తేదీని బుచ్చయ్యపంతులుగారు "ఈశ్వరసేవ"ను గుఱించి ప్రసంగించిరి. వయస్సు తీఱిన యనుభవశాలి యగు పంతుల వాక్కులను యువకులము మేము సగౌరవముగ నాకర్ణించితిమి. ఆ మఱునటిదినము సారంగధరపర్వతమున భగవన్నామసంకీర్తనముచేసి, గీతములు పాడుచు, పురప్రవేశము చేసితిమి. నా కన్నుల కాసమయమున నాచార్యపదవి నధిష్ఠించిన యిద్దఱుపంతుల్లును ఋషిసత్తముల వలెఁ గానవచ్చిరి. కొన్ని దినములక్రిందటనే కళాశాల వేసవికి మూయఁబడెను. ౧౧-వ తేదీని నేను వీరేశలింగముగారియొద్దకుఁ బోయి, నేత్ర వైద్యమునకై చెన్నపురి కేగవలెనని చెప్పితిని. ఆయనయు, బుచ్చయ్యపంతులును సకుటుంబముగ మఱునాఁడే చెన్నపురిప్రయాణము పెట్టుకొనియుండుటచేత, నన్ను దమతోఁ దీసికొనిపోయెద మనిరి.

కొంతకష్టముమీఁద నా చెన్నపురిపయనమునకు మా తలిదండ్రులు సమ్మతించిరి. వీరిని, తమ్ములను చెల్లెండ్రను నేను విడిచిపోవునపుడు, అందఱమును కంట నీరు పెట్టుకొంటిమి. కొందఱు స్నేహితులతో పడవప్రయాణముచేసి, ౧౩-వ తేదీని కాకినాడ చేరితిని. మఱునాఁడు ప్రొద్దుననే సహచరుఁడగు మద్దిరాల రామారావుగారియింట భోజనము చేసి, ఒకడబ్బాతో మంచినీరు, ఇంకొకదానితో పెరుగును కొంత మిఠాయియు వెంటఁదీసికొని, నేను చిన్నపడవమీఁదఁ బోయి, సాయంకాలమున పొగయోడ నెక్కితిని.

## ౨౯. చెన్నపురి ప్రయాణము

ఇదివఱకు నే నెన్నఁడును సముద్రదర్శనము చేసియుండలేదు. నాకన్నుల కిపుడు లోక మంతయు వింతవన్నెలు దాల్చినటు లుండెను! బిడియముచేత పొగయోడలో వీరేశలింగముపంతులు మున్నగు పరిచితు లుండుచోటఁగాక, వేఱొకచోటఁ గూర్చుంటిని. ఓడ మఱునాఁటియుదయమునకు బందరురేవు చేరి, సామా నెక్కించుకొనుచు నచటనే సాయంకాలమువఱకును నిలిచియుండెను. ఒక్కొకసారి పెద్దయలలు చెలరేఁగుటవలన బం రురేవు కల్లోలముగ నుండును. నాఁ డంతయు పొగయోడ పెద్దకెరటములతాఁకున కుయ్యాలవలె నూఁగుటచేత, పైత్యప్రకోపమున నాకు వాంతులయ్యెను. సాయంకాలము పొగయోడ కదలిపోయినపుడు శమనము గలిగి, కొంచెము ఫలాహారము చేసితిని. మఱునాఁటియుదయమునకు చెన్నపురి సమీపించితిమి. అనతిదూరమున నగరము సముద్రముమీఁద మిగుల రమణీయముగఁ గానవచ్చెను. అపుడు వీరేశలింగము బుచ్చయ్యపంతులుగార్లు కనఁబడి, కుశలప్రశ్న చేసి, పట్టణమందలి తమబసకు న న్నాహ్వానించిరి. క్రొత్తప్రదేశము చూచి బెదరిననాకు, చేరఁబిలిచిన యీ ప్రాఁతపరిచితులు ప్రాణరక్షకులవలెఁ గానఁబడిరి! వారితో నే నంత పరశువాక మేగితిని. అచ్చట బుచ్చయ్యపంతులుగారి కొక లోగిలి గలదు. ఆసాయంకాలమే వీరేశలింగముగారితో నేను గుజిలీబజారు మున్నగు పురభాగములు సందర్శింప వెడలితిని.

నేను చెన్నపురిలో బుచ్చయ్యపంతులుగారియింటనే విడిసి వీరేశలింగముగారియతిథిగ నుంటిని. ఒకొక్కప్పుడు బుచ్చయ్యపంతులుగారితోఁగూడ భోజనము చేయుచుందును. నేత్రవైద్యాలయమునకుఁ బోవునపుడు తప్ప, తక్కినకాలమందు నే నింటనో బయటనో వీరేశలింగముగారితోనే యుండుచువచ్చితిని. రాజమంద్రియందు నాకుఁ

బ్రాహ్మప్రతింపని పంతులుగారి నిరంతరసహవాసభాగ్యము నా కిచట లభించెను. నీతిమతసాంఘికసాహిత్యాంశములందు ఆమహనీయుని యూహలు నుదారాశయములును నే నిపుడు గ్రహించి యానందింపఁ గలిగితిని. భార్యయగు రాజ్యలక్ష్మమ్మగారితోను, అభిమానపుత్రకుఁ డగు చిన్నవీరేశలింగముతోను, ఆయన మాటాడి మెలఁగుచుండురీతి నేను గనిపెట్టితిని. వ్యర్థకాలక్షేపము చేయక, పంతులుగారు సదా సద్గ్రంథపఠనమునను, పుస్తకరచనమునందును లగ్నమానసులై యుందురు.

౨౮-వ తేదిని నా కనులు డాక్టరు బ్రాకుమను పరీక్షించి, అం దేమియు జబ్బు కానఁబడక పోవుటచేత, నే నింటికి వెడలిపోవచ్చునని చెప్పివేసిరి. ఇది సంతోషకరమైన సంగతి యైనను, కనులమందు దాడెడి చుక్కలనుగురించి వైద్యుఁడు ప్రస్తావింపక పోవుటచేత, ఆయన వానిని గుర్తింపలేకుండె నేమో యని నేను సంశయమందితిని. ఐనను, నేత్ర వైద్యనేత్త యగు బ్రాకుమనుని నిశ్చితాభిప్రాయము నే నెట్లు శిరసా వహింపకుందును? కావున నేను తిరుగుపయనమున కాయత్తపడితిని.

మే ౧-వ తేదిన వీరేశలింగముగారితోఁ బోయి, రాజధానీ కళాశాలను జూచితిని. అందలియాంధ్రభాషాభివర్ధనీసమాజసభ కాయన యధ్యక్షుఁడై యొక చక్కనియుపన్యాస మొసంగిరి. బుచ్చయ్య పంతులుగారు, బ్రాహ్మమతస్వీకారమునుగూర్చి నాతో మనసిచ్చి మాటాడిరి. అదివఱ కాయన చిరకాలము మద్రాసునందలి బ్రాహ్మ సమాజమున సభ్యులుగ నుండి, సమాజాభివృద్ధికై మిక్కిలి పాటుపడి, మందిరనిర్మాణముఁ గావించిరి. ఆ సమాజమువారికిని పంతులుగారికిని సరిపడనందున, వారినుండి యాయన విడిపోవలసివచ్చెను. అంత మద్రాసున స్వంతముద్రాలయమును స్థాపించి, "హిందూజనసంస్క

రిణి" అను మాసపత్రికను నెలకొల్పి, పంతులు జరుపుచుండెను. బుచ్చయ్యపంతు లిపుడు హిందూమతపునరుద్ధారణము ప్రధానాదర్శముగఁ జేసికొని, పండితులసాహాయ్యమున నర్థతాత్పర్యసహితముగ హిందూధర్మశాస్త్రము లాంధ్రమునఁ బ్రకటించుచుండెను.

మే ౨-వ తేదీన బళ్లారి "సరసవినోదినీనాటకసమాజము" వారు తాము ప్రదర్శించెడి యొకనాటకమునకు వీరేశలింగముపంతులుగారి నాహ్వానింపఁగా, నేనును వెళ్లితిని. నాటకము మిగుల రమ్యముగ నుండెను. ఆ మఱుసటిదినము పంతులుగారితోఁ గలసి బ్రాహ్మమందిరమున కేగితిని. ఉపాసనసమయమున సామాజికు లందఱును గలిసి కీర్తనలు పాడుటకు మాఱుగా, జీతమునకుఁ గుదిరిన యొకపాటకుని గీతము లూరక వినుచుండిరి! ఇది నాకు రుచింపలేదు. వీరేశలింగముగా రంతట "ఐహికాముష్మికసుఖముల"నుగూర్చి యుపన్యాసముచేసిరి.

నేను చెన్నపురిలో నుండురోజులలోనే, స్విఫ్టువిరచిత మగు "గల్లివరుని ప్రయాణముల"ననుసరించి, "సత్యరాజాపూర్వదేశయాత్రలు" అను విచిత్రకథను పంతులుగారు రచింపఁదొడంగిరి. ఏనాఁడు వ్రాసిన ప్రకరణముల నానాఁడు పంతులు నాకుఁ జదివి వినిపించి, నాయభిప్రాయము గైకొనుచుండెను. ఓడప్రయాణమందలి నాబాధలసంగతి నేఁ జెప్పగా విని, సమయోచితముగ నందుఁ గొన్నిటిని సత్యరాజున కాయన యారోపించుట చోద్యముగ నుండెను. హాస్యరసకల్పనా విషయమున పంతులుగారు అడ్డిసనునికంటె స్విఫ్టునే యెక్కువగఁ బోలియుండె నని నే నంటిని. అడ్డిసనుని మృదుహాస్యప్రయోగము తెలుఁగునఁ జొప్పింప పంతులయాశయము. అది కడు దుస్సాధ్య మని నేను జెప్పితిని. పంతులుగారి నిరంతరపరిశ్రమము నా కాశ్చర్యానందములను గొలిపెను. వారివలెనే నేనును పాటుపడనెంచి, నే నక్కడ

కొనిన 'ఈసపుకథల'ను తెలిఁగింప మొదలిడితిని. ఈవిధముగ నేను చెన్నపురిలోఁ గొన్నికథల ననువదించితిని.

౫-వ తేదీసాయంకాలము వీరేశలింగము బుచ్చయ్యపంతులు గార్లకు అద్వైతమతమునుగుఱించి పెద్దచర్చ జరిగెను. బుచ్చయ్య పంతులిపుడు అద్వైతమతాభిమాని. వీరేశలింగముగారి మనస్తత్వమున కామతము బొత్తిగా సరిపడకుండెను. దానియం దణుమాత్రమును సత్యము లే దని యాయన నిశ్చితాభిప్రాయము. అంత బ్రాహ్మధర్మ మందలిలోపములను బుచ్చయ్యపంతులుగారు వెలువరింపఁగా, వీరేశలింగముగారు వారివాదమును ఖండించిరి. నేను వీరేశలింగముగారి పక్షము నే యవలంబించితిని.

౭-వ తేదీని, ఈయిరువురు మహాశయులయొద్దను, జననులవలె నిన్నాళ్లును నాకు భోజనసౌకర్యములు గలిగించిన వారిసతీమణుల యొద్దను, నేను సెలవు గైకొని, మద్రాసునుండి బయలుదేఱితిని. వెనుకటి యనుభవములు మఱచిపోయి, నాస్వాభావికరుచుల ననుసరించియో, పొగయోడలో భుజించుటకు తీయని యుపాహారము లే యీమాఱును నేను వెంటఁదీసికొనిపోయితిని! కాని, యోడలో పయనము చేయుచుండు నామిత్రుఁ డొకఁడు, సముద్రయానమందు పైత్యోద్రేకకరములగు మధురపదార్థములు పనికిరావని నాకుఁ జెప్పి, తాను దెచ్చుకొనిన పచ్చడియూరుగాయలతోఁ గలిపినయన్నము నాకుఁ బెట్టెను. ఈమాఱు నాపయనము హాయిగ నుండెను. ౯-వ తేదీమధ్యాహ్నము కాకినాడ తీరము చేరి,బండిమీఁద మఱునాఁటిసాయంకాలమునకు రాజమంద్రి వచ్చితిని. సుఖముగ నేనిలు చేరినందు కందఱు నానందపరవశులైరి.

# ౩౦. జనకుని వ్యవహారదక్షత, శకటవ్యాపారఫలితము

౩౦. జనకుని వ్యవహారదక్షత, శకటవ్యాపారఫలితము

ఇటీవల మాతండ్రి, దూరదేశము పోలేక, ఉద్యోగము విరమించుకొని, యింటిపట్టుననే యుండెను. ఎవరితోడనో మాటలసందర్భమున బండివ్యాపారము లాభకరమైనదని యాయన వినెను. త్రాడు బొంగరములు లేని వ్యవహారములలోఁ జొరఁబడుటకు నే నిష్టపడు వాఁడను కాను. నా చెన్నపురిప్రవాససమయమున మాజనకుఁడు మా తల్లిని, పెద్దతమ్ముని నెటులో యొప్పించి, కొంతసొమ్ము బదులుచేసి, బండిని యెద్దులజతను కొనెను. బాడుగకు బండి తోలుటకై యొకజీతగాఁడు నియమింపఁబడెను. బండివలన దినమున కొకరూపాయి వచ్చి, ఖర్చుల కర్ధరూపాయి వ్యయమైనను, కనీస మెనిమిదణాలు మిగులునట్లు తేలెను. కావున నింకొకబండియు నెద్దులజతయును శీఘ్రమే మాతండ్రి కొనెను. దినకృత్యములు చేసికొనుటయే భారముగ నుండెడి మాతల్లి, సాయంకాల మగునప్పటికి, ఎద్దులు నాలుగింటికిని, చిట్టు పొట్టులు కుడితియు గుగ్గిళ్లును సమకూర్పవలసివచ్చెను! రెండుబండ్లకును పని కుదుర్చుట, పనివాండ్రు సరిగా పని చేసి సొమ్ము తెచ్చి యిచ్చుట మొదలగుకార్యభార మంతయు మాతండ్రిమీఁదఁ బడెను. మాతమ్ము లాయనకు సాయముచేయుచుండిరి. ఈశకటవ్యాపారవ్యామోహము మాతో నిలిచిపోయినదికాదు! మా మామగారికిని మా తండ్రికిని చెలిమి యెక్కువ. ఆయనయును మా నాయనవలెనే తనపుత్రుని విద్యాభివృద్ధికై సకుటుంబముగ నిచ్చటికి వచ్చి, ఇపు డూరకయే కాలము గడపుచున్నారు. వారును బండి యొకటి కొని, కుటుంబాదాయ మేల వృద్ధిచేసికొనరాదు? మాజనకుని ప్రేరేపణమున, కొలఁదిరోజులలో వారికిని నొక బండి యెద్దులజతయు సమకూడెను! ఇపుడు వారు మా పొరుగునకుఁ గాఁపురము వచ్చిరి. కావున నీయుభయకుటుంబముల

కును, తెల్లవాఁడుసరికి శకటవ్యాపారసందర్భమునఁ జేతులకుఁ బనియు, మనస్సున కలజడియు సమృద్ధిగఁ జేకూరెను! ఒకరియొద్దులకంటె నొక రివి మంచి పనియు, ఒకరిబండికంటె నొకరిదాని కెక్కువలాభము వచ్చు ననియు నెంచెడి యీర్ష్యాజనకములగు నభిప్రాయములు గలిగి, పరస్పరస్నేహసౌహార్దములకు భంగకరము లగు పరిస్థితు లేర్పడెను!

నేను చెన్నపురినుండి యింటికి వచ్చునప్పటికి, నాకీ క్రొత్త సంగతు లన్నియు ద్యోతకమయ్యెను. తన వ్యవహారదక్షతనుగుఱించియు, మా కుటుంబమున కిపుడు గలుగు ధనలాభమునుగూర్చియు మా తండ్రి నాకుఁ జెప్పఁదొడంగెను! నాకుమాత్రము మాకుటుంబమున కింతసులభముగ నే గొప్పయదృష్టమును పట్టునను నమ్మకము లేదు! మా యదృష్టముమాట యటుంచి, మా జనకుని యాలోచనాసౌష్ఠవమునుగూర్చి విచారించినను, నా మనస్సున క్షేమియు సంతృప్తి గలుఁగ దయ్యెను. ఆయన వ్యాపారకౌశలమునుగూర్చి నాచిన్నతనమున రేలంగిలో నొకగాథ వినుచుండువాఁడను. ఇప్పటివలెనే మాతండ్రి యపుడును ఉద్యోగము చాలించుకొని, యింట దినములు గడపుచుండెను. ఆ కాలమున చింతపండు అమితప్రియ మయ్యెనఁట. వీసె ముప్పావలా దాఁటిపోయెను. ఒకవేళ, చింతపండుధర హెచ్చుచుండుటచేత, వర్తకులు దానిలో ఖర్జూరపుపండు మిశ్రమము చేసి యమ్మి లాభము గడించుచుండిరి! ఈతెరుణమున చింతపండువర్తకము చేసి మంచిలాభ మేల సంపాదింపరాదని మా తండ్రిమనస్సునకు స్ఫురించెను. ఇట్టి వ్యాపారపరిశ్రమమం దీయనకుఁ దీసిపోని ప్రజ్ఞానుభవములుగల యాయన పెద్దయన్న దీనికి వల్లె యనెను! అంత మా నాయన రాజమంద్రి వెళ్లి, కొన్నికంట్లముల చింతపండు కొని, రహదారిపడవమీఁద సరకు రేలంగి తీసికొనివచ్చెను. ఈబుట్టల యమ్మకమున మితిమీఱిన లాభము

# ౩౦. జనకుని వ్యవహారదక్షత, శకటవ్యాపారఫలితము

రానున్న దని యన్నదమ్ములు గుసగుసలాడుకొనిరి! ఇంకను విరివిగా నీవ్యాపారము సాగించినచో, సులభముగ వందలు వేలును లాభము మూటగట్టవచ్చునని యాసోదరులు తలపోసిరి. అంత మా జనకుడు సొంతచేతులతోనే యాచింతపండు తూఁచి యమ్ముటకు తక్కెడయు రాళ్లును తయారు చేసికొనెను!

గాలిపాటువలె వర్తకపరిస్థితులును నిముసనిముసమును పరివర్తన మందుచుండును! మఱునాఁటినుండియె చింతపండుధర తగ్గసాగెను, పూర్తిగ లాభము తీయవలయు ననుపేరాస ప్రేరింపఁగా, మాతండ్రి కాలానుసారముగ కొంతధర తగ్గించి, తానెటులో సరకు నమ్మివేయుటకు సమ్మతింపలేదు. రానురాను చింతపండు చౌక యైపోయెను. స్వల్పలాభమునకో నష్టమునకో సకాలముననే సరకమ్మలేనివారు, అది కారుచౌక యగునపుడు, ఎక్కువనష్టమునకు తెగించి యమ్మివేయఁ గలరా? పర్యవసాన మే మన, మా నాయన తెచ్చినచింతపండుబుట్టలు, తెచ్చినవి తెచ్చినట్టుగనే నిలువయుండి, పదు నుడిగి, బూజు పట్టి, గడ్డ గట్టిపోయినవి! ఇపు డవి యెవరికిఁ గావలెను? ఇంటనైన నుపయోగింప వలనుపడకుండెను. మావాండ్రు నీళ్లపొయిలో చింతపండు అడలు వేయుచుండువారు! శీతకాలమందు ప్రొద్దున చలిమంటల కివి యుపకరించుచుండెను. మంట యారిపోవ నున్నపు డెల్ల, "ఇంకొక అడ తెచ్చివేయండిరా!" అనుమాటలు చిన్ననాఁడు నేను వినుచుండిన జ్ఞాపకము! ఈచింతపండువ్యాపారప్రస్తావము తెచ్చి, మావాండ్రు, అప్పుడప్పుడు మాతండ్రిని పరియాచకము చేయుచుండువారు. అపుడాయన ముసిముసినవ్వులు నవ్వుచు నుండువాఁడు!

ఇపు డీబండ్లవ్యాపార మటులే పరిణమించు నని నేను వాక్యము పెట్టితిని! కాలము గడచినకొలఁది, బండ్ల 'గిరాకి' తగ్గెను.

బండి 'కిరాయి' తగ్గుటచేత, స్వల్పలాభము స్వల్పనష్టముక్రింద దిగెను. ఇదే బండ్లమ్మివేయుట కదనని నేను మాతండ్రిని హెచ్చరించితిని. ఒక బండియమ్మివేయుట కాయన యొడఁబడుటచే, కొంచెమునష్టమునకు దానిని, దానియెద్దులను అమ్మివేసితిమి. కష్టనష్టములు పెరుఁగుచుండుటచేత, రెండవబండిని ఎద్దులనుగూడ పోకడపెట్టితిమి. మా మామగారి సంగతి కూడ నిట్లే జరిగెను. ఉభయకుటుంబములును, ఈ బండ్లవ్యాపారమున మూటగట్టుకొనినది, శ్రమయు ఋణమును మాత్రమే! ఈయప్పు భావికాలమందలి కుటుంబఋణమునకు ప్రాతిపదికము కూడ నయ్యెను!

## ౩౧. రచనావ్యాసంగము

చెన్నపురినుండి వచ్చిన మఱుసటిదినముననే నా పుస్తకములు సరదుకొని, చెలికాండ్రను జూచివచ్చి మద్రాసులో నారంభించిన వ్రాఁతపని సాగింపఁబూనితిని. నా గురువర్యులగు వెంకటరత్నముగారిని చూచినపుడు, తెలుఁగులోనికి తర్జుమా చేయుమని యాయన నాకొక యింగ్లీషుపుస్తక మిచ్చెను. అది నేను ముందు వేసికొని, యింటఁ గూర్చుంటిని. తెలుఁగున గద్యపద్యరచనము చేయ నేనుద్యమించి, పోపు విరచితమగు "సార్వజనికప్రార్థన"ను, 'గ్రే' వ్రాసిన "పెంపుడుపిల్లి" యను గీతమును, పద్యరూపమున ననువదించితిని. చేంబర్సు "నీతిపాఠకపుస్తక"మందలి పాఠములు కొన్ని చదివి తెలుఁగు చేసితిని. వీనిలోఁ గొన్ని కరపత్రములుగఁ బ్రచురించి ప్రార్థనసమాజపక్షమున జనులకుచితముగఁ బంచిపెట్టుట మంచిదని తలంచితిని. వీరేశలింగముగారు తెప్పించుకొనుచుండు "ఇండియన్ మెసెంజర్" అను బ్రాహ్మసమాజ వారపత్రికను జదువుటకు వారమువారమును వారిం

టికిఁ బోవుచుండువాఁడను. ఆపత్రికలోఁ బ్రచురమగు మంచివ్యాసముల నిపుడు ఆంధ్రీకరింపసాగితిని. కడచిన రెండుసంవత్సరముల నుండియు రాజమండ్రిలో ప్రచుర మగు "వివేకవర్ధనీ" వారపత్రికను దెప్పించి సంతోషమునఁ జదువుచుండువాఁడను. ఇపుడు కొలఁది కాలమునుండి యాపత్రిక పడిపోయెను. మా చేతులలోనే యిట్టివార్తాపత్రిక యొకటి యుండినచో, నే నిటీవల వ్రాయుచువచ్చిన పద్యములు వ్యాసములు నందుఁ బ్రచురింపవచ్చునుగదా! నావలెనే ప్రార్థన సమాజమిత్రులును వ్రాసెడి వ్యాసములు, సభలలోఁ జదివెడి యుపన్యాసములును, ఇట్టి వార్తాపత్రికలలో ముద్రింపవచ్చును.

వార్తాపత్రికా స్థాపనమును గుఱించి నే నంతట కొందఱు సమాజమిత్రులతోఁ బ్రస్తావించితిని. వారు దాని నామోదించిరి. మే ౨౭-వ తేదీని మృత్యుంజయరావు నేనును వీరేశలింగముగారితో మాటాడి, గోదావరియొడ్డున షికారుపోవుచు, ప్రతికాస్థాపనమును గుఱించి మాటాడుకొంటిమి. మిత్రునితో నే నిట్లు చెప్పితిని:—"వీరేశలింగముపంతులుగారు తాము విరమించిన వివేకవర్థనీ స్థానమున చింతామణి యను మాసపత్రికను నెలకొల్పఁ దలఁచుకొన్నారు. మనబోటివారు వ్రాయు వ్యాసము లందుఁ బ్రచురింపరు. బొంబాయి బంగాళాదేశములలోని ప్రార్థన సమాజములకు స్వంత వార్తాపత్రిక లున్నవి. మనకుఁగూడ నొక పత్రిక యుండుట కర్తవ్యము. ముందుగా నొక చిన్నపత్రిక నేర్పటిచి, దానిని క్రమముగఁ బెంపు చేయవచ్చును. ప్రార్థనసమాజమే దీని యాజమాన్యము వహింపవలెను. ఈ పట్టణములో నుండు సభ్యులు కార్య నిర్వాహక సంఘముగ నేర్పడి పత్రికను సాగింపవచ్చును." మృత్యుంజయరావు నాతో నేకీభవించెను. అంత మే మిరువురము పత్రికను గుఱించి మాటాడుకొని, చందాలు పోగు

చేయఁదలంచితిమి. భావోద్రేకమున నా కారాత్రి మంచి నిద్దుర పట్టలేదు.

ఒకటి రెండు రోజులు జరిగినపిమ్మట, మే మిద్దఱము మరలఁ గలిసికొని పత్రికాస్థాపనమును గుఱించి సంభాషించితిమి. ఆఱు నెలలవఱకును తాను దానిని బోషింతునని నామిత్రుఁడు చెప్పినప్పుడు, అటులైన పత్రిక తప్పక వెలయఁగల దని నే నసుకొంటిని. మఱునాఁటిసాయంకాలము మే మిరువురము వీరేశలింగముగారి యింటికిఁ బోయి, నూతనపత్రికనుగుఱించి వారితో మాటాడితిమి. దీని కాయన మిగుల సంతోషించి, మావలెనే యౌవనమున దాము "వివేకవర్ధనీ" పత్రికను బ్రకటింపఁగినసందర్భము జ్ఞప్తికిఁ దెచ్చుకొని, ఆపత్రిక వెనుకటిప్రతుల లోనివ్రాఁతలు కొన్ని మాకుఁ జదివి వినిపించెను. పత్రిక నెలకొల్పుటకుఁ జేయవలసిన కార్యక్రమము మాకుఁ దెలియఁబఱచెను. వలసినచో నేను పత్రికాధిపతిగ నుండెద నంటిని.

ఆమఱునాఁటి యుదయమునుండియె నూతనపత్రికాస్థాపన విషయమై నేను దలపోయసాగితిని. వివేకవర్ధనిని బ్రారంభించుటకు వీరేశలింగముగారికిఁ గల యాశయములె మా దృష్టిపథమునను వెలసి యుండుటచేత, పేరున నించుక మార్పు చేసి, నూతనపత్రికకు "సత్య సంవర్ధని" యని నామకరణము చేసితిని. క్రొత్తపత్రిక కంతట "విజ్ఞాపనము" వ్రాసి ఒకవ శేదీని నే నది పంతులుగారికిఁ జూపించితిని. అది బాగుగ నుండె ననియు, కొంచెము తగ్గించినయెడల, అదియే పత్రికలో ప్రథమవ్యాసముగ ముద్రింపవచ్చు ననియుఁ బంతులుగారు చెప్పఁగా, నే నెంతో సంతోషపడితిని. అప్పటినుండియు నేను "సత్య సంవర్ధనీ" పత్రికకు వ్యాసములు వ్రాయుటతోఁ గాలము గడిపితిని. "అను

తాపము" అనువ్యాసము నే నీసమయమున రచించి, సవరించి, పత్రికకు సిద్ధపఱిచినదియె.

నూతన పత్రికా వ్యాసంగమున నే నిట్లు తవిలియుండుటకుఁ గారణమారయఁగా, ఆనాఁటి నామనస్తత్త్వసమాచారము నాకు స్ఫురణకు వచ్చుచున్నది. నాశరీరదౌర్బల్యము సంగతి మాటిమాటికి నా మనస్సున కింకను దట్టుచు, నాబాధలను బెనుచుచుండెను. ఈ బాధలు నేను లెక్కఁగొనక మఱచిపోవుటకు, నామనస్సున కపుడు నిరంతర పరిశ్రమ మేదియో యొకటి యావశ్యక మయ్యెను. ప్రార్థన సంఘ సంస్కరణ సమాజ ప్రణాళికలు నామనసున కట్టి వ్యాసంగము కొంత గలిపించినమాట వాస్తవమే. కాని, సమాజసభలు వారమున కొకటి రెండు గంటలు మాత్రమే జరుగుచుండెను. సభాప్రసంగము లందును, సఖులతో సంభాషణమునందును, ఉపన్యాసాదుల యందును నేను దఱచుగఁ బాల్గొనుచుండెడివాఁడను. కాని, యిట్టి చర్యలనుదినమును జరుగుట కవకాశము లేదుగదా.

ఇదిగాక, ఉపన్యాసములు, వాదోపవాదములును నా కంతగ రుచించెడివికావు. మీఁదుమిక్కిలి నా సంస్కరణ వ్యాపనమునకుఁ గూడ నివి కొంత ప్రతిబంధములని నాకుఁ దోఁచెను. వ్యాసరచనయు పత్రికావిలేఖనమును ముఖ్య కర్తవ్యములుగ నా కగఁబడెను. దీనికి హేతువులు లేకపోలేదు. తగినంత వేగముగను విస్పష్టముగను సభలలో నేను నా భావములను వ్యక్తపఱుప లేకుండెడివాఁడను. తెలుఁగున మాటాడునపుడు ఇంగ్లీషుపదములు దొరలుచుండెడివి! భావోద్రేక మున నా వచోధోరణి కుంటుచు నడుచుచుండెడిది. పదలాలిత్యాది సొంపులు లేక, నాభాష పరుషముగను, పలుకులు కటువులుగను

నుండెడివి. ఇట్టి వాక్ఛక్తి లోపమువలన, హృదయమున లేని కాఠిన్యమునకును, మనసున లేని కాపట్యమునకును, నేను ఉత్తరవాది నగుచు వచ్చితిని!

నిశ్శబ్ద మగుచోటఁ గూర్చుండి కలము చేతఁ బట్టినప్పుడు, ఉపన్యాసవేదికమీఁదను సభామధ్యమునను నాకుఁ గానవచ్చెడి తొట్రుపాటులు తొలఁగిపోయెడివి. భావమును వ్యక్తపఱచెడి భాషయు, అభిప్రాయముల కనువగు పదసంఘటనమును, వ్రాఁత లభింపఁజేసెడివి. కలము చేతఁ బూనినపుడు, అవమాన మేమియుఁ గలుగకుండ మన తలంపులు మనము మార్చుకొనవచ్చును. మిత్రుల పరిహాసములకును, వైరుల వ్యాఖ్యానములకును ఎడ మీయకుండ వెనువెంటనే మన వాక్యములు మనము సరిచేసికొనవచ్చును. కావున నన్ని విధములను వ్రాఁతపనియె నాకుఁ గర్తవ్యముగఁ గానఁబడెను.

## ౩౨. పత్రికాస్థాపనము

“సత్యసంవర్ధని”ని ప్రచురింప వీరేశలింగముగారు మిత్రులును సమ్మతించిరి కాన, ఆ పత్రికాస్థాపనవిషయమై వలయు ప్రయత్నములు నేనంతట చేసితిని. “వివేకవర్ధనీ”పత్రికకు వెనుకటివ్యవహారకర్త యగు శ్రీరాములుగారితో నేను జూలై ౨-వ తేదీని కలసి మాటాడఁగా, పత్రికను నడుపురీతిని నా కాయన చెప్పి, తానే యాపని చేసిపెట్టెద ననెను. పత్రికను టపాలో నంపువిషయమై మాటాడుట కానాఁడె నేను టపాలాకచ్చేరికిఁ బోయితిని. సబుకలెక్టరునొద్ద కేగి, నేను “సత్యసంవర్ధనీ” పత్రికాప్రచురణకర్త నని కాగితముమీఁద సంతకముచేసి వచ్చితిని.

## ౩౯. పత్రికాస్థాపనము

సత్యసంవర్ధనిని తమపత్రికఁగా ప్రార్థనసమాజము అంగీకరించుట యావశ్యకము గాన, ౫-వ తేదీని సమాజప్రత్యేకసభ నొకటిఁ గూర్చితిమి. సమాజపునరుద్ధరణము జరిగినపిదప, పత్రికాప్రచురణమున కందఱు నొప్పుకొనిరి. ఎవరికిఁ దోఁచినచందాలు వారు వేసిరి. అంతట సమాజము చేసికొనిన తీర్మానములచొప్పున, పత్రికానిర్వాహణకార్యము నాలో నైదుగురు సభ్యుల కొప్పగింపఁబడెను. వీరిలో శ్రీరాములుగారు పత్రికావిలేఖకులు నిర్వాహకులును; నేను ప్రచురణకర్తను, కోశాధికారిని. సాంబశివరావు పత్రికను జందాదారుల కందఁజేయుకార్యము నిర్వహించువాఁడు.

నే నిట్లు పత్రికాప్రచురణమును గుఱించి ప్రయత్నించుచుండఁగా, 17-వ తేదీని వీరేశలింగముగారు నాతో మాటాడుచు, జనసామాన్యమున కుద్దేశింపఁబడిన యాపత్రికలో తెలుఁగు వ్యాసములే యుండవలె నని చెప్పిరి. ఇంతియ కాదు. ప్రార్థనసమాజము పేరిట నీపత్రిక ప్రచుర మగుటయె యుక్తము కాదనిరి. నేను గారణ మడుగఁగా, సమాజసభ్యులలోఁ బలువురు విద్యార్థులె యగుటచేత, పత్రికయందు మంచివ్యాసము లుండవనియు, చేతఁగాని వ్రాఁతలవలన సమాజమునకును అధ్యక్షులగు తమకును నపకీర్తి యాపాదించు ననియు, కావున నా పేరిటనే పత్రిక వేయుట యుక్తమనియు పంతులుగారు చెప్పిరి!

ఇది నాకు సమంజసముగఁ గనఁబడలేదు. పత్రికాప్రకటనము, సమాజాదర్శములను బ్రకటించుటకే కాని, నా సొంతయభిప్రాయముల నెలకొల్పుటకుఁ గా దని నేను జెప్పివేసితిని. సత్యసంవర్ధనిని సమాజపత్రికగాఁ బ్రచురింపఁ గోరితి మేని, అందుఁ దమరచనలకు ప్రాముఖ్యము గలుగవలె నని యంతట పంతులుగా రనిరి. నే నందుకు

సమ్మతించితిని. ఎట్టకేలకు సత్యసంవర్ధనిని సమాజపత్రికగా పంతులుగా రంగీకరించి నన్ను పత్రికాసంపాదకునిగ నిర్ణయించిరి.

జూలై ౧౫ వ తేదీని పత్రిక మొదటిసంచిక వెలువడెను. దీనిలో, తెలుఁగున పంతులుగారును, ఇంగ్లీషున నేనును, విజ్ఞాపనము వ్రాసితిమి. 'అనుతాపము' అను వ్యాసమునకు నేనును, 'పుణ్యపాప మార్గములు' అనుదానికి పద్మనాభరాజుగారును రచయితలము. ఇవి గాక రెండు సంగ్రహవార్తలుమాత్రమే యాసంచికయందుఁ గలవు. మచ్చునకై యీ వ్యాసములలోని కొన్నిభాగము లిచట నుల్లేఖించు చున్నాను:—

(తెలుఁగు) విజ్ఞాపనము: "మన హిందూదేశమందు సమస్తమును మతముతో సంబంధించియున్నది. మతమునం దక్రమముగ ప్రవేశించిన దురాచారములను తొలఁగింప బ్రయత్నింపనిపక్షమున, మన దేశమునం దితరవిషయములయం దభివృద్ధి కలిగించుట సాధ్యము కాదు. మతమే సమస్తాభివృద్ధులకును మూలాధారము మతమే నీతి వృక్షమునకు కుదురు. కాఁబట్టి సామాన్యజనులయభివృద్ధికయి మత విషయములయిన సత్యములను, నీతిని, సద్వర్తనమును బోధించెడిపత్రిక యొక్కటి యత్యావశ్యకముయియున్నది. అట్టికొఱఁతను కొంతవఱకయినను తీర్పవలె నని యిక్కడి ప్రార్థనసమాజమువా రిప్పు డీచిన్న పత్రికను ప్రచురింపఁబూనుకొన్నారు."

అనుతాపము: "ప్రతిదినమును తాను జేసినయపరాధముల మనసునకుఁ దెచ్చుకొని, వానికై పరితపించుటచేత, ఎవరిదుర్గుణములు వారికిఁ దెలియును. లోకములో జనులకు సాధారణముగ తమ కీలోపము లున్నవని బాగుగ తెలియవు. ఒకవేళ తెలిసినను అవి యున్నవని

యెవరైనఁ జెప్పిన, అందునకు రోషపడియెదరు. అట్లుండ, ఆలోపముల నివారించుటకు వారి కెట్లు ఊహ పుట్టును? ఎట్లు సాధ్యమగును? పరితపించువాఁ డన్ననో, తన కీదుర్గుణశేషము లున్నవని గ్రహించి, వానిని విడనాడుటకు సర్వదా ప్రయత్నము చేయుచుండును. తన కీసుగుణములు పూర్ణముగా లేవని, సచ్చారిత్రుల నడవడి ననుసరించి, సకలకల్యాణగుణపరిపూర్ణుఁడగు ఈశ్వరుని జేర యత్నముఁ జేయుచుండును."

పుణ్యపాపమార్గములు:—"మొదటిదారి పాపమార్గము. లోకమందు పాప మాచరించుట బహు సులభము. దానివలన మొట్టమొదట ననేకఫలములు గనుపించును. శరీరాయాస మక్కఱలేకయే ప్రతిమనుజుఁడును పాపాయుధమువలన తాను వలయువస్తువు సాధింపవచ్చును. అయిన నెంతకాలము సాధింపఁగలఁడు? 'కలకాలపుదొంగ దొరకఁగలఁ డొకవేళన్' అనునట్లు వానిపాపములే వానికాళ్లకు బంధములై తగులుకొన సర్వవిధముల చెడి, యజ్ఞానాంధకారమగ్నుఁడై, తుద కెన్నరానిదురవస్థల కిల్లగు నరకగృహప్రవేశంబు చేయును."

సత్యసంవర్ధనీపత్రిక నే నిట్లు ప్రారంభించి, నెలనెలయును ప్రచురించితిని. ప్రథమోత్సాహమున సభ్యులలోఁ బలువురు పత్రికకు వ్రాసెద మని చేసినవాగ్దానములు చెల్లింపలేకపోయిరి. ఏవియో కొన్ని పంక్తులు గీకి, అవి ప్రచురింపుఁ డని కొందఱు కోరుచుండిరి. ప్రతినెలయును కార్యనిర్వాహకవర్గము కూడి, పత్రికలో ముద్రింపవలసిన వ్యాసములు నిర్ణయింపవలయును. అధికముగ నిట్టివ్రాఁతలు రాకుండుటవలన నందువానిలో నేవియో కొన్ని వారు పత్రికలో వేయ నిశ్చయించుచుండువారు. రానురాను, సభ్యులు సమావేశమగు

టయె దుర్లభ మయ్యెను. ఒకటి రెండు నెలలైనపిమ్మట, వీరేశలింగముగారు నాతో పత్రికనుగుఱించి మాటాడుచు, ఒకసంచికలో వేయుటకు కార్యనిర్వాహక సంఘమువా రేర్పఱిచిన వ్యాసములలో నేను వ్రాసినది యొకటి తప్ప మిగిలిన వన్నియును పనికిమాలిన వగుట చేత, వానినిఁ ద్రోసివేసితి నని యాయన చెప్పెను! నెలనెలయును వ్యాసనిర్ణయమునకై నేను బడెడిశ్రమ నంత పంతులుగారికి నివేదించి, పత్రికమూలమున సమాజమిత్రుల యాదరణమును గోల్పోయి, వారి యనూయకుఁ బాల్పడుచుంటి నని నేను మొఱలిడితిని. పత్రికాధిపత్యము నేనె వహించితిని గాన, ఇతరులసాయ మున్నను లేకున్నను, మంచి వ్యాసములు వ్రాసి యిచ్చుచుండుట నావిధి యని పంతులు వక్కాణించెను. ఇంతియె కాదు. తమపనులు చేయ నసమర్థులగు కార్యనిర్వాహకసంఘమువారిసభలు సమకూర్చుటయందు కాలము వ్యర్థము చేయక నేనె వ్యాసనిర్ణయము చేయవచ్చు ననియు, ఈ పనిలో తమరు నాకు సాయము చేతు మనియు, పంతులుగారు చెప్పివేసిరి! పత్రికాసంపాదకత్వమునకు వలయుస్వాతంత్ర్య మందువలన నాకు సమకూరెను.

పత్రికలో నింగ్లీషువ్యాస లుండుటకు పంతులుగారు మొదట సమ్మతింపకున్నను, అవి లేనిచో నెవరికిని పత్రిక రుచింప దని నేను నొక్కి చెప్పుటచేత, దీనికిని వా రొప్పుకొనిరి. కావున మొదటినుండియు సత్యసంవర్ధనిలో తెలుఁగువ్యాసములతో పాటు ఇంగ్లీషురచనములును నుండుచువచ్చినవి. విద్యార్థి నగునే నాంగ్లభాషలో వ్యాసరచన చేయుటకు మొదట భయపడెడివాఁడను. మాకాంగ్లేయపండితులగు స్కాటుదొరగారు మిగుల దయతో నాయింగ్లీషువ్యాసములు దిద్దుచుండెడివారు. మొట్టమొదట నేను రెండుభాషలలోని

వ్యాసములును వ్రాయుచువచ్చినను, అంతకంత కింగ్లీషు వ్రాయుటకే నే నేర్పఱుచుకొనుటచేత, తెలుఁగువ్యాసములు మిత్రుఁడు కనకరాజు వ్రాయుచుండువాఁడు. పత్రికలో నింగ్లీషుభాగమునకు నేను బాధ్యత వహించుటచేత, వీరేశలింగముపంతులుగారు తెలుఁగు భాగము సరిచూచుచుండువారు. అందువలన కనకరాజు తాను వ్రాసిన తెలుఁగువ్యాసములు పంతులచే దిద్దించుకొనుచు, ఆయన కోపమునకు గుఱి యగుచుండెను! ఐన నందువలననె యతఁ డాంధ్రరచనయందు శీఘ్రముగ నిపుణుఁ డయ్యెను. ఇంగ్లీషురచనలో నే మునుఁగుచుఁ దేలుచు నుండుటచేత, తెలుఁగున బెదరుతీఱ వ్రాయుటకును, ముఖ్యముగ పంతులుగారి సుశిక్షఁ బడయుటకును, ఆ బాల్యదినములలో నా కంతగ నవకాశము లేకపోయెను.

మొదట "సత్యసంవర్ధని" యెనిమిదిపుటలతో నారంభమై, క్రమక్రమముగఁ బెరిఁగి, రెండవసంపుటమునుండియు పైపత్రముగల పదునాఱుపుటల పుస్తకరూపమున వెలువడుచుండెను. పత్రికయందు నీతి మత సంఘసంస్కరణ విషయములు బాహాటముగఁ జర్చింపఁబడుచుండెను. వీరేశలింగముగారి రచనములు, విద్యార్థిసభ్యులమగు మా వ్యాసములు నందుఁ బ్రచురమగుచువచ్చెను. మాయభిప్రాయము లిపుడు లిఖితరూపముఁ దాల్చుటచేత, మే మెక్కువ జాగరూకత నలవఱుచుకొంటిమి. పత్రికాపాఠకుల నోళ్ల కెక్కి, ప్రజలవ్యాఖ్యానములకు గుఱి యగుచుండుటచేత, మాకు ధైర్యసాహసాదులు పట్టుపడెను. ఇపుడు ప్రార్థనసమాజము, వారమున కొకమాఱు ప్రార్థనలు చేసికొనుటకుఁ గూడుచుండెడి వట్టి భక్తసమావేశము కాక, ఒకశాశ్వత సంస్థక్రింద నేర్పడెను. ఆ సమాజమువారి ప్రార్థనలు నుపన్యాసములు మున్నగు కార్యక్రమమంతయును బత్రికల కెక్కుచు, లోకుల వాద

ప్రతివాదసంభాషణములకు విషయమగుచుండెను! చెన్నపురిసమాజమును జూచి వచ్చిననేను, ఆసమాజపద్ధతులను ప్రణాళికలను గొన్నిటిని చటికిఁ గొనివచ్చితిని. కొలఁదికాలములోనే "దానపుపెట్టె" యొకటి మందిరపుగోడకు వ్రేలాడుచుండెను! "ఆస్తికపుస్తకాలయము"న కంకురార్పణ జరిగెను. సమాజసభ్యులకు లింకను శాశ్వతమగు సంస్థ నొకటి స్థాపించుట కర్తవ్య మని మిత్రులము తలపోసితిమి. దీనినిగుఱించి ముందలిప్రకరణములలోఁ జెప్పెదను.

## 33. క్రొత్తకోడలు, క్లిష్టపరిస్థితులు

రాజమండ్రి యిన్నీసుపేటలోని మాసొంతస్థలములోఁ జిన్న పెంకుటిల్లుండెడిది. పెద్దయిల్లు కట్టుకొనువఱకు నందె కాలము గడపుద మని మా తలిదండ్రుల యభిప్రాయము. నేను దీని కంగీకరింపక, ఆ చిన్నయిల్లు తీయించివైచితిని. మాస్థలమున నొక తాటియాకులయిల్లు వేయించితిమి అందు మేము చదువుకొనుచుండువారము. పెద్దపెంకుటిల్లు వేయుటకు నిశ్చయించి, పునాదులవఱకుఁ గట్టించితిమి. కాని, యాసమయముననే మాస్వగ్రామమున తనయన్నలతోఁ గలసి మాతండ్రి యొకపెంకుటిల్లు కట్టించుచుండుటచేతను, రాజమండ్రిలో ముందు వేయఁబడనున్న రెయిలుమార్గము మావీథినుండియె పోవచ్చునని వదంతి కలుగుటచేతను, మారాజమండ్రి యింటిపని యంతటితో నిలిచిపోయెను.

కేలంగిలోని క్రొత్తయింటికిని, మాచదువులకును, కుటుంబపోషణమునకును చాల సొమ్ము వ్యయమై, అప్పు పెరిఁగెను. ఇట్టి కష్టపరిస్థితులందు కుటుంబవ్యయము తగ్గింప నెంచి, రాజమండ్రిలోని మాసొంతకుటీరములోనికి ౧౮౯౦ అక్టోబరులోఁ గాపురమునకు వెడలితిమి. ఇంటి

# 33. క్రొత్తకోడలు, క్లిష్టపరిస్థితులు

చుట్టును విశాలస్థల ముండుటచేతను, స్వతంత్రత ననుభవించుటవలనను, కుటీరనివాసమె మాకు సుఖప్రదముగ నుండెను. కాని, అంతకంతకు మా కిచ్చటి కష్టములు బోధపడెను. ముందుండెడి యెత్తగు పునాదుల మీఁద వేసినచో, ఈశాలయె యెంతో సౌఖ్యదాయకముగ నుండెడిది. అట్లుగాక వెనుకభాగమందలి పల్లపునేల నుండుటచేత, వర్ష కాలమున నిల్లు చెమ్మగిల్లుచుండెను. ఆయింట వంట చేసికొనుట కొకగది మాత్రమే ప్రత్యేకింపఁబడియుండుటచేత, పిల్లలము చదువుకొనుటకుఁ గాని, వచ్చిన బంధుమిత్రులు మసలుటకుఁ గాని, వసతి లేకుండెను.

మాతల్లి సీతమ్మ, తన జన్మస్థలమగు వేలివెన్నులో, సమవయస్సు గల అచ్చమ్మ యను బంధువులబాలికతోఁ గలసి బాల్యమున నాడుకొనుచుండెడిది. వీరిరువురు బొమ్మలపెండ్లిండ్లలో వియ్యపురాండ్రై వినోదించుచుండువారు. సీతమ్మ సామాన్యముగ పెండ్లికొడుకుతల్లియు, అచ్చమ్మ పెండ్లికూఁతునితల్లియు నగుచుండిరి. ఇపుడు వా రిరువురు పెద్దవారై పిల్లలతల్లు లయిరి. నేను సీతమ్మ పెద్దకుమారుఁడను. విద్యాభ్యాసకాలమున నాకు వివాహసంబంధము లనేకములు వచ్చినను, మాతల్లి, చిన్ననాఁటి చెలికత్తెతోనే వియ్య మంది, ఆమె పెద్దకూఁతురు రత్నమ్మను తన పెద్దకుమారునికిఁ జేసికొనఁగోరెను. అంత నాయిరువురుపిల్లలకును, వారియొక్కయు వారితల్లులయొక్కయు జన్మస్థలమును, చిన్ననాఁటి యాటపాటలకుఁ దావలమును నగు వేలివెన్నులో, ౧౮౮౪ వ సంవత్సరము వేసవిని వివాహమయ్యెను.

౧౮౮౫ వ సంవత్సరమునందు, మామామగారగు వెలిచేటి బుచ్చిరామయ్యగారు, తమపిల్లల చదువునిమిత్తము స్వగ్రామమగు కట్టుంగ విడిచి, మావలెనే రాజమంద్రి కాపురము వచ్చిరి. ఆయన యేకపుత్రు

డగు వేంకటరత్నము ఇన్నీసుపేటపాఠశాలలోఁ జేరి చదువుచుండెను. పుత్రికలలో నీడు వచ్చిన పెద్దకొమార్తె గాక, తక్కినయిద్దఱును బాలికాపాఠశాలలో నిపుడు చదువుచుండిరి. సంబంధబాంధవ్యము గలిసిన యీరెండుకుటుంబముల వారును, ఇపు డేకపట్టణవాస్తవ్యులై, ఒకరి స్థితిగతులు, గుణగణములు నొకరు బాగుగ గ్రహించి, స్నేహవిరోధములు లేని తటస్థభావమున మెలంగుచుండిరి.

నేను చెన్నపురినుండి యింటికి వచ్చిన కొలఁది దినములకే నాభార్య కాపురమునకు వచ్చెను. వసియించుటకు విశాలమగు గృహమును, వాడుకొనుటకుఁ బుష్కలముగ ధనమును లేని క్లిష్టపరిస్థితులలో, క్రొత్తకోడలికాపురము కష్టతరముగనె యుండును. పదుమూఁడేండ్లు నిండని యీవధువుకోమలహృదయము నిపుడు గాకుచేసినది, పరిస్థితులవ్యత్యయము గాక, పతి విపరీతసంస్కరణాభిమానకథనమె! ఇప్పటికంటె నాకాలమున విద్యావంతుఁడగు భర్తకును విద్యావిహీన యగు భార్యకును గల యంతర మధికముగ నుండెను. తనపతి జనసమ్మతము గాని సంస్కరణాభిరతుఁ డనియు, సంఘబహిష్కృతుఁడైన వీరేశలింగముపంతుల ప్రియశిష్యుఁ డనియు నందఱు చెప్పుకొనునపుడు, పూర్వమె బాలసతి కలజడి గలుగుచుండెడిది. వెనుక వీనుల వినినదానికంటె నిపుడు కనులఁ గాంచిన విశేషములు మిగుల కష్టముగనుండెను! ఆతఁడు విపరీతమతసాంఘికాదర్శప్రియుఁ డగుటయె కాక, ఏపాప మెఱుంగని యీపడఁతికి సంకరధర్మములు బోధించి, వానిని విశ్వసింపుమని నిర్బంధించుచున్నాఁడు! పాప మాబాలిక యేమి చేయఁగలదు? పూర్వాచారపరులగు పెద్దలమార్గ మవలంబింపవలయునా? ప్రాచీన సంప్రదాయవిరోధియగు పతియడుగుజాడల నడువవలయునా?

# 33. క్రొత్తకోడలు, క్లిష్టపరిస్థితులు

ఇపుడు నా సంస్కరణాభిమానము, వేరుదన్ని మొగ్గతొడిగిన పూలమొక్కయై, సంస్కారప్రియులకు నయనాకర్షకమైనను, ప్రశాంత జీవితము గడపఁగోరు పూర్వాచారపరులగు జననీజనకులకుఁ గంటక వృక్షమయ్యెను! నా సావాసులు కనకరాజు మృత్యుంజయరావు మున్నగువారల సమాచారము తలిదండ్రులు మొదలగువారు చెప్పుకొనునపుడు వినిన నాభార్య, సంస్కారదేవత మూర్తీభవించినట్లు వారిపుడు నన్నుఁ జూడ మాయింటికి వచ్చునపుడు, పతివిపరీతభావములకు వీరు పట్టుకొమ్మగదా యని భయభ్రాంత యగుచుండెను! నా "సత్యసంవర్థనీ"పత్రికాప్రచురణము కుటుంబపుసట్టును రచ్చఁబెట్టెను. అనుదినమును వీథిని పతిపే రెలుగెత్తి యఱచి, జాబులు పత్రికలును దెచ్చి యిచ్చు తపాలజవానుకేక, పెనిమిటి సంఘసంస్కర్త యని లోకమునకు సాటెడివానిశబ్దమై, తనగుండియ కదరు గలిపించె నని క్రొత్త కోడలిమొఱ! "సత్యసంవర్థని"యందలి వ్రాఁతలు నింటఁ జిన్నలు పెద్దలును జదువునపు డెల్ల, భర్త మాయాసంస్కరణకూపమున మఱింతఁ గూరుకొనిపోవుచున్నాఁడని తలంచి యాబాలిక భీతిల్లుచుండును!

ఇంక, తీవ్రసంఘసంస్కరణాభిమానమునఁ దేజరిల్లు పతిని గూర్చి యొకింతఁ బ్రస్తావింపవలెను. ఆతనిసంస్కరణాభినివేశ మిల్లు కట్టుకొని వసియింప వసుమతి నవకాశము లేనటు లుండెను! గృహస్థాశ్రమారంభదశలో తనసతికి సంస్కరణసుముఖత చేకూరుపట్ల నెట్టిప్రతిబంధము నుండఁగూడ దని యాతనిపట్టు! మొదలు, పూర్వాచారపరాయణత్వము ప్రబలియుండు సమష్టికుటుంబజీవితమే యతని కనిష్టముగ నుండెను. ప్రథమమునుండియు తనభార్య విద్యావికాసము

గాంచి, పరిపూర్ణ సంస్కరణామోదినియై విలసిల్లవలె నని యాతని వాంఛ!

ఇప్పుడు, గృహస్థాశ్రమప్రథమరంగముననే, తనసతి విద్యారసికతత్వసంస్కారవిముఖత్వములు, ఆతనినయనములకు ప్రదర్శితములయ్యెను! ముందైన నాయువిదకు విద్యాసంస్కరణామోదము రుచించు నవకాశము చేకూరునట్లు దోఁపకుండెను. ఆతఁడు నెమ్మదియు నిదానమునుగల కార్యవాది యై యుండెనేని, ప్రకృతమున సతికి విద్యాబోధనము చేయుటతోనె సంతృప్తి నొంది, తాను స్వతంత్రుఁడై తనపరిస్థితులు సుముఖమైనపుడు, సంస్కరణాంకురమా మెహృదయమున నాటఁజూచియుండును. కాని, యాతనిసంస్కరణావేశము మె ల్లెక్కకయె మేడఁ జేరఁగోరెను! ఆతనివేగిరపాటు, నాందీముఖముననే, నాటకాంత్యరంగసందర్శనముఁ జేయఁగోరెను! భర్తకు భార్య యర్ధాంగియు సహధర్మచారిణియును గావున, సంస్కరణమే జీవితవ్రతమైన పతికి, సంసారయాత్రయందు సతి చేయూఁతయై నిలువ నిశ్చయింపవలయును; లేదా, గృహస్థాశ్రమారంభమే, వీతదాశ్రమవిచ్ఛేదకదశాప్రారంభ మని యాగృహిణి పరిగణింపవలయును!

ఇట్టి కఠినసమస్య నెదుర్కొన నెవరు వెఱవరు? కాని, యెంతటిచిక్కునైనను నైసర్గికసౌశీల్యప్రభావమున స్త్రీ యవలీలగ విడఁదీయ నేర్చును. పతి కభిమతమగు సంస్కరణమార్గము తనకును సమ్మత మని యా కలికి పలికి, తనసౌజన్యకార్యసాధకనై పుణ్యములను వ్యక్తీకరించెను!

నేర్పుటకంటె మాన్పుట కష్టతరము. ఆకాలమున పామరజనులు, విద్యాధికులకును, సంఘసంస్కారులకును, ఆరోపింపని యవగుణ మేది

యును లేదు! విద్యార్థులు నీతినియమములు పాటింపనివారు! సంస్కారులకు దేవుఁడు దయ్యము నను వివక్షలు లేవు! వీరలంగో న్నగేసరుఁడగు వీరేశలింగముపంతులు పరమనాస్తికవాది, సర్వసంకరములకును మూలకందము! ఇట్టిదురూహాలు సతిమనసునుండి పాఱఁద్రోలి, విద్యావంతులు సంస్కారప్రియులును సుగుణసంపత్తికి దూరులు గారనియు, మీఁదుమిక్కిలి వారు స్వార్థరహితజీవితమునకు నాదర్శప్రాయు లనియు బోధించుట నా కిపుడు ప్రథమగార్హస్థ్యధర్మ మయ్యెను. కాని, ఆనాఁటి నా యసంపూర్ణబోధనలకంటె ననుభవపూర్వకమగు స్వయంకృషిచేతనే యాపాలఁతి నానాఁట తెలివి గలిగి, పిమ్మట "జనానాపత్రిక"లోఁ బ్రచురమైన "శారద" కథానాయికవలె, పతి కాశ్చర్యము గొలిపెడి సువిద్యాప్రబోధముఁ గాంచియుండెను!

## ౩౯. పెద్ద ప లు కు లు!

ఒకనాఁడు నా పూర్వసహపాఠి యొకఁడు నాయొద్దకు వచ్చి, తన్ను నీచకులస్థుఁ డని కళాశాలలోని మిత్రులు గేలి చేయుచుండిరని చెప్పి, విచారము నొందెను. ఇతఁడు వేశ్యకులజుఁడు. విశాలభావము లలవఱుచుకొనవలసిన విద్యార్థులు, గుణసంపన్నుఁడగు నీతనిని నిరసించుట శోచనీయ మని నేను కళాశాలలో మిత్రులతోఁ బలికితిని. వారు నామాట లొప్పుకొట్టిరే కాని, మనస్సు మార్చుకొనినట్లు గానఁబడలేదు!

పట్టపరీక్షతరగతులలో మా కొక పంచమజాతిక్రైస్తవుఁడు సహపాఠిగ నుండెడివాఁడు. ఒకనాఁ డాతఁడు నాబల్లయొద్దకు వచ్చి, తా నచటఁ గూర్చుండవచ్చునా యని యడిగెను. విద్యార్థి తరి

గతిలో నెచటనైనఁ గూర్చుండవచ్చును గాన, నే నాతనిప్రశ్న కాశ్చర్య మందితిని. కాని, హీనజాతివాఁడ నని మిత్రులు తన్ను హేయముగఁ జూచి, తమదరిఁ జేరనీయకుండి రని యతనివలన విని, నా కమితమగు కోపము వచ్చెను. తరగతిలో ననేకులు జాతిభేదములు పాటింప మని చెప్పుకొను ప్రార్థనసామాజికులు. వీ రిట్లు సంకుచితభావములతో నీతనిపట్ల మెలఁగుట నా కాశ్చర్యవిషాదములు గలిగించెను. తెలివిగలవాఁడును, తెలుఁగులో నందఱికంటె మిన్నయును నగునీసహచరు నిట్లు అవజ్ఞ చేయుట తగదని నేను రెండుమూఁడు మాఱులు స్నేహితులతో నొక్కి చెప్పఁగా, వారొకరిమొగ మొకరు చూచుచుండిరే కాని, తమనడవడికి విచారపడలేదు! అందువలన నావిషాదము మఱింత హెచ్చెను. ఎక్కువచనవుగల యొకమిత్రుఁ డంత మెల్లగ నాతో, “ నీకుఁగల సోదరభావము మాకును లేకపోలేదు. కాని, గోమాంసభక్షకుఁడైన యాతఁడు చెంతఁ గూర్చుండు నపుడు మేమచట నిలువఁజాలము! ” అని పలికెను. ఈతని మాటలలోఁ గొంత సత్యము లేకపోలేదు గాని, తమతో సమానునిగఁ జూచెడి నలుగురమధ్య మెలఁగ నవకాశ మున్నప్పుడే యట్టియువకుఁడు ఎక్కువ శుచిశుభ్రములు గలిగి, ఎక్కువజాగ్రతతో సంచరింపఁగలఁ డని నేను నమ్మి, పంచమసహోధ్యాయుని ప్రేమించువాఁడను.

కళాశాలయొద్దనుండు కొట్లలో నే నెఱిఁగిన యొక పూఁటకూళ్లముసలమ్మను చుట్టుపట్టుల నుండు విద్యార్థులు, “ జలపాత ” మని పేరు పెట్టి, వేధించుచుండి రని నాకు వినవచ్చెను! విద్యాధికులును, ప్రార్థనసామాజికులును గూడ నిట్లు చేయుటకు నే నెంతయు వగచితిని. ఇట్టిసహోధ్యాయులఁ గొందఱి నొకచోటికి నేను బిలిచి, విద్యాధికు లగువారు తమబాధ్యతలను గుర్తింపక, దిక్కులేని పేద

## ౩౮. పెద్దపలుకులు!

పూఁటుపాటిదానిని బరిహసించుట సిగ్గులచేటని నొక్కిచెప్పితిని. వీరి మధ్యనుండు సాంబశివరా వంత నందుకొని, నే నందఱిలోను మొన గాఁడ ననుకొని మిడిసిపడుచుంటి ననియు, ప్రార్థనసమాజమునకు నిరంకుశాధికారి నని భావించుకొనుచుంటి ననియు, తానుమాత్రము నన్నావంతయు లెక్కసేయ ననియుఁ జెప్పి వెడలిపోయెను! ఇది జరిగిన యొకటిరెండు మాసములవఱకును నాతో నతఁడు మాటాడక, సదా మౌనమున నుండువాఁడు! చనవరియు సరసుఁడునునగు సాంబశివరావే యిట్లు నాతో మాటాడకుండుటకు నేను వగచి, ఒకనాఁ డాతని బిలిచి, "జలపాత"సందర్భమున నే నాడిన నిష్ఠురోక్తులకు నన్ను మన్నింపు మంటిని. నాచెలికాఁ డంత పసిపాపవలె గోలుగోలున నేడ్చి, నామాటలకుఁ దా నేమియు తప్పుపట్టలే దనియును, తనజిహ్వ నరికట్టుటకే తా నీదీర్ఘమౌనవ్రతమువలంబించి ప్రవర్తనమున లాభ మందుచుంటి నని చెప్పెను! పిమ్మట మే మిరువురమును వెనుకటివలెనే, మనసుగలసిన నేస్తుల మైతిమి.

కాని, యెల్లరును సాంబశివరావు వంటి నిష్కాపట్యహృదయులు గారు. మితిమీఱిన గర్వము నహంభావమును ప్రేరించుటచేత నే నే నిట్లు పెద్దమాటలు చెప్పుచున్నా నని యెంచి, ప్రార్థనసామాజికులలోఁ బలువురు నన్ను లోలోన ద్వేషించిరి. దీనిపర్యవసానము, కొంతవఱకు, కళాశాలాంత్యదినములలో నాకుఁ గానఁబడెను.

## ౩౯. రంగనాయకులు నాయఁడు గారు.

నేను చెన్నపురి పోయి వచ్చినను, నా నేత్రములబాధ నివారణము గాలేదు. ఎక్కువసేపు చదివినను వ్రాసినను, కనులు మండుచుండును. "పెండ్లికి వెళ్లుచు పిల్లిని వెంటఁగొనిపోయిన" వానికివలె,

మద్రాసు పోయి వచ్చినప్పటినుండియు నాకు వ్రాఁతపని వెంటఁ బడెను! అందువలనఁ గనులమంటలు హెచ్చెను. ౪-౬-౯౧వ తేదీని నేను వీరేశలింగముపంతులుగారి యింటికిఁ బోయి, రాజ్యలక్ష్మమ్మగారు జబ్బుగ నుండి రని తెలిసి, ఆమెను జూచితిని. అపుడె శరీరము నెమ్మది పడుచుండెడి. యోయిల్లాలు కుశలప్రశ్నము చేయఁగా నా కనుల సమాచారము తెలిపితిని. దీని కామె విచారపడి, పెద్దచెరసాలలో వైద్యుఁ డు రంగనాయకులనాయుఁడుగారు కంటివైద్యములో మంచి సాధకులని పలికి, పంతులుగారిద్వారా వారి నెఱుకఁజేసికొని వారిసాయము పొందు మని నా కాలోచన చెప్పిరి.

ఆనెల ౧౭-వ తేదీని నేను పంతులుగారిని సందర్శించినపుడు, ఆయన తన "ఆంధ్రకవుల చరిత్రము"ను పూర్తిచేయుటకై యాఱు నెలలు సెలవుతీసికొని చెన్నపురిలో నుందు మని చెప్పిరి. ఆసందర్భమున నాకనులసంగతి వారితోఁ బ్రస్తావించి, రంగనాయకులు నాయఁడు గారియొద్దకు న న్నొకమాఱు కొనిపోం డని వారిని గోరితిని. అందుకు వారు సమ్మతించిరి.

౨౧-వ జూలై తేదీని పంతులుగారు నేనును కారాగారమునొద్దకుఁ బోయితిమి. అపుడు నాయఁడుగారు రోగులకు మందుచీట్లిచ్చుచుండిరి. కుర్చీ కొకప్రక్క నిలిచి, ఖైదీ యొకఁడు విసనకఱ్ఱ వేయుచుండెను. నాయఁడుగారు స్థూలకాయులును, మంచి యెడ్డుపొడుగు గలవారును. మందహాసము చేయునపుడు, సహజసౌజన్యము వారి వదనకమలము నుండి వెల్లివిరిసి నలుదెసలను బ్రసరించునటు లుండెను. ఆయన పంతులుగారిని ప్రేమపూర్వకముగ సన్మానించెను. కుశలప్రశ్నము లైనపిమ్మట, వీరేశలింగముగారు నన్ను గుఱించి నాయుఁడుగారితోఁ జెప్పిరి. నాకనులు చూచి, నేను కొంతకాలము చదువు విరమించుట

# ౩౫. రంగనాయకులు నాయుఁడుగారు

శ్రేయ మని వైద్యుఁడు ఏకాగ్రణించెను. అప్పటినుండియు నేను నాయుఁడుగారిని జూచుచు, వారొసఁగు మందులు సేవించుచు,కొంచె ముకొంచెముగ లాభము నొందుచుంటిని.

కొంతకాలమునకు రంగనాయకులు నాయుఁడుగారిని నగరవైద్యశాలలోనికి మార్చఁగా, పట్టణమధ్యమునకు వారు కాపురము వచ్చిరి. సహజసౌజన్యమహిమమున నాయుఁడుగారు శీఘ్రకాలములోనే జనానుమోదము నొందిన వైద్యు లను కీర్తిఁ గాంచిరి. దయాస్వభావు లగు వారికి ధర్మసంస్థలం దమితప్రీతి. ఆయన సద్భావయుతుఁడగు సంస్కరణాభిమాని. నాయుఁడుగారును, వారిధర్మపత్ని జానకీబాయిగారును, సహృదయులు; జీసను మహనీయునియం దధిక విశ్వాసము గలవారలును. పెరిఁగినది సంసారబాహ్యతె నొదలఁ గలవారగుటచేత వారు బహిరంగముగ క్రైస్తవులు గాకపోయినను, సామాన్యక్రైస్తవులకంటె నెన్నిమడుంగులో ఈశ్వరభక్తి సంపన్నులును, సదాచారనిష్ఠాసమన్వితులును. పలుమాఱు తమయింటికిఁ బోయి తమతో సంభాషించుచుండు నామీఁద, ఆదంపతు లిరువురు నవ్యాజసోదరభావము గలిగియుండిరి. నాయందలి వత్సలతచేత నాయుఁడుగారు నా బంధుమిత్రులకును దయచూపి, ఉచితవైద్యసాహాయ్య మొనరించుచుండువారు. ఆదినములలో నేను పెద్దబజారునకు వెళ్లి వచ్చునపు డెల్ల, పెద్దరస్తాప్రక్క నొకబీదముసలిది బిచ్చ మడుగుచుండెడిది. అంతకంతకు, వార్ధక్యము ముదిరి, దృష్టి తప్పి, అది కూర్చుండుచోటనుండి కదలలేకపోయెడిది! దానికి వేవేగమే మతి కూడ తప్పిపోవుచుండెను. తూష్ణీంభావులగు జనుల మధ్యమం దీముసలిదాని దైన్యము నిస్సహాయతయును జూచినపు డెల్ల, నాగుండె నీరగుచుండెడిది. ఈస్త్రీ సమాచార మొకటి రెండుమాఱులు నాయుఁడు

గారితో నేను ప్రస్తావింపఁగా, దురవస్థ నుండు నిట్టివారిసంరక్షణ కే ధర్మసంస్థయు నేర్పడక యుండుట కాయన వగచి, తా నే సాయమైనఁ జేతు నని చెప్పెను. జను లందఱివలెనే నాయుఁడుగా రును దిక్కుమాలిన యీముసలిదాని సంగతి మఱచిపోయి రని నేను దలంచితిని.

ఒకనాఁడు నేను రంగనాయకులునాయుఁడుగారిని జూచి వచ్చుటకు వైద్యాలయమున కేగితిని. ఆయన నాతో సంభాషించుచు, కొంత సేపటికి నా కొకచిత్రము చూపింతు నని చెప్పి, వైద్యశాలవెనుక నున్న యొక మాఱుమూలకు నన్నుఁ గొనిపోయెను. నాయుఁడుగా రొసంగిన తెల్లనివలువ దాల్చి, ఆబీదగ్రుడ్డిముసలిది, పెండ్లికూఁతువలె నచటఁ గులుకుచుఁ గూర్చుండెను! వార్ధక్య దారిద్ర్యములు తప్ప వేఱు వ్యాధి లేని యీముదుసలి, నాయుఁడుగారి దయచే వైద్యాలయమున రోగిగఁ జేరి, సువార మారగించుచుండెను! దిక్కు లేక బాట ప్రక్క గాసిల్లుగ్రుడ్డిది, వైద్యాలయమందలి సౌకర్యములచే నిపుడు నునుపెక్కి, తేటమొగమున నుండుట చూచి, మాయిరువురకును గనుల నీరు గ్రమ్మెను. నాయుఁడుగారిమాట వినఁబడి, వృద్ధురాలు దండముపెట్టి, ఆయనను జేరువకుఁ బిలిచి, ఏదో మాటాడెను. ఆయన చిఱునవ్వు నవ్వుచు, "దీనికి నల్లమందు అలవాటు. కాని, అది వైద్యశాలలో నెవరికిని వాడము. దానికి మాఱుగ నేదో సరది యిచ్చెదను లెండి!" అని నాతో ననెను. నాయుఁడుగారిని దలంచుకొనినపుడు "తల్లిదండ్రుల భంగి ధర్మవత్సలతను, దీనులఁ గావఁ జింతించువాఁడు" అను ప్రహ్లాదుని గుఱించిన కవివచనము నాకు స్ఫురణకు వచ్చుచుండును.

## ౩౬. సత్యసంవర్ధని

ఏ వార్తాపత్రికకైన నెలకొల్పుటకుఁ బూర్వమే సంస్థాపకునికి స్వేచ్ఛ యుండును గాని, పిమ్మట కాదు. అది యారంభమైనప్పటినుండియు క్రమము తప్పక నడచుచుండవలసినదే. ప్రతికాధిపతి పట్టి కీలుబొమ్మవలెను, గడియారపుయంత్రమువలెను, విసుగు విరామమును లేక పని చేయవలె ననియే పాఠకజనులయుద్దేశము! సత్యసంవర్ధని మాసమున కొకతూరి ప్రచురమగు చిన్నపత్రిక యైనను, చేయవలసినపనిమాత్ర మెక్కువగ నుండెను. సాయము చేతునని మొదట వాగ్దానముచేసిన సమాజమిత్రులు, ఏదో యొకమిష పెట్టి, సాకు చెప్పి, తప్పించుకొనుచువచ్చిరి. వ్యాసరచన తమ కభ్యాసము లేదని కొందఱును, తమరచనములు ప్రచురము కాలేదని కొందఱును, వానియందు మార్పులు చేసి రని కొందఱును, మొఱపెట్టి, యీవ్యాజమునఁ దమ వాగ్దానములను తుదముట్టించుచువచ్చిరి! వీరేశలింగము పంతులు కనకరాజుగార్లు ప్రతినెలయును పత్రికకు వ్రాయుచు నేయుండిరి. పెద్దవారగు పంతులుగారికిఁ గాని, పరీక్షకుఁ జదువు కనకరాజునకుఁ గాని, పత్రికను గూర్చిన కనులకుఁ గానఁబడని యెన్నియో చిన్నపను లప్పగించుట యనుచితముగదా. కావున మిగిలిన వ్యాసములువ్రాసి, చిత్తులు దిద్ది, పత్రికను ముద్రింపించి, చందాదారులతో నుత్తరప్రత్యుత్తరములు నేనే జరుపవలసివచ్చెను. అందువలన నా కనులబాధ విస్తరిల్లెను.

పూర్వాచారపరులగు మా కళాశాలాధ్యాపకు లొకరు, పాపఁపుప్రార్థనసమాజములోఁ జేరినకారణమున నాకనులు పోవుచుండె నని పలికిరి! సత్యసంవర్ధనీకార్యభారముననే నా నేత్రదృష్టి ధ్వంస మగు

చుండె నని నుడివియుండినచో, ఆయనమాటలు సత్యవాక్యములుగ నుండెడివి. వ్రాతపని యెక్కువ యై నాకనులకు మాంద్యము గలుగు చుండెను. ఏతత్కారణముననే నాదేహారోగ్యమును జెడుచుండె నని రంగనాయకులునాయుఁడుగారు పలికి, కొంతకాలము నేను పరిపూర్ణవిశ్రాంతి నొందవలె నని హితవు చెప్పిరి. నే నందువలన సహపాఠులు చదువుచుండఁగ విని యెటులో కళాశాలలోని నిత్యవిధులు నిర్వహించుచుంటిని గాని, పత్రికపని యట్లు జరుగదయ్యెను. చెన్నపురిలో పరిచితులైన శ్రీరఘుపతి వెంకటరత్నమునాయుఁడు గారి సాయము కోరఁగా, వారు రెండువ్యాసములు వ్రాసిరి. ఇట్లు నేను ౧౮౯౧ అగష్టుమాసములో వ్రాసిన "అసహనము"నకు వారు అక్టోబరు లోను, నేను నవంబరులో వ్రాసిన " ప్రేమక్షమలు " అనుదానికి వారు డిశంబరులోను అనుబంధవ్యాసములు వ్రాసి పంపిరి. ఈయిరువురు రచయితలవ్యాసములకును చాల యంతరము గలదు. నావ్యాసములు భావమునను భాషావిషయమునను మిగులఁ గొఱవడియుండెను. నాయుఁడుగారివ్యాసము లన్ననో, విశాలభావములతోను విశిష్టభాషా నైపుణ్యముతోను విరాజిల్లుచుండెను.

వ్యాసమునకు వ్యాసమునకును, సంచికకు సంచికకును, ఇట్టి వ్యత్యాసము లుండుట సత్యసంవర్ధనికి సంప్రదాయ మయ్యెను! వెనుకటిప్రకరణములలో నొకదానియందు, మొదటిసంచికలోని వ్యాసభాగములు మచ్చునకుఁ జూపఁబడినవి. ప్రతిసంచికలోను ఆంగ్లమున నొకవ్యాసమును, తెలుఁగున రెండు మూఁడును నుండెడివి. అందుచేత నింగ్లీషువ్యాసములలోకంటె నాంధ్రవ్యాసములందే యిట్టితారతమ్యములు స్ఫుటముగఁ గానఁబడియెడివి. విఖ్యాతరచయితలగు వీరేశలింగముగారి వ్యాసరాజములకును, నాబోటి విద్యార్థి ప్రయాసమునఁ

జెక్కినవానికిని గలభేదములు, కనులు గలవారి కెవరికి గోచరింపవు? రెండవసంచికలో పంతులుగారు "ఈశ్వరచంద్రవిద్యాసాగరు" లను గూర్చియు, నేను "పరోపకారము"నుగుఱించియు వ్రాసితిమి. మూఁడవ సంచికయందు పంతులుగారి "సౌదామినిరాయి" యు, నావిరచిత మగు "సత్యము"ను గానవచ్చెను. ఇవిగాక, ఆసంపుటమున నింక రెండుమాఱులే తెలుఁగువ్యాసములు నేను వ్రాసితిని. అవి ౫ వ సంచిక యందలి "శరత్కాలము", ౭ వ సంచికలోని "మిత్రత్వము"ను. వీనియన్నిటిని బరిశీలించినచో, నే నెట్లు ఇంగ్లీషువ్యాసములయొరవడిని గైకొని, భావమునసే కాక, భాషావిషయమునఁగూడ, ఆంగ్లసంప్రదాయముల ననుకరించుచుంటినో తెలియఁగలదు. 'మీఁగాళ్ల వాఁపు మొగమే తెలుపు' ననునట్లుగ, నావ్యాసముల మొదటివాక్యములే వాని యన్యభాషాసంప్రదాయానుసరణమును వెల్లడించుచున్నవి!

ఏదో యొకయింగ్లీషుమాతృకను గైకొనియో, కల్పన చేసికొనియో, ఆంగ్లభావములను, ఆభాషాసంప్రదాయముల ననుసరించి యాంధ్రవ్యాసము లల్లుటకంటె, తోఁచినవిషయము చేకొని, యిచ్చవచ్చినచొప్పున తెలుఁగు వ్రాసియుంటినచో, నా కలము బాగుగ సాగిపోయెడిది. ౪ వ సంచికలో "సత్యవాది" పేరు పెట్టిన జాబు నే వ్రాసినదియే. అది పంచమజాతిసమస్యను గుఱించినది. లేకరి గ్రామాంతరము పోయి తిరిగి వచ్చునపుడు, ఒకబ్రాహ్మణుని యింట భోజనము చేసెను. భోజనసమయమందు, ఇంటియజమానునికొఱ కెవరో వచ్చి వీథిలో నిలుచుండిరని తెలిసెను. వాఁడు చెప్పరానివాఁ డని గృహిణి పలికెను. అపుడా చెప్పరానివాని గుఱించి యజమానుఁడు లేకరితో ప్రస్తావించుచు, అతఁడు తమ పాలేరనియు, విశ్వసనీయుఁ డనియుఁ బలికెను. ఈసంభాషణసమయమునందు, ఇరువురు శ్రోతలు చెప్ప

రానివాఁ డనఁగఁ దెలియక తల్లడిల్లుచుండిరి. యజమానుని చిన్నకొమారితకు, ఆపదమున కర్థము తెలియకుండెను. భోజనసమయమునఁ జెప్పరానివానినిగుఱించి విప్పిచెప్పుట తప్పిద మని దానిని తండ్రి వారించెను. యజమానుని మాటలనుబట్టి యా చెప్పరానివాఁడు "చెప్పఁదగువాఁడే" యని లేకరి తలంచినను, తా నాయనతో వాదమునకు డీకొనినచో కృతఘ్నుఁడ నయ్యెద నను భయమునను, సందియము లొకటికి రెండై బాలిక రొదచేయు ననువెఱపునను, ఆతఁ డూరకుండెను! భూతదయాదిసుగుణముల కాకరమగు నగ్రకులమువారు హీనవర్ణజులను భోజనసమయమునఁ దలపెట్టనేకూడదా? పేరు పెట్టినను లేకున్నను, మనోనేత్రమునెదుటఁ గానిపించునది వ్యక్తియొక్కయాకార మేకదా! జాతికంటె నీతియే ప్రధాన మైనచో, గుణవంతుఁడైన యీచెప్పరానివాఁడు చెప్పఁదగువాఁడే కదా?—ఇదియే యీ లేఖాసారము.

"చిత్తము శివునిమీఁదను భక్తి చెప్పులమీఁదను" అను నట్లుగ, ఆకాలమున నా యాంధ్రవ్యాసరచనము విచిత్రద్వంద్వవిధానము ననుసరించుచుండెడిది! భావకల్పనము ఆంగ్లమునను, వాగ్విధానము ఆంధ్రమునను జరుగుచుండెడిది. కాని, యింగ్లీషులో వ్రాయునపుడు, నాకీకష్ట మెంతమాత్రమును గనిపించెడిదికాదు. ఆంగ్లసాహిత్యము ప్రథమమునుండియు నా యభిమానవిద్యా విషయము. మొదట కొంత భీతి జనించినను, నా గురువర్యులగు స్కాట్ దొరగారు నా వ్యాసములు దిద్దుచుండుటవలన, నా కచిరకాలముననే బెదరు తీఱి, ఆంగ్లమున బాహాటముగఁ గలము సాగుచువచ్చెను. పూర్వోదాహృతములగు నాంగ్లవ్యాసములు గాక నేను ప్రథమసంపుటమున, "మత మననేమి" "విశ్వాసహీనత" "పవిత్రప్రేమము," "బహుత్వమున నేకత్వము" "భక్తిమాధుర్యము" అను మకుటములుగల వ్యాసములు వ్రాసితిని.

వీనిలోఁ గల భావసామ్యతా రచనాసౌష్ఠవములలో వీసమంత యైన నాయాంగ్లవ్యాసములందుఁ గనుపడకుండెడిది!

అంతకంతకు నాకలమునకు సంపూర్ణ స్వేచ్ఛానువర్తనము వాంఛనీయ మయ్యెను. స్కాటుదొర సజ్జనులలో సజ్జనుఁడు. కాని, ఆయనకు విరోధములగు విషయములను గుఱించిన నా యింగ్లీషురచన లాయన సవరించునా? సైల్సు అను నొకక్రైస్తవుఁడు మాపత్రిక కొకయాంగ్లేయలేఖ వ్రాసెను. అది పత్రికలోఁ బ్రకటింపవలదా? ప్రకటించినచో, క్రైస్తవాభిప్రాయములు సమర్థించెడి యాజాబునకుఁ దగుప్రత్యుత్తర మీయవలదా? అంత నే నాలేఖను బ్రచురించి, దానికి సమాధానముగ నొక పెద్దయాంగ్లవ్యాసము వ్రాసి, యది నేనే దిద్దుకొని, ఆసంచికయందే ప్రకటించితిని. సంకుచితాదర్శయుతమగు క్రైస్తవమత మెన్నఁటికిని ఏకేశ్వరారాధన ప్రబోధకమగు బ్రాహ్మధర్మము కానేర దనియు, క్రైస్తవమతము సిద్ధాంతమున విగ్రహారాధనమును నిరసించుచున్నను ఆచరణమున నాదరించుచున్నదనియును, నిరాకారుఁడగు పరమాత్ముని ధ్యానించుటకు హిందువునకు పాంచభౌతిక విగ్రహము కావలసినట్లే క్రైస్తవునికి క్రీస్తునిజీవితము ఉపాధిగ నుపకరించుచున్నది గావున రెండు మతములవారును విగ్రహారాధకు లనియును, బ్రాహ్మమతస్థు లిట్టిబాహ్యసాధనముల నపేక్షింపక, పరమాత్ముని మనసున ప్రత్యక్షముగ ధ్యానింపనేర్తు రనియును, నేను సమాధానము చెప్పితిని. నావాదన, నావాక్కులు, నావైఖరియును, ప్రార్థనసామాజికులకు హృదయరంజకముగ నుండెను.

## 3౨. చెన్నపురిస్నేహితులు

నేను కొన్ని నెలలు పూర్తిగఁ జదువు విరమించినను, నాకనులు నెమ్మదిపడలేదు. మరల నేను చెన్నపురి పోయి కన్నులు పరీక్షింపించు

కొని, అనుమానరహితము చేసికొని వచ్చుట కర్తవ్య మని రంగనాయకులునాయఁడుగారు చెప్పి, తమతమ్ములును రాజధానీవైద్యకళాశాలలో నధ్యాపకులును నగు నారాయణస్వామినాయఁడుగారికి నన్ను గుఱించి వ్రాసిరి. నే నంత కళాశాలకు శీతకాలపుసెలవు లీయకమునుపే గుంటకల్లుమార్గమున రెయిలులో చెన్నపురికిఁ బోయితిని. వెంకటరత్నమునాయుఁడుగారి యేర్పాటుచొప్పున నేను బ్రాహ్మమందిరమున విడిసియుంటిని.

మరల నేత్రవైద్యాలయమున నాకనులు పరీక్షింపఁబడెను. ఈమా అచట వైద్యాధికారియగు కింగు అనుదొర నాకనులు పరీక్షించి, అం దేమియు దోషము లే దని చెప్పివేసెను. ముత్తెపుసరములవంటి చుక్కలు కనులనరములమీఁదనుండినను, వానివలన దృష్టిక్షేమియు విఘాతము గలుగదనియు, కనులమంటలు శరీరదౌర్బల్యమున జనించిన వగుటచేత, బలమునకు మందు పుచ్చుకొనవలెనని యును ఆయన నుడివెను. ఈయభిప్రాయమును వెంకటరత్నమునాయఁడుగారి మిత్రులగు వైద్యులు నంజుండరావుగారు స్థిరపఱిచిరి. కావున నేను కనులనుగుఱించి భీతిల్లక, క్రొత్తనేస్తులగు వెంకటరత్నమునాయఁడు, నారాయణస్వామినాయఁడుగార్ల సావాసమునఁ గొన్ని దినములు గడపితిని.

నారాయణస్వామినాయఁడుగారు తమయన్నవలెనే క్రైస్తవమతవిశ్వాసులే కాక, క్రైస్తవధర్మస్వీకారము చేసినవారును. ఆయన బ్లాక్‌టౌనులోఁ గాఁపుర ముండిరి. సోదరునివలెనే వీరును సహజసౌజన్యస్వభావులును, దయార్ద్రహృదయులును. అన్నదమ్ములకుఁ గల భేదములను నేను గనిపెట్టితిని. అన్న గంభీరస్వభావుఁడు, తమ్ముఁడు సరళశీలుఁడు. ఈ భేదము మతానుష్ఠానమునందును ప్రస్ఫుట

మయ్యెను. కుటుంబ సాంఘికపరిస్థితుల వ్యత్యయముచే రంగనాయకు లునాయఁడు మతాంతరుఁడు కానొల్లక యుండినను, నిజమతవిశ్వాస ములను దాఁపజాలకము లేక స్నేహితుల కెఱిఁగించి, హిందూసంఘ సంస్కరణపరాయణుల యెడల పరిపూర్ణసానుభూతి చూపెడి విశాల హృదయుఁడు. నారాయణస్వామినాయఁడు తన విశ్వాసముల చొప్పున నడచుకొనుట కావంతయు వెనుదీయకుండెడి ధైర్యవం తుఁడు. సంస్కరణాభిరతులయెడ నీయనకును అభిమాన ముండినను, తాను నమ్మిన సత్యక్రైస్తవదీక్ష నెల్లరు నేల గైకొనరని యాయన సంప్రశ్నము. క్రైస్తవమతావలంబనమే మానవులకు మోక్షప్రదాయక మని యాయన మనసార నమ్ముచుండువాఁడు. రంగనాయకులునాయఁడు నిరంతర మందహాసమున నొప్పెడి ప్రశాంతచేతస్కుఁడు. నారాయణ స్వామినాయఁడు కాపట్య మెఱుఁగని కోపస్వభావుఁడు. బాలకుని వలె సహృదయుఁడై, బాలకునివలెనే తాత్కాలి కాగ్రహాది భావో ద్రేకాదులకు వశవర్తి యగుచుండును. మనసు గలసిన మిత్రునికి వలసిన సాయము చేయుట కీయన వెనుదీయకుండువాఁడు. అన్న యన్ననో, తమ్మునకుఁ దీసిపోని నైసర్గికసౌజన్యమునఁ జెలంగుచుండియు, పరిస్థి తుల వైపరీత్యమునకుఁ జెక్కుచెదరని శీలసమత్వమునఁ జెన్నొందెడి శాంతమూర్తి. సుగుణోపేతులగు నీసోదరుల యరమరలు సవరించి, యిరువురికి సామరస్యము నొడఁగూర్ప నే నానాఁడు ప్రయ త్నించితిని.

చెన్నపురిలో నీమాఱు నాకు లభించిన మిత్రు లింకొకరు శ్రీ వెంకటరత్నము నాయఁడుగారు. ఈయన యప్పుడే యమ్. యే. పరీక్ష నిచ్చి, పచ్చప్పకళాశాలలో నుపాధ్యాయుఁడుగ నుండెను. సునిశిత బుద్ధివికాసమునకును, ఆంగ్లసారస్వతమున పాండిత్యగరిమమునకును,

అనర్గళవచోవిభవమునకును, చెన్నపురియందీయన మంచి కీర్తి గడించెను. నీతిమతవిషయములందసమానమగు ప్రజ్ఞయు పట్టుదలయు వీరికిఁ గలవు. ఇట్టి కీర్తిప్రతిభలతో నొప్పెడివారికి నిరువదియైదువత్సరముల లేఁబ్రాయముననే పత్నీవియోగము సంభవించెను. ఒక కొమార్తెమాత్రము గలదు. ఎందరెంతఁగ బోధించినను, పునర్వివాహము చేసికొనలేదు. బంగారమునకు వెలిగారమువలె, ఈమహాశయుని సచ్చారిత్రమునకును మతాభినివేశమునకును, ఆయనవైరాగ్యబుద్ధియు బ్రహ్మచర్యనిష్ఠయు మఱింత వన్నెఁ గొనివచ్చెను.

నే నీసమయమున నిట్టి సచ్ఛీలుఁడగు బ్రాహ్మధర్మవిశ్వాసుని సావాసమునే మిక్కిలి కాంక్షించుచుంటిని. వీరేశలింగముపంతులు లౌకికవిద్యయందువలె పారమార్థికవిషయములందును నా గురూత్తములే. ఐనను, వారిప్రజ్ఞానైపుణ్యములు సంఘసంస్కరణరంగముననే ముఖ్యముగ ప్రదర్శితము లగుచుండెను. ఆయనకుఁ బ్రియమగు మతము బ్రాహ్మధర్మమే. బ్రాహ్మసమాజాదర్శములు వారికిఁ గొట్టినపిండియే. కాని, యింగ్లీషువిద్యయే పరమావధి యైన యీకాలపువిద్యాధికులకు, ఆవిద్యలో నున్నతస్థాన మలంకరించిన నాయఁడుగారివంటివారు చేసెడి ధర్మప్రసంగములే మతవిషయములందు పరమప్రమాణములు. నేను జదువవలసినగ్రంథములు, జరుపవలసిన విధానములనుగూర్చిన యనేకవిషయములు నేను వారివలన గ్రహించితిని.

నాకంటె నాయఁడుగారు ౬, ౭ సంవత్సరములు మాత్రమే పెద్దలు. నామనస్సునఁ దోఁచిన పలుసందియముల నాయన సోదరభావమునఁ దీర్చుచుండువారు. ఇంతియ కాదు. బ్రాహ్మధర్మమున కాయువుపట్టగు ప్రేమగుణము వారియందు మూర్తీభవించినటు లుండెను!

వయోవ్యత్యాస మెక్కువగఁ గలిగి, ఆగ్రహ మితభాషిత్వములతో నొప్పెడి వీరేశలింగముపంతులుగారి నెన్నఁడునుగాని మేము వేయ వెఱగందెడిప్రశ్నములకు, సమవయస్కులగు నాయఁడుగారు సౌమ్య భావమున సదుత్తరము లిచ్చుచుండువారు. యువజనహృదయాకర్షము చేయుసమర్థతయు, వారలను సన్మార్గమునకుఁ బురిగొల్పెడి సౌజన్య మును, వారియందుఁ గలవు. కావున నేను గనులనుగుఱించి చెన్నపురికిఁ గట్టినపయనము వ్యర్థ మని యెంచక, అంతర్చక్షువికసనమున కిది సందర్భ మయ్యెనని మిగుల సంతసించితిని.

చెన్నపురియందు నే నుండు దినములలోనే యచటి బ్రాహ్మసమాజవర్థంతి జరిగెను. ఆసందర్భమున నాయఁడుగా రొక యుపన్యాసము చేసిరి. ఆయుత్సవానంతరమున, 1892 జనవరి 4-వ తేదీ సోమవారమున చెన్నపురినుండి నే నింటికి బయలుదేఱితిని.

## ౩౮. సంరంభము

ఆకాలమున చెన్నపురి నుండి యుత్తరాంధ్రమండలములకు రెయిలుపయనము చేయువారు మిగుల మెల్లగను, మిక్కిలి చుట్టు మార్గమునను పోవలసివచ్చెను. మద్రాసు నుండి గుంతకల్లువఱకును మెయిలులో నొకరాత్రి; గుంతకల్లునుండి కంభమువఱకు నొకపగలం తయు; అంత, కంభము చలిలో నిర్బంధ విశ్రమము రాత్రియంతయు; కంభమునుండి బెజవాడకు మఱునాఁటి యుదయమునుండి సాయంకా లము వఱకును. నేను పయనము చేయుబండిలో నదృష్టవశమున మద్రాసునుండి బెజవాడవఱకును ఇంజనీరింగ్ కాలేజివిద్యార్థు లుండిరి. వారిలో నా పూర్వసహపాఠి రంగనాయకులుగారుండుటవలన నాకుఁ గాలక్షేపము సుకర మయ్యెను. బెజవాడలో నే నెక్కినపడవలోనే

నాగపూరులో జరిగిన దేశీయమహాసభకుఁ బోయి వచ్చుచుండెడి కొంద ఱు మిత్రు లుండిరి. వీరిని రాజమండ్రి కొనిపోవుటకు పాపయ్యగారు మున్నగు స్నేహితులు వచ్చిరి. కాఁబట్టి పడవలోఁ గూడ నాకు సుఖ ముగ నుండెను. ౧-వ తేదీని రాజమండ్రి చేరితిని.

౧౩-వ తేదీని సంక్రాంతినాఁడు రాజమండ్రి పురమందిరములో శ్రీ. శే. బసవరాజు గవర్రాజుగారి ఛాయాపటము నెలకొల్పు సందర్భ మున నొకబహిరంగసభ జరిగెను. కళాశాలాధ్యక్షులు మెట్కాఫు దొరగారు ఆసభ కధ్యక్షులు.

చెన్నపురినుండి వచ్చినపిమ్మట, మద్రాసు బ్రాహ్మసమాజ పద్ధ తులను జూచివచ్చినహేతువున, మతవ్యాపనమం దెక్కువ శ్రద్ధ వహించితిని. సమాజమునకు నూతన సభ్యులను జేర్చితిని. ఇన్నిసుపే టలో రెండవ ప్రార్థనసభ నేర్పటిచితిమి. జనవరినుండియు సత్యసం వర్ధనీవ్యవహారకర్తగఁ బని చేయుటకు సాంబశివరావు సమ్మతించుట చేత, ఆపని యాతని కొప్పగింపఁబడెను. తమ్ముఁడు నేనును జదువు కొనుట కొకగది పెద్దరస్తా సమీపమునఁ గుదిర్చితిమి. అది యిపుడు సమాజాభిమానులు తఱచుగఁ గూడి సంస్కరణవిషయములు, పత్రికా వ్యవహారములును జర్చించుకొను రచ్చసావడి యయ్యెను. ఇంతలో విశ్వవిద్యాలయ పరీక్షాఫలితములు తెలిసెను. కొండయ్యశాస్త్రి ప్రవే శపరీక్షయందును, కనకరాజు గంగరాజులు ప్రథమశాస్త్ర పరీక్షయం దును నుత్తీర్ణులైరి. పట్టపరీక్షకుఁ జదువుటకై గంగరాజు చెన్నపు రికిఁ బోయెను. చదువు చాలించి యుద్యోగము చేయఁజూచిన కనక రాజు, మిత్రులమగు మా ప్రోత్సాహమున రాజమండ్రి కళాశాలలో పట్టపరీక్షతరగతిలోఁ జేరెను. ఇంతియ కాదు. నే నిదివఱకు మిత్రు లతోఁ గలసి యాలోచించుచుండిన "ఆస్తికపాఠశాలా" స్థాపనవిష

యమై యిపుడు గట్టిగఁ దలపోయసాగితిమి. ఈ సంవత్సరము పట్ట పరీక్ష పూర్తిచేసి, బోధనాభ్యాసమునకై రాఁబోవువత్సరము తాను సైదాపేటకుఁ బోయెదనని మృత్యుంజయరావు చెప్పెను. నేనును పాఠశాలలోఁ బనిచేయ నిశ్చయించి, నరసింహరాయఁడుగారిని గూడఁ జేరున ట్లొప్పించితిని. కనకరాజు కూడ చేరెద ననెను.

సమాజప్రార్థనలతోఁ దనివి నొందక, నిత్యకుటుంబప్రార్థనలు జరుపుట కర్తవ్యమని వీరేశలింగముపంతులుగారు మాకు హితబోధనము చేసిరి. తమరు వారమువారమును జరుపు ప్రార్థనసభలకు నాతల్లిని భార్యను బంపు మని రాజ్యలక్ష్మమ్మగారు నన్నడిగిరి. లక్ష్మీనారాయణగారు నేనును మాటాడుకొనుచు, స్నేహితులసతీమణు లందఱు నొకచోట సమావేశమై చదువు సాగించుకొనుట యుక్తమని భావించితిమి. కాని, సమష్టికుటుంబములలోఁ గూరుకొనిపోయెడి చిన్న కోడండ్రు ధైర్యమున బయటపడి, తమచదువు సాగించుటకుఁ గాని, ప్రార్థనసభలు జరుపుటకుఁగాని యెట్లు సాధ్య మగును?

లక్ష్మీనారాయణగా రిపుడు ప్రార్థనసమాజాదర్శములనుగుఱించి యెక్కువ సానుభూతిఁ జూపుచుండెడివారు. అపుడే జరిగిన యొక బోగము మేళమునుగుఱించి యాయన యొక పెద్దజాబు వ్రాసి,అది మాపత్రికలోఁ బ్రచురింపఁగోరెను. అంత పెద్దలేఖకుఁ దావు లేనందున, అది సంగ్రహవార్తగ ఫీబ్రవరిపత్రికలోఁ బ్రచురింపఁబడెను. ఆకాలమున మిత్రులలోఁ గలవరమునకుఁ గారణ మయ్యెను గావున, దాని నిచట నుల్లేఖించుచున్నాము. కనకరాజుయొక్క కటుపదప్రయోగములతోఁ గూడిన దిద్దుఁబాటు లిందుఁ గానఁబడఁగలవు:—

“ కడచిన మకరసంక్రాంతినాఁడు, మన పట్టణములో పట్ట పరీక్షయందు తేరినవారు కొందరును, ఆపరీక్షకు పోదలచినవారు

కొందరును, నిర్వ్యాపారులై కాలమువ్యర్థపుచ్చు మరికొందరును మనయెదుటనే యెన్నియో సంసారముల గూలద్రోచి, ప్రస్తుతము కోరలు పెరికిన వృద్ధకాలసర్పమువలె నున్న ఒకవేశ్యాకాంతయొక్క ముద్దుకూతురిచే గజ్జెకట్టించిరి. కామశాస్త్రోపాధ్యాయి యగు ఆమెయు తనగాత్రముయొక్క అభివ్యక్తిచేతను, నేత్రవిలోకములచేతను, అభినయముచేతను, పాడినగీతముల దుర్నీతులచేతను, 'బ్రహుకుదినముల మోక్షంబు వెదుక నేల?' అను మృగధర్మమును వారిమనస్సులకు నాటునట్లు బోధించి చనెను. పామరజనులను సన్మార్గమునకు పురికొల్పవలసిన పట్టపరీక్షావిద్యార్థులే కులటల నాదరించుచున్నపుడు, మనదేశ మెప్పు డున్నతస్థితికి వచ్చునో తెలియకున్నది."

ఈవార్త పత్రికలోఁ బ్రచురించినందున కనేకులు నన్ను నిందించిరి. సభకు వెళ్లిన విద్యార్థులు కొందఱు రోషపడిరి. తమ్ము నవమానించినందుకు నామీఁద నభియోగము తెచ్చెద మని కొందఱు భయపెట్టిరి. నామీఁద వ్యాజ్యెము తెమ్మని యా వేశ్యను కొందఱు పురికొల్పిరి. నామూలమునఁ దామును జిక్కులలోనికి వచ్చెద మని సమాజమిత్రులు కొందఱు భయపడిరి. తమ లేఖామాతృకను దమ కిచ్చి వేయుమని భీతిల్లిన లక్ష్మీనారాయణగారు నన్ను వేఁడిరి. నే నది యిచ్చివేసితిని. ఒకనాఁడు నాపూర్వసహచరుఁ డొకఁడు నాగదిలోనికి వచ్చి, "ఈసత్యసంవర్ధనీపత్రికను నడపువారు, మీవిద్యార్థులే కాక, మీనాయకుఁడు వీరేశలింగముపంతులుకూడను కాదా? పత్రికాధిపత్యమునందు ఆయనకును బాధ్యత యున్నదికాదా?" అని నన్నడిగెను. ఆయనకూడ పత్రికాధిపత్యమున భాగస్వామియే యని నే జెప్పితిని. "పెద్దవారగు పంతులుగారియాలోచన పుచ్చుకొనియే మీరీపత్రిక నడుపుచున్నారుకాదా?" అని నాసహచరుని ప్రశ్న.

# ౩౮. సంరంభము

"అవును. పంతులుగారు పత్రికాధిపత్యమందును మాకు నాయకులే!" అని నాసమాధానము.

ఈసంభాషణ జరిగిన యొకటిరెండురోజుల కీసావాసుఁడు మరల నాకుఁ గనిపించి, మానరక్షణమును గుఱించి వేశ్య వ్యాజ్యెము తెచ్చుట మానుకొనె నని చెప్పెను. కారణ మడుగఁగా, వెనుకటిసారి నాతో నతఁడు మాటాడునపుడు, ఆవేశ్య నాగదిప్రక్కగదిలో నిలుచుండి సంభాషణ యంతయు విని, పెద్దపులివంటి వీరేశలింగము పంతులే యీవ్యవహారములో నుండుటచేత, తనయాటలు సాగవని భీతితో నుద్యమము విరమించుకొనె నని చెప్పెను! వేశ్యాజన ప్రియుఁడగు నా యీ పూర్వసహచరుఁడే, ఆ స్త్రీ యాప్రక్కగదిలోనికి వచ్చిపొంచుని వినునట్టి యేర్పాటు చేసెనఁట!

సత్యసంవర్ధనీ పత్రికాధిపతిమీఁదను, ప్రార్థనసమాజముమీఁదను జనులకుఁ గొందఱికిఁగల యాగ్రహ మింతటితో నంతరింప లేదు. 19వ మార్చి తేదీని పురమందిరమున జరిగిన నాటకసందర్భమున, ప్రహసనములో ప్రార్థనసామాజికులు పత్రికాధిపతియును వెక్కిరింపఁబడిరి ఇది జరిగిన కొలఁదిదినములకే ప్రార్థనసమాజవార్షికోత్సవము జరిగెను. ఏఁటేఁటను, ఈ సందర్భమునసే ప్రార్థనసమాజమువారిని వెలివేయుటకు యత్నములు జరుగుచుండెడివి. పూర్వాచారపరులకు మామీఁద నిపుడు పూర్తిగ నాగ్రహము గలిగెను. ఉత్సవదినములలో నన్నదానమునకై వంట చేయుటకు బ్రాహ్మణులు రాకుండఁజేయు ప్రయత్నములు జరిగెను. వంటపందెర మీఁద రాళ్లు రువ్వఁబడెను. సారంగధరుని మెట్టమీఁద ఫలాహారములు చేసిన వారిని వెలివేయుట కిపుడు ప్రయత్నములు సాగెను. ఈసందర్భమున పూర్వాచారపరులను బురికొల్పుటకు కళాశాలోపాధ్యాయులు కొందఱును వారి శిష్యులు

ండఱును పట్టుదలతోఁ బనిచేసిరి. ప్రార్థనసామాజికులకు పూఁటకూళ్ల ఇండ్లలో రెండుదినములు భోజనము దొరకకుండఁ జేసిరి. అంత, నకరాజు నేనును కళాశాలాధ్యక్షుని దగ్గఱకుఁబోయి, ఉపాధ్యాయుల ప్రటను వారి కెఱిఁగించితిమి. ఆయన మాకుఁ దోడుపడెద నని చెప్పి, ఆయుపాధ్యాయులను వారించెను. బహిష్కరణప్రమాద మంతట మెల్లమెల్లగఁ దొలఁగి పోయెను. కాని, ప్రార్థనసమాజ శత్రువుల యీర్ష్యారోషము లింతటితో నస్తమింపలేదు. ౧౧-వ ఏప్రిలు తేదిని 'రాజమంద్రి యందలి ప్రస్తుత పరిస్థి" తుల ను గూర్చి యొక న్యాయవాది పురమందిరమున నుపన్యాస మిచ్చెను. వాదప్రతివాదనల తీవ్రతచేత సభ యల్లకల్లోల మయ్యెను. ఆసమయమున మిత్రుఁడు కనకరాజు చేసిన యప్రస్తుత ప్రసంగమునకు స్నేహితులము వానిని నిందింపఁగా, సమాజము వదలివేతు నని యాతఁడు చెప్పివేసెను గాని, పాపయ్యగారి శాంతవచనములచే మనస్సు మార్చుకొనెను.

నా పూర్వమిత్రుఁడగు మహమ్మదు బజులుల్లా సాహేబు, ఒక బ్రాహ్మణ స్నేహితునితోఁ గలసి యిపుడు "సత్యాన్వేషిణి" యనునొక యింగ్లీషు వార్తాపత్రికను నెలకొల్పెను. దాని మొదటి సంచిక ౧౭-వ ఏప్రిలున వెలువడెను. మతసాంఘిక విషయములు చర్చింప నుద్యమించిన యీతోడి మాసపత్రికకు ఏప్రిలు సంచికలో సత్యసంవర్ధని సుస్వాగత మిచ్చెను గాని, సంస్కరణ నిరసనమే ముఖ్య కార్యముగఁ జేసికొన బయలువెడలిన యీనూతనపత్రికకు మాకును ముందు పోరు ఘోరముగ జరుగు నని మేమెఱిఁగియే యుంటిమి.

# ౩౯. స్నేహభాగ్యము

౧౯౧౩ వ సంవత్సరము మార్చి తుదివారమున జరిగిన మా ప్రార్థనసమాజ జయంత్యుత్సవసమయమున సభ్యుల మందఱము నమితోత్సాహమున నుంటిమి. వీరేశలింగముగారు "మానుషధర్మము"ను గుఱించియు, నరసింహరాయఁడుగారు "విశ్వాసము"ను గూర్చియు, కనకరాజు "దేవేంద్రనాథు"నిగూర్చియు, నేను "ప్రేమపారిశుద్ధ్యము"నుగుఱించియు, ధర్మోపన్యాసములు చేసితిమి. బీదజనులకు అన్నదానము చేయఁబడెను. ఏకాంతప్రార్థనమునకై సారంగధరపర్వతము నకుఁ బోయి వచ్చితిమి.

వేసవికి కళాశాల మూయుటచేత పట్టణమునుండి సమాజమిత్రులు తమ తమ గ్రామములకు వెడలిపోయిరి. సత్యసంవర్ధనిని విడిచి నెంబనే నే నెచటికిని బోలేకపోయితిని. పత్రికకు వ్యాసములు వ్రాయుచును, చందాదారులతో నుత్తరప్రత్యుత్తరములు నడపుచును, నేను రాజమండ్రిలో చల్లనిగాలి ననుభవించుచుంటిని! ఇపుడు స్కాటుదొరగారు నాయింగ్లీషువ్యాసములు దిద్దుటకు నిరాకరించుటచేత, ఆంగ్లేయవ్యాసరచనయం దెక్కువజాగ్రత్త వహించితిని.

ప్రార్థనసమాజసంపర్కము వదలుకొనుమని తండ్రియు మామయు నాకు హితబోధము చేసిరి. పత్రికమూలమున నాతలంపులు కార్యములును రచ్చ కెక్కుచుండెను. ఇపుడు వేలివెన్నునుండి వచ్చిన నాభార్య, సమాజవార్షికసమయమందలి మాచర్యలు, అచటిచుట్టముల హృదయములను గలంచివైచె నని చెప్పెను. నేను విద్యాభ్యాసమును గూర్చి శ్రద్ధఁబూని, యుద్యోగసంపాదనమునకుఁ గడంగవలయునే కాని, నిరర్థకసంస్కరణములవిషయమై కాలమును వ్యర్థపుచ్చరా దని,

మనుమనిపురోభివృద్ధి గోరి వృద్ధురాలగు మాయమ్మమ్మ పంపినట్టియు, పతిసేవ మారసి నాభార్య భద్రముగఁ గొనివచ్చినట్టియు, సందేశవిశేషము! ప్రాఁతగిల్లిన ప్రేమను జూపు ముత్తువమాటలు మనుమనికి నచ్చినను నచ్చకున్నను, నవయౌవనమున విలసిల్లు సతినూతనానురాగయుతమగు హితోక్తులు పతిచెవి కెక్కు ననుట స్పష్టము కావున, సంస్కరణోద్యమమునెడ నెట్టులైన నాకు విముఖత్వము గలిగింప నీయాఁడువా రిద్దఱు నాలోచించుకొనిరి!

ఈవేసవిలో వీరేశలింగముగారు చెన్నపురి వెళ్లిపోయిరి. ఆయన బయలుదేఱుటకు మునుపు, ఇంటియొద్ద వారిని జూచితిని. సంస్కరణాంశములం దాయన నామనసునకు నచ్చినట్టి అతివాదియె. కాని, యాయనలోపము లెంత బయలుపడియున్నవి! అహంభావము, ఆత్మశ్లాఘనమును వీరి వాక్కులయందుఁ జూచి నేను జింతించి, ఈశ్వర కృపచే నివి తొలఁగవలె నని కాంక్షించితిని. ఆస్తికపాఠశాలాస్థాపన విషయమై పాపయ్యగారు పరిపూర్ణసానుభూతిఁ జూపుచుండువారు. ఇపుడు నాకు మాతమ్ముఁడు వెంకటరామయ్యయు, మృత్యుంజయరావును నిత్యసహచరు లయిరి. నవీనముగా స్నేహము గలసినను, మృత్యుంజయరావునెడల నాకు చన వెక్కువ. మితభాషి యైనను, మనసుగలసినమిత్రులతోఁ దన యాదర్శములను విశ్వాసములను అతఁడు వెల్లడించుటకు వెనుదీయకుండువాఁడు. భవిష్యత్తునందలి మాకార్యప్రణాళికనుగుఱించి ముచ్చటించుచుండువారము. మిల్లు వ్రాసిన "స్త్రీనిర్బంధము" అనుపుస్తకమును అమితతమకమునఁ జదివితిమి. జనలోకముయొక్క కనులు విప్పి, ఉత్కృష్టసాంఘికసమస్యలను నిర్భయముగ నెదుర్కొనిన యాయుత్తమరచయితవాక్కులు విని నామిత్రుఁడు హర్షోద్రేకమున మిన్ను ముట్టుచుండువాఁడు. ఈమిత్రుఁడు వక్తయు

వ్రాయసకాఁడును కాఁడు. సఖులతోడి సుఖసంభాషణములందు మాత్రము, ఆతనికంటె నధికమగు బుద్ధివైశద్యము సదుద్దేశసద్భావము లును గనఁబఱచెడివా రరుదుగ నుందురు! అతనికి స్త్రీవిద్యాభిమానము మెండు. అందఱివలె మాటలతోఁ దనివి నొందక, తనభార్య మాణిక్యాంబ కాతఁడు విద్యాసౌకర్యము లెన్నియో కలిగించెను. ఇపుడు నాప్రోత్సాహమున నతఁడు "పండిత రామాబాయిసరస్వతి"ని గుఱించి వ్యాసము వ్రాయఁగా, అది జూన్‌పత్రికలోఁ బ్రచురించితిమి.

రాజమండ్రినివాస మనిన నే నంత విసు వంది, ఏప్రిలుపత్రిక తపాలో నంపినవెంటనే, వేలివెన్ను, నర్సాపురము మున్నగుప్రదేశములు తిరిగి వచ్చితిని. ఈసెలవులలో వీరేశలింగముపంతులు కనకరాజును పట్టణమున లేనందున, మే జూను పత్రికలలోఁ బ్రచురింపవలసినవ్యాసములు నేనే నిర్ణయించితిని. ప్రాఁతవ్యాసములలో "అహం బ్రహ్మాస్మి" అను నద్వైతమతఖండనము నాకనుల కగపడెను. అది కనకరాజు వ్రాసినది. వేదాంతవిషయములలో మాకు పంతులుగారి తరువాత కనకరాజే ప్రమాణము! అద్వైతము బ్రాహ్మమతమునకుఁ బరమశత్రు వని యాతనిమతము. ఇపు డీవ్యాసము గాటుగ నుండుట చేత, మేనెల పత్రికలో దానినిఁ బ్రచురించి, దేశోద్ధరణము గావించితి మని సంతసించితిమి. తప్పులతడకగ నుండిన యీ యసంపూర్ణ వ్యాసము తనకుఁ జెప్పక యేల ప్రచురించితి రని పిమ్మట కనకరాజు కోపపడెను. ఆతఁ డనుకొనినట్టుగనే, బళ్లారి "సన్మార్గబోధినీ" పత్రికలో నీవ్యాసమువిూఁద పెద్దఖండనము ప్రచుర మయ్యెను. వేసవి సెలవు లయినపిమ్మట, ఈఖండనమునకుఁ బ్రత్యుత్తరము లిచ్చితిమి.

మరల కళాశాల తీసినవెనుక మృత్యుంజయరావుని యాలోచన ననుసరించి, ప్రార్థనసమాజసభ్యులము కొందఱము, ఇతరవిద్యా

థులు కొందఱితోఁ గలసి, విద్యాలయమునకుఁ జేరువ నుండు నొక మేడను అద్దెకుఁ దీసికొంటిమి. నాచదువున కందు నిశ్శబ్దమగు గది యొసఁగఁబడెను. చుట్టుపట్టుల నిండ్లలో నివసించియుండు కనక రాజు మృత్యుంజయరావు మున్నగుస్నేహితులు తఱచుగ మాబసకు వచ్చి, మాతో సంభాషించుచుందురు. మృత్యుంజయరా విపుడు కళాశాల చేరి పట్టపరీక్ష రెండవభాగమునకుఁ జదువుచుండెను. ఇపుడు కనకరాజు పట్టపరీక్ష మొదటితరగతిలోఁ జేరి, యెక్కువ విశ్రాంతి గలిగియుండుటచేత, పత్రికవ్యవహారము లతఁడు చూచుచువచ్చెను. చదువుకొనుటకు ప్రత్యేకవసతి యేర్పడుటచేత, ఆఱునెలలలో రానున్న పట్టపరీక్షకై కృషిసలుప నుద్యమించితిని. కాని, నా యా రోగ్య మింకను సరిగ లేదు. ఆదినములలో రోగము నాదేహముతో 'సెలగాటము' లాడుచువచ్చెను! ఆతరుణమున నామిత్రులు కొందఱు నాకు సాయము చేసిరి. రామారావుగారు ఉపహారములు చేయించి పెట్టుచును, మృత్యుంజయరావు అపుడపుడు భోజనసదుపాయము లొనరించుచును, రంగనాయకులునాయఁడుగారు ఔషధపానీయ ముల నంపుచును, నా కెంతయో తోడ్పడిరి.

ఇంట భోజనవిషయమున మాతల్లి యెన్నియో సదుపాయ ములు నాకు సమకూర్చుచుండెడిది. అప్పుడప్పుడు జబ్బుపడుచుండినను, మొత్తముమీఁద మాయింట నుండునందఱిలోను సుఖానుభవమున నేనే యధిపుఁడను! చదువుకొనుటకు శయనించుటకును నాకు విశాలమును నిశ్శబ్దమునునగు ప్రత్యేకమగు మేడగది కలదు. వర్షకాలమున మా కుటీరనివాసము కడు బాధాకరముగ నుండెడిది. ఆపర్ణశాలలో నేల మిగుల తేమగను, పెరడు బురదగను నుండుటవలన, అహర్నిశ మచట తిరిగి పనులు చేసికొనుచుండు మాతల్లికిని తక్కిన యాఁడు

వాండ్రకును, కాళ్లు ఒరసికొనిపోయి పుండ్లు పడెను. ఆయిల్లు విడిచి చేరుటనుండి నే పెంకుటింటికైనఁ గాపురము తరలింపు డని నేను మొఱపెట్టినప్పుడు, మాతండ్రి, "ఇపు డీ నేల యివఃగా నున్నది గాని, కొంచె మారినయెడల, ఇక్కడనే కొబ్బరికాయలు కొట్టి వచ్చును సుమా!" అని పలుకుచు, నాయాలోచన లెసరఁగొట్టుచుండువాఁడు. అందువలన మాతల్లికి దేహారోగ్యము చెడిపోవుటయు, అంతటికి నసౌఖ్యము గలుగుటయుఁ దటస్థించి, నన్నలజడిపాలు చేసెను.

## ౪౦. రోగారోగ్యములు

ఆకాలమున నా యారోగ్యమునుగుఱించి నే నెంతయో శ్రద్ధ వహించెడివాఁడను. ఏమాత్ర మనుమాన ముండినను, మిత్రుఁడు రంగనాయకులునాయఁడుగారు నన్నుఁ బరీక్షించి మం దిచ్చుచుండువారు. రాత్రులు చదువకుండుటయె నియమముగఁ జేసికొని నేను భోజనానంతరమున నెనిమిదిగంటలకే పాన్పు చేరుచుండువాఁడను. కాని, అత్యాతురతచే నాకనులు పొడివాఱి, కునుకు పట్టకుండెడిది! ప్రక్కగదులలోఁ జదువుస్నేహితులను చదువు మానుఁడనియును, కనీసము మెల్లఁగఁ జదువుకొనుఁడనియును వేఁడుచుండువాఁడను! చన వెక్కువ గలవారి గదిలోని దీప మార్పివేసి, వారికి నిర్బంధవిశ్రాంతి చేకూర్చుచుండువాఁడను. కాని, యెన్నిపూజలు సల్పినను, నిద్రాదేవత నాకుఁ బ్రసన్న యయ్యెడిదిగాదు. చీఁకటిపడుటయె తడవుగా పడకఁ జేరి, పొడిగ్రుడ్లుపడి యాపసోపములతో గంటలు లెక్కించెడి నాకంటె, కాలనియమము లేని చదువున నోడ లెఱుఁగక దీపముచెంతనే నిదురించు పొరుగుసహచరు లదృష్టవంతు లని యచ్చెరు వందుచుందును.

నా వైద్యమిత్రుఁ డిచ్చు నిద్రాకరమగు మందె నాకు వికారము గలి గించి నిదురను బాఱఁద్రోలుచుండును! నిద్ర యెట్లు పట్టునా యని యాలోచించినకొలఁది నా కది దూరస్థ మగుచుండును!

రాత్రి నిద్దురమాట యెటు లుండినను, పగటికాల మేమాత్ర మును వృథచేయక నేను చదువుచుండును. ఏమాత్రము చదువుపా లెక్కువయైనను, ఒక్కొక్కసారి బొత్తిగఁ జదువకున్నను, నాకు రోగము ప్రత్యక్ష మగుచుండును. బంగారము తూఁచుత్రాసువలె, మిగుల చిన్నమార్పునకైనను నాదేహము రోగముదెస కొఱగుచుండును. అయినను, వ్యాధినుండి యొకింత తెఱపి గలిగనేని, నేను మరలఁ జదువుచు పత్రికకు వ్రాయుచు, కాలమును సద్వినియోగము చేయ నుంకించుచుందును. ఈసంగతి, ఆనాఁటి నాదినచర్యపుస్తకములలోని క్రిందియుల్లేఖములవలన తేటఁబడఁగలదు:—

"బుధ. ౧౩ జూలై ౧౯౯౭: నాకు బాధ హెచ్చెను. తయారు చేసిన వ్యాసమును అచ్చున కిచ్చితిని. వేదన అతిశయించెను. ఊపిరి సరిగా విడువనేరక నేను పండుకొనియుండుట చూచి, కనకరాజు కంట తడిపెట్టుకొనెను. నాయఁడుగారిమందువలన కొంత యుపశ మనము గలిగెను. బంధుమిత్రులు నన్నుఁ జూడవచ్చిరి. భగవానుఁడా, యెటులయినను నేను నీవాఁడనెకదా!"

"సోమ. ౧౮ జూలై:—ప్రొద్దుననే నా పూర్వశత్రువు గుండె నొప్పి మరల పొడసూపెను. రోజంతయు బాధనొందినను కళాశాలకుఁ బోయితిని. గదిలోనివస్తువులు సరదుకొంటిని. అచ్చుచిత్తులు దిద్దితిని. లోకాక గూడ నుండెను."

# ౪౦. రోగారోగ్యములు

"మంగళ. ౧౯ జూలై. దేహ మింకను సరిగా లేదు. ప్రొద్దున ముద్రాలయమున కేగి పని చేసితిని. ప్రాతశత్రువగు కనులత్రిప్పు మరల రెండుసంవత్సరముల కీనాఁడు గనఁబడినది. దాని వెన్నంటి యుండు తలనొప్పిచే రోజంతయు బాధపడితిని. ఆరోగ్య మిట్లు ఊఁగులాడుచున్నది!"

పైని జెప్పినదానిలో రెండుసంవత్సరముల కనునది రెండునెల లని యుండవలయును. రెండునెలలకైనను, రెండుసంవత్సరములకైనను, శరీరముపై మోయలేని బరువులెత్తుటచేత నేకదా ప్రాతరోగములు బయలుపడుచుండును! విద్యార్థులకు పరీక్షాకాలము పెద్దపరీక్షాకాలమె!

రోగముతో నిట్లు నిరంతరయుద్ధము సల్పుచుండు నాదేహము, అక్టోబరు చివరభాగమున మరల వ్యాధిగ్రస్థ మయ్యెను. శరీరమందు సరిగా నుండనిసమయమున పాఠములు చదువుచును, పరీక్షలకుఁ బోవుచును, పత్రికకు వ్రాయుచును, విందులు గుడుచుచును నుండుటచేత, అక్టోబరు ౨౩ వ తేదీని నాకు పెద్దజ్వరము వచ్చెను. వేసినమందు వికటించి రోగము హెచ్చెను. ఆమఱునాఁడు నన్ను లంకణ ముంచిరి. రాత్రి పదిగంట లగుసరికి నాకు తల తిరిగెను. ప్రాణ మెగిరిపోవునటు లుండెను. చూచుచుండఁగనే కాలుసేతులు చివరనుండి చల్లఁబడి మొద్దుపాఱఁజొచ్చెను! స్పృహమాత్రము స్ఫుటముగ నుండెను. ఇది యంత్యావస్థ యని నే ననుకొని, ఒక కేక వేసితిని. జీవితమంతయుఁ జేసెద ననుకొనిన ఘనకార్యములు సాధింపకయే నే నిట్లగుచుండుట కాశ్చర్య మందితిని. భోజనము చేయుచుండు నా తల్లియు, భార్యయు నంతట లేచివచ్చిరి. అంత పొరుగువీథి నుండిన యొక వైద్యుని గొనివచ్చిరి.

ఇపుడు నా దేహమునిండ చెమ్మటలు పట్టెను. నిదానముగల యావైద్యుఁడు నాచేయి చూచి, నాడిలో దోషము లేకుండుట గ్రహించెను. జ్వరము విడుచుటచేత నుచ్చెమటలు పట్టి నాకు నిస్స త్తువ గలిగె నని నిశ్చయించి, నా కాయన, పేలాలజావ పోయించెను. నేను తెప్పిఱిల్లితిని. ఆవైద్యునియౌషధమువలన నొకవారము నకు నాకు నింపొందిచెను.

## ౪౧. వైరివర్గము

మహమ్మదీయ సంపాదకునిచే నడుపఁబడుచుండెడి "సత్యాన్వేషిణీ" పత్రిక, హిందూసంఘ దురాచార నిరసనము నెఱపుచుండెడి మా "సత్యసంవర్ధని" యెడ సానుభూతి చూపు నని లోకు లనుకొనవచ్చును కాని, అట్లు జరుగలేదు. జనన మొందినది మొదలు, "సత్యాన్వేషిణి" ప్రార్థన సామాజికులను, "సత్యసంవర్ధని"ని దూషించుటతోనే కాలము గడపెను. ఈదూషణ మైనను, సిద్ధాంతముల లోను విధానములందును గల యభిప్రాయభేదము లాధారముగఁ జేసి కొనిన ధారాళవిమర్శన మైనచోఁ గొంత సారస్యముగ నుండెడిది. అట్లు గాక, "సత్యాన్వేషిణి" వ్యక్తిగత దూషణములు చేయఁ జొచ్చెను. ప్రార్థన సామాజికులకు లేనిపోని యవగుణము లారోపించి, వారి యాదర్శములను వెక్కిరింపఁ జొచ్చెను. మా సమాజమువా రెంత యోపికతో నూరకుండినను, సత్యాన్వేషిణి నోరు కట్టువడలేదు. అంతట వీరేశలింగముపంతులు, మహమ్మదీయసంపాదకునిచేతను, బ్రాహ్మణకార్యనిర్వాహకునిచేతను ప్రకటింపఁబడెడి యాపత్రికకుఁ దగుసమాధాన మీయఁదొడంగెను. సెప్టెంబరు "సత్యసంవర్ధని" లో "సాభిప్రాయవిషయ వ్యాసము" వ్రాసినది వీరె. దీనిలో

## ౨౧. వైరివర్గము

"సత్యాన్వేషిణి" వ్రాఁతలలోని వంకరలను, వేశ్యాజనాభిమానము, పూర్వాచార పరాయణత్వము, స్మార్తకర్మలు, స్త్రీ గౌరవము, సత్యము, అను శీర్షికలతో పంతులుగారు ఖండించివైచిరి. ఇంతటితోఁ దనివి చెందక, పంతులు హిందూ మతోన్మాదములను, దురాచారములను సమర్థింపఁజూచెడి పండితాభాసులవాదనలను చర్యలను గర్హించుచు, ఆగస్టు నెలనుండియే ప్రహసనములు వ్రాయఁజొచ్చెను. ఆనెలలోఁ బ్రచురింపఁబడిన "హిందూమతసభ" వీరి ప్రహసనములలో నెల్ల కడుపుఁబ్బ నవ్వించుటకుఁ బ్రసిద్ధి కెక్కియున్న వానిలో నొకటి. అది చదివి వినోదించుటకై యనేకు లాపత్రిక సంచికలను గొనిరి. ఇట్టి ప్రహసనము లుండుటవలన "సత్యసంవర్ధని" జనరంజక మగుచుండుట విని, పంతులుగారు అప్పటినుండియు కొంతకాలము పత్రికకొకొక్క చిన్న ప్రహసనము వ్రాయఁజొచ్చిరి. ఇట్లే సమయమున మాపత్రికలో పంతులుగారు వ్రాసిన ప్రహసనములలో "యోగాభ్యాసము," "కలిపురుషశనైశ్చర విలాసము"ను ముఖ్యములు.

ఆ నవంబరు నెల తుదివారములో, రాజమండ్రికి కోటయ్య సెట్టిగా రను దివ్యజ్ఞానసమాజోద్యోగి యొకరు వచ్చి, అక్కడ కొన్ని యుపన్యాసము లిచ్చి, విద్యార్థులతో సంభాషణములు జరిపిరి. మిత్రులతోఁ గూడి నే నాసభకుఁ బోయి, సెట్టిగారి యభిప్రాయములను గ్రహించి, వానిని గుఱించి విపులమగు విమర్శనము ఆంగ్లమున వ్రాసి మాపత్రిక నవంబరు డిసెంబరు సంచికలలోఁ బ్రచురించితిని. ప్రకృతమున "దివ్యజ్ఞాన సమాజము" వారు సంఘసంస్కారమునకు సుముఖులుగ నున్నను, ఆకాలమున వారు హిందూమతమును, హిందూసాంఘికాచారములను ఆమూలాగ్రముగ సమర్థించుటయె తమ ధర్మమని విశ్వసించెడివారు! కావున సంఘ సంస్కారములకును, దివ్యజ్ఞాన సామా

జికులకును పూర్వకాలమున పోరు ఘోరముగఁ జెలరేగుచుండెడిది. సెట్టిగారి యభిప్రాయములందుఁ గానిపించిన లోపములను నేను గర్హించి, ఖండించి, ఆ సమాజ సిద్ధాంతములమీఁద నాకుఁగల కసి తీర్చుకొంటిని.

ఆకాలమునందు ప్రహసనరూపమున, వాదప్రతివాదములు జరుపుట యాచారమయ్యెను. ప్రహసనమెంత వ్యక్తిగతమైనను సరే, అది తగినంత కఱకుగను, చమత్కారముగను నుండినచో, పాఠకుల కుల్లాసము గలుగుచుండెడిది!

౧-వ అక్టోబరున మా కందిన "ఆంధ్రప్రకాశిక" సంచికలో నొక ప్రహసన ముండెను. అందు వీరేశలింగముగారిని, కనకరాజు సాంబశివరావుగార్లను, నన్నును, మాఱు పేరులు పెట్టి, మా ప్రతికక్షులు వెక్కిరించి వినోదించిరి.

ప్రతికక్షులగు భిన్నకూటస్థు లొకరి నొకరిట్లు నిరసించు కొనుట స్వాభావికమే. కాని, మా సమాజసభ్యులు రానురాను తగినంత పరస్పర ప్రేమానురాగములు లేక, ఒకరియం దొకరు ఈర్ష్యాద్వేషములు వహించి భిన్నభిన్న కక్షులక్రింద నేర్పడిరి. సత్యసంవర్ధనీ పత్రిక నాధారము చేసికొని, నేను ప్రార్థన సమాజ వ్యవహారము లన్నిటిలో నిరంకుశ ప్రభుత్వమును నెఱపుచున్నా నని మామిత్రుల యపోహము! నాస్నేహితుఁడు కనకరాజు రెండుమూఁడు సారులు నాయందు మిత్రుల కేర్పడిన యీ ద్వేషభావమును గూర్చి నాయొద్ద ప్రస్తావించెను. కాని, యాతఁడు వేగిరపాటుచేత మిత్రులమీఁద ననగత్యముగ ననుమానములు పడుచుండెనని నేను దలంచుచుండెడి వాఁడను. సమాజాభివృద్ధికై యెంతయో కృషి సల్పుచు, సమాజ

## ౪౧. వైరివర్గము

పత్రిక విషయమై నా చేసిన నా కాలము నాయారోగ్యమును ధార వోయు నన్ను గుజించిరో మిత్రులు సందియము లందుచుండు టకు విస్మయ మందితిని. సత్యసంవర్ధనికి మాఱుగా వచ్చెడి పత్రికలు సభ్యుల కందఱకిని బంపుచు వచ్చినచో వారి మనస్సులు కొంత శాంతించు నని కనకరాజు ఆలోచన చెప్పుటచేత, అట్లు పంపుచువచ్చితిమి. కాని, పత్రిక పనులు చేయుటకు నెలకు రెండుమూఁడు రూపాయిల జీతముమీఁద నేర్పడిన యొకపిల్లవాఁ డొకఁడె యీపనిని నిర్వహింపవలసివచ్చుటచేత, క్రమముగ పత్రిక లందఱికిని నందకుండెడివి. సమాజము యొక్క నౌకరుచేత నే నింటి చాకిరీ చేయించుకొనుచు, వాని నితర సభ్యుల పరిచర్యలకు వదలకుంటి నని సభ్యుల మొఱ! దీనిలోఁ గొంత సత్యము లేకపోలేదు. ఏయుద్యోగ సంబంధమైన జవానుగాని పరిచారకుఁడు గాని యా యుద్యోగి యింటఁ గనఁబడుటయె తడవుగా, ఆపింగుల నియామకమున నాతఁడు ఇంటి నౌకరుగఁ బరిణమించుచున్నాఁడు! ఇట్టిపనులు వానికి నియమించుట కూడని పనియె యైనను, ఏయుద్యోగి తన భార్యమీఁదను బిడ్డలమీఁదను అహర్నిశమును ఈచిన్న సంగతిని గూర్చి యుద్ధము సలుపఁగలఁడు? ఇది కారణముగ, ఆకాలమున నేను స్నేహితుల సుముఖత్వమును గోలుపోయితిని. సహనబుద్ధియు కార్యవాదిత్వమును బూని, పరిస్థితుల కెటులో సరిపెట్టుకొని, స్నేహసఖ్యములె యన్నిటికంటె ప్రధాన మని గ్రహించి, సమభావమున మెలంగుటకు, మే మెవరము గాని వయసు మీఱిన యనుభవశాలులము గాము. స్వల్పవిషయము లందె గొప్ప పట్టుదలలు గల బాల్యావస్థయందె మే మెల్లరము నుండుటచేత, మా సమాజసభ్యులలో నిట్టి ద్వేషభావములు క్రమముగఁ బెరుఁగఁజొచ్చెను.

మేము పరీక్ష నిమిత్తమై చెన్నపురి బయలుదేఱవలసిన దినములు వచ్చెను. ఆసమయమునందు, నామీఁదఁ గల వైరభావము స్నేహితులు వెలిపుచ్చ నారంభించిరి. వీరలలో నగ్రేసరుఁడు నా మిత్రుఁడు మృత్యుంజయరావె యగుటకు నే నెంతయు వగచితిని. ఇట్టి స్వభావము గలవారితోఁ జెలిమి చేసి, యేల నే నీసమాజమునఁ బని చేసితినని విచారించితిని. నేను చెన్నపురికిఁ బోవునపుడు సెలవు గైకొనుటకు వీరేశలింగముగారియొద్ద కేఁగఁగా, ఆయన మా యంతః కలహముల సంగతి విని, స్నేహితు లందఱిని సమావేశపఱచి, మాలో మరల మిత్రభావము నెలకొల్పఁ బ్రయత్నించిరి. వారిమాటలు శిరసావహించి మే మందఱమును వారి హితవచనముల చొప్పున మెలఁగ వాగ్దానము చేసితిమి. ఇపు డందఱము కూడి ప్రయాణము చేయ సమ్మతించుటయె యీ స్నేహ పునరుద్ధరణమునకు సూచన.

## ౮౨. సౌఖ్య దినములు

రోగములు, మనస్పర్ధలు, మున్నగు శోధనల కెంతలోనైనను, ౧౮౯౨-వ సంవత్సరమున తుదియాఱు నెలలును నాకు నా స్నేహితులకును విద్యార్థిదశలో నెల్ల సుఖతమదినము లని చెప్పవచ్చును. మిత్రుల మందఱమును గలసియుండెడి యా యిల్లపుడు రాజభవనము వలె నాకును నా స్నేహితులకును గానఁబడియెడిది! ముఖ్యముగ సంఘసంస్కరణాభిమానుల కది యాటపట్టయ్యెను. అచటినుండి వీచుగాలియె సంస్కరణాభిమానబీజములను నలుదెసలకును వెదచల్లు నటు లుండెను. సంస్కరణమును గూర్చి చర్చలు, ప్రసంగములు, సంభాషణములును, ఎల్ల సమయములందును, అచట వినవచ్చుచుండెను. సంస్కరణమును గూర్చిన పత్రిక లచటఁ జదువరులకు లభ్యమగు

చుండెను. సంస్కరణాభిమానులగు చిన్నలు పెద్దలు, విద్యార్థులు విద్యాధికులును పలువు రచట సమావేశ మగుచు నొకరి యుత్సాహో త్సాహము లొకరు గ్రహించుచుండిరి. రాజమంద్రిలో జరుగు సంస్కరణకార్యప్రణాళిక యంతయు నిచట నారంభమై, మున్ముందుగఁ బ్రచుర మగుచువచ్చెను.

సంస్కరణ పక్షమున కెట్టి సంబంధము గలవారు పట్టణము నకు వేంచేసినను, వారలను గూర్చిన వార్తలు ప్రథమమున నిచ్చటనే ప్రభవించుచుండెను. ఆసమయమున నొక భూతవైద్యుఁడు రాజ మంద్రి వచ్చి, ఎవరియింటనో బసచేసి, వైద్యము చేయుచుండెను. మే మాయనతో వాద ప్రతివాదనలు చేయుటకు వారియొద్దకుఁ బోవుచుండెడివారము. దయ్యములను జూపింపు మనియు, పట్టింపు మనియు, మాలోఁ గొందఱ మాయనతో డీకొని వాదించితిమి. ఆయన యట్లు చేసెద నని పలికియు, తుద కేమియుఁ జేయలేక వెడలి పోయెను. హిందూమతము, దివ్యజ్ఞాన సమాజములను గూర్చి ప్రసంగిం చుటకు, మేము సాహసమున బయలుదేఱుచుందుము.

మాయందఱికిని వివాహ సంస్కరణము ప్రియతమమగునం శము. వితంతూద్వాహములు చేసికొనినవారిలోఁ బెక్కండ్రు మాకు సావాసులే. వారియిండ్లు మామేడ కంటియె యుండెను. వారినిజూచి పోవుటకు వచ్చెడి వీరేశలింగము పంతులు మున్నగు సంస్కర్తలు, మామేడమీఁదికి వచ్చి మాతో మాటాడి పోవుచుందురు. మే మచట నుండు దినములలో రెండుమూఁడు వితంతూద్వాహములు దగ్గఱ యింటిలోనే జరిగెను. ఆ పెండ్లి పెద్దలలో మామిత్రులె ముఖ్యులు. మృత్యుంజయరావు ప్రోత్సాహముననే యందొక పెండ్లి జరిగెను. ఆ పెండ్లికుమారునికి పెండ్లికొమార్తెకును పునర్వివాహోపళ్యకతను

గుఱించి బోధించి, వారి కాలోచనలు చెప్పి, వారి చిక్కులు విడఁదీసి పరిణయము జరిగించినవారు మృత్యుంజయరావు, అతని సతీతిలక మగు మాణిక్యాంబయును.

అచట జరిగిన యింకొక వివాహసందర్భమునఁగూడ మా స్నేహితులే యధ్వర్యము చేసిరి. ఆసమయమున నచటికి వచ్చిన పెద్దలను మేమె సమ్మానించితిమి. వివాహదినములలో వధూవరులను జూచి పోవుటకు కళాశాలాధ్యక్షులగు మెట్కాపు దొరయును ఆయన సతీమణియు వేంచేసిరి. ఇంటిమీఁద పొట్టిగ నుండుటచేత, ఆసమయమున దొరగారికి ముఖముమీఁద కొంచెము గాయమయ్యెను.

విద్యార్థులతోఁ గిటకిట మనుచుండు మా మేడ చూచి పోవుటకు పిన్నలుపెద్దలు వచ్చుచుందురు. నాతమ్ములు చెల్లెండ్రును నన్నుఁ జూచి మాటాడు నెపమున తఱచుగ నా బసకు వచ్చుచు, మేడ మీఁదినుండి చుట్టుపట్టుల యిండ్లు చెట్లును జూచి వినోదించుచుందురు. దూరమునందలి యీ మేడగదిలో నేనుండుట, ఈనిశ్శబ్ద ప్రదేశమున విద్యాపరిశ్రమము చేయుటకుఁ గాక, ఇచ్ఛావిహారము సల్పుటకె యని బాల్యమున నుండువా రనుకొనుచు వచ్చిరి! నేను రాజాధిరాజుల భోగము ననుభవించుచుంటి నని మా పెద్దచెల్లె లానాఁ డనుచుండెడిది!

## ౨౩. పట్టపరీక్ష

నే నిపుడు పట్టపరీక్షకుఁ జెన్నపురి పోవలసియుండెను. తేమ యెుబుకుచుండెడి మా పర్ణకుటీరమునుండి కుటుంబమును ఎదురుగ నుండెడి యింటికిఁ జేర్చినఁగాని నాకుఁ దోఁచలేదు. స్నేహితులతోఁ గలసి నే నంత పట్టణమునకుఁ బ్రయాణ మైతిని. మార్గమధ్యమున పడ

వలో "సత్యసంవర్ధని"కి వ్యాసములు వ్రాయుచుంటిని. గుంటూరిలో మృత్యుంజయరావునకు బంధువు లుండుటవలన మే మందఱము నచట నొకదినము నిలిచి చెన్నపురి ప్రయాణ మైతిమి. స్నేహితులతో నాడుచు పాడుచుండుటచేత, ఆ దీర్ఘ ప్రయాణమువలని బడలిక నాకగఁబడలేదు. లింగిసెట్టివీధిలో నుండు రామలింగయ్య ప్రాఁటకూళ్ల యింటి మేడలో నామిత్రుఁడు గంగరాజు నివసించెను. అది నాకతఁ డిచ్చి, శీతకాలపు సెలవులకుఁ దాను నర్సాపురము వెళ్లిపోయెను. మృత్యుంజయరావు, అతని భార్యయును, పరశువాకము వెళ్లి, అచ్చట మన్నవ బుచ్చయ్య పంతులుగారియింట బసచేసిరి. నాకుఁ జేరువనె సాంబశివరావు మున్నగు స్నేహితులు విడిసిరి. నా ప్రాఁతస్నేహితులగు వెంకటరత్నము నాయఁడుగారిని, నారాయణస్వామి నాయఁడుగారిని గలసికొని, వారితో సంభాషణములందు తీఱిక కాలమును గడపుచుంటిని. నే నిచట శ్రద్ధతోఁ జదువుచుంటిని. రాజమంద్రి స్నేహితుఁడు పానుగంటి అప్పారావుగారితోఁ దఱచుగ నేను ప్రాఁత పాఠములు తిరుగవేయుచుండువాఁడను.

నా సహాధ్యాయుఁడు రామారావుగారు పరశువాకములో జబ్బుపడుటచేత, అతని నాబసకుఁ గొనివచ్చి, వైద్యుఁడు నారాయణస్వామి నాయఁడుగారిచే మందిప్పించితిని. అతనికి నాకును నాయఁడుగారు తమ సహజకృపావిశేషముతో మందు లిచ్చుటవలన మాకు స్వస్థత గలిగెను. డిశంబరు చివరభాగమున చెన్నపురి బ్రాహ్మమందిరములో "ఆస్తికసమావేశము," బ్రాహ్మసమాజ వార్షికసభలును జరిగెను. సమాజ పత్రికయగు "ఫెల్లోవర్కరు" పత్రికను పునరుద్ధరించుటకు వెంకటరత్నము నాయఁడుగారు సమాజమిత్రులును

నిశ్చయించిరి. నేనును వ్రాయుచుండు నని వాగ్దానము చేయకుండినను, నాచేతనైనసాయము చేయ నుద్దేశించుకొంటిని.

మద్రాసులో నేను పలుమారు వెంకటరత్నము నాయఁడు గారిని సందర్శించి, ఆత్మజీవనమును గుఱించియు, దుష్టసంకల్పముల నరికట్టి మనస్సును ఋజుమార్గమున నడిపించు విషయమును గూర్చియు, వారి యమూల్యాలోచనములను గొనుచువచ్చితిని. వైద్యుఁ డయ్యును నారాయణస్వామి నాయఁడుగారికి మత ధర్మములను గుఱించి మంచి యనుభవము గలదు. పలికెడి పలుకులందుకంటె చేసెడి కార్యములం దాయన సౌజన్యము బాగుగఁ గానవచ్చుచుండెను. ఏమాత్రము విసివి కొనక, నాకోరికచొప్పున నామిత్రుల కెల్ల నాయన యుచితముగనే వైద్యసహాయము చేయుచుండువారు.

చెన్నపురియందుఁగూడ నేను ఆరోగ్య విషయమున మిగుల జాగరూకతతో నుండువాఁడను. మిగుల మితముగఁ జదువుచు, సాయంకాలమున సముద్రతీరమునఁ జాలసేపు చల్లనిగాలి ననుభవించుచు, నేను దినములు గడపుచువచ్చితిని. దేహమున పుష్టి గలుగుటకును, కనులకుఁ జలువ చేయుటకును నేను వలసిన మందులు సేవించుచుండువాఁడను.

ఎట్టకేలకు పరీక్షాదినములు వచ్చెను. మొదటి పరీక్షాపత్రము చేత నందుకొనిన పావుగంటవఱకు నందలి విషయములు నామనస్సున కెక్కలేదు! నే నీ పరీక్షయందు తప్పినచో ముందు కుటుంబపోషణ మెట్లు జరుగునా యని నే నాలోచింపఁ దొడంగితిని. అంత నేను మనసును పరీక్షాప్రశ్నల దెసకు మరలించుకొంటిని. పరీక్ష రెండవ నాఁడు ప్రొద్దుననే, న న్నదివఱకు సంవత్సరముల కొలఁది వేధించుచు

వచ్చిన నేత్రమాంద్యచిహ్నములు గానఁబడెను. వ్యాధి యీనాఁడు పొడసూపెనా, రోజంతయు నాకు దృష్టిమాంద్యము, తలనొప్పియుఁ గలిగి మిగుల బాధపడియెడివాఁడను! అట్టి పరిస్థితులలో నే నెట్లు ప్రశ్నములకు సమాధానములు వ్రాయనేర్తును? అనుచు నేను మిగుల వగచితిని. విచారావేశముచే జనించిన దైన్యమున దేవదేవుని సాహాయ్యము నేను వేఁడికొంటిని. ఆ దయామయుని యనుగ్రహమున నా కీజబ్బు రా దనియె నేను గట్టిగ నమ్మితిని. నా యాశ్చర్య మేమని చెప్పను? భగవంతుని పరిపూర్ణానుగ్రహమునను, ఉద్రేక సమయమందలి సంకల్ప బలమునను, చూచుచుండఁగనే వ్యాధి పలాయితమయ్యెను. ఇంతియ కాదు. ఈశత్రువుమీఁద సమగ్రవిజయ మీతరుణమున నే నాకుఁ జేకూరెను. అప్పటినుండి నేఁటివఱకు మరల నెన్నఁడును నే నీ రుగ్ణతబారిఁ బడలేదు.

ఇంగ్లీషులో మొత్తముమీఁద నేను బాగుగ వ్రాసినను, ఆంధ్ర సాహిత్యమునందు ప్రశ్నలు మిగుల కఠినముగ నుండుటచేత, నే నందపజయ మొందుదు నని భయ మందితిని. కాని, నా స్నేహితులు సాంబశివరావు నరసింహరాయఁడుగార్ల వలె నేను పరీక్షలోని రెండవ భాగమును వదలిపెట్టక, మఱువారమునం దాపరీక్షకుఁగూడఁ బోయితిని. ౨౫ వ జనవరినాఁటితో నా పట్టపరీక్ష పూర్తి యయ్యెను. ఆ సాయంకాలమున వ్యాయామమున కొకమిత్రునితోఁ బోయి, గుజిలీ బజారు చూచి, అచట నొకపుస్తకము కొని తెచ్చుకొంటిని. ఐనను, నేను పూర్తియగు విరామము నాలుగుదినము లైన ననుభవింప నోఁచుకొననైతిని! సైదాపేటలోని బోధనాభ్యసనకళాశాల యదివఱకే తెఱచిరి. అందుఁ జేరి, యల్. టి. పరీక్షకుఁ జదువవలె నని మృత్యుంజయరావు నేనును ఉద్యమించుకొంటిమిగదా. ఆమఱునాఁడే మే ము

భయములమును సైదాపేట పోయితిమి. యల్.టి. తరగతి కిటకిట మను చుండెను. పెద్దగుమాస్తాను జూచితిమి. మాయిద్దఱికి నచట ప్రవేశము దొరకఁగల దని యాయన యాశ కలిగించెను. అధ్యక్షుఁడు నాఁడు కళాశాలకు రాకుండినందున, ఆయనను జూచి, తరగతిలోఁ జేరుటకై ౩౦ వ తేదీ సోమవారము తిరిగి వచ్చెద మని మద్రాసు వెడలి పోయితిమి.

కళాశాలలోఁ జేర్చుకొనుటకు అధ్యక్షుఁ డిష్టపడినచో, మ మ్మొకవైద్యుఁడు పరీక్షింపవలెను. ఆవిషయమై మాకు సాయము చేయుదు నని వైద్యుఁడు నారాయణస్వామినాయఁడుగారు చెప్పిరి. ఆదివారమునాఁడు సత్యసంవర్ధని క్రొత్తసంచికకుఁ గొన్ని వ్యాస ములు వార్తలును వ్రాసి, ఇపుడు రాజమంద్రి వెడలిపోవుచుండు స్నేహితులచేతి కవి యిచ్చి పంపితిని.

సోమవారము మరల మృత్యుంజయరావు నేనును సైదాపేట పోయితిమి. అచట మమ్ముఁ జేర్చుకొనుట కధ్యక్షుఁ డంగీకరించి, మమ్ముఁ బరీక్షింపు మని రాయపేట వైద్యాధికారికి జాబు వ్రాసెను. మఱు నాఁడు వైద్యాధికారియొద్ద కేగితిమి. మే మెంత భయపడినను, మే మారోగ్యవంతులమనియె వైద్యుఁడు వ్రాసివేసెను. ఆదినమె మేము సైదాపేట పోయి, అచట కొన్ని పాఠములు బోధించితిమి. జీవితకాల మంతయు విద్యావృత్తిలో నుండు నని నిశ్చయించుకొనియె నే నాకళాశాలలోఁ జేరితిని.

## ౨౮. ఉపాధ్యాయవృత్తి

రాజమంద్రికళాశాలలోఁ జదువుకాలమున నపుడపుడు భావి కాలమున నే నవలంబింపవలసిన వృత్తినిగుఱించి యాలోచించుచుండె

డివాఁడను. సంస్కరణావేశమునకు లోనగునప్పటినుండియు నా కీ విషయమునఁ గొన్ని నిశ్చితాభిప్రాయములు గలిగెను. న్యాయవాదివి కమ్మని మాతల్లిదండ్రులు హితవు చెప్పుచువచ్చిరి. నే నావృత్తి చేకొనినచో, మిక్కుటముగ ధనయశస్సంపాదనము చేయుదు నని మాజనకుని తలంపు. కాని, కీర్తిధనాదులమీఁద నాదృష్టి లేదనియు, న్యాయమార్గమున నడచుటకు న్యాయవాది కవకాశము లేదనియు నేను వాదించుచుండువాఁడను. అటు లైనచో నేను కలక్టరుకచేరిలోఁ గాని మఱియే కచేరీలోఁగాని యుద్యోగము సంపాదించుట మంచి దని మాతండ్రి చెప్పుచుండువాఁడు. దొరతనమువారికొలువున లంచములు పుచ్చుకొనవలసివచ్చును గాన నా కది బొత్తిగ నిష్టము లే దని నే జెప్పివేయుచుండువాఁడను. సర్కారుకొలువున నన్యాయముల కొడిగట్టకయె వ్యవహరింపవచ్చుననియు, శ్రమపడినంతకాలము చాలినంత జీతమును, వార్ధకమున పింఛనును బడయవచ్చుననియు, మాతండ్రి పలుకుచుండువాఁడు. కాని, మతసంఘసంస్కరణోద్యమములఁ బని చేయుటకు న్యాయవాదుల కవకాశమును, సర్కారుఉద్యోగులకు స్వాతంత్ర్యమును లభింప దని నేను దలంచి, ఈరెండువృత్తులనుండియు పెడమొగము పెట్టివేసితిని. నాస్నేహితుఁడు కాంతయ్యగారు, రిజిష్ట్రేషను శాఖలో కావలసినంత తీఱికయు స్వతంత్రతయు నుండుట చేతఁ దా నందుఁ బ్రవేశించి, అందు లభించు కొంచెముజీతముతోనే తృప్తినొందెద నని చెప్పుచుండువాఁడు. దొరతనమువారికొలు వనఁగనే యన్యాయమున కెడము గలుగు నని నానమ్మిక. కావున నెవ్విధమునఁ జూచినను, ఉపాధ్యాయత్వమె యుక్తమవృత్తిగ నాకుఁ దోఁచెను. ఈవృత్తినె నాగురువర్యులగు వీరేశలింగముగారును స్వీకరించి ధన్యజీవితు లగుచుండిరికదా! సంఘసంస్కరణాదివిషయములందు వారి

పాదముద్రలనే యడుగులు వేయఁజూచునాకును ఉపాధ్యాయత్వమె యుక్తమైనదిగఁ గానఁబడెను. చిన్ననాఁడు ధవళేశ్వరమున నే నొక నెల యుపాధ్యాయునిగ నుంటిని. అపుడు విద్యాబోధనకార్యము నా కానందదాయకముగ నుండెను. నా తత్త్వమునకు సరిపడిన వృత్తి యిదియె యని నేను నిశ్చయించుకొంటిని.

మతసంఘసంస్కరణములలో బాగుగఁ గృషిచేయుటకై స్నేహితులము కొందఱము "ఆస్తికపాఠశాల" నొకటి రాజమంద్రిలో స్థాపించి, అందు నుపాధ్యాయుల మైనచో, "ఏక క్రియా ద్వ్యర్థకరీ" అనునట్టుగ నొకమూల జీవనసంపాదనము, ఇంకొకమూల జీవితాదర్శ సాఫల్యమును, బొందఁగల మని మేము తలపోసితిమి. ఇదివఱకె మండపేటలో నుపాధ్యాయుఁడుగ నుండిన మృత్యుంజయరావు, ముందు కూడ నదేవృత్తిలో నుండ నిశ్చయించి, యీసంవత్సరము రాజమంద్రి కళాశాలలో పట్టపరీక్షఁ బూర్తిచేసి, రాఁబోవుసంవత్సరమందు సైదాపేటబోధనాభ్యాసనకళాశాలలోఁ బ్రవేశించి, యల్. టీ. పరీక్షలో జయ మందఁగోరెను. నేనును ఉపాధ్యాయునిగ నుండుటకే నిశ్చయించుకొంటిని. వీరేశలింగము వెంకటరత్నము నాయుఁడు గార్లు మున్నగు స్నేహితులు దీనికామోదించిరి. మాతోఁబాటుగ "ఆస్తికపాఠశాల"లో బనిచేయునుద్దేశముతో, రాఁబోవువత్సరమున సైదాపేట కళాశాలలోఁ జేరుట కింక నిద్దఱు ముగ్గురు స్నేహితులు సిద్ధముగ నుండిరి. కావున నేను పట్టపరీక్షుఁడైనతోడనే కాలయాపనముచేయక, బోధనాభ్యాసన కళాశాలఁ జేరుట కర్తవ్య మని తోఁచెను. పిమ్మట నెటులైనను, మొట్టమొదటి రోజులలో నెక్కువజీతము విద్యాధికుల కనులఁ గనఁబడెడి వృత్తి యాకాలమున నుపాధ్యాయత్వమె. ముందు వెనువెంటనే

## ౪౪. ఉపాధ్యాయవృత్తి

కుటుంబభారము వహింపవలసిన నాకు, సర్వవిధములను ఉపాధ్యాయ వృత్తి నవలంబించుటయే కర్తవ్యముగఁ దోఁచెను.

స్వతంత్రబుద్ధియు, మనోనిశ్చయమును గలిగి కార్యసాధనము చేయుట విద్యాధికులధర్మ మనుట నిజమె. కాని, నిన్నటి వఱకును తలిదండ్రుల పరిపోషణముననుండి, తన విద్యావిషయమై వారిని మితి లేని వ్యయప్రయాసములపాలు చేసి, ఈనాఁడు విద్యాపరిపూర్తిచేసి, స్వతంత్రజీవనసంపాద్యము చేయుటకు శక్తి వచ్చినతోడనె, వారికి తన యూహాపోహలు సవిస్తరముగఁ దెలుపక, వారి యాలోచనలు సాకల్యముగ నాకర్ణింపక, బాధ్యతాయుతమగు వృత్తిసమస్యను తా నొకఁడె వేవేగముగఁ బరిష్కరింపఁబూనుట, ఏయువకునికిని సాహసకృత్యమె!

ఇంకొక కారణమువలనఁగూడ నా వృత్తినిర్ణయకార్యము, అసమగ్రము, అసంతృప్తికరము నయ్యెను. నే నిపుడు స్నేహితులతోఁ గలసి ఆస్తికపాఠశాలాసంస్థలోఁ బని చేయ నుద్యమించితినిగదా. అందలి యుపాధ్యాయు లందఱితోఁబాటుగ నాకు నచట నీయఁ బడెడి స్వల్ప గౌరవవేతనముతో మాపెద్దకుటుంబమునకుఁ బోషణ మెట్లు జరుగఁగలదు? నేనుదక్క మాయిల్లు చక్కపెట్టఁగలవా రెవరు నీసమయమున లేరుకదా? పోనిండు, స్వార్థచింతనము విడిచి, పారమార్థికబుద్ధితోనె నే నీపాఠశాలానిర్వహణ మను గుండములోఁ దుముక సిద్ధపడితి ననుకొన్నను, నన్నుఁ బెంచి పెద్దవానినిఁ జేసి నా శ్రేయస్సుగోరి, నామీఁద నాధారపడిన తలిదండ్రుల కీసంగతి ధారా శముగ నెఱిఁగించి, ముందు వారిదారి వారు చూచుకొనుఁ డని చెప్పి వేయుట న్యాయ్యముగదా!

ఇవ్విధమున ముందలి సాధకబాధకములు బాగుగ నాలోచించుకొనక, పట్టపరీక్షాఫలితములు తెలియకమున్నె, వేవేగముగ నేను బోధనాభ్యసనకళాశాలకుఁ బరుగిడితిని!

## ౭౫. సైదాపేట

౧౮౯౩ వ సంవత్సరము ఫిబ్రవరి ౧ వ తేదీని సైదాపేట బోధనాభ్యసనకళాశాలలో మృత్యుంజయరావు నేనును జేరితిమి. ఆ విద్యాలయములో జ్ఞానకాండమునకంటె కర్మకాండమునకే ప్రాముఖ్య మీయఁబడుచుండెను. ఒకొక్కప్పుడు, జ్ఞానసంపాదనమున కచట బొత్తిగ నవకాశము గలిగెడిదియేకాదు! అచ్చటి నిరంతరకర్మకలాపము విద్యార్థులను పట్టి కీలుబొమ్మలగఁ జేయుచుండెను! వేకువనె డ్రిల్లు, పిమ్మట డ్రాయింగు. ఈరెండును పూర్తియగునప్పటికి తొమ్మిదిగంటలు. పదిమొదలు నాలుగు నాలుగున్నరవఱకును బడి. పిమ్మట కసరతుగాని, సభగాని, సాయంత్రమువఱకును. మొత్తముమీఁద విద్యార్థి చదువుకొనుట కేమియు వ్యవధి లేకుండెడిది. కసరతు అయినను, శరీరమున కేమియు వ్యాయామ మొసంగని వట్టి డ్రిల్లు. ఇందు సరిగా కీలుబొమ్మలవలెనే సాధకులు వికృతాంగ వైఖరులతో నటునిటుఁ దిరుగుచు కాలక్షేపము చేయుదురు!

ఒకపూట ఉపాధ్యాయులు మాకు బోధింతురు. ఈబదులు తీర్చివేయుటకా యనునట్లుగ మే మింకొకపూట మావిద్యార్థులకు బోధింతుము! కళాశాలనుండి మేము గ్రహించినది విద్యావిశేష మేమియు నందు లేదనియె! ఇచటి బోధనాప్రభావ మింతటితో నిలువక, జ్ఞానబోధకపుస్తకములు మేము చదువ నవకాశముకూడ లేకుండఁ జేసెను! సహోపాధ్యాయుఁడగు డెన్హాముదొర ప్రవీణుఁడు. ఆయన

విద్యావిశారదుఁడును, విశాలహృదయుఁడును. ఆ విద్యాలయమందలి విద్యనిరర్థక మని చెప్పివేయ నాయన వెనుదీయఁడు! ఇంగ్లండుదేశమందలి విద్యార్థులనుగుఱించియు, విద్యాశాలలనుగుఱించియు, వినోదవిషయములాయనవలన వినుచుందుము.

మే మచట మా విద్యార్థులకుఁజేయు బోధనావిధానమును గుఱించి కొంచెము చెప్పవలెను. ఇంచుమించుగ నందఱు విద్యార్థులును నిరక్షరకుక్షులె. విహారార్థమె వారు విద్యాశాలకు వేంచేయుచు, బోధకవిద్యార్థులగు మాబోటి క్రొత్తవారిని జూచి పరిహసించుచు, మా ప్రశ్నలను వినుపించుకొనక వాని కపసవ్యసమాధానములిచ్చుచు, చదువు నేరువవలె నను వాంఛ యేకోశమునను లేక, గురువుల కడ్డంకులు గలిగించుచు వ్యర్థకాలక్షేపము చేయుదురు! విద్యార్థుల నేపట్టునను గొట్టక తిట్టక మఱి విద్యాబోధన చేయవలె నను విపరీతసిద్ధాంత మా విద్యాశాలయందు ప్రాచుర్యమున నుండుట గ్రహించి, విద్యార్థులు వినయవివేకములు వీడి, సర్వస్వతంత్రులై మెలఁగుచుండిరి. ఇచటి వికారపువిద్యలు విపరీతవిధానములును జూచి, ఏదో యొకవింతలోకమున నుంటి మని కొన్నాళ్లవఱకును మే మనుకొంటిమి.

మృత్యుంజయరావు, అతనిభార్యయును ఇపుడు సైదాపేటలో నొకచిన్నయింటఁ గాపుర ముండిరి. నేను అఱవ పూటకూటింట భుజించుచు, స్నేహితునిబసలో నివసించుచుంటిని. కొలఁదిదినములలో ప్రథమశాస్త్రపరీక్షాఫలితములు తెలిసెను. మాతమ్ముఁడు వెంకటరామయ్య ఆపరీక్షలో నుత్తీర్ణుఁడై, పట్టపరీక్షతరగతిలోఁ జేరెను. మృత్యుంజయరావు తమ్ముఁడు కామేశ్వరరావు చెన్నపురిలో పట్టపరీక్షకుఁ జదువుచు, సైదాపేటలోని యన్నయింట విడిసియుండెను. ఆర్యపాఠశాలాధికారియు, హిందూపత్రికాసంపాదకులును నగు జి. సుబ్ర

ష్ణయ్యగారు, బుచ్చయ్యపంతులుగారిసిఫారసుమీఁద, బోధనా భ్యసనానంతరమున మిత్రుని నన్నుఁ దమవిద్యాలయమున బోధకులగ నియమింతుమని వాగ్దానము చేసిరి. కొలఁదిదినములకే మాపట్టపరీక్షాఫలిత ములు తెలిసెను. గణితశాస్త్రమునందు జయ మందుటచేత మృత్యుం జయరావును, మూఁడుభాగములందు నొకమాఱె యుత్తీర్ణ మగుటచేత నేనును, పట్టపరీక్షఁ బూర్తి చేసితిమి. కావున మేము బోధనాభ్యసన కళాశాలలో నుండుట నిశ్చయ మయ్యెను.

పైని చెప్పిన నిత్యకర్మానుష్ఠానమున మునిఁగి మిత్రుఁడు నేనును మేయిగంవతేదీవఱకును సైదాపేటలో నుంటిమి. మాకుఁ బ్రియమగు భావికాలమునందలి "ఆస్తికపాఠశాల"నుగుఱించి మే మిరువురము మాటాడుకొనుచుందుము. ఆవిద్యాలయము నెలకొల్పుట సాధ్యమని యొకమాఱును కా దని యొకమాఱును మాకుఁ దోఁచుచుండెను. పాఠశాలాస్థాపనము నిజమైనచో, రాజమంద్రిలో ముందు మేము సమాజవిధులు, పత్రికపనులు నెట్లు జరుపుదుమా యని యాలోచించు కొనుచుందుము.

మృత్యుంజయరావు స్నేహపాత్రుఁడె. కాని, యతఁ డొకొక్కక సారి యమితమితభాషిత్వ మూని, తన మనస్సునందలి సందియములను సహచరుఁడను సహాధ్యాయుఁడను నగు నాతో ధారాళముగఁ జెప్పకుం డెడివాఁడు. పరదేశమున నొకరికష్టసుఖముల కొకరు కావలసిన మా కిరువురకు నందువలనఁ దగినంత సౌహార్ద మేర్పడక, మీఁదు మిక్కిలి యరమరలు జనించెను. తక్కిన మిత్రులైనను, మాపొరపాటులను సవరించి, మాకుఁ బొత్తు గలిగింప నేరకుండిరి.

సైదాపేట మద్రాసునకంటె నెక్కువ యారోగ్యప్రదమైనది. ఆకాలమున బోధనాభ్యసనకళాశాలచెంతనే "వ్యవసాయకళాశాల"

కూడ నుండెడిది. ఆకళాశాల కనుబంధముగ మంచిపొలము లుండెడివి. పెద్దపెద్దయావులు వర్ధిలుచుండెడివి. స్వచ్ఛముగనుండు నచటియావు పాలును, ఆపొలములలో పైరగు కూరగాయలును మేము కొనుక్కొను చుండెడివారము. ఆవైపునకు షికారు పోవునపుడెల్ల నిర్మలవాయువును బీల్చుచు, మనోహరములగు పూలమొలకలను జూచుచు నుండెడివారము.

సైదాపేట యెంతటి చక్కని నిశ్శబ్దప్రదేశమైనను, మే మచటి సౌకర్యముల ననుభవింప వలనుపడకుండెను. కళాశాలాదినముల లో మే మెచటికిని కాలు గదుపుటకు వ్యవధానమె లేదు. నేను అఱవ పూటకూళ్ల వారియతిథిని. అచటివంటకములు మొదట కొన్నిదినములు చోద్యముగ నుండినను, పిమ్మట నోటికి వెగటయ్యెను. చప్పనికూరలు, సారహీనములగు పప్పుపచ్చడులును, నేయిలేని యన్నమును, అనుదిన మును భుజించి, నానాలుక బరడుగట్టిపోయెను! అఱవవారిసాంప్ర దాయములు, ద్రావిడాచారములును జూచి, మా తెలుగుకన్నులు కాయలుగాచిపోయెను! ఎపుడు పాఠశాల గట్టివేయుదురా యని మేము రోజులు లెక్కించుకొనుచుంటిమి. తుదకు ౧౧ వ మేయి తేదీని మిత్రులయొద్ద వీడుకోలొంది, నేను రెయిలులో రాజమంద్రి పయనమైతిని.

## ౨౬. వేసవి సెలవులు

నేను రాజమంద్రికి వచ్చుటయే తడవుగా, మరల నచటిసమా జముకొఱకు పాటుపడితిని. "సత్యసంవర్ధని"కి వ్యాసములు రచింపఁ బూనితిని. కనకరాజు నేనును సమాజపుస్తకములను సరిదితిమి. నే నాతనితో "ఆస్తికపాఠశాల"నుగూర్చి ముచ్చటించునపుడు, సాను భూతి నగఁబఱచి, మిత్రులమనస్పర్థలు పోఁగొట్ట నాతఁడు ప్రయ

త్నింతు ననెను. పాపయ్యగారితోను, నాపూర్వగురువులగు వెంకటప్పయ్యగారితోను, పాఠశాలనుగూర్చి ప్రస్తావింపఁగా, ఆమోదము చూపి సహాయము చేసెద మనిరి.

మేమిట్లు రాజమంద్రిలో "ఆస్తికపాఠశాలా" స్థాపనమును గూర్చిన ప్రయత్నములమీఁద నుండఁగా, ఆ విద్యాలయమును గుఱించి మేము ఔదాసీన్యము వహించియుంటిమని మృత్యుంజయరావు మామీఁద నుత్తరములు గుఱిపించుచుండెను!

మా కుటుంబమునకై మే మిదివఱకు వేలువేలుచోట్ల చేసిన యప్పులన్నియుఁ దీర్చివైచుటకై, ఇపుడు గోటేటి రామభద్రిరాజుగారియొద్ద పెద్దఋణము తీసికొని, ఆయనకు మాతండ్రియు నేనును గలసి పత్రము వ్రాసియిచ్చితిమి. ఆసందర్భమున వివిధప్రదేశముల నుండు బంధువులను జూచి వచ్చితిని.

కొంతకాలమునుండి "వివేకవర్ధని" ప్రచురింపఁబడుచుండుట లేదు. వీరేశలింగముగారు దాని నిపుడు పునరుద్ధరింప నెంచి, తాను దొరతనమువారికొలువున నుండుటచేత, ఆపత్రిక కొకసంపాదకుని గుదుర్చుట కాలోచించుచుండిరి. నేనిపుడు పట్టపరీక్షలోఁ దేఱి, పత్రికాసంపాదకత్వమునఁ గొంత యనుభవము సమకూర్చుకొనుటచేత, వారికన్ను నామీఁదఁ బడెను. ఈగౌరవమునకు హర్ష మందినను, పత్రికాధిపత్యమునకు నేను సమ్మతింపలేదు. సైదాపేటలో విద్యార్థిగ నుండు నేను రాజమంద్రిలోని వారపత్రికకు సంపాదకుఁడనగుట సమంజసమా యని నాప్రశ్నము. నామకార్థము నేను పత్రికాధిపతి నైనచో, రాజమంద్రిలో తానే పని నంతయుఁ జక్క పెట్టుదు నని పంతులసమాధానము. నూతనపత్రికను తమప్రహసనములతో నింపివేసి, పంతులు! నన్నుఁగూడ నభియోగములపాలు చేయు నని నాభయము.

తనయం దీమాత్రపు విశ్వాస ముంచనేరని నాబోటివారలతోఁ గలసి సమాజసంస్థలలోఁ దా నెట్లు పని చేయనేర్తు నని పంతుల బెదరింపు. పెద్దవాఁడగు పంతులమాట శిరసావహింపుమని కనకరాజుని హితోప దేశము. అహంభావ స్వార్థపరత్వముల ప్రేరణమున నే నిట్లు మిడిసి పడుచుంటి నని వా రిరువురు న న్నంత నిందించిరి. అంత్యనిష్ఠురమున కంటె నాదినిష్ఠురమే మేలని నేను స్థిరత్వముఁ బూనియుంటిని. ఆపత్రిక నొకన్యాయవాది నడపుట కంగీకరించె నని తెలిసి, నా కీగండము తప్పుటకు నే నంత సంతోషమందితిని!

౧౧ వ జూన్ తేదీని, ఆఱు నెలలపిల్లయగు మాచిన్నచెల్లె లేకార ణముననో విడువక యేడువ నారంభించెను. దేహముమీఁద దానికి పొక్కులు గానిపించి, బాధ యతిశయించెను. శస్త్రము చేసినయెడల కురుపులు నిర్మూలించు నని నామిత్రుఁడు రంగనాయకులునాయఁడు గారి యభిప్రాయము. దీనికి మాతలిదండ్రులు పెద్దతమ్ముఁడును సమ్మ తింపలేదు. శస్త్రము చేయించినఁగాని రోగి జీవింపదని నానమ్మ కము. అంతకంతకు రోగి కడు బలహీనయై వేదన నొందుచుండుటచేత మా కెల్లరకు మనస్తాపము గలిగెను. బంధువులప్రేరణమువలన మా తలి దండ్రులు బాలిక నంతట సావరము గొనిపోయి, అచటివైద్యునిచే మం దిప్పించిరి.

"ఆస్తికపాఠశాల"స్థాపనమునుగూర్చి నేను మిత్రులును బాగుగ సంభాషించుకొంటిమి. మృత్యుంజయరావు భార్యను దీసికొని సైదా పేటనుండి యిక్కడకు వచ్చెను. పాఠశాలస్థాపనమునుగుఱించి యతని కెక్కువయలజడి గలిగెను. ఈవిషయమై కళాశాలాధ్యక్షు లగు మెట్కాఫ్ దొరను జూచి మాటాడుట ముఖ్య మని మాకుఁ దోఁచెను. కాని, "వివేకవర్ధని" పత్రికాధిపత్యమునుగుఱించి నేజూపిన

యసమ్మతిని గంటకించిన వీరేశలింగముపంతులుగారు మాతో వచ్చుట కిష్టపడలేదు. కావున కనకరాజు నేనును మెట్కాఫ్‌దొరదగ్గఱకు వెళ్లి మా నూతనపాఠశాలనుగుఱించి సవిస్తరముగ మాటాడితిమి. దొరతనమువారికి ముందు రాజమండ్రిలో నున్నతపాఠశాలావిద్యను తమ చేతులలోనికే తీసికొందురనియు, కావున మాపాఠశాల కచట నవకాశము లేదనియు, ఆయన చెప్పివేసిరి! మఱునాఁడు నాలుగవ జూలై తేదీని, మే మిరువురమును పంతులుగారి కీవార్త తెలిపితిమి. ఎన్నికష్టముల నైన సహించి, పాఠశాలను స్థాపించి, అందు మేమందఱమును పని చేసెదమని పంతులుగారితోఁ జెప్పివేసితిమి.

౭వ జూలై తేదీని, మద్రాసు ప్రయాణము తలపెట్టుకొంటిమి. ఈమాఱు భార్యతో నే నచటికి బయలుదేఱితిని. గంగరాజు కామేశ్వరరావులు వారిపత్నులతోఁ బ్రయాణ మయిరి. గోదావరి దాటుటకు మే మందఱమును స్టీమరురేవునకు వచ్చునప్పటికి, మాకు వీడుకోలొసంగుటకు పంతు లచటికి వచ్చి వేచియుండెను. ఆస్తికవిద్యాలయములోఁ బని చేయుదు నని నేను జెప్పినపు డాయన మిగుల సంతోషభరితుఁ డయ్యెను.

మిత్రు లందఱమును గూడి పోవుచుంటిమి గాన, మాకు ప్రయాణకష్టము గానఁబడలేదు. కంభముసమీపమందలి గుహలు వనములు పర్వతములు మున్నగు సుందరదృశ్యములు మా కనులకుఁ బండువు చేసెను. ఎనిమిదవ తేదీని మద్రాసు చేరితిమి. భార్యతో సైదాపేటలోఁ గాపుర ముండి, అన్నగారికి భోజనసదుపాయము చేయవలె నని కామేశ్వరరావు అదివఱకు సంకల్పించుకొనియుండెను. గంగరాజు నాకంటెను నిదాన మెఱుఁగని వేగిరపాటు గల మనుష్యుఁడు. ఇపు డాతని యాలోచనచొప్పున, గంగరాజు కామేశ్వర

రావుగార్లు పరశువాకములో బుచ్చయ్యపంతులుగారియింటఁ గలసి కాపురము చేయునట్టుగను, సైదాపేటలోఁ గాపురముండు నేను మృత్యుంజయరావునకు భోజనసౌకర్యము చేయుటకును, ఏర్పాటు లయ్యెను! సహాధ్యాయుఁడు కొల్లిపర సీతారామయ్యగారు సకుటుంబముగ నుండు నింటిభాగమున మేము సైదాపేటలోఁ గాపుర మేర్పఱుచుకొంటిమి. కురుపులబాధతో మాకడగొట్టుచెల్లెలు చనిపోయెనని తెలిసి మిగుల విషాద మందితిమి.

## ౪౭. వ్యాధిగ్రస్తత

నేను సైదాపేటలో పాదము పెట్టుటయే తడవుగ నాశరీరమున మరల వ్యాధి యంకురించెను. జ్వరముతో నారంభించినరోగము మెల్లగ నజీర్ణవ్యాధిగఁ బరిణమిల్లెను. నా జఠరము మిగుల బలహీనమయ్యెను. మద్రాసునందలి మిత్రుఁడు నారాయణస్వామినాయఁడుగారు మంచిమందు లిచ్చెనేగాని, రోగములొంగక లోలోననే రగులుచుండెను. నీరసము హెచ్చెను. కొంచెము నెమ్మదిగ నుండినపుడు పాఠశాలకుఁ బోయి విద్య గఱపుచును, బజారువెచ్చములకై యెండలోఁ దిరుగుచును నుంటిని. ఈమధ్యగ నొకటిరెండుసారులు నాభార్యయు జబ్బుపడెను. ఎటులో నాపనులు చేసికొనుచు, నేను దినములు గడుప నెంచితిని.

" లంకణములలో మనుగుడుపు"అనునట్టుగ, కష్టపరిస్థితులందు నాభార్యకుఁ జదువు చెప్పుటకును, ధర్మశాస్త్రములు బోధించుటకును నేను బూనుకొంటిని! నాసహచరుఁడు సీతారామయ్యగారిసతియు జననియు చెల్లెండ్రును నాభార్యయందమిత ప్రేమానురాగములు గలిగి వర్తించిరి.

క్రొత్తనెచ్చెలుల సావాసమున నాభార్యకు విద్యయందభిరుచి కలిగెను. నాగురువర్యులగు మల్లాద వెంకటరత్నముగారు ఆజూలై నెలనుండియుఁ బ్రచురించెడి "తెలుఁగుజనానాపత్రిక" ప్రతులును, "సత్యసంవర్ధనీ" పత్రికయును, ఇతరపుస్తకములందలి కథలు మున్నగునవియును జదువుచు, నాభార్య విద్యయం దభివృద్ధిఁగాంచుచుండెను.

నా నీరసస్థితిని గ్రహించి కళాశాలలో ప్రథమోపాధ్యాయుఁడు నేను బోధింపవలసినపాఠములు తగ్గించెను. ఇప్పుడు నేను ప్రవేశపరీక్షకుఁ జదివెడి యొకవిద్యార్థికి తెలుఁగుమాత్రమే చెప్పవలెను.

రాజమంద్రిలోని క్రైస్తవపాఠశాలాధికారి తనవిద్యాలయమునందు ప్రథమోపాధ్యాయపదవి నా కిచ్చెద నని జూలై తుదిని వ్రాసెను. నా కిది యక్కఱలేదని యానాఁడే యాయనకుఁ బ్రత్యుత్తర మిచ్చి, యీసంగతి కనకరాజునకుఁ దెలియఁబఱచితిని.

కష్టసుఖములందును రోగారోగ్యములందును, పత్రికాపుత్రిక యగు సత్యసంవర్ధని యభ్యున్నతికై నేను పాటుపడితిని. ఇప్పుడు నెలనెలయును ఆంగ్లేయవ్యాసములు నేనే వ్రాసి సరిచూచి పంపుచు వచ్చితిని. ఇవిగాక, వార్తలు విశేషములు, ఉల్లేఖనములును నేనే సిద్ధపఱచుచును, అప్పుడప్పుడు ఆంధ్రవ్యాసములు రచించుచునువచ్చితిని. ఇప్పుడు కనకరాజు పట్టపరీక్షకు కొలఁదిమాసములకే పోవలసినవాఁ డగుటచేత, ఆపరీక్ష మొదటితరగతిలోఁ జదువుచుండు నాతమ్ముఁడు వెంకటరామయ్య "సత్యసంవర్ధనీ" సంపాదకత్వమున నాతనికి సహాయుఁ డయ్యెను.

రాఁబోవు సంవత్సరమునుండియు రాజమంద్రిలో మొదటితరగతి బోధనాభ్యసనకళాశాల నెలకొల్పఁబడు నను వార్తను ఆగష్టు నాలుగవ

## ౪౭. వ్యాధిగ్రస్తత

తేదీని "హిందూపత్రిక"లో నేను జూచితిని. ఇదియే నిజ మైనచో, మెట్కాఫ్ద్వార చెప్పినట్టుగ రాజమంద్రిలోని యున్నతపాఠశాలావిద్య యంతయు దొరతనమువారి హస్తగత మగును! అందువలన మాయుద్యమమునకు తప్పక భంగము గలుగును. ఇది చూచిన మృత్యుంజయరావునకును నాకును మతి పోవునటు లయ్యెను. ౬ వ అగష్టు ఆదివారమున, నేను మృత్యుంజయరావును గలసి చెన్నపురి వెళ్లి, హిందూపత్రికాధిపతియగు సుబ్రహ్మణ్యయ్యరుగారితో సంభాషించితిమి. రాజమంద్రికళాశాలనుగుఱించి నేను వ్రాయువ్యాసము లాయన తన పత్రికయందుఁ బ్రచురించుట కంగీకరించెను. "ఆంధ్రప్రకాశిక" పత్రికాధిపతులగు పార్థసారధి నాయఁడుగారు నిటులె చేయుటకును, నాకుఁ దమపత్రిక నుచితముగఁ బంపుటకును దయతో సమ్మతించిరి.

ఆసాయంకాలము మరల మేము సైదాపేట వచ్చునప్పటికి హిందూపత్రికకు నాప్రథమవ్యాసము పూర్తియయ్యెను! మఱునాఁడె నే నది యాపత్రికకుఁ బంపివేసితిని. కడుపులోనివికారముతో బాధ నొందుచుండినను, వ్యాసరచనావ్యాసంగమున నే నుంటిని! ఆదినములలో కామేశ్వరరావుభార్య పరశువాకములో జబ్బుపడుటచేత, ఆమెసహాయార్థమై నాభార్య నచటికిఁ బంపివేసితిని. నా కంతకంతకు శరీరమున వ్యాధి నీరసములు హెచ్చుచుండెను. ఒకనెల సెల వీయుఁడని వైద్యాలయాధికారియొద్దకుఁ బోయితిని. సర్టిఫికేటు "శేపిచ్చెదను, మాపిచ్చెదను"అని నన్నాతఁడు త్రిప్పి బాధించెను. కళాశాల రైటరుమాత్రము సజ్జనుఁడు, శాంతచిత్తుఁడును. నాకు సదుపాయము చేయుదునని యతఁడు వాగ్దానము చేసెను. నావ్యాధి దినదినమును ముదురుచుండెను. నాకు వైద్యుని సర్టిఫికేటు దొరకినను దొరకకున్నను, రాజమంద్రి పోయి ప్రాణములు దక్కించుకొన నేను నిశ్చ

యించుకొని, ౧౨ వ అగష్టు శనివారమురోజున మృత్యుంజయరావుతో పరశువాకమునకుఁ బయన మైతిని.

ఆకాలమున సుప్రసిద్ధవైద్యులగు వరదప్పనాయఁడుగారియొద్ద మందు పుచ్చుకొనుచు, చెన్నపురిలోనే యుండు మని బుచ్చయ్య పంతులు గంగరాజుగార్లు నా కాలోచన చెప్పిరి. నాయఁడుగారి మందువలన నేను గొంచెము తెప్పిరిల్లి, వెంకటరత్నము నాయఁడు గారు మున్నగు మిత్రులను సందర్శించుచుంటిని. కాని, ౧౭ వ అగష్టు నుండి నావ్యాధి ప్రకోపించెను. నాయసహాయస్థితిఁ జూచి, నా భార్యయు, మిత్రుఁడు గంగరాజును కన్నీరు తెచ్చుకొనిరి. రాజమండ్రి తిరిగి చూచినఁగాని నాకు దేహస్వాస్థ్యము కలుగదని చెప్పివేసితిని. ఆమఱునాఁటిసాయంకాలము భార్యతో నేను రాజమండ్రి పయన మైతిని. ఈనీరసస్థితిలో నేను ప్రయాణము చేయవలసివచ్చినందుకు మిత్రులు విచారము నొందిరి.

ఐనను, రెయిలులో నాజబ్బు హెచ్చలేదు. కృష్ణానది యావలి యొడ్డున సీతానగరమునందు రెయిలు దిగి, యిసుకలో నడచి, చక్రముల పడవ మీఁద బెజవాడయొడ్డు చేరి, రెయి లందుకొను నప్పటికి, నాకు తలప్రాణము తోఁకకు వచ్చెను! ఎటులో రాత్రికి రాజమండ్రి చేరితిమి. "విశీర్ణగ్రామ" కథానాయకునివలె స్వస్థలముననే నేను స్వస్థుఁడను గాఁగోరితిని! తలిదండ్రులు తమ్ములు చెలియండ్రును నాయెడఁ బ్రేమాతిశయమున నుండిరి.

రాజమండ్రి వచ్చినకొన్ని దినములవఱకును నాకు దేహమున పసిగా లేదు. ఇచట కనకరాజు వీరేశలింగముపంతులు మున్నగుమిత్రులు నన్నుఁ జూచిరి. రంగనాయకులునాయఁడుగారు, తియ్యనిమందు

లిచ్చి నా యారోగ్యము చక్కపఱతునని నన్నుఁ బ్రోత్సహించిరి. సత్యసంవర్ధనికి వ్యాసములు వ్రాయుట, చందాదారులకుఁ బత్రిక లంపుట, సమాజపుస్తకాగారము సరిచూచుట మున్నగుపనులతో దినములు గడపితిని. స్కాటు, షేక్స్పియర్ మున్నగు కవులరచనములు చదివి వినోదించుచుంటిని.

ఒక్కొక్కప్పుడు కడుపులోనిబాధ యుద్రేకించి నన్ను వేధించుచుండెను. రంగనాయకులునాయఁడుగారు ప్రీతిపూర్వకముగఁ జేసిన వైద్యమువలన, శరీరమునఁ గొంతస్వస్థత గలుగుచుండెను. పరిపూర్ణారోగ్యము లభించుటకు నే నిచ్చట నింకనొకనెల యుండవలయునని స్నేహితు లనిరి కాని, సైదాపేటకళాశాలాధ్యక్షునికోరికమీఁదఁ గాని, నా సెలవు పొడిగింప వీలుపడదని మండలవైద్యాధికారి చెప్పివేసెను. మరల సైదాపేట పోవుట తప్ప నాకు గత్యంతరము లేదు! నే నంత ప్రయాణసన్నాహము చేసితిని. ౧౦వ సెప్టెంబరున చెన్నపురి సుఖముగఁ జేరి, కళాశాలలో మఱునాఁడు ప్రవేశించితిని.

## ౨౮. ఆస్తికపాఠశాల

నేను తిరిగి సైదాపేట సేమముగ వచ్చినందుకు సహచరులు సంతోషించిరి. కళాశాలకుఁ బోయి, యథాప్రకారముగ నాపనులు చూచుకొనుచువచ్చితిని. ఐనను, నాశరీరమునుండి రోగాంకురములు పూర్తిగఁ దొలఁగిపోలేదు. అపుడపుడు నాకు జ్వరము, అజీర్ణమును గానిపించుచునేయుండెను, నాభార్యకుఁగూడ జబ్బుచేయుచునే వచ్చెను. సైదాపేట శీతలప్రదేశ మగుటచేత, తఱచుగ మా కస్వస్థత గలుగుచుండె నని మిత్రు లనుచువచ్చిరి.

1౬౯న సెప్టెంబరున వీరేశలింగముగారు చెన్నపురి వచ్చిరి. వారిని జూచుటకు మేము పరశువాకము పోయితిమి. చెన్నపురి యందలి యితరమిత్రులు నచటి కేతెంచిరి. మఱునాఁడు, పంతులు గారికి మేము విందు చేసితిమి. ప్రార్థనసభలో పంతులుగారు ఉపన్యాసము చేసిరి. పట్టణము పోయి నేను స్నేహితులను జూచి వచ్చితిని. పంతులు గారికిని, మాకును స్నేహితులు విందులు చేసిరి. పంతులు గారి కంత మేము వీడ్కోలొసంగితిమి.

ఈవిందులు గుడిచిన నాకు మరల శరీరమునం దస్వస్థత యేర్పడెను. దీనికిఁ దోడుగ, మావిద్యాసంస్థను గుఱించి గంగరాజునకు నాకును భిన్నాభిప్రాయములు గలిగెను. మనశ్శరీరములు డస్సి నే నంతట సైదాపేట వెడలిపోయితిని.

ఆదినములలో నామనస్సు నమితముగఁ గలంచినవిషయము, "ఆస్తికపాఠశాల"నుగూర్చినదియె. ఆపాఠశాలాస్థాపనముతో నే నాయుద్యోగసంపాదనాసమస్యయుఁ బెనఁగలసి యుండెను. పాఠశాల యేర్పడు నని యొకమాఱును, లే దని యొకమాఱును మాకుఁ దోఁచుచుండెను. "సంగీతముచేత బేరసారము లుడిగెఁ"అనునట్లు, ఆస్తిక పాఠశాల నెలకొల్పువిషయమున భిన్నాభిప్రాయము లేర్పడి, మా స్నేహితులలో వైషమ్యములు జనించెను. ఒకచోటనే చదువు సాగించుకొనుచుండెడి మృత్యుంజయరావునకు నాకును పూర్వసౌహార్దసామరస్యములు వేగముగ నెగిరిపోవుచుండెను!

కొలఁదికాలములోనె మేమిచట విద్యాపరిపూర్తి చేసి, యుద్యోగసంపాదనము చేయవలెను. రాజమంద్రిలో "ఆస్తికపాఠశాల"స్థాపితమైనచో, మిత్రులతోఁ గలసి నే నందు పని చేసెదను.

లేనిచో, కుటుంబపోషణమునకై నేను వెంటనే మఱియొక పాఠశాలలో నుద్యోగమును సంపాదింపవలెను. ఈ ద్వంద్వరాహిత్య మైనఁగాని, నాకు ముక్తిగానఁబడదు!

నవంబరు నాలుగవతేదీని మృత్యుంజయారావుతోఁ గలసి నేను పట్టణము పోయితిని. దుగ్గిరాల రామమూర్తిగారు వెంకటరత్నము నాయఁడుగారు, మే మిరువురము నంత పెరంబూరుపోయి, డైరక్టరుగారి యాంతరంగికకార్యదర్శి యగు శేషాద్రిఅయ్యంగారిని గలసికొని, ఆయనతో రాజమంద్రిలో బోధనాభ్యసనకళాశాల యేర్పడుటను గూర్చి సవిస్తరముగ మాటాడితిమి. రాఁబోవుసంవత్సరమునుండియు, రాజమంద్రిలో ప్రభుత్వమువారు బోధనాభ్యసనకళాశాల నెలకొల్ప నిశ్చయించి రనియు, దాని కనుబంధముగ నుండు నున్నతపాఠశాలకు పోటీగా నింకొకపాఠశాల నాప్రదేశమున వారు స్థాపింపనీయరనియును, ఆయన నిష్కర్షగఁ జెప్పివేసెను. మేమంత సైదాపేట వచ్చివేసితిమి. నేను నామువందలి ప్రణాళిక నేర్పఱుచుకొంటిని. రాజమంద్రిలో "ఆస్తికపాఠశాల" స్థాపించుట కవకాశము లేదు గావున, నే నింకొకయుద్యోగమునకై ప్రయత్నము చేయుటకు నిశ్చయించుకొంటిని. ఈసంగతులు తెలియఁబఱచుచు, వీరేశలింగముగారికి నాసోదరునికిని ౧౩ వ నవంబరున నేను రాజమంద్రికి జాబులు వ్రాసితిని.

వీరేశలింగముగా రంత నింకొక యాలోచన చేసిరి. ఉన్నతపాఠశాల నెలకొల్పుట యసంభవ మైనచో, మాధ్యమికపాఠశాల స్థాపింపఁ గూడదా? పరిస్థితు లనుకూల మైనపిమ్మట, ఆచిన్నపాఠశాల పెద్దది కావచ్చును. ఈ మాధ్యమికపాఠశాలాస్థాపననిమిత్తమై పంతులుగారు రెండుమూఁడువేల రూపాయలు విరాళ మిచ్చెదరు— ఈమాటు నాయుద్దేశ మేమి?

౨౮ వ నవంబరున నేను మృత్యుంజయరావుతోఁ బరశువాక మేఁగితిని. అక్కడకు పట్టపరీక్షనిమిత్తమై కనకరాజు వచ్చియుండెను. గంగరాజును కనకరాజును నే మిరువురమును నూతనపాఠశాలను గుఱించి సవిస్తరముగ మాటాడుకొంటిమి. మాధ్యమికపాఠశాలలో నేను బని చేయ నని చెప్పివేసితిని. అంతట కనకరాజు నరసింహరాయఁడు, మృత్యుంజయరావుగార్లు ముగ్గురును గలసి, మాధ్యమికపాఠశాల నెలకొల్పెద మనియు, "సత్యసంవర్ధని" ని వారపత్రికగాఁ జేయుదు మనియుఁ జెప్పిరి. సత్యసంవర్ధనితో వివేకవర్ధనిని జేర్చుట నా కిష్టమా యని వీరేశలింగముగారు నాకు వ్రాసిరి. "ఆస్తికపాఠశాల"లో నా కిఁక జోక్యము లే దనియు, "సత్యసంవర్ధని" నెటులైన మార్పవచ్చు ననియు, నేను పంతులుగారికి వ్రాసివేసితిని. రాజమంత్రిలో నింకొక మాధ్యమిక పాఠశాలనైన దొరతనమువా రంగీకరింపనట్లు తెలిసికొంటి నని మృత్యుంజయరావు వార్త గొనివచ్చెను.

నే నంతట వేఱు ఉద్యోగమునకై ప్రయత్నించితిని. రాజమంద్రిలో దొరతనమువారు స్థాపింపనున్న బోధనాభ్యసనకళాశాలలో నాకుఁ బని దొరకవచ్చును. కాని, దొరతనమువారి కొలువులో నేను జేరఁదలఁచుకొనలేదు. రాజమంద్రిక్రైస్తవపాఠశాలలో ప్రథమోపాధ్యాయపదవిసంగతికూడ నింకను స్థిరపడలేదు. యలమంచిలి, అమలాపురముపాఠశాలలలో ఖాళీ లున్న వని తెలిసి, నేను దరఖాస్తుల నంపితిని. ఏదేని యొకయుద్యోగములోఁ బ్రవేశించి, కుటుంబపోషణముఁ జేసికొనఁగోరితిని. సైదాపేటకళాశాలలోని నాచదు వంతట ముగిసెను. నేను భార్యయు పరశువాకము వచ్చి, బుచ్చయ్యపంతులుగారియింట విడిసియుంటిమి. అపుడపుడు వ్యాధిపీడితుఁడ నగుచుండియు, నేను బరీక్షకు శ్రద్ధతోఁ జదివితిని. ౧౮౯౮ సం. ౨౨ వ జనవరిని మా

యల్-టి-పరీక్షలు జరిగెను. మే మంతట బయలుదేఱి, రాజమంద్రి వచ్చివేసితిమి.

మృత్యుంజయరావున కంతట బెజవాడక్రైస్తవపాఠశాలలో నుద్యోగమై, యతఁడు వెడలిపోయెను. ఇంతలో మే మిరువురమును యల్-టీ-పరీక్ష మొదటిభాగమున జయ మందితి మనువార్త వచ్చెను. అంత మేము రెండవభాగమందలి పరీక్షకుఁ బోయితిమి. మార్చినెలలో పరీక్షాఫలితములు తెలిసెను. మిత్రుఁడు జయ మందెను; నేను దప్పిపోయితిని. అంతట, మృత్యుంజయరావు బెజవాడలోనియుద్యోగము వదలి, ప్రథమోపాధ్యాయుఁడుగ యలమంచిలి వెడలిపోయెను. తన పాఠశాలలోనే నా కీయఁబడిన రెండవయుపాధ్యాయపదవి స్వీకరింపుమని యతఁడు నాకు బోధించెను. మనసు గలియని మేమిరువుర మొకచోట నుద్యోగముఁ జేయుట మంచిది గాదని నాకుఁ దోఁచెను. ఈప్రాంతములందు నా కుద్యోగము లభింపనిచో, హైదరాబాదు వెడలిపోవఁదలచితిని. నాయవస్థనుగుఱించి నేను మిగుల విచారపడితిని. అంతట, మార్చి ౧ వ తేదీని బందరునుండి నాకు తంతి వచ్చెను. బెజవాడక్రైస్తవపాఠశాలలో డెబ్బదిరూపాయలు వేతనముగల యుద్యోగము నా కీయఁబడెను. దైవమునకు నామీఁద నెట్టకేలకు దయ కలుగుటకు నేను ముదమందితిని.

౯-వ మార్చి తేదీని ప్రొద్దున నేను రాజమంద్రినుండి బయలుదేఱి, మధ్యాహ్నమునకు బెజవాడ చేరి, పాఠశాలాప్రధానోపాధ్యాయులగు శ్రీధన్వాడ అనంతముగారినిఁ జూచితిని. ఆయన సజ్జనులు. నాకెంతో దయ గనఁబఱిచిరి. నేను ఉద్యోగమునఁ జేరితిని. నాకుఁ జూపినకృపావిశేషమునకు దేవదేవునికి హృదయపూర్వకనమస్కృతులొనర్చితిని.

## ౪౯. సైదాపేట చదువు

విద్యార్థిదశయంతటిలోను ఈతుదివత్సరమే నా యారోగ్య విషయమున నధమకాలము. సైదాపేటలో నే నుండినయేఁడాదిపొడుగునను, నేను రోగపీడితుఁడ నగుచునేయుంటిని. దీనివలన నావిద్య కెంతో భంగము కలిగెను. రెండవ యర్ధసంవత్సరమున కుటుంబముతో నుండిన లాభము నే నంతగఁ బొందలేదు. నా వ్యాధిగ్రస్తతఁ జూచి, నామీఁద జాలిగొని, నాచదువుచెప్పుపని తేలికచేసినప్రథమోపాధ్యాయునిసాయమే నాకు విషమించెను! ఆంధ్రవిద్యార్థుల కావిద్యాలయమున చదువు చెప్పుట కొప్పగింపఁబడు తెలుఁగుబాలురతరగతులు చిన్నవిగ నుండెను. ఇంగ్లీషు చెప్పుటకు నా కీయఁబడిన మూఁడవతరగతిలో ఐదారుగురే విద్యార్థు లుండిరి. పిమ్మట నాకు పని కలిగిన చిన్నపాఠశాలలో నిద్దఱు విద్యార్థులే కలరు. ఆవేసవియెండలకో, నాబోధనమహిమముననో, వీరిద్దఱును తరగతిలో నిద్దురపోయెడివారు! రెండవయర్ధసంవత్సరమున వ్యాధి ముదురుటచేత నొకవిద్యార్థిమాత్రమే కల తెలుఁగుతరగతి నా కీయఁబడెను. ఆరోగ్యము చేకూరినపిమ్మటఁ గూడ, నాకు కొలఁదిమందిగల చిన్నతరగతులే సంప్రాప్తమయ్యెను. ఇట్లు నే నాకళాశాలలోఁ గడిపిన యేఁడాదియు తగినంత విద్యాబోధనానుభవమును సమకూర్చుకొనలేకపోయితిని. బోధించుటకు అధిక సంఖ్యగల పెద్దతరగతులు తమ కీయుఁడని తోడిబోధకవిద్యార్థులు గురువులను పీడించుచుండఁగా, నాకోరిక యెపుడును స్వల్పసంఖ్యగల తరగతులు గావలయు ననియే!

ఈకారణములవలన నేను విద్యాబోధన కౌశలమునందు వెనుకఁబడియుంటిని. కావుననే సంవత్సరమునందు రెండుమూఁడు సారులు

నే నిచ్చిన విమర్శనపాఠములందు నేను గురువులయొక్కయు సహాధ్యాయులయొక్కయు సదభిప్రాయమును బడయనేరకుంటిని. శరీరమునందలి నీరసము దీనికిఁ దోడుపడుటచేత, నాబోధన మెవరికిని నచ్చకుండెను. సహజమగు వేగిరపాటునకు సభాకంపము, శరీరదుర్బలతయుఁ దోడ్పడె, పలుకునకు తొట్రుపాటును, దేహమునకు వణఁకును అట్టిసమయములందు గలిగించెడివి! ఒకప్పుడు కళాశాలాధ్యక్షుఁడు విమర్శనము చేయుటకై కూర్చుండిన నా సహపాఠులకు నన్నుఁ జూపించి, "గుడికిఁ గొనిపోవు మేఁకపోతువలె నీబోధకుఁ డెట్లు భయమందుచున్నాఁడో పరికింపుఁడు!" అని పలుకునపుడు, నాయలజడి మఱింత హెచ్చెను. అంత నాసహాధ్యాయులలో పెద్దవాఁ డొకఁడు లేచి, "ఇతనికి జబ్బుగా నున్నది. మీ తెలుఁగరు కాఁబోలు!" అని నిర్భయముగఁ జెప్పఁగా, నే నానాఁడు చెప్పవలసిన పాఠము మఱుసటివారమునకు వాయిదావేయఁబడెను. రెండవమాఱుకూడ నే నిట్టి దుస్థితినే యుండుటఁ జూచి, వెనుకటి సహాధ్యాయుఁ డొకయుపాయము చేసెను. నే నపుడు బోధించిన పాఠము బాగుగ లేదని యందఱికిని దెలిసియేయుండెను. ఈయభిప్రాయ మధ్యక్షుఁడు పుస్తకమున లిఖించినయెడల నా కపకారము కలిగెడిది. తమతమ యభిప్రాయము లీయుఁ డని యధికారి సదస్యుల నడిగెను. నాయాశ్చర్య మేమి చెప్పను! నాపాఠము మిక్కిలి చక్కఁగ నుండెనని కొందఱును, మార్గప్రదర్శకముగ నుండెనని కొందఱును జెప్పివేసిరి! ఈశ్లాఘనము వినిన యధ్యక్షుఁడు తనయభిప్రాయమునే మార్చుకొని, నాపాఠము మొత్తముమీఁద బాగుగనే యుండెనని నిర్ణయించెను!

బోధనాభ్యసనకళాశాలలోని పని సామాన్యముగ బూటకమని యందఱు నెఱిఁగినదియె! ఐనను, నాటకరంగమున కేతెంచిన

నటుఁడు, పాత్రానురూపమగు నభినయము చేయకతీఱునా? బ్రదుకు తెఱవెఱిఁగిన నాసహపాఠులలోఁ బలువురు, బోధనసమయమున లేని వికాసమును చుఱుకుఁదనమును దెచ్చుకొని, మృదుమందహాసములతో బోధనకార్యము నెఱపి, కృతకృత్యు లగుచువచ్చిరి. ఇట్టి కపటనటన మయోగ్యమని యెంచిన నేను, నాబోధనమును తగినంత సొగసుగను సారవంతముగను జేయ ప్రజ్ఞానుభవములును, కనీసము వాంఛాబల మైనను లేక, బోధనకార్యమం దపజయము గాంచుచుంటిని! ఈకారణముననే, అదివఱ కే పరీక్షలోఁగాని పరాజయ మెఱుంగని నేను, యల్‌-టీ-పరీక్షలోని బోధనభాగమున పిమ్మట ముమ్మాఱు తప్పి, వృత్తిలో నాకుఁ జేకూరెడి లాభమును జాలభాగము గోలుపోయితిని!

## ౫౦. పత్రికాయౌవనము

ద్వితీయసంవత్సరప్రారంభముననే సత్యసంవర్ధనికి యౌవన దశాసంప్రాప్త మయ్యెను. దీని కొకచిహ్నముగ, రెండవసంపుటము నుండియు మాపత్రిక, ముప్పదిరెండుపుటలు రంగుకాగితపుముఖపత్ర మునుగల రమ్యపుస్తకరూపమున విలసిల్లెను. బాహ్యవేషముతోనే పత్రికమిసమిసలు తుదముట్టలేదు. నా యాంగ్లవ్యాసములందును, కనకరాజునియాంధ్రరచనములందును, చక్కని యభివృద్ధి గాన వచ్చెను. ౧౮౯౪ సంవత్సరము జూలై నెలసంచికలో నే నాంగ్లమున వ్రాసిన "మానవజీవితమందలి త్రివిధశోధనముల"లోనె పత్రికయౌవనపుఁబోకడలు గనఁబడెను. అప్పటినుండియు నా సత్యసంవర్ధనీ వ్యాసములు వెనుకటివానివలె మొండిముక్కలు గాక, నిడుదలై, భావవిస్ఫురణ వాక్యసౌష్ఠవములతో విరాజిల్లుచుండెను. ఆ సెప్టెంబరుసంచికలోని నా "అనుష్ఠానికధర్మము"నం దీసంగతి విస్పష్ట

మయ్యెను. ౧౮౯౩-వ సంవత్స రారంభమునుండి నాయింగ్లీషువ్యాసము లింకను దీర్ఘములై భాషాసారస్యమున నొప్పారుచుండెను. ఆసంపుటములో నేను వ్రాసిన "ఆంతరంగికమతము," "ఈశ్వరధ్యానము", "జాగ్రన్మోక్షము", "స్త్రీస్వాతంత్ర్యము" మున్నగువ్యాసములలో విద్యానుభవములందు దినదినాభివృద్ధి నొందెడి మనశ్శక్తుల వికాసము విస్పష్టమయ్యెను. ఆంగ్లసాహిత్యమన తత్త్వశాస్త్రములలో నాకుఁ దెలిసిన నూతనాంశములను, నేను విశ్వసించిన పరిశుద్ధాస్తిక మత సిద్ధాంతములతో సమన్వయము చేసికొని, నా యభిప్రాయములను వ్యక్తీకరించితిని. నాశైలి యిపుడు పొంకమును గాంభీర్యమును దాల్చియుండెను.

సత్యసంవర్ధనియందలి యితర రచయితల వ్యాసములందును, అభివృద్ధి గానవచ్చెను. వీరేశలింగముపంతులుగారు దివఱకె విఖ్యాతిఁ జెందినగ్రంథకర్తలైనను, సత్యసంవర్ధనికిఁ దఱచుగ వ్రాయుచుండలేదు. వారివ్రాఁతలును నునుపెక్కెను. ౧౮౯౩-వ సంవత్సరమున వీరాపత్రికలో, "వర్ణము", "విద్యాధికులధర్మములు" నను దీర్ఘోపన్యాసములు వ్రాసిరి. ఇవి వారియుపన్యాసములలో నెల్ల ప్రథమగణ్యములు. మొదటిది విషయబాహుళ్యముచేతను, రెండవది వాదనపటుత్వమునను, లలితవాక్యసంఘటనమునను బేరెన్నిక గన్నది. మాతమ్ముఁడు వెంకటరామయ్య, ౧౮౯౩ మే సంచికలో వ్రాసిన "కేశవచంద్రబ్రహ్మానందులు", ౯౪ వ సంవత్సరారంభమున వ్రాసిన "నీతిమతములు"ను, అపుడె రమ్యవ్యాసరచన మాతనికిఁ బట్టుపడుటను సూచించుచున్నవి. అందఱి కంటెను కనకరాజుని వ్రాఁతలలోని యభివృద్ధి మిగుల స్పష్టముగ నుండెను. వ్యాసరచనమందును, గ్రంథవిమర్శనమునను, అతనికలము కఱకుఁదనము గాంచియుండెను. ౯౩ జూనులోఁ బ్రచురింపఁబడిన

"శ్రీవడ్డాదిసుబ్బరాయకవి విరచిత ప్రబోధచంద్రోదయ విమర్శన" యాతని రచనమె. ఇపు డీతని వ్రాతలు వీరేశలింగముగారి రచనములం బోలియుండెను. సామాన్యపఠితల కీయిరువురు రచయితల వ్రాతలకును భేదము గానిపించెడిది కాదు!

---

# ఆత్మచరిత్రము

—:(౦):—

## ద్వితీయభాగము : ఉపాధ్యాయదశ

---

### ౧. బెజవాడ

౧౮౯౩-వ సంవత్సరము మార్చి౯-వ తేదీని నేను బెజవాడ కేఁగి, నాకు లభించిన యుద్యోగమునఁ బ్రవేశించితిని. నా కనుల కపుడు, విజయవాడయె కాక, జగతీరంగమంతయు నూతనకాంతులతో విలసిల్లెను. ఇదివఱకు తలిదండ్రుల పోషణమున నుండి, వారి చెప్పుచేతలకు లోనై, వినమ్రభావమున, నేను మెలంగితిని. నాహృదయమున గోదావరినదివెల్లువలవలె సంస్కరణవిషయములను గుఱించిన మహాశయము లుప్పొంగుచున్నను, కార్యస్వాతంత్ర్యము లేమిం జేసి వానినెల్ల నిరోధించి, లేనియోపికను దెచ్చుకొని మసలవలసినవాఁడనైతిని. ఇపుడన్ననో, నేను విద్యముగించి, వృత్తిఁ జేకొని, సంసారసాగరమును స్వతంత్రముగ నీదఁజొచ్చితిని. లోకమును గుఱించి వట్టి యూహాపోహములతోనే నే నిదివఱకుఁ గాలము గడిపితిని. ఇప్పుడో, జీవితమందలి కష్టసుఖములు, మేలుకీడులును క్రమముగ నా కనుభవగోచరము కాఁజొచ్చెను.

నా నూతనాశ్రమజీవితమును స్పష్టముగ సూచించుటకో యన నీనూతన పురనివాసమును నా కిపుడు సంఘటిల్లెను. బెజవాడ నే నిదివఱకెఱుంగనిది కాదు. చెన్నపురి పోయి వచ్చుచుండినప్పుడు పలుమాఱు నేనీ పట్టణమును సందర్శించుచునే యుంటిని. కాని యిదివఱ కెపుడును, ఈనగర మామూలాగ్రముగ నేను పరిశీలింపలేదు. కావున విజయవాడపురము నా కెంతయుఁ గ్రొత్తగ నుండెను. ఇచటిప్రకృతిదృశ్యము లత్యంతరమణీయములు. కృష్ణవేణీనది, దాని కిరుపార్శ్వములనుండి ఱెక్కలవలె మింటి కెగయుపర్వతపంక్తులు, తూర్పున మొగలరాజపురపుకొండ, నదిమీఁదఁ గట్టినయానకట్ట రెయిలువంతెనలు, వీటినుండి వెడలిన మూఁడుకాలువలు, దాపుననుండు కొండమీఁద వెలసిన కనకదుర్గాలయము,—ఇవి యన్నియు నేత్రోత్సవముఁ జేయుచుండును. బందరురైవిసుకాలువలమధ్య విచిత్రద్వీపకల్పమువలె నేర్పడిన బకింగుహాముపేట యుద్యానవనమువలె సొంపారుచుండును. బందరుకాలువ యొడ్డునందలి చిన్నబాటను చెట్లనీడను నడచిపోవునపుడు, కాలువనీటినుండి వీతెంచెడి చల్లనిగాలి ననుభవించుచు, పక్షుల మధురాలాపములు వినుచును, నే నేదో విచిత్రలోకవిహారము చేయునటు లనుకొనువాఁడను!

ఇచటివారికిని గోదావరిమండలజనులకును, వేషభాషాచారములం దనేకభేదములు నాకుఁ బొడఁకట్టెను. అయినను వీరును సోదరాంధ్రులే. కావున విద్యాబోధకరూపమున నాంధ్రావనియందు సాంఘికసేవ లొనర్ప నే నవకాశములు గలిపించుకొనఁబూనితిని.

నేను బెజవాడ వచ్చిన మఱునాఁడే, ఆ పాఠశాలావిద్యార్థులకు బహుమతులు పంచిపెట్టఁబడెను. ఆ సభాసందర్భమున నచటికి విచ్చేసిన పౌరప్రముఖులతో ప్రథమోపాధ్యాయులగు శ్రీ ధన్వాడ అనంతము

గారు నాకుఁ బరిచయము గలిగించిరి. మఱునాఁడు మా తండ్రి రాజమండ్రినుండి నా భార్యను, తమ్ముఁడు సూర్యనారాయణను బెజవాడకుఁ గొనివచ్చెను. మేము తాత్కాలికముగ నొక స్నేహితునియింట విడిసితిమి. పాఠశాల కొంతదూరమైనను, బకింగుహాము పేట వాసయోగ్య మగుటచేత, మే మచటనే యుండ నిశ్చయించితిమి. కాలువవంతెనకుఁ జేరువనుండు గోవిందరాజులవారియింటిలో నొకభాగమును మా తండ్రిగారు మాకుఁ గుదిర్చిరి. చదువుకొనుటకే సూర్యనారాయణ యిచటికి వచ్చినను, మా తల్లిని విడువనోల్లక, మూఁడునాలుగుదినములలో పయనమైన మాజనకునివెంటఁబడి యాపసివాఁడు రాజమండ్రి వెడలిపోయెను! మా క్రొత్తకాపురమునకు వలయు వస్తుసముదాయమును బజారునుండి కొనితెచ్చియిచ్చి, మా తండ్రి మమ్ము విడిచివెళ్లెను. అనంతముగారియొక్కయు, ద్వితీయోపాధ్యాయులగు దేవసహాయముగారియొక్కయు సాయమువలన, కూర్చుండుటకు కుర్చీలు బల్లలు మున్నగు సామాను నేను కొని, నూతనపురనివాసమున కాయత్తమైతిని.

కాని, జీవితమున నన్ను గాసిఁబెట్టుటయే వినోదముగఁ గైకొనిన వికటవిధి నా కిపుడైన మనశ్శాంతి లేకుండఁజేసెను! నూతన ప్రదేశమునఁ గ్రొత్తకాపుర మారంభించిన నా కాశాభంగ మొనరించెడి యుదంత మొకటి యంతట సంభవించెను. బెజవాడ పాఠశాలాధికారియు, బందరు నోబిలుకళాశాలాధ్యక్షుఁడును, నా యుద్యోగ ప్రదాతయునగు రెవరెండుక్లార్కుదొర నాకొకలేఖ నిపుడు వ్రాసెను. నేను యల్. టి. పరీక్షలో పూర్తిగ విజయమందనిహేతువున నామూలమునఁ దమవిద్యాలయమునకు దొరతనమువారినుండి యాదాయ మేమియు రాదు గావున, తా నిదివఱ కేర్పఱచినట్టుగ డెబ్బదియాపా

యిలు కాక, అఱువదియే నాకు జీతమిచ్చెద వని యాయన తెలియఁ బఱిచెను! ఈ సంవత్సరమైన డెబ్బదిరూప్యము లిప్పింపుఁ డని వారికి వ్రాసికొని, ఆనాఁడే తమ్ముఁడు వెంకటరామయ్య పంపినజాబు ననుస రించి, అమలాపురము పాఠశాలలో ద్వితీయోపాధ్యాయుని యుద్యోగ మునకై ప్రయత్నింప నే నారంభించితిని!

నా మనోవ్యాకులతను బూర్తిచేయుటకీ యుదంత మొక టియే చాలదేమో యనునట్టుగ, ఆ మొదటిదినములలో మాకింకఁ గొన్ని యిక్కట్టులేర్పడెను. దినదినప్రవర్ధమానమగు బెజవాడవేసవియెండలు మా యుభయులను మిగుల వేధించెను. ఇరువురమును కురుపులచేత బాధపడితిమి. కడుపునొప్పి, జ్వరము మున్నగు వ్యాధులు నా భార్యను బీడించెను. ఆ కష్టసమయములందు, ఇంటియజమానురాలగు శ్రీమతి సుబ్బమ్మగారు మా కమితముగఁ దోడ్పడిరి. మంచమెక్కిన నాభా ర్యకు చికిత్సాపరిచర్యలు చేయుచును, నాకు వేళకు నన్నపానము లొనఁగూర్చుచును, ఆయిల్లాలు మాకు రెండవతల్లి యయ్యెను!

౧౮-వ మార్చిని మాపాఠశాలలోని "విద్యార్థిసాహితీసమా జము"వారు నన్నుఁ దమ యధ్యక్షునిగ నెన్నుకొనిరి. ఆ సమాజమునకు నే జేయవలసిన సేవనుగూర్చియు, దాని యభ్యున్నతికై నే గావింప వలసిన యపారపరిశ్రమనుగుఱించియుఁ దలంచుకొనినపుడు, నా మేను పులకరింపఁదొడంగెను! ఇంతియ కాదు, పాఠశాలలోని యనుదిన విద్యాబోధనాకార్యనిర్వహణమందే నాకు నిరుపమానందము గాన వచ్చెను. సతికి విద్యగఱపుట ముఖ్యవిధిగ నే జేసికొని, భారతాది గ్రంథములందలి కథలును, 'సత్యసంవర్ధనీ'పత్రికకు నేను వ్రాయు వ్యాసములును, ఆమెకుఁ జదివి వినిపించుచుండువాఁడను. ఆ బాలకు ముఖ్యముగ మతబోధనము చేయ నాసక్తి గొనియుంటిని. సంఘ

సంస్కరణ విషయములను సతితోఁ జర్చించుచును, తీఱికసమయములందుత్తమవిషయములనుగుఱించి సంభాషించుచును, ప్రొద్దుపుచ్చుచుండువాఁడను.

ఉద్యోగమునఁ బ్రవేశించినను నా వృత్తిసమస్య యింకను పరిష్కారము కానివిధముననే, మతమునుగుఱించి బాహాటముగ ప్రసంగములు సల్పుటకును వ్యాసములు వ్రాయుటకును నే నేర్చియుండినను, నా విశ్వాసము లింకను జీవితమునఁ బెనఁగలసి, క్రియారూపమున వెలువడ నేరకుండెను! ఒకనిముసమున నధికపవిత్రస్థానము నధివసించెడి నాహృదయము, మఱుక్షణముననే హేయవిషయవాంఛల నోలలాడుచుండును! ఈశ్వరచరణకమలధ్యానమే జీవితకర్తవ్యమని నమ్మిననామనస్సు, పలుమాఱు విషయలాలసా పంకమున బ్రుంగుచుండెడిది! తప్పించుకొనఁ బ్రయత్నించినకొలఁది కామోపభోగములందు నా మనస్సు మఱింత గాఢముగఁ గూరుకొనిపోవుచుండును! ఒకనాఁటి మనోనిశ్చయము మఱునాఁటికి హాస్యాస్పదమగుచున్నదనియు, ఈ చిత్తచాంచల్యమునుండి నన్నుఁ దప్పింపుమనియు, దైన్యమున నే నెంతవేఁడుకొనినను, దీనరక్షకుఁడగు దైవము నా మొఱలు వినిపించుకొనక, చెవులు మూసికొని కూర్చుండునట్లు తోఁచెను!

మార్చినెల తుదిదినములలో నొకసాయంకాలము, మరల తన పుస్తకములు విప్పి యాంగ్లము నభ్యసింపుమని భార్యకు బోధించి, నేను బందరుకాలువయొడ్డున షికారుచేయుచు, నా ప్రకృతదురవస్థను జ్ఞప్తికిఁ దెచ్చుకొని, నన్ను రక్షింపుమని దేవదేవుని వేఁడుకొంటిని. నామానసికస్థితినంత నేను విమర్శించుకొంటిని. నా లోపపాపములలో, అసూయ, విషయవాంఛ, నిగ్రహరాహిత్యము, అసమగ్రభక్తియును

ప్రముఖము లని నేను గనిపెట్టి, వీనిని సవరించి నా కాత్మవికాసము గలిగింపు మని పరాత్పరుని వేఁడుకొంటిని. లోకమందు భక్తులచిత్తములు నిరతము భగవదున్ముఖములగుచుండఁగా నాకుమాత్రము లోకవిషయములె మఱెంత హృదయరంజకము లగుచుండుటకు నే నెంతయు విషాదమందితిని!

## ౨. ప్రార్థనసమాజము

రాజమండ్రి ప్రార్థనసమాజవార్షిక సభకు నా కిపుడు పిలుపు రాఁగా, ఆసందర్భమునఁ జదువుటకై "ఆస్తికమతాధిక్యము" అనునొక యాంగ్లోపన్యాసమును నేను సిద్ధపఱిచితిని. ఏప్రిలు ౬-వ తేదీని నేను రాజమండ్రి వెళ్లితిని. మాయమ్మ యపు డారోగ్యవతిగ లేదు. మఱునాఁటిప్రొద్దున తమ్ముఁడు వెంకటరామయ్య యుపన్యాసము జరిగెను. ఆ సాయంత్రము నేను ప్రసంగించితిని. పలువురు సభికులు నా యుపన్యాసమును మెచ్చుకొనిరి. అందలి ముఖ్యవిషయము లిందుఁ బొందుపఱుచుచున్నాను:—

"ప్రార్థనసమాజమువారిమతము ఆస్తికమత మనియు, వారి యర్చనల కధిదేవత పరమాత్ముఁ డనియు నుడువనగును. ఇతరమతములకును దైవమే ముఖ్యమైనను, అవి యామహామహునికంటె నాతని యవతారములకును, ప్రవక్తలకును, ప్రతినిధులకును ప్రాధాన్య మొసంగుచున్నవి. పరిశుద్ధాస్తికమతమునకు మాత్రము దైవభక్తియె ప్రధానాంగము. దీనికి గొప్ప సిద్ధాంతగ్రంథములతోఁ బ్రసక్తి లేదు. మనుష్యుని బాహ్యాంతరప్రకృతులే దేవదేవుని యునికికి సాక్షీభూతములు. జగత్తె యీశ్వరనిర్మితమగు దివ్యభవనము. మనస్సాక్షి మానవచారిత్రాదు లాస్తిక్యమునకు ముఖ్యనిదర్శనములు. పాప మనఁగ

మానవశాసనోల్లంఘనమాత్రమే గాక, పరమాత్ముని పవిత్రాజ్ఞా
తిరస్కారణముకూడను. ఆఘోరవిపత్తునుండి మనుష్యుని రక్షించున
దియే మతము. ఈశ్వరసాక్షాత్కారము వడయుటకు సాధనములు
భక్తిధ్యానానుతాపములు, సత్కార్మనిచయమును. ఈ సాధనకలాప
మున ప్రజ్ఞాశక్తులందు పెనుపొంది, జీవాత్మ పరమాత్మనుఁ జేరఁగలదు.

“తక్కిన మతములకు వలెనే ఆస్తికమతయాథార్థ్యమునకును
సాక్ష్యము లేకపోలేదు. ఈ మతధర్మములచొప్పున జీవితయాత్ర
జరుపుకొని ధన్యులైన యుత్తమజనులచరితములె దీనికి గొప్పసాక్షులు.
రామమోహనరాయలు, దేవేంద్రనాథకేశవచంద్రులును, భరతఖండ
మున నిటీవల నీ మతప్రచారము సలిపి చరితార్థత నొందిన మహా
మహులు. ఈ సమాజసభ్యులగు మేము వారితో సరిపోల్పఁదగిన
వారము గాక, మా యాశయముల కుచితమగు నున్నతపదవినైన నంద
కున్నయల్పుల మైనను, స్వయంకృషిచే దినదినాభివృద్ధి నొందఁగోరు
చున్నవారము. అజ్ఞానతిమిరమునుండియు, పాపకూపమునుండియు
దైవానుగ్రహమున మే మొకింత తప్పించుకొని, సత్పథగాములమై
సాగిపోవ నుద్యమించియున్నారము.”

ఆమఱునాఁడు ప్రార్థనసమాజమువారు బీదల కన్నదానముఁ
జేసిరి. సాయంకాలము వీరేశలింగముపంతులుగారు “జీవితముయొక్క
పరమార్థము, దానిని పొందు మార్గము” అను విషయమున నొక
దీర్ఘోపన్యాసముఁ జేసిరి. మఱుసటిదినమున నేను బెజవాడ వెళ్లి,
పాఠశాలలోని పనులు నెఱవేర్చుకొంటిని.

అప్పటికిఁ గొన్నిదినములకు వెనుకనే నాకు క్లార్కుదొర
నుండి ప్రత్యుత్తరము వచ్చెను. యల్. టి. పరీక్షనిచ్చినపిమ్మట రెండు

వత్సరము లీ పాఠశాలలో నుందునని వాగ్దానము చేసినఁగాని నా కిప్పటి జీత మీయఁజాల నని యాయన చెప్పివేసెను! దీనికి నేను సమ్మతింప లేదు. నాతో క్లార్కుదొర జరిపెడి బేరములు విని మిత్రులు నవ్వసాగిరి. ఇతరోద్యోగ మేమియు సమకూర్చుకొనక, చేతనున్న పని వదలివేయఁగూడదు గదా. ఐనను,౧౦-వ ఏప్రిలు తేదీని నేను కోపమున క్లార్కుదొరకుఁ బంప నొకయుత్తరము లిఖించితిని. కాని, అనంతముగారి సదాలోచనము ననుసరించి, యది సవరించి, మఱి పంపితిని. ఇప్పటి జీత మీయనిచో నే నిచట నుండఁ జాల నని చెప్పివేసితిని.

అనంతముగా రొకనాఁడు నాతో మాటాడుచు, మావలెనే మా యాఁడువాండ్రును అపుడపుడు సమావేశమై సంభాషించుకొను చుండుట శ్రేయోదాయకమని సూచింపఁగా నే నందుల కంగీకరించితిని. ౨౧-వ ఏప్రిలు తేదీని మే మిరువురమును అనంతముగారి గృహమును సందర్శించితిమి. ఆదంపతులు మాకు సుస్వాగత మొసంగి ఫలాహారము లిడిరి. నే నొకింత భుజించినను, తన కుపాహారములు సరి పడవని నాభార్య చెప్పివేసి వానినిఁ గైకొనలేదు.

ఆదినములలో నొకప్రొద్దున దేవసహాయముగారు, యతిరాజులు పిళ్లగారి తమ్ముఁడు, మఱి యిద్దఱు ముగ్గురు స్నేహితులును వెంట రాఁగా, నేను కృష్ణదాటి, ఉండవల్లిపోయి, యచటఁ గల గుహాలను వీక్షించితిని. మేడయంతస్తుల వలె కొండఁదొలిచి నిర్మాణముఁ జేసిన యాగుహాలను జూచి మే మాశ్చర్య మందితిమి. అనంతశయనుఁడగు విష్ణుని విగ్రహము మా కచటఁ గానఁబడెను. పూర్వ మక్కడ ఋషిసత్తములు సమావేశమై, యీశ్వరధ్యాననిమగ్ను లగుచుండి రని మే మనుకొంటిమి. మిగుల దయతో మాకు పిళ్లగారు కాఫీ, రొట్టె

మున్నగు నుపాహారములు సిద్ధపఱిచిరి. మే మానాఁ డెంతో సంతోషమునఁ బ్రొద్దుపుచ్చితిమి.

రాజమంద్రికళాశాలావిద్యార్థులలో పట్టపరీక్షలో నాంగ్లమునఁ బ్రథమునిగ నుత్తీర్ణత నొందుటచే నాకు బహుమతి చేయఁబడిన స్కాటువిరచిత కథావళిని నే నీసమయమునఁ జదువుచువచ్చితిని. ఒక్కొక్కసారి యింగ్లీషుపుస్తకములలోని యంశములును, ఆంధ్ర గ్రంథములును, పత్నికిఁ జదివి వినిపించుచుందును. ఏప్రిలు ౨౭-వ తేదీని, స్కాటువ్రాసిన 'ఐవాన్‌హో'నవలను బూర్తిచేసితిని. కథానాయికయగు 'రిబెక్కా'కాంతవిషయమై కృతికర్త పక్షపాతబుద్ధిఁ జూపె నని నే నసంతృప్తిఁ జెందితిని. ఆ యంగన యౌదార్యసచ్ఛీలతాసౌందర్యముల కనురూపమగు సౌభాగ్యగరిమ మామె కొసంగ లేదనియు, ఐవాన్‌హోను బరిణయమై రిబెక్కా సౌఖ్యాబ్ధి నోలలాడెనని కవి వర్ణింప లేదనియును, నేను విషాదమందితిని.

ఏప్రిలు ౨౫-వ తేదీని అమలాపురము పాఠశాలాప్రథమోపాధ్యాయునియొద్దనుండి నాకొక జాబు వచ్చెను. నా కాపాఠశాలలో ద్వితీయోపాధ్యాయునిపదవి నీయుఁ డని పాఠశాలలపరీక్షాధికారియగు నాగోజీరావుపంతులుగారు సిఫారసు చేసినట్లు వారు వ్రాసిరి. ఈ సంగతిని గుఱించి తలపోయుచు నామనస్సు మరల చంచలగతి నందెను!

నాలుగవ మేయి తేదీని అనంతముగారు సతీసమేతముగ మమ్ము సందర్శింపవచ్చిరి. వారు మాయింటికి వచ్చినందుకు ఇంటివారు తప్పు పట్టెదరేమో యని మేము భీతిల్లితిమిగాని, యట్లు జరుగ లేదు. సజ్జనులగు వసంతముగారి యెడ బెజవాడ వాస్తవ్యుల కమిత భక్త్యనురాగములు గలవు.

"ఇస్లాము విశ్వాసము" అను నాంగ్లగ్రంథము నే నపుడు చదివి, మహమ్మదీయ మతసిద్ధాంతములను గ్రహించితిని. ఆపుస్తకమందలి ముఖ్యాంశములను నేను వ్రాసిపెట్టుకొంటిని. ఎంతో శ్రమకోర్చి నే నాకాలమునఁ జదివి యిట్లు సారము వ్రాసికొనినవ్రాఁతపుస్తకము లింకను నాయొద్ద నున్నవి.

౬ వ-మేయి తేదీని స్నేహితులు గంగరాజు కనకరాజుగార్లు చెన్నపురినుండి వచ్చిరి. మేము ముగ్గురమును గూడి యానాఁడు వీరేశలింగముగారి రాకకై బెజవాడరెయిలుస్టేషనునొద్దఁ గనిపెట్టుకొనియుంటిమి. పంతులుగారు భార్యాసహితముగా వచ్చి మాపొరుగున నుండు పాటిబండ వెంకటరమణయ్యగారి యింట విందారగించి, వెంటనే చెన్నపురి రెయిలెక్కిరి. మేము వారిని సాగనంపి వచ్చితిమి. మఱునాఁ డాస్నేహితులు రాజమంద్రి వెడలిపోయిరి. మాపాఠశాలను వేసవికి మూయుటచేత, మేమును ౮ వ తేదీని రాజమంద్రి బయలుదేఱితిమి.

## 3. వేసవిసెలవులు

౯ వ-మెయి తేదీని తమ్ముఁడు వెంకటరామయ్యతోఁ గూడి రాజమంద్రియందలి స్నేహితులను సందర్శింపఁ బోయితిని. 'సత్యసంవర్ధనీ' సంచికను వేగమె ముద్రింపుఁ డని "వివేకవర్ధనీ ముద్రాక్షరశాల"లోఁ జెప్పి, మిత్రులు పాపయ్య, రంగనాయకులు నాయుఁడు గార్లను వీక్షించితిని. మధ్యాహ్నము మృత్యుంజయరావు, నరసింహరాయుఁడుగార్లనుఁ జూచివచ్చితిని. మృత్యుంజయరా విపుడు నవీనముగ రాజమంద్రిలో స్థాపితమైన దొరతనమువారి బోధనాభ్యసన కళాశాలలో నుపన్యాసకుఁడు. నరసింహరాయుఁడుగా రేతత్కళా

శాలలో బోధనాభ్యాసనముఁ జేయుచుండిరి. స్నేహితు లిట్లు గురుశిష్యు లయిరి!

౧౦-వ తేదీని నన్నుఁ జూచుటకు మృత్యుంజయరావు మాయింటికి వచ్చెను. ఇటీవల రాజమండ్రిలో జరిగిన ప్రార్థనసమాజ సమావేశమున నన్ను గుఱించియు, నా తమ్ముని గుఱించియు నతఁడేల ద్వేషభావమున మాటాడి, మామీఁద నపనిందలు వెలయించెనని యాతని నడిగితిని. అతఁడు ప్రత్యుత్తర మీయలేదు. మిత్రుల పోరాటములు లెక్కసేయక యథాప్రకారముగ నేను "సత్యసంవర్ధని"కి వ్యాసములు వ్రాసి యచ్చున కిచ్చుచుంటిని. కాని, కొలఁదిరోజులలో నరసింహరాయుడుగారిని నేను గలసికొని, యిటీవలి యల్లరికిఁ గారణ మడుగఁగా, "మీ రెప్పటివలెనే నిరంకుశాధికారముఁ జెల్లింపఁ బ్రయత్నించుచున్నారు. ముం దట్లు సాగనీయము. సరియైన త్రోవను మీరు పత్రికను నడపినచో మే మందఱమును మీకు సాయముచేతుము" అని యాయన చెప్పెను. ఈమాటలు విని నే నిఁక "సత్యసంవర్ధనీ" పత్రికతోడి సంబంధము విడువ నుద్యమించితిని. పత్రిక విషయమున కనకరాజు, మృత్యుంజయరావు, నరసింహరాయుడుగార్లు నామీఁదఁ గినుక వహించుట నేను సవిస్తరముగ గ్రహించి, దానితో జోక్యము వదలుకొన నిశ్చయించితిని.

శ్రీ మల్లాది వెంకటరత్నముగారి కోరికమీఁద, శ్రీమతి సత్యనాథను కృపాబాయిగారు ఇంగ్లీషున రచించిన "సగుణచరిత్రము"ను నేను తెలుఁగుఁ జేయ నారంభించి, అచ్చువేయుటకై కొన్ని ప్రకరణములు వారికిఁ బంపితిని. లివింగ్‌స్టను చరిత్రమును జదివితిని. ఆమహామహుని యపారదైవభక్తికి నే నాశ్చర్యమంది, నాజీవితము నటులే ధన్యముఁ జేయు మని దైవమును వేఁడితిని.

నామనస్సు నిప్పుడు కలఁచెడి విషయములు కొన్ని కలవు. పెద్దచెల్లెలు కనకమ్మ వివాహసంబంధనిశ్చయ మింకను గాలేదు. కొన్ని సంబంధములు వచ్చినవి. మా తండ్రియు తమ్ముఁడును వీనిని గుఱించి మిక్కిలి తిరిగిరి. ఏదో యొక సంబంధము శీఘ్రమే నిర్ణయింపవలెనని నాకోరిక. మాతల్లి తనపెద్దకోడలిమీఁద నాగ్రహపడి, ఆక్షేపము నామీఁదఁ జూపసాగెను! నాకిది యాశ్చర్యవిషాదములు గొలిపెను. ఇపుడు మాయింటితీరు నాకు బాగుగఁ గనఁబడలేదు. చిన్నపిల్లలు తలిదండ్రుల యెడఁ దగిన గౌరవములేక, వారిని బరిహసించుచు, సత్యదీక్షలేక నవ్వులాటలతోఁ బ్రొద్దుపుచ్చుచుండిరి! వారికి నాభార్యకు నిపుడు మనసు గలియక, ఉభయులు చిన్నచిన్న కయ్యములకుఁ గాలుద్రవ్వుచుండిరి!

అప్పుడప్పుడు నేను మిత్రుఁడు రంగనాయకులునాయఁడు గారినిఁ గలసికొనుచువచ్చితిని. తన భావికార్య ప్రణాళికను గుఱించి యాయన చెప్పుచుండువాఁడు. తాను ఉద్యోగమునుండి విశ్రాంతిఁ గొనినపిదప, రాజమండ్రిలో స్వకీయవైద్యాలయ మొకటి స్థాపింతు ననియు, అచట మందులిచ్చుటకై తనపెద్దకొడుకున కీలోపుగ మూలికాజ్ఞానమును సమకూర్చుచదువు చెప్పింతు ననియు నాయన యనుచుండువాఁడు. ఇపుడు జబ్బుపడిన నాభార్యకు, చెల్లెండ్రకును నాయఁడుగారు మంచిమందు లిప్పించిరి.

ఈ సమయమున నాకు నాబావమఱఁది వెలిచేటి వెంకటరత్నము గారితో స్నేహము పెంపొందెను. ఆయన క్రమక్రమముగ ప్రార్థన సమాజముపట్లను, సంఘసంస్కరణ విషయములందును, సుముఖత్వముఁ జూపుచు నాకు సాయపడుచువచ్చెను.

కాని, క్రొత్తస్నేహితులు నాకు లభించుకొలఁది, ప్రాఁతవారి తోడిస్నేహము విడివడుచుండెను! సమాజ సత్యసంవర్ధనుల గుఱించి యిటీవల ప్రబలిన గడిబిడ యేమని నేను వ్రాయఁగా, కనకరాజు పాలకొల్లు నుండి ప్రత్యుత్తరమిచ్చెను. ఆతనిమనస్సు లేఖలో ధారాళముగ ప్రతిబింబిత మయ్యెను. ఆతనియెడ నేను వైరభావమూని నిరంకుశాధికారము సల్పుచుంటిననియు, మిత్రు లారోపించెడి లోపము లన్నియు నాయందుఁ గలవనియు, నాతని యభిప్రాయము! మాతమ్మునిదెసఁ గూడ నీతనికి వైరస్యమే. మే మిరువురమును సత్యసంవర్ధని కర్తవ్యము వదలుకొని, మృత్యుంజయరావున కాపదవి కట్టఁబెట్టి, పత్రికా విలేఖకులముగ మాత్ర ముండినచో, తానును బత్రికకు వ్రాయుచుందునని యాతఁడు చెప్పివేసెను! ఈమిత్రునివైఖరి చూచి నాకు వెఱ్ఱికోపము వచ్చెను. నిజముగ నా వర్తనమునం దీపెద్ద లోపము లుండెనా? ఇపుడు నన్ను గుఱించి మొఱపెట్టుటలో మిత్రులు సద్భావమున మెలంగిరా? నేను మిగుల విలపించి నిరుత్సాహమందితిని. నేను మిత్రులనుకొనినంత దోషిని గాననియు, ఈవిషయమున వారైన నిర్దోషులు గారనియు, నా నిశ్చయాభిప్రాయము! స్నేహితుల సోదరప్రేమ మిట్లు కోలుపోయిన నాకు, సోదరుని స్నేహప్రేమములు పెంపొందఁజొచ్చెను.

నే నీకాలమున ప్లేటో విరచితమగు "ప్రజాస్వామికత్వము"ను పఠించితిని. బహుదేవతారాధనాది మతోన్మాదములను నిరసించిన ప్లేటో, ౧౯-వ శతాబ్దమందలి యాస్తికునివలె గనఁబడెను. ఐనను, స్త్రీసామాన్యతా సిద్ధాంతమును సమర్థించిన ప్లేటో మొఱకుమానిసి వలెఁ గన్పించెను. ఇందుఁ బ్రతిఫలితమగు సోక్రటీసుని యాకార

మునకును, ఏకపత్నీత్వము మున్నగు నీతినియమములను సముద్ధరించిన జీససునకును నెంతయో యంతరము గలదు!

నా మనస్సునకుఁ గళవళపాటు కలిగించిన యొకవిషయమును గూర్చి యిచటఁ బ్రస్తావించెదను. ఇపుడు మా కెన్నియో చిల్లర యప్పులుండెను. ఇవియన్నియుఁ దీర్చివేయుటకై యొచటనైన మూఁడువేలరూపాయిల పెద్దయప్పునకు మేము ప్రయత్నించితిమి. నా స్వల్పశక్తితో నీ ఋణము నెట్లు తీర్చివేయఁగలనా యని నేను తల్లడిల్లితిని. ఋణవిముక్తుఁడనై మఱి చనిపోవునటు లనుగ్రహింపుమని పరమేశ్వరునికి మ్రొక్కులిడితిని. జూన్ ౧౯ వ తేదీని యీ యప్పు సంగతి రంగనాయకులునాయఁడుగారితోఁ బ్రస్తావింపఁగా, కొంచెము వడ్డికి నా కీసొమ్ము లభించునట్లుగ ధనికులగు తమస్నేహితులతోఁ జెప్పెదనని యాయన వాగ్దానముఁ జేసెను.

## ౪. "జనానాపత్రిక"

నా పూర్వగురువులగు మల్లాది వెంకటరత్నముగారు ౧౮౯౩ వ సంవత్సరము జూలై నెలలో స్త్రీవిద్యాభివృద్ధి నిమిత్తమై "తెలుఁగు జనానాపత్రిక" యనునొక మాసపత్రికను నెలకొల్పి, యొక సంవత్సరము నడిపి, అది యిపుడు విరమింప నుద్యమించి, నే నద్దానినిఁ గైకొని సాగింతునా యని, మెయి ౨౭ వ తేదీని నాకు వ్రాసిరి. "సత్యసంవర్ధని" ని గుఱించి మొగము తిరిగిన నాకు, "జనానాపత్రిక" వంటి వేఱొకపత్రిక చేతనుండుట కర్తవ్యమని తోఁచెను. ఆ జూను మొదటి వారమున జబ్బుగనుండు మామత్తవతల్లిని జూచుటకు వేలివెన్ను వెళ్లియుండునపుడు, బావమఱఁది వెంకటరత్నముతో నూతన పత్రికను గుఱించి నేను ముచ్చటించితిని. మిత్రులతోఁడి

తగవులకుఁ గారణమైన సత్యసంవర్ధనిని నేనిఁక విడిచిపెట్టి, జనానా పత్రికను జేపట్టుట యుక్తమని నా కాతఁ డాలోచనఁ జెప్పెను. అంత నేను రాజమంద్రి తిరిగి వచ్చిన పిమ్మట, సోదరుని యాలోచనఁ గూడఁ గైకొని, ౬-వ తేదీని మల్లాది వెంకటరత్నముగారికి జాబు వ్రాసితిని. నా సంపాదకత్వమున జరుగు జనానాపత్రికకుఁ దాము నిర్వాహకులుగ నుండి కొంతకాల మది నడపుచుందు మని వెంకటరత్నముగారు ప్రత్యుత్తరమిచ్చిరి. నే నపుడు వ్రాసిపంపిన "ప్రావుల"ను గుఱించినదియె యాపత్రికలో నా మొదటి వ్యాసము.

చిన్ననాఁడు నాకెంతో సంతోషదాయకముగ నుండిన "డాన్ క్విజ్గోటు" నవల నీవేసవిని మిగుల తమకమునఁ జదివితిని. నే నీకాలమున నమితముగఁ జదువుచుండుటవలన నే కనులకును శరీరమందును బలహీనత హెచ్చిపోయెను.

ఈకాలమున నా దైవభక్తిని గుఱించియు ప్రార్థనరీతిని గుఱించియు నొకింత తెలుపవలెను. నేను నిత్యవిధిగ వ్రాసెడి దినచర్య పుస్తకములందు నా ప్రార్థనానుతాపముల పోకడలు నానాఁటఁ సూచితమగుచుండెను. శత్రుమిత్రులు నాలోపము లెన్నుచుండిరని నే నొక్కొక్కప్పుడు కటకటఁబడుచుంటిని కదా. ఇతరుల కన్నులకుకంటె నాచక్షువులకే నాలోపపాపములు మిగుల స్ఫుటముగఁ దోఁచుచుండెను. ఆత్మోపాలంభనములో పరుల దోషారోపణము లోకవీసమైన కలుగ లేకుండెను! నా పాపచింతనమునకును కుటిల వర్తనమునకును, నేను సంతతానుతాపానలమున దగ్ధుఁడ నగుచుండియు, మరల నీవక్రచర్యలకే గడంగుచుందును! స్వకీయపాపలేశమునుఁ బరిశోధించుటయందును, లోపముల వివరములను గుర్తెఱిఁగుటయందును, న న్నెవరును మించియుండరు! కాని, యీ పాప

పరిశీలనాశక్తియును, అనుతాపతీవ్రతయును, అపరాధములు చేయకుండ నా బుద్ధి నేల యరికట్టనేరకుండెనని యచ్చెరువొందు చుందును. నాకుఁ గల యమిత మతాభినివేశము, అపార దైవభక్తియును, మన స్సును అన్యాయపథమునుండి యేల మరలింపఁజాలకుండెనో గ్రాహ్యము గాకుండెను!

జూన్ ౧-వ తేదీని నేమను, మృత్యుంజయరావును, రెయిలు స్టేషనుకుఁ బోయి బెజవాడలో జరిగెడి కృష్ణామండలసభ కేగుచుండు వెంకటరత్నము నాయఁడుగారిని సందర్శించితిమి. బెజవాడ వీడవల దనియు, ఎమ్. ఏ. పరీక్షకుఁ జదువుమనియు నాయుఁడుగారు నాకు సలహా నిచ్చిరి. వారు రాజమండ్రి వచ్చి జూన్ ౧౫, ౧౬ తేదీలలో నచట నుండిరి. ౧౬-వ తేదీని మేము చేయించిన బహిరంగసభలో, "సువిశాల మిదం విశ్వం" అను శీర్షికతో నాయఁడుగారొక యాంగ్లోపన్యాస మిచ్చిరి.

తలిదండ్రులయొద్దను బంధుమిత్రులయొద్దను సెలవుఁగైకొని, ౨౦ వ జూనున బెజవాడకు ప్రయాణమై, మధ్యాహ్నమున కచటఁ జేరి, నా వస్తువులు, పుస్తకములును, సరదికొంటిని. ఉపాధ్యాయ మిత్రుఁడగు దేవసహాయముగారితోఁ గలసి మాటాడునప్పుడు, ఈపాఠశాలలోనే నేను రాఁబోవు సంవత్సరమునఁ గూడ నుండి, ఆయన ఖాళీచేయఁ బోవు ద్వితీయోపాధ్యాయపదవి నలంకరింపఁగల నసెడి యాశను నా కాయన గలుగఁజేసిరి.

## ౫. మరల బెజవాడ.

బెజవాడ పాఠశాలలో పని జూన్ ౨౧-వ తేదీని మరల ప్రారంభ మయ్యెను. మఱునాఁడు ఉపాధ్యాయులసభ జరిగెను. అందు

విద్యార్థులను గుఱించిన ముఖ్యమగుసంగతులు కొన్ని చర్చించుకొంటిమి. శిష్యులందుఁగల దురభ్యాసములు నిర్మూలించుటకును, మరల నుత్సాహముతోఁ బనిచేయుటకును, మేము దృఢసంకల్పులమైతిమి.

౨౩-వ తేదీని "నీతిధైర్యము"ను గుఱించి నేనింట మాటాడితిని. కష్టము లాపాదించిన తరుణమున ధృతిఁ దొలఁగకుండ నిలువవలయునే కాని, అవి తొలఁగిపోయినపిమ్మట ధైర్యమూనిన లాభ మేమి యని పలికిన సతిపలుకులందు సునిశితసత్యవిచక్షణశక్తి నాకుఁ గానఁబడెను.

౨౫-వ తేదీని మద్రాసునుండి రాజమంద్రి వెడలిపోవుచుండు వీరేశలింగముగారిని, వారిభార్యను, నేను రెయిలు స్టేషనులోఁ గలసికొంటిని. నే నంత వారితో కనకరాజు మున్నగు మిత్రవర్గమునకు నన్నుగుఱించి కలిగిన దురభిప్రాయములను గూర్చి ప్రస్తావించితిని. తనకును నామీఁద నిటీవలఁ బొడమిన సందియముల నాయన యేకరువు పెట్టెను. ఆయనపలుకులవలన నా కేమియు నోదార్పు గలుగలేదు!

రాజమంద్రినుండి వచ్చిన వారమునకు నా తమ్ముఁ డొక యుత్తరము వ్రాసెను. నేను బెజవాడకు బయలుదేఱిన రెంవురోజులకు కనకరాజు రాజమంద్రి వచ్చి, మార్చి యేప్రిలు నెలల సత్యసంవర్థనీపత్రిక మొదటి ఫారములో నేను అచ్చొత్తించిన "వార్తలు : అభిప్రాయములు" అను శీర్షికతోఁ జివర నింగ్లీషున నేను వ్రాసిన భాగము మాననష్టమున కెడ మిచ్చు ననియు, అందు నేను మహాపవిత్రుఁడ ననియు, నితరులు దుర్మార్గు లనియు సూచించితి ననియును, వీరేశలింగముగారు రాజమంద్రి వచ్చువఱకును ఆపత్రిక ప్రకటింపవలదనియును స్నేహితులతోఁ జెప్పెనఁట! నేనీ వార్తను విని మిగుల

ఖిన్నుఁడనై, హృదయపరిశోధకుఁడగు దైవసమ్ముఖమునఁ గన్నీరు విడిచితిని. నాతమ్ముఁడు పిమ్మట నాకు వ్రాసిన జాబువలన నిందలి రహస్యము కొంత బయలుపడెను. నేనిటీవల నొక కాకినాడ స్నేహితునితో మనసిచ్చి మాటాడుచుఁ బ్రస్తాపవశమునఁ జెప్పిన సంగతులాయన కనకరాజునకు నివేదింపఁగా, ఆతఁడు నా వ్రాఁతలకి ట్లపార్థకల్పనఁ జేసెనని తేలెను! ఈశ్వరభక్తులు తమ దుస్థితినిఁ దలపోయుచు దైవసాహాయ్యమును వేఁడుచుండు విషయమును, నేను కొంతకాలము నుండి కొన్ని యింగ్లీషు పత్రికలలోని వ్రాఁతల ననుసరించి, యుత్తమపురుషైకవచనమున నే వర్ణించు నభ్యాసముఁ జేసికొంటిని. అట్లు వ్రాయుటకుఁ గారణము, పాఠకుల కందలి సంగతులు మఱింత స్పష్టముగఁ ద్యోతక మగుననియె. స్నేహితులు దీనికింత రట్టుచేసి, యెన్ని కష్టములు పడియైన సత్యసంవర్ధనికి వ్రాయుచుండు నాకు నిరుత్సాహముఁ గలిగించిరో, దురూహ్యముగ నుండెను!

౧-వ జూలై తేదీని నాకు మృత్యుంజయరావు వ్రాసిన జాబులోఁ బూర్వోదాహృతమైన పత్రిక సంచికలోని భాగము తొలఁగింప నిర్ధారితమైనటులుండెను. నేను దీనికి సమ్మతింపలేదు. నామనస్సు మిగుల వ్యాకులము నొందెను.

నా వ్యాకులచిత్తత కిది యొకటియే హేతువు కాదు. సతికి నాకునుఁ దగినట్టుగ మనస్సు గలియకుండెను. జూలై ౨-వ తేదీని నాకు జీతము రాఁగా, ఆసొమ్ములోఁ గొంతతో నింటికిఁ గావలసిన పాత్రసామగ్రిఁ గొనుఁడని యామె పట్టుపట్టెను. రాజమండ్రిలోని కుటుంబవ్యయములకును, ఇతర కర్చులకును సొమ్ము వెచ్చింపవలసిన నే నట్లు చేయలేకుంటిని. మాకిద్దఱికి నంత సంఘర్షణ మేర్పడెను. నా కామె లోభగుణ మారోపించి నన్నుగుఱించి యపోహములందెను!

ఒక ధనవ్యయ విషయమున నే గాక, మఱికొన్ని సంగతులందును దంపతుల కభిప్రాయభేద మేర్పడెను. నే ననుదినమును సాయంకాలమున కాలువయొడ్డున షికారు పోవుచుండు నప్పుడు, నాతోఁగూడ రమ్మని సతి నాహ్వానించుచుండువాఁడను. ఆమె యట్లు చేయనొల్లకుండెడిది. పదునాఱేండ్ల బాల పతితోఁ గలసి వాహ్యాళి కేగుట, ఆకాలమున నే కాదు, ప్రకృతమందును, సాహసకృత్యమని హిందూసంఘ మెంచుచున్నది! చెన్నపురివంటి మహాపట్టణములలో హిందూయువిదల కిట్టి స్వేచ్ఛావర్తనమున కవకాశము గలుగును గాని, బెజవాడవంటి చిన్న పట్టణములలో నిట్టి చర్య లిరుగుపొరుగుల యమ్మలక్కల వికట వ్యాఖ్యానములకుఁ దావలమగుచుండును! ఇట్టిపనులవలన తరుణవయస్కలగు నబలలకు తోడి కులకాంతలలోఁ దలవంపులు గలుగుచుండును.

## ౬. అమలాపురోద్యోగము

నా "బెజవాడ - అమలాపురముల" యుద్యోగములకుఁ జాల కాలమువఱకు ద్వంద్వయుద్ధము సాగెను! వేసవిపిమ్మట నేను బెజవాడపాఠశాలఁ జేరిన కొలఁదిదినములకు, అమలాపురపుఁ బని తప్పక యిచ్చెదరని మాతమ్ముఁడు రాజమండ్రినుండి నాకు వ్రాసెను. ౧౭ వ. జూలై తేదీని అమలాపురము పాఠశాలా ప్రథమోపాధ్యాయుఁడు నాకుఁ దమపాఠశాలలో ద్వితీయోపాధ్యాయపదవి నిచ్చెదరని వ్రాసి, నే నది స్వీకరింతునా యని యడిగెను. అందువలన మరల నామనస్సున కలజడి గలిగి, నాఁడే మాప్రథమోపాధ్యాయుని యొద్దకుఁ బోయి, యీసంగతి యాయన కెఱిఁగించితిని. ఆయన దిగులుపడి, క్రొత్తపనిఁ గైకొనవలదని సలహానిచ్చెను. కొలఁది దినములలో

క్లార్కుగారు బెజవాడ వచ్చునని యును, అపుడాయనతోఁ దాను సాక్ష్యములఁగూర్చి చెప్పెద ననియును, అనంతముగారు వాగ్దానముఁ జేసిరి. ప్రకృతపుఁబని నాకు ఖాయము చేయుఁడనియు, రాఁబోవు వత్సరమున యల్. టి. పరీక్ష పూర్తిచేసినచో నెలకు బదిరూపాయి లీయుఁడనియు, పరీక్షయందు తప్పిపోయినచో నీ దెబ్బదియే చాలు ననియు నేను బలికితిని. నా యభీష్టము నెఱవేఱుచో నే నిచటినుండి కదలనక్కఱయె లేదుగదా!

జూలై ౨౩-వ తేదీని క్లార్కుదొర మాపాఠశాలకు వచ్చి, నా తరగతులలోఁ గొంతసేపు కూర్చుండి, నా బోధనమునకు సంతృప్తి నొందితి ననియు, నాకోరికను జెల్లింతుననియును జెప్పి, నా మనో నిశ్చయ మేమని యడిగెను. ఆరోజుననే మా తమ్ముని యొద్దనుండి వచ్చిన యుత్తరములో, నేను బెజవాడ విడిచి క్రొత్తప్రదేశమున కేగుట శ్రేయమని యుండుటచేత, నా నిర్ధారణమును వెల్లడించుట కొకవారము గడువుఁ గైకొంటిని. ౨౫-వ తేదీని రాజమండ్రి వెళ్లి పరిస్థితులు కనుఁగొంటిని. రాజమండ్రి సబుకలెక్టరే అమలాపురము తాలూకాబోర్డు ప్రెసిడెంటు. ఆ యుద్యోగస్థానమున నడుగఁగా, నాకు హుకుమింకను పంపలేదనియు, అచట నా కెన్నటికి నలు వదిరూపాయలజీతమే యిచ్చెద రనియుఁ దేలెను! ప్రథమోపాధ్యా యుఁడు నిరంకుశాధికారి యనికూడఁ దెలిసెను! బెజవాడ "వేడిమం గల"మైనను, నాగరికత కావాసమయిన యానగరము విడిచి, పూర్వా చార పరాయణతకుఁ బట్టుగొమ్మయైన అమలాపురగ్రామము వెళ్లుట శ్రేయము గాదని నాకుఁ దోఁచెను. బంధుమిత్రులు నటులె చెప్పిరి. కావున నేను బెజవాడలోనె యుండుటకు నిశ్చయించి, ఆసంగతి

మచిలీపట్టణము వ్రాయఁగా, దానికిఁ దన యామోదమును క్లార్కుదొర నాకు వెంటనే తెలియఁబఱచెను.

నే నిపుడు బెజవాడలో నుండుటకే స్థిరపఱచుకొని, మంచములు మున్నగు సామానులు కొంటిని. ఇదివఱకే "జనానాపత్రికా"ధిపత్యమును బూనితిని. ఆపత్రిక చందాదారులకు నాపే రెఱుకపడువఱకు నొక సంవత్సరము పత్రికమీఁద నాపేరుతోఁ బాటు వెంకటరత్నముగారి నామమును బ్రకటింపఁబడెను. కాని, వ్యాసాదు లన్నియు నేనే వ్రాసి పంపుచుంటిని. ఇట్లు "సత్యసంవర్ధని"ని వదలివైచిన నాచేతు లొకమాసమైన నూరకుండక, నూతన పత్రికయగు "జనానాపత్రికా" వ్యాసరచనమునఁ దగిలియుండెను!

బెజవాడలోని మా వేఱింటికాపురపుఁ దొలిదినములను గూర్చి యొకింత ప్రస్తావింపవలెను. ఆనాఁటి నా దినచర్యపుస్తకములు పరికింప నా కాశ్చర్యము పొడముచున్నది. నా కప్పు డిఱువదిమూఁ డేండ్ల వయస్సు. భార్యకుఁ బదునాలు వత్సరములు. యువవిద్యార్థికుఁడగు పతి బజారుపనులు మున్నగు నిత్యకృత్యములు నిర్వర్తించుటకంటె, విద్యాగంధము లేక బాల్యావస్థ దాటియుదాటని సతియే తనగృహకృత్యములు బాగుగఁ జక్కఁబెట్టుకొనఁగలిగెను! ఇంటవంటకముల రుచి కేమాత్రము భంగము వాటిల్లినను నేను భార్యమీఁద మండిపడుచుందునే కాని, నే దెచ్చిన పుచ్చుపెసలకును, పచ్చి కట్టెలకును, ఆమె యించుక విసిగికొనిన సహించువాఁడను గాను! ఇంతియ కాదు. భర్తశాసనము చొప్పున ననుదినమును భార్య పాఠముఁ జదివి, వ్రాఁత వ్రాసి, ఆయన బోధనమును జెవియొగ్గి వినుచుండవలయునే కాని, తనవిధులు నెరవేర్చుటయం దావంతయు ప్రాలుమాలికఁ జూప కాదు. స్త్రీవిద్యాభిమానియగు పెనిమిటి స్త్రీస్వాతంత్ర్య మభిల

షించియే యిట్లు చేయుచున్నాఁడు గాన, ప్రథమమున సతి విద్యావతియై పిమ్మట స్వేచ్ఛాస్వాతంత్ర్యముల ననుభవింపఁగోరవలయును! "పిల్లికి చెలగాటము, ఎలుకకుఁ బ్రాణపోకటము" అనునట్లుగ, భర్తకఠిన విధానము భార్యమీఁది నిరంకుశాధికారముగఁ బరిణమించెను!

కావుననే నా యుద్యోగపు ప్రథమదినములలో, ఒడుదొడుకు నేలను మోటుబండిపయనమువలె మాసంసారయాత్ర మిగుల కష్టముగ సాగెను! ఇంటియందలి చిన్నచిన్న పొరపాటులకుఁ బెనిమిటి చీటికిమాటికిఁ జీదరపడుచుండువాఁడు. మగని పెళుసుమాటలకు మగువ కినుకఁ జెందుచుండునది. ఇట్లు, లోకానుభవము చాలని యాదంపతులు, పరిస్థితు లాడించు కీలుబొమ్మ లయిపోయిరి! కోపము కోపమునఁ గాక యోరిమిచేతను లాలనవలనను చల్లారునని యాయువదంపతులకుఁ దెలియ దయ్యెను. కావున, నూతనాశయములతోను, నవీనమనోరథములతోను విలసిల్లవలసిన యాయౌవనసుఖదినములందు, ఆ కుటుంబమున, పతి యనుతాపవహ్నియందును, సతి యశ్రుధారాతోయములందును గడుప దీక్షావ్రతముఁ గైకొనినవారివలె మెలఁగుచుండిరి!

## ౭. ధన్వాడ దంపతులు.

పెద్దలును, మా పాఠశాలాప్రథమోపాధ్యాయులును నగు శ్రీ ధన్వాడఅనంతముగారు బెజవాడప్రాంతములందలి ప్రజలచే నెక్కువ మన్ననలఁ బడయుచుండిరి. వారా మండలము వారే. గౌరవమాధ్వకుటుంబమున జనించి విద్యాధికులైన అనంతముగారు, జీసను మహనీయుని యమూల్యాదేశముల ననుసరించి, స్వసంఘములోని తమ యున్నతస్థానత్యాగ మొనరించి క్రైస్తవమతావలంబనము చేసినవారగు

టచేత, హిందువులు క్రైస్తవులును వారియందు సమానగౌరవమును గలిగియుండిరి. ఇదివఱకు వారు క్రైస్తవమతబోధకులలో నాయకులు గనుండి, ఆ మత సంఘము వారి కోరిక చొప్పున నిటీవల బెజవాడ పాఠశాలాధ్యక్షతను వహించిరి. జ్ఞాన సంపన్నులును, అనుభవశాలురును నగువారు, నాకిపుడు పాఠశాలలో పైయధికారు లగుటయే కాక, లోకజ్ఞానసంపాదన విషయమున గురుప్రాయులు కూడనయిరి. అనుదినమును పురవీథులయందు నడచిపోవునపుడు, కనఁబడిన పరిచితుల యోగక్షేమ మారయుచు, వారి కష్టసుఖములు తెలిసికొనుచును, అనంతముగారు లోకబాంధవు లనిపించుకొనిరి. నూతన ప్రదేశమునఁ గ్రొత్తకాపుర మేర్పఱుచుకొనిన యువదంపతుల మగు మా సేమము పలుమారు వారు గనిపెట్టుచు, ప్రేమాస్పదులగు జనకునివలె మాకు సదాలోచనములు చెప్పుచునుండువారు. శాస్త్రజ్ఞాన లాభమందినను అనుభవమునఁ గొఱవడిన నా కా బాల్య దినములలో, వారి హితబోధనమును, ముఖ్యముగ వారి పవిత్ర జీవితమును, సత్పథగమనమున నమితముగ సహకారు లయ్యెను.

ప్రథమ దినములలో నాకుఁ బలుమారు, ధనసాహాయ్యము కావలసివచ్చెను. క్రొత్తకాపుర మనఁగనే ధనవ్యయ మధికము. దీనికిఁ దోడుగ, రాజమంద్రి యందలి కుటుంబ వ్యయమునకును, తమ్ముల విద్యాపరిపోషణమునకును, నేను నెలనెలయును సొమ్ము పంపవలసివచ్చుచుండెడిది. చదువు వార్తాపత్రికలకును, కొను పుస్తకములకును, తఱచుగ డబ్బు కావలసివచ్చెడిది. అట్టి యిక్కట్టులకెల్ల, అనంతముగారు, నా జీతములోనుండి సొమ్ము ముందుగ నిచ్చుచుండెడివారు. నే నిట్టి యప్పులకు తఱచుగ వారియొద్దకుఁ బరుగులిడుచు, అచిరకాలమున నే వారిని విసిగించితిని! ఒకటిరెండు మాఱులు అనంతముగారు నాకు ధన

విషయమున జాగరూకత యత్యావశ్యమని మెల్లగ సూచించిరి. కాని నాకది బాగుగ నచ్చకపోవుటచేతనో, నాయవసరము లసంఖ్యాకము లగుటచేతనో, నాయప్పులకు తెంపు లేకుండెను! ఆగష్టునెల చివర నొకనాఁడు నే నాయనను సొమ్మడుగఁగా, అది యొసంగుచు, యువకులు అప్పులపాలు గాకుండుట కర్తవ్యమని నను వారు హెచ్చరించిరి. ఆయన వాక్కులు నాహృదమునం దీమాఱు సూటిగ నాటెను! ఇంకఁ బలుమాఱీయప్పులు చేయకుందు నని నామనస్సును దిట్టపఱచుకొంటిని. అప్పుడును, పిమ్మట పెక్కువత్సరముల వఱకును, నా ఋణబాధ శమింపకుండినను, చిట్టియప్పులకై చీటికి మాటికి చెలికాండ్ర చెంత చేయిచాచు నలవాటు చాలించుకొంటిని!

అనంతముగారి స్నేహము మఱికొన్ని సందర్భములందును నాకు లాభకారి యయ్యెను. ఆయనకు ప్రథమకళత్రమువలన రామచంద్రరావు, ఆనందరావు నను పుత్రులు గలరు. వీ రపుడు మా పాఠశాలావిద్యార్థులు. భార్యామరణానంతరమున అనంతముగారు చెన్నపురియందలి యొకగౌరవక్రైస్తవ కుటుంబములోని సౌభాగ్యవతి యను పడఁతిని బరిణయమయిరి. సౌభాగ్యవతి తనసుందరాకారమునకెనయగు సుగుణసంపత్తిని దాల్చియుండెను. విద్యావంతుఁడును, అకుంఠిత దైవభక్తిపరుఁడును నగు భర్తయం దీమెకు భక్తిగౌరవములు మెండు. సవతికుమారులయం దీసతి యమితపుత్రవత్సలతఁ గాంచియుండెను. నాయం దీసుదతికి సోదరభావము గలదు. నాభార్య కీమెతోఁ బరిచయము గలిగినప్పటినుండియు, పలుమా రీయువిదలిరువురును గలసికొని, యొకరి కష్టసుఖము లొకరు చెప్పుకొనుచు వచ్చిరి. సతివిద్యాభ్యున్నతి విషయమై సంతత పరిశ్రమముఁ జేయుచు, అపరిమితమగు నలజడి పాలగుచునుండెడి

నాకీ సుదతీమణి, చిన్నితమ్మునితోవలె, భార్యను నేను ప్రేమించి లాలింపవలె ననియు, నగలవిషయమందామెకుఁ గల చిన్నకోరికలు చెల్లింపవలె ననియును, మెల్ల మెల్లగ హితబోధనముఁ జేయుచుండె డిది. గర్భసంబంధమగు వ్యాధికి లోనయిన నాసతికి, తరుణముననే చికిత్స చేయించి, గార్హస్థ్యజీవితమును సుఖప్రదముగఁ జేసికొమ్మని ప్రేమపూరిత హృదయయగు సోదరివలె నీసౌశీల్యవతి నా కుద్బోధ నము చేయుచుండెడిది.

ఆ పత్నీపతుల యన్యోన్యానురాగము కడు శ్లాఘాపాత్రముగ నుండెను-ఎన్నఁడుగాని అనంతముగారు తమసతీమణిమీఁద నలుక చెందుట నేను గాంచియుండలేదు. ఆకోమలి పతిమీఁదఁ గినుక వహించుటయు నెఱుఁగను. సంతత కోపావేశమునను, పరుషవాక్య ప్రయోగమునను, సతీహృదయమునుచీకాకుచేసి, స్వకుటుంబశాంతినిభంగ పఱచుకొనియెడి నాకు, వీరి యనుకూలదాంపత్య మాదర్శప్రాయముగ నుండెను. ఒకనాఁడు, సంసారసౌఖ్యరహస్యమును గుఱించి అనంతము గారు నాతో ముచ్చటించుచు, మలయమారుతపుఁదాఁకుననె సౌర భము నొకింత కోలుపోవు కోమలకుసుమముతోఁ గుటుంబ సౌఖ్య మునుఁ బోల్చి, భావగర్భితముగ మాట్లాడిరి. దాంపత్య జీవితమున కామ సుఖలాలసయే ప్రధానమని భావించు స్త్రీలోలుఁ డెన్నఁడును, ఏతత్సుఖానుభవమునకు దూరుఁడగుచుండు నని నే నపుడు గ్రహించితిని. కాని, యౌవనప్రాదుర్భావమునఁ జెలంగువారలకు జితేంద్రియత్వ భాగ్య మొక్కసారిగ లభించుట కడు దుర్లభముకదా.

ల. యం. యే. పరీక్ష.

ఆగస్టు ౨౦-వ తేదీని వేకువనే నేను షికారుపోయి, నా భావికాల కర్తవ్యములనుగుఱించి యోజించితిని. నేను యల్. టి. పరీక్ష

పూర్తిచేసినఁ గాని నా కీవృత్తిలో వేతనాభివృద్ధి గలుగ దనుట స్పష్ట ము. ఆ పరీక్షలో జయ మందుటకు వేఱుగ ప్రయత్న మక్కఱయే లేదు. నన్ను గుఱించి పరీక్షాధికారులు సదభిప్రాయ మందుటయే నా విజయమునకు హేతువు. ఇట్టి యదృష్టముమీఁద నేను బూర్తిగ నా ధారపడక, స్వయంకృషిచేత నీని కంటె నుత్తమపరీక్ష నిచ్చి, బోధక వృత్తిని చిరస్థాయిగఁ జేసికొనవలదా? అదియే యం. యే. పరీక్ష. నే నందు జయ మందినచో, యల్. టి. లో మరలఁ దప్పిపోయినను, ఏ కళాశాలలోనైన నిప్పటికంటె మిగుల గౌరవస్థానమును బడయనర్హ తను గాంచియుందును. కావున నేనా యున్నత పరీక్షకుఁ జదువ నిపుడు దీక్షవహించితిని. ఆంగ్ల సాహిత్యమునందు నా కభిరుచి మెం డు. అయినను దానిలోకంటె తత్త్వశాస్త్రమునసే నేనా పరీక్షకుఁ జది వినచో, వినోదములును, జ్ఞానదాయకములునగు మహత్తరవిషయము లనేకములు గ్రహింప నా కవకాశము గలుగును. ఇట్లే చేయుమని వెంకటరత్నమునాయఁడుగారు మున్నగు మిత్రులును నాకుఁ జెప్పిరి. కావున నేను తత్త్వశాస్త్రమున యం. యే. పరీక్షకుఁ జదువ నుద్దే శించుకొంటిని.

నే నానాఁడు నిశ్చయించుకొనిన సంగతి యింకొకటి కలదు. నా కీలోకమునఁ బ్రియతమమగు విషయములలో పరిశుద్ధాస్తికమతవ్యా పనమొకటి. ఇది మెల్లగఁ గొనసాగించుటకుఁ బ్రార్థనసమాజస్థాపన మావశ్యకము. ఈ బెజవాడపట్టణమం దిదివఱకు ప్రార్థనసమాజము లేకుండినను, ఏతత్సమాజాభిమానులు లేకపోలేదు. కాని, వయసు వచ్చినవారినికంటె, విద్యార్థియువకుల నే ప్రార్థనసమాజసభ్యులగఁ జేర్పఁ బ్రయత్నించుట శ్రేయము. బాల్యమున విద్యార్థిమనోక్షేత్రమునఁ బడిన మతబీజములు సకాలమున మొలకలెత్తి భావిజీవితమున విజృం

భించి సత్ఫలముల నొసంగఁగలవు. కావున ప్రార్థనసమాజ మిట స్థాపించి, నా విద్యార్థిస్నేహితుల నందుఁ జేర్పింప నే నుద్యమించితిని. ఒకనాఁడు సంభాషణసందర్భమున అనంతముగారితో నే నీసంగతి ప్రస్తావింపఁగా, వారు క్రైస్తవమతవిశ్వాసు లయ్యును ప్రార్థనసమాజస్థాపనము విద్యార్థుల నైతికాభివృద్ధికి లాభకరమని యొప్పుకొని, నాకుఁ బ్రోత్సాహముఁ గలిగించిరి. క్రైస్తవమతస్థుల కన్యమతప్రచార మంతరంగమున నసమ్మతమని నామిత్రులును, పాఠశాలలో నాంధ్రోపాధ్యాయులునగు జానపాటి కామశాస్త్రిలుగారు సదా హెచ్చరించుచుండినను, ప్రార్థనసమాజాదర్శములు మొత్తముమీఁద క్రైస్తవుల కిష్టములే యనియును, మాపాఠశాలాధికారులగు క్రైస్తవసంఘమువారు నాయెడ సానుభూతిఁ జూపుదురనియును దలంచి, నే నీకార్యమునకుఁ గడంగితిని. ౨౬-వ ఆగస్టు శనివారము నాఁడు ప్రార్థనసమాజస్థాపనము జరుగునని పాఠశాలలోని పైతరగతులలో నేను బ్రకటించితిని.

కాని, ఆరోజున "హిందూబాలసమాజము" నెలకొల్పఁ బడునని నేనొక ప్రకటనము చూచితిని. కాన నాఁడు ప్రార్థనసభ జరుగుటకు వలనుపడ దనియు, ప్రార్థనసమాజస్థాపన మొకవేళ నా యుద్యోగమునకే భంగకరముగఁ బరిణమింపవచ్చు ననియును నేను దలంచి, "సంఘపారిశుద్ధ్య సమాజము"ను నెలకొల్పినచో, నే నెవరియీర్ష్యకును లోనుగాక విద్యార్థిలోకమునకు మే లొనరింపఁగలనని యెంచితిని. "హిందూబాలసమాజము" విద్యార్థుల నీతిపోషణమునకు సహకారి కాక, విగ్రహారాధనాది మూఢవిశ్వాసములకుఁ బ్రోత్సాహకరముగ మాత్ర ముండునని నమ్మి, ఆసమాజమునఁ జేరవలదని నావిద్యార్థులకు బోధించుచుండువాఁడను.

హిందూమత మనిన నాకెంతో వెగటుగను విగ్రహారాధనము కంటకసదృశముగను నుండెడిది. మా చిన్న మేనమామ వెంకయ్య గారు మమ్ముఁ జూచిపోవుటకు సెప్టెంబరు ౫-వ తేదీని బెజవాడ వచ్చి, కృష్ణానదిని కనకదుర్గాలయమును దమకుఁ జూపింపుమని నన్ను గోరిరి. నేనీ పట్టణము వచ్చి కొన్నినెలలైనను, దుర్గాదేవిదర్శన మింకను జేసికొనియుండ లేదు. మా మేనమామ ప్రోత్సాహమున నేనిపుడు ఆగుడి కేగితిని. పర్వతమధ్యమున నొక రమ్యప్రదేశమునం దాదేవాలయము నిర్మింపఁబడెను. ఆ పరిసర దృశ్యము లత్యంత రమణీయములు. మామామ నన్ను గర్భాలయములోని కాహ్వా నింపఁగా, ఆయనను సంతృప్తిపఱచుటకే నేను లోని కేగినను, దుర్గ విగ్రహమునకు మ్రొక్క నాకుఁ జేతులు రాలేదు! భక్తిపారవశ్య మున వినమ్రుఁడైన తీవసరసను, చేతులు జోడింపక, చెట్టువలె నిలువఁ బడిన నామీఁద మామామ మిగుల విసువుఁజెందెను. దేవునికిని పూజారికిని కాసైనఁ జెల్లింపక నే నెటులో యంతట బయటపడితిని!

సెప్టెంబరు ౮-వ తేదీని బెజవాడపట్టణ మమితకల్లోలమున కాకర మయ్యెను. కొన్నిదినములక్రింద నచటి కొక మార్వాడీవర్త కుఁడు వచ్చి, యెక్కువ వడ్డీనిచ్చి, జనులనుండి చిన్నచిన్నయప్పులఁ గొనఁజొచ్చెను. రూపాయి బదులిచ్చినవానికి వారమురోజులపిమ్మట పావులావడ్డితో అసలీయఁబడుచుండెడిది! ఈమనుజునిచుట్టును జనులు మూఁగుట చూచి, యీతనివలెనె మఱికొందఱు ఎక్కువవడ్డీకి బదుళ్లు పుచ్చుకొనసాగిరి. అంతకంతకు వడ్డీపరిమితి పెరిఁగి, వారమునకు రూపాయికి రూపాయి యయ్యెను! పేదజను లీ వ్యాపారవ్యామోహ మునఁ బడి, తమ వృత్తులు కట్టిపెట్టి, తమకుఁగల ధనమంతయు బదుళ్లలోఁ ద్రిప్పసాగిరి. ఒకనాఁడు నామిత్రుఁడును, వాణీముద్రా

క్షురశాలాధికారియును నగు శ్రీ దాసు కేశవరావుగారియింటికేగి, యచట ముద్రితమయ్యెడి ప్రకటనపత్రిక నొకటి నేను జూచితిని. "అత్యాపేక్షాధైర్యసంఘము" అను పెద్దపేరు పెట్టుకొనిన యొక వడ్డీవ్యాపారస్థుని సంస్థనుగురించిన కాకితమే యిది! అత్యాపేక్ష ధైర్యమునకైనను అధైర్యమునకైనను, ఎడమీయు నని యిందలి ధ్వన్యర్థ మని నవ్వుచు స్నేహితుఁడు నాకుఁ జెప్పెను. నదీప్రవాహమునఁ గన్పడు బుడగలవంటి యీవర్తకసంఘములు, దురాశచే నేర్పడునవియేగాని సదుద్దేశముతో నెలకొల్పఁబడునవి కావు. అప్పుపుచ్చుకొన్న కొంచెపు మొత్తములతో విరివిగ నేవర్తక వ్యాపారములు స్వల్పకాలమున సాగఁగలవు? కావున కేవల ద్రోహ చింతనముతోనే యీసంఘములు వెలసె ననుట స్పష్టమయ్యెను. ఈద్యూతవ్యాపారము ప్రబలు దినములలో రక్షకభటులు, ప్రభుత్వోద్యోగులును ఏచర్యనుఁ బుచ్చుకొనక, ౧-వ సెప్టెంబరున నకస్మాత్తుగ సంఘమువెంటసంఘము దివాలుదీయుటచేత సొమ్ము పోఁగొట్టుకొనిన జనుల కోలాహలము ప్రబలినప్పుడుమాత్రమే, వారు తమ కర్తవ్యమునకుఁ గడంగుటకై కనులు తెఱచిరి! పురమం దెచటఁ జూచినను కొద్దిగనో గొప్పగనో సొమ్ము పోఁగొట్టుకొని విలపించుజనులే గానవచ్చిరి! మాపాఠశాల బంట్రోతు కనకయ్య తన సంగతి నాకుఁ జెప్పెను. తాను మూఁడు నాలుగు రూపాయిలీ యప్పులకు ముందు పెట్టుబడి పెట్టి, కొద్ది రోజులలో ముప్పది రూపాయలవఱకును బెంచి, దానిలోఁ జాలవఱకిపుడు కోలుపోయినను, తనయొద్ద నింకను పది పదునైదు రూపాయిలు నిలిచియుండె నని చెప్పెను. కడుధైర్యముతోనైనను అధైర్యముతోనైనను అతిలోభబుద్ధితో జరిగెడియిట్టి వ్యాపారద్యూతము, జనసామాన్యమునకు తుదకు చేటుతెచ్చుననుట కీయుదంతమే తార్కాణము!

## ౯. కష్టకాలము, శుభకార్యము

అమలాపురోద్యోగపుఁజిక్కు లింతటితోఁ దొలఁగలేదు. నేను బెజవాడయందలి యుద్యోగమున నుండుటకే నిశ్చయించుకొంటిని కాని, అమలాపురోద్యోగము వదలితి నని వ్రాసివేయలేదు! వదలుకొనుటకు ముందుగ, ఆపని నాకీయఁబడె నను కాకితమే యింతవఱకును నాచేతి కందలేదు! కావున నా కీయుద్యోగ మక్కఱలేదని నే నెట్లు వ్రాసివేయఁగలను? ఎట్టకేలకు, ౨-వ సెప్టెంబరున అమలాపురపుఁబని నా కిచ్చితి మని నాగోజీరావు పంతులుగారి నుండి హుకుము వచ్చెను. నా కిటు లొసఁగఁబడినట్టియు, దొరతనమువారి కొలువుతో సమానస్థిరత్వముగలిగినట్టియు, బోర్డుపని వలదని చెప్పివేసి, క్రైస్తవపాఠశాలను నమ్ముకొని యుండుట భద్రమా యని నే నంత సందేహ మందితిని. బెజవాడమీఁదుగఁ బ్రయాణము చేయు నాగోజీరావుపంతులుగారిని నేను రెయిలుస్టేషనులో ౧౧-వ తేదీని గలసికొంటిని. వెంటనే బెజవాడ పని వదలి, అమలాపురము పొమ్మని వారు ఖచితముగఁ జెప్పివేసిరి! మరల నే నీ విషమద్వంద్వావస్థలోఁ జిక్కుకొనిపోయితిని!

ఇపుడు కొన్నిరోజులు సెల వగుటచేత ౧౬-వ సెప్టెంబరున రాజమంద్రి వెళ్లి, సబ్‌కలెక్టరును జూచి మాటాడితిని. ఈవిషయమై తా నేమియుఁ జేయలే ననియును, నేను నాగోజీరావుగారినే సంప్రదించి చిక్కు విడదీసికొనవలె ననియును, ఆయన చెప్పివేసెను. అమలాపురమందలి యుద్యోగమును స్వీకరింపఁజాలనని నేనంత పంతులుగారికి వ్రాసివేసితిని.

రాజమంద్రిలో నాకనుల కెల్లెడలను కష్టదృశ్యములే కానవచ్చెను. పాపము, దొరతనమువారికళాశాలలో నూఱురూపాయిల

## ౯. కష్టకాలము, శుభకార్యము

వేతనముగల మంచియుద్యోగము దొరికిన మృత్యుంజయరావున కేమియు సౌఖ్యము లేదు. కఠినవ్యాధి వానిదేహమును పీల్చి పిప్పి చేయుచుండెను! తోడిబోధకు లాతనిదెస ననూయాగ్రస్తులై యుండిరి. మా కుటుంబములో చిక్కులు మిక్కుటమయ్యెను. తండ్రియు తమ్ముఁడు నెంత ప్రయత్నించినను మాచెల్లెలి కింకను వివాహసంబంధము కుదురలేదు. మేము రాజమంద్రిలో నిలిచిన యానాలుగుదినములలోనె మాయింటియందత్తకోడండ్ర సామరస్యము వెల్లడియగుచుండెను! ఈ కష్టపరంపర వీక్షింపలేక, నాయక్షులు సంక్షోభించెను.

అంత మేము ౨౩-వ సెప్టెంబరున బెజవాడకు వెడలిపోయితిమి. కొన్నిదినములకుఁ బిమ్మట ననంతముగారు నాతో మాటాడుచు, తా మిటీవల క్లార్కు-దొరతో సంభాషించితి మనియు, నేను గోరినచో డిసెంబరులో అమలాపురము వెడలిపోవచ్చు నని యాయన పలికి రనియుఁ జెప్పిరి! బెజవాడ వీడుటకుమాత్రము నాకు మన సొప్పకుండెను.

అక్టోబరు ౧౩, ౧౪ వ తేదీలలో సతీపతులుభయులము బంధుసందర్శనార్థమై ఏలూరు వెళ్లియుంటిమి. అచటఁ గ్రొత్తగఁ గాపురమునకు వచ్చిన నామఱఁదలు శ్యామలాంబకు, ఆమెభర్తయగు వెంకటరత్నముతోను, ఆతని తల్లితోను మనస్పర్థలు ప్రబలుట విని, వారి గృహకల్లోలము లొకింత శమియింపఁబూనితిమి. ఇంట నంతఁగఁ బొత్తులేని మేమంతట యాయువదంపతులకుఁ జెలిమిచేకూరు సుద్దులు చెప్పి, బెజవాడకు మరలివచ్చితిమి.

ఒకనెల జీతము ముందుగఁ దీసికొని, మాచెల్లెలి వివాహమునకై యుభయులమును అక్టోబరు ౨౦-వ తేదిని రాజమంద్రి పోయి

తిమి. తమ్ముఁడు కృష్ణమూర్తి సన్నిపాతజ్వరముచేఁ బీడితుఁడై యుండెను. నాలుగుదినములలో జరుగఁబోయెడి మాచెల్లెలి వివాహమునకు బంధువులను బిలుచుటకై మాతండ్రి రాజమండ్రినుండి వెడలిపోయెను. అర్తమూరు సంబంధము మే మంత నిశ్చయించి, పెండ్లికుమారుని తలిదండ్రులకుఁ దెలియఁబఱచితిమి. ఒకమూల పెండ్లిపనులు, వేఱొకమూల రోగికిఁ బరిచర్యలు!

వివాహదినమగు బుధవారము సమీపించినకొలఁది, మా యలజడి మఱింత హెచ్చెను. బంధువుల పిలుపునకుఁ బోయిన మా తండ్రి పెండ్లి వెనుకటిరోజునకైన నిలు సేరలేదు! తమ్మునివ్యాధి నిమ్మళింపలేదు. ఎట్టకేలకు మంగళవారమురాత్రికి మాజనకుఁడు బంధుసమేతముగ నింటికి వచ్చెను. పెండ్లివారుకూడ ధవళేశ్వరమునకు వచ్చియుండిరని తెలిసెను.

పెండ్లికొమార్తెకు జ్వరము వచ్చుటచే వివాహము మఱునాఁడు జరుగలేదు. ఎట్టకేలకు ౨౫-వ అక్టోబరు, గురువారము ప్రాతఃకాలమున ధవళేశ్వరమున జనార్దనస్వామి యాలయమున మాచెల్లెలు కనకమ్మను పులుగుర్త సీతాపతిరావున కిచ్చి వివాహము చేసితిమి. మాతమ్ముఁడు కృష్ణమూర్తి వ్యాధిగ్రస్తుఁ డగుటవలన వానిని విడిచి మా తలిదండ్రులు రాఁజాలక పోయిరి. కావున నేను భార్యయును కన్యాదానము జరిపితిమి. ఒక జాములోనే వివాహము పూర్తి కాఁగా మేము రాజమండ్రి వచ్చి చేరితిమి.

అంత మా తమ్ముని జ్వరము మఱింత హెచ్చెను. రంగనాయకులు నాయఁడుగారు మిగుల శ్రమపడి రోగి కౌషధము లిచ్చుచుండిరి. కొలఁది దినములలోనె పెండ్లికూఁతునికిని జ్వరము సోఁకెను. నేను

మదల ౨౯-వ అక్టోబరు సోమవారమే నా యుద్యోగమునఁ బ్రవేశింపవలెను గాన, మేము ఉభయులమును వెనుకటిరోజుననే బెజవాడకు వెడలిపోయితిమి.

## ౧౦. బెజవాడ స్నేహితులు

పెండ్లిలోనే యారంభమైన మాచెల్లెలి యస్వస్థతయు సన్నిపాత జ్వరముగనె బరిణమించెను! మిత్రుఁడు రంగనాయకులు నాయఁడుగారు నాయందలి యవ్యాజసోదరభావమున నా తమ్మునికిఁ జెల్లెలికిని మిగుల శ్రమపడి వ్యాధి నివారణముఁ జేసిరి. జ్వరవిముక్తులై తెలుపిని బడిన వారిరువురును మిగుల బలహీనదశ నుండిరి. శరీరమున సత్తువ పుట్టుటకై నాయఁడుగారు వారికి మంచిమందు లొసఁగిరి. ఎట్టకేలకు వారిరువురును పూర్ణారోగ్యవంతులైరి.

బెజవాడ "స్వయంకృషి సమాజము" వారు తమ సమాజవర్ధంతికి నన్నధ్యక్షునిగాఁ గోరఁగా, నా యుపన్యాసము సిద్ధపఱచితిని. ౧౦-వ నవంబరునం దాయుత్సవము జరిగెను. అనుకొనిన యంశములనేకములు ప్రస్తావింపనే మఱచిపోయినను, మొత్తముమీఁద నా యుపన్యాసము సమగ్రముగనే యుండెను. దానిసారము వార్తాపత్రికలకుఁ బంపితిని. నా యాధిపత్యమున జరుగు జనానాపత్రికకే కాక, యితర వార్తాపత్రికలకును దఱచుగ నేను వ్రాయుచుండువాఁడను. నే నిట్లు వ్రాయుచుండుటవలన, నాయూహలకు సుస్థిరత్వమును, పదజాలమునకు సులభగమనమును, కాలక్రమమునఁ బట్టువడెను.

మత సంఘ సంస్కరణ విషయముల గుఱించి నేను దీక్షాసమయములందు పాఠశాలలలో బాహాటముగఁ బ్రసంగించుచుండువాఁడను.

ఆకారణమున విద్యార్థుల మనస్సులలోఁ గొంత సంచలనము గలిగెను. క్రైస్తవ పాఠశాలలోని హిందూవిద్యార్థులు, అన్యమతధర్మములను గుఱించియు, సంఘసంస్కరణావశ్యకమును గుఱించియు వినుచుండువారలయ్యెను, హిందువునగు నానోటనే యట్టి వాక్యము లాకర్ణించుట కచ్చెరువొందుచుండువారు. దేవగ్రాజు అనంతరామయ్యయను మా పాఠశాలలోని ప్రవేశపరీక్షతరగతి విద్యార్థి, విగ్రహారాధనమును నిరసించి, తోడివిద్యార్థుల యాగ్రహమునకుఁ బాల్పడియెను. "హిందూబాలసమాజ" సభకు నే నొకమాఱు పోయి, అచట విగ్రహారాధనమును గుఱించి జరిగిన చర్చలోఁ బాల్గొంటిని. సంస్కరణ పక్షాభిమానులగు విద్యార్థిబృందమునకు నే నిట్లు నాయకుఁడ నైతిని. పాఠశాలలోను బయటను, సంస్కరణ విషయములను గుఱించి విద్యార్థులతో నేను చర్చలు సలుపుచుండువాఁడను. ౧౮౯౫-వ నవంబరున పాఠశాలలో "విద్యార్థి ప్రసంగసమాజ" సంవత్సరోత్సవము జరిగెను. ఆ సందర్భమున సమాజసభ్యులను హెచ్చరించుచు నా యధ్యక్షోపన్యాసము చదివితిని. సభ కగ్రాసనాధిపతి యగు డిస్ట్రిక్టుమునసబు కొప్పరపు రామారావు పంతులుగారు నా యుపన్యాసమును గొంత నిరసించినను, సభ్యుల కది సమ్మోదముగ నుండుటచే నాకుఁ బ్రోత్సాహము గలిగెను.

లోకమున నెట్టి సాధుజనులకు నొక్కొక్కతఱిని శాంతముగ దినములు గడువవు. ఆ నవంబరు నెలలో మా యుపాధ్యాయులలోఁ గొందఱి కాకాశరామన్న యుత్తరములు వచ్చెను. ఒకపుణ్యవతి వర్తనమును గుఱించి యందు హేయమగు నపవాదములు సూచింపఁబడెను! ఊరునకుఁ గ్రొత్తనగు నా కిట్టి లేఖలు రాకుండినను, మిత్రుల వలన నీసంగతి విని నేను మిగుల విషాదము నొందితిని. ఆదంపతుల

కెంతో మనస్తాపము గలిగె నని వేరె చెప్ప నక్కఱలేదు. "మానవ మాత్రులు భూషణదూషణములకు సరిసమానముగఁ దలయొగ్గవలయు" నను లోకోక్తిని ఆకష్టసమయమున నొకమిత్రుఁడు వచించుచుండుట నాకిప్పటికిని జ్ఞాపకము.

నేను బెజవాడ వచ్చిననాఁటినుండియు ద్వితీయోపాధ్యాయుఁడగు దేవసహాయముగారికిని నాకును మంచి స్నేహము కలసెను. మే మిరువురము సమవయస్కులము; పలువిషయములందు పరస్పర సానుభూతి గలిగియుండువారము. క్రొత్తగ నుద్యోగమునఁ బ్రవేశించిన యువకుఁడనగు నాకష్టసుఖము లాయన యారయుచు, సోదరునివలె నిరంతరము నన్నుఁ బ్రేమించుచుండువాఁడు. ఈసంవత్సరాంతముననే యాయన బెజవాడ విడిచి మద్రాసులో నుద్యోగస్వీకారముఁ జేయ నుద్దేశించెను. నే నీపాఠశాలయం దెట్లు మెలఁగవలయునో, ఎవరి నెట్లు చూడవలయునో, నా కాయన బోధించుచుండువాఁడు. ఇరువురమును ప్రథమోపాధ్యాయునిదెస గౌరవభావము గలిగియుండెడివారము. ఐనను కొన్ని చిన్నసంగతులందు వారితో మాకుఁగల యభిప్రాయభేదములె, మాయిద్దఱి పొత్తును వృద్ధిచేసెను. దేవసహాయముగారు బెజవాడ వీడుదినములు రాఁగా, విద్యార్థులు తమగురువునకు బహుమానపూర్వకముగ విజ్ఞాపనపత్ర మొసంగ నిశ్చయించి, మాయిరువురికిని గల చెలిమిని బాటించి, నన్నే యాపత్రము సిద్ధపఱుపఁగోరిరి. ౭-వ డిసెంబరున పాఠశాలలో జరిగిన బహిరంగసభలో నేనే విజ్ఞాపనపత్రమును జదివితిని. సహృదయుఁడు సరళస్వభావుఁడు నగు దేవసహాయమహాశయునకుఁ దగినట్టుగ, సద్భావపూరితముగను, లలితపదయుతముగను వినతిపత్ర మలరారుచుండె నని సదస్యులు సంతోషభరితులైరి.

నా కాపాఠశాలలోఁ బ్రియమిత్రులయిన యింకొక యుపాధ్యాయుని గుఱించి కూడ నిచటఁ జెప్పవలయును. వీరు ఆంధ్రపండితులగు జానపాటి కామశాస్త్రిగారు. ఇంచుమించుగ నాయీడువారే. నావలెనే బకింగుహాముపేటలోఁ గాపురము. సామాన్యముగ మేమిద్దఱమును గలసియే పాఠశాలకుఁ బోవుచు వచ్చుచుండెడివారము. ఉభయులము పాఠశాల యావరణమున సాయంకాలమున బంతు లాడుచుందుము. సామాన్యదేశభాషాపండితులవలెఁ గాక, కామశాస్త్రిగారు ఉన్నతయాంగ్లవిద్య నభ్యసించినయధ్యాపకునివలె విద్యార్థులను మంచియదుపులో నుంచి, వారి గౌరవ లాలనములకుఁ బాత్రు లగుచుండువారు. తాను గొంతవఱకు పూర్వాచారపరుఁ డయ్యును, కాలానుగుణ్యముగ సంఘమున కావశ్యకమైన కొన్ని సంస్కారణముల నీయన యామోదించుచుండువాఁడు.

తఱచుగ నాంధ్రవ్యాసములు రచించుచును మాసపత్రిక నొకటి ప్రకటించుచును నుండునాకు, వీరిసాయము నిరతమును గావలసి వచ్చెడిది. సరసులు, సాధుపుంగవులు, స్నేహపాత్రులును నగు శాస్త్రిగారు విసు వనుమాట నెఱుంగక, నావ్రాఁతలు దిద్దిపెట్టుచు నిరుపమాన స్త్రీవిద్యాభిమానమున నొప్పుచుండువారు.

నా కీ కాలమున పాఠశాలలోని బోధకులే గాక విద్యార్థులును గొందఱు స్నేహితులైరి. విగ్రహారాధనమును గుఱించి తనకుఁ గల స్వతంత్రాభిప్రాయములకొఱకు, సహచరుల యెత్తిపొడుపులకు గుఱియై నాయాదరము వడయుచుండిన అనంతరామయ్యను గుఱించి యిదివఱకే చెప్పితిని. మానికొండ రాజారావు, చేకుమళ్ల రాజగోపాలరావుగార్లు, తక్కినవారిలో ముఖ్యులు. మొదటి యాతఁ డానగరనివాసి. నేను షికారు పోవునపుడు ఆతఁడు నన్ను వెంబ

డించుచు, పట్టణవార్తలు విస్తారములును ప్రస్తావింపుచుండువాఁడు. శిష్యుఁడని యీసడింపక, అవ్యాజప్రేమమున నే నాతనిని మన్నించుచుండువాఁడను. రాజగోపాలరా వనిన రాజారావున కంతగఁ బడెడిది కాదు. ఆజానుబాహువగు రాజారావువలెఁగాక రాజగోపాలరావు పొట్టిగ సన్నముగ నుండి, ఆంధ్రసారస్వతమునఁ జక్కని యభిరుచి గాంచియుండుటచే నే నాతనిఁ బ్రేమించువాఁడను. పిమ్మట నీతఁడు నాపత్రికకు "స్త్రీచరిత కదంబము" అను పేరిట కథలు వ్రాయుచుండువాఁడు.

౧౮౯౮ సంవత్సరము డిసెంబరులో మద్రాసున జాతీయ సభలు దర్శించుటకై, వీరేశలింగముపంతులు రంగనాయకులునాయఁడు గార్లు రాజమంద్రినుండి ప్రయాణముఁ జేసి, మార్గమధ్యమందలి బెజవాడలో నొకనాఁడు నా కతిథులైరి. వీరేశలింగముగారు మాయింట విడియుటకు నింటివారు తప్పుపట్టక, మీఁదుమిక్కిలి వారికి వంట చేయుటయందు నాభార్యకు సాయముఁగూడఁ జేసిరి. నేను మా తమ్ముఁడు వెంకటరామయ్యతోఁగూడి వారితోఁ జెన్నపురికిఁ బ్రయాణమైతిని. రాజమంద్రిస్నేహితుల మంత దేశీయమహాసభకుఁ బోయెడి తక్కినవిద్యాధికులతోఁ గలసి యొకబండిలో నెక్కితిమి కాన, ప్రయాణకష్టము మాకేమియుఁ దోఁపలేదు. పూర్వాచారపరులగు సహచరులతో సంఘసంస్కరణమునుగురించి యత్యధికముగ వాదించుట వలన, వీరేశలింగముగారికి రెయిలులో గొంతు బొంగుపోయెను!

ఆ సంసత్సరమున జాతీయసభ కధ్యక్షుఁడు, వృద్ధుఁడు, బ్రిటిషు పార్లమెంటు సభ్యుఁడునునగు ఆల్ఫ్రెడు వెబ్బుదొర. రెండవ నాఁటి యుపన్యాసకులలో పార్లమెంటు సభ్యుఁడగు 'కీ' ముఖ్యుఁడు. ఈతఁడు తడవుకొనక, చేతనుండు కాకితమువంకనైనఁ జూడక, గంటల

కొలఁది ఘుటికావేగమునఁ బ్రసంగము చేయఁజాలినవాఁడు. సద్వర్తనముఁ గోలుపోయె నను కారణమున గొప్పవక్తయు ప్రసిద్ధన్యాయవాదియు నైన యొకదొరను సభలో మాటాడనీయవలదని ముల్లరుకన్య తెచ్చిన తీర్మానమును అధ్యక్షుఁడు త్రోసివేయుట, మిత్రుఁడు వెంకటరత్నము నాయఁడుగారు మున్నగు కొందఱి కసమ్మతమయ్యెను.

౨౮-వ తేదీని నేను మహాసభకుఁ బోక, పూర్వగురువులు మిత్రులు నగు మల్లాది వెంకటరత్నముగారిని సందర్శించితిని. ముందు చెన్నపురిలో న్యాయవాదిపరీక్షకుఁ జదువఁబూనిన నాతమ్మునికొఱకై తన యింట నొకగది యిచ్చెను. ౨౯-వ తేదీని నేను కాంగ్రెసులోఁ గాంచిన యుపన్యాసకులలో నెల్ల సురేంద్రనాథబెనర్జి మదనమోహన మాళవ్యాగార్లు అధికప్రతిభావంతులుగఁ దోఁచిరి.

డిసెంబరు ౩౦-వ తేదీని బ్రాహ్మమందిరములో జరిగిన యొక బ్రాహ్మవివాహమును జూచితిని. జగద్విఖ్యాతిఁ గాంచిన భండార్కరు పండితుఁడు ఆసందర్భమున పురోహితుఁడు. ఇతఁడు సప్తపది మంత్రములు పఠించి, వధూవరులచే నడుగు లిడుచు వేయించి వాని భావము విప్పిచెప్పునప్పుడు, పూర్వకాలపు ఋషివర్యు లెవరో యిపు డధ్వర్యము చేసి యీ యార్యవివాహమును నడపించుచుండినట్లు గాన వచ్చెను! మఱునాఁడు క్రైస్తవకళాశాలలో చెన్నపురి సంఘసంస్కరణసమాజ వార్షికసభ జరిగెను. రేనడే, భండార్కరుగార్లు మహోపన్యాసము లొసంగిరి.

## ౧౧. నూతన వత్సరము

౧౮౯౪-వ సంవత్సరము జనవరి ౫-వ తేదీని నేను చెన్నపురినుండి తిరిగి బెజవాడ వచ్చినపుడు, దేశీయమహాసభ ప్రతినిధు రాంధ్ర

యొక్కయు, ఇతర ప్రతిభావంతులయొక్కయు ప్రతిమలు కొన్నికొని చట్టములు కట్టించి నాతోఁ దెచ్చితిని. ఇంట వెలిగించుకొనుటకు కాంతిమంతములగు గాజుదీపములను, ముఖము చూచుకొనుటకు ముకురములను గొనివచ్చితిని. రాత్రులు దీపముల వెలుఁగున గోడలకుఁ దగిలింపఁబడిన పటములు ప్రతిమలును తళతళ మని మెఱయుచు, గాంధర్వలోకదృశ్యములను సూచించుచుండెను. దేశీయమహాసభయందును, తదితర మహాసభలందును నే నాకర్ణించిన సురేంద్రనాధబెనర్జీ, మదనమోహనమాళవ్యా ప్రభృతులగు మహావక్తల ప్రసంగములు నా వీనుల నింకను వినుపించునట్లే యుండెను. ఎచటఁ జూచినను నా కనులకు సౌందర్యవాహిని గోచరించెను. పక్షుల కలస్వనములందును, మానినీమణుల మందహాసములందును, ప్రకృతికాంత వదనముకురమందును, నాకు సర్వేశ్వరుని సుందరాకారము ప్రతిబింబితమయ్యెను. ప్రాచ్యదైవభక్తుల హృదయసీమలందలి బహుదేవతా విశ్వాసమున కిట్టి దృశ్యములే హేతుభూతములై యుండవచ్చునని నేను దలపోసితిని.

పాఠశాల కింకను సెలవు లుండినందున మేము రాజమండ్రివెళ్లి బంధుమిత్రులను జూచితిమి. మృత్యుంజయరావున కిటీవల జ్వరమువలన బలహీనత యతిశయించినను, ఇపుడు కొంచెము నెమ్మదిగ నుండెను. మిత్రుల మిరువురమును భగవద్విషయములను గుఱించి ముచ్చటించుకొంటిమి. ఈమధ్య వ్యాధి ముదిరి, పరిస్థితులు తలక్రిందైనపుడు తన్నావరించిన నిబిడాంధకారము నొక్కింతఁ దొలఁగించి, తన యాత్మముందొక విద్యుద్దీపము వెలిఁగెనని నామిత్రుఁడు పలికినపుడు, నే నది యీశ్వర సాక్షాత్కారమే యని గ్రహించితిని. అనుభవసిద్ధమగు నిట్టియీశ్వరసందర్శనమే మతమునకు ప్రధానాంగము కాని, సూత్రములు సిద్ధాంతములును గావని నాకు ద్యోతకమయ్యెను.

కుటుంబఋణము పెరుఁగుచుండుటచేత, అది తీర్చివేయు నుద్దేశమున మాభూము లమ్మఁజూపుటకై తండ్రియు నేనును గోటేరు మున్నగు ప్రదేశముల కపుడు ప్రయాణమైతిమి. ఈపద్ధతి మాతల్లికి సమ్మతముగ లేదు. ఈ సందర్భమున నా కామె దుర్గుణదురుద్దేశము లారోపింప వెనుదీయకుండెను! అప్పులన్నియు విద్యాపరిపూర్తిఁజేసిన నేనును, నా పెద్ద తమ్ముఁడును మాత్రమే తీర్చివేసి, ఆస్తి యందఱము ను సరిసమానముగఁ బంచుకొనుట న్యాయ్యమని యామె తలంచెను. కుటుంబమరియాద నిలువఁబెట్టు విషయమున నాకుఁగల సద్భావ మామె సంశయించుటకు నేను మిగుల వగచితిని.

జనవరి ౯-వ తేదీని మానాయనయు నేనును రాజమంద్రి నుండి బయలుదేఱి, రాత్రికి వేలివెన్నును, మఱునాఁటికి గోటేరును జేరితిమి. గోటేరులో ఋణదాత రామభద్రరాజుగారు మాభూములు కొనుటకు మొదట సమ్మతింపకుండినను, మేము పట్టుపట్టినపిదప నద్దాని కొప్పుకొనెను. మేము తణుకులో నొకటిరెండురోజులు నిలిచియుంటిమి. నాపూర్వసహపాఠి జనమంచి వెంకటరామయ్యగా రచటి మాధ్యమిక పాఠశాలలో ప్రధానోపాధ్యాయుఁడు. జనానా పత్రికకు వ్రాయుటకాయన సమ్మతించెను. మే మంత రేలంగి వెళ్లి బంధువులను జూచితిమి. పట్టపరీక్ష నిచ్చి, ఉద్యోగస్వీకారము చేసి, స్వగ్రామ సందర్శనముఁ జేయవచ్చిన నన్ను గ్రామస్థులు మిగుల మన్నించిరి. కుటుంబ కలహములవలన మాపెద్ద పెత్తండ్రి మొదట నాతో మాటాడకుండినను, పిమ్మట నా కెంతయో దయ చూపించెను. నన్నాయన ముద్దాడి, కంట నీరు దెచ్చుకొనెను. మే మంత బయలుదేఱి, రాజమంద్రి తిరిగి వచ్చితిమి.

## ౧౧. నూతన వత్సరము

నేను మరల మృత్యుంజయరావును గలసికొని మాటాడితిని. సత్యసంవర్ధనితోడి సంబంధము కొన్ని మాసములనుండి నేను వదలుకొనినను, నాస్నేహితునిరీతిఁ జూచి, మార్చినెలనుండి యాపత్రికకు వ్రాయుదు నంటిని. అంత నందఱి యొద్దను వీడ్కోలు గైకొని బెజవాడకు వెడలిపోయితిమి.

చదువు నిమిత్తమై తమ్ములు కృష్ణమూర్తి సూర్యనారాయణులను బెజవాడకు మాతోఁ గొనివచ్చితిమి. వారిని మాతో నంపుటకు మాతల్లి కెంతో కష్టముగఁ దోఁచెను. ౧౬ వ-తేదీని మేము బెజవాడ చేరితిమి. మాపాఠశాల మంచిస్థితిలో లేకుండుటకు నే నెంతయుఁ జింతిల్లితిని. ఇది కారణముగ బెజవాడలో నాయునికి కంతరాయము గలుగవచ్చు నని భయమందితిని.

౧౭ వ-తేదీని వీరేశలింగముగారు సకుటుంబముగ మద్రాసునుండి రాజమంద్రికి వచ్చుచు, మార్గమధ్యమున భోజనము నిమిత్తమై బెజవాడలో మా యింటికి వచ్చిరి. అపుడు మాయింట నన్న మమర కుండుటవలన, వేఱుచోట వారు భుజించిరి. ఈయశ్రద్ధకై భార్య మీఁద నేను గోపించితిని.

అందఱు నొకచోట నివసించినచో కుటుంబవ్యయము తగ్గునని నేను జెప్పఁగా, రాజమంద్రిలోని కాపుర మెత్తివైచి, బెజవాడలో నాయొద్ద నుండుటకు మా తలిదండ్రులు సమ్మతించిరి. తగినంతస్థలము సమకూరుటకై గోవిందరాజులవారి యింటిలో నుత్తరభాగము విడిచి, విశాలమగు దక్షిణభాగమును, దానితోఁ జేరియుండు వీథివసారాగది యును మేము నెల కైదు రూపాయీల బాడుగకుఁ దీసికొని, దాని లోనికిఁ గాపురము తరలించితిమి.

ఆకాలమున బెజవాడలో డిస్ట్రిక్టుమునసబుగనుండిన కొప్ప రపు రామారావుగారిచ్చిన కొన్నివేల రూపాయిల విరాళముమీఁద వచ్చెడి వడ్డితో, ఏఁటేఁట నాంధ్రదేశమం దున్నతవిద్య నేర్చెడి పేద నియోగి బాలురకు వేతనము లీయఁబడుచుండెడివి. ఈ“యాఱువేల నియోగివిద్యార్థి సహాయకసమాజ” కార్యనిర్వాహక సభలో నన్నిటీవల సభికునిగ నెన్నుకొనిరి. ౧౯ వ-జనవరిలో జరిగిన సభకు నే నధ్యక్షుఁడను. వర్ణభేదములను బాటింపని నే నీనియోగులసమాజమునఁ జేరుటకు సందేహింపమికి, అది వట్టివిద్యాసంస్థ యని భావించుటయే కారణము.

మా తలిదండ్రులు రాజమండ్రివిడిచి బెజవాడ రాలేకపోయిరి. బెజవాడలో నాతో నాతమ్ములిద్దఱుండుటచేత, ఇంటి పని యొక్క తెయుఁ జేసికొనలేక, నాభార్య మూలుగుచు, నామీఁద చిరచిర మనుచుండెడిది. తలిదండ్రులను విడిచి యుండుటకు సూర్యనారాయణ లోన బెంగపెట్టుకొనియుండెను. నేను “జనానాపత్రిక”కు వ్రాసినవ్యాసములు వానిచేఁ జదివించుచును, పత్రికకు సొంతముగ వ్రాయుమని హెచ్చరించుచును, ఎటులో వానిదృష్టిని జదువునకు మరలింపఁ జూచితిని. ఇంకను బలహీనుఁ డగు కృష్ణమూర్తికి బలముపట్టు మందు లిప్పించుటకై రంగనాయకులునాయఁడుగారితో నే నుత్తరప్రత్యుత్తరములు జరిపితిని.

సంసార లంపటయు నింద్రియలోలత్వమును నాయందు పెచ్చుపెరిఁగి, నామనస్సు నీశ్వరధ్యానమునుండి మెల్లమెల్లగఁ దొలఁగించుచుండెను. దైవభక్తియందు నాకు మరల తీపి గలిగింపఁగల యుదంత మొకటి యిపుడు సంభవించెను. నాపూర్వపరిచితులగు దుగ్గిరాల రామమూర్తిగారి పాఠశాలలో ప్రకృతిశాస్త్రబోధకులుగ

నియమింపఁబడిరి. ఆయన బ్రాహ్మమతవిశ్వాసియు, స్నేహపాత్రుఁడును. పాఠశాలలోఁ గొన్ని క్రొత్తయేర్పాటులు చేసితిమి. విద్యార్థుల యుపయోగార్థమై పఠనాలయము నెలకొల్పితిమి. నేనీయేఁడు ద్వితీయోపాధ్యాయుఁడ నైతినిగాన, దేవసహాయముగారి స్థానమున పాఠశాలలో వ్యాయామాధికారి నైతిని.

మా పాఠశాలాప్రవేశపరీక్షాఫలితము లంత తెలిసెను. అనంతరామయ్య యొకఁడు మాత్రమే జయమందెను. మేము దీనికి నిరుత్సాహ మందక, పరిస్థితులు ముందు బాగుపడు నుపాయము లాలోచించితిమి. పాఠశాలలో పాఠనిర్ణయపట్టికలు సిద్ధము చేయు పని నేనిపుడు నిర్వహింపవలసివచ్చెను. ఈపని నే నెంత సద్భావముతోను నిష్పాక్షికబుద్ధితోను నెరవేర్పఁబూనినను, నామూలమున తమపనియందు చిక్కు లధికమయ్యె నని సణుగుకొనుచు, బోధకులు కొందఱు నాకు దుర్గుణము లారోపింప వెనుదీయకుండిరి!

ఫిబ్రవరి ౧౪ వ తేదీని మమ్ముఁ జూచిపోవుటకు, మా చిన్నచెల్లెలు కామేశ్వరమ్మతోఁ గలసి మాయమ్మ బెజవాడ వచ్చెను. మృత్యుంజయరావు చిన్నకూఁతురు రామాబాయి చనిపోయె నని వారివలన విని మే మెంతయు విచారపడితిమి.

## ౧౨. నిత్యవిధులు

నేను యల్. టి. పరీక్షకు మార్చినెలలో మద్రాసు వచ్చి కొన్ని రోజు లుంటిని. అచట నాతమ్ముఁడు వెంకటరామయ్యతోను, మిత్రులు వెంకటరత్నము, నారాయణస్వామినాయఁడు, కనకరాజు, గంగరాజు గార్లతోను నేను ప్రొద్దుపుచ్చితిని. నా తమ్ముఁడు పట్టపరీ

క్షలో నాంగ్లమున తప్పి, ఆపరీక్ష కిచట చదువుటకై చెన్నపురి క్రైస్తవకళాశాలలోఁ జేర నుద్దేశించెను. కలకత్తా భారనగరమున తాను నెలకొల్పి నడిపెడి "వితంతు శరణాలయమున"కు చందాలు పోగుచే యుటకై మద్రాసు వచ్చియుండిన శశిపాద బెనర్జీగారిని ౫-వ మార్చి ని మిత్రులతో నేను సందర్శించి, నాకుఁ దోఁచిన కొంచెము చందా వారి కిచ్చితిని.

యల్. టి. పరీక్ష రెండవభాగమున నీరెండవసారికూడ నే నపజయముఁ గాంచుటచేత, ఆ లోపమును గొంత పూరించుటకై నేను యం. యె. పరీక్ష కింటఁ జదువ నుద్దేశించితిని. డాక్టరు సత్య నాథముగారిని జూచి, తత్త్వశాస్త్రమున యం. యే. పరీక్షకుఁ జదువ వలసిన పుస్తకములను గురించి వారి యాలోచనలు గైకొంటిని. కొన్ని పుస్తకములు కొని బెజవాడ తెచ్చుకొంటిని. చెన్నపురి కళాశాలలోఁ దనకు సౌకర్యము గలుగని కారణమున, వెంకటరామయ్య నాతో బెజవాడకు వచ్చి మాతల్లిని చెల్లెలిని దీసికొని రాజమండ్రి వెడలిపో యెను. బెజవాడలో మాతో నుండలేక, తమ్ముఁడు సూర్యనారాయణ వారిని వెంబడించెను!

పాఠశాలలో తోడిబోధకులగు రామమూర్తిగారు నాకీ కాల మున నిత్యసహవాసులైరి. విద్యాశాలలోను, బయటను మే మిరువుర మును గలసి మాటాడుకొనుచు కాలము గడుపు చుందుము. ఆయన బోధనము ననుసరించి నే నిపుడు కార్లయిలు విరచితమగు "సార్టరు రిసా ర్టసు" అను గ్రంథరాజమును జదువ మొదలిడితిని. నేను యం. యే. పరీక్షకును, ఆయన బి. యే. పరీక్షలోని రెండవభాగమునకును మిగుల దీక్షతోఁ జదువ నారంభించితిమి. విద్యాపరిశ్రమమునకు ప్రాతఃకా లమే మంచిసమయ మని యెంచి, మేము వేకువనే లేచి, యింటఁ

పుస్తకములు ముందు వేసికొని కూర్చుండువారము. కాని, కడుపులో నాహారము లేక దేహమున నిస్సత్తువుగ నుండు సమయమునఁ జదువుట మంచిది కా దని తెలిసినవారము గాన, మే మిరువురమును నానుఱొట్టెను, కోకోను స్వీకరింప నారంభించితిమి. కోకోనీరు త్వరగఁ జేసికొనుటకు మర ప్రొయ్యి మున్నగు పరికరములు సిద్ధము చేసికొంటిమి. కాని, యీ యుపాహార వస్తువులు సమకూర్చుకొను నాటోపమునందే విలువగల ప్రాతఃకాలము వ్యయమగుచు వచ్చెను! ఇదివఱకు పరగడుపునఁ బనిచేయుట కష్టముగఁ దోఁచెడి మాకిపుడు, నిండుకడుపుతోఁ బరిశ్రమించుట కష్టతరమయ్యెను! అంతట, ఫలాహారములతో నారంభమైన ప్రొద్దుటి చదువు సాగియు సాగకమునుపే, సకాలమున పాఠశాలఁ జేరుటకై మేము భోజనసన్నాహము చేయవలసివచ్చెడిది! చదువు వంటఁబట్టుట సందేహాస్పదమైనను, అజీర్ణరోగము, ఫలాహారాభ్యాసమును మాత్రము వెంటఁబడుట స్పష్టమని మే మంత భయపడి, యుపాహారములను త్యజించి యదేచ్ఛగ నుంటిమి!

పాఠశాలలో నంత నర్ధసంవత్సర పరీక్ష లారంభమయ్యెను. పరీక్షాపత్రము లన్నియు నేనే చేతియంత్రమున నచ్చొత్తితిని. దీనివలనఁ దమపని సులువయ్యెనని సంతసించుటకు మాఱుగఁ గొందఱు బోధకులు, తమ పరీక్షాపత్రములు వేళకు నా కందీయక, నన్నుఁ జిక్కులుపెట్టి, మీఁదుమిక్కిలి నిందింప సాగిరి! ఎట్టకేలకు పరీక్షలు పూర్తి కాఁగా, వేసవికి పాఠశాల కట్టివేసిరి. 3-వ మేయి తేదీని, ఏప్రిలు "జనానాపత్రిక" నందుకొని, మేము రాజమండ్రి వెడలిపోయితిమి.

మే ౧౦-వ తేదీని మిత్రుఁడు రంగనాయకులు నాయఁడుగారి యత్తగారు చనిపోఁగా, ఆ మెశవమును కోటిలింగక్షేత్రమునకుఁ గొనిపోయిరి. అదివఱకె యచట నాయఁడుగారి భార్యసమాధి వెలసియుం

డెను. దానిచెంతనె వృద్ధురాలి యస్తికలు చేర్పఁబడెను. నాయఁడుగారాసమయమున ప్రార్థన సలిపిరి.

అప్పు పంచుకొని, నావంతు తీర్చివేయుమని తలిదండ్రులు పెద్దతమ్ముఁడును నాకిపుడు బోధించిరి. ఎటులో నన్ను ఋణవిముక్తునిగఁ జేసినచో నొక వేయిరూపాయి లిచ్చెద నని నేను వారలకుఁ జెప్పితిని. ఇది యుక్త మని మా మామగారును అభిప్రాయమందిరి.

నే నా రోజులలో సత్యనాథము కృపాబాయి గారిచే విరచితము "కమల" చదివి వినోదించితిని. మల్లాది వెంకటరత్నముగారి కోరిక ననుసరించి మాతమ్ముఁ డిదివఱకె యీపుస్తకమును తెనుఁగు చేయఁగా, దానిని సవరించి యిపుడు చెన్నపురికిఁ బంపితిని.

ఆ సెలవుదినములలో, పాపము, మృత్యుంజయరావునకు వ్యాధి ప్రబలమయ్యెను. అతనిఁ జూచి మిత్రులు విషాదమందిరి. మా తల్లికి వేసంగిలో మూర్ఛ యంకురించెను. ఆమె బాధకై మేము విచారించుచుండువారము. యం. యే. పరీక్షకై నే నీసెలవులలో రాజమండ్రికళాశాలా గ్రంథాలయమందలి యుద్గ్రంథములు కొన్ని చదివి యందలి ముఖ్యాంశములను నాపుస్తకములలో వ్రాసికొంటిని.

౨౫వ–మెయి తేదీని తండ్రి, పెదతమ్ముఁడు నేనును మా భూముల విక్రయమునకై రేలంగి పయనమై వేలివెన్ను చేరితిమి. అచట మాతమ్మునిమామ నరసయ్యగారు మాకుఁ గానఁబడి, తమ కూఁతుని శుభకార్యమునకు వలసిన ప్రయత్నములు జరిగిన వనియు, ఆలస్యమైనచోఁ దనకెంతో ధననష్ట మగు ననియు మొఱవెట్టెను. వధూవరుల కింత లేఁబ్రాయమున శుభకార్యము తలపెట్టఁగూడ దని నేను జెప్పివేసి, ఆయనపూర్ణాగ్రహమున కాహుతియైతిని! మా మూఁడవ

పెత్తండ్రి పద్మరాజుగారిని జూచుటకై మే మంత రాత్రికి పెనుగొండ వెడలిపోయి మఱునాఁడు రేలంగి వచ్చితిమి. ఆదినములలో రేలంగిగ్రామస్థులు కొందఱు రెండుకక్షులక్రింద చేర్పడి, ఒకరితో నొకరు ఘోరయుద్ధము జరుపుచుండిరి. ఈద్వంద్వయుద్ధ సందర్భమున, నిరపరాధులగు మాబోటివారును చిక్కులలోనికి రావచ్చునని నేను భీతిల్లితిని. భూములయమ్మకమునకై మాతండ్రి యంతట నుట్టుప్రక్కలగ్రామములు తిరిగెను. అప్పుడు మేము రేలంగి మండపాక కేతలి వడ్డూరు గ్రామములలోఁగల మాభూము లమ్మివేసితిమి. మా పెదతండ్రికుమారుఁడు మా యుభయకుటుంబములకు నిపుడు జరుగు వ్యాజ్యెములకు వివాదములకును ముఖ్యకారణ మని వింటిమి. అతఁడు తన తప్పునొప్పుకొనినను, నేను జెప్పిన సామమార్గమునకు సులభముగ నొడంబడలేదు. ఎటులో మే మంతసమాధానపడితిమి.

ఇంకముందునుండి కుటుంబవ్యయములకుఁ గొంత సొమ్ము నెలనెలయును సరిగా రాజమండ్రి పంపుచు, కొంత సొంత కర్చులకు వ్యయపఱచుకొని, మిగిలినదానితో నప్పులు తీర్చివేసెద నని నేను నిర్ధారణచేసికొంటిని. మేము రాజమండ్రి వచ్చునప్పటికి, మాతల్లియుఁ దమ్ముఁడును జబ్బుగ నుండిరి. గర్భసంబంధమగు వ్యాధికి లోనయిన నాభార్య, ఇంటఁ దాను బడుకష్టములనుగుఱించి మొఱపెట్టెను. స్కాటు మెట్కాపు దొరలను సందర్శించి, పాపయ్య మృత్యుంజయరావుగార్ల మున్నగు స్నేహితుల వీడుకొలంది, నేను పత్నీసమేతముగ జూను ౧౯-వ తేదీని బెజవాడ బయలుదేఱితిని. తల్లినిగూర్చియు తమ్ములనుగూర్చియు నా కెంతో విచారము గలిగెను. వారలకుమాత్రము నాచిక్కు తెలుకపడవుగదా! మే మంత ప్రీమరు

డెను. దానిచెంతనె వృద్ధురాలియస్థికలు చేర్పఁబడెను. నాయఁడుగారాసమయమున ప్రార్థన సలిపిరి.

అప్పు పంచుకొని, నావంతు తీర్చివేయుమని తలిదండ్రులు పెద్దతమ్ముఁడును నా కిపుడు బోధించిరి. ఎటులో నన్ను ఋణవిముక్తుని గఁ జేసినచో నొక వేయిరూపాయి లిచ్చెద నని నేను వారలకుఁ జెప్పితిని. ఇది యుక్త మని మా మామగారును అభిప్రాయమందిరి.

నే నా రోజులలో సత్యనాథము కృపాబాయి గారిచే విరచితమగు "కమల" చదివి వినోదించితిని. మల్లాది వెంకటరత్నముగారి కోరిక ననుసరించి మాతమ్ముఁ డిదివఱకె యీపుస్తకమును తెనుఁగు చేయఁగా, దానిని సవరించి యిపుడు చెన్నపురికిఁ బంపితిని.

ఆ సెలవుదినములలో, పాపము, మృత్యుంజయరావునకు వ్యాధి ప్రబలమయ్యెను. అతనిఁ జూచి మిత్రులు విషాదమందిరి. మా తల్లికీ వేసంగిలో మూర్ఛ యంకురించెను. ఆమె బాధకై మేము విచారించుచుండువారము. యం. యే. పరీక్షకై నే నీసెలవులలో రాజమండ్రికళాశాలా గ్రంథాలయమందలి యుద్గ్రంథములు కొన్ని చదివి యందలి ముఖ్యాంశములను నాపుస్తకములలో వ్రాసికొంటిని.

౨౫వ - మెయి తేదీని తండ్రి, పెదతమ్ముఁడు నేనును మా భూముల విక్రయమునకై రేలంగి పయనమై వేలివెన్ను చేరితిమి. అచట మాతమ్మునిమామ నరసయ్యగారు మాకుఁ గానఁబడి, తమ కూఁతుని శుభకార్యమునకు వలసిన ప్రయత్నములు జరిగిన వనియు, ఆలస్యమైనచోఁ దనకెంతో ధననష్ట మగు ననియు మొఱవెట్టెను. వధూవరుల కింత లేఁబ్రాయమున శుభకార్యము తలపెట్టఁగూడ దని నేను జెప్పివేసి, ఆయనపూర్ణాగ్రహమున కాహుతియైతిని! మా మూఁడవ

పెత్తండ్రి పద్మరాజుగారిని జూచుటకై మేమంత రాత్రికి పెనుగొండ వెడలిపోయి మఱునాఁడు రేలంగి వచ్చితిమి. ఆదినములలో రేలంగిగ్రామస్థులు కొందఱు రెండుకక్షులక్రింద నేర్పడి, ఒకరితో నొకరు ఘోరయుద్ధము జరుపుచుండిరి. ఈద్వంద్వయుద్ధ సందర్భమున, నిరపరాధులను మాబోటివారను చిక్కులలోనికి రావచ్చునని నేను భీతిల్లితిని. భూములయమ్మకమునకై మాతండ్రి యంతట నుట్టుప్రక్కలగ్రామములు తిరిగెను. అపుడు మేము రేలంగి మండపాక కేతవరము వద్దూరు గ్రామములలోఁగల మాభూము లమ్మివేసితిమి. మా పెదతండ్రికుమారుఁడు మా యుభయకుటుంబములకు నిపుడు జరుగు వ్యాజ్యములకు వివాదములకును ముఖ్యకారణ మని వింటిమి. అతఁడు తన తప్పునొప్పుకొనినను, నేను జెప్పిన సామమార్గమునకు సులభముగ నొడంబడలేదు. ఎటులో మేమంతసమాధానపడితిమి.

ఇంకముందునుండి కుటుంబవ్యయములకుఁ గొంత సొమ్ము నెలనెలయును సరిగా రాజమంద్రి పంపుచు, కొంత సొంత ఖర్చులకు వ్యయపఱచుకొని, మిగిలినదానితో నప్పులు తీర్చివేసెద నని నేను నిర్ధారణచేసికొంటిని. మేము రాజమంద్రి వచ్చునప్పటికి, మాతల్లియుఁ దమ్ముఁడును జబ్బుగ నుండిరి. గర్భసంబంధమగు వ్యాధికి లోనయిన నాభార్య, ఇంటఁ దాను బడుకష్టములనుగుఱించి మొఱపెట్టెను. స్కాటు మెట్కాపు దొరలను సందర్శించి, పాపయ్య మృత్యుంజయరావుగార్లు మున్నగు స్నేహితుల వీడుకొలంది, నేను పత్నీసమేతముగ జూను ౧౯-వ తేదీని బెజవాడ బయలుదేఱితిని. తల్లినిగూర్చియు తమ్మునిగూర్చియు నా కెంతో విచారము గలిగెను. వారలకుమాత్రము నాచిక్కు లెఱుకపడవుగదా! మేమంత స్టీమరు

మీఁద గోదావరి దాటి, కొవ్వూరునొద్ద రెయిలెక్కి, బెజవాడ చేరితిమి. అనంతముగారిని, స్టేషనునొద్ద మేము చూచితిమి.

జూను ౨౦-వ తేదీని పుస్తకములు సరదికొని, మిత్రులను సందర్శించి వచ్చితిని. విద్యార్థు లనేకులు నన్నుఁ జూడవచ్చిరి. బెజవాడ మకామునుచేసియుండు మన్నవ బుచ్చయ్యపంతులుగా రిపుడు నాకుఁ గానఁబడిరి. నే నిచటనె యింక రెండు సంవత్సరము లుందు నని క్లార్కుదొరకు వ్రాయనా యని అనంతముగారితో నేననఁగా, అది తమకు సమ్మతమె యైనను, దొరకు వ్రాయుట సమంజసము గాదనియు, సమయము చూచి తామె యీసంగతి వారికిఁ దెలియఁజేతు మనియు వారు చెప్పిరి.

ఈ జులై నెలనుండియు, "జనానాపత్రిక" నాయొక్కని యాధిపత్యముననె ప్రచురింపఁబడుచుండెను. గతవత్సరమున నాకోరిక చొప్పున వెంకటరత్నముగారు తోడిపత్రికాధిపతులుగ నుండి సాయము చేసిరి. తమ కిఁకఁ దీఱదని వారు చెప్పివేయఁగా, పత్రికా నిర్వహణభారము నేను వహింపవలసివచ్చెను. అంతటినుండి "జనానా పత్రిక"నుగూర్చిన పనులన్నియు నామీఁదనె పడెను. పాఠశాలలో విద్యాబోధనమును, ఇంటఁ బరీక్షాగ్రంథపఠనము, పత్రికానిర్వహణమును జేయవలసివచ్చి, తీఱిక లేక నేను తల్లడిల్లితిని. పనులు బాగుగ నెరవేర్పకుండెననియు, పాఠములు సక్రమముగఁ జదువుచుండలే దనియును నేను భార్యను సదా తప్పుపట్టుచు, నావాక్కున నిట్లు మార్దవము లేకుండఁజేసిన విధిని దూరుచు, లోనఁ బరితపించుచు, దినములు గడుపుచుండువాఁడను!

# ౧౩. స హ వా సు లు

ఆ సంవత్సరము జూన్ ౨౯-వ తేదీని మద్రాసునుండి రాజమండ్రి వచ్చెడి వీరేశలింగముగారిని వారిభార్యను గలసికొనుటకై, రామమూర్తిగారు నేనును రెయిలుస్టేషనుకుఁ బోయితిమి. మేము నలువురము నంత బుచ్చయ్యపంతులుగారి వసతిగృహమున కేగి యచట విందారగించితిమి. రాజ్యలక్ష్మమ్మగారి నొకదినము బెజవాడలో నిలుపఁగోరిన గురవమ్మగారు, వీరేశలింగముగారి ప్రతికూల వికటవచనములకు నిరుత్సాహులై యూరకుండిరి !

ఆరోజులలో రామమూర్తి నాకు గుండెకాయయే! అనవరతమును చదువుసాములు సరససల్లాపములు నా కాతనితోడనే! పలువిషయములం దిరువురము నేకాభిప్రాయులము. జులై ౫-వ తేదీని పాఠశాలలో "విద్యార్థిసాహితీసమాజ" సభలో మే మిరువురమును ప్రసంగించితిమి. నా వాక్యము లేమియు సారస్యముగ లేవని నేను మొఱపెట్టఁగా, అట్లు కాదనియు, నా పలుకులింపుగను సొంపుగను నుండెననియు పలికి, మిత్రుఁడు నాకుత్సాహము గలిగించెను. మే మిరువురము తఱచుగ నుపన్యాసము లొసంగ నుద్యమించితిమి.

జూలై ౨౫-వ తేదీని రామమూర్తిగారి పుత్రునికి జబ్బుచేసి, కొన్ని గంటలలోనే వానికి మృత్యువు సంభవించెను. మా కెంతో మనస్తాపము కలిగెను. ఈపిల్లవాని యన్నప్రాశనశుభకార్యము కొలఁది కాలముక్రిందటనే యతివైభవముగ జరిగెను! మనుష్యజీవిత మింత యస్థిరమగుటకు మే మాశ్చర్య మందితిమి.

ఆగష్టునెలనుండి "జనానాపత్రిక"లో ప్రకటించుటకై "గృహనిర్వాహకత్వ"మను పుస్తకమును వ్రాయఁదొడంగితిని. కీలీదొరసాని

వ్రాసిన చిన్న పుస్తకము సారచనకు మాతృక. అప్పటినుండియు నెల నెలయును నేనా పుస్తక ప్రకరణములను జనానాపత్రికలోఁ బ్రకటించుచుంటిని. కమలాంబచరిత్ర తర్జుమా బాగుగ లేదని వెంకటరత్నము గారు చెప్పుటచేత నేనా పుస్తకమును మరల తెలుఁగు చేసితిని. ౧౧-వ అగష్టు ఆదివారమురోజున రామమూర్తియు, నేనును, బెజవాడలో "ప్రార్థనసమాజ" స్థాపనముఁ జేసితిమి. నేను ప్రార్థన సలిపి, దైవ భక్తిని గుఱించి ప్రసంగించితిని. నామిత్రుఁడు సమాజోద్దేశముల విషయమై యుపన్యాస మొసంగెను.

ఆకాలమున చెన్నపురి రాజధానిలోని ఆంధ్రమండలముల ప్రతినిధులు శాసననిర్మాణ సమాజసభ్యుల నేర్పఱుచుటకై బెజవాడలోఁ గూడుచువచ్చిరి. ఈమాఱు ౧౫-వ అగష్టున నీ సభ బెజవాడలో జరిగెను. పురపాలక సంఘముల పక్షమున శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగా రెన్నుకొనఁబడిరి. ఇది మా కందఱకును సంతోషకరముగ నుండెను.

ఈ సంవత్సరపు పరీక్షాఫలితములైన బాగుగ లేనిచో, తానీ పాఠశాల వదలివేయుదు నని అనంతముగారు చెప్పివేసిరి. అందువలన నా కెంతో యలజడి గలిగెను. నేనిపుడు ప్రథమసహాయోపాధ్యాయుఁడనై, ఆటలు పాఠక్రమపట్టిక మున్నగు పనులయం దాయనకుఁ దోడ్పడుచుండుటచేత, నా కాయన పలుకులు కొంత భీతిని జనింపఁ జేసెను. పాఠశాలాభివృద్ధికొఱ కెంతో పాటుపడితిమి.

౧౬-వ అగష్టున మాపెద్దపెత్తండ్రి చనిపోయె నని తెలిసి తమ్ముఁడు నేనును మిగుల విషాదమందితిమి. ౨౨-వ అగష్టున బాలికాపాఠశాలాధికారిణి యగు బ్రాండరుదొరసాని దగ్గఱనుండి నా కొక

జాబువచ్చెను. "జనానాపత్రిక" వ్యాసశైలి కఠినపాకమున నున్న
దను మొఱ విని, నే నాశ్చర్యవిషాదముల నందితిని!

౨౮-వ సెప్టెంబరున అనంతముగారు, రామమూర్తిగారు నేనును సకుటుంబముగ విద్యార్థులు కొందఱితోఁ గలసి, కొండపల్లి కొండను జూచుటకై రెయిలుమీఁద బయలుదేఱి, అచటి సత్రములో రాత్రి విడిసితిమి. మఱునాఁడు వేకువనే చలిదియన్నము తిని, అంఱఱము కొండయెక్క నారంభించితిమి. విద్యార్థులు మాముందు దుముకుచు కోఁతులవలె కొండ కెగఁబ్రాకిరి. ముందు పురుషులము, వెనుక స్త్రీలు నంత బారుగ నేర్పడి, నడువసాగితిమి. అచటి దృశ్యము లత్యంతరమణీయములుగ నుండెను. దారి కిరుకెలంకులను చెట్లు, పొద లును గలవు. వానిమీఁదఁగూర్చుని పక్షులు మధురరుతములు చేయుచుం డెను. సుందరలతలు, కమ్మఁదావుల వెదజల్లువృక్షములు, వృక్షములఁ దల దాల్చిన పర్వతశిఖరములును, కనుల పండువు సేయుచుండెను. సృష్టిలో ప్రస్ఫుటమైన సర్వేశ్వరుని సుందరాకారము మాకు చక్షుగోచర మయ్యెను. కొండమీఁద "కిల్లా" మా కపుడు కానవచ్చెను. పాడుపడిన ప్రాచీనపుకోటగోడలు చూచి పూర్వకాలపుసంగతులు నాకు స్ఫురణకు వచ్చెను. ఈదృశ్యము లాధారముగఁ గైకొని ముందు నేనొక చిత్ర కథ గల్పింప సంకల్పించుకొంటిని! కొనకొండమీఁదికి మే మంత వేవేగమె ప్రాఁకిపోయితిమి. అచట గీతములు పాడి వినోదమునఁ గాలక్షేపము చేసితిమి. రాత్రి యగుసరికి మేము కొండ దిగి, సత్ర మున కేగి, మరల నచట వంటచేసికొని సుఖభోజనము చేసితిమి. మఱునాఁడు చలిదియన్నము తిని రెయిలుస్టేషనుకు వెడలిపోయి తిమి. కొండపల్లి బొమ్మలకు ప్రసిద్ధి కెక్కినది. భోగము మేళములు, కలెక్టరుకచేరి, తాడిదానిమ్మలు, ఆవులు, పాములు మొదలగు జంతువులు,

మున్నగు వానియాకారములు చిన్నచిన్న కొయ్యబొమ్మలరూపమునఁ జెక్కఁబడి, కొద్దినెలల కమ్మఁబడుచుండెను. ఈబొమ్మలు కొన్ని కొనిమేము రెయిలులోఁ గూర్చుండి, మధ్యాహ్నమునకు బెజవాడఁ జేరితిమి.

ఆ దసరాసెలవులలో "జనానాపత్రిక"కుఁ గ్రొత్తచందాదారులను సమకూర్చుటకై ౨౭-వ సెప్టెంబరున బుచ్చయ్యపంతులుగారితోఁ గలసి నేను గుంటూరు వచ్చితిని. ఆయనద్వారా నాకు కళాశాలలో నుపన్యాసకులగు పసుపులేటి వెంకటకృష్ణమ్మనాయఁడుగారు పరిచితులైరి. ఆయన సజ్జనులు, విశాలహృదయులును. గుంటూరు పురపాలకసంఘాధ్యక్షులగు నాయఁడుగారి కచట మిగుల పలుకుబడి కలదు. ఆయన నన్నుఁ దమస్నేహితులయిండ్లకుఁ గొనిపోయి, నా పత్రికకుఁ జందాదారులై స్త్రీవిద్యకుఁ బ్రోత్సాహము గలిగింపుఁ డని వారితో నొక్కిచెప్పిరి. ఈకారణమున గుంటూరులో నాపత్రికకుఁ గొందఱు చందాదారు లేర్పడిరి. ఈలాభమునకంటె నెన్నిమడుంగులో విలువగల సహృదయులగు నాయఁడుగారి పరిచయలాభము నాకీ సందర్భమునఁ జేకూరెను.

రాజమండ్రిలో వ్యాధిగ్రస్తులైన తమ యన్న రంగనాయకులు నాయఁడుగారిని సందర్శించుటకై చెన్నపురినుండి డాక్టరు నారాయణస్వామినాయఁడుగారు అక్టోబరు ౨-వ తేదీని బెజవాడ వచ్చిరి. బెజవాడ పరిసరములనుండు బుడమేరునది అంతకుఁ గొన్నిదినముల క్రిందటనె కురిసిన యధికవర్షములవలన నకస్మాత్తుగఁ బొంగుటచేత, రెయిలుకట్ట కాలువగట్టులును తెగిపోయెను. ఆకారణమున రెయిలు బెజవాడనుండి యేలూరునకు సరిగా నడచుచుండుట లేదు. పడవల రాకపోకలు కూడ క్రమముగ లేవు. నా రా య ణ స్వా మి

నాయఁడుగారికి నే నంత వసంతముగారి పరిచయము గలుగఁజేసితిని. నాయఁడుగారు వారి యింట భోజనము చేసి, మేము కుదిర్చిన పడవలో నేలూరు వెళ్లిరి. మిత్రుఁడు రంగనాయకులునాయఁడుగారు సన్నిపాతజ్వరము వాతఁబడి మరణించిరని కొలఁది రోజులలోనే మాకుఁ దెలిసెను. ఆ దుఃఖవార్త విని నేను మిక్కిలి విలపించితిని. అక్టోబరు ౧౧-వ తేదీని నారాయణస్వామినాయఁడుగారు తనసోదరిని, తమ్మునిపిల్లలను, రాజమంద్రినుండి తీసికొనివచ్చిరి. పిల్లలందఱు మాయింట భోజనము చేసిరి. క్రైస్తవులగు నాయఁడుగారు వారి సోదరియును అనంతముగారి యతిథులైరి. ఆ సాయంత్రము వారందఱును మద్రాసు రెయిలెక్కి పోయిరి.

౧౩-వ అక్టోబరున మా బకింగుహాముపేట పఠనాలయ వార్షికోత్సవము జరిగెను. మిత్రుఁడు రామమూర్తి యాతరుణమున చక్కని యుపన్యాస మొసంగినను, రామారావుగారు దానిమీఁది వికటవ్యాఖ్యానములతోఁ దమ యధ్యక్షోపన్యాసమును ముగించిరి!

"శీలము" అను పేరితో నేనొక దీర్ఘోపన్యాసము వ్రాసి, ౧౧-వ నవంబరు సోమవారము జరిగిన "విద్యార్థిసాహితీసమాజ" వార్షికసభలోఁ జదివితిని.

డిసెంబరు ౭-వ తేదీని నేను స్నేహితులకొఱకు రెయిలుస్టేషనులో కనిపెట్టుకొని యుంటిని. మద్రాసునుండి వీరేశలింగముపంతులుగారు వచ్చి, వెంటనే రాజమంద్రి వెడలిపోయిరి. కాని, మిత్రులు కనకరాజు, గంగరాజుగార్లు ఆరోజున మాయింట నిలిచియుండిరి. శీతకాలపు సెలవులకు పాఠశాల మూయఁబడుట చేత, డిసెంబరు ౯-వ తేదీని సతీపతు లిరువురమును స్నేహితులతో బెజవాడనుండి బయలుదేఱి రాజమంద్రి వెడలిపోయితిమి.

ఈ యిద్దఱు మిత్రులు నేనును గలసి మృత్యుంజయరావును మఱునాఁడు చూచి వచ్చితిమి. అతని కిప్పుడు వ్యాధి ప్రబలియుండెను. సాయంకాలము వీరేశలింగముగారినిఁ జూచివచ్చితిమి. స్నేహితు లంత నరసాపురము వెడలిపోయిరి.

రాజమంద్రిలో నున్న రోజులలో నేను మా నాయనతోను, పెద్దతమ్మునితోను కుటుంబఋణముల తీరుమానమును గుఱించి మాటాడితిని. మిత్రుఁడు రామమూర్తి తాను బూర్తిచేయవలసిన బి. యే. పరిక్షకుఁ జనువుటకై రాజమంద్రి యిపుడు వచ్చెను కాని, యాయన చదువు చాలించుకొని కొలఁదిదినములలోనే స్వగ్రామ మగు నేలూరు వెడలిపోయెను. పాపము, మృత్యుంజయరావున కంత్యదినములు సమీపించుచుండెను. ఇప్పు డాతఁడు తీవ్రజ్వరపీడితుఁ డయ్యెను. అతని స్థితి నిగూర్చి మిగుల వగచితిని. ఇట్టి నిరపరాధి నేల వేధించెద వని దేవదేవుని సంప్రశ్నించితిని. మానవులు మొఱపెట్టక, తమ విధికృత్యములు నెరవేర్చుచుండుటయే కర్తవ్యముకదా!

వ్యాధిగ్రస్తుఁడగు మృత్యుంజయరావు సెలవు పొడిగించుఁ డని మెట్కాఫుదొర నడుగుటకై, పాపయ్యగారు నేనును ఆ క్రిస్మసుదినములలో దొరగారిని సందర్శించితిమి. మృత్యుంజయరావునకు సెలవిచ్చెద మని దొరగారు ధైర్యము చెప్పిరి.

౨౧-న తేదీని నేను కోటిలింగక్షేత్రమున కేగి, యీమధ్య చనిపోయిన స్నేహితుఁడు రంగనాయకులునాయఁడుగారి సమాధిచూచి వచ్చితిని. కాలగతి నొందిన మిత్రుఁడగు నాయఁడుగారిని గుఱించి విచారమందితిని. నెచ్చెలుని సుగుణగణవర్ణనము చేయుచు నొక పద్యమాల రచింప నూహించితిని. ఒకటిరెండు రోజులలో పరీక్షు

నిమిత్తమై వెంకటరామయ్య మద్రాసు వెడలిపోయెను. మేము బెజవాడకు మరలివచ్చితిమి.

## ౧౪. ప్రాఁతక్రొత్తలు

క్రడచిన సంవత్సరమున నేను జేసిన పనులను విమర్శించుకొనుచు, ౧౮౯౨-వ సంవత్సరము జనవరి మొదటి తేదీని నేనొక పట్టికను వ్రాసికొంటిని. అందులో గత సంవత్సరమున పరీక్షకొఱకును వినోదార్థమును జదివిన పుస్తకములఁ జేర్కొని, ముందు సంవత్సరమునఁ జదువఁబూనిన ముఖ్యగ్రంథముల నామముల నుదాహరించితిని. గతసంవత్సరము నేను జదివిన యుద్గ్రంథములలో ముఖ్యములైనవి, మిల్లువిరచితమగు "మతవిషయికవ్యాసత్రయము", కార్లయిలుని "సార్టారు రిసార్టసు", ఇమర్సనుని "మానవప్రతినిధులు", రీననుని "క్రీస్తుజీవితము"ను. మిత్రుఁడు రామమూర్తిగారి సహవాసమహిమముననే నా మనస్తత్త్వమునకిపుడు ఇమర్సను, కార్లయిలులు సరిపడుట చేత, ఈ సంవత్సరము కార్లయిలుని "శూరులు" "భూతవర్తమానములు" అను పుస్తకములు చదువ నేర్పఱుచుకొంటిని. తమ్ముఁడు కృష్ణమూర్తి రాజమండ్రిలో మున్నుపటికంటె జ్ఞానశీలాదులందుం దభ్యున్నతి నొందుచుండెను. ఈ సంవత్సర మాతని గుఱించి నే నెక్కువగ శ్రద్ధ వహించి, ప్రవేశపరీక్షలో నాతఁడు జయమందునట్లు చేయ నుద్యమించితిని. భార్య విద్యావిషయమైకూడ మిగుల పాటుపడి, మత సంఘ సంస్కరణములయందామె కభిరుచి కలిగింప నుద్యమించితిని.

ఆ కాలమున నాదేహమును బీడించు పెనుభూతమగు మలబద్ధమును నిర్జించుటకై, నిద్రాభోజనాదులందు మితత్వముఁ గలిగి, నిత్య

మును వాహ్యాళి కేగుటయు, డంబెల్సుతో కసరతు చేయుటయును ముఖ్యసాధనము లని నాకుఁ దోఁచెను. విద్యావిషయమై నే నతిజాగ్రతతో నుండఁగోరి, రాత్రి పదిగంటల పిమ్మట చదువవలదనియు, తెల్లవాఱుజామున మూఁడు నాలుగుగంటలకు మెలఁకువ వచ్చినా తిరిగి నిద్రింపక, చదువునకుఁ గాని ప్రార్థనవ్యాయామములకుఁ గాని గడుపవలె ననియు నేను నియమముచేసికొన నుద్యమించితిని.

నా యాత్మజీవనవిషయమును విమర్శనఁ జేసికొనుచు నే నిట్లు వ్రాసితిని :— "గతవత్సరమునకంటె నే నిపుడు మంచి స్థితి నున్నాను గాని, యిప్పుడైనను భగవంతునికి హృదయపూర్వక ప్రార్థనలు చెల్లింపనేరకుండుట శోచనీయముగదా! అనుదినప్రార్థన మభ్యాసము చేసికొని, కోపదుఃఖములు పొడసూపు నట్టి యేక సమయములందును, విషయలాలసయందును, దైవమును స్ఫురణకుఁ దెచ్చుకొనుటవలన నాత్మజీవనము కలుగును. నీ సంభాషణాది యనుదినకార్యక్రమమునందె దైవభక్తి ప్రకటీకృత మగుచుండవలెను. శీలసౌష్ఠవ మొకటియే ప్రాణోత్క్రమణ సమయమందు నిన్నుఁ జేయి విడువని పరమమిత్రుఁ డని నమ్ముము! ఉత్తమజనులస్నేహమును సముపార్జించి, నీరసుల సముద్ధరింపఁబూనుము. మిక్కిలి యోగ్యమగు పుస్తకములే చదువుచుండుము. సౌహార్దమె మానవులయం దేకీభావ మొనఁగూర్చు దివ్యమంత్ర మని నమ్ముము". ఇట్లు నేను మానసబోధముఁ గావించుకొంటిని.

గత సంవత్సరమున బెజవాడలో ప్రార్థనసమాజము నెలకొల్పితిమి. జనానాపత్రికను నడిపి, పాఠశాలలోని కార్యక్రమమును సరిగ జరిపితిని. ఈసంవత్సర మింకను ఈపనుల నెక్కువశ్రద్ధతో నాచరించుచు, జనోపయుక్తములగు నుపన్యాసము లిచ్చుచు, సంఘసంస్క-

రణ సమాజమును నెలకొల్పి కార్యసాధనముఁ జేయవలెనని నేను సంకల్పించుకొంటిని.

స్నేహితుఁడు రామమూర్తి ౧౮౯౬-వ సంవత్సరారంభమున బెజవాడ విడిచి పోయి, బందరు నోబిలుకళాశాలలో నుపాధ్యాయుఁ డయ్యెను. కావున కామశాస్త్రి, రాజారావు, రామస్వామిశాస్త్రి గార్లు మున్నగు మిత్రులతోఁ గలసి, నే నీకాలమునఁ బ్రొద్దుపుచ్చుచుండువాఁడను. "సత్యసంవర్ధని"కిఁ దఱచుగ వ్రాయుచు, "జనానా పత్రికను" బ్రచురించుటయే కాక, మద్రాసునందలి "స్టాండర్డు" పత్రికకును, "సంఘసంస్కారి" పత్రికకును, ఆంగ్లవ్యాసములు లిఖించుచునువచ్చితిని.

ఈ ౧౮౯౬-వ సంవత్సరము ఫిబ్రవరినెలలో మిత్రుఁడు మృత్యుంజయరావు క్షయరోగపీడితుఁడై తుదకు మృత్యువువాతఁ బడుటకు నే నెంతయు వగచితిని. అతనిని గుఱించి "సంఘ సంస్కారిణి"పత్రికలో నొక వ్యాసము వ్రాసి, కళాశాలాదినములలో ప్రార్థన సమాజమునకును, సత్యసంవర్ధనీ పత్రికవిషయమునను, అతఁడు చేసినకృషి నభినందించి, వితంతూద్వాహములఁ బ్రోత్సహించిన సంఘసంస్కారి యనియు, నిక్కమగు దైవభక్తుఁ డనియు నాతనిని బ్రశంసించితిని. రాజమంద్రిలో "ఆస్తికపాఠశాల" నెలకొల్పసమకట్టిన సుజనుఁ డనియు, అతని మృత్యువువలన మా సమాజమునకే కాక, ఆంధ్రావని కంతకును తీఱనికొఱఁత వాటిల్లె ననియు నేను వక్కాణించితిని.

శరీరదార్ఢ్యములేని నాకును అతనికివలెనే యకాలమరణము సంభవించి, మాకుటుంబమును మితిమీఱిన కష్టములపాలు చేయవచ్చునని భీతిల్లి, అట్టిపరిస్థితులలో సతికి జననికిని గొంత జీవనోపాధిఁ గలిగింప విధ్యుక్తమని యెంచి, నేను ఈసంవత్సరము ఏప్రిలునెలలో

నాజీవితమును "ఓరియంటలు భీమాకంపెనీ"లో నాలుగువేలరూపాయిలకు భీమా చేయించి, మూఁడు "పాలిసీలు" తీసికొంటిని. కుటుంబ ఋణము లెప్పటికి తీఱినను, ఆపత్సమయమునం దీభీమాసొమ్ము మావారలకుఁ గొంత లాభకారిగ నుండఁ గల దని నమ్మి, అప్పటినుండియు నేను మనోధైర్యమున నుంటిని.

ఈ సంవత్సరము వేసవిసెలవులలో నెప్పటివలెనే పత్నీసమేతముగ నేను రాజమంద్రి వెళ్లియుంటిని. అప్పుడు నాభార్య తీవ్రజ్వరముచేఁ గొన్నిదినములు బాధపడెను. రెయిలువేవైద్యుఁడు జే. రంగనాయకులు నాయఁడుగారు మం దిచ్చి వ్యాధినివారణము చేయఁగా, ఆమె తన పుట్టినింటికి కట్టుంగ వెడలిపోయెను. అచట వెంకటరత్నమునకు విడువని దారుణజ్వరము వచ్చుచుండె నని మామామగారు కొలఁదిదినములలోనే నాకొఱకు రాజమంద్రి బయలుదేఱి వచ్చిరి. నే నపుడు కట్టుంగ వెళ్లి చూడఁగా, జ్వరముతీరు సవ్యముగ లేదు. ఆ కుగ్రామమునుండి రోగిని గదల్చి రాజమంద్రికిఁ గొనిరానిచో నతఁడు జీవింప నట్టుగఁ దోఁచెను. అంత నా నడివేసవిదినములలో నొకరాత్రి సవారిలోఁ గూర్చుండఁబెట్టి రోగిని రాజమంద్రి చేర్చితిమి.

రాజమంద్రి ఇన్నీసుపేటలో నిదివఱకు మాకుఁగల నివేశనమునకుఁ జేరిన యింకొక స్థలమును మాతండ్రి యిటీవల కొనెను. ఆరెండింటియందును నుండినవి తాటియాకులయిండ్లే యైనను, సొంత యింటఁ గాపురము మాకు సుఖప్రదముగ నుండెను. మాతలిదండ్రులు, సోదరులును వెంకటరత్నమున కమితముగఁ బరిచర్యలు చేసిరి. ఒకనెలవఱకును, సన్నిపాతజ్వర మాతనిఁ బీడించెను. ఆతని ప్రాణమును గుఱించి మే మాదినములలో నధైర్యపడినను, దైవానుగ్రహమున నెట్టకేల

కాతనికి శరీరస్వాస్థ్యము కలిగెను. సెలవులపిమ్మట మేము మువ్వురము బెజవాడ వెడలిపోయితిమి.

తమ్ముఁడు కృష్ణమూర్తి వెనుక రాజమంద్రిలోవలెఁ గాక యిపుడు చదువునం దెంతో శ్రద్ధవహించి యుండెను. ఆటలందును నతఁ డెక్కువ చుఱుకుగనుండెను. ఆరెండు సంవత్సరములును పాఠశాలలో నాటలనుగూర్చిన యేర్పాటులు నేనె చేయుచుండువాఁడను. సోదరుఁడు, స్నేహితులు, విద్యార్థులు మున్నగువారలతోఁ గలసి నేను కాలిబంతి, బాడ్మింటను బంతులాట లాడుచుండువాఁడను. మే మెంతో పట్టుదలతో నాడుచుండుటవలన, రెండుమూఁడు సారులెదటికక్షులో నుండు సోదరుని వలననే నాకు కాలిబంతిదెబ్బలు పెద్దవి తగిలెను!

మాతండ్రి నా కాదినములలో వ్రాసిన యీ క్రిందియుత్తరము వలన, మాకుటుంబవ్యవహారములు, ఆయన శీలభావలేఖనాంశముల వైచిత్ర్యములు నెగాక, ఆ కాల పరిస్థితులును గొంతవఱకు తేటపడఁగలవు:-

"౨౯–౭–౯౬ స్థిరవారం, రాజమంద్రి, యిన్నీసుపేట.

శ్రీరాములు.

"చిరంజీవులయిన మా కుమారుడు రాయసం వెంకటశివుడును సుబ్బారాయుడు చిరాయువులుగాను దీవిశ్శిషి.

"తరువాత యిక్కడ అంత్తా క్షేమం. యీ నెలగడ తేది లగాయతు ౨౭ తేదీవఱకు గోదావరి ప్రవృద్ధరములు. తూర్పుపడమర ప్రజలు రెయిలు వుండుటచాత అనేకమంది జ్నం వచ్చినారు. కోటిలింగాలవద్ద సరకారువారు విస్తారం పాకలు వేయించ్చినప్పటిక్కీ, అనేకమంది బస్తిలోనే ప్రవేశించ్చినారు. రేవులవద్దను వీథులలోను

గలిబిలి జర్గకుండా ౮౦౦ కనిస్టేబిలు పిల్పించ్చి ఘాట్లు ఫారాలు యేర్పర్చినారు. చోరీలు మొదలయ్యేవి యేమీ జర్గకుండా సబుకల్కె టరుఘోరవారు శ్రేధణ పుచ్చుకున్నారు.

"వేలివెన్ను పశువేదలవారు యావన్మందిన్ని, ధవిళేశ్వరం నుంచ్చి చింనప్పానున్ను, కన్నకంమ అత్తగారున్ను ఆమెనాలుగో కుమార్డు కృష్ణమూర్తిగారున్ను యిక్కడ మ్నాయింటికి వచ్చినారు. నింన కొంత్తమందిన్ని, యీరోజున కొంతమందిన్ని వారివారి గ్రామములకు వెళ్లినారు.

"షుమారు ౧౦ రోజులునుంచ్చి విశూచి జాడ్యములు కనిపించ్చి రోజు ౧ కి షుమారు ౧౦ మంది జ్నంచొప్పున చనిపోతుంన్నారు. యిక్కడి యితరదేశపు ప్రజలు వారివారి దేశములుకు వెళ్లిపోయ్నారు.

"లక్ష్మీపతిగారి నింన్ని రామచెంద్రరావుగార్నింన్ని చూచినాను. తమకు యివ్వవలశ్ని వెంకటచెలంపంత్తులు గారు యింకాయివ్వలేదనింన్ని యిచ్చిన వెంటనే పయిసలు చేయిస్తానని లక్ష్మీపతిగారు శెల్వుయిచ్చినారు. వెంకటచెలంపంత్తులుగారు య్నాం అంమ్మకమయ్యేసొంము యీగ్రామంలో మెరక వీధికాపులవద్ద నిలవ వుంన్నది. రామచెందరావుగారు చెప్పిన దేమనగా, కొంతదస్తు శిధంగా వుంనదనింన్ని తలింమ్మాదస్తు ౧౦ రోజులలో తాము జమీగ్రామములలో నుంచ్చి రాబడుననింన్ని తప్పకుండా యిప్పిస్తామనిన్ని చెప్పినారు. * * * రామభద్రిరాజు గారు ౮ రోజులకిందట కోర్టుపనినిమిత్తం రాజమంద్రికి వచ్చినారు. వీరభద్రుడు కూడా వుత్తరం వ్రాసినాడు. ౮ రోజులలో రేలంగి వెళ్లి యిలిందలపర్తి వ్యవహారం పరిష్కారం

చేస్తాను. అత్తిలి వెంకటరత్నంగారిపేర వుత్తరం ౧౫ రోజులకిందట వ్రాశినాను. జవాబు లేదు. నేను వెళ్లి అత్తిలి వగైరాలు కనుక్కొని వారం రోజులలో తిర్గి రాజమండ్రికి చేరి వుత్తరం వ్రాస్తున్నాను."

ఆ సంవత్సరము డిశెంబరులో జరిగెడి ప్రవేశ పరీక్షకు తమ్ముఁడు కృష్ణమూర్తి పోయియుండెను. శీతకాలపు సెలవులలో మే మిరువురమును రాజమండ్రి వెడలిపోయితిమి. అక్కడనుండి నాభార్య తన పుట్టినింటికి కట్టుంగ పోయెను. రక్తగ్రహణిచే నే నాదినములలో నధికముగ బాధపడితిని. అత్తిలి భూముల యమ్మకమునకై నన్ను రేలంగి రమ్మని చెప్పి ముందుగ మామంగారు రాజమండ్రినుండి బయలుదేరెను. కొంచెము నీరసముగ నుండినను నేను రేలంగి ప్రయాణమైతిని. ఎంతో ప్రయాసపడి నే నచటికి డిశంబరు తుది దినములలోఁ జేరితిని. కాని, అప్పటి కింకను వ్యవహారము తెమలకపోవుటచేత, భార్యను రాజ మండ్రి కొనిపోవుటకై యచటినుండి నేను కట్టుంగ పయనమైతిని.

## ౧౬. కీళ్ల వాతము

నేను రేలంగినుండి డిసెంబరు ౩౧-వ తేదీని ప్రొద్దుననే బయలు దేఱి, కాలినడకను మధ్యాహ్నమునకు కట్టుంగ జేరితిని. నాఁడు కటిస్థలమున నొప్పిగ నుండినను, నే నది లెక్కసేయ లేదు. ఆ గ్రామ ములో మాయత్తమామలు, వారి కుమారుఁడు, కొమార్తెలు నుండిరి మా బావమఱఁదితో ముందలి సంగతు లాలోచించుచు, జనవరి ౧, ౨. తేదీలలో నేనచటనే యుంటిని. ఈసంవత్సర మైనను నేను యల్.టి. పరీక్షలో గెలుపొందనిచో, నా కిష్టములేని న్యాయవాదివృత్తిలోఁ బ్రవేశించుటకై, న్యాయశాస్త్ర పరీక్షకుఁ జదువ నాయుద్దేశ మని చెప్పి వేసితిని. ఇది యాతఁ డామోదించెను.

భార్యతోను, బావమఱఁదితోను పడవమీఁద బయలుదేఱి, నేను 3-వ తేదీకి రాజమంద్రి వచ్చితిని. మాతండ్రి యదివఱకే వచ్చి యుండెను. స్నానము చేయునపుడు నా కుడి మోకాలిమీఁద కొంచెము వాఁపు కనుపించెను. అక్కడ కొంత నొప్పిగ కూడ నుండెను. ఇది లెక్కసేయకయే నా పనుల మీఁద నేను పట్టణమునఁ దిరుగాడితిని. మఱునాఁటి సాయంకాలమునకు నా కించుక జ్వరము సోఁకెను. నా మోకాలికీలు పొంగి, అడుగు తీసి యడుగు వేయలేనిస్థితికి వచ్చితిని! రాత్రి యెంతో బాధపడితిని.

మఱునాఁడు రంగనాయకులునాయఁడు గారు వచ్చి, యిది కీళ్లవాతము కాదని చెప్పి, వాఁపుమీఁద రాయుటకు కర్పూరతైల మంపిరి. దానివలన లాభము లేకపోయెను. అత్తిలిలోని భూములపస్తావేజు వ్రాసి ఆవ్యవహారము పూర్తిపఱుచుటకు మా నాయనయు, పెద్ద తమ్ముఁడును, ఆ సాయంకాలమే పడవమీఁద వెడలిపోయిరి. నాకు శరీరములో నెటులుండినను, ఒకటిరెండురోజులలో నేను అత్తిలి తప్పక వచ్చి, అచట పనియైన పిమ్మట నే నింటికి తిరిగి రావచ్చునని వారు చెప్పిరి. అట్లే చేయుదు-నంటిని.

మూలుగుచునే నే నానాఁడు "జనానాపత్రిక"కు వ్యాసములు వ్రాసితిని. రాత్రి యంతయును, మోకాలిపోటు చెప్పనలవి కాకుండెను. మఱునాఁడు నాయఁడుగా రిచ్చినమందు మ్రింగితిని కాని, నా కేమియు నుపశమనము గలుగలేదు. ఆ రోజుకూడ పత్రికకు వ్రాయుచునేయుంటిని.

6-వ తేదీకి నావ్యాధి ముదిరిపోయెను. తమ్ముఁడు కృష్ణయ్యచే పత్రికకు వ్యాసములు వ్రాయించి, ఆ కాకితములు అచ్చునకై బెజవాడ కంపివేసితిని. నే నిపుడు నడచుట యటుంచి, సరిగా నిలుచుం-

డుటకైన శక్తిలేక యుంటిని! ఈ దురవస్థలో నేను అత్తిలి రాఁజాల నని మాతండ్రికిని తమ్మునికిని దెలిపి, త్వరగా వారిని రాజమండ్రి తోడితెమ్మని తమ్ముఁడు కృష్ణయ్య నచటికిఁ బంపితిని. ఇంట నాకు మందుమాకులు తెచ్చి యిచ్చుటకుఁ బసివాఁడగు సూర్యనారాయణ యొక్కఁడే కలఁడు. ఐన నాతనివి యినుపకాళ్లు! పగలనక రాత్రి యనక యాతఁడు నామందులకొఱకై తిరుగాడఁ జొచ్చెను. రాత్రులు కాలిపోటు లెక్కువయై నేను తీవ్రవేదన నొందునపుడు, హాస్యపుఁబలు కులు పలుకుచు, మా చిన్న తమ్ముఁడు నాచెంతఁ గూర్చుండువాఁడు. లోకువయగు వానిని నే నపుడు తిట్టుచుఁ గొట్టుచును, రోగముమీఁది కసి చిన్నవానిమీఁద దీర్చుకొనుచుండువాఁడను! తీవ్రవేదనకు నేను దాళలేనపుడు, అతఁడు నాకు 'పెరిడేవిసు' ని "పెయిన్ కిల్లరు" తెచ్చి పూయుచుండుటవలన, 'పెరిడేవిసు' అను నామమిడి, తమ్ముని నిరసనతోఁ బిలుచుచుండువాఁడను! వేదనాభరమున నే నాడెడి దూషణోక్తులకు వాఁ డించుకయుఁ గినియక, నాపిచ్చిపలుకు లను గాకితముమీఁద నెక్కించి చదివి నాకు నవ్వు తెప్పించుచు, అందు మూలమున నా కొకింత బాధాశమనము గల్పించుచుండువాఁడు!

తీవ్రవేదనకు లోనగు నాకుఁ బగలు రాత్రియు నొకటియే యయ్యెను! ఎన్నిదినములకును తండ్రియుఁ దమ్ములును అత్తిలినుండి రాకుండిరి. ఎట్టకేలకు ౧౧వ జనవరి సాయంకాలమునకు సోదరులు వచ్చిరి. కొలఁదిదినములలో తాను న్యాయవాదిపరీక్షకుఁ బోవలసి యుండియు, నారోగోపశమనమునకై తమ్ముఁడు వెంకటరామయ్య యెంతో ప్రయత్నించెను. అంత వైద్యము మార్చివేసితిమి. డిస్ట్రిక్టు సర్జను డాక్టరు సార్కెసు దొర యొద్ద మాతమ్ముఁడు నాకు మందు తెచ్చి యిచ్చెను. అదియు నా కేమియుఁ బ్రయోజనకారి కాకుండెను.

ఆరోజులలో ముఖ్యముగ రాత్రులందు నరకలోకమున నుండునట్లు నాకుఁ దోఁచుచుండెడిది. ఆబాధలో భగవంతునిప్రసక్తియె నా మనస్సునకు గోచరించెడిదికాదు! మీఁదుమిక్కిలి నే నాయనకు మఱపు వచ్చితి ననియె భావించుచుండువాఁడను! వివేకము తెచ్చుకొని కొంచెమాలోచించునప్పుడుమాత్రము, విసు వెఱుఁగక అహర్నిశము నాకొఱకుఁ బరిశ్రమించు మాతాసతులమూర్తులందె దేవుని యవ్యాజ ప్రేమకళ యొకింత నాకుఁ బొడగట్టుచుండెడిది!

మాతమ్ముఁడంత నన్నుఁ బరీక్షించుటకై ౨౭వ జనవరిని డాక్టరు సార్కీసును మాయింటికిఁ గొనివచ్చెను. ఆయన నన్నేమియు నడుగక గోప్యాంగపరీక్ష చేసి, రుగ్ణత సుఖవ్యాధులచే సంక్రమింపలేదని నిర్ధారణచేసికొని, మంచిమం దిచ్చెద నని నన్నోదార్చెను. నావేదనాప్రకోపమును, మాపర్ణకుటీరనివాస రహస్యమును గనిపెట్టిన యా సహృదయుఁడు మే మీయఁబూనిన పారితోషికమును గైకొనకయే వెడలిపోయెను. కొలఁదిదినములలో బెజవాడపాఠశాల తీసెదరు కావున, అచట నాకు బదులుగ బోధకుఁడుగ నుండి పనిచేయుటకై మాబావమఱఁది వెంకటరత్నమునకుఁ గబురంపితిని. అతఁడు ౧౫-వ తేదీని వచ్చి పరీక్షాపత్రములు దిద్దుటయందు నాకుఁ దోడ్పడి, ౧౬-వ తేదీని బెజవాడ వెడలిపోయెను. ఆనాఁడే వడ్లుపట్టుకొని మాతండ్రి రాజమండ్రికి వచ్చెను.

ఆమఱునాఁడు రాజమండ్రిలో మాయింటికిఁ జేరువనుండు డెబ్బది యెనుబది పూరిండ్లు తగులఁబడిపోయెను. మాకుటీరముకూడ పరశురామప్రీతి యగునని భీతిల్లితిమి. వేదనతో నుండియు ప్రాణములందలి తీపిచే నేను గేకలు వేయఁగ, తమ్ముఁడు కృష్ణయ్యయు

నాభార్యయు నన్నొక బండిలోఁ గూర్చుండఁ బెట్టి, ఎద్దులేని యా బండిని తామె లాగి, మా తోడియల్లుని బసకు నన్నుఁ జేర్చిరి!

౨౮ వ- తేదీవఱకును నావ్యాధి మరలక, ముఖ్యముగ రాత్రులందు పెనుభూతమై నన్నుఁ బీడించుచుండెను! కంటిమీఁద ఱెప్ప వేయక భార్య నామంచమునొద్ద కనిపెట్టుకొని పరిచర్యలు చేయుచుండెడిది. తల్లియు నాకొఱ కమితశ్రమ పడుచుండెను. వారల యవస్థ తలంచుకొనునపుడు, నావ్యసనము మఱింత దుర్భర మగుచువచ్చెను!

ఎట్టకేలకు జనవరి ౨౬-వ తేదీని, గోడ పట్టుకొని కొన్ని యంగలు వేయఁగలిగితిని. ఆరాత్రి నాకు బాధ తగ్గుచుండెను. దీనికై నేను దైవమునకుఁ బ్రణతు లొనర్చితిని.

కొలఁదిదినములలో నేను బెజవాడకును, వెంకటరామయ్య పరీక్షకై మద్రాసునకును బోవలయును గాన, భూము లమ్మెపని మాతండ్రి కొప్పగించితి మని ఆయన పేరిట మే మిరువురమును పౌరాష్ట్రినామా వ్రాసి యిచ్చితిమి. అనంతముగారికి తరుణముననే బెజవాడ వదలి వేఱొక యుద్యోగమునకుఁ బోవుచుంటి మని వ్రాయుటచేత, మేము బెజవాడ పయనమునకు సిద్ధమైతిమి. ఇట్టిస్థితిలో సోదరులను, తలిదండ్రులను విడిచిపోవ నాకు విషాదకరముగ నుండెను.

ఎట్టకేలకు ౨౭ వ జనవరి ప్రొద్దున భార్యాసమేతముగ నేను బెజవాడకు బయలుదేఱితిని. మద్రాసుపోవలసిన తమ్ముఁడు వెంకటరామయ్యయు రంగనాయకులు నాయఁడుగారి పెద్దకుమారుఁడు నారాయణస్వామియును మాతో వచ్చి, నా కెంతయు సాయము చేసిరి. గోదావరి యావలి యొడ్డున రెయిలుబండిలోఁ గూర్చుండి మధ్యాహ్నమునకు మేము బెజవాడ చేరితిమి.

## ౧౬. తుదకు విజయము

గత మూఁడు సంవత్సరములనుండియు బెజవాడలోని క్రైస్తవ పాఠశాలకు ధన్వాడ అనంతముగారు ప్రథమోపాధ్యాయులుగ నుండిరి. ఆయన సజ్జనులు ననుభవశాలులును. వారియందు నా కమిత భక్తి గౌరవములును, నాయెడ వారి కపారవిశ్వాస వాత్సల్యములును గలవు. ఇపు డాయనను క్రైస్తవమతసంఘమువారు "బైబిలు ఆంధ్రానువాదము సరిచూచు సంఘము" లో సభ్యునిగ నియమించుటచేత సకుటుంబముగ వారు బళ్లారినగరము వెడలిపోవ సిద్ధముగ నుండిరి. అట్టి యుత్తమమిత్రుని విడిచి నాకును, వారి సతీతిలకమగు సౌభాగ్యవతమ్మగారిని విడిచి నాభార్యకును, ఈప్రదేశమున నివసించుట మొదట కడు దుర్భరముగఁ దోఁచెను. బోధకులు విద్యార్థులును కోరుటచేత, అందఱు ననంతముగారి కొసంగవలసిన విజ్ఞాపనపత్రమును నేనె సిద్ధపఱిచితిని. పాఠశాలకుఁ గ్రొత్తయధికారియైన టానరుదొర విశాలహృదయునివలెఁ గానవచ్చెను. అంత ఫిబ్రవరి మొదటి తేదీని పాఠశాలాభవనమున జరిగిన బహిరంగసభలో అనంతముగారి విజ్ఞాపనాపత్రమును నేను జదివితిని. నూతన ప్రథమోపాధ్యాయుఁడు లాలా బాలముకుందదాసుగారు నా కంటె వయస్సునందును బోధకానుభవమందును జిన్నవారు.

బావమఱఁది వెంకటరత్నము ప్రథమశాస్త్రపరీక్షలోను, తమ్ముఁడు కృష్ణమూర్తియు అనంతముగారి ప్రథమ పుత్రుఁడు రామచంద్రరావును ప్రవేశపరీక్షలోను గెలుపొందిరని విని మిగుల సంతసించితిమి. వెంకటరత్నము పట్టపరీక్షకును, కృష్ణమూర్తి ప్రథమశాస్త్రపరీక్షకును జదువుటకై రాజమంద్రికళాశాలఁ జేరిరి.

## ౧౬. తుదకు విజయము

కనకరాజు వెంకటరామయ్యయును ఫిబ్రవరి 3 వ తేదీని మద్రాసు నుండి వచ్చిరి. మఱునాఁడు "హిందూమతముయొక్క భవిష్యత్తు"ను గుఱించి కనకరాజు బెజవాడలో నుపన్యాసమిచ్చెను. అం దాతఁడు హిందూమత దివ్యజ్ఞాన సమాజములను గూర్చి సద్భావము తెలిపినందుకు సభను సమకూర్చిన నా కమితకోపము వచ్చెను. ఆరెండు సంస్థలవలనను దేశమునకు లేశమైనను మే లొనఁగూడదని గురువర్యులగు వీరేశలింగముగారివలెనే నేనును ఆకాలమున నమ్మియుంటిని!

మా పాఠశాలనూతనాధికారియగు టానరుదొరకు నాకు నంతగ మనస్సు గలియలేదు. నేను జెప్పుపాఠములలో నా కనిష్టమగు మార్పు గలిగింపవలె నని యాయన యుద్దేశము. ఆయనకు సలహాదారు గోటేటి సాంబమూర్తిగారు. ఇపు డింకొక యుదంతముకూడ జరిగెను. ఏదో పనిమీఁద టానరుదొర బందరు వెళ్లినపుడు, యల్. టీ. పరీక్షా ప్రథమ భాగపు ఫలితములు తెలిసెను. వెంకటరత్నమునాయఁడును, బాలముకుందదాసుగార్లందు కృతార్థులైరి. ప్రథమ భాగ పరీక్షా పర్యవసానము తెలిసినవెనువెంటనే, రెండవ భాగమునఁ బరీక్ష జరుగుచుండుట సాంప్రదాయము. అందువలన దొరతోఁ జెప్పకయే దాసుగారు నేనును మద్రాసు వెడలిపోయితిమి. దీనికై మాయిరువురిమీఁదను దొరగారికిఁ గోపోద్రేకము గలిగె నని నాకుఁ దెలిసెను. నా విధాయకకృత్యవిషయమై యధికారికి నిర్హేతుకముగఁ గలిగిన యాగ్రహమును నే నేమియు లెక్కసేయలేదు.

ఈమాఱు మద్రాసులో నాకాతిథ్యమొసఁగినవారు శ్రీ భూపతిరాజు వెంకటపతిరాజుగారు. వీరును మిత్రుఁడు సాంబశివరావును ఒకబసలోనే యుండి న్యాయవాదిపరీక్షకుఁ జదివెడివారు. నా పరీక్ష పచ్చయ్యప్పకళాశాలలో జరిగెను. సైదాపేటలోని నా

పూర్వగురువులగు వైద్యనాథయ్యరుగారు నా పరీక్షాధికారి యని ముందుగఁ బ్రకటింపఁబడినను, తుదకు స్కాటుదొరగారు నన్నుఁ బరీక్షించిరి. నేను క్రమముగనే బోధించితిని గాని, నా బోధనాసమయమందు స్కాటు, వైద్యనాథయ్యరుగా ర్లొకచోటఁ గూడి, నన్ను గుఱించియు, నాకును వీరేశలింగముపంతులుగారికినిఁ గల సంబంధ బాంధవ్యములను గుఱించియును గుసగుస లాడుకొనుచు, నాబోధన సంగతి మఱచిపోయినట్లు కానఁబడిరి! పరీక్షానంతరమున నేను స్కాటుదొరబసకుఁ బోయి నాకు వారితోఁగల చనవుచేత నాపరీక్షా పర్యవసాన మే మని యడిగితిని. వారు మౌనముద్ర నూనియుండిరి. ఈమాఱుకూడ నేనీ పరీక్ష తప్పినయెడల, నేను బోధకవృత్తిని విరమించి, న్యాయవాదిపరీక్షకుఁ జదువవలసివచ్చు నని స్కాటుదొరతోఁ జెప్పివేసితిని. ఆయన యూఁకొట్టుచు సమాధాన మీయకుండెను. నేను వృత్తి మార్చుకొనుటయే నాకు మేలేమో యనికూడ స్కాటుమహాశయుఁ డనెనే కాని, పరీక్షాఫలితమును గుఱించి బొత్తిగఁ బ్రస్తావింపఁడు! వీరి ధోరణిని బట్టి మరల నాకుఁ బరీక్షలో నపజయము తప్పదని నిర్ధారణచేసికొని నేను ఖిన్నుఁడనైతిని. నా విజయము నిశ్చయమని రాజుగారు మాత్ర మోదార్పుపలుకులు పలికిరి.

మద్రాసులోనే యల్. టి. పరీక్షాఫలితము విని మఱి యచటి నుండి కదలుట నా కాచార మయ్యెను. కాని, రెండుమూఁడుదినము లచటనే నిలచినను, ఆపరీక్షాపర్యవసానము తేలకుండుటచేత, నేను బెజవాడ వెడలిపోయితిని.

టానరుదొరకు నాయెడ దురభిప్రాయ మని యిదివఱకే సూచించితిని. ఇన్ని యేండ్లనుండియు నేను బోధించెడి గణిత శాస్త్రము నింకొక యుపాధ్యాయుని కిచ్చివేసి, నాకు వేఱొకపాఠ

మొప్పగింప వీరిసంకల్పము! ఈ మార్పువలన నాకుఁ గలిగెడి యవమానమునకై యుద్యోగము చాలించి పోయెదనని నేను జెప్పివేయ నుద్యమించితిని. ఎన్నాళ్లు వేచియుండినను నా పరీక్షాపర్యవసానము తెలియ దయ్యెను. మిత్రుల విజయవార్తలు మాత్రము వినవచ్చుచునే యుండెను. దీనినిఁబట్టి మరల నపజయ మందితినని నేను నిర్ధారణ చేసికొంటిని. పరిస్థితు లిటు లున్నను, తమపాఠశాల విడిచిపోయెద నని టానరుదొరతోఁ జెప్పివేయ ౮ వ-మార్చిని నేను ప్రయత్నించి తిని. కాని యట్లు చేయుట కానాఁ డవకాశము కలుగలేదు.

ఆ రాత్రి నాకుఁ గంటికిఁ గూర్కు రాలేదు. ఆకఱవుకాల ములో, మాటపట్టింపులకై మరల పరీక్షలో నోటువడిన నే నెటు లాకస్మికముగ నుద్యోగవిసర్జనము చేసి, కుటుంబపరిపోషణము చేసి కొనఁగలనా యని రేయెల్లఁ దలపోసితిని. అట్లు చేయకున్న నేను పరాభవ మందుట స్పష్టముగదా. ఎటులో నేను మద్రాసు పోయి, బి. యల్. పరీక్షకుఁ జదివి, కంటక సదృశమగు న్యాయవాదివృత్తి నవలంబించి, సంసారసాగర మీదవలెనని నేను సమకట్టితిని!

నా నిర్ధారణ మానాఁడు పాఠశాలాధికారికిఁ జెప్పివేయ నే నుద్దేశించి, ౨ వ-మార్చి యుదయమున విద్యాశాలకుఁ బోవుచు, మార్గ మధ్యమున తపాల కచేరిలోని కట్టె యడుగిడితిని. జవాను నాచేత నంత రెండు జాబులు వేసెను. మిత్రులు వెంకటరత్నమునాయఁడు గారియొక్కయు, గురువులు వెంకటరత్నముగారి యొక్కయు నభి నందనము లందుఁ గలవు.

ఈక్లిష్టపరిస్థితులలో వారు నన్నభినందించుటకుఁ గారణ మే మని సందియమంది, జాబులు చదువుకొనఁగా, పరీక్షలో నేను

జయమందినటు లందుండెను! మఱుఁనిమేషమున మనకొక భిక్ష్యదృశ్యమును జూపించుటకే దైవ మొక్కొక్కప్పుడు మనకనుల నంధకారమునఁ గప్పుచుండునని నేను గ్రహించి, ఆనందపరవశుఁడనైతిని.

ఈ మాఱు నేను టాననుదొర బెదరింపులను లెక్కసేయ నక్కఱలేదుగదా! మఱునాఁడు ప్రొద్దున నేను కొండ యెక్కి దొరను జూచినప్పుడు, నావేతనాభివృద్ధి విషయమున క్లార్కుదొరకు వ్రాసెద ననియు, కాలక్రమ పట్టికయందలి నా పనిని గుఱించిన మార్పుమాత్రము స్థిరమనియు నాయన నుడివెను. ఈయవజ్ఞకు నే నోడఁబడ ననియు, వలసినచో నుద్యోగవిసర్జనము చేసి, వేఱొక చోటికి నెడలిపోయెద ననియు దొరతో నే నంత గట్టిగఁ జెప్పివేసితిని. పర్యవసానము, నేను అట్లు చేయవలదని చెప్పి, దొర తన మార్పు నె రద్దుపఱచుకొనియెను!

## ౧౭. "ప్రత్యక్ష భగవత్సందర్శనము"

నా భార్య గర్భసంబంధమగు వ్యాధికి లోనగుటచేత, గుంటూరులో స్త్రీలకొఱకు కిటీవల వైద్యాలయము స్థాపించి జరుపుచుండెడి కుగ్లరు దొరసాని కామెనుఁ జూపింపనెంచి, గుంటూరు పయనమైతిమి. మొన్న నాతోఁ జెన్నపురినుండి ప్రయాణముచేసి, నావలెనే యిపుడె యల్. టి. పరీక్ష నిచ్చి, గుంటూరులో సంస్కృతపాఠశాలలో నధ్యాపకులుగ నుండు శ్రీ చావలి సూర్యప్రకాశరావు గారియింట బస చేసితిమి. కృష్ణమ్మ నాయఁడుగారు నాతో వచ్చి దొరసానితో నాకుఁ బరిచయము గలిగించిరి. అప్పు డామె నాభార్యనుఁ బరీక్షించి మందిచ్చెను. అపుడపుడు రోగి గుంటూరు వచ్చి తనకుఁ గనఁబడుచుండవలెనని యామె చెప్పుటచేత, మే మంతటినుండి గుంటూరు పోవుచు వచ్చుచునుంటిమి.

## ౧౭. "ప్రత్యక్ష భగవత్సందర్శనము"

నిరుడు మద్రాసులో న్యాయవాదిపరీక్షకుఁ జదివిన తమ్ముఁడు వెంకట రామయ్య ఆపరీక్షలో నపజయ మందినట్లు తెలిసి మేము విచారించితిమి. కనకరాజు రెండవ తరగతి న్యాయవాదిపరీక్ష నిచ్చుట సంతోషవార్తయే. బావమఱఁది సీతాపతిరావు మాధ్యమిక పరీక్షలోఁ దప్పిపోయెనని తెలిసెను. ఈసంవత్సరము తా నింట నూరకుండ నొల్లక వెంకటరామయ్య నలుబది రూపాయిల జీతము మీఁద రేపల్లె మాధ్యమిక పాఠశాలలోని ప్రథమోపాధ్యాయ పదవిని స్వీకరించుటకు సంతోషించితిమి. ఇపుడు కుటుంబ పరిపోషణము చేయువారు, ఒకరి కిద్దఱు మగుట నా కెంతయుఁ బ్రోత్సాహకరముగ నుండెను.

మాఋణదాత పార్వతీశముగారు మామీఁద వ్యాజ్యము వేసెనని చెప్పుటకు మాతండ్రి బెజవాడ ౨౬వ మార్చి తేదీని వచ్చెను. అప్పులను గుఱించి తలంచుకొనినపుడెల్ల నాకు మనస్తాపము గలుగుచుండెను. కాని, యధైర్యపడిన లాభము లేదనియు, ఎల్లకాలము చీఁకటిరాత్రులె యుండవనియు, మాతండ్రి నన్నోదార్చుచుండు వాఁడు. మేముమాత్ర మట్టి సుదినములు గాంచ నోఁచుకొనలేదని నేను భయమందుచుండెడివాఁడను.

మా రేలంగి వాస్తవ్యుఁడును, ఆ దినములలో నెల్లూరులో "దేశోపకారి" పత్రికాధిపత్యము నెరపువాఁడును నగు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు నన్నుఁ జూచుటకు బెజవాడ వచ్చిరి. కొలఁది కాలములోఁ దాను ముద్రాలయ మొకటి కొని నావలెనే బెజవాడలో నివసించెదనని యాయన చెప్పినపుడు నే నానందపరవశుఁడనైతిని.

రాజమహేంద్రవర ప్రార్థనసమాజ వార్షికోత్సవము వీక్షింపఁ గోరి, నేను బెజవాడనుండి ౧౫వ ఏప్రిలున బయలుదేఱితిని. మార్గ

మధ్యమున నేలూరులో వీరభద్రరావు, కామేశ్వరరావుగార్లు మమ్ముఁ గలసికొనిరి. సాయంకాలము పురమందిరమునకుఁ బోయి చూచుసరికి మఱునాఁడు ప్రొద్దున బీదలకు నన్నదానము చేయు నేర్పాటులు గావించుచు, శ్రమపడుచుండెడి పావనమూర్తియగు పాపయ్యగారు కానఁబడిరి.

౧౬ వ-ఏప్రిలు తేదీని వీరేశలింగముగారు ప్రార్థనసమాజమున ప్రారంభోపన్యాసము గావించిరి. మధ్యాహ్నము పాపయ్యగారి యన్నదానమును, సాయంసమయమున నరసింహరాయఁడుగారి ధర్మోపన్యాసమును జరిగెను. నేను కొన్ని ప్రార్థనలు గావించితిని. మిత్రులు వెంకటరత్నము నాయఁడు రామమూర్తిగార్లు బందరునుండి వచ్చిరి. మఱునాఁటియుదయమున నాయఁడుగారు "తమసో మా జ్యోతిర్గమయ !" అను వాక్యముతో నారంభించి, ధర్మోపన్యాస మొసంగిరి. సాయంకాలమున వీరేశలింగముగారు తాము నూతనముగ నిర్మించిన "ప్రార్థనమందిరము"నుఁ దెఱచిరి. వెంకటరత్నమునాయఁడుగారు తమకు పంతులుగారిదెసఁ గల యసమాన భక్తివిశ్వాసముల నాసమయమున వెలిపుచ్చిరి. మఱునాఁడు సమాజసభ్యుల ఛాయాపటము తీయఁబడెను. మధ్యాహ్నము కూడిన ఆస్తికసభాసమావేశమునందు, ఏతత్సభానిధికై ౫౦౦ రూప్యములు విరాళ మొసఁగెదమని మిత్రులు వాగ్దానము చేసిరి. నేను సంవత్సరమునకు డెబ్బదియైదు రూపాయ లీయ నిశ్చయించితిని.

సత్యసంవర్ధనిలోఁ బ్రచురించుటకై "ప్రత్యక్షభగవత్సందర్శనము" అను శీర్షికతో నొక యాంగ్లవ్యాసము వ్రాసి, అది వీరేశలింగముగారికి నే నిపు డిచ్చితిని. అది ౧౮౯౭ మార్చి "సత్యసంవర్ధని"లోఁ బ్రచురింపఁబడెను. అందలి ముఖ్యాంశము లిటుఁ బొందు

## ౧౭. “ప్రత్యక్ష భగవత్సందర్శనము”

పఱచుచున్నాను:—“ ప్రార్థనసామాజికులకు దైవమే మతము. ఆయ-నను హృదయదర్పణమందును, ప్రకృతిముఖముననుఁ సందర్శింపనగును. నిజమగు భక్తునికి, ఈశ్వరుఁడు తప్ప వేఱు స్వర్గమోక్షము లెవ్వియు లేవు! భగవత్సందర్శనమే భక్తుని పెన్నిధానము! అట్టి భగవంతుని సూటిగనే మనము గ్రహింపనగును. మనుష్యుని మనస్సును ననేక లోపపాపములు పీడించుచున్నను, మనము దేవుని తిన్నగనే దర్శింపఁ గలము. గ్రంథములు, గురుసహాయము మున్నగు పరికరములు భక్తునికిఁ గావలసియున్నను, అవి యెన్నఁడును దేవునిస్థానముమాత్ర మాక్ర-మింపలేవు. తన మహిమాధికారములు అవతారవిగ్రహాదులకు వదలి వైచినదేవుఁడు, దూరస్థదైవమే! అట్టిదేవుఁడు మనుజుని జ్ఞానచక్షువు-నకును దూరస్థుఁడే. ఆదేవునికిని నాస్తికవాదుల కెఱుకఁబడనట్టియు, ఎఱుఁగరానట్టియు నీశ్వరునికిని భేదము లేనే లేదు! సత్యదైవ మెప్పు-డును మనచెంతనే పొంచియున్నాఁడు. ఇది మనుష్యకోటి కనుభవ-సిద్ధవిషయమె.

“ఇట్టి భగవత్సందర్శనము ప్రజ్ఞాన్వితులకేకాని పామరజనులకు సాధ్యము గాదని యెవరైనఁ జెప్పవత్తురేమొ. మనశ్శక్తులలో వ్యక్తిగత-భేదము లున్నను, జ్ఞానసంపాదనవిషయమునమాత్రము మనుజు లందఱు నొకకుటుంబములోనివారె. పండితపామరు లుభయులు నీశ్వరు నొక విధముగనే గ్రహింపఁగలరు. ఒకవిధముననే సాక్షాత్కారము చేసి-కొనఁగలరు. ఈశ్వరసాక్షాత్కారము భక్తు లందఱికిని సుసాధ్యమగు కార్యమే.”

రాజమండ్రిలో నుండు రోజులలో వీరభద్రరావుగారిని వీరేశ-లింగముగారి కెఱుకపఱచితిని. రావుగారి కొక ముద్రాలయము కొని-పెట్టెదమని పంతులుగారు సెలవిచ్చిరి. వీరభద్రరావుగారు కొలఁది-

కాలములో బెజవాడ వచ్చునట్టును, మేమిరువురమును గలసి యచట నొకవార్తాపత్రిక నెలకొల్పునట్టును మే మేర్పఱుచుకొంటిమి.

## ౧౮. "ప్రాచీన నవీన సైతానులు"

యల్. టి. పరీక్షలో గెలుపొందినపిమ్మట, ఉపాధ్యాయవృత్తి విరమింపవలసివచ్చునని మరల నే నెన్నఁడును మొఱలిడలేదు. బెజవాడ పాఠశాలాధికారులు నా కిపు డైదురూపాయిలు వేతనాభివృద్ధి చేయుటచేత, నాజీత మెనుబదిరూపాయిలయ్యెను. పాఠశాలలోని బోధన, పత్రికలకు వ్రాఁతపనియును నేను క్రమముగ నెరవేర్చుచుంటిని. వెనుకటివలెనే యీవేసంగి నేను రాజమండ్రిలో గడపితిని.

రాజమండ్రిలో నుండు దినములలో నేను సమాజకార్యములు దీక్షతో జరుపుచుండువాఁడను. ఆస్తికపుస్తకాలయమందలి పుస్తకములు పరిచూచి, మిత్రుల నడిగి నూతనగ్రంథములు తెచ్చి యందుఁ జేర్చితిని. సత్యసంవర్థనికి వ్యాసములు వ్రాసితిని. అప్పుడప్పుడు వీరేశలింగముగారిని గలసికొని, వారితో వితంతూద్వాహములనుగుఱించి ముచ్చటించువాఁడను.

ఆ వేసవిని నేను జదివిన పుస్తకములలో మేరీ కొరెల్లీకన్యావిరచితమగు "సైతానువెతలు" అను నాంగ్లనవల ముఖ్యమైనది. అందు నాగరికాగ్రగణ్యయగు నింగ్లండుదేశమందలి పెద్దలోపములు రచ్చకీడ్వఁబడినవి. ఒక యాంగ్లేయజాతి యన నేల, మానవకోటి యంతయు నీ గ్రంథరాజముయొక్క యుపాలంభనమునకు గుఱియయ్యెను! ఇచట ప్రదర్శితమైన సైతాను బైబిలులోని సైతాను గాఁడు. ఈతఁడు నవనవోన్మేషకాంతులతో మనచెంతనే విహరించుచు, విద్యానాగరికతలతో విలసిల్లెడి వినూతనశకపురుషుఁడు!

## ౧౮. "ప్రాచీన నవీన సైతానులు"

నేనీ నూతనాంశము నూతఁగఁగైకొని, బాగుగ నాలోచించి, "ప్రాచీననవీనసైతానులు" అను శీర్షికతో నొక యాంగ్లవ్యాసమును లిఖించితిని. అది యా ౧౮౯౭ వ సంవత్సరము జులై నెల "సత్యసంవర్ధని"లోఁ బ్రచురమయ్యెను. అందలి ముఖ్యాంశము లిందుఁ జేర్చుచున్నాఁడను:—

"సైతాను మన ముఖ్యబంధుమిత్రులలో నొకఁడు! అతఁడు లేకున్నచో, మన మట్టివాని నొకనినిఁ గల్పించి తెచ్చుకొనవలసినదె! అతఁడు లేని మతసిద్ధాంతము రాణింపదు. అనాదిగ సైతాను లోకరంగమున విహరించి, నరుల వినమ్రప్రణామములు చేకొనుచున్నాఁడు. దేవుని కొక గుడి వెలయునప్పటికి, జగతిని సైతానుని కేఁబది యాలయము లేర్పడుచున్నవి!

"సైతానుని గూర్చి మానవుల మనస్సీమల నొక సక్రమపరిణామము గన్పట్టుచున్నది. బైబిలు ప్రాఁతనిబంధనలోని సైతాను వికృతసర్పవేషమున మన తొలియవ్వయగు హవ్వను శోధించెను. నూతననిబంధనకాలము వచ్చునప్పటికి సైతాను తెలుఁగుమీఱెను. అపరూపఫల మొకటి చూపించి యబలను మోసగించిన సైతా నిపుడు, ఈశ్వరాంశసంభూతుఁడగు జీసనునకు జగత్సామ్రాజ్యము కట్టఁబెట్టెద నని భ్రమపెట్టఁదలకొనెను! సైతానుని కిపుడు గావలసినది మానవవైకల్యమును, ఆత్మాపహరణమును! శోధితునితో పాటు శోధకుని స్వభావమును విచిత్రపరివర్తన మందెను.

"మిల్టనుకవి సృజించిన సైతా నింకను నెగనిగ్యము దాల్చియున్నాఁడు. ఆ కవివర్యుఁడు, తాను రచించిన "విశీర్ణస్వర్గ" కావ్యమునకు ఆదామునకు మాఱుగ సైతానునె నాయకునిగఁ గైకొ

నిరయె నని విమర్శకులు గేలిచేసిరి! మిల్టనుని సైతానునందు నీచత్వ హీనత్వములు గానరావు. నరకలోకకుడ్యములు తన గంభీరోపన్యాస గర్జనములకు మాఱు మ్రోఁగునట్టుగ సహచరులతోఁ బ్రసంగించి, తన ధీరవచన గాంభీర్యమహిమమున వారల నంచటినిని పరమేశ్వరుని మీఁది కెత్తివచ్చునట్లు పురికొల్పఁ గలుగుట సామాన్యప్రతిభము కానేరదు. మిల్టనుకవి, పుక్కిడిపురాణముల సైతానునిగాక, తన సోదరాంగ్లేయు లనుదినమును నగరఘంటాపథంబుల సందర్శించెడి స్వదేశీయ సమకాలిక సర్దసాగ్రగణ్యుఁడగు సైతానునే వారలకుఁ బ్రదర్శించెను!

"ఈ సైతానుకూడ ప్రకృతకాలమున పదనుడిగి ప్రాఁతగిల్లి పోయినవాఁడె! అంత పందొమ్మిదవశతాబ్ద మధ్యమునఁ బ్రసిద్ధి నొందిన కార్లయిలు రచించిన "సార్టారు రిసార్టసు" నందలి సైతాను వినూతనకాంతులతో విరాజిల్లెను. "సైతాను నీవెలుపల లేఁడు. నీ యంతరంగముననె యాతఁ డణఁగి మణఁగియున్నాఁడు!" అనువేదాంత రహస్యమె కార్లయిలుని సిద్ధాంతసారము.

"ఇంతకంటెను నూతనమగు సైతానుని మన మాధునికాంగ్ల సారస్వతమునఁ జూడఁగాంచఁగలము. మేరీకొరిల్లీకన్యక రచించిన "సైతానువెతలు" అను గ్రంథమునందు సైతానుని ప్రకృత వృత్తాంత కథనము గానవగును. ఇందలి కథానాయకుఁడగు 'టెంపెస్టు', దరిలేని పేదఱికమనుభవించుచు నొకనాఁ డాకస్మికముగ నైశ్వర్యవంతుఁడైన యొకలండనునగరనివాసి. ఆ సుదినమున లూసియోరైమానెజ్ అను నొక రాజకుమారుఁ డాయనకు స్నేహితుఁడు సహచరుఁడునై, టెంపెస్టు తనసర్వస్వమును గోలుపోయి మరల దుర్భరదారిద్ర్యదశకు దిగువఱకు నాతనిని విడనాడకుండెను! ఆకాలమున లూసియో కనఁబఱ చిన శక్తిసామర్థ్యము లన్నియు సైతానుని కళలె! ప్రకృతకాలపు పురుష

## ౧౮. “ప్రాచీన నవీన సైతానులు”

వర్యుల యతులిత మేధాశక్తి, వాక్చాతుర్యము, శృంగార విలాసములును, లూసిఫెరాయందుఁ జక్కఁగాఁ బ్రదర్శితములయ్యెను. ఈ శోధనలలోఁ జిక్కఁబడవలదని శోధకుఁడు మాటిమాటికిఁ దన్ను వారించుచున్నను, కుశాగ్రబుద్ధియగు పెంపెస్టు ఆసుడిగుండములలోనే పడి కొట్టుకొని పోవుచుండెను! ఇదియె ప్రకృతిపు సైతానుని స్వభావలక్షణము. భాగ్యవంతుల మాయామర్మములందును, ధనికుల దురంత దుష్కృతములలోను, లక్ష్మీపుత్రుల లోభమోహములలోను, స్త్రీపురుషుల గూఢవ్యభిచారము లందును, — ఈనాఁటి సైతాను ప్రత్యక్షమగుచున్నాఁడు!

“ఈ నూతనమగు సైతానుని నమ్మిక లోకైకాంత విమర్శాంతము. సైతానునికి దైవవిశ్వాసము లేకపోలేదు. ఈశ్వరాజ్ఞోల్లంఘనము మాత్ర మతనికిఁ గడుప్రీతి. సైతాను ‘పాపాలభైరవుఁడ’ని ఘోషించునవి బైబిలుక్రైస్తవమతములుమాత్రమె. కొరిల్లీకన్యక వర్ణించిన సైతా నట్లు వర్తింపక, మనుష్యుఁడు నూతనదుష్పథము త్రొక్కఁ చూచినపుడెల్ల దుఃఖాతిరేకమున వెతనొందుచుండును. కావుననె యీగ్రంథమునకు “సైతానువెతలు” అను నామకరణము గలిగెను. నరుఁడు చేయు పాపకార్యముల కెల్ల సైతాను వగచుచునేయుండును!

“ఈ పుస్తకమందలి సైతా నిట్లు ఘోషించుచున్నాఁడు:—
‘స్త్రీపురుషుల పాపపరంపరయె దరిలేని నాదుఃఖాబ్ధి! స్వేచ్ఛాపేక్ష గల నన్ను బందీకృతునిఁ జేయుచున్న దిదియె. ఇదియె నాకు నరకలోకావరణమును గల్పించి, నన్ను మితిలేని వెతలపాలు చేయుచున్నది. ఇదియె నన్ను బంధించి, ఛేదించి, వికృతాంగునిఁ జేయుచున్నది!

" 'మతగురువులు నా కొనరించు నపకార మే మనఁగా,— పాపమె నావినోద మని నన్నుగుఱించి వారు నిందలువేసి, అపవాదములు వెలయించుచున్నారు! మనుష్యుఁడా! ఇప్పుడైన నీవు నిజము గ్రహింపుము. పాప మేరికైన సంతోషదాయక మగునా? లోకవినాశకరమగు పాతక మెల్లయు మనుష్యకృతమెసుఁడీ. పాపము దేవుని కపచారము, నావెతల కాలవాలమును! లోకమందెచట నేమనుజుఁడు దుష్కృతము లొనరించినను, అవి నావేదనల నభివృద్ధి చేసి, నా బానిసత్వమునకు దోహద మొసంగుచున్నవి. నిరతము నరుని శోధింతునని నేను నియమ మూనితిని. ఐనను, మనుజుఁడు నాకు లోఁబడనక్కఱలేదు. కార్యస్వతంత్రుఁడై యతఁడు నన్ను ధిక్కరించినచో, నేను పలాయన మయ్యెదను. అతఁడు న న్నాదరించెనా, వాని యందనె నేను నిలిచియుండెదను!

" 'అనాదిగ మానిసివేసమున నేను పుడమిని గ్రుమ్మరుచున్నాఁడను. ప్రభువులకు ప్రధానులకును, శిష్యులకు శాస్త్రజ్ఞులకును, పిన్నలకు పెద్దలకును, వారివారి లోపముల ననుసరించి, నేను సాక్షాత్కార మగుచున్నాను! కాని, యోగ్యులకు పవిత్రులకు విశ్వాసకులకును నేను నమస్కృతు లొనరించి, సంతోషమున వారిని వీడి పలాయితుఁడ నగుచున్నాఁడను. ఇదియె నా నిజస్థితి. నరుఁడు మనఃపూర్వకముగ నన్నుద్ధరించి నాకు విముక్తి గలిగించువఱకును, నేను వానినె యాశ్రయించి, అవనియందె నిలిచి యుందును!' "

## ౧౫. సంఘసంస్కరణసభ

రాజమండ్రిలో ౨౦ వ మెయితేదీని నేను పురమందిరమునకుఁ బోయి, అచటి పఠనాలయమునుండి "ఇమర్సనుని రచనలు" అను

గ్రంథమును, ఆస్తికపుస్తకాలయమునుండి కార్లయిలుని "శూరులు, శూర పూజ"యు, ఆడమ్సువిరచితమగు "నిరాడంబరజీవితము, ఉత్కృష్ట విచారము" అను పుస్తకమును జదువఁ దీసికొంటిని. ఒకటి రెండు దినములలోనే ఇమర్సనుని "ఆంగ్లేయుల గుణవిశేషములు", "పరమాత్మ", అను వ్యాసములును, కార్లయిలుని "వీరప్రవక్త" అను రచనమును జదివి వినోదించితిని. వీరిరువురును ప్రతిభాశాలురగు రచయితలె. ఐనను, ఇమర్సనునికంటె కార్లయిలె నామనస్తత్త్వము నెక్కువగ నాకర్షించెను. ఇమర్సనునందు మౌనగాంభీర్యములు, బ్రహ్మజ్ఞానసంపత్తి, ఆత్మోపలబ్ధియును నతిశయించియుండెను. కార్లయిలునందు ధైర్యశూరతావాగ్విభవములు ప్రదర్శితములయ్యెను. ఇమర్సను ఆత్మవిచార దీక్షను, కార్లయిలు కార్యోత్సాహమును బురికొల్పుచుందురు. మొదటి రచయిత మనస్సును దేవునిదెసకు మరలుపఁ జూచును. రెండవవాఁడు మనుష్యుని నీచతాహేయత్వములను నిరసించును. ఇరువురు నసమాన ప్రతిభావంతులును, పరమార్థతత్త్వకోవిదులును.

ఈసెలవులలో మాయప్పుదారులలో నిరువురకుఁ దిరిగి క్రొత్త పత్రములు వ్రాసి యిచ్చి సంతృప్తిపఱచితిమి. మా కడగొట్టుతమ్ముఁడు సూర్యనారాయణకు వడుగు చేసితిమి.

ఈసంవత్సరము గోదావరిమండల సభలు ఏలూరులో జరుగుట కేర్పాటయ్యెను. రాజకీయసభకు రెంటాల వేంకటసుబ్బారావుపంతులు గారు అగ్రాసనాధిపతులు. సాంఘికసభకు న్యాపతి సుబ్బారావుపంతులుగారధ్యక్షులుగ నుండుట కంగీకరించిరికాని, వారు రాలేకపోవుటచేత, కందుకూరి వీరేశలింగముపంతులుగా రగ్రాసనాసీనులైరి.

సతీసమేతముగ నే నీసభలకేగ నిశ్చయించుకొనుట మాతల్లికి సమ్మతముగలేదు. ఐనను, ౭-వ జూను తేదీని మే మిరువురమును ఏలూరు బయలుదేఱితిమి. సాంఘికసభా కార్యదర్శి శ్రీ సత్తిరాజు కామేశ్వరరావుగారియింట మేము విడిసితిమి. బహిరంగసభకు భార్య నాతఁడు గొనిపోవుట అతని సోదరులకును సంగీకృతము కాలేదు. కాని, యీవిషయమున నావలెనే కామేశ్వరరావుకూడ గట్టిపట్టు పట్టెను. ౯-వ జూనున జరిగిన సాంఘికసభలోనికి కామేశ్వరరావు నేనును పత్నీసమేతముగఁ బోయితిమి. రాజ్యలక్ష్మమ్మగారును సభ కేతెంచిరి. ఇంకఁ గొందఱు స్త్రీలుకూడ సభకు వచ్చి, స్త్రీలకొఱకు ప్రత్యేకించిన ప్రదేశమున నాసీనలయిరి.

వీరేశలింగముగారి యధ్యక్షత క్రింద జరిగిన యాసభలో, 'స్త్రీవిద్య' 'అతిబాల్యవివాహములను గుఱించిన తీర్మానములను నే నుపపాదించితిని. సభ నిర్విఘ్నముగ జరిగెను. కొలఁదికాలము క్రిందట నే తండ్రి కాలధర్మమునొందిన నా తోడియల్లుఁడు సత్తిరాజు వెంకటరత్నమును, మామఱఁదలు శ్యామలాంబను బంధువులను మే మంత పరామర్శ చేసి, మఱునాఁటిరాత్రికి రాజమండ్రి చేరితిమి. అంత వీరేశలింగముగారి యధ్యక్షోపన్యాసమును నే నాంగ్లము చేసి, ఎల్లేపద్ది నారాయణశాస్త్రిగారి కిచ్చితిని. అది యాంగ్లపత్రికలలోఁ బ్రకటననిమిత్తము మద్రాసు పంపఁబడెను.

౨౨-న జూను తేదీని విక్టోరియా మహారాణిగారి జూబిలీమహోత్సవము రాజమండ్రిపురమందిరమున నతివైభవమున జరిగెను. కలక్టరు బ్రాడీదొర అగ్రాసనాధిపత్యము వహించెను. వీరేశలింగముపంతులుగారొక తీర్మానమును ప్రతిపాదించుచు, రాణీగారి చరిత్రాంశములను జెప్పిరి. కొందఱు పద్యములు చదివిరి. వీథులలో పెద్ద యూరేగింపు

జరిగెను. నాఁడు సభలోఁ జదువఁబడినపద్యము లింట నాఁడువాండ్రకు నేను జదివి వినిపించితిని.

౨౨ వ తేదీని నేను సెలవుగైకొనుటకు వీరేశలింగముగారి యింటి కేగితిని. వారిచరిత్రమును నా "జనానాపత్రిక"లోఁ బ్రచురింపఁగోరి, వారి జీవితమునుండి కొన్ని ముఖ్యాంశము లాసమయమున నేను వ్రాసికొంటిని. ఆకాలమున వీరేశలింగమహాశయునినామము స్మరించినంతనే నామనస్సున ధైర్యోత్సాహములు ముప్పిరిగొనుచుండెను. వారివలెనే సంస్కరణపక్ష మవలంబించి, నా జీవితమును సార్థకపఱుచుకొన నా మహదాశయము.

౨౮-వ తేదీని జరిగిన రాజమండ్రిప్రార్థనసమాజ ప్రత్యేక సభలో, సత్యసంవర్ధనీపత్రికను పునరుద్ధరింపవలె ననియు, ఆపత్రికకు నేనును కనకరాజును సంపాదకులముగను, సాంబశివరావు వ్యవహారకర్తగను నుండునటుల తీర్మానమయ్యెను. నే నంతగ నిచ్ఛగింపకున్నను, మరల "సత్యసంవర్ధని" నా మెడ కంటఁగట్టఁబడెను!

తలిదండ్రులయొద్ద వీడ్కోలొంది నేను బెజవాడ పయనమయితిని. అంతకుముం దొకటిరెండు దినములక్రిందట, ఒకరాత్రి భోజన సమయమున నాకును మాతండ్రికిని కుటుంబవ్యయముల విషయమై కొంత వాగ్వాదము జరిగెను. ఇంటికర్చులకు నెల కెంత కావలయు నను నాప్రశ్నమునకు మానాయన కమితకోపము వచ్చెను. తమకుఁ గావలసినసొమ్ము నేను క్రమముగఁ బంపకుండుటవలననే, కుటుంబ ఋణము పెరుఁగుచుండె నని మాతండ్రి మొఱ. అంత మాయిరువుర కును జరిగిన సంఘర్షణమునకుఁ బిమ్మట నేను మిగుల వగచితిని. వయసు చెల్లిన యాతండ్రిని, మూర్ఛలచేఁ గృశించిన యాతల్లిని విడిచిపోవుటకుఁ గాళ్లాడక, నే నెంతో దైన్యమందితిని.

## ౨౦. చెన్నపురి యుద్యోగము.

నేను సైదాపేట బోధనాభ్యసనకళాశాల విడునంగనే, నూతనముగ వెలసిన రాజమంద్రిబోధనాభ్యసనకళాశాలలో నా కుద్యోగ మిప్పింప వలెనని మాగురువర్యులును, ఏతత్కళాశాలాధ్యక్షులును నగు మెట్కాఫుదొరగారు సిద్ధపడిరి. కాని, నేను యల్. టి, పరీక్ష రెండవ భాగములోఁ దప్పిపోవుటచేత, ఆపని నాకుఁ గాక, నామిత్రుఁడు మృత్యుంజయరావున కీయఁబడెను. పిమ్మట నేను తమ దర్శనము చేయునపుడెల్ల, నేను యల్. టి. పరీక్ష పూర్తిపఱిచితినా యని దొరగారు నన్నడుగుచునేవచ్చిరి. కాని, అది యేమివిచిత్రమో కాని, ౧౮౯౭వ సంవత్సరమువఱకును నే నాపరీక్ష నీయలేకపోయితిని. అందుచేత, మెట్కాఫుదొరకు నాయం దెంత ప్రేమాభిమానము లుండినను, రాజమంద్రికళాశాలలో నాకుఁ బ్రవేశము కలుగలేదు! ౯౭-వ సంవత్సరారంభమునం దా దొరగారు తమ యుద్యోగమును జాలించుకొని ఇంగ్లండు వెడలిపోయిరి. నేనా మార్చినెలలోనే యల్. టి. లోఁ గృతార్థుఁడనైతిని!

అంత రాజమంద్రికళాశాలకు మిడిల్‌మాస్టుదొర అధ్యక్షుఁడుగ నియమింపఁబడెను. వారి కళాశాలలోఁ దర్కశాస్త్రము బోధించుటకొక యుపాధ్యాయుఁడు కావలసినట్లు నాకుఁ దెలిసి, మద్రాసునుండి రాజమంద్రి ప్రయాణముఁ జేయుచు, బెజవాడరెయిలు స్టేషనులో దిగి యుండిన యాదొరగారిని జులై ౫-వ తేదీని నేను సందర్శించి, నాసంగతి చెప్పుకొంటిని. నన్నాయన స్వయముగ నెఱుఁగఁడు కావున, నేను దరఖాస్తు చేసికొనినచో, తా నాలోచింతునని యాయన చెప్పెను. నేను దరఖాస్తుపెట్టి ౯-వ జూలై తేదీని రాజమంద్రి బయలుదేఱి

పోయితిని. అచట మాతలిదండ్రులు సోదరులును సేమముగనే యుండిరి. నా దరఖాస్తు చెన్నపురి కనుపఁబడెనని నాకుఁ దెలిసెను. తన కళాశాలకు, అనుభవశాలియును సంస్కృతజ్ఞానము గలవాఁడును నగు బోధకుఁడు గావలెనని దొర కోరెనఁట. అందువలన నాకు లాభము గలుఁగ దని నేను గ్రహించితిని. ఈవిషయమై నాపూర్వ గురువులగు స్కాటుదొరగారికి మద్రాసు తంతి నంపి, నన్ను గుఱించి డైరక్టరుగారికి సిఫారసు చేయుఁ డని నేను గోరితిని.

మే మిదివఱకు బెజవాడలో బసచేసియుండిన గోవిందరాజుల వారి యిల్లు జూలై ౨౬-వ తేదీని మేము వదలి పోవలసివచ్చెను. వారి పెరటిలో మేము పెట్టిన చెట్లపాదులకు తుమ్మమండలు కొన్ని తెప్పించి నేను పాతించినందుకై, ఇంటియజమానుఁడగు సుబ్బారా యఁడుగారికి నామీఁదఁ గోపము వచ్చెను.

ఆపేటలోనే కొంచెము దూరమున వేఱుగా నుండు నొక్క బంగాళాను నెల కెనిమిది రూపాయిల యద్దెమీఁద పుచ్చుకొని మే మచటికిఁ బోయితిమి. ఈక్రొత్తయింటి చుట్టును విశాలమగు పెరడు గలదు. కాని, చుట్టుపట్టుల దగ్గఱగ నిండ్లేమియు లేకపోవుటవలన, నొంటరిగ మే మచట నుండుటకు మొదట కష్టముగ నుండెను. మాపాఠశాలలో చిత్రలేఖనాబోధకుఁడును నా స్నేహితుఁడునగు రామస్వామి శాస్త్రిలుగారు వారి తల్లియును వచ్చి, జూలై నెలాఖరున మా యింట నొక భాగమున దిగుటచేత, మాకు ధైర్యముగ నుండెను.

ఒకరాత్రి సంభాషణసందర్భమున, "చెన్నపురి ఆర్యపాఠశాల"లో ప్రథమోపాధ్యాయపదవి ఖాళీ యయ్యె ననియు, వారి కాంధ్రోపాధ్యాయుఁడు గావలెననియును శాస్త్రిగారు చెప్పిరి.

ఆమఱునాఁటినుండియు నే నాపని నిమిత్తమై కృషి చేసితిని. ఆపాఠశాలాధికారి, "హిందూపత్రికా" ముఖ్యవిలేఖకులగు జి. సుబ్రహ్మణ్యయ్యరుగారు. వీరే కొన్నిసంవత్సరములక్రిందట నాకును మిత్రుఁడు మృత్యుంజయరావునకును తమపాఠశాలలో పేరునకు బోధకోద్యోగము లిచ్చినవారు. వీరికి నన్నుగూర్చి సిఫారసు చేయుఁడని రాజమంద్రియందలి న్యాపతి సుబ్బారావుపంతులు, వీరేశలింగముపంతులుగార్లకును, మద్రాసునందలి బుచ్చయ్యపంతులుగారికిని నేను జాబులు వ్రాసితిని. వా రందఱును నన్ను గుఱించి అయ్యరుగారికి గట్టి సిఫారసులు చేసిరి.

అంత ౧౧-వ అగస్టు తేదీని సుబ్రహ్మణ్యయ్యరుగారి యొద్దనుండి నాకొక లేఖ వచ్చెను. నాకు నెలకేఁబది రూపాయిలు జీతమీయఁగలమని వారు వ్రాసి, నే నెంత త్వరలో తమపాఠశాలలోఁ జేరఁగలనో వ్రాయుఁడని యడిగిరి. ఆమఱునాఁడే నే నిట్లు అయ్యరుగారికి తంతి నంపితిని:—"వందనములతో నుద్యోగస్వీకారము చేయుచున్నాను. అఱువదిరూపాయి లియ్యఁగోరెదను. ఒకనెలలో చేరఁగలను. నాపని తృప్తికరముగ నున్నచో, కొన్ని సంవత్సరములవఱకును మీపాఠశాలలో నుద్యోగము నాకు స్థిరమని చెప్పఁగోరెదను."

ఈ తంతి నంపి, మఱు నిమేషమునుండియె వారి జవాబున కెదురు చూచుచుంటిని! కాని, మఱునాఁటి సాయంకాలము వఱకు నాకుఁ బ్రత్యుత్తరము రానేలేదు. అంత రాత్రి తొమ్మిది గంటలకు జవాను నాకొక తంతి తెచ్చియిచ్చెను. దానిలో నిటు లుండెను: "వందనములు. రాఁబోవుజనవరిలో నేఁబదియైదును, మఱు సటివత్సరము అఱువదియును ఇచ్చెదను. సెప్టెంబరు మొదటి తేదీని మీరు చేరవలెను." ఈతంతి నందుకొని రాజమంద్రిలోనుండు తలి

దండ్రుల యాలోచన నడుగుటకై నే నారాత్రియె రెయిలులో బయలుదేఱితిని. మాయింటి కదివఱకు వచ్చియుండిన నాపెద్దమేనమామయు, నాభార్య పెదమేనమామయును నాతో రాజమండ్రి కపుడె బయలుదేఱిరి.

నేను రాజమండ్రి చేరు నప్పటికి మాతల్లి వేలివెన్ను వెళ్లియుండెను. ఇంట తండ్రియు, తమ్ములు నుండిరి. చిన్నచెల్లెలు జబ్బుగ నుండెను. రాజమండ్రిలో మావారల స్థితిగతులు దైన్యముగ నుండెను. నా చెన్నపురి ప్రయాణమునకు మా మామగారామోదించిరి. కాని, మాతండ్రి యేమియు ననకుండెను. ఆయనకు జ్యోతిషమునం దభిమానమును, కొంత పరిచయమును గలవు. గోచారమును బట్టి నాకు త్వరలో "స్థానభ్రష్టత్వము, ధనక్షయమును"గలుగునని మాత్ర మాయన చెప్పెను! ఈ యుద్యోగమునుతప్పక స్వీకరించి, యం. యే. పరీక్షకుఁ జదువు మని వీరేశలింగముగా రనిరి. నే నంతట బెజవాడ వెడలిపోయి, ౧౭-వ సెప్టెంబరున చెన్నపురిలోని పనిలోఁ జేర గలనని అయ్యరుగారికి తంతి నంపితిని.

నే నిపుడు బెజవాడయుద్యోగముసంగతి యేమిచేయవలెనో తోఁపకుండెను! నాపనికి రాజీనామా నీయవలె ననియె నేను మొదట నెంచితిని. కాని, యది మంచిది కాదనియు, కొంతకాలము సెలవు పుచ్చుకొని, క్రొత్తపనిలోఁ బ్రవేశించిచూచుట యుక్తమనియు, ప్రధానోపాధ్యాయులు దాసుగారు నాకు సలహానిచ్చిరి. సెప్టెంబరు ౧౫-వ తేదీనాఁటికి మాపాఠశాలకు పరీక్షాధికారి తనిఖీ యగును గావున, అప్పటినుండి నా కిచ్చట సెలవు దొరకవచ్చు ననికూడ వారు చెప్పిరి. వారిసలహా చక్కఁగ నుండెను.

నే నంతట పాఠశాలాధికారి టానరు దొరను జూడఁబోయితిని. నా కీళ్లవాత మెటులుండె నని యాయన చేసిన కుశలప్రశ్నమె నాకు మంచిసందిచ్చెను! వీతద్రోగోపశమనమునకై నే నిపుడు మద్రాసు వెళ్లఁదలంచి, అచట పొట్టజరుగుటకొరకు చిన్నపనిలోఁ ప్రవేశింప నిశ్చయించితిని కాన నా కారుసెలలు సెలవీయుఁ డనియు, నేను తిరిగి వచ్చువఱకును మాతమ్ముఁడు నాస్థానమం దీపాఠశాలలో బోధకుఁడుగ నుండు ననియును నేను జెప్పితిని. మాతమ్ముని యుద్యోగమునాట యెటులుండినను, నాకు మాత్రము సెలవు దొరుకు నని దొర చెప్పెను.

నారాక నిశ్చయమని అయ్యరుగారికి నే నంతట చెన్నపురి వ్రాసివేసితిని. తలిదండ్రుల కీ సంగతి తెలియఁబఱచితిని. చెన్నపురిలో నాకు బాగుగ జరుగుచున్నచో, నే నచటనే నిలిచిపోవచ్చును గావున, నాసామాను నాతోఁ గొనిపోవ నిశ్చయించుకొని, అనవసరమగు పుస్తకములు వస్తువులును అమ్మివేసితిని. తలిదండ్రులను జూచుటకు మరల ౧౧-వ సెప్టెంబరున నేను రాజమండ్రి వెళ్లితిని. మాతల్లి యపుడె దేహస్వాస్థ్యము నొందుచుండెను. రెండవ మఱఁదలికి జబ్బుగ నుండెను. మా తాటియాకుల యింటిలో తేమ యుఱియుచుండెను! ఆకుటీరమున దరిద్రదేవత తాండవమాడుచుండెను! నాకు వెఱ్ఱి దుఃఖము గలిగెను. జననీజనకుల దురవస్థ నే నెట్లు తొలఁగింపఁగలనా యని తలపోసితిని.

అంత వీరేశలింగముపంతులుగారు సాంబశివరావు మున్నగు స్నేహితులను జూచి, నేను బెజవాడ బయలుదేఱితిని. నాకు వీడ్కోలొసంగుటకు పెద్దతమ్ముఁడు రేపల్లెనుండి బెజవాడ వచ్చియుండెను. మాపాఠశాలతనిఖీ ౧౪ వ-సెప్టెంబరుతో ముగిసెను. సెప్టెంబరు

“జనానాపత్రిక” యాదినముననే చందాదారుల కంపివైచి, పాఠ శాలకుం బోయి, అచట నుపాధ్యాయులయొద్దను, విద్యార్థులయొద్దను వీడ్కోలొందితిని. నాలుగుసంవత్సరములు గలసిమెలసి యుండిన మిత్రుల నొకసారి వీడుట కష్టముగఁ దోఁచెను. తోడియుపాధ్యాయు లగు అయ్యన్నగారు నన్నుఁ గౌఁగిలించుకొని విలపించిరి! నేను మాత్రము చిఱునవ్వు నవ్వి, త్వరలోనే మరలివచ్చెద నని వారి నూర డించితిని. అంత, సామానులు సరదికొని, స్టేషనునకు వచ్చి, విద్యా ర్థులు బోధకులును వీడుకొలుపఁగా, మేము రేయిలులోఁ గూర్చుంటిమి.

## ౨౧. ఆశాభంగము

మేము బెజవాడనుండి బయలుదేఱునాఁడే, చెన్నపురినుండి నా కొక ‘యాకాశరామన్న’ జాబు వచ్చెను. ‘చెన్నపురి ఆర్యపాఠశాల’లో జీతములు సరిగా నీయ రనియు, మంచిపాఠశాల వదలి యిట్టి దిక్కులేని విద్యాలయమున కేగినచో సుఖమున నుండు ప్రాణమును దుఃఖములపాలు చేసికొందు ననియు నందుండెను! ఐనను, మించినపనికి నే నిపు డేమిచేయఁగలను ?

ఆకాలమందు బెజవాడనుండి సరిగా, చెన్నపురికి రెయిలు పడ లేదు. మేము చిన్నబండి మీఁద గుంతకల్లుదారిని బోయితిమి. దారిలోని చెట్లు చేమలు, కొండలు కనుములును జూచి, మా కనులు సేదదేఱెను. మఱునాఁటిరాత్రి గుంటకల్లులో బొంబాయిమెయి- లెక్కితిమి. తిలకు మహాశయునికి ౧౮ నెలలు కఠినశిక్ష వేసిరని రెయిలులో విని విచారించితిని. ౧౪-వ సెప్టెంబరు ప్రొద్దున్నకుఁ జెన్నపురిచేరి, పరశువాక మేగి, మన్నవ బుచ్చయ్యపంతులుగారి యింట, బసచేసితిమి. పంతులుగారు నేనును గలసి తిరువళిక్కేణి

వెళ్లి, సుబ్రహ్మణ్యయ్యగారిని సందర్శించితిమి. ఆయన దయార్ద్రహృదయుఁడు. నన్నాయన పాఠశాలకుఁ గొనిపోయి, ప్రతియుపాధ్యాయునికి నెఱుకపఱచిరి. పాఠశాల కడు బీదస్థితిలో నుండెను. తిరువళిక్కేణిలో నుండు బంధువు మంత్రిరావు వెంకటరత్నమును నే నపుడు కలసికొని, అతఁడు త్వరగా స్వస్థలమునకుఁ బోయి, భార్యకు మంచిమందిప్పించుట యగత్య మని చెప్పితిని.

మఱునాఁడు నేను తిరువళిక్కేణి వెళ్లి, పూర్వము "ఆర్య పాఠశాలా" ప్రథమోపాధ్యాయుఁడును, ఇపుడు "హిందూపత్రికా" సహాయవిలేఖకుఁడునునగు శ్రీ కే. నటరాజనుగారిని, వారిమిత్రులనుఁ జూచితిని. మాపాఠశాలలోని యొకబోధకుఁడు నాకు బస కుదుర్చుటకై నాతో వచ్చి, కొన్నియిండ్లు చూపించెను. బ్లాకుటవును పోయి మిత్రుఁడు శ్రీ కొల్లిపర సీతారామయ్యగారిని జూచితిని. మఱునాఁడు ఆదివారము బ్రాహ్మమందిరమునకుఁ బోయినపుడు, రాఁబోవు రామమోహనరాయలవర్ధంతి సందర్భమున నొకయుపన్యాసము చేయుఁడని మిత్రులు నన్ను గోరిరి.

నేను పాఠశాలలో వెంటనే పనిచేయ నారంభించితిని. ఆవిద్యాలయము మంచిస్థితిలో లేదు. ప్రవేశపరీక్షతరగతి క్రమము తప్పియుండెను. నేను జేయవలసిన కృషి యత్యధికముగఁ గలదు.

"ఆర్యపాఠశాల"కు సమీపముననుండు నొకచిన్న యింటిలో నేను అద్దెకు రెండుగదులు పుచ్చుకొంటిని. ఆ యింటిలో రెండవ భాగమున సుబ్రహ్మణ్యయ్యరుగారి బావమఱఁదులు కాపుర ముండిరి. సెప్టెంబరు ౨౽-వ తేదీని బ్రాహ్మసమాజమువారు రాజారామమోహనుని వర్ధంతి జరిపిరి. వారి మందిరమునఁ గూడిన బహిరంగ సభకు రా. బ. పనప్పాకం ఆనందాచార్యులుగారు అధ్యక్షులు.

## ౨౧. ఆశాభంగము

నేను రామమోహనుని గురించి వ్రాసిన యింగ్లీషువ్యాసమును జదివితిని. అధ్యక్షులు నావ్యాసమును మెచ్చుకొని, బ్రాహ్మమతమును గురించి సదభిప్రాయము దెలిపిరి. అపుడు "సంఘసంస్కారిణీ"పత్రికలో ముద్రితమైన నావ్యాసమును, కలకత్తా సాధారణబ్రాహ్మసమాజమువారి "ఇండియన్ మెసెంజరు" పత్రిక పునర్ముద్రితము చేసెను.

30-వ సెప్టెంబరు ప్రవేశపరీక్షకు దరఖాస్తు లంపుటకు తుది దినము. మా పాఠశాలనుండి 31 మంది బాలుర నా పరీక్షకంపి, యిద్దఱినిమాత్రము నిలిపితిమి. కాని, యా యిరువురు విద్యార్థులును పలుమాఱు యింటికి వచ్చి చేసిన దీనాలాపములకు జాలినొంది, వారినిఁ గూడఁ బంపివేసితిని.

నా మిత్రులు కనకరాజు గంగరాజుగార్లు బి. యల్. పరీక్షలో తప్పి, తిరిగి యాపరీక్ష నిచ్చుటకై అక్టోబరు ౯-వ తేదీని మద్రాసు వచ్చిరి. మాయింటికి వారినిఁ గొనివచ్చి, కొలఁదిరోజులలో వారి కొకబస కుదిర్చితిని. ఇపుడు నేను మద్రాసులో నివసించుటచేత, 'జనానాపత్రిక' నిచటనే ప్రచురించి తపాలో నంపుచువచ్చితిని.

మద్రాసులో నొకనెల యుండునప్పటికే నా కచటి నివాసమునందు విసువు జనించెను. నెల కేఁబదిరూపాయిలతో నా కక్కడ జరుగకుండెను. ఆ జీతమైనను సరిగా నొక్కసారి చేతికి రాదు. పాఠశాలలో పనియు, బాధ్యతయును అధికము. ఫలము స్వల్పము! తలిదండ్రుల పోషణమునకు రాజమండ్రి పంపుటకు నాయొద్ద సొమ్మే లేనేలేదు. కావున నేను త్వరలోనే యీ పట్టణమునుండి కానిన కనీస మీపాఠశాలనుండి కాని, వెడలిపోయి, వేఱొక యుద్యోగమునఁ బ్రవేశింపవలసినదే. నాపూర్వమిత్రులగు అనంతముగారికి నేనీ సంగతి

వ్రాయఁగా, నేను మరల బెజవాడ వెడలిపోవుటయె శ్రేయమని వారు హితవుచెప్పిరి. వెనుక బెజవాడపాఠశాలలో నుపాధ్యాయ మిత్రులగు దేవసహాయముగా రిపుడు చెన్నపురి రాయపేటకళాశాలలో నుపాధ్యాయులుగ నుండిరి. ఆయనను నే నిపుడు సందర్శించి, వేఱు మంచియుద్యోగ మేమైన నిచట దొరకునా యని యడుగఁగా, అచటి క్రైస్తవ పాఠశాలాధికారుల నిద్దఱిని జూడు మని వారు చెప్పిరి. నే నట్లు చేసితిని. కాని, నాకు లాభ మెచటను గానఁబడలేదు. తిరిగి బెజవాడకు వెడలిపోవుటయె మే లని తోఁచెను. కావున ౨౬ వ అక్టోబరున బెజవాడ పాఠశాలాధికారికి తంతినిచ్చి, డిశెంబరు ప్రారంభమున నేను మరల బెజవాడలో నాపనిలోఁ జేరెదనంటిని. వారు దాని కొప్పుకొనిరి. నే నిట్లు బెజవాడకుఁ బోవుటకే నిశ్చయించుకొంటిని.

సుబ్రహ్మణ్యయ్యరుగారును నా బెజవాడ ప్రయాణమునకు సమ్మతించిరి. నా తోఁటబంగాళా నాకొఱకు నిలిపి యుంచుఁడని బెజవాడస్నేహితులకు నే నంత వ్రాసివేసితిని.

చెన్నపురిలో నుండునపుడు, తఱచుగ నేను మిత్రులు కనకరాజు గంగరాజుగార్లను గలసికొని, మాకుఁ బ్రియమగు సంస్కరణోద్యమమును గూర్చి ముచ్చటించువాఁడను. నాపత్రిక పేరు బాగుగ లేదు కావున, శ్రవణానందకరమగు వేఱొక నామమును, ముఖపత్రము మీఁద నాకర్షణీయమగు స్త్రీప్రతిమయు నుండవలెనని కనకరాజు చెప్పెను. ఇంకను నాభార్యకు మత సంఘ సంస్కరణ విషయములు కంటకములుగఁ దోఁచెను. ప్రకృత హిందూస్త్రీల స్థితిగతులు సామాన్యముగ నిట్టివియే యని నేను మనస్సునఁ గొంత సమాధానపఱుచుకొంటిని. మద్రాసులో నున్న దినములలో నే నప్పుడప్పుడు "సంఘ

సంస్కరణ సమాజము"వారి విడిదికిఁ బోవుచుండువాఁడను. నన్ను వారు సభ్యునిగఁ జేర్చుకొనిరి. సభికులు వారమున కొక్కమాఱు తమబసలో సమావేశమై, తమలో సౌభ్రాతృత్వమును బెంపొందించు కొనుటకై యందఱును గలసి ఫలాహారములు చేయుచుండువారు. ఇది నా కంతగ తృప్తికరముగ లేదు.

నేను చెన్నపురికి వచ్చినపిమ్మట, "లండను నగర రహస్యములు" మున్నగు ననేకపుస్తకములు చదివితిని. కాని, నేనిచ్చటికి వచ్చిన ముఖ్యకార్యమె మఱచిపోయితినికదా! ఎన్ని కష్టములు పడియైనను, ఇచట రెండుమూఁడు సంవత్సరము లుండి, యం. యే. పరీక్షకుఁ జదివి యందు జయ మందినచో, ఏకళాశాలలోనైనను నాకు మంచి యుద్యోగము లభింపఁగలదు. లేనిచో, బి. యల్. పరీక్షకైనను నేను మెల్ల మెల్లగఁ జదివి కృతార్థుఁడనైన బాగుండునని మా తలిదండ్రుల తలంపు. కాని, యీ పాఠశాలలో దినమున కాఱుగంటలు నేను పని చేయవలసివచ్చెను. ఇదిగాక, ప్రథమోపాధ్యాయుఁడ నగుటచేత, నా బాధ్యత యధికముగ నుండెను. పాఠశాలకు సొమ్ము చాలదు. బోధకుల కండఱికి నెలలకొలఁది జీతములు ముట్టుటలేదు! ఇటువంటి విద్యాలయమున నే నెటులుండి యుద్ధరింపఁగలను? ఈ పాఠశాలకుఁ జేరువనుండెడి "తిరువళిక్కేణియున్నత పాఠశాల"తో సరిసమాన మైన మంచిపేరు దీనికిని గొనిరావలదా యని సుబ్రహ్మణ్యయ్యరు గారితో నే నొకనాఁ డనఁగా, "మన పాఠశాల వేఱొకవిద్యాలయ ముతో పోటీ చేయ నక్కఱలేదు. మంచి విద్యార్థులు ఇతరపాఠశాలల కేగినను, మిగిలిన తక్కువరకపు బాలురే మనకుఁ జాలు" నని అయన చెప్పివేసిరి! ఇంకొకసారి, ఇచటి యుపాధ్యాయులకు నెల నెలకును సరిగా జీతములు లభింపకుండుట చింతనీయ మని నే ననఁగా,

“పంతులుగారూ, పట్నము సంగతులు మీకు బాగా తెలియవు. మనము జీతములు బాకీపడియుండుటయే మనబడికి శ్రేయము. ఉపాధ్యాయులు మన విద్యాలయమునుండి దాటిపోకుండ వారి కిదియే సంకెలి యగుచున్నది సుమీ!” అని అయ్యరుగారు నాకు సమాధాన మిచ్చిరి! విద్యాశాలాధికారి కిట్లు ఉదారాశయములు లేకుండుట చేతను, తోడి బోధకుల కష్టములు నిరతము చూడలేకయు, నే నిట్టి పాఠశాలలో పాతుకొనిపోవుట వ్యర్థమని తలంచితిని.

ఇదిగాక, పెద్దపరీక్షలకుఁ జదువుటకు నాకీ పాఠశాలలో బొత్తిగ తీఱిక లేకుండెను. దీనికితోడు ఈ మహాపట్టణమున నేఁబది రూపాయిలతో నాకు జరుగదని నే నధైర్యపడితిని. అప్పులు తీర్చుట యటుండనిచ్చినను, తలిదండ్రుల పోషణమునకును, సోదరుల చదువునకును వలయు సొమ్ము మాసమాసమును నే నెట్లు సమకూర్పఁగలను? ఈ కారణములచేత నేను బెజవాడకు సంసారమును తరలింపవలసి వచ్చెను.

నవంబరుమధ్యనే నేను సామానులు సరదుకొన నారంభించితిని. మద్రాసులో కొంతకాలము నివసించి యిచట సంస్కరణోద్యమ ప్రచారము సలుప నుద్యమించిన వీరేశలింగముగారి సరకులు పుస్తకములు నపుడే రాజమండ్రినుండి వచ్చుచుండెను. నా సామానులు కొన్ని బకింగుహాముకాలువ పడవమీఁదను, కొన్ని రెయిలులోను వేసి, బెజవాడ కంపివేసితిని. అంత ౨౬-వ నవంబరున మేము మద్రాసునుండి బయలుదేఱితిమి. చెన్నపురికాపుర మిట్లు కడతేఱెను! తా నొకటి తలంచిన దైవ మొకటి తలంచును!

# ౨౨. మరల బెజవాడ

అనంతముగా రిపుడు సకుటుంబముగ బళ్ళారిలో నివసించి యుండిరి. వారి యాహ్వానము ననుసరించి మే మపుడు మార్గమధ్యమందలి బళ్ళారి పోయి యచట రెండుదినములు నిలిచితిమి. వారి స్నేహితులగు సి. యస్. సుబ్రహ్మణ్యమయ్యగారి యిల్లు మాకు విడిది యయ్యెను. అయ్యగారు సుప్రసిద్ధాంధ్రులగు మీనాక్షయ్యగారి యల్లుఁడు. ఈ దంపతులు సాధుజనులు. అనంతముగారు మాకు బళ్ళారినగరము చూపించిరి. పట్టణము చక్కనిదియె కాని, అందు దోమలబాధ మెండు. దివ్యజ్ఞానసామాజికులగు ఆర్. జగన్నాథయ్యగారును, వార్డ్లాపాఠశాలాధ్యక్షులగు కోటిలింగముగారును నా కచటఁ బరిచితులైరి. నా స్నేహితులును, బాలికాపాఠశాలల పరీక్షాధికారులునగు శ్రీ పి. రామానుజాచార్యులుగా రచట నుండిరి.

౩౦-వ నవంబరు ప్రొద్దున మేము మరల రెయిలులో కూర్చుండి డిశెంబరు ౧-వ తేదీ యుదయమునకు బెజవాడ చేరితిమి. కడుఁ బ్రియమగు బెజవాడను మరలఁ గాంచి నా కన్నులనుండి యానందాశ్రువు లొలికెను. నాకొఱకు విద్యార్థులు రెయిలుస్టేషనులోఁ గనిపెట్టుకొని యుండిరి. మేము మాతోఁటబంగాళాకుఁ బోయితిమి. పెరటిలోని జామలు, సీతాఫలపుచెట్లును పండ్లతో నిండియుండి, మాకు సుస్వాగతమొసంగెను! ఆసాయంకాలము టానరుదొరను, దాసుగారిని జూచి, మరల బెజవాడ పాఠశాలలోఁ బ్రవేశించితిని. మే మంత సంవత్సర పరీక్షలు జరుప నారంభించితిమి. డిశెంబరు ౭-వ తేదీని మిత్రులతోఁ గలసి, రెయిలుస్టేషనులో వీరేశలింగముగారిని సందర్శించితిని. చెన్నపురిలోఁ గృషి చేయవలెనని గంపెడాసతోఁ గదలిపోవుచుండు

పంతులుగారు నావలెనే విఫలమనోరథులై వెనుకంజవేయుదురేమో యని నేను వెఱగందితిని. దైవానుగ్రహమువలన వారి కన్ని శుభములు సమకూరవలయు నని కోరితిని.

నా సలహామీఁద శ్రీ చిలుకూరి వీరభద్రరావుగా రిపుడు బెజవాడ రావలె నని యుద్దేశించిరి. ౯౮ వ సంవత్సరారంభమునుండియు మే మిరువురమును గలసి యొక యాంగ్లాంధ్ర వారపత్రిక నెలకొల్ప నుద్యమించితిమి. రావుగారికిని వారి ముద్రాలయమునకును వలసిన యొక బస నేర్పాటు చేయుటకు మిత్రులు నేనును వెదకితిమి.

ఈ శీతకాలపు సెలవులలో కొంచెము జబ్బుగ నుండిన నా భార్యను జూచిపోవుటకు నా యత్తగారు, బావమఱఁదియు బెజవాడ వచ్చిరి. వెంకటరామయ్య రేపల్లెనుండి బెజవాడకు వచ్చి న్యాయవాదిపరీక్షకై మద్రాసు వెడలిపోయెను. తలిదండ్రులను జూచివచ్చుటకు నేను డిశెంబరు ౧౮ వ-తేదీని రాజమంద్రి వెళ్లితిని. కృష్ణమూర్తిభార్య సంజువ్యాధితో బాధపడుచుండెను. కుటుంబవ్యవహారములను గుఱించి తలిదండ్రులతోను, తమ్ముఁడు కృష్ణమూర్తితోను నేను మాటాడితిని. మా సంసారమున వ్యాధులవలెనే అప్పులును దినదినప్రవర్ధమాన మగుచుండెను! బాధ్యతలు హెచ్చుచుండెను. దూరమున రాజమంద్రిలోనుండు జననీజనకులను నేను సరిగాఁ గనిపెట్టనేరకుంటిని కాన, పిల్లలతో వారు బెజవాడ వచ్చినచో, అందఱును సౌఖ్యమును మనశ్శాంతిని ననుభవింతు రని తలిదండ్రులకు బోధించి, వారలను విజయవాడ కాహ్వానించితిని. వా రొకవిధముగ సమ్మతించిరి.

పెద్దయప్పు లటుండనిచ్చి, మా చిల్లర యప్పులే రాజమంద్రిలో పెరిఁగిపోవుచుండెను! మా సంసారము రాజమంద్రినుండి తరలించుటకు

ముందుగ ౨౫౦ రూపాయిలు కావలసివచ్చెను. సోదరినగలు కుదువఁబెట్టినచోఁ నీసొమ్ము మాకు దొరుకుననని తెలిసెను. దీనికి చెల్లెలు సమ్మతించుటచేత, నగలతాకట్టుమీఁద సొమ్ము బదులు తెచ్చి యప్పులు తీర్చివైచితిమి. తలిదండ్రులను వెనుకనుండి రమ్మని చెప్పి, ౨౨ వ-తేదీని మామగారితో నే నేలూరు పయనమైతిని. అక్కడ వీరభద్రరావుగారిని గలిసికొని, వారితో మాటాడితిని. భూములు కొన్ని యమ్మివైచి, ఆ సొమ్ముతో ముద్రాలయము నొకటి కొని బెజవాడలో దాని నెలకొల్పెదనని ఆయన చెప్పిరి. నాకును గొంత సొమ్ము బదు లిచ్చెద మనిరి. మేము ఉభయులమును వారపత్రికను స్థాపింపఁబూనుకొంటిమి.

అంత నేను బెజవాడ వచ్చితిని. మద్రాసులో నారంభింపని న్యాయశాస్త్రపరీక్ష చదువులు బెజవాడలో నే నిపుడు మొదలు పెట్టితిని! దాసుగారి నడిగి న్యాయశాస్త్రగ్రంథ మొకటి తెచ్చి ముందు వేసికొని కూర్చుంటిని. శరీరస్వాస్థ్యమునకై తొట్టిస్నానములు చేయఁబూనితిని. కాలక్రమమున మన యూహలందును క్రియల యందును మనకే విడ్డూరముగఁ దోఁచు విచిత్ర పరిణామ మొక్కొక్క తఱి నేర్పడుచుండును!

## ౨౩. "చిప్పలశివరాత్రి"

౧౯౧౫ జనవరి మొదటితేదీని మా యప్పులపట్టికను నేను దిరుగ వేసితిని. వడ్డితో మే మానాఁటికి పద్దుపత్రములమూలమున నీయవల సిన యప్పులును స్నేహితుల చేబదుళ్లును గలసి, సుమారు నాలుగువేల రూపాయి లగఁబడెను! ఎట్లీ యప్పు తీర్చివేయఁగలమా యని నేను తల్లడిల్లితిని. ఆరోజు దినచర్యపుటలో నే నిట్లు లిఖించితిని:—"ఈ

సంవత్సరారంభము నా కెంతయు నశుభప్రదముగ నున్నది. మరణ మొకటియే నా బాధానివారణము చేయఁగలుగు నని తోఁచుచున్నది! దేవుని యాస్తిక్యమునందు నాకు నమ్మిక తొలఁగలేదు గాని, పరమాత్ముని మహిమ మేమియు నా యాత్మలో ప్రతిఫలన మగుటలేదు!"

నేనీ సంవత్సరము చేయవలసిన కార్యములు రెండు గలవు. ఒకటి న్యాయశాస్త్రసంబంధమగు చదువు. రెండవది, నూతనవార్తాపత్రికాప్రకటనము. ఇదియును, పాఠశాలలోనిపనియు, "జనానా" "సత్యసంవర్ధనీ" పత్రికాసంపాదకత్వమును గలసి నాకు దుర్భరభారముగఁ దోఁచెను!

జనవరినెలలో బెజవాడలో విశూచి ప్రబలియుండెను. మాయింట నొకభాగమున నుండు శ్రీఅయ్యగారి సుబ్బారాయఁడుగారి జవాను సుబ్బయ్యకు రావ తేదీని ఈవ్యాధి సోఁకెను. అంత వానిని వైద్యాలయమునకుఁ గొనిపోయితిమి. అక్కడ వాఁడా రాత్రి చనిపోయెను. చందావేసి వానికి దహనాదికర్మలు జరిపించితిమి.

కాబెట్టు విరచితమగు "యువజనహితోపదేశము" అను నాంగ్లపుస్తకము నేనిపు డెంతో తమకమునఁ జదివితిని. ఈరీతి నాంధ్రమున గ్రంథరచన చేయ నే నభిలషించితిని. కాని, స్వానుభవమున నిన్నియంశములు నా కెట్లు సమకూరఁగలవు? నా యనుభవ మసమగ్రము, భావవిస్ఫురణము సంకుచితమును! ముందైన సుఖదినములు గాంచ నోఁచితినా యని నేను బలవించితిని.

సతి కాంగ్లము బోధింప నే నాసక్తితో నుంటిని. కాని, యామెకుఁ జదువునం దిష్టములేదు. విద్యావతులగోష్ఠికంటె నజ్ఞానస్త్రీల సహవాసమే యామె కభిమతము!

## ౨౩. "చిప్పల శివరాత్రి"

నా తమ్ముఁడు సూర్యనారాయణ లోవరు సెకండరీపరీక్షలో విజయమంది విజయవాడలోఁ జదువుటకై జనవరి ౨౯వ తేదీని వచ్చెను. బావమఱఁది సీతాపతియు నిక్కడఁ జదువఁగోరుచున్నాఁడు కాని, తలిదండ్రు లాతనిజీతమైన నీయఁజాల రని చిన్నతమ్ముఁడు చెప్పెను. నే నాహ్వానింపఁగా సీతాపతి ౫-వ ఫిబ్రవరిని బెజవాడ వచ్చెను. కృష్ణయ్యభార్యకు మిక్కిలి జబ్బుగా నుండెనను వార్త నాతఁడు గొనివచ్చెను. మాపాఠశాలలో నీసంవత్సరము ఐదుగురు ప్రవేశపరీక్షయందు జయ మందుటకు మేమందఱము సంతసించితిమి.

వీరభద్రరావుగారిచటికిఁ గొనివచ్చెడి ముద్రాలయమున కొక్క వసతి గృహము సంవత్సరమునకు నూఱురూపాయిల బాడుగకుఁ గుదిర్చితిమి. కాని, ౮-వ ఫిబ్రవరిని ఆయన ముద్రాలయమును బెజవాడకుఁ గొనిరాఁగా, అదివఱకు బస యిచ్చెద నని పెద్దమనుష్యుఁడు వెనుకకు తగ్గెను! అంతఁ గొన్నిరోజులకు వేఱొకయిల్లు సమకూడెను. ఈ ముద్రాక్షరశాలకు పని సంపాదించుట కెంతయో ప్రయత్నించితిని. నా "జనానాపత్రిక"నింతటినుండి యీముద్రాలయమున నే ప్రచురించుట కేర్పఱిచితిని.

న్యాయవాదిపరీక్ష నిచ్చి వెంకటరామయ్య ఫిబ్రవరి ౧౧వ తేదీని మద్రాసునుండి వచ్చెను. కుటుంబవ్యవహారములగుఱించియు, అప్పులతీర్మానమును గూర్చియు మేము మాటాడుకొంటిమి. రేలంగి రాజమహేంద్రవరములలోఁగల మాయిండ్లు నమ్మివైచి, ఋణము నిశ్శేషము చేయవలెనని నాపట్టు. ఇది యిట్లుండఁగా, బెజవాడ గవర్నరుపేటలో వేయిగజముల స్థలములోఁ గట్టిన యొకయిల్లు ౮౦౦ రూపాయిలకు విక్రయమునకు వచ్చెను. అది కొనుటకు నే నభిలషించితిని. మిత్రుఁడు రాజారావు నడుగఁగా, ఆయింటి తాకట్టు

మీఁదనే నాకుఁ గావలసిన సొమ్మిచ్చెద నని యతఁ డనెను. వేగమే బెజవాడ రమ్మని యింటియజమానునికిని మామగారికిని తంతి నంపితిని. వారిరువురును వచ్చిరి. కాని, పూర్వ మొకవితంతువు అమ్మిన స్థలములో నీయిల్లు కట్టఁబడుటచేత, ఇంటి హక్కునుగుఱించి ముందు చిక్కులు రావచ్చునని భీతిల్లి, యిల్లు కొనుట మానుకొంటిమి.

ఇటీవల రాజమండ్రిలో నగలు కుదువఁబెట్టి తెచ్చినసొమ్ము నేను జెల్లింపనేలేదు. కాఁబట్టి నా కెటులో సొమ్మియ సిద్ధమైన రాజారావునొద్ద 300 రూపాయిలు బదులు తెచ్చి, నగలు విడిపింపుఁ డని యాసొమ్మును రాజమండ్రికిఁ బోవుచుండెడి మామగారికిఁ దమ్మునికి నిచ్చివేసితిని.

ఆరోజులలో నాకుఁ దగినంత చిత్తశాంతి లేకుండెను. చేయు పనియు చదివెడిచదువును ఎక్కువయ్యె, నాకిట్లు మనశ్శాంతి తొలఁగ లేదు. మీఁదుమిక్కిలి వానివలన నా కొకవిధమగు విరామమే కలిగె నని చెప్పవచ్చును. అట్టి కార్యవ్యాజమే లేకున్నచో, స్థితిగతులను గుఱించియు మా దురవస్థను గూర్చియు తలపోసి నా మనస్సు విచార పంకమున మఱింత గాఢముగ మునిఁగిపోయెడిదియే ! కనులముందటనే యప్పు పెరిఁగిపోవుచుండుటయును, చేత తగినంతసొమ్ము లేకుండుట యును నా యలజడికిఁ గొంత కారణము. దీనికిఁ దోడుగ నింట సతికిఁ బతికిని సామరస్యము లేకుండెను. బుద్ధిపూర్వకముగ నే నప్పులపా లగుచుంటి నని భార్య యపోహము! ఇంగ్లీషు నేరువు మనియు, పూర్వాచారపరాయణత్వము వీడు మనియు నే నామెను శాసించు వాఁడను. ఒక్కతెయె యింటిపనులు చేసికొనవలసివచ్చిన యామె కీచదువు కంటకసదృశమయ్యెను. సతి ప్రాఁతయాచారముల నంటి పట్టుకొని యుండుట నాకుఁ గడు దుస్సహముగ నుండెను. కావున

## ౨౩. "చెప్పుల శివరాత్రి"

" ఇంటిలోని పోరు ఇంతంత గాదయా" అను వేమనయోగిపలుకుల సత్యము మాకు ద్యోతకమయ్యెను. ఇట్టిగృహకల్లోల మొకటి ఫిబ్రవరి ౧౯-వ తేదీని శివరాత్రినాఁడు మాకు సంభవించెను.

శివరాత్రికి కృష్ణస్నానమునకై వేలకొలఁదిప్రజలు చుట్టుపట్టుల నుండి బెజవాడకు వచ్చుచుందురు. ఆనాఁడు విశాలక్షమ్మగారితోఁ గలసి నాభార్య యేటికి స్నానము చేయఁబోయెను. ఇది నా కెంతయు నసమ్మతము. గృహిణిమీఁదఁ గసి తీర్చుకొనుటకె యామ ధ్యాహ్నము నేను పింగాళీకంచమున నన్నము తింటిని! నదీస్నానము చేసివచ్చిన తా నీగాజుచిప్పలు కడిగి మైలపడినది గావున, నాభార్య యానాఁడు భుజింప నని చెప్పివేసెను. దీనితో నాయాగ్రహము ప్రజ్వరిల్లెను. తా నుపవాసము చేయుట యయుక్తమును, నా కసమ్మ తము నని నేను గట్టిగఁ జెప్పి కోపించుటచేత, ఎట్టకేల కామె రాత్రి భుజించెను. ఈపుణ్యదివసము మాయింటఁ గేకలతోను రోదనముతోను జరిగిపోవుటచేత, దీనికి నాచిన్నితమ్ముఁడు సూర్యనారాయణ "చిప్పల శివరాత్రి"యని నవ్వులాటలకుఁ బేరుపెట్టెను!

ఈ సంవత్సరము న్యాయవాదిపరీక్షయందు తమ్ముఁడు వెంకట రామయ్య జయమందె నని మార్చి ౧౫వ తేదీని తెలిసి, సంతోషమున మిన్నందితిని.

" దేశాభిమాని " యనుపేర నాంధ్రాంగ్లవారపత్రిక నొకటి ప్రచురింప వీరభద్రరావుగారు నేను నుద్దేశించితిమి. దాని కాంగ్ల రాజకీయ వ్యాసములు వ్రాసి, అవి దిద్ది పంపుఁ డని మిత్రులు వెంకట రత్నమునాయఁడుగారికి నేను బంద రంపితిని. కాని, నాయఁడుగా రవి దిద్దకపోవుటయేగాక, మరల మా కవి పంపనైన లేదు! అందువల

నము, వీరభద్రరావుగారి "విద్యాసాగరముద్రాలయము"నఁ బనులు సరిగా జరుగకుండుటవలనను, మేము పత్రికాప్రకటనమును విరమించుకొంటిమి!

మా యత్తగారికి జబ్బుగా నుండె నని జాబు వచ్చుటచే భార్యను రాజమంద్రి పంపితిని. ఆమెకుఁ గొంచెము నెమ్మది గలిగె ననియు, తమ్ముఁడు కృష్ణమూర్తిభార్య చనిపోయె ననియును నా కంతట లేఖ వచ్చెను. ఈబాలిక మరణవార్త విని మిగుల విచార పడితిని.

## ౨౮. పెండ్లి బేరములు

ఇదివఱకే మాతలిదండ్రులు బెజవాడ వచ్చి నాతో నుందుమని వాగ్దానము చేసిరి. కాని, యట్లు జరుగలేదు. దీనికి ముఖ్యకారణము, అందఱును బెజవాడ చేరినచో, తమమాట చెల్లదని పెద్దవారును, తమ మరియాద నిలువ దని చిన్నవారును, స్త్రీజనము తలంచుటయె! ఆదినములలో మాతమ్ములలో నొకరు నాకు రాజమండ్రినుండి వ్రాసిన యీక్రింది యుత్తరము దీనికి వ్యాఖ్యానప్రాయముగ నున్నది:— "నీవు తెలివిహీనుఁడవు కాఁబట్టి యితరులమాయలలో పడుచున్నావు! నీ అత్తగారు నెమ్మదిగనే యున్నది. వదెన నిపు డిచటికి నీవు పంపుట వట్టి అనగత్యకార్యము! * * * * "

మాయింటను, అయ్యగారివారియింటను స్త్రీ లీసమయమున లేకపోవుటచేత, రెండిండ్లలోను పురుషపాకమే! దాని మాహాత్మ్యమున ౫-వ తేదీని తెలవాఱుజామున అజీర్ణసంబంధమైన పోటు నాకు కడుపులో బయలుదేఱెను. ఆనాఁ డంతయు మంచ మెక్కితిని. వైద్యులు

వెంకటసుబ్బయ్యగారు వచ్చి మందిచ్చిరి. భార్యను బంపుఁ డని నేను రాజమంద్రి తంతి యిచ్చితిని. తంత్రీసమాచారము విని మానాయన దుఃఖపరవశుఁడై, నన్నుగుఱించి వివరములు వ్రాయనందుకు సీతాపతి మీఁద కోపపడెనఁట. ఒకటి రెండురోజులలో నాఁడువాండ్రు బెజవాడకు వచ్చిరి.

ఈ కడుపునొప్పి నెమ్మదిపడిన కొన్నిదినములవఱకును నాకు నిస్సత్తువుగ నుండెను. కావుననే కాకినాడలో జరిగిన "ఆస్తికసమావేశము"నకు నేను వెళ్లలేకపోయితిని. అచటికిఁబోయి ౧౧-వ తేదీని తిరిగివచ్చిన వీరభద్రరావుగారు సభాసమాచారములు కొనివచ్చెను. మఱుసటిసంవత్సరసభ బెజవాడలో జరుపుటకు తీర్మానించిరి.

ఆ సంవత్సరమున బెజవాడపాఠశాలకు క్లార్కుదొరయే వ్యవహారకర్తగ నుండినట్లు కనఁబడుచున్నది. ౧౧-వ ఏప్రిలు తేదీని పాఠశాలలో జరిగిన యుపాధ్యాయులసభలో, ప్రతి యుపాధ్యాయునిపనియు నెక్కువ చేయవలె నని క్లార్కుదొరయానతి యయ్యె నని ప్రకటింపఁబడెను.

౧౮-వ ఏప్రిలు తేదీని నాకు తమ్ముఁడు కృష్ణయ్య వ్రాసిన జాబులో, ఆనెలలోనే తన ద్వితీయవివాహము చేయవలె నని మాతలిదండ్రులు సంకల్పించి, మంచి వరదక్షిణకొఱకుఁ బ్రయత్నించుచుండి రని యుండెను! నామాట మావాండ్రు ధిక్కరించి రనియు, ఇట్టి యకృత్యములవలన కుటుంబమున కపకీర్తి వాటిల్లు ననియును, నేను మిగుల వగచితిని.

౧౭-వ ఏప్రిలు తేదీని నాదినచర్య పుస్తకమునం దిట్లున్నది:—
" భార్యసానుభూతి లేనికారణమున బ్రాహ్మమతస్వీకారము చేయవలె

ననెడియాశ నామనస్సున నణఁగిపోవుచున్నది. ఎంతకాలము నేను సంఘమువారి భయముచే నిట్లు కృంగిపోవలెను? నేను బ్రాహ్మసామాజికుఁడనై, భగవత్సేవ చేయుచు, అంతరాత్మయాదేశములచొప్పున జీవితము నడపుకొనవలె నని నాయుత్కృష్టాశయము. దీనికిఁ బ్రబల విఘాతము గలుగుచున్నది! ”

౧౯-వ ఏప్రిలున వెంకటరామయ్య బెజవాడ వచ్చెను. భార్య పోయిన నెలలోనే తమ్మునికిఁ బెండ్లి తలపెట్టితివేమని నేను వానిని చీవాట్లు పెట్టినను, పెద్దవారల నిర్ధారణమునకు పిన్నవారలను నిందించుట న్యాయము కాదని నేను గ్రహించి, పిమ్మట విచారించితిని. నా కోరికమీఁద వెంకటరామయ్య తాను బెజవాడ వచ్చి యిచటనే న్యాయవాదిగ నుందు నని చెప్పెను. ౨౬-వ తేదీని అతఁడు రాజమండ్రి వెడలిపోయెను.

కొన్ని దినములకు నాకీ క్రిందియుత్తరము మా తండ్రిగారి యొద్దనుండి వచ్చెను.

“ శ్రీరాములు. చిరంజీవులయిన మాకుమాళ్లు రాయసం వెంకటశివుడును సుబ్బారాయుడు చిరాయువులుగాను దీవిస్తిమి——

“ వెంకట్రామయ్యవల్ల అన్నిసంగతులున్ను తెలిశ్నివి. కృష్ణయ్యవివాహమునుగురించి యిదివరక్కు ౧౦-౧౫ సంబంధములు వచ్చినవి. మనకు అనుకూలం లేనివారితో ప్రస్తుతం తలంపులేదని చెప్పినాము. కొంన్నిసంబంధములు తిర్గిపోయి మరివకర్కి ఏర్పర్చుకుంన్నారు. రెండుమూడు రోజులకిందట తాంన్యాడ గంగరాజుగారివద్దనుంచ్చి వకసంబంధం రాబడినది. వారు చాలా మర్యాదస్తులు. పిల్ల ౧౧ సంవత్సరములు కలదై బహు మంచిదనింన్ని, ముఖ్యంగా

ఈచిన్నదాన్ని కృష్ణయ్యకు యివ్వడంకు గంగరాజు శెలవుప్రకారం తాను నరసాపురంనుంచి వచ్చినా ననిన్ని, యేవిధమయ్ని లోట్లా లేకుండా యెక్కడ వివాహం చాయమంటే అక్కడ వివాహం చేస్తామనిన్ని, శీఘ్రంగా రోజులలో జర్గవలశియుంటుం దనిన్ని చెప్పినాడు. కాబట్టి వ్రాశేది యేమంటే, యీసంబంధం చేసుకోవడ ముకు మీఅప్పకున్ను నాకున్ను కోరిక కలిగియున్నది. దయనీక రాజీకములచాత ఈ సం॥రం కృష్ణయ్య పరీక్ష ప్యాసైనా కాక పోయినా, యీకార్యం అయివుంటే మంచిది. మనం చివర్కు ధవ ళేశ్వరంలో చాయమన్నప్పటికీ, చాయతల్చుకునియున్నారు. మనం వప్పుకుని అంగీకరించి ఉత్తరం వ్రాశినట్టుగానే, ముహూర్తం పెట్టి స్తిరపరుస్తున్నారు. నీవు ౫, ౬ రోజులలో యిక్కడికి వచ్చి ౧౦-౧౫ రోజులలోపల ఈవివాహం చేయించి, తరువాత వెంటనే వెంక ట్రామయ్య నీవున్ను బెజవాడ వెళ్లవచ్చును. * * * * *

" మనకు శ్రమలేకుండా పిల్లవానికి వివాహం తటస్తమయి నప్పుడు మానివేశి, తటస్తం కానప్పుడు ప్రయత్నం చాయడం యింత్త కంటె లోపం లేదు. ఈపిల్ల రెండుమూడుసంవత్సరములకు గాని కాపరముకు రాదు. అప్పట్కి కృష్ణయ్యకు కొన్ని పరీక్షలు కాబ డును. కృష్ణయ్యకు యిస్తామని వచ్చిన సంబంధముల పిల్లలకు, మేము వప్పుకోనివాళ్లకు ౧, ౨ కి ధవళేశ్వరంలో ౪ రోజులు యీలోగా వివాహములు కాబడ్డవి. గనుక అన్ని సంబంధములున్ను కూడా యిదేప్రకారం దాటిపోగలవు. యీకార్యం అయ్ని తరువాత యింత్త తొందరకార్యములు తక్కినవి కావు. గనుక యీవుత్తరం అందిన వెంటనే నీ జవాబు పంప్పిస్తే, నరసాపురం గంగరాజుగారి యిలాకా వారితో మాట్లాడి ముహూర్త నిర్ణయం యేర్పరుస్తున్నాము. యీ

కార్యం చాయకుండా వుంటే మాత్రం మనకు లాభం లేదు. చేశినందు వల్ల వచ్చే లుగసాను లేదు. కార్యం కావడం చాలా విశేషమై యున్నది.

రా. సుబ్బారాయుడు."

ఈ పైయుత్తరమునకు నే నేమి సమాధాన మిచ్చితినో నాకు జ్ఞప్తి లేదు. వేసవి సెలవులలో నేను రాజమండ్రి వచ్చినప్పుడు, అందఱమును గలసి మాటాడుకొని నిశ్చయింపవచ్చునని నేను వ్రాసి యుంటిని. కృష్ణమూర్తి ద్వితీయవివాహము వెంటనే చేయవలె ననియు, నర్సాపురపు సంబంధమే నిశ్చయింపవలెననియు, మా తలి దండ్రుల దృఢసంకల్ప మని పై లేఖవలన స్పష్టము కాఁగలదు.

## ౨౫. ఇంటితగవులు, మండల సభలు

ఈ సమయమున మేము నివసించెడి బెజవాడ యింటిని గుఱించి కొంత వివాదము కలిగెను. నేను చెన్నపురి వెళ్లి పోవునపుడు, ఆయింటిని రెండవభాగమున నుండిన రామస్వామి శాస్త్రిగారి వశముఁ జేసితిని. కాని, మరల నిచ్చటికి వచ్చుటకు స్థిర పఱుచుకొనిన వెంటనే, ఇల్లెవ్వరికి నీయవల దని వారికి వ్రాసివేసి తిని. ఈలోపుగ నాయన యింటిలోని కొంతభాగమును సుబ్బారా యుఁడుగారి కిచ్చినను, నేను జెన్నపురినుండి వచ్చినతోడనే, నాభా గము నాకు వదలివేసిరి. కాని, యంతకంతకు నాకును శాస్త్రిగారికిని అభిప్రాయభేదము లేర్పడెను. దీనికిఁ గారణము, ఆఁడువారల కలహ ములే! మా బంగాళాలో నిపుడు నివసించు నారీమణుల సంఖ్య మూఁడు, వేర్పడిన కక్షలు రెండు! ఒక కక్షలో చిన్నవారలగు నా

భార్యయు, సుబ్బారాయఁడుగారి పత్నియును. విశాలాక్షమ్మ రెండవ కక్షిదారురాలు. పెద్దలకు చిన్నలకును ఆశయములందును, అభిప్రాయములందును భేదము లుండుట స్వాభావికము. చిన్నవార లిరువురును సతతము తనమీఁద చాడీలు చెప్పుకొనుచుందురని విశాలాక్షమ్మయలుకు! "కలహకంఠీ!"యని యీ పెద్దముత్తయిదువ వెంకమ్మ గారి ననుచుండఁగ చెవులఁబడి నే నొకనాఁడు నవ్వుకొంటిని. సుబ్బారాయఁడుగారి భార్య వెంకమ్మగారికిఁ జఱువు రాదు. "చూచితివమ్మా! నన్ను 'కలాలకంటే' అని యీముసలవ్వ తిట్టుచున్నది" అని వెంకమ్మగారు రత్నమ్మగారితో ఫిర్యాదు! అంత చిన్న లిద్దఱును సమ్మెకట్టి, ముసలమ్మతో మాటాడ మానివేసిరి.

చిన్నమ్మలను జూచి పెద్దమ్మ సదా మోము ముడుచుకొని యుండెడిది!

ఆఁడువారి మనస్పర్ధలు మెల్లమెల్లగ మగవారల కెగఁబ్రాఁకెను! శాస్త్రిగారిని ఏలూరునుండి రప్పించి, వారికా పాఠశాలలో నుపాధ్యాయునిపని నేనె యిప్పించితిని. మా కిరువురకును స్నేహమే. ఇరువురికిని మిత్రులొకబృందమువారే. అద్దెలో చాలభాగము నేనె యిచ్చుచుండువాఁడను. స్త్రీలవైరము లడఁచుట యసాధ్యమని నేనిపుడు గ్రహించి, తా మింకొకయిల్లు చూచుకొనెదరా యని నేను శాస్త్రి నొకనాఁ డడిగితిని. దీని కాయన కోపించి, తాను గదల ననియు, వలసినచో నేనె యిల్లు విడిచిపోవచ్చు ననియును జెప్పివేసి, నన్నాశ్చర్యమున ముంచిరి! ఈయింటికే కాదు, ఊరికిని ఉద్యోగమునకును నా యాహ్వానముమీఁదనే వచ్చినశాస్త్రి నా కీజవాబిచ్చుటకు నేను జిఱబిఱలాడితిని!

ఇంటియజమాని మద్రాసులో నుండెను. ఆయనబంధు వొకఁడు బెజవాడలో మాయొద్దనుండి యద్దె వసూలుచేయుచుండువాఁడు. ఈ తగవు పరిష్కరింపుఁడని యాయుభయులను నే నిపుడు కోరితిని. బాడుగ నిచ్చుటకు నేనె యుత్తరవాది నని పలికి నన్నాయింట నుండుఁడని వారు చెప్పివేసిరి.

ఇప్పుడైనను శాస్త్రిమనసు మాఱలేదు. తనకు వేఱొకయిల్లు కుదురుటకు కొన్నినెలలు పట్టు ననియు, అంతవఱకుఁ దా నిచటనే యుండు ననియును, ఆయన చెప్పివేసెను! అంత యుభయుల మిత్రులగు రాజారావు సాంబమూర్తిగార్లతో నేనీ సంగతి చెప్పితిని. వారి హితవచనము లాలకించి, ఎట్టకేలకు శాస్త్రి యిల్లు వదలి పోయెను.

౧౮౯౮ సంవత్సరము వేసవిసెలవులలోఁ గొంత యాలస్యముగ మేము రాజమంద్రి పోయితిమి. దీనికిఁ గారణము, 'విద్యాసాగర, ముద్రాక్షరశాలలో నా "జనానా పత్రిక" సకాలమున నచ్చుపడకుండుటయే. వీరభద్రరావుగారు సొమ్మునుసబెంచిన చిక్కులు తీర్చుకొనుటకు తఱచుగ ఏలూరు పోవుచుండువారు. అందువలన బెజవాడలోని వారిముద్రాలయమున పని సరిగా జరుగుచుండెడిదిగాదు. పాఠశాలలో పని, పత్రికపనియును భారమైన నేను, ఎప్పుడోగాని క్రొత్తపేటలోని యీ ముద్రాలయకార్యములను బరిశీలింపఁ బోలేకుండెడివాఁడను!

౨౦-వ మేయి తేదీని, ఆనెల జనానాపత్రిక చందాదారులకుఁ బంపి, కొందఱు స్నేహితులతోఁ గలసి సాయంకాలమునకు గుంటూరు వెళ్లితిని. అచట కృష్ణామండలసభలు జరుగుచుండెను. రెయిలులో

మిత్రులగు దాసు శ్రీరాములుపంతులుగారిని గలిసికొని, మఱునాఁటి సంస్కరణసభాకార్యక్రమమునుగుఱించి మాటాడితిని. సభల కేతెంచిన ప్రాంతనేస్తులు గుంటూరులోఁ బలువురు గానఁబడిరి. మద్దిరాల రామమూర్తిగారును వచ్చియుండిరి. ఆకాలమున గుంటూరుపురము పూర్వాచారపరాయణత్వమునకు ప్రసిద్ధి నొందెను. కావున వితంతూద్వాహములనుగుఱించిన తీర్మానము సభలోఁ గావించుటకు గుంటూరువారి కిష్టము లేదు.

రాజకీయ సంస్కరణసభలకు మిత్రులు వెంకటరత్నము నాయఁడుగారే యధ్యక్షులు. ౨౧-వ తేదీని జరిగిన సాంఘికవిషయ నిర్ధారణసభ కెటులో వితంతూద్వాహవిషయకమగు తీర్మానమును అంగీకృతముఁ జేసితిమి. మధ్యాహ్నము జరిగిన ముఖ్య సభలో నేను స్త్రీవిద్యను గుఱించిన తీర్మానమును ప్రతిపాదించితిని. నా యుపన్యాసానంతరమున అధ్యక్షులగు నాయఁడుగారు లేచి, నేను ప్రచురించెడి "జనానా పత్రికను" స్త్రీవిద్యాభిమాను లందఱును దెప్పించుకొనుట కర్తవ్య మని నొక్కి వక్కాణించిరి. ఇందుకు వారియెడల కృతజ్ఞుఁడనే కాని, నాకోరికమీఁద వా రిట్లు చెప్పిరని జను లనుకొందురేమో యని నేను సిగ్గుపడితిని!

అతిబాల్యవివాహ నిరసనమును గుఱించిన తీర్మానమునకు పలువురు విరోధు లేర్పడిరి. ప్రభుత్వమువారు వివాహవిషయమున వయోనిర్ణయము చేయుటకే పలువురు సమ్మతింపకుండిరి. కావున పండ్రెండేండ్ల యీడురాని బాలికలకు వివాహము చేయరా దను తీర్మానమున కనేక సవరణలు వచ్చెను. వయోనిర్ణయము ౧౧ సంవత్సరములకుండవలయునని యొకరును, ౧౦ సంవత్సరముల కని యొకరును, అడ్డు తీర్మానములు తెచ్చి, సభాకార్యక్రమమును నవ్వులాటలోనికి

దింపిరి. అంత మా ప్రార్థనమీఁద దాసు శ్రీరాములుగారు సభావేదిక నెక్కి, తాము ధర్మశాస్త్రములు సాంగముగఁ జదివితిమనియు, అసలు తీర్మానమున కడ్డుపెట్టువారు జాతిద్రోహులు శాస్త్రద్రోహులు నని గంభీరస్వరమున నుపన్యసించిరి! దీని పర్యవసానము, మొదటిసవరణ కొనివచ్చిన పండితంమన్యుఁడు సభనుండి నిశ్శబ్దముగ నిష్క్రమించెను! తీర్మాన మేకగ్రీవముగ నామోదింపఁబడెను! నాఁడు వ్యవధానము లేకపోవుటచేతను, మరల భిన్నాభిప్రాయములతో సభ చీలిపోవు నను భయమునను, నాయఁడుగారు కార్యప్రణాళికనుండి వితంతూద్వాహమును గుఱించిన తీర్మానమును దీసివైచిరి. వారి యంత్యోపన్యాసము హృదయరంజకముగ నుండెను. ఈనాఁడే సుప్రసిద్ధరాజకీయవేత్తయగు గ్లాడుస్టనుగారు చనిపోయి రని తెలిసెను.

మఱునాఁడు (౨౨, ఆదివారము) సంస్కృతపాఠశాలలో ప్రార్థన జరిపితిమి. ఇదియే గుంటూరు పుర ప్రార్థన సమాజ జననకాలము. మిత్రులతోఁ గూడి నేను బెజవాడ తిరిగివచ్చితిని. బెజవాడలో సంఘసంస్కరణ సమాజస్థాపనము యుక్తమని మాకుఁదోఁచి, ౨౩-వ తేదీని యొకసభ చేసితిమి. పదునొక్క సభ్యులతోను, ఒక యభిమానితోను బెజవాడ "సంఘసంస్కరణ సమాజము" నెలకొల్పఁబడెను. దానికి శ్రీవేమవరపు రామదాసుపంతులుగారిని కార్యదర్శిగ నెన్నుకొంటిమి.

## ౨౬. తమ్ముని వివాహము

ఇంటిలోని విలువగల వస్తువులను శిష్యుఁడు వెంకయ్య గదిలో నుంచి, మేము ౨౫-వ మేయిరాత్రి బయలుదేఱి మఱునాఁటి ప్రొద్దునకు రాజమండ్రి చేరితిమి. తలిదండ్రులను తమ్ముఁ జెల్లెండ్రను

జూచి సంతోషించితిని. సాయంకాలము పాపయ్యగారిని జూచి వచ్చితిని. వారి కొమార్తెను మాతమ్మునికిఁ జేసికొనవలె నని నా కెంతో మక్కువ గలదు. కాని మా యుభయ కుటుంబముల ప్రవరలకును విశ్వామిత్రఋషి కలసి యీ కార్యమున కడ్డుపడెనని యాయన చెప్పెను. ఆ సంబంధమును వదలివేసి, మఱియొక్కటి మే మప్పుడు వెదకితిమి.

నా "జనానాపత్రిక"ను ఆంధ్రదేశమందలి తమ బాలికాపాఠశాలల కన్నిటికిని దొరతనమువారు తెప్పించుకొనెడివారు. పత్రికలో ౧౬ పుటలుమాత్రమే యుండుటచేత, తగినన్ని వ్యాసము లందుఁ బ్రచురింప సాధ్య మయ్యెడిదికాదు. కావున నీ జూలై నెలనుండి యును చందా రెట్టింపుచేసి, పత్రిక విస్తీర్ణమును ద్విగుణీకృతము చేయ నిర్ధారణచేసికొని, ఈసంగతిని ప్రభుత్వపరీక్షాధికారులకిఁ దెలియఁబఱచితిని. దీనినిగుఱించి తమ యభిప్రాయ మేమని యామె యడుగఁగా, నామిత్రులును బళ్లారి సహాయపరీక్షాధికారియు నగు శ్రీ పి. రామానుజాచార్యులవారు తమ పరిపూర్ణానుమోదమును జూపిరి. కాని, రాజమండ్రి మండలోద్యోగియగు స్వామిరావుగారు ప్రత్యుత్తరము వ్రాయుచు, చందా యెక్కువచేయ వచ్చును గాని, పత్రికలో సంస్కరణవిషయములు ప్రకటింపఁగూడదని నుడివిరి. వారి వ్రాఁత యసమంజసము నప్రస్తుతము నని నేను దలంచితిని! నేను సంఘసంస్కరణాభిమాని నైనను, వితంతూద్వాహములు సలుపవలె నని పత్రికలోఁ జాటుచుండుట లేదు. అపుడపుడు సంస్కరణమును గూర్చిన సంగ్రహవార్తలు మాత్రమే ముద్రించుచుంటిని. స్వామిరావుగారి హ్రస్వదృష్టికి! నాకాశ్చర్యాగ్రహములు గలిగెను. ఈవిషయమై నాకు పరీక్షాధికారిణి బ్రాండరుసతి వ్రాసిన లేఖకు

నేను ప్రత్యుత్తర మిచ్చుచు, విద్యాధికులలోఁ గొందఱు సంకుచితభావమున సంస్కరణవిషయమై యామెకుఁ దెలిపెడి సంగతు లామె విశ్వసింపఁగూడ దని వ్రాసివేసితిని! పత్రికలోని మార్పునకు దొరతనమువా రంతట సమ్మతించిరి.

నేను రాజమంద్రిలో నుండు దినములలోఁ దఱచుగ పురమందిరము పోయి, పత్రికలు చదువుచుండువాఁడను. "ఇంగ్లీషువారి సంసారపద్ధతులు" అను శీర్షికతో నొక యాంగ్లస్త్రీ వ్రాసిన వ్యాసములు హృద్యములుగ నుండెను.

నే నెచట నుండినను, నాకు పత్రికావ్యాసరచనమునుండి మాత్రము విరామము లేకుండెను! ఆనెల జనానాపత్రికకు వ్యాసములు వ్రాయుచు, నేను తమ్ముఁడును జూన్ ౮-వ తేది యంతయుఁ గడపితిమి. మఱునాఁడు మద్రాసునందలి "ఫెల్లోవర్కరు" పత్రికకొక చిన్న యాంగ్లవ్యాసము వ్రాసి పంపితిని.

మా తమ్ముఁడు కృష్ణమూర్తి కిపుడు వచ్చిన యొకటి రెండు సంబంధములకు మే మంగీకరింప లేదు. మేయి 30-వ తేదీని మా నాయనయు, కృష్ణయ్యయును వివాహసంబంధ నిశ్చయమునకై కాళ్ళ గ్రామము వెళ్లి, నాల్గవ జూను తేదీని రాజమంద్రి తిరిగివచ్చిరి. అచటి సంబంధమే తమకు నచ్చె ననియును, పెండ్లి ౯ రోజులలో జరుగు ననియును వారు చెప్పిరి. ౧౨-వ జూనున మే మందఱము బండ్లమీఁద భవశేశ్వరము వెళ్లి, అచ్చట మాతోడియల్లుఁడు పోడూరి కృష్ణమూర్తి గారియింట బస చేసితిమి. పెండ్లికూఁతునివారు సత్రములో దిగిరి. జనార్దనస్వామి యాలయములో ప్రాతఃకాలముననే వివాహము జరిగెను. పెండ్లికూఁతుని కను లొకించుక తెలుపైనను సౌందర్యవతియె

యని చూప దనుకొంటిని. మా తలిదండ్రులు సాయంకాలమునకు రాజమండ్రి వెడలిపోయిరి. నేను, సోదరులు, మిత్రులును ఆదినమున ధవళేశ్వరములో నిలిచి, ఆనకట్ట మున్నగు దృశ్యములు చూచి వచ్చితిమి. మఱునాఁటి ప్రొద్దున పెండ్లినా దంపతిని రాజమండ్రియందలి మా యింటికి గృహప్రవేశమునకుఁ గొనివచ్చితిమి.

౧౫-వ జూను సాయంకాలమున పురమందిరమున ప్రత్యేక ప్రార్థనసమాజసభ యొకటి జరిగెను. "సత్యసంవర్ధని" పత్రిక యిఁక ముందు నా యాజమాన్యమున బెజవాడలో ముద్రణమై, రాజమండ్రిలో ప్రచురింపఁబడునట్లుగ తీర్మానమయ్యెను!

అంత మేము బెజవాడ వెడలిపోవలసిన తరుణము వచ్చెను. నా భార్య మాతో రాలేకపోయెను. అందువలన, నాకును చిన్నతమ్ముఁడు సూర్యనారాయణకును బెజవాడలో భోజనసౌకర్య మొనఁగూర్చుటకై, మా చిన్నప్ప మాతో వచ్చెను. ౨౦ వ తేదీని మేము బెజవాడ చేరి, వీరభద్రరావుగారిని గలసికొంటిమి. తన చిన్నకుమారుఁ డిటీవల చనిపోవుటచేత, ఆయన దుఃఖతోయములఁ దోఁగియుండిరి.

## ౨౭. ప్రహసనవిమర్శనము

మరల బెజవాడపాఠశాలలోఁ జేరి నా కార్యక్రమమును జరుపుకొనుచుంటిని. ప్రార్థనసమాజసభలు నితరసంస్థలును యథాప్రకారముగ నేసాగుచుండెను. జూన్ ౨౬-వ తేదీని జరిగిన ప్రార్థనసభలో నేను భాగవతమునుండి కొన్ని పద్యములు చదివి, వాని సారమునుగూర్చి ప్రసంగించితిని. ప్రార్థనసమయమున తమ్ముఁడు సూర్యనారాయణను సద్దు చేయవలదని వారించితిని. ఆరోజునసాయంకాలమునందు ప్రాంత

వలసిన ముఖ్యలక్షణములు, దీనికి లేకపోలేదు. ముందలి సంపుటముల యందు పాఠకులకు రుచి కలిగించుటకొఱకై యీ గ్రంథమున నతికొన్ని నా పంతులుగారి ప్రహసనములు ముద్రితములయ్యెను. గ్రంథకర్తకు స్థిరకీర్తి నాపాదించిన వారి హాస్యరసయుక్తసంభాషణా ప్రహసనము లిందుఁ గలవు. 'శకునములుఁ' 'మూఢభార్య-మంచిమగఁడు' – 'ఆచారము', 'పెళ్లి వెళ్లినతరువాత పెద్దపెళ్లి', 'బాలభార్య—వృద్ధ భర్తల సంవాదము', 'హిందూమతసభ,' మున్నగు నీచిన్న చిన్న ప్రహసనముల చవిగాంచనివా రెవరు గలరు? ప్రకృతాంధ్రవచనమునకువలెనే, ప్రహసనరచనమునకును వీరేశలింగకవియే సృష్టికర్త! ఇందలి హాస్యసంభాషణముల కీయన యిచ్చిన "హాస్యసంజీవని" యను పేరే తెలుఁగున ప్రహసనమునకుఁ బర్యాయపద మయ్యెను. బాలవృద్ధులకును పండిత పామరులకును,—ఎల్లరికి నీరచనలు 'కరకర మని' రుచికరముగ నున్నయవి!

"ఈ ప్రహసనము లన్నియు గత ౨౫ సంవత్సరములలోఁ వ్రాయఁబడినవి. ఇవి బాలురు చదివి వినోదింతురు. పెద్దవారు గ్రహించి మెచ్చుకొందురు. సంఘసంస్కరణవిషయములనుగూర్చి యిందు చర్చలు గలవు. ఈ సంస్కర్తకు సంఘముతోడి సంరంభ మారంభమయినప్పుడు, మనలోఁ బలువురు చిన్నవారలుగ నుండిరి; కొందఱు జననమే కాలేదు. సంస్కారవిముఖమగు సంఘముతో నీవీరుఁ డొంటరిగ సమరము సాగించిన వీరి పూర్వకాలపుటపారపరిశ్రమమును, సభలు చర్చలు ప్రసంగములును ప్రబలినయీప్రశాంతసమయమున మనము సమగ్రముగ గ్రహింపక నేరకపోవచ్చును. ఆకాలమున ప్రసంగములును బహిరంగసభలును నిషిద్ధములు! దుర్నీతి, వ్యభిచారము, మూఢవిశ్వాసములును గౌరవాస్పదమైన యాకాలమున నీశూరుఁడు దౌష్ట్యమును ఖండించి

వైచెను. మతాచార్యులయాంక్షల వీరు లెక్కసేయలేదు. కలమే వీరి ఖడ్గము! తమపలుకు క్రియారూపము దాల్చుపట్ల నీశూరుఁడు గొంక లేదు. సందియమనుమాట నీతఁ డెఱుంగకయె, సమరము సాగించెను. ఇట్టివాఁడేకదా, నిజమైన శూరుఁడు!

“ప్రకృతమున సంస్కారవేత్తలకు దుస్సాధ్యమగు కార్యముల నీవీరుఁ డానాఁడు ఒక్కరుఁడే సాధించెను. ఇట్టి క్రియాశూరుఁ డయ్యును వీరేశలింగముపంతులు హాస్యరసార్ద్రమగు మనస్తత్త్వముగల వాఁడు. ఇదిగాక పామరజనులతో మెలంగవలసినవాఁడు గావున, ప్రహసన మాయన కరముల కుచితపరికర మయ్యెను. శైలిసొంపులతోను, హాస్యంపుఁజలుకులతోను శోభిల్లెడి యీ ప్రహసనావళియందు, “దుష్టాంగమును ఖండించి శేషాంగస్ఫూర్తికి రక్షచేయు చికిత్సకునివలె” నీ రచయిత, సాంఘికానర్థముల నణుమాడెను! ప్రభుత్వోద్యోగి యొకఁడు లంచము పుచ్చుకొనినను, పెద్దమనుష్యుఁ డొకఁడు వేశ్య నాదరించినను, ఆసంగతి యీ వారపు “వివేకవర్ధని” వెక్కిరింపవలసినదే! వ్యక్తులమనసులు నొచ్చిన నొవ్వనిండు, వ్యాజ్యముల కెడమిచ్చిన నెడమీయనిండు, వీరేశలింగముపంతులు, సంఘమువారి చిన్నబాధలు లెక్కగొనక, తన విధ్యుక్తకార్యములను మోమోటములేక నెఱవేర్పవలసినదియే!

“తమిళపత్రికలు సంఘసంస్కరణమున కంతగ సుముఖములు గావని కొందఱితలంపు. దీనిలో సత్యము లేకపోలేదు. ఏదేశమునఁగాని భాషకు భావమునకును గొంత యానుగుణ్య మేర్పడకతప్పదు. ప్రకృతాంధ్రసారస్వతము సంఘసంస్కారప్రచారమునకు సహాయకారియె యని చెప్పవచ్చును. తెలుఁగుపత్రికలు పుస్తకములును సామాన్యముగ సంఘసంస్కరణానుకూలములె. ఆంధ్రసారస్వతమునకును, ఆంధ్రజనుల

లో సంఘసంస్కరణానుమోదమునకును నిట్టి సమ్మోళన మొనఁగూ ర్చినప్రతిష్ఠ, ఆంధ్రకవిశేఖరుఁడగు వీరేశలింగముపంతులకే ముఖ్యముగఁ జెందవలయును.

“ఆంధ్రజనులు, తమ కిష్ట మున్నను లేకున్నను, వీరేశలింగము పంతుల తలంపులే తలంచుచున్నారు. వారిపలుకులే పలుకుచున్నారు. కొలఁది కాలములో వారికార్యములే యాచరించెద రని మాయాశయ ము. ఇది భగవదుద్దేశము. లూథరు మహాసంస్కర్తను వెక్కిరించిన సమకాలికు లందఱు సమాధులలోని కెక్కినను, వారిసంతతివారే లూథ రునికి స్మారకచిహ్నముగ మహాసౌధనిర్మాణము చేసిరి. వీరేశలింగ వ్యక్తియొక్క యూహలు పలుకులు పదములును శక్తిమంతము లైనను, ఆయనక్రియలే మనకు ముఖ్యములు. మనము ధన్యులము కాఁగోరితి మేని, యీ మహాశయుని బోధనలు విని, పలుకులు మననముచేసి, కార్యముల ననుకరింపవలయును”

## ౨౮. “హిందూసుందరీమణులు”

౧౯౦౯-వ సంవత్సరము మార్చి ౨౭-వ తేదీ శనివారము నేను ౪, ౕ తరగతుల విద్యార్థులకు పరీక్షలు చేసితిని. ఒకపిల్లవాఁడు ప్రశ్నకాకితములకు త్తరువులు వ్రాయుచున్నవానివలె నటించి, పరీక్షా సమయమున నేదో పుస్తకపుఁ బుటలు తిరుగవేయుచుండెను. నే నట్టె చూడఁగ, అది “కళాశాస్త్రము”! నే నా పుస్తకమును దీసికొని, ఈ సంగతిని విచారించి విద్యార్థినిఁ దగినట్టుగ శిక్షింపుఁ డని యచట నిలు చుండిన ప్రథమోపాధ్యాయునిఁ గోరితిని. ఆ పిల్లవానినిగుఱించి మిగుల విషాదమందితిని. విద్యార్థులకు నీతిబోధనము చేయుట కొక సమాజ ముండుట యావశ్యకమని తలంచితిని.

## ౩౮. "హిందూ సుందరీమణులు"

పదిదినములు గడచిపోయెను. ప్రథమోపాధ్యాయుని కీవిషయమునఁ జీమకుట్టదయ్యెను! అంతట ౩౮-వ తేదీని గూడిన యుపాధ్యాయసభలో నే నీసంగతిని బ్రస్తావించి, పాఠశాలాధ్యక్షుని వైఖరిని గర్హించితిని. అతఁడు కుపితుఁడై విద్యార్థి చేష్టను సమర్థింపఁబూని, తనకా కళాశాస్త్రపుస్తకమును నే నీయకుండుటయే, దీనినిగుఱించిన కాలహరణమునకుఁ గారణ మని సాకు చెప్పెను. నా కతితీవ్రమైన కోపము వచ్చెను. నాఁడు పిల్లవానిని నేనే శిక్షించి యుందు ననియును, పైయధికారియగు తా నచట నుండుటవలన, తనమీఁది గౌరవభావము చేత నే నే నీసంగతి తనవిచారణ కొప్పగించితి ననియును, నేను బలికితిని. తాను బ్రహ్మచారి యగుటచేత స్త్రీల గోప్యాంగవర్ణనాదికము గల యిట్టిపుస్తకము నేను తన కీయలే దనియు, ఇప్పుడైన నీయఁజాల ననియు, విద్యార్థిశిక్షనుగుఱించి తా నింక నుపేక్ష చేసినచో, పాఠశాలాధికారి కీసంగతి విన్నవించుట నావిధి యనియును నేను గట్టిగఁ జెప్పివేసితిని!

నామాటలకు ప్రథమోపాధ్యాయుఁ డుగ్రుఁడయ్యెను. కాని, నాతీవ్రప్రసంగఫలితముగనే యాతఁ డీవిషయమునఁ దనవిధ్యుక్తము నెఱవేర్ప నంగీకరించెను. మఱునాఁడు విద్యార్థు లందఱియెదుటను, ఆ బాలకుని నిలువఁబెట్టి, ప్రథమోపాధ్యాయుఁడు శిక్షించెను. ఈదురభ్యాసమునకులోనగు విద్యార్థిశిక్ష ఉపాధ్యాయు లందఱికిని సమ్మతమె కాని, యిట్టిపనులు విద్యార్థులు బహిరంగముగ జరుపుటయందలి రహస్య మొకింత యారయుట యగత్య మనియె వారలమొఱ! ఇచటి ప్రథమోపాధ్యాయుఁడు మున్నగు కొందఱు ఉపాధ్యాయుల శోచనీయమగు చర్యలె దీనికిఁ గారణ మని యందఱికిని దెలిసియుండెను. "అత్తపనుల కారడులు లేవు." పూతచారిత్రుఁడగు క్రీస్తుమహాశయుని

మతప్రచారమే ముఖ్యోద్దేశముగఁగల యిట్టివిద్యాలయములలో, నీతి విషయమున మంచిపేరు లేని బోధకుల నియమించెడి యధికారుల నేమనవచ్చును!

నా కాకాలమున వ్రాఁతపనియం దెంతో యాసక్తి. ఒకొక్కప్పుడు రాత్రి రెండుజాములకే నాకు మెలఁకువవచ్చి పిమ్మట మరల నిద్దుర పట్టకుండెడిది. ఊరక మంచము నంటిపట్టుకొని యుండనోల్లక, నే నంతఁ గలము చేతఁబట్టి, దీపముదగ్గఱఁ గూర్చుండువాఁడను. 'జనానాపత్రిక'కు సంపాదకుఁడ నగుటచేత, ఆపత్రిక కేదో సదా వ్రాయుచుండువాఁడను. 'సత్యసంవర్ధనీ', 'ఫెల్లోవర్కరు', 'మద్రాసుస్టాండర్డు' పత్రికలకును, ఆంగ్లవ్యాసములు వ్రాయుచుండువాఁడను. కాని, వీనియన్నిటికంటె "సంఘసంస్కారిణీ" పత్రికకు వ్రాయుటయందు నాకు మిగుల మక్కువ. నాకుఁ బ్రియములగు సంస్కరణములను గూర్చి నా యిచ్చవచ్చినచొప్పున నింగ్లీషున వ్రాసి, యారచనముల నాపత్రికకుఁ బంపుచుండువాఁడను. ఆపత్రికకు వ్రాయఁ గేలఁగలము పూనఁగనే, ఉత్సాహోద్రేకములు నాకుఁ గలిగి, పొంకమగు పదజాలముతో నొప్పెడి వాక్యములదొంతరలు కాకితముమీఁద దొరలుచుండెడివి! రానురాను మృదుహాస్యరసయుక్తమగు వ్యాసరచన మాంగ్లమున నాకభ్యాసమయ్యెను. వ్రాయఁగోలఁది నాకలమునకుఁ దీవ్రగమనమును లభించెను.

ఒకొక్కప్పుడు, ఆంధ్రరచనముకూడ నా కుత్సాహకరముగ నుండెడిది. కాని, యింగ్లీషునవలెఁ దెలుఁగున వ్రాయునపుడు, సామాన్యముగ నేను స్వతంత్రముగ నాలోచింప నక్కఱలేదు. మాతృక లగు నాంగ్లపుస్తకములు, పత్రికలును నా కీసందర్భములం దాధారములు. వానినుండి భాషాంతరముచేయుటయే తెలుఁగున నా ముఖ్యకార్యము.

## ౨౮. హిందూ సుందరీమణులు

ఇపుడీ జూలై నుండియు నేను "జనానాపత్రిక"ను పొడిగించిన హేతువున నెక్కువగఁ దెలుఁగున వ్రాయవలసివచ్చెను. వెంటనే పుస్తకరూపమునఁ గొన్ని ప్రతులు తీయుట కనువుగ నుండు గ్రంథ మేదైన నారంభించుట యుక్త మని నాకుఁ దోఁచెను. తాత్కాలికోపయోగమునకై పత్రికలకు వ్యాసములు వ్రాయుట వ్యర్థకాలక్షేపము. అట్టి వ్యాసములు చదువరుల కెపుడు నుపయుక్తమై రుచించునట్టివిగ నుండవు. కావున స్థిరరూపము తాల్చు పుస్తకరచనమునకే నే నిపుడు పూనితిని. ఈ యొకపనిమూలమున, పత్రికాప్రచురణ పుస్తకముద్రణము లను రెండుకార్యములు నేను సాధింపవచ్చును.

"జనానాపత్రిక"లో నిదివఱకు స్నేహితులపుస్తకము లీకీతిని ప్రచురింపఁబడినవియె. "గృహనిర్వాహకత్వము" అను పుస్తకము నివ్విధముననే నా పత్రికలోఁ బ్రచురించితిని. స్త్రీల కుద్దేశింపఁబడిన పత్రికలో భారతదేశమున నిదివఱకుఁ బ్రసిద్ధినొందిన పుణ్యాంగనలకథ లుండుట సమంజసముగదా. ఈ మేయినెల సంచికలోనే "శకుంతల" కథను వ్రాసితిని. ఇపుడు జూలై నుండియు "సీత" చరిత్రమును వ్రాసి ప్రచురించితిని. పిమ్మట 'సావిత్రి' మున్నగు స్త్రీలకథలు వ్రాసి, ౯౯-వ సంవత్సరము ఏప్రిలు నెల నాఁటికి "హిందూ సుందరీమణుల చరిత్రముల" మొదటిభాగమును బూర్తిపఱిచితిని. పత్రికలో ముద్రింపఁబడిన యీకథలు, వెనువెంటనే పుస్తకరూపమునఁగూడఁ బ్రచురింపఁబడెను.

మిగులఁ బరిశ్రమ చేసియే నే నీ పుస్తకములు వ్రాసితిని. అదివఱకే భారత, రామాయణాదులు చదివియుండినను, ఇపు డీకథలకొఱకై ఆయా పుస్తకములు నే నీమాఱు సమగ్రముగఁ జదువవలసివచ్చెను. ఇంతియకాక, ఒక్కొక చరిత్రలోని కథకొఱకు మూఁడునాలుగు పుస్త

ములు నేను దిరుగవేయవలసివచ్చెను. ఆ పుస్తకములనుండి రమ్యములగు పద్యములుకూడ నుల్లేఖించితిని. కథలో రసహీనములగు భాగములు వదలివేసి, వినోదకరములును నీతిదాయకములును నగుపట్టులకుఁ బ్రాముఖ్య మిచ్చుచుండువాఁడను. పురాణేతిహాసములలోని కథాక్రమమును సామాన్యముగ మార్పకుండువాఁడను. మిక్కిలి యరుదుగనే నా సొంత యభిప్రాయములను చరిత్రములలోఁ జొప్పించుచుండువాఁడను.

ఈకథలలో నెల్ల సీతాద్రౌపదులచరిత్రములు ఉత్కృష్టములు. ప్రాచీనకాలహిందూసుందరు లందఱిలోను సీతయే శీలపవిత్రతలయందుఁ బ్రథమగణ్య. రాముఁడు సుగుణాభిరాముఁడె యైనను,హృదయేశ్వరియగు సీతయెడఁ దుద కాయన చూపిననిరసనమునకును, అందుమూలమున నా పుణ్యవతి కాపాదిల్లిన శోకకష్టములకును వగవనివా రుండరు. ఈకథలన్నిటిలోను ద్రౌపదిచరిత్రము కడు దీర్ఘమైనది. ఆ సుగుణవతిచరిత్రమున నెన్నియంశములో యిమిడియుండుటచేత,కథ విపులముగఁ దెలుపనవకాశము గలిగెను.

## ౨౯. పితృనిర్యాణము

విజయదశమిపండుగలకు నే నొకసారి మా తల్లిదండ్రులను జూచుటకు ౨౫-వ సెప్టెంబరున రాజమండ్రి వెళ్లితిని. అందఱు నచట సుఖముగ నుండిరి. మిత్రులను సందర్శించితిని. మందిరములో ప్రార్థన జరిపితిని. స్నేహితులగు పాపయ్యగారికి పోలవరము సంస్థానాధికారియుద్యోగ మగుటకు మా యభినందనములు తెలుపుచు నొక తీర్మానము గావించితిమి. మఱునాఁడు అత్తగారు మున్నగు బంధువులను జూచివచ్చితిని. నాకు రాజమండ్రికళాశాలలో నుద్యోగము దొరకు

ననెడియాశ యిప్పటికిఁ దొలఁగిపోయెను! ౨౦-వ తేదీని తల్లి దండ్రులను సోదరులను విడువలేక విడిచి, రైలెక్కి బెజవాడ చేరితిని.

ఆ దినములలో బెజవాడపఠనాలయమున సాయంకాలము చీట్లాడుట పెద్దమనుష్యుల సంప్రదాయమయ్యెను. ఇది నాకును తక్కిన సంస్కారపరులగు మిత్రులకును సరిపడకుండెను. దీనిని నిరసించుచు నేను పత్రికలకు వ్రాసితిని. వీరభద్రరావుగా రొక ప్రహసనము కల్పించిరి. మా వ్రాఁతలు సభ్యులకుఁ గష్టముగాఁ దోఁచెను. మా వ్యాఖ్యానము లసమంజసములని యొక బహిరంగసభలో సభ్యుఁ డొకఁడు వాకొనిరెను.

నా "గృహనిర్వాహకత్వ" మిదివఱకె ప్రకటింపఁబడినను, ముద్రితమైన మున్నూఱు ప్రతులును వేగమె విక్రయమగుటచేత, కొన్ని మార్పులు చేసి, రెండవకూర్పునకు పుస్తకమును మద్రాసు పంపితిని. కాని, సొమ్మునుగుఱించిన చిక్కులవలన, అచ్చుపని యాఁపుఁడని నేను అక్టోబరు ౫-వ తేదీని తంతి నంపినను, ముద్రాలయాధిపతి పుస్తకముద్రణము మానివేయలేదు.

ఆకాలమునందు నా గ్రంథపఠనవైపరీత్యము నా దినచర్యపుస్తకమందలి యీ క్రిందియుల్లేఖమువలనఁ దెలియఁగలదు:—

"౧౮౯౭ అక్టోబరు ౬ గురువారము: 'లండనునగర రహస్యములు' లోను, కార్లయిలుని 'భూతవర్తమానములు' లోను కొన్ని పుటలు చదివితిని. 'మార్కసు అరీలియసునిమననములు,' 'సెనీకానుండి యుల్లేఖనములు' అనుపుస్తకములు చదువఁ దీసికొంటిని. ఉత్కృష్టములు నికృష్టములునగునిట్టి పరస్పరవిరుద్ధ విషయములను సమానప్రేమమున నా యాత్మ గ్రోలుటకుఁ గారణము తెలియదు! రైనాల్డ్సుని విషయవాం

ఛావర్ణనముపలెనే కార్లయిలు, అరీలియసుల తత్త్వశాస్త్రవిషయము లును నాకు హృదయానుమోదము లే!"

హైదరాబాదు ప్రాంతములనుండి యారోజులలో బెజవాడ కొక స్వాములవారు వచ్చిరి. ఆయన గొప్పమాహాత్మ్యము గలవాఁడని జను లనుకొనిరి. స్వామివారిని సందర్శింపఁగోరి, ౧౫-వ అక్టోబరు శనివారము వేఁకువనే కామశాస్త్రి వీరభద్రరావుగార్లు వెంటరాఁగా, నేను ప్రాఁతయూరు పోయితిని. స్వామివారు మౌనముద్ర నూనియుండుటచేత, వారి నచటికిఁ గొనివచ్చిన బెజవాడనివాసులగు శ్రీగోవిందరాజుల రామప్పగారితో మేము ప్రసంగించితిమి. స్వామివారు తమ వయస్సు ౫౦౦ వత్సరములని నుడివి రని తెలిసెను. ఆయన నిరశనవ్రతులు కూడనఁట!

ఆ సెలవుదినములలోఁ గొందఱు మిత్రులతోఁ గలసి నే నొక నాఁడు కొండపల్లి వెళ్లితిని. పర్వతశిఖరమగు "నోంటిమన్యము"ను జూచితిమి. అచటి ప్రకృతిదృశ్యము లత్యంతరమణీయములు.

౬-వ నవంబరునాఁటి దినచర్య యిటులుండెను:—"రాఁబోవు సంవత్సరము వెంకటరత్నమునాయఁడుగారు నోబిలుకళాశాలనుండి వెడలిపోవుదురను దుర్వార్త వినవచ్చెను. నాయఁడుగారు బ్రాహ్మసమాజప్రచారమునం దమితోత్సాహము గలిగియుండుట, కళాశాలాధ్యక్షుఁడగు క్లార్కుదొర కిష్టము లేకుండుటయే దీనికిఁ గారణము! నేను నాయఁడుగారి కొక పెద్దయుత్తరము వ్రాసి, పూర్వము మే మను కొనిన 'ఆస్తికపాఠశాల' నిపుడు నెలకొల్పఁగూడదా యని యడిగితిని. ఆకాశము మేఘావృత మగుటచేత నేఁడు దుర్దినము. మిత్రుఁడు నాయఁడుగారినిగూర్చిన దుఃఖవార్త వినుటవలన నామనస్సునకును నేఁడు దుర్దినమే!"

## ౨౯. పితృనిర్యాణము

ఇటీవల మాతల్లి తఱచుగ వ్యాధిపీడిత యగుచుండెడిది. మా తండ్రిమాత్రము సామాన్యముగ నారోగ్యభాగ్య మనుభవించుచునే యుండెడివాఁడు. కాని, ౯-వ నవంబరున మాతండ్రికి జ్వరమువచ్చె నని తమ్ముఁడు వెంకటరామయ్య జాబువ్రాసెను. ఈరోజున వర్షము కురిసెను. నేను వ్యాకులచిత్తుఁడనైతిని. నాఁటిరాత్రి ౯ గంటలకు రాజమండ్రిలోని మాతమ్మునియొద్దనుండి నాకు తంతివచ్చెను. మాతండ్రికి వ్యాధి యధికమయ్యెనని యందుండెను. తమ్ముఁడు సూర్యనారాయణుని వెంటఁదీసికొని, నేనారాత్రి రైలులోనే బయలుదేఱితిని. దారి పొడుగునను మాజనకునిగుఱించిన దుఃఖకరములగు తలంపులు నామనస్సును జీకాకుపఱిచెను.

మఱునాఁడు ప్రొద్దున మేము రాజమండ్రి చేరి, యింటికిఁ బోయి చూచునప్పటికి, మానాయన స్పృహతప్పి వేదనపడుచుండెను. అందఱమును విలపించితిమి. గతరాత్రి గడచుటయే దుర్లభమయ్యెనని మావాళ్లు చెప్పిరి. మాతండ్రి కేవిపత్తు సంభవించునో యని మేము భీతిల్లితిమి. భార్యను రమ్మని బెజవాడ తంతి నంపితిని. జాగ్రత్తతో మందులిచ్చుచు, మానాయనకుఁ బరిచర్యలు చేసితిమి.

మాతండ్రికి సన్నిపాతము గానఁబడెను. దానికిఁదోడు, ఎక్కిళ్లుకూడ నారంభమయ్యెను. దేశీయవైద్యుఁడు కృష్ణమరాజుగారివలన లాభములేదని యెంచి, రమణారావుగారి నేర్పఱిచితిమి. ఈవైద్యుల మార్పువలన రోగి కేమియు లాభము చేకూరదయ్యెను. ౧౩-వ నవంబరు దీపావళినాఁడు మానాయనకు వ్యాధి ప్రబలమయ్యెను. నాడి క్షీణించెను. జ్వరము తగ్గినను, రోగి బొత్తిగ విశ్రాంతి లేక బాధపడుచుండెను.

౧౪-వ నవంబరున మేము వైద్యాలయాధికారిని దీసికొనివచ్చితిమి. వాతము క్రమ్మిన దనియు, రోగి జీవింపఁ డనియు, ఆయనచెప్పివేసెను. మాతండ్రి కడవఱకు ఛాయాపటము తీయనేలేదు. మంచము మీఁదనే పడియుండు రోగిపటము తీయుఁ డని యిపు డొకచిత్రకారుని గోరితిమి. ఆతఁ డొకపట మెత్తి, అది పాడయ్యె నని చాలదినములకుఁ బిమ్మట మాకుఁ జెప్పివేసెను!

శిశువును బెంచురీతిని, నలుగురు సోదరులమును అహర్నిశము జనకునికిఁ బరిచర్యలు చేసితిమి. కాని, యాయనదేహస్థితి క్షీణదశకు వచ్చెను. ఒక్కొక్కమాఱు మిల్లె గరిటెఁడు పాలయినను మ్రింగలేక, ఆయన స్పృహతప్పిపడి యుండెను. వెక్కిళ్లు వచ్చునప్పుడు మాత్రము కొంచెము తెలివిగలుగుచుండెను కాని, యాస్పృహయే యాయనవేదనను మఱింత పెంచుచుండెను! ౧౫-వ నవంబరు రాత్రి యెక్కిళ్లు మితిమీఱెను. పొత్తికడుపు దగ్గఱనుండి లోనయేదో యెత్తుగ పొంగి, పామువలె కడుపులో పైకెగఁబ్రాఁకి, గొంతుదగ్గఱకు వచ్చునప్పటికి, రోగి, యొక్కొక్కప్పుడు ఉక్కిరిబిక్కిరి యగుచుండెను. ఇట్లొక్కొక్కప్పుడు ఊపిరాడక, ఆయన పడిపోవుచువచ్చెను. మృత్యు వాసన్న మయ్యె ననుకొనుచుందుము. మరల తెప్పిఱిల్లుచువచ్చినను నాడి క్షీణించిపోసాగెను.

౧౬-వ నవంబరు ప్రాతఃకాలమున మాజనకునికి ప్రాణోత్క్రమణసమయ మాసన్నమయ్యెను. మరల దేశీయవైద్యుని పిలువఁగా, ఆయన ముసాంబ్రపుగంధము రోగికడుపుమీఁద పట్టువేయించెను. వెంటనే వెక్కిళ్లు కట్టైను. అందుచేత మాకుఁ గొంత యాశ కలిగెను. కాని, రోగినాడి క్రుంగిపోవుచున్న దనియు, లాభము లేదనియు వైద్యుఁడు చెప్పివేసెను.

## ౨౯. పితృనిర్యాణము

నే నంత దుఃఖపరవశుఁడ నైతిని. ఈకర్ణకఠోరపుఁబలు కాడిన వైద్యుని దిట్టివైచి, నేను లేచి నిలువఁబడితిని. నా కింతలో, మాతండ్రితోడనే కాక, లోక మంతటితోను సంబంధము వీడిపోయెనను వెఱ్ఱిభ్రమ గలిగెను! బయటికి వెడలిపోవుచున్నా నని చెప్పివేసి, నే నంత వీథినిఁ బడితిని. వర్ణింపరాని గాఢాంధకార మేదియో జగము నావరించినటు లయ్యెను. నా దేహమున గగుర్పాటు గలిగెను. శరీరమనశ్శక్తు లన్నియు నొక్కుమ్మడి నుడిఁగిపోవుచున్నట్లు తోఁచెను. స్పృహ దాదాపుగ నంతరించెను. చనిపోవుచుండు మాతండ్రి నంతవదలివేసి, నాభార్యయు మఱికొందఱును నావెంటఁబడి, నన్ను బట్టుకొని, పొరుగున నుండు నొక మిత్రుని యిల్లు చేర్చిరి. నా కపుడు శైత్యోపచారములు చేసిరి. అపుడే వారియింటిలో వంట సిద్ధముకాఁగా, నాచేత ముఖము కడిగించి, నాభార్య, నాకుఁ గొంచెము మజ్జిగతోఁ గలిపిన యన్నము పెట్టి, వారివీధిగదిలో నిద్రపుచ్చెనఁట!

నాకు మెలఁకువ వచ్చునప్పటికి, పగలు పదిపదునొక్కగంట యయ్యెను: మానాయన యదివఱకే చనిపోయెను! తమ్ముఁడు వెంకటరామయ్యయు నావలెనే కొంతసేపు మతి తొలఁగియుండెనఁట. నేనపుడు మాయింటికిఁ జని, చనిపోయిన తండ్రికై విలపించితిని. మమ్ముఁ బెంచి పెద్దవాండ్రను జేసి, విద్యాబుద్ధులు గఱపి సంరక్షించిన ప్రియజనకునికి మే మపుడు, గోదావరినదీసైకత ప్రదేశమున నగ్నిసంస్కారము జరిపితిమి. ఇటీవల నడ్డులేని పోఁకడలు పోవు నాపాపపుహృదయమును గుఱించియే మాకీ ఘోరవిపత్తు సంఘటిల్లె నని నేను విలపించితిని. మాసంసారము నిబిడాంధకారనిమగ్న మయ్యెను!

## ౩౦. జనకసంస్మరణము

దినముల కొలఁది నిద్రాహారములు సరిగాలేక మేము తండ్రిని గని పెట్టుకొని యుండుటచేతను, ఇపు డాయన పరలోకప్రాప్తిఁ జెందుటవలనఁ గలిగిన యాశాభంగపుఁ దాఁకుడుచేతను, మాసోదరుల కందఱికిని శరీరస్వాస్థ్యము తప్పిపోయెను. నన్ను రక్తగ్రహణి పట్టి పీడించెను. చిన్నతమ్ముఁడు సూర్యనారాయణకు తీవ్రజ్వరము వచ్చెను. అందువలన, ఇపుడు సంప్రాప్తమైన విపత్తును విచారమును మఱపించెడి యలజడికి కుటుంబము తావల మయ్యెను. కాని, క్రమముగ నందఱికిని దేహమున నెమ్మది గలిగెను. ఆదినములలో మాయందఱియాలోచనలకును మా తండ్రిని గూర్చిన సంగతులే ముఖ్యవిషయ మయ్యెను. మానాయన సదా పెరటిలోని చెట్లు పెంచుచుఁ బాటు పడుచుండువాఁడు. ఆయన నిరతము కూరగాయల మొలకలే పెంచు చుండును గాని, పూలచెట్లనిన మక్కువ లేశమును లేనివాఁడని నేను క నే నాయన నొకటిరెండు మాఱులు గేలిచేసితిని. క్రియాపూర్వకమైన ప్రత్యుత్తరము నా కీయఁగోరిన వానివలె, మాతండ్రి యిటీవల నొక యాంగ్లేయుఁడు పట్టణము విడిచిపోవుచుండఁగా, జవానుల నడిగి, వాని పెరటిలోని క్రోటనులు పూలమొలకలు ననేకములు తెచ్చి, విశాలమగు మా పెరటిలో నాఁటెను. ఇపు డాచెట్లు, వింత రంగుల చిగురు జొంపములు వెట్టియు, సువాసన లీను పూవులు దాల్చియు కనులపండువు సేయుచుండెను. ఆయన మిగుల శ్రద్ధతోఁ బెంచిన నిమ్మచెట్టిదినములలో పచ్చనిపండ్లతో నిండియుండెను. పెరటిలో నెచటఁ జూచినను మాతండ్రి పాటు గానవచ్చుచుండెను. ఆయన యేచెట్టునకుఁ గలుపు తీయుచునో, ఏమొలక తీఁగల సరదు

చనో యుండునట్లు మేము భ్రమపడుచుండువారము. మాకనుల కిం కెన్నఁడు కనఁబడక, ఆయన యొక్క పెట్టున మృత్యువునోటఁ బడినట్టుగ మేము విశ్వసింపఁజాలకుంటిమి!

మే మిపుడు చేయు కర్మాంతరములవలన నా కొకింత తాపోపశమనము గలుగుట వాస్తవమే. కాని, యీ వ్యర్థకర్మకలాపమువలననే జనకుని పవిత్ర సంస్మరణమునకుఁ గొంత కొఱంతయుఁ గలుగుచున్నదని నే నెంతయు విసుగుచుండువాఁడను.

ఆదినములలో మా కెల్లరకును దుర్భరముగఁ దోఁచినది పదవ నాఁటి మా జనని వపనకర్మయే. దీని కంగీకరింపవలదనియు, ఆక్షేపించువారలకు మేము తగు సమాధాన మిచ్చెద మనియు, మే మెంత బోధించినను మాతల్లి వినక, పూర్వాచారపరాయణయై యీ క్రూర కర్మ కొడంబడెను. ఆసమయమున దుఃఖావేశమున నామె మూర్ఛిల్లి పోవచ్చు నని మేము భీతిల్లినను, దైవానుగ్రహమున నట్లు జరుగలేదు. తనయులవలెఁ గాక, యాకష్టసమయమున మాతల్లి ధైర్యము వహించి యుండెను. విధ్యుక్త మని తాను నమ్మిన మార్గ మెంత దుస్సహమైనను, దానిచొప్పుననడచుకొనుట కాపుణ్యవతి యావంతయుఁగొంకకుండెను.

మాతండ్రి చనిపోయిన ౧౧-వ నాఁడు రాజమండ్రి "ప్రార్థన సమాజము"వారు ప్రత్యేకసభ నొకటి సమకూర్చిరి. ఆసమయమున రెబ్బాప్రగడ పాపయ్యగారు అధ్యక్షులుగ నుండిరి. మా జనకునిగూర్చి నే నపు డొక యాంగ్లవ్యాసమును జదివితిని. అందలి ముఖ్యభావము లిచటఁ జేర్చుచున్నాను:—

"చనిపోవునప్పటికి మాతండ్రికి సుమారు రఱువది సంవత్సరముల వయస్సు. ఆయన జన్మస్థలము తణుకుతాలూకాలోని గోటేరు.

వారిది గౌరవనీయమగు నియోగిబ్రాహ్మణ కుటుంబము. విద్యాగంధ మెఱుంగని యాయన తండ్రి ప్రయాసమునఁ దనపెద్ద సంసారమును బోషించుకొనుచుండువాఁడు. ఆగ్రామమున నింటికిఁ జేరువనుండు తన పొలమును సొంతముగ సేద్యము చేసికొని, ఆయన సతీసుతులను బోషించుకొనుచుండువాఁడు. మాతాత కృష్ణమ్మగారి కైదుగురు పుత్రులును, ముగ్గురు పుత్రికలును గలరు. ఆయన కష్టములు నానాఁట ఫలించెను. కుమాళ్లు ఒక్కరొక్కరే పెద్దవారలు ప్రయోజకులునై, కుటుంబపోషణ భారమును తామే వహించిరి. చిన్నవాఁడు మా తండ్రికి విద్య నేర్చుటకు స్వస్థలమున నవకాశము లేకపోయెను. కాని, ఆయన యింట వ్యర్థకాలక్షేపము చేయనొల్లక స్వతంత్రజీవన సంపాద్యము చేయఁబూనెను. విద్య యంతగ రాకుండెడి యువకులకు జీవనోపాధి గలిపించుటకై యాకాలమున నరసాపురమున బోధనాభ్యాసన పాఠశాల యొకటి యేర్పడియుండెను. మాతండ్రి యందుఁ జేరెను గాని, అచట బోధింపఁబడెడి చరిత్రము భూగోళము మున్నగు నూతన విషయములు తలకెక్కక, కొలఁది దినములకే యాయన యచటినుండి తప్పించుకొనిపోయెను! అంత సర్వేశాఖలో నుద్యోగము సంపాదించి, పలుమాఱు పని విరమించుకొనుచు వచ్చినను, తన యుద్యోగకాల మంతయు నాయన, యా శాఖలోనే పనిచేసెను.

"సర్వేయుద్యోగమం దాయన యాంధ్రదేశ మంతటను సంచారము చేసెను. ఉత్తరజిల్లాలే కాక, దత్తమండలములుకూడ మానాయన సందర్శించెను. ఎక్కువగ ధన సంపాదనము చేసి, జ్యేష్ఠసోదరునికి సొమ్మంపి, మంచిభూవసతి సంపాదించెను. ధన సంపాదన విషయమై మాతండ్రి త్రొక్కినత్రోవ సరియైన దని చెప్పువాఁడను గాను. కుటుంబపోషణము చేసికొనుటయం దెట్టి ప్రవర్తన మైనను

కూడు నని సామాన్యజనులవలె నమ్మి, ఆయన తన చర్యలను సమర్థించుకొనుచుండువాఁడు.

౧౮౭౨-వ సంవత్సరమున తనయుల విద్యాభివృద్ధినిమిత్తమై మాతండ్రి రేలంగినుండి రాజమండ్రికి సంసారమును తరలించెను. తా నున్నతవిద్య నభ్యసింపకున్నను, ఆంగ్లేయ విద్యాసంస్కారము కలిగినఁ గాని తనకుమాళ్లు వృద్ధినొందరని గ్రహించి, ఆయన వారి విద్యకొఱకై పడరాని పాట్లుపడెను. మేము రాజమండ్రిలోఁ జదువుచుండినపుడు, నెలకు పదునైదు రూపాయీల జీతముమీఁద మానాయన గోదావరి విశాఖపట్టణ మండలములందలి గడుమన్యములలోఁ దిరుగుచు, ఒకొక్కప్పుడు వన్యమృగములనోటఁ బడ సిద్ధ మగుచు, పుత్రుల విద్యాభ్యున్నతికై యపారస్వార్థత్యాగము చేసెను! కాని, యిటీవల కొంతకాలమునుండి యాయన వ్యాధిగ్రస్తుఁడై యుద్యోగము లేక యుండుటవలన, కుటుంబము అప్పుల పాలయ్యెను. ఋణములు తీర్చి వేయుటకై కష్టార్జితమగు భూమినంతను అమ్మివేయుటకాయన సంశయింపకుండెను. ఆయన పడిన కష్టముల ఫలితముగ, కుమాళ్లలోఁ బెద్దవార మిరువురము విద్యాపరిపూర్తిచేసి ఉద్యోగమునఁ బ్రవేశించితిమి. కాని, మా కష్టమంతగ ననుభవింపకయే, ఆయన పరలోకప్రాప్తిఁ జెందిరి!

" ఈకష్టసమయమున నా హృదయమును దుర్భరవిషాదముచేఁ గలంచునది, ఆయనయెడ నేను జెల్లింపని విధ్యుక్తములసంస్మరణమే! పలువిషయములలో మేము మాజనకునియెడ నపరాధులము! మేము హాయిగ నుండునపుడు, ఆయన కష్టముల పాలయ్యెడివాఁడు. మా కొఱకింతగాఁ బాటుపడిన తండ్రినిఁ దగినట్టుగ సుఖపెట్టమైతిమిగదా యని మేము వగచుచున్నాము. ముం దాయన కెప్పుడో 'కట్నము

గప్పుడో మను మా యాశ లన్నియును ఆయన మృత్యువువలన వట్టి యడియాస లయ్యెను!

"సంఘసంస్కరణమును గుఱించియును, ప్రార్థన సమాజము నెడలను మాతండ్రిగారి దృక్పథ మెట్టులుండెనని మీ రడుగవచ్చును. ఆయన పూర్వాచారపరుఁ డయ్యును, వివిధప్రదేశములు సందర్శించి విదేశీయోద్యోగులతోడి సంపర్కము గలిగియుండిన హేతువున, ఆయనభావములకుఁ గొంత వైశాల్య మబ్బెను. రాజమండ్రిలో తన కుమారులలో పెద్దవా రిరువురును సంఘసంస్కరణ సమాజమునఁ జేరి పాడగుచుండిరను వదంతులు ప్రబలినను, ఆయనకుఁ జీమకుట్ట దయ్యెను! పుత్రుల మతాభిప్రాయములపట్ల నాయన మంచి సహన బుద్ధి గలిగియుండెను. నే నిచటి ప్రార్థనసమాజమునఁ జేరి తీవ్రముగఁ బనిచేయుచు, "సత్యసంవర్ధనీ పత్రికను" నెలకొల్పి నడపుచుండెడి ౧౮౯౧-౯౨ సంవత్సర ప్రాంతములందు, నేను నాస్తికుఁడనై దుష్కార్యము లాచరించుచుంటి నని పలువురు మొఱలిడినను, ఆయన నిశ్చలుఁడై యుండెను! మాతండ్రిగారి మత విశ్వాసములు కొంతవఱకు ప్రజాభిప్రాయములకు భిన్నములే. కావున నేకేశ్వరోపాసకుఁడనకు నాయం దాయన కొంత సానుభూతి గనఁబఱుచుచుండువాఁడు.

"లోకవ్యాపారములలో మాతండ్రి న్యాయశీలుఁడు. తా నెన్నఁడును న్యాయసభల కెక్క లేదనియు, అసత్య మాడ లేదనియును ఆయన చెప్పుచుండువాఁడు. ఆయన యెవరినిగాని హింసించుటయు, మోసపుచ్చుటయు నే నెఱుంగను. పైకి మొరటుగఁ గానిపించినను, ఆయన కోమలహృదయమున నొప్పువాఁడు.

"మాతండ్రి మంచ మెక్కి వేదన పడుచుండెడి యంత్యదిన ములలో, నలుగురు సోదరులమును రేయుంబవళ్లు ఆయనను కనిపెట్టి

యుండువారము. రాత్రులు నిద్రను నిరోధించితిమి. అట్లుకాక, ఒకరి వెనుక నొకరము మేము మాతండ్రిని గాచుచు, నిదురించుచుండుట మంచి దని బంధువులు యోజన చెప్పిరి. కాని, వంతులచొప్పున వేచి యుండుట యనునది, వంతులచొప్పున ప్రేమించుటవలె మాకుఁ దోఁచెను! ఒక్కొక్కప్పుడు మాలో నెవరముగాని నిద్రాపారవశ్యమున నైనను, ఒండొరుల బోధనముననైనను, ఒకింత కునికినప్పుడు, తండ్రి మూలుగు చెవులఁబడఁగనే అదరిపడి లేచి కూర్చుండువారము! ఇట్లు మేము చనిపోవుతండ్రిని మిగుల శ్రద్ధతోఁ గనిపెట్టితిమి. ప్రేమ పూరితహృదయులగు పుత్రులు తనకు సపర్యలు చేయుచుండిరని గాంచి సంతృప్తి నొందుటకైన మాతండ్రి కొకింత స్పృహ వచ్చి ప్రాణము నిలుచునేమో యని మే మాశించుచుంటిమి. కాని, యీశ్వరోద్దేశము వేరయ్యెను.

"మా కత్యంత ప్రేమాస్పదుఁడగు పితృని కళేబరము క్షితిపై నొక త్రుటిలో మటుమాయమయ్యెను. మృత్యుదేవతా! మా జనకుని యసువులఁ గొనిపోయిన నీవు, విచ్చల విడిగ సంచారముచేసెడి నా విషయేచ్ఛల నేల సమయింపఁజాలవు? కొంతకాలముక్రిందట పాపచింతనలు నామనసునఁ జెలరేగి యుండునపుడు, ఒకచిన్నతమ్ముని మరణరూపమున భగవంతుఁడు నాకు హృదయప్రబోధముఁ గలిగింపఁజూచెను. మరల నిటీవల నా యంతరంగము హేయవాంఛలకును పాపసంకల్పములకును నాటపట్టయ్యెను. నా మహోన్నతత నడపించుటకు నాకేదో మూఁడునని యెదురు చూచుచుంటిని. ఇవ్విధముగఁగాని నాకుఁ బ్రాయశ్చిత్తము గలుగదని యెంచి భగవంతుఁడు నా కీవిపత్సందేశము నంపెనని నే నెంచుచున్నాఁడను.

"మా జనకుని పవిత్ర జీవితము మాసోదరు లందఱికిని పరస్పర ప్రేమముఁ బురికొల్పును గాక! మా తండ్రి కీలోకమున సమకూరని శాంతి సౌఖ్యములు పరాత్పరుని సన్నిధానమునఁ బ్రసాదిత మగును గాక!"

నా ప్రసంగానంతరమున మిత్రులు పెద్దాడ సాంబశివరావు గారు మా జనకుని సౌజన్యమును గూర్చి ముచ్చటించిరి. అగ్రాసనాధిపతియగు పాపయ్యగారు మానాయన సుగుణములను ప్రశంసించిరి. ఎన్నఁడుగాని తనకుమారులు చెడువార లనియు నాస్తికు లనియు మాతండ్రి మొఱలిడలేదని వారు చెప్పిరి. అమిత సహన సౌజన్యములు గలిగి మాజనకుఁడు మనుచుండెడివాఁడని పాపయ్యగారు వక్కాణించిరి.

## ౩౧. ప్రాథమిక పరీక్ష

మాతండ్రి చనిపోయిన చాలకాలమువఱకును, నా కాయనను గుఱించి భయంకరమగు కలలు వచ్చుచుండెడివి. మా కిపుడు కష్టపరంపర సంభవించె ననియు, మాతల్లి మున్నగు వారును మృతి నొంది రనియు నేను సుషుప్త్యవస్థయందు భ్రమనొందుచుండు వాఁడను. ఇపుడు సంవత్సరపు తుదిదినము లగుటచేత మా పాఠశాలకుఁ బరీక్షలు చేయఁజొచ్చితిమి. నామిత్రులు వెంకటరత్నము నాయఁడు గారు కృష్ణామండలపూర్వభాగమునకు ప్రాథమిక పరీక్షాధికారిగ నియమింపఁబడిరి. ఆయన నన్నును, మఱికొందఱు స్నేహితులను సహాయ పరీక్షాధికారులుగ నియమించిరి. అందువలన నించుక ధనలాభమె కాక, మనసునకుఁ గొంత విరామమును, వారియొక్కయు నితర స్నేహితులయొక్కయు నమూల్య సహవాస భాగ్యమును నాకు లభించెను

## ౩౧. ప్రాథమిక పరీక్ష

నేను ౮-వ డిశంబరు తేదీని, బెజవాడనుండి కంకిపాడు బయలుదేఱి, నాయఁడుగారి నచట సాయంకాలము గలసికొంటిని. చెన్నాప్రెగడ భానుమూర్తిగారు నిడుగొంది నరసింహముగారును, వారికి సహాయకులుగ నుండిరి. రాత్రి చాలసేపటివఱకును నాయఁడుగారు తమ బందరు వృత్తాంతములు నాకుఁ జెప్పిరి. క్లార్కుదొర తనను నోబిలు కళాశాల విడిచిపొమ్మను సందర్భము వారు సవిస్తరముగఁ దెల్పి, ఆస్తికపాఠశాలా స్థాపనమున కిది యదను గాదని పలికిరి.

ప్రాథమిక పరీక్ష నితర గ్రామములోఁ జేయఁబోవుటకు నాకు సెలవు దొరకుట దుర్లభమయ్యెను. పాఠశాలలోని పని, "జనానా పత్రిక" పని, ఇపుడు పునర్ముద్రణ మగుచుండు "గృహనిర్వాహకత్వము" అచ్చుప్రతులు సవరించు పనియును గలసి, నాకెంతో ప్రయాసము గలిగించెను.

౧౩-వ డిశంబరు విద్యాశాల సంవత్సరపు తుదిదినము. ఆరోజున వేవేగమే పాఠశాలా పరీక్షలు పూర్తి పఱుచుకొని, నేను స్టేషనునకు వెళ్లితిని. చెన్నపురికిఁ బోవుచుండెడి కనకరాజు గంగరాజు గార్లను జూచి, నైజాము పోవుబండి యెక్కి, మదిరలోఁ దిగితిని. ఆరాత్రియంతయును నాయఁడుగారు నేనును బండిపయనము చేసి, మఱునాఁటి యుదయమునకు నందిగామ చేరితిమి. రెండు రోజులలో నచటి పరీక్షలు పూర్తిచేసి, జగ్గయ్యపేట వెడలిపోయితిమి. ౧౬-వ డిశంబరున నచట పరీక్ష జరిగెను. ఇపు డక్కడ పూర్వ మిత్రుఁడు అయ్యగారి సుబ్బారాయఁడుగారు ఉద్యోగమున నుండిరి. వారి యింట నేను బసచేసితిని. బెజవాడయందలి వెనుకటి సౌఖ్య దినములు మా కప్పుడు జ్ఞప్తికి వచ్చెను. మఱునాఁడు బెజవాడ చేరితిమి. ౧౯-వ

తేదీని నేను రెయిలెక్కి రాజమండ్రి వెడలిపోయితిని. ఆప్రదేశమున మానాయన సంతోషానన మిపుడు గానరాక నేను మిగుల వగచితిని.

ఆ శీతకాలపు సెలవు రోజులలో నేనును తమ్ముఁడును చెల్లెలు కామేశ్వరమ్మ వివాహ సంబంధమునకు వెదకితిమి. అట్లపాడు సంబంధమే యేర్పాటు చేయఁదలఁచితిమి. దుఃఖాతిరేకమున వగచు మాతల్లికి ననుదినమును భాగవతము చదివి యర్థము చెప్పుచు, ఆమెను గొంత సేదదేర్చితిని. మా మఱఁదల కింకను, దేహస్వాస్థ్యము గలుగనే లేదు. ఐనను నేను భార్యాసమేతముగ ౫-వ జనవరిని బెజవాడకు బయలు దేఱిపోయితిని.

మరల ప్రాథమిక పరీక్షలు జనవరి ప్రారంభమున నారంభించుటచేత నే నింత త్వరగ బెజవాడ రావలసివచ్చెను. నా భార్యయు, అత్తగారును బంధువులను జూచివచ్చెద మని యేలూరులో దిగిరి. కావుననే నాయఁడుగారు మున్నగు పరీక్షా స్నేహితులకు, ఇంట రెండవ భాగమున నుండు మిత్రులు వీరభద్రరావుగారే యాతిథ్య మొసంగిరి. నాయఁడుగారి సహోద్యోగులగు దుగ్గిరాల రామమూర్తిగారు మొదలగు మిత్రులు మాయింటనే విడిసియుండిరి.

ఆకాలమునందలి నా శీల విశేషములు తేటపడుటకై, ౧౯౯౯ జనవరి ౧౩ వ తేది సంక్రాంతిపండుగనాఁటి దినచర్య నిచట నుల్లేఖించుచున్నాను:—

"ఈనాఁ డంతయు విషయవాంఛలే నన్ను వేధించినవి! అవగత్యముగనే నేను వానికి లోఁబడుచున్నాఁడను. దేవా, వీని బాధనుండి నా కెపుడు విముక్తి కలిగించెదవు? నేను కర్మకాండలోఁ జొప్పించి యెంత నలుపుచున్నను, నామనసునకు వయవినయాదిసుగు

ణములు పట్టువడకున్నవి! విషయవాంఛలు నాకు వారసత్వపు టాస్తివలె నయ్యెను. ఇంతకాలమునకైన పాపిష్ఠ చక్షువులకు వైరాగ్య మొనఁగూడకున్నది! భగవానుఁడా, నాకు హృదయపారిశుద్ధ్యము ప్రసాదింపుము.”

ప్రాథమిక పరీక్షలనూాలమున నాకు నిత్యసహవాసులైన నాయఁడుగారితో పలుమాఱు ఆత్మీయవిషయములను గుఱించి ముచ్చటించుచుండువాఁడను. నావలెనే తానును గొన్ని లోపములకు లోనగుచుంటి నని యాయన మొఱపెట్టువాఁడు. సమయపాలన విషయమునం దాయన వెనుకఁబడి యుండిరి. మనవలెనే యితరులును లోపములకు లోనయిరని వినుటవలన, మనసున కొకింత శమనము గలుగుచుండును.

౧౬-వ తేదీని మేము ప్రాథమికపరీక్షకై రేపల్లె వెళ్లినప్పుడు, అచట నిరుడు ప్రధానోపాధ్యాయుఁడుగ నుండిన తమ్ముఁడు వెంకటరామయ్యకును నాకునుగల పోలికలను గుఱించి యచటివారు చెప్పుకొనసాగిరి. సోదరుఁడు విడిసియుండు గృహము నాకచటివారు చూపించిరి. అతని మిత్రుఁడగు లక్ష్మీనారాయణగారను నుపాధ్యాయుఁడు మాకు విందొనర్చెను.

ఒక్కొకనాఁడు ముమ్మరమగు పనితో నేను నలిఁగిపోవుచు వచ్చితిని. సెలవుదినములలో నా కీపను లెక్కువగ నుండెడివి. ౨౨-వ జనవరి ఆదివారమునాఁడు నే నెన్నియో సభలకుఁ బోవలసి వచ్చెను. ఆనాఁడు సంఘ సంస్కరణ సభను జరిపితిమి. మా సమాజాదరణమున స్త్రీల సభలు సమకూర్చుటకును, బాలికాపాఠశాల నొకటి నెలకొల్పుటకును మేము నిశ్చయించుకొంటిమి. ఆఱువేల నియోగి సభా సమావేశములు రెండింటికిని నేను బోయితిని. కొంత శ్రమపడి బావమఱఁది

వెంకటరత్నమునకు నియోగి సమాజమువారి వేతనమును సంపాదించితిని. ఇదిగాక నేను వ్రాసిన ద్రౌపది చరిత్రకు నేఁడు శుద్ధప్రతి వ్రాసితిని.

నిరుడు బెజవాడలో నాయొద్ద నాలుగవ తరగతిలోఁ జదివిన నాతమ్ముఁడు సూర్యనారాయణ, ఈసంవత్సరము బెజవాడ రానని జనవరి తుదివారములో నాకుఁ దెలియఁబఱచెను. మాతండ్రి చనిపోయిన పిమ్మట బెంగపెట్టుకొని, తల్లిని విడిచి యిచ్చటికి వచ్చుటకు వాఁ డిచ్ఛగింపకుండెను.

యూనిటేరియను మత సంఘమువారి ప్రచురణము లనిన నా కిదివఱకు తలనొప్పిగ నుండెడిది. యూనిటేరియను గ్రంథకర్తయగు ఆరమ్‌స్ట్రాంగు వ్రాసిన "జీవాత్మ పరమాత్మలు" అను గ్రంథమును బాగుగ విమర్శనము చేసినవారికి బహుమతి నిచ్చెదమని ఆ మతసంఘమువా రిపుడు ప్రచురించిరి. మిత్రుఁడు రాజగోపాలరావునొద్ద నే నా పుస్తకప్రతిని ఎరవు పుచ్చుకొని చదివితిని. అది రమ్యముగ నుండెను.

౨౬-వ జనవరి తేదీని వెంకటరత్నమునాయఁడుగారు బందరునుండి వచ్చిరి. ఉద్యోగాన్వేషణమునకై వా రిపుడు హైదరాబాదు పోవుచుండిరి. ఇట్టి సుశీలుఁడు ప్రతిభావంతుఁడును క్రైస్తవ మతసంఘమువారి కొలువున నుద్యోగముఁ గోల్పోయెనే యని నేను విషాద మందితిని.

మరల నేను న్యాయశాస్త్ర పుస్తకములు విప్పితిని. మాతండ్రి చిన్ననాఁ డెంత బోధించినను నే నాచదువుదెస పెడమొగము పట్టియేయుంటిని. ఆయన చనిపోయిన పిమ్మట నా కా చదువునందు విపరీతాభిరుచి జనియించెను!

## ౩౨. మనస్తత్త్వ పరిశోధక సంఘము

మా తండ్రి చనిపోయిన మొదటి దినములలో దుఃఖాతిరేకమున నాకు మతి తొలఁగిపోవునటు లుండుచువచ్చెను. మొన్న మొన్నటి వఱకును ఆరోగ్యానందము లనుభవించి మనుచుండెడి జనకుఁ డింత వేగమె మటుమాయ మగుట నా కాశ్చర్య విషాదములు గొలిపెను. మృత్యువుతో మన మనోవృత్తు లన్నియు నశించునా, లేక పిమ్మటకూడ నవి వేఱు పరిస్థితులలోఁ గార్యకలాపము సాగించునా యని నేను దలపోయువాఁడను. నే నా దినములలో నొకప్పుడు రాజమంద్రిలో "ఇండియన్ మెస్సెంజరు" పత్రిక చదువుచుండఁగా, దానిలో "లండను మనస్తత్త్వ పరిశోధక సంఘము" వారి యొక్క నూతన గ్రంథ విమర్శనము కానఁబడెను. అది నే నతి కుతూహలమునఁ జదివియుఁ దనివి నొందక, ఏతద్గ్రంథకర్తయగు రిచర్డుహాడ్జిసను గారికి తమపుస్తకప్రతి నాకుఁ బంపుఁడని అమెరికాకు వ్రాసితిని. ఆయన నాకుఁ బంపిన పుస్తకము ప్రేమపూర్వకమగు లేఖయును, ౧౮౯౯ సంవత్సరము జనవరి ౩౦-వ తేదీని నా కందినవి. ఆసాయంకాలమునుండియే నే నాగ్రంథపఠన మారంభించితిని. రాత్రులందును, పగలు పాఠశాలలో తీఱిక సమయమందును, నే నా పుస్తకమును జదువుచుండువాఁడను. అందలి "జి. పి. సందేశములు" అనుభాగము అత్యద్భుతముగ నుండెను. ఈవార్తలే యథార్థమైనచో, మనస్సునకు మరణానంతరదశ కల దనుట స్పష్టము. హాడ్జిసనుగారికి నేను బుస్తకపువెల నంపుచు, పైపరు దొరసానిగారిని మాతండ్రిని గూర్చి ప్రశ్నించుటకై యాయన జాబులు నే నంపవచ్చునా యని వ్రాసితిని.

ఇపుడు చేరిన పుస్తకము చదివినకొలఁది నా కాశ్చర్య ప్రమోదము లతిశయించెను. పగ లనక రాత్రి యనక నే నా పుస్తకసారము నుగ్రోలితిని. జీవాత్మ మరణావస్థకు లోనుగాకుండుట కింత యమోఘ నిదర్శనము గానవచ్చుటయే నన్నాశ్చర్యమగ్నుని జేసెను.

హాడ్జిసనుగారి యోజనచొప్పున నేను సమాజకార్యదర్శికి లండనునగరము వ్రాసి, అందు సహాయసభ్యుఁడ నైతిని. అప్పటినుండియు నాకు సమాజ ప్రచురణములు క్రమముగ వచ్చుచుండెను. హాడ్జిసనుగారి పుస్తక విమర్శనము లనేకములు చదివితిని.

మేము బెజవాడలో నెలకొల్పిన "సంఘసంస్కరణసభ"కు నేను సభ్యునిగ నుండి, రామదాసుగారు పట్టణమున లేకుండుకాలమునం దా సమాజకార్యదర్శి నైతిని. ఆ సమాజమువా రిపుడు హిందూబాలికా పాఠశాల నొకటి నెలకొల్ప ౭-వ ఫిబ్రవరిని తీర్మానము చేసిరి. బెజవాడలో క్రైస్తవ బాలికాపాఠశాల లనేకము లుండెను. క్రైస్తవ విద్యాశాలలో బోధకుఁడనగు నేను వారిసంస్థలకుఁ బోటీగా నుండు విద్యాలయమును స్థాపించు సంఘమున నుంటినేని, మిత్రులు వెంకటరత్నమునాయుఁడుగారివలెనే క్రైస్తవమత సంఘమువారి యనుమానములకు గుఱియై యుద్యోగము గోలుపోవలసివచ్చు నని, నేను సంఘసంస్కరణ సమాజ సభ్యత్వమును విరమించు కొంటిని.

ఆసమయమున మా బెజవాడ పాఠశాలలోని యుపాధ్యాయులలో కక్షు లేర్పడెను. ప్రధానోపాధ్యాయుని చర్య లెవ్వికమునను తృప్తికరముగఁ గానఁబడలేదు. కావున సహోపాధ్యాయులలో పలువురకు వారియం దిష్టము లేదు. క్రైస్తవ బోధకుఁడగు సాంబమూర్తిగారు బహిరంగముగ నాయనయెడ నిరసన చూపుచుండువాఁడు. ఎందును తటస్థభావమున మెలఁగ నా కభ్యాస మయ్యెను, సౌజన్య

ము లేని వారు నడుపు విద్యాలయమునఁ బనిచేయ నాకుఁ గష్టముగ దోఁచెను. ప్రధానోపాధ్యాయునికి నాతోఁగూడ నానాఁట వైమనస్య మేర్పడెను. చిక్కులలోనికి వచ్చి నా సాయ మపేక్షించినపుడు మాత్రము నే నాయనకు హితబోధనము చేయుచుండువాఁడను. ఆయనకు సాంబమూర్తికిని సామరస్యము కుదురుటకై మిగుల ప్రయత్నించితిని.

నే నపుడు చదివెడి పుస్తక మహిమమున, నాదృష్టి యెపుడును ఆధ్యాత్మిక విషయములకును, ముఖ్యముగ మా నాయనను గుఱించిన తలంపులకును బరుగు లెత్తుచుండెడిది. ౧౨-వ ఫిబ్రవరిని మా జనకుని మాసిక సమయమున నేను దుఃఖపరవశుఁడ నైతిని. ఆనాఁటి దినచర్యయం దిట్లు గలదు:

"తండ్రీ నీ వెచటి కేగితివి? ఇపు డెచట నున్నావు? భూలోకమున నుండునపుడు నీకు వలయు సౌకర్యము లొనఁగూర్ప లేకుంటిని. ఇప్పటివలె గాఢానురాగమున నిన్నుఁ బ్రేమింపనైతిని. నిన్నుఁ గలసికొని, నీయాలింగనము గైకొన నేను వాంఛించుచున్నాఁడను."

పాఠశాలలో బోధించుటకు ముందుగ గణితపుస్తకమందలి ముఖ్యమగు లెక్కల నింటఁ జేయకుండు దురభ్యాసమువలని నష్టము నా కంతకంతకుఁ స్ఫుటముగ గానఁబడెను. ఒకగణితమె కాదు, ఏపాఠము నైనను ముందు బాగుగఁ జదివియే బోధకుఁడు తరగతిలోఁ బ్రవేశించుట కర్తవ్య మని నా కనుభవ గోచర మయ్యెను. చదువను నెరనుబడి కొంతకాలమునుండి నేను శరీరవ్యాయామము గట్టిపెట్టుట చేత, అనారోగ్యము పాలయితి నని తెలిసికొంటిని. దీని కేమిగాని,

యెన్నిటికైన మందు కానవచ్చుచున్నది కాని, విషయ సుఖలాలస కౌషధము గానరాకున్నదే ! నా దేహమన స్తత్త్వములందు, స్థూలసూక్ష్మములు, మంచిచెడుగులును ఎంత విచిత్రముగ మిశ్రితములై యున్నవి !

"గృహనిర్వాహకత్వము" రెండవకూర్పు పుస్తకములు ౫వ మార్చిని నా కందెను. ఆపుస్తకము మాతండ్రిగారికిఁ గృతి యిచ్చి, కొంత మనశ్శాంతి నొందితిని. నా కోరికమీఁద నామిత్రులు కామశాస్త్రిలుగారు కృతిపద్యములు రచియించి యిచ్చిరి. ఆ పుస్తకపు ప్రతులు పలువురు కొని చదివిరి. పుస్తకములు అమ్ముడు వోయిన కొలఁది, చేత సొమ్ము చేరి, నాకు ప్రోత్సాహము కలిగెను.

సుఖదుఃఖము లొకటి నొకటి వెంబడించుచుండును. ౧౧వ మార్చి తేదీని చెన్నై ప్రగడ సూరయ్యగారు చనిపోయిరను దుఃఖవార్త వింటిని. ఆయన సత్పురుషుఁడు. కొన్ని సంవత్సరములనుండి పరీక్షలో నపజయ మందుచుండు మిత్రులు కనకరాజు గంగరాజుగార్లు బి. యల్. పరీక్షలో నీమాఱు గెలుపొందిరని విని మిగుల సంతోషమందితిని.

౧౨వ మార్చిని బెజవాడ రెయిలుస్టేషనుకుఁ బోయి, ప్రయాణము చేయుచుండు వీరేశలింగముగారిని జూచి వారికి భోజన సదుపాయము చేసితిని. ఈ యుదారపురుషునికిఁ జిరాయు వొసఁగు మని దేవదేవుని వేఁడుకొంటిని. మిక్కిలి శ్రమపడి యెట్టకేల కీరోజున, "జీవాత్మ పరమాత్మలను" గూర్చిన నా విమర్శన వ్యాసమును రాత్రి ౮ గంటలకు సిద్ధము చేసితిని.

# 33. చెల్లెలివివాహము

నేనిదివఱకు వ్రాసిన "జీవాత్మ పరమాత్మల" విమర్శనము సరిచూడుఁడని వెంకటరత్నమునాయఁడుగారికి బందరు పంపితిని. ఆయన యది ౨౦ మార్చిని నాకు మరల నంపివేసెను. వారిసూచనల ననుసరించి నే నా వ్యాసమున వలసినకొలఁది మార్పులు చేసి, శుద్ధప్రతి వ్రాసి, 3-వ మార్చిని కలకత్తాకుఁ బంపివేసి, మనస్సునఁ గొంతయుపశమనముఁ గాంచితిని.

బాహ్యవిమ్ముల బాధ నాకు గలుగుచువచ్చెను. ఇదివఱకు నేనారంభించిన 'హిందూసుందరీమణుల చరిత్రములు' పూర్తియగుచుండెను. న్యాయశాస్త్రపుఁజదువు లోకవిధముగ సాగుచుండెను. నన్నిపుడు వేధించునది కార్యభారము కాదు. నాకప్పిచ్చిన రాజారావు తనసొమ్మీయుమని తొందరచేయసాగెను. అప్పులనుగూర్చి తలంచుటయే నాకు బాధాకరముగ నుండెను. ఎటులో కష్టపడి, ధనసంపాదనము చేసి యప్పులు తీర్చుట పురుషధర్మమని నాకు నచ్చెను. సోదరుల తోడ్పాటున నీఋణశత్రువును సులభముగ నిర్జింపవచ్చునని యెంచితిని. ౨౮-వ తేదీని ఆంధ్రసారస్వతవిషయములను గుఱించి వీరభద్రరావుగారితో మాటాడుచు, వీరేశలింగముగారి జీవితచరిత్ర నేను వ్రాసెద నంటిని. "దరిద్రాణాం మనోరథాః"!

౫-వ ఏప్రిలున మా పాఠశాలలో ఎడ్డీ యను యువ క్రైస్తవమతప్రచారకుఁడు ఉపన్యాసమిచ్చెను. ఆతనికి విపరీత క్రైస్తవమతాభినివేశము గలదు. జ్ఞానవిచక్షణకంటె పట్టుదలయే యాతనియం దధికముగఁ గానిపించెను! ఈ మహనీయుఁడే నాయుఁడుగారు బందరునుండి కదలిపోవుటకు ముఖ్యకారణ మని నాకుఁ దెలిసెను. ఆతని వైఖరియు

వేగిరపాటును, మా పాఠశాలలోని హిందూవిద్యార్థుల కందఱికి నొక్కమాఱుగ జ్ఞానస్నాన మిప్పింపఁగోరుచుండెను!

నేను సభ్యుఁడనైన లండను "మనస్తత్త్వపరిశోధన సంఘము" వారి ప్రచురణములు నాకు క్రమముగ నందుచుండెను. వారి నూతన ప్రచురణము వినోదాంశములతో నిండియుండెను. ఆసమాజమువారి మాసపత్రికకూడ నాకు వచ్చుచుండెను. నాకోరికమీఁద వారు హిందూదేశమందలి సభ్యులకుఁ దమ గ్రంథముల ప్రతులు రెండేసియంపుట కంగీకరించిరి. అందువలన నాయుఁడుగారు నేనును గలసి యొక సభ్యునిచందా చెల్లించి, ఒక్కొక పుస్తకప్రతి నందుకొనుచుండువారము.

౧౮౯౯ సంవత్సరము ౧౧-వ ఏప్రిలు వికారి సంవత్సరాది పండుగరోజున నా దినచర్య యిటు లుండెను:—

"ఏమికారణముననో కాని సతి నన్ను ప్రబలశత్రువునివలెఁ జూచుచున్నది! తనకు ధన మీయ లేదని నామీఁద పగఁబూనినది. ప్రస్తుత సంసారపరిస్థితులలో నే నెట్లు సామ్మ్యయనేర్తును? ఆమెవిరోధవైమనస్యములచే నా యుదారాశయములు తాఱుమాఱగుచున్నవి! ఈశ్వరాదేశములగు నీయాశయముల నే నెట్లు త్యజింపఁగలను? * నే నిదివఱకు వ్రాసిన వ్యాసములు చదివి వినోదమునఁ గాలము గడిపితిని. కామశాస్త్రిగారితో నద్వైతమతమునుగూర్చి వాదించుచు, అందలి లోపములు వారికిఁ జూపించితిని."

మిత్రుఁడు వెంకటరత్నము నాయఁడుగారికి ౧౭౦ రూపాయల జీతముమీఁద, సికందరాబాదు మహబాబు పాఠశాలాధ్యక్షపదవి లభించిన దని తెలిసి నే నెంతయు సంతోషించితిని.

## 33. చెల్లెలి వివాహము

మా తండ్రిగారు నా కిదివఱకు వ్రాసిన రెండు ఉత్తరములును నా కిపుడు పరిచితులయిన హాడ్జిసనుదొరగారి కమెరికా పంపితిని. పై పరుదొరసానికి మూర్చాసమయమున వీనిని జూపించి, మా తండ్రిని గుఱించి యామె యేమి చెప్పునో నాకుఁ దెలియఁజేయుఁడని వారినిగో రితిని. పాఠశాలలోఁ బ్రథమోపాధ్యాయుఁడు చేయుచున్న క్రమములను గు ఱించి నా దినచర్యపుస్తకము నందీక్రిందివ్యాఖ్య గలదు:—

"ఈ క్రైస్తవబృందమువారికి మనుజుల వర్తన మెటు లున్నను వారిమతమే ప్రధానమని తోఁచుచున్నది! సజ్జనులగు హిందువులకంటె దుశ్శీలురగు క్రైస్తవులే వీరికిఁ బ్రియులు! దేవదూతవంటి పూతచా రిత్రుఁడగు నాయఁడుగారి నీ మతసంఘమువారు తమ విద్యాలయము నుండి వెడలఁగొట్టిరే! శీలసౌష్ఠవముఁ గోలుపోయిన బోధకమహాశయుల నీ పాఠశాలనుండి యెవరును గదలింపలేకున్నారు! ఇట్టి భూలోక దృశ్యములు దేవతల పరిహాసములకుఁ దావల మగుచున్నవి."

మా చెల్లెలిపెండ్లి 3-వ మేయి తేదీని జరుగునని తమ్ముఁడు వ్రాసెను. కాని, నేను వెళ్లుటకు వలనుపడదని ప్రథమోపాధ్యాయుఁడు చెప్పివేసెను. పాఠశాలాధికారికి బందరు జాబువ్రాసివేసి, ౧-వ మేయి తేదీని నేను రాజమండ్రి వెడలిపోయితిని. ఎంతో ప్రయాసపడి వస్తు సామగ్రి సిద్ధము చేసితిమి. ఎట్టకేలకు 3-వ తేదీన రాత్రి చెల్లెలిపెండ్లి జరిగెను. నాలుగవనాఁడు పురములోని యుద్యోగిమిత్రులకు విందు చేసితిమి. ఈపెండ్లికి స్వల్పముగనె సొమ్ము వెచ్చించితిమి.

నేను రాజమండ్రిలోనుండు దినములలోనే విడిగా తీయించిన "హిందూసుందరీమణుల చరిత్రముల" ప్రతులు ప్రచురమయ్యెను. వాని లోఁ గొన్ని విమర్శనార్థమై పత్రికాధిపతులకుఁ బంపితిని. ఇప్పుడు

భర్తృవిహీనయై వనరుచుండెడి మా ప్రియజనని కీపుస్తకము కృతియి చ్చి, సంతృప్తి నొందితిని.

౧౪-వ మేయి తేదీ దినచర్యయం దిట్లు గలదు:—

"నే నీ మనోనిశ్చయములను జేసికొన్నాను:—(౧) కోపపరవశుఁడను గాకుండవలెను. (౨) నామాటలవలన నెవనిమనస్సును నొప్పింపవలదు (౩) ఈశ్వరధ్యానమునకై తీఱికకాలము వినియోగింపవలెను. వృథాకాలక్షేపము చేయఁగూడదు. (౪) ప్రలోభనముల బారిఁబడకుండ తప్పించుకొనవలెను. మనస్సునుండి విషయాసక్తిని గోసివేయవలయును." ఇవి యన్నియు మంచినియమములే. వాని నాచరణమునఁ జొప్పించుటయే కష్టతరమగు విషయము!

ఈ వేసవిని రాజమంద్రిలో తమ్ముఁడు వెంకటరామయ్యతోఁ గలసి నేను న్యాయశాస్త్ర గ్రంథములను చదివితిని. అతఁడు రెండవతరగతి పరీక్ష నిచ్చి యిపుడు రాజమంద్రిలో న్యాయవాదిగ నున్నాఁడు. మొదటి తరగతిపరీక్ష కాతఁడును, రెండవతరగతికి నేనును బోవలెనను సంకల్పముతో నిపుడు శ్రద్ధతోఁ జదివితిమి. తమ్ముఁడు కృష్ణయ్యకు ప్రథమశాస్త్ర పరీక్ష యాంగ్ల పఠనీయపుస్తకములు బోధించితిని. పెద్దవార మిద్దఱము నింత శ్రద్ధతోఁ జదువుచుండినను, చిన్నవారలు కృష్ణయ్య సూర్యనారాయణలు వ్యర్థకాలక్షేపము చేయుచున్నారని వారలను జీవాట్లు పెట్టువాఁడను. నా యారోగ్యము సరిగా లేదు. నాకంటెను తమ్ముఁడు వెంకటరామయ్య బలహీనుఁడే యని విచారించుచుండువాఁడను. జనని వ్యాధినిగుఱించి వైద్యాధికారి నడుగఁగా, ఆమె రోగనివారణము కష్టసాధ్య మనియు, తత్శాంతిమాత్రము చేయవచ్చు ననియును, ఆయన చెప్పెను.

నా దేహారోగ్య మెటు లుండినను, ఆత్మారోగ్యము మాత్రము క్రమముతప్పి యుండెను. నా యాత్మకు పాపేచ్ఛ యనునది జీర్ణ వ్యాధిగఁ బరిణమించెను! ఆత్మవ్యాధులు సులభ నివారితము లని పూర్వము నే ననుకొనువాఁడను గాని, అంతకంటె మొండిరోగము లుండవని నా కిపుడు ద్యోతక మయ్యెను.

౧-వ జూన్ తేదీని మిత్రుఁడు కనకరాజు భార్య చనిపోయె నను దుఃఖవార్త విని, నా సంతాపమును సానుభూతిని దెలుపుచు నాతని కొకలేఖ వ్రాసితిని. ౧౭-వ జూన్ ప్రొద్దున బెజవాడ పయనమయితిని. రెయిలులోఁ గూర్చుండి నే నిట్లు తలపోసితిని :—

“ఈ సెలవులలో రాజమంద్రిలో నుండురోజులలో నేను తల్లితో ధారాళముగ మాటాడలేకపోయితిని. విపరీత మిత భాషిత్వము నన్నావహించి యుండెను. దీనికితోడు, ఆమె రుసరుసమనుచు, విరోధ భావమున మెలంగెడిది. తుదిదినములలో మా తండ్రియు నిట్లే యుండెడివాఁడు. కావుననే నే నాయనతో మనసిచ్చి మాటాడనేరకుండెడివాఁడను!” రెయిలులో నేను విశాఖపట్టణమునుండివచ్చు దాసుగారిని గలసికొంటిని. మరల మేము మిత్రులమయితిమి. నేను బెజవాడలో దిగునప్పటికి నన్నుఁ గలసికొనుటకు రాజారావు, విద్యార్థి పానకాలును గనిపెట్టుకొని యుండిరి. రాజారావునింట నేను భుజించితిని. బెజవాడలో ఆస్తికసమావేశము జరిపింతుమని ప్రకటించిన రాజగోపాలరావు మీఁద నేను కోపించితిని.

## ౩౮. “జీవాత్మ — పరమాత్మలు”

ఆ వేసవి సెలవుల పిమ్మట బెజవాడలో యథాప్రకారముగ నాపనులు నేను జేయుచువచ్చితిని. పుట్టినిల్లగు కట్టుంగ

పోయి చాలదినములవఱకును నాభార్య బెజవాడ చేరకుండుటచేత, కొన్నిరోజులు శిష్యమిత్రులు నాకు వంట చేసిపెట్టిరి. ఒక్కొక్కప్పుడు వంటపని నామీఁద పడుచుండుటచేత పాఠశాలపనికిని, ఇతర పనులకును వ్యవధానము చాలక, చికమకలు పడుచుండువాఁడను. దీనికిఁదోడు, నా మనస్సీమను పాపపుఁదలంపు లేపారి తిరుగాడుచుండెను! ఎక్కువపనిచే నేను డస్సియుండినను, పలువిధములగు దుష్ట సంకల్పములు నన్ను విడువనొల్లక, నా మనోవీథిని స్వైర విహారములు సల్పుచుండెడివి! జీవిత మొక విషాదాంతనాటకముగఁ బరిణమిల్లునట్లు తోఁచెను. ఇదిగాక, జ్వరముచేఁ బీడింపఁబడినప్పటికైనను తోడి క్రైస్తవబోధకునివలె నొక దినమైనను నేను బడి మానరాదు! ఐరోపావారు పక్షపాతబుద్ధితో భరతదేశమున క్రైస్తవమతప్రచారము సల్పుచున్నారని నేను మొఱలిడువాఁడను. ఈ చిక్కులలో నేను మరల న్యాయశాస్త్రసంబంధమగు చదువు సాగించితిని.

ఇట్టి విషమస్థితిలో నాకు ౭-వ జూలయిని రెండు జాబులు వచ్చెను. అవి రెండును మా ఋణములనుగుఱించినవియే! తన కీయవలసిన వేయిరూపాయిలు నీయుఁ మని యొక ఋణదాత నిర్బంధించెను. రెండవయుత్తరము మాతమ్ముఁడు వ్రాసినది. మాకు బదు లిచ్చిన వేలివెన్నుకమ్మస్త్రీ యొకతె మామీఁద వ్యాజ్యెము వేసినటు లందుండెను!

౧౦-వ తేదీని నాభార్య తన పినతండ్రితో బెజవాడ వచ్చెను. రాజమండ్రిగాని బెజవాడగాని తనను దీసికొని వచ్చు బంధువులు లేకుండుటవలన తనరాక కీ యాలస్య మయ్యె నని యామె సమాధానము.

## ౩౮. “జీవాత్మ-పరమాత్మలు”

వేలివెన్ను ఋణదాత కిచ్చుటకై పాఠశాలలో పండితులగు కామశాస్త్రిగారియొద్ద నిన్నూఱు రూపాయిలు నే నప్పు పుచ్చుకొని, ౧౫-వ జూలై శనివారమునాఁడు రెయిలెక్కి, నిడదవోలులో దిగితిని. అచట తమ్ములు కృష్ణయ్య వెంకటరామయ్యలు నన్నుఁ గలసికొనిరి. అట్లపాడుమీఁదుగ మేము పోవుచుండఁగా పింగళివారి పెద్ద కోడలు అత్తమీఁదికోపమున కాలువలోఁ బడిపోయె నని మాకచటఁ జెప్పిరి! శవ మింకను కానఁబడలేదు. రాత్రికి మేము వేలివెన్ను చేరి యచట జరిగిన వీధినాటకము చూచి సంతోషించితిమి.

మేము బాకీపడిన కమ్మశాస్త్రితో రాజీ కుదరకుండ నొక తుంటరి యడ్డపడుటచేత, మఱునాఁడు గ్రామము విడిచిపోయితిమి. నేను బెజవాడ చేరినమఱునాఁడే మా పొరుగుననుండు యువతి యొకతె గృహకల్లోలములచేత బందరుకాలువలోఁబడి యాత్మహత్య గావించుకొనెను! మనదేశమునఁ గోడండ్ర ఘోరదుర్మరణము లెపుడంతరించునో కదా!

౨౬-వ జూలయి తేదీ దినచర్య నా కా దినములలోఁగల బాధ నొకదానిని తేటపఱుచు చున్నది:—“న్యాయశాస్త్రపుఁ జదువులు, పాఠశాల పనులును—ఇపుడు నా నిత్యకార్యక్రమము. * * * ఈ భార్యతో నే నెట్లు వేఁగఁగలను? ఒకనాఁడు ముడుఁగుఁదామర, ఒకనాఁడు వికచపద్మమునగు నీ కలహాంతరితను పైసలేని నే నెట్లు ప్రసన్నవదనఁ జేయఁగలను? ఎటు లాభరణములకు ధన మొసంగి సంతృప్తఁ జేయఁగలను?”

తమ్ముఁడు రాజమంద్రిలో చిల్లరయప్పులు తీర్చి వేయుచుండెనని తెలిసి సంతోషించితిని. వేలివెన్ను వ్యాజ్యము జరుగుచునే

యుండెను. తమ చరిత్రమును నేను వ్రాయుటకు వీరేశలింగముగారు సమ్మతింపకున్నను, నే నీవిషయమున కృషి చేయఁదలంచితిని.

జూలయి 30-వ తేదీని మాపేట పఠనమందిర కార్యదర్శి పని మానుకొనఁగ, ఆ యుద్యోగము నా కిచ్చెద మనిరి. నే నొప్పుకొనలేదు. రాత్రి యేడున్నరగంటలకు నా కొకతంతి వచ్చెను. రాజమహేంద్రవరమున మాతల్లికి మూర్ఛ లీనాఁడు విడువకుండ వచ్చుచుండుటచేత, నన్ను మా తమ్ముఁడు, వెంటనే రమ్మని కోరెను. కాఁబట్టి నే నారాత్రియె బయలుదేఱితిని. రెయిలులో నాకొక స్నేహితుఁడు కానఁబడి, ధవళేశ్వరమునందలి యొక వైద్యునిచే మాయమ్మకు మందిప్పించుమని చెప్పెను. రేవుస్టీమరులోనే నా కావైద్యుఁడు కానఁబడి, రాజమండ్రిలో దిగినతోడనె నాతో మాయింటికి వచ్చి మా తల్లిని బరీక్షించి వ్యాధినివారణ చేసెదనని పలికెను. వెంకటరామయ్య వృత్తి సంబంధమగు పనిమీఁద నిడదవోలు వెళ్లి, అక్కడనుండి మా వ్యాజ్యెమునకై తణుకు పోయెద నని చెప్పెను. నేను రాజమండ్రిలో నుండి మాయమ్మ కుపచారములు చేసితిని.

మఱునాఁడు వైద్యునికొఱకు ధవళేశ్వరము వెళ్లితిని. నాతల్లికి భార్యకునుగూడ నాయన మందులు నిర్ణయించి చెప్పెను. ఆరాత్రి బండిమీఁద విధిలేక నేను బెజవాడ బయలుదేఱితిని. మాతల్లియెడ నాకుఁగల ప్రేమాతిశయము నే నెట్లు వెలిపుచ్చఁ గలను? ఆసంగతి యా పరమాత్మునికే యెఱుక !

ఇపుడు నా "గృహనిర్వాహకత్వము", "హిందూసుందరీమణుల" ప్రతులు బాగుగ నమ్ముడువడుచు నా కెంతయు నుత్సాహప్రమోదములు గలిపించెను.

౭-వ అగష్టు మధ్యాహ్నమున తపాలజవాను నాచేత నొక యుత్తరమును నాలుగు పుస్తకములును బడవైచెను. "జీవాత్మ - పరమాత్మల" మీఁది నావిమర్శనమునకే యీనాలుగుపుస్తకములును బహుమతులని యాకమ్మయం దుండెను. ఇవి మార్టినోమహాశయుఁడు రచించిన "నీతిసిద్ధాంతములు" అను పుస్తకసంపుటములు రెండును, "మతవిమర్శనము" అను పుస్తకములు రెండును. ఈ యమూల్యమగు పుస్తకము లందుకొని, నేను హర్షాంబుధి నోలలాడితిని.

హిందూదేశమునం దా సంవత్సరమున నీ బహుమతులకు పోటీచేసినవారిలో నెల్ల, నా మిత్రులును బందరుపురవాస్తవ్యులును నగు శ్రీ వేమూరి రామకృష్ణారావుగారికిని నాకును ఈ మొదటితరగతి బహుమానము లీయఁబడె ననియు, వేఱుప్రదేశములనుండు మఱి యిద్దఱికి రెండవతరగతి బహుమానములుగ మఱికొన్ని పుస్తకము లీయఁబడిన వనియు, నాకుఁ బిమ్మట తెలిసెను.

"జీవాత్మ - పరమాత్మల" విమర్శనమున, ఈశ్వర విశ్వాసమునకు స్వభావజనితజ్ఞానమే ప్రధానమని గ్రంథకర్త చెప్పినవాక్యములు కొన్ని నేను విమర్శించి, ఈవిషయమున ననుభవముకూడ ముఖ్యమని నేను జెప్పితిని.

## ౩౫. నిత్యవిధులు

౧౫-వ ఆగష్టున "సంఘసంస్కరణసమాజము" వారి యాజమాన్యమున బెజవాడలో నొక బహిరంగసభ జరిగెను. డిస్ట్రిక్టు మునసబు టి. కృష్ణస్వామినాయఁడుగారు అగ్రాసనాధిపతులు. నా పూర్వమిత్రులగు కొరిశేపాటి నరసింహాచార్యులుగారు సంస్కరణ పక్షానుకూలముగఁ బ్రసంగించి రాజమంద్రిపండితులు చేసిన యాక్షేపణలను

ఖండించి వైచిరి. నేను కొంచెము మాటాడితిని. సంస్కరణమునకు సుముఖుఁడగు నగ్రాసనాధిపతి, మెల్లఁగను క్రమక్రమముగను సంఘ సంస్కరణము దేశమున నల్లుకొనవలె నని చెప్పిరి.

౨౮-వ తేదీ దినచర్యలో నే నిట్లు లిఖించితిని:—

"స్వార్థపరుని సంకుచిత స్వభావము, వాని ప్రతి పనియందును, పలుకునందును ప్రతిబింబిత మగుచుండును! * * * నా కిపుడు కావలసినది, భాగ్యము కాదు, ఆరోగ్యము కాదు, తుదకు మనశ్శాంతి యైనను గాదు. ఇంద్రియ నిగ్రహ మొకటియే కావలయును! దైవమా! నాకి ది యేల ప్రసాదింపవు?"

౧౮-వ సెప్టెంబరు దినచర్య యిటు లుండెను: — "నేఁడు భార్య, యిరువదిరూపాయిల కొక పట్టుచీర కొనుక్కొనెను. నేను గట్టిగ చీవాట్లు పెట్టఁగ విలపించెను. తుదకుఁ గావలసిన సొమ్ము కొంత నేనీయఁగా సుముఖి యై సంతోషించెను. ధనమహిమ మిట్టిది గదా!"

ఇప్పుడు పఠనాలయమున జరుగుచుండెడి మా ప్రార్థనసమాజసభలకు పెక్కండ్రు విద్యార్థులు వచ్చుచుండువారు. ప్రతివారము నేదో విషయమునుగూర్చి నేను ఉపన్యాస మిచ్చుచుంటిని. ఆదివార ప్రార్థన సభ లేకాక బుధవార సంభాషణ సమావేశములు కూడ నేర్పఱిచితిమి. ౨౦-వ సెప్టెంబరు బుధవారమున మొదటి ప్రసంగసభలో, "విగ్రహారాధనము" ను గుఱించి చర్చ రెండుగంటలవఱకును జరిగెను. విద్యార్థులలో పలువురు చర్చలో పాల్గొనిరి. కొందఱిమాటలలో, తెలివికంటె టక్కఱితనమే ప్రబలియుండినను మొత్తముమీఁద చర్చ సంతోషదాయకముగ నుండెను.

## ౩౫. నిత్యవిధులు

మేము నివసించెడి యింటియజమానియగు గొల్లపూడి శ్రీనివాసరావుగారు కొంతకాలమునుండి నంజువ్యాధిచేఁ బీడింపఁబడి ౨౮-వ సెప్టెంబరున మరణించిరి. ఆయనసతి రూపవతియు గుణవతియు నగు సుదతి. సంతానము లేదు. శవమును శ్మశానవాటికకుఁ గొనిపోవుట కెవరును రాలేదు. అంత రాజారావు వీరభద్రరావు మున్నగు స్నేహితులతోఁ గలసి నేను శవవహనమున సాయముచేసితిని.

౨౭-వ తేదీని రామమోహనరాయల వర్ధంతిని జరిపితిమి. రాయలజీవితమును గుఱించి రాజగోపాలరావు తెలుఁగున వ్యాసము చదివి, తాను రచించిన పద్యపుస్తకములను బంచిపెట్టెను.

దసరా సెలవులకు మేము ఉభయులమును ఏలూరు వెళ్లితిమి. ౨౦-వ అక్టోబరున నచటి పాఠశాలోపాధ్యాయుల తోఁటవిందునకు నన్నాహ్వానించిరి. కామేశ్వరరావుతోఁ గలసి నేను వెళ్లితిని. పురము వెలుపలి జామతోఁటలో కాఫీ మున్నగు ఫలాహారములు గొని, యాటలాడి వినోదించితిమి. మఱునాఁడు నాతోడియల్లుఁడు వెంకటరత్నమును, తరువాతిదినము వల్లూరి సన్న్యాసిరాజుగారును, మిత్రుల కుపాహారము లొసంగిరి. నేస్తులందఱిమును గలసికొని ముచ్చటలాడుకొంటిమి. వెంకటరత్నముతోఁ గలసి షికారు పోవునపుడు, తన సంసార సమాచారముల నాతఁడు నాకుఁ జెప్పెను. ప్రథమమునఁ గుటుంబ కలహములమూలమున భార్యకుఁ దనకును బొత్తు గలియకుండినను, ఇపుడు సామరస్య మేర్పడెనని యతనివలన విని సంతసించితిని. మేమంత బెజవాడ వెడలిపోయితిమి.

అక్టోబరు ౨౩-౨౪ తేదీలందు చట్టనిర్మాణసభలకు ప్రతినిధుల నెన్నుకొనుసభలు బెజవాడలో జరిగెను. మొదటిరోజున పురపాలక

సంఘములపక్షమున గంజాము వెంకటరత్నముగారును, రెండవనాఁడు స్థానికసంఘములపక్షమున జంబులింగమొదల్యారుగారును శాసననిర్మాణ సభాసభ్యు లయిరి. నే నా సభలకుఁ బోయి, "మద్రాసుస్టాండర్డు" పత్రిక ప్రతినిధిగా వార్తల నంపితిని. నా కాదినపత్రిక యుచితముగ వచ్చుచుండెడిది. రెండవనాఁడు యతిరాజులుపిళ్లగారి ఛాయాపట ప్రదర్శనము జరిగెను. అంత ౪ గంటలకు పిళ్లగారి తోఁటవిందు జరిగెను.

నరసాపురోన్నత పాఠశాలకు ప్రథమోపాధ్యాయుఁడు కావలె నని యాదినములలో పత్రికలలోఁ బ్రకటన లుండెను. నే నీపనికి దరఖాస్తుచేసి సాయము చేయుఁడని స్నేహితులను గోరితిని.

మూఁడవ నవంబరున నేను రాజమంద్రి వెళ్లి, తల్లిని తమ్ములను గలసికొంటిని. మా తండ్రిగారి సాంవత్సరికమునకు మా పినతల్లి తప్ప మఱియెవరును రాలేదు. ౬-వ తేదీని కర్మలు పూర్తిచేసికొని, నేను బెజవాడ వెడలిపోయితిని. ౧౦ వ తేదీని న్యాయవాదిపరీక్షకు నేను దరఖాస్తు నంపితిని గాని, పరీక్షలో జయమందెదననెడి యాశగాని, జయమందినపిదప న్యాయవాది నయ్యెడికోరికగాని, నాకు లేదు !

వేలివెన్ను వ్యాజ్యెమునకై నాకుఁ బిలుపు వచ్చుటచేత, ౧౫-వ నవంబరున రెయిలులో నేను తాడేపల్లిగూడెము వెళ్లితిని. నాతోఁ గూడ వీరభద్రరావుగారు వచ్చి రేలంగి వెళ్లిపోయిరి. నేను తణుకు చేరితిని. అచట న్యాయవాదుల యభిమానమున వాది ప్రతివాదులము రాజీపడితిమి. కొంతసొమ్ము మేము వాది కిచ్చుట కంగీకరించితిమి. నే నంతట రాజమంద్రిమార్గమున బెజవాడ వెడలిపోయితిని. నేను పట్టణమున లేనిదినములలో పురప్రముఖులలో నొకరగు సింగరాజు లింగయ్యపంతులుగారు చనిపోయిరి.

డిసెంబరు రెండవవారమున నాయఁడుగారు బెజవాడ వచ్చి, యీప్రాంతములందు ప్రాథమిక పరీక్షలు జరిపిరి. వారితో నేను తెనాలి నూజవీడు రేపల్లె గ్రామములు పోయి, యీ పరీక్షలలో పాల్గొంటిని. నాయఁడుగారు ౨౪-వ తేదీని మద్రాసు వెళ్లిపోయినపిమ్మట నాకుఁ గొంత విరామము గలిగి, న్యాయశాస్త్రపరీక్షకుఁ జదివితిని.

దాసు శ్రీరాములుగారి యేకైకపుత్రిక మరణించె నని ౨౨-వ తేదీని విని మిగుల విచార మందితిమి. ఈమె విదుషీమణి.

న్యాయశాస్త్రపరీక్ష చదువులు నాప్రాణములు నమలివేయఁ జొచ్చెను! నా కెప్పుడైన మనశ్శాంతి కుదురునా యని నే నాశ్చర్యపడితిని. ౩౧-వ తేదీని "హిందూన్యాయశాస్త్రము" ను బూర్తిచేసి, తల తడివి చూచుకొంటిని. ఆసాయంకాలము ఆనకట్టుమీఁదనుండి కృష్ణానదిని దాఁటి, ఆవలియొడ్డునందలి దృశ్యములు మిత్రులతోఁ జూచివచ్చితిని. నూతనవత్సరకార్యముల నాలోచించుకొంటిని. ఇట్లు ౧౮౯౯-వ సంవత్సరము గడచిపోయెను.

## ౩౬. "సతీయుతసంఘసంస్కారి"

ఈశీర్షికతో చిన్న యాంగ్లవ్యాసము వ్రాసి, "సంఘసంస్కారిణీ"పత్రికకు నే నంపితిని. అది ౧౮౯౯-వ సంవత్సరము డిశంబరు ౧౦-వ తేదీని ఆపత్రికయందు "బెజ" అను సంజ్ఞాక్షరములతోఁ బ్రకటింపఁబడెను. ఈ క్రింద నుల్లేఖింపఁబడిన యీ వ్యాససారమును బట్టి, అందలి విషయములు కొంతవఱకు స్వకీయములె యని చదువరులు గ్రహింపఁగలరు:—

"ప్రేమాధిదేవతయగు మన్మథుఁడు, అంధుఁ డని యవనులకును, అనంగుఁ డని యార్యులకును విశ్వాసము. వివాహాధిదేవతస్థితి

యంతకంటె నధమముగ నున్నది! ఈ యుభయదేవతలలోను మన్మథుఁడు మంచివాఁ డనిపించుకొనుచున్నాఁడు! స్త్రీ పురుష హృదయ సమ్మేళనమే యాతనికిఁ బ్రీతికరము. వివాహాధిదేవత యన్ననో, ముఖ్యముగ మనదేశమున తగినంత కారణము లేకయే స్త్రీపురుషులకు నిర్బంధబాంధవ్య మేర్పఱుచుచున్నాఁడు! ఈ కిరాతుని చేతలవలన పెక్కండ్రు స్త్రీ పురుషులు తమజీవితసౌఖ్యమును గోలుపోవుచున్నారు.

"సజ్జనుఁడగు నా మిత్రుఁడు 'సంస్కర్త' ను గూర్చి యిచటఁ గొంత ప్రస్తావించెదను. ఆయనయందు ప్రజ్ఞాసామర్థ్యములు విశేషముగ నున్నను, వానివలని మేలుమాత్రము కడు స్వల్పముగఁ గానవచ్చుచున్నది! ఆయన విద్యావిశారదుఁడు సుగుణభూషితుఁడు నగు నవనాగరకుఁడైనను, వివాహమూలములగు వైషమ్యములవలన, ఆతని ప్రజ్ఞలు క్రియాశూన్యములును, ఆశయములు నిష్ప్రయోజకములును నగుచున్నవి! భావసంపదయు మహాశయభాగ్యమును గలవాఁడయ్యును, ఆతనివిలువ యెఱుంగక యాతనిసందేశములచొప్పున నడువనొల్లని యొక యంగన కాతఁడు గట్టఁబడుట యెంతటి కాలవైపరీత్యము!

"తాను జెప్పినచొప్పున నాచరించుటయే పరమధర్మముగఁ జేసికొనినవాఁ డాపురుషుఁడు! ఇదియే యాదంపతుల కలతలకుఁ గారణము. స్త్రీపురుషులకుఁ జిత్తవృత్తులందుఁ గొంత భేద మే కాలము నందును గాననగును. ప్రకృతమునం దాభేదము మిగుల నతిశయించి యున్నది. మోటుజాతులలో మగవానికి నాఁడుదానికి నెక్కువ యైక మత్య ముండును. ఇరువుర భావములు నాచరణములు నించుమించుగ నేకవిధముననే సాగుచుండును. నాగరకత హెచ్చినకొలఁది

రిప స్థితులలోను భావాదులలోను భేదము లేర్పడును. విద్యావంతుఁడగు పురుషుని యాశయములు విద్యాగంధ మెఱుఁగని స్త్రీకి గొంతెమ్మ కోరికలవలెఁ గానిపించును! శతాబ్దములనుండి స్త్రీవిద్యను నిరసించెడి యీ భారతదేశమున, స్త్రీపురుషులకుఁగల యీ యంతర మధికమై, ప్రకృతమందలి గృహకల్లోలములకుఁ గారణ మగుచున్నది.

“ఒడ్డుపొడుగులందు హనుమంతునికిని వాలఖిల్యులకును గల భేదము, బుద్ధివిషయమున “ఈ సంస్కర్త”కును అతని సతీమణికిని గలదు. గృహజీవితమునుగుఱించి యున్నతాశయములును, భార్యావిద్యాభ్యున్నతి విషయమై యుత్కృష్టభావములును గల యీ ‘సంస్కర్త’ జీవితమున పరాజయ మందెనే! విద్యాధికులగు భారతీయులు పరిష్కరింపలేని సాంఘికసమస్యలకై వారిని నిందింపఁదగదు. పురుషుఁడొక్కఁడే యీ పరాజయమునకుఁ గారణము గాఁడు. కుటుంబ విషయములలో నతనికి సర్వాధికారము లేదు. పశ్చిమదేశములలో భార్య యనఁగ సామాన్యముగ స్వయంవరయగు సుదతియె. అచ్చట వివాహబంధము భగ్నమైపోవుటకు భార్యాభర్త లిరువురలో తప్పక యొకరు ముఖ్యకారకు లని మనము గ్రహింపవచ్చును. భారతదేశమందట్లు కాదు. ‘సంస్కారి’ యాశయముల సద్భావము సంశయింప వలనుపడదు. కాని, యాతనిసతినిగూడఁ బూర్తిగ నిందింప నేరము. అజ్ఞానయై యటవీమృగమువలె నాయిల్లాలు పెరిఁగెను. అజ్ఞానయై నిరతము నడవియందే సంచరింప నామె వాంఛించుచున్నది! ముఖ్యవిషయములం దాపొలఁతి పొరుగు ముసలమ్మలను గురువులఁగఁ జేకొని, భర్తకు ప్రాణసమానమగు నాశయముల నాశన మొనర్చి, అనుతాపలేశము లేక సంసారయాత్ర గడపుచున్నయది!”

## ౩౭. న్యాయవాదిపరీక్ష

మహబూబు పాఠశాలలో బోధకుఁడును, నాయఁడుగారి స్నేహితుఁడును నగు కుప్పురామయ్యగారు, సకుటుంబముగ వచ్చి మాయింట జనవరిలో ౧౦ దినము లుండిరి. ౧౧ యేండ్లవయస్సుగల యాయనకొమార్తె వితంతు వయ్యెను. ఆమెకుఁ బునర్వివాహము చేయఁ దన కుద్దేశముగలదని యాయన నాతోఁ జెప్పఁగ, కాకినాడ లోని నామిత్రు లొకరు తప్పక చేసికొందు రని చెప్పితిని. ౧౧-వ జనవరి తేదీని నేను రాజమండ్రి వెళ్లి యక్కడనుండి యాస్నేహితునికి జాబు వ్రాసితిని. ధైర్యముచేసి వారిపిల్లను వివాహమాడుట ధర్మ మనియు, అట్లు చేయకున్న తమరి నిఁక నెవ్వరును నమ్మరనియును, నేను వ్రాసివేసితిని!

ఆదినములలో బోయరుయుద్ధము సాగుచుండెను. ఉభయసైన్య ములలోను పెక్కండ్రు నిహతు లగుచుండిరి. ధైర్యశాలులును, అల్ప సంఖ్యాకులును నగు పగతుర దెస బ్రిటీషువారికిఁ గల వైఖరిని మేము నిర సించుచుండువారము.

మాతమ్ముఁడు వెంకటరామయ్య నాతో న్యాయశాస్త్ర పుస్తక ములు చదువుచు, తన వృత్తిపనులు చక్కపెట్టుకొను చుండువాఁడు. మాతండ్రి గతించుటకు మేము మిగుల వగచితిమి. ౧౬-వ తేదీని నేను మరల బెజవాడ వెడలివచ్చితిని.

మా మఱఁదలు చామాలమ్మ తనపిల్లలతో బెజవాడ వచ్చి, మాతోఁ గొన్నిరోజు లుండెను. ఆరోజులలో నామెకొమార్తె నగ యొకటి పోయెను. మాయింట 'పాచిపనులు' చేయు నొకపిల్లమీఁద మే మనుమానపడితిమి. కామశాస్త్రిగారు నేనును దానియింటికిఁ

బోయి, నగ యిచ్చివేయు మనియు, లేనిచో చిక్కులలోని కది వచ్చు ననియుఁ జెప్పివేసితిమి. నగసంగతి తనకుఁ దెలియదని యపుడు చెప్పి నను, మఱునాఁ డాశాస్త్రి మావస్తువు మా కిచ్చివేసెను.

౨౬-వ జనవరి దినచర్యయం దిట్లుండెను:—"పాఠశాలాధి కారి క్లార్కుదొర వచ్చుటచేత నేను తమ్ముఁడును న్యాయశాస్త్ర పరీక్షలకుఁ జెన్నపురి బయలుదేఱలేకపోయితిమి. సాయంకాలము పాఠశాలలో నుపాధ్యాయులసభ జరిగెను. బోధకులు దినమున నైదు గంటలు విద్యాలయమునఁ బని చేయవలయు ననియు, అట్లు చేయ నొల్లనివారు పాఠశాల వదలిపోవలయు ననియును, క్లార్కుదొర సగ ర్వముగ నేసానివలెఁ జెప్పివేసెను! భారతదేశవిముక్తికొఱకు పాటు పడెడి క్రైస్తవమతప్రచారకులపద్ధతు లిట్టివి! ఓ జీససా, నీయను చరుల చర్యలనుగూర్చి యశ్రువులెట్లు నీకనుగవనుండి యొలుకుచున్న వో కద!"

౨౭-వ జనవరిని తమ్ముఁడు నేనును మద్రాసు బయలుదేఱి తిమి. రెయిలులోకూడ మే మిరువురమును పరీక్షాపుస్తకములు తిరుగ వేయుచుంటిమి. అంతకుముందె తెనాలిమీఁదుగ మధ్యమార్గమున రెయిలు చెన్నపురి పోవ నారంభించెను. కావున మఱునాఁడు ప్రొద్దు నకే రాయపురము చేరితిమి. మిత్రుఁడు ములుకుట్ల సూర్యప్రకాశరావు గారు తిరువళిక్కేణిలో తమ బసయొద్ద మా కొకగది కుదిర్చిపెట్టిరి. ౩౧-వ తేదీనుండి పరీక్షలు జరిగెను. మొదటి పరీక్షాపత్రము నందలి వలెనే నేనును పాడుచేసితిని. ౬-వ ఫిబ్రవరితో పరీక్ష ముగియఁగా, తల తడివి చూచికొంటిని! మంత్రిరావు వెంకటరత్నముతో మే మిరు వురమును, పార్థసారథికోవెలను దర్శించితిమి. మఱునాఁడు ప్లెచ్చరు విలియమ్సుదొర యొసంగిన 'షేక్సుపియరును' గుఱించిన యుపన్యా

సము విని, ఆయనతో మాటాడితిమి. ౮-వ ఫిబ్రవరిని పరశువాకము వెళ్లి వీరేశలింగముగారిని జూచివచ్చితిమి. ఆయన యచట విశాలస్థలమున నొకభవనము కట్టి, అందు 'వితంతుశరణాలయము'ను నెలకొల్పి నడుపుచుండిరి. ఆసాయంకాలము మేము చెన్నపురి విడిచితిమి.

౨౮-వ ఫిబ్రవరిని వీరభద్రరావుగారితోఁ గలసి నేను రెయిలు స్టేషనునకుఁ బోయి, వీరేశలింగముగారికొఱకుఁ గనిపెట్టుకొని యుంటిని. పంతులుగారు సకుటుంబముగ చెన్నపురినుండి ప్రయాణము చేయుచుండిరి. మేము కొనిపోయిన యన్నము వారు భుజించిరి. తాము విశాఖపట్టణముజిల్లా పోవుచున్నా మనియు, తమతో వచ్చెడి బాలవితంతువును న్యాయపతి శేషగిరిరావుపంతులుగారి కిచ్చి యక్కడ వివాహము చేతు మనియు, వివాహ మగువఱకు నే నీసంగతిని రహస్యముగ నుంచవలెననియును, పంతులుగారు చెప్పిరి. పెండ్లికుమారుని యన్నగారగు సుబ్బారావుపంతులుగారు రాజమండ్రిలో నుండుటవలన, ప్రమాదవశమున నీసంగతి వారికిఁ దెలిసినచో, వివాహమున కంతరాయము సంభవింపవచ్చు నని పంతులుగారి భయము!

ఈరోజున నే మాతల్లి, తమ్ముఁడు కృష్ణమూర్తి, చెల్లెలు కామేశ్వరమ్మయును, మమ్ముఁ జూచిపోవుటకు బెజవాడ వచ్చిరి. వైద్యుని బిలిపించి మాతల్లిని జూపించితిని. ఔషధ మిచ్చెద మని యాయన చెప్పిరి.

నాకు రెండువేలరూపాయిలు బదు లిచ్చెదరా యని నా పూర్వశిష్యుల నిద్దఱిని నే నడుగఁగా, ఈయ లేమని మోమోటముచేఁ జెప్పలేక, వారు కొంత కాలయాపనము చేసిరి. ఈ సంగతిని స్పష్టముగఁ దెలిసికొనుటకై నేను వారియింటికిఁ బోఁగా, వారిలో నొకఁడు తన లెక్కలపుస్తకము నాముందు వేసెను. ఆయనయొద్ద దమ్మిడియైనను

నిలువ లేనట్టుగ నంకె లందు వేయఁబడియుండెను! లేదని చెప్పివేయు టకు శిష్యుఁడు త్రొక్కిన యీ చుట్టుత్రోవకు నాకు విస్మయము గల్గెను!

వీరేశలింగముగారు, వారిభార్యయు, 3-వ మార్చిని తిరిగి మద్రాసు వెడలిపోయిరి. మేము స్టేషనులో వారిని గలసికొంటిమి. ఈ పెండ్లి విషయమున పంతులుగారు చూపిన సాహసచాతుర్యములను మెచ్చుకొంటిమి.

౪-వ మార్చి ఆదివారమున నా దినచర్య యిటు లున్నది:— "భోజన మాలస్యము, భార్యమీఁదికోపము! ఛీ! ఇట్టిబ్రదుకుకంటె మరణమే మేలు! అవిధేయురాలగు భార్య, ఎక్కడఁ జూచిన నప్పులు, తగుమాత్రపు రాబడి, ఉన్నతాశయములు — వీనియన్నిటికిని సమ న్వయ సామరస్యము లెట్లు పొసంగును? * * * * * మేము ప్రార్థన జరిపితిమి. 'సత్యము, సర్వేశ్వరుఁడు' అను విషయమున నేను ధర్మోప న్యాసము చేసితిని. అంత కృష్ణవైపునకు షికారు. మార్టినో విరచిత మగు 'మతపఠనము'ను జదివితిని."

౪-వ తేదీని మా కొక యాకాశరామన్నయుత్తర మందెను. లిపి బాగుగ లేనందున నందలిసంగతులు బాగుగఁ దెలియలేదు. మఱు నాఁడు వీరభద్రరావుగారికి నిట్టి యుత్తరము వచ్చిన ట్లాయన చెప్పి, నా కది చూపించెను. నాభార్య మాటకారి యనియు, గర్వి యనియు నం దుండెను! నలుగురు విద్యార్థులీయుత్తరము వ్రాసె నని యందుఁ గలదు. ఇట్టి యాకాశరామన్న యుత్తరములు నే నెప్పుడు నెఱుఁ గను! ఖిన్నురాలగు నాభార్య యీసంగతి వీరభద్రరావుగారి సతితోఁ జెప్పఁగా, సర్వజ్ఞులగు కవు లింటనేయుండఁగా, పరులనుగుఱించి యను మానపడెద రేమని సాభిప్రాయముగ నాసుదతి ప్రత్యుత్తర మిచ్చెను

న్యాయవాది పరీక్షాఫలితములు ౧౮-వ మార్చిని తెలిసెను. నేను తప్పిపోయితిని. వెంకటరామయ్య వెనుకటివలెనే రెండవతరగతి లోనే జయమందెను. రాజధాని యంతటిలోను మొదటితరగతిలో నొక్కరే గెలుచుటయు, నావలె రెండవతరగతి పరీక్షకు వచ్చినవా రందఱు నపజయము గాంచుటయు, ఈపరీక్షలోని యైదుభాగము లలో రెండింట నేను కృతార్థుఁడ నగుటయును, నాకుఁ గొంత యుప శమనము గావించెను!

'ఏలూరు యువజనసమాజ'సభలో నొక యుపన్యాస మీయుఁ డని నా కిపుడు పిలుపువచ్చెను. "బాల్యస్వర్గము" అను విషయముపై నే నొక యాంగ్లవ్యాసము వ్రాసి, ౮-వ ఏప్రిలున ఏలూరులో జరిగిన సభలోఁ జదివితిని.

కొలఁది రోజులలోనే రాజమండ్రి ప్రార్థనసమాజవర్ధంతి జరిగెను. ఆ సమయమున (౧౫-వ ఏప్రిలు) మా తమ్ముఁడు "భూలోక స్వర్గము" అను తెలుఁగు వ్యాసమును, నేను "వీరసంస్కర్త" అను నాంగ్లవ్యాసమును జదివితిమి. వీరేశలింగముగారి జీవితవిమర్శనమే నా ప్రసంగమునకు ముఖ్యవిషయము. అల్లపల్లి సుబ్బారావుగారు మున్నగు విద్యార్థులు మెచ్చుకొనిరి గాని, నామిత్రుల కంతగ నారచనము రుచింపలేదు. 'పెరటిచెట్టు మందునకు రాదుగదా' యని తలపోసి నే నూఱడిల్లితిని.

## ౩౮. "బాల్యస్వర్గము"

మనుజుని రచనములు వాని యాలోచనముల ప్రతిబింబములు. ౧౯౦౦-వ సంవత్సరప్రాంతములందలి నాయూహాపోహములకును, ఆశయములకును, నే నాసంవత్సరమున లిఖియించిన రెండువ్యాసములు

నిదర్శనములు. ఈరెండు నిదివఱకే సూచింపఁబడినవి. కావున వాని లోని మొదటిదగు "బాల్యస్వర్గము" అను వ్యాసమందలి ముఖ్యాంశము లిందుఁ బొందుపఱచు చున్నాను :—

శిశువు మనుజుని జనకుఁ డని వర్డ్సువర్తుకవి నుడివెను. యౌవనపుఁబోకడలు బాల్యముననె పొడఁగట్టును. పండునూచనలు పూవులోనె కానవచ్చును. కారణముననె కార్య మిమిడియున్నది. తన వంశమునకు భావికాలమున రానున్న విపద్దశ తొలఁగించుకొనుటకై, జ్యేష్ఠపుత్రుఁడు దుర్యోధనుని బాల్యముననె తాను తెగటార్చవలయు ననీ, ధృతరాష్ట్రునికి మంత్రులు హితోపదేశము చేసిరి. బాలకులు వికాసమునొందని చిన్నిమనుజులు.

ఐనను, 'చిన్నిమనుజులని' చిన్నవారిని చిన్నగాఁ జెప్ప నొప్పదు. ఆకాశమంత యాశయు, అభివృద్ధినొంద నపరిమితావకాశము నఖండమనశ్శక్తులును గల చిన్నవారలో, హ్రస్వదృష్టియు సంకుచిత స్వభావము నేర్పడిన పెద్దవారలో, నిజమయిన చిన్నవారలని చదువరులె నిర్ధారణచేసికొనఁ గలరు. ఎన్నిలోపము లున్నను శైశవముతోనె నాకు సానుభూతి. పెద్దవారలతోడి స్వర్గమునకంటె చిన్నవారలతోడి నరకమె, నాకు వాంఛనీయము!

బాల్యసుఖములె నిశ్చితమైన సుఖములు! — పిన్నవాని పిన్ననవ్వు గగనతలమందలి బాలచంద్రునిఁ దోఁపించును. ఒక కవి వర్ణించినట్టుగ, మనుజుని కపోలతలమునఁ బొడసూపు నల్లనివెండ్రుకలు మొలకలెత్తు పాపబీజములను స్ఫురించును. దీనితో బాలకుని నిష్కాపటమగు మోముదమ్మిని బోల్చి చూడుఁడు! స్ఫటికమువలె స్వచ్ఛముగను, వికసించు మల్లియవలె పరువముతోను, అయ్యది యొప్పుచుండును. స్వర్గలోకసుఖముల నిది స్ఫురించుచుండును! స్వాభావికముగ సుగుణ

మణియగు జీవాత్మ, ప్రాపంచిక కలుషములచేఁ గప్పఁబడి, రానురాను తన నైసర్గిక నైర్మల్యమును గోలుపోవుచున్నదని నేను నమ్మెదను.

బాల్యమునకుఁగల ప్రథమలక్షణము, అమాయికత్వము. అది వట్టి యజ్ఞానము గాదు. శైశవమందలి నిర్మలత్వము, ఆత్మకు నైసర్గికముగఁ గల పవిత్రతయె. ఎవ్వాని ఋజువర్తన ప్రభావమున వానియాత్మ యీసౌరభవిశేషమును గోలుపోవదో, వాఁడె ధన్యజీవితుఁడు !

అమాయికత్వ మనఁగా, నిరపరాధత్వమె కాదు, అపరాధ మాచరింప నేరకుండుటయును. శోధనలకు దూరముగ నుండుట కాదు, వానికిలోనయ్యును వాని తాఁకుడును లెక్కసేయ కుండుటయె, యీ యమాయికత్వమునకు గుఱుతు. సుగుణసౌందర్యరాశియగు జానకి యిట్టి యమాయికత్వమునకు గొప్పతార్కాణము. లోకకష్టములు కలుషములు నాపుణ్యవతి నెదుర్కొనకపోలేదు. కాని, యీ సుగుణప్రభావమున, ఆసుశీలకుఁ గలిగిన శోధనలబలము పటాపంచలయ్యెను. ఈ భూనాటకరంగమున నాకాంత కార్యకలాపము ముగించుకొని, మరల తన జననీగర్భమునకు నిష్క్రమించెను !

శైశవమునకుఁగల ముఖ్యలక్షణము అమాయికత్వమని నావాదము. దీని నరికట్టుటవలననే నైతికబాలారిష్టములు వాటిల్లుచున్నవని నామతము. పెద్దవారలగు మనలను జూచి బాగుపడుటకు మాఱుగా పిల్లలు మఱింత పాడగుచుండుట, మనకంటె వారలె సజ్జనులని సాటుచున్నది ! పెద్దవారలచేష్టలు చర్యలును పిన్నవారలకు మార్గప్రదర్శనములు గాకున్నవి. మన దురభ్యాసములు దురాచారములును ముఖ్యముగ బాలురు చెడిపోవుటకుఁ గారణము లగుచున్నవి. బాలురు మన దుర్వ్యసనములఁ గనిపెట్టుట లేదనుకొనుటకంటె పెద్ద పొరపాటు లేదు. వేయికనులతో వారు మన యపరాధముల నీక్షించుచున్నారు.

## ౩౮. "బాల్యస్వర్గము"

బాల్యలక్షణ మింకొకటి నిష్కాపట్యము. బాలుర స్నేహములు, వారల మధుర భాషణములును సద్భావపూరితములు. ఒకపాఠశాలలో తరగతియందు నొక బాలకునిచెంతఁ గూర్చుండు మని యందున కిష్టపడని విద్యార్థిని నేను నిర్బంధింపఁగా నతఁ డేడ్చి, "మాయిద్దఱికిని విరోధమండి! మేము దగ్గఱగా నుండఁజాలమ"ని వాఁడు మొఱపెట్టెను. ఆ బాలకుని నిష్కాపట్యమునకు నివ్వెఱపడితిని. 'పెద్దవారలగు మా కిట్టి నీతి యుండిన నెంత బాగుండు!' నని నే నపు డనుకొంటిని. లోని తలంపులు బయల్పడకుండఁ జేసికొనుటయే పరమావధియని పెద్దవారల మనుకొనుచున్నాము! కావుననే యేండ్లు పైఁబడినకొలఁది మోక్షదూరుల మగుచున్నాము!

బాల్యలక్షణములలో నింకొకటి విశ్వాసగుణము. కౌతుకాశ్చర్యములతో జ్ఞానోత్పత్తి యగుచున్నది. ఇవియె విశ్వాసమున కెల్ల మూలకందము. శైశవమున భూలోక మంతయు చిత్రవస్తుప్రదర్శనశాలవలెఁ గానిపించును! ప్రశ్నోత్తరములతో నిండియుండు బాలకుని మనస్సునకు విశ్వాసము పట్టుగొమ్మ యగుచుండును. జననీజనకులు, వయోవృద్ధులును, విశ్వాసపూరిత హృదయులగు బాలకులకుఁ బూజనీయులగుచుందురు. పిన్నవారల భక్తిప్రేమము లందుకొన నర్హత గలిగి యుండుటకైనను, పెద్దలు పూజ్యత దాల్చియుండుట కర్తవ్యముగదా!

"క. గురువులు తమకును లోఁబడు
తెరువులు చెప్పెదరు విష్ణుదివ్యపదవికిఁ
దెరువులు చెప్పరు, చీఁకటిఁ
బరువులు వెట్టంగ నేల బాలకులారా?"

అని బాలుఁడగు ప్రహ్లాదుఁడు తోడిబాలకుల కుద్బోధించెను. బాలహృదయములు గ్రోలుటకుఁ దగినమాధుర్యము లేక నిస్సారతను

దాల్చియున్నవి, పెద్దలగు మన చరిత్రములు! ఇట్లనుటవలన పెద్దవార లందఱు దుశ్చరితులని నేఁ జెప్పుటలేదు. చిన్నవారల చిత్తముల నాకర్షింపఁగల యోగ్యత మనలో మట్టుపడుచున్న దనియే నామొఱ!

బాలుర మంచిలక్షణముల పూర్తిపట్టిక నిచ్చుట నాతలంపుగాదు. అమాయికత్వము నిష్కాపట్యము విశ్వాసము మున్నగు సుగుణములు, బాల్యమునకుఁగల సౌందర్యగౌరవములకు హేతువులు. పెద్దలను గ్రిందుపఱుచుట నా యభిప్రాయము కాదు. సుగుణములతోఁ జెన్నొందు పెద్దఱిక మెప్పుడును శ్లాఘాపాత్రమె. అమాయికత్వాదిగుణభూయిష్ఠమగు బాల్యము, సుజ్ఞానోపేతమగు పెద్దఱికముగఁ బరిణమింపవలయు ననియె నామతము. నిష్కాపటుఁడగు బాలకుఁడు, నిర్మలినుఁడును, నియమబద్ధుఁడునగు పురుషునిగ వికసన మందవలయును. బాల్యమున వార్ధకపు దుర్గుణములును, వార్ధక్యమున యౌవనమదాంధత్వమును, బొడసూపుటకంటె ననర్థ మేమిగలదు? పెద్దవారలు తమ పెద్దఱికమును నిలుపుకొను నుదారచరితులై, పిన్నవారలకు శీలసౌష్ఠవ మేర్పడుటకు సహకారు లయ్యెదరుగావుత!

## ౩౯. "వీరసంస్కర్త"

నా రెండవ వ్యాస మగు "వీరసంస్కర్త" సార మిచట వివరింపఁబడుచున్నది :—

'కార్లైలు' శూర నామమును వివిధవృత్తులలోనుండువారల కొసంగి యున్నాఁడు. తన విధ్యుక్తములను ధైర్యసాహససద్భావములతో నిర్వర్తించువాఁడె శూరుఁడు. కత్తిగట్టి దేశస్వాతంత్ర్యమునకై పోరాడు సైనికునివలెనే, స్వదేశమును గలంచెడి దురాచారముల నెదుర్కొని, వానిని నిర్మూలన మొనరింపనూనెడివాఁడును శూరుఁడె.

## ౩౯. "వీరసంస్కర్త"

సంఘసంస్కరణ విషయమునఁగూడ శూరులు గానవచ్చు చున్నారు. దేశీయుల దురభిమానదుర్భ్రమలను లెక్కసేయక, సంఘశరీరము నందలి దుష్టాంగమును ఖండించివైచు చికిత్సకుఁడై, వలసినయెడ తనసుఖమును తనయసువులను తాను బూనిన యుత్తమకార్యనిర్వహణమున కై యర్పణచేయువాఁడె శూరుఁడు. సంఘసంస్కర్త కార్యకలాపము సుఖశయ్య యని తలంపరాదు. దైవముపట్లను తోడిమానవులదెసను జెల్లింపవలసిన విధ్యుక్తములు చెల్లించుటతప్ప నన్యాపేక్షలతో సంస్కరణరంగము చొచ్చువాని కాశాభంగమె కలుగును.

కావున సంస్కర్తయు శూరుఁడె. ఎంత హీనస్థితియం దుండిన జాతిలోనైనను శుభోదయసమయమున సంస్కర్త పొడసూపుచుండును. పరదేశీయులచే జయింపఁబడిన భారతదేశము తరతరముల నుండి యంతశ్శత్రులదాడికిని లోనగుచువచ్చెను. నిరర్థకకర్మలకును, హేయదురాచారములకును భారతమాత దాస్యము చెల్లింపుచుండెను. అంత వంగదేశమున రామమోహనుఁ డుద్భవించి, సహగమననిరోధము గావించి, స్త్రీస్వాతంత్ర్యమునకు రాజమార్గ మేర్పఱిచెను. ఈశ్వరచంద్రవిద్యాసాగరుఁడు వితంతువివాహములు నెలకొల్పెను. బొంబాయి రాజధానిలో విష్ణుపండితుఁ డీసంస్కరణమునకు ప్రాచుర్యము గలిగించెను.

ఇంక మనరాజధానిమాట యేమని యెవరైన నడుగవచ్చును. విద్యాధికతా ధనసంపన్నతలు వెలసియుండు దిక్కున సంస్కర్త యుద్భవము గాలేదు. దాక్షిణాత్యులలో నెల్ల నిట్టి భాగ్యము మన యాంధ్రులకే సంప్రాప్తమయ్యెను. 'నాటుపుర' మందలి యొక విద్యాబోధకునికీ గౌరవము లభించెను! ౧౮౭౯-వ సంవత్సరము డిసెంబరు

# ఆత్మచరిత్రము

౧౧-వ తేదీని రాజమండ్రిలో జరిగిన ప్రథమవితంతువివాహము శ్రీకందుకూరి వీరేశలింగముపంతులనామమునకు దేశవిఖ్యాతిని గలిగించెను. కారణము లేని కార్యమెన్నఁడును గలుగనేరదు. ప్రస్తుతమున నాంధ్రులెంత హీనదశలో నున్నను, పూర్వకాలమున ప్రఖ్యాతిగనిన జాతియె వారిది. కృష్ణదేవరాయల కాలమున నాంధ్రరాజ్యము దక్షిణహిందూదేశమంతటను వ్యాపించియుండెను. వారిభాష లాలిత్యమృదుత్వములకుఁ బర్యాయపదమయ్యెను. వారి కవితా సారస్వత మౌన్నత్యము దాల్చెను. అదివఱకె ఆంధ్రదేశమునకు రాజమహేంద్రవరము మధ్యస్థాన మయ్యెను. దక్షిణదేశవాహినులలో మిన్నయగు గోదావరినదీతీరమున నాపురము భాసిల్లుచుండెను. ఆపట్టణమున నన్నయభట్టు తన యాంధ్రభారతమును రచియించి, ఏలికయగు రాజనరేంద్రుని కంకితమొనరించెను. ఆ ప్రాంతములందె ఆంధ్రకవిసార్వభౌముఁ డగు శ్రీనాథుఁడు గ్రుమ్మరుచుండువాఁడు.

వీరేశలింగకవి ఆంధ్రులలో నాంధ్రుఁడు. వీరిది విద్వద్వంశము. ప్రవేశపరీక్షవఱకె యాయన యాంగ్లవిద్య నేర్చియుండినను, ఆంగ్ల సారస్వత సారమును గ్రోలినవాఁడని చెప్పవచ్చును. విద్యాబోధకవృత్తి నవలంబించిన యీయువకుఁడు, స్త్రీ విద్యాభిమానియై బాలికాపాఠశాల నొకటి ధవళేశ్వరమున స్థాపించెను. పత్రికలకు వ్యాసములు వ్రాసి పంపుచు, పిదప 'వివేకవర్ధని' యను పత్రికను నెలకొల్పెను. మొదట పద్యములు రచియించుటతోనె కాలము గడపినను, అంతకంత కీయన గద్యరచన మారంభించి, సంస్కరణ విషయములను జర్చింపసాగెను. వితంతూద్వాహములను బ్రోత్సహింప నొకసమాజమును స్థాపించి, అంత వీరేశలింగముపంతులు ఆసంస్కరణమును గురించి విజ్ఞాపనములు ప్రకటించెను. కార్యరూపము దాల్చినఁగాని యెట్టి సంస్కరణమునకును

దృఢత్వస్థిరత్వము లేర్పడవనినమ్మి, యాయన ౧౮౮౧-వ సంవత్సరము ౧౧-వ డిసెంబరున రాజమహేంద్రవరమున ప్రథమవితంతువివాహము జరిగించిరి.

వాక్కునకు లేని చైతన్యవిశేషము కార్యమునకుఁ గలదు. మాటలకు లొంగక నిదురించెడి సంఘము పనుల కదలిపడి లేచి, ఆలోచన చేయఁదొడంగెను. అంత, వితంతూద్వాహసంస్కరణము నణఁచి వేయ సంఘములోని పూర్వాచారపరులు విశ్వప్రయత్నములు చేసిరి. పంతులను పంతుల మిత్రులను వారు బహిష్కరించిరి. వీరేశలింగము గారి యనుచరు లంత నొక్క రొక్కరె బహిష్కారభీతిచే నొత్తిగిల్లినను, ఆయనమాత్రము గొంకకుండెను. ౧౮౮౮-వ సంవత్సరమునఁ దన ప్రియమిత్రుఁడు గవర్రాజుగారు మృతినొందినను, వీరేశలింగము పంతులుగారు ధైర్యస్థైర్యములు వీడకుండిరి. తా నొకఁడె రణరంగమున నిలువవలసివచ్చినను, వీరేశలింగముపంతు లించుకయైనను జలింపని ధీరత్వమునఁ బోరు సల్పెను. కావుననె యా మహాశయునికిని, ఆయన చేపట్టిన యుద్యమమునకును సంపూర్ణవిజయము చేకూరెను. కాకినాడ వాస్తవ్యులు పైండా రామకృష్ణయ్యగారు వితంతూద్వాహములకు వలసిన ధనసాహాయ్యముచేసిరి. బహిరంగముగ పంతులుగారితో భోజనముచేయ సాహసింపని విద్యార్థికు లెందరో యాయనకుఁ దోడుపడిరి. మొదటినుండియు విద్యార్థు లాయనకు సహచరులుగ నుండిరి. వీరేశలింగముగారి వితంతూద్వాహసంస్కరణము రానురాను దేశీయుల యామోదము వడసెను. ఆసంస్కరణ మిపుడు పల్లెలకును పట్టణములకును బ్రాకఁజొచ్చెను.

ఇట్టి వీరేశలింగసంస్కర్త శూరుఁడేకదా! ఈతఁడు కట్టుకథలలోని ఓడిను, పరదేశవీరుఁడగు క్రాంవెలు, నరరక్తపాత మొనరించిన

నెపోలియనును, కనుల మిఱుమిట్లు గొలిపెడి కవితానైపుణ్యము గల షేక్స్పియరును గాకపోవచ్చును! ఇతఁడు మన తోడియాంధ్రుఁడు. షేక్స్పియరునకుఁగల కవితాశక్తియు, క్రాంవెలునకుఁ గల బాహుబలమును, ఈతనికిఁ గలదని చెప్పువాఁడను కాను. కాని, సంస్కరణ విషయమున వీరియందువలెనే యీయనయందును శౌర్యగుణము ప్రస్ఫుట మయ్యెను. శూరునికి సద్భావము ప్రథమలక్షణము. వీరేశలింగము పంతులను సద్భావమున మించువా రుండుట యరుదు. ఆచారకాలసర్పము కోఱలు పెఱికి, మఠాధిపతుల తీవ్రాస్త్రములను వమ్ముచేసి, సంఘమువారి శాపముల విఫలముచేసి, మన హాస్యములను క్రౌర్యములను సహనబుద్ధితో క్షమించిన యీధీరుని పేరు, లూథరు, తియోడోరు పార్కరు, రామమోహనరాయలు మున్నగు యోధుల నామముల ప్రక్క కనకాక్షరములతో లిఖియింపఁదగినదియొకదా! ధైర్యమునందు, బుద్ధిస్వాతంత్ర్యమునందు, క్షితిని జయింపఁజాలిన క్షమాగుణమునందును, దక్షిణహిందూదేశమున నీతనితో సరిసమాను లెవ్వరు? ఉత్ప్రేక్షాతిశయోక్తులతోఁ బొద్దుపుచ్చు నాయుద్యమము కాదు. కేవలసత్యమును గూర్చిన నా నిశ్చితాభిప్రాయమె నేను వక్కాణించుచున్నాను. ఈనాయకుఁడు అసమానప్రజ్ఞయు, స్వతంత్రబుద్ధియు, సమధికవాక్శక్తులతో వెలయుచున్నాఁడని చెప్పువాఁడను గాను. ఆయనకుఁగల లోపములు నాకంటె నెవరికిని బాగుగఁ దెలియవని చెప్పఁగలను. ఐనను, నిశ్చితబుద్ధి, స్వార్థత్యాగము, నయసంపద —— వీనియందు మాత్రము ఉన్నతస్థానమునకును, అగ్రస్థానమునకును, నానాయకుఁ డర్హుఁడని నమ్మువాఁడను.

సంఘసంస్కరణము తీక్ష్ణత దాల్చియుండెడి యాపూర్వదినములలో వీరేశలింగ సంస్కర్తకు చెడుగనిన బొత్తిగ నోరిమి లేకుండె

డెను. యుద్ధరంగమున మృదువగు సాధనములు ప్రయోగింప నాయన కిచ్చలేదు. దౌష్ట్యము నొక్కి పెట్టున దుడ్డుఁగఱ్ఱతో మోదుటకె యాతఁ డభ్యాసపడియుండెను. ఆయన ప్రహసనములు వ్యక్తిగతము లని యందఱు నెఱుఁగుదురు. ఆప్రహసనములందలి ముఖ్యపాత్రలు సజీవులగు మనుజులె. రాజమహేంద్రనగరవీథులలో రాత్రులు పడుపుటిండ్లకుఁ జేరెడి విటకాండ్రును, న్యాయసభలలో నున్నతాసనము లధిష్ఠించు నీతిదూరులగు నుద్యోగస్థులును—వీరందఱును తన ప్రహసనములకై ప్రత్యేకముగఁ గల్పింపఁబడిన పాత్రలనియె కాక, నీతిపథమునకు న్యాయమార్గమునకును ముఖ్యముగఁ దనకును అగర్భశత్రువులనియె యాయన దలంచువాఁడు! వారియెడ నాయన గాంచిన గాఢమైన, హృదయపూర్వకమయిన, క్రోధమునకుఁగల రహస్య మిదియె!

తనప్రక్క టుపాకి వ్రేలాడుచుండ, ఒఱనుండి తీసిన కత్తిని ఝుళిపించుచు యుద్ధసన్నద్ధుఁ డగు వీరభటునివలె వివేకవర్ధనీ పత్రిక యాదినములలో వారమువారమును నీతిన్యాయముల నుల్లంఘించు వారలతోఁ బోరుసల్పుచుండెడిది. అందలి యుపన్యాసముల కెట్లు దౌష్ట్యద్రోహములు వడంకుచుండెనో యిప్పటికిని గొంద ఱెఱుంగుదురు. ఆయన ప్రహసనము కటువుగ నుండునట్లె, వారివ్యాసము గాంభీర్యము వహించి యుండెను.

వీరేశలింగముపంతులపేరు సంఘసంస్కరణ విషయములందు వలెనే సాహిత్యపునరుద్ధరణమునందును విఖ్యాతి గాంచెను. ఈరచయిత ప్రకృతాంధ్రవచన చతురాననుఁడు.

సంస్కృత సారస్వత సాంగత్యమున నాంధ్రకవిత్వము పూర్వము వినుతికెక్కినరీతిని, ఆంగ్లసాహిత్యసంపర్కమున ప్రకృతమున నాంధ్రవచనము సుస్థితికి వచ్చెను. ఈకార్యము వీరేశలింగకవి

కృతమె కావున, దీనికీర్తి యంతయువారిదె. వీరిశైలమువలెనే, వచన శైలియు, స్వచ్ఛత, మృదుత్వము, బలిమియును దాల్చియున్నది.

మొదటి యాంధ్రకవులవలెనే యీప్రథమాంధ్ర వచనరచయితయు, భాషాంతర గ్రంథరచనముతోనె కాలము గడపవలసి వచ్చెను. అన్యభాషలలోఁగల సొంపులను మాతృభాషలోనికిఁ గొనిరావలసిన భార మాయన వహింప వలసివచ్చెను. ఆయన సొంతకావ్యము లల్లుటకిదియె వ్యాఘాత మయ్యెను. ఇదిగాక, బంగాళీసారస్వతమున ప్రథమవచనరచయితలగు రామమోహన విద్యాసాగరులవలె, వీరేశలింగము పంతులు కూడ సంఘసంస్కరణమునకె వచనగ్రంథముల నధికముగ రచియించెను. సత్యమును విస్పష్టముగను, విపులముగను, మోమోటములేకయు నాయనఁ జెప్పవలెను గావున, ఆయన శైలియు స్వచ్ఛముగను స్పష్టముగను సూటిగను నుండెను! ఇంతియకాదు. ఈ గుణములతోను, సంస్కరణాభిలాషతోడను విలసిల్లెడి వచన శైలిని మనయాంధ్రమునకుఁ గల్పించి కానుకగ నొసంగిన కీర్తిని శాశ్వతముగ నీమహామహుఁడు సంపాదించెను!

## ౪౦. సమష్టికుటుంబ కష్టములు

౧౯౦౦ సం॥ ౧౯-వ యేప్రియలున నాకష్టములను దలపోయుచు, ఎచటఁ జూచిన నష్టాలు, ఇంటిలోనిపోరు, చెడుతలంపులు, కార్యగతముకాని సంకల్పములు,—ఇవియె నాముఖ్యశోధనములని గుర్తెఱిగితిని. ౨౧-వ తేదీని జరిగిన 'నియోగి సహాయక సభ'కు నే నగ్రాసనాధిపతిని. నారెండవ పెదతండ్రి కుమారుఁడగు పట్టాభిరామయ్యకు ముప్పదిరూపాయిలు వేతన మప్పుడీయఁబడెను.

# ౪౦. సమష్టికుటుంబ కష్టములు

౨౩-వ అక్టోబరున ఆదిపూడి సోమనాథరావుగారు వచ్చిరి. సంఘ బహిష్కృతులగు నాయనకు మాయింటనే యాతిథ్య మిడితిని. రోజం తయు వారితోనే సంభాషణమున నుంటిని. ఆయన సాయంకాలమం దొక చక్కని యుపన్యాస మిచ్చిరి.

౨౪-వ తేదీని దివ్యజ్ఞానప్రచురణము నొకటి చదివి, మూఢత్వ మను గాఢాంధకారమున దివ్యజ్ఞానసామాజికులు చెరలాడుచుండి రని నే నెంచితిని. పశ్చిమఖండవాసుల విజ్ఞానమునకంటె ప్రాగ్దేశీయుల మూఢత్వమే యీ సమాజమువారికి ప్రియతరముగఁ గానవచ్చుచున్నది!

౬-వ మేయి ఆదివారము తెల్లవారుజామున వైద్యాలయాధి కారియగు డాక్టరు వెంకటసుబ్బయ్యగారి జవాను వచ్చి నన్నుఁ బిలి చెను. వారములు చేసికొని మాపాఠశాలలోఁ జదువుచు కాలిబంతి యాటలోఁ గడు నేర్పరియైన పి పులిపాక వెంకయ్య మిగుల జబ్బుగా నుండినట్లు వానివలన విని, నేను వైద్యునింటికేగితిని. పాపము వెంకయ్య వెనువెంటనే మరణించెను! హృద్రోగమువలన నాతఁ డింత త్వరగ మృత్యువునోటఁ బడెనని వైద్యులు వెంకటసుబ్బయ్యగారి యభి ప్రాయము. కొలఁదికాలముక్రిందటనే యాతనికి పెండ్లియయ్యెను! వెంకయ్య కిచట బంధువులు లేకుండుటవలన మేమే యాతనిశవమును శ్మశానవాటికకుఁ గొనిపోయి దహనాదిక్రియలు జరిపించితిమి. నిన్నటి వఱకును మందహాసమున బంతులాడెడి యీయువకుఁడు మరణించె ననుట మా కెవరికిని విశ్వసనీయము గాకుండెను! ఆహా! జీవిత మెంత యస్థిరము!

౮-వ మేయి పాఠశాల కీయర్ధసంవత్సరమున తుదిదినము. దాసు గారి కీపాఠశాలతోడిసంబంధ మీనాఁటితోఁ దీఱెను. చివరవఱకును సుగుణదుర్గుణములు మనుజుని వీడకుండునుగదా!

విద్యార్థు లాసాయంకాలమున విజ్ఞాపనపత్ర మాయన కర్పించిరి. ఆసమయమున మాబోటి ప్రత్యర్థి బోధకులను బరిహసింప నొకసంభాషణముకూడ సిద్ధపఱచిరి! కాని యది పిమ్మట విరమింపఁబడెను. పాటలు, విజ్ఞాపనము, వక్తలలో నొకరగు గోపయ్యగారు చేసిన ప్రసంగమును, సహోపాధ్యాయులగు మమ్ము ననుగుఱించిన యెత్తిపొడుపుమాటలతో నిండియుండెను. ఎంత శ్లాఘింపఁబడినను, చెడుగు మంచిగఁ బరిణమింపఁగలదా?

ఈసమయమున మాతల్లియు, చిన్నచెల్లెలును మాతో బెజవాడలోనే యుండిరి. మాయమ్మకు వెనుకటి జబ్బు అప్పుడప్పుడు కానఁబడుచునే యుండెను. వైద్యుని బిలిచి, నేను మందు తెచ్చి యిప్పించితిని. తమ్ముఁడు కృష్ణయ్య తంత్రీశాఖాపరీక్షకు విశాఖపట్టణము వెళ్లియుండుటచే, నేను రాత్రులు నిద్ర మాని వ్యాధిగ్రస్తయగు మాయమ్మకుఁ బరిచర్యలు చేసితిని.

౧౦-వ మేయి తేదీని నే నొక దివ్యజ్ఞానసమాజ సభ్యునితోఁ బ్రసంగించితిని. తత్త్వశాస్త్రసంబంధ మగు నద్భుత విషయములు నాకును హర్షదాయకము లయ్యెను, వానిని విమర్శించునపుడు దివ్యజ్ఞాన సమాజమువారి పద్ధతిగాక, "లండను మనశ్శాస్త్ర పరిశోధక సమాజము" వారివిధానమె నాకు యుక్తముగఁ దోఁచెను. అంధప్రాయమగు విశ్వాసమునకంటె శాస్త్రబద్ధవిమర్శనమే నాకుఁ బ్రియము.

మే మంత, వేసవిసెలవులకు బెజవాడనుండి వెడలిపోయితిమి. తనతమ్ముఁడు శేషగిరిరావుగారిటీవల చేసికొనిన వితంతువివాహ మశాస్త్రీయ మని దానిని రద్దుపఱిపింప సుబ్బారావుపంతులు గారు ప్రయత్నించుచుండి రని సాంబశివరావుగారివలన విని మేము విచార

పడితిమి. చిరకాలస్నేహితులగు వీరేశలింగముగారు తనతోఁ జెప్పక తనతమ్మునికి కిట్టిపెండ్లి చేయించిరని సుబ్బారావుగారు వీరేశలింగముగారియెడ నాగ్రహముఁ బూనియుండిరని వింటిమి.

౨౩-వ మేయి దినచర్యలో నిటు లున్నది:— "మరల మా యమ్మగారు మామఱఁదలితో వైరము సాగించుచున్నది. ఇదివఱకే నా భార్యకు మాతల్లియం దనుగ్రహముగదా! కర్తవ్య మేమి?" ఆరోజులలో రాజమంద్రిలో విషూచిజాడ్యములు వ్యాపించియుండెను. ౨౭-వ మేయిని మాపొరుగుననుండు వేపా లక్ష్మీనరసింహముగారికి విషూచి సోఁకెను. ఆయన కిచట భార్యయు, బిడ్డయు మాత్రము గలరు. అంత మేమాయనను వైద్యాలయమునకుఁ గొనిపోయి యచట విడిచివచ్చి, భార్యను పిల్లవానిని మాయిల్లు చేర్చితిమి. మొదట మే మాయనను గుఱించి భీతిల్లితిమి గాని, కొలఁదిరోజులలోనే యాయనకు నెమ్మది కలిగెను.

మా కెచటనైన పెద్దయప్పు లభించినచో, చిల్లరబాకీలన్నియును దీర్చివేయుద మనుకొంటిమి. రాజమంద్రిన్యాయవాదులు మోచర్ల రామచంద్రరావుగారు తమ బావమఱఁదితో బాగుగ నాలోచించుకొని, నూటికి ౧౨ అణాలు వడ్డీచొప్పున నొక వేయిరూపాయిలు మా నివేశనస్థలముల తనఖామీఁద మా కప్పిచ్చుటకు సమ్మతించిరి. ౩౧-వ మేయి తేదీని మే మంతే రామచంద్రరావుగారికి దస్తావేజు వ్రాసి రిజిష్టరు చేయించి, సొమ్ము పుచ్చుకొని, చిన్నయప్పులు తీర్చి, పెద్దఋణదాతలకుఁ గొంచెము కొంచెముగఁ జెల్లించితిమి.

౧౮-వ జూను తేదీ దినచర్యయందు నే నిట్లు లిఖించితిని:— "తమ్మునితో పెద్దబజారు వెళ్లి, అతనిభార్య కీనాఁడు రెండుచీరలు

గొంటిని. ఆమె యిదివఱకు రెండుమూడుకోకలతోనే గడపుకొనుచుండె నఁట! మాయమ్మకు నన్నుగుఱించి దురభిప్రాయములు గలవు. సంసార వ్యవహారములు నాకు నచ్చుచుండలేదని యామె యపోహము! సత్యము సర్వజ్ఞునికే యెఱుక!"

జూను ౧౮,౧౯ తేదీలలో నేను వెంకటరామయ్యయును కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి బసకుఁ బోయి, ఆయనతో దీర్ఘసంభాషణము చేసితిమి. అరుంధతినిగుఱించి యాయన కొన్ని వినోదకరములగు నంశములను మాకుఁ జెప్పెను. మే మచట నుండు నపుడు, మొదటినాఁడు వారి పసిబిడ్డ యుయ్యాలనుండి క్రిందఁ బడి పోయెను. వేగమే వచ్చి బిడ్డను దీయుమని యాత్రమున భార్యను బిలుచునపుడైనను పంతులుగారు గ్రామ్యభాషాప్రయోగము చేయకుండుట మా కాశ్చర్యమును గొలిపెను!

ఓరియంటలు భీమాసంఘమువారు, మాతమ్ముఁడు వెంకటరామయ్యవలనఁ గొంచె మదనముగ సొమ్ము పుచ్చుకొని, భీమా కంగీకరించుటకు సంతోషించితిమి.

౨౦-వ జూను తేదీని వస్తువులను సరదికొని, భార్యతో నేను బెజవాడ బయలుదేఱితిని. మాతల్లి మితభాషిణిగ నుండి, మేము ప్రయాణము చేయుటకుఁ గోపించెను! రాత్రికి బెజవాడ చేరితిమి. పూర్వపు ప్రధానోపాధ్యాయుఁడు వెడలిపోవుటచేత, నాకుఁ బిమ్మటి సహోపాధ్యాపకులగు జాను కల్యాణరామయ్యరుగారు క్రైస్తవు లగుటచేత నిపుడు అగ్రస్థాన మలంకరించిరి.

౨౨-వ తేది దినచర్యయం దిట్లున్నది:—"క్లార్కుదొర పాఠశాలకు వచ్చెను. 'నాతో మాట్లాడుటకు మీ కవకాశ మిచ్చెదను'

అని నా కథయహస్త మిచ్చినటు లాయన సెలవిచ్చిరి! ఈశ్వరసేవకుల మని చెప్పుకొనువారివైఖరి యిట్టిది. ఈ పాఠశాలలో లెక్కలే నన్ని లోపములు కష్టములు నున్నవి! దీని కీయన యజమాని. ఇట్లయ్యును, పాఠశాలలోఁగల చిన్నలోపములను సహించియైన నడుగుట కీమహనీయునికిఁ దోఁచదు, తీఱదు! దైవమా యేమని చెప్పను!”

## ౨౧. క్రొత్త హరికథలు

ఇదివఱకు నేను “హిందూసుందరీమణు” లను పేరుతో సీత సావిత్రి మున్నగు నేడుగురు సుదతుల కథలు వ్రాసితిని. ఇంకను ప్రాచీనకాలసుందరు లనేకులు కలరు. కొలఁదిదివసముల క్రిందట నేను రాజమంద్రిలో నుండునపుడు వెంకటరత్నముపంతులుగారు అరుంధతి మున్నగు స్త్రీలనుగుఱించి నాకుఁ జెప్పిరి. నామిత్రు కామశాస్త్రిగారిచేవల “కాదంబరీసారసంగ్రహము” ను రచియించి, అందలి మహాశ్వేతనుగుఱించి సూచించిరి. కావున నేను “జనానాపత్రిక” లో “హిందూసుందరీమణుల” రెండవభాగమును వ్రాయ నారంభించితిని.

ఆకాలమున బెజవాడలో కొంచెముసేపు రెయిళ్లు ఆఁగుచు వచ్చుటచేత, తమకుఁ గొంచెము అన్నము పంపుమని స్నేహితులు తఱచుగ నాకు వ్రాయుచు వచ్చిరి. 3-వ జూలయిని వీరేశలింగముగారు వచ్చుచుంటిమని వ్రాసిరి. కాని, యానాఁడు బండి యాలస్యముగ వచ్చుటచేత నేను పాఠశాలకు వెళ్లిపోయితిని. స్నేహితులు వారిని గలసికొనిరి. మఱునాఁడు ప్రణతార్తిహర అయ్యరుగారు మద్రాసునుండి రాజమంద్రివైపునకుఁ బోవుచు, ఐదుగురికి అన్నము పంపుఁడని నాకు వ్రాయఁగా, ఒక బ్రాహ్మణవిద్యార్థిచే నన్నము పంపితిని. కాని యతఁ డాలస్యముగ వెళ్లుటచేత, వారు నిరాహారులై

వెడలి పోయిరి ! ౮-వ జూలయి తేదీని వీరేశలింగముగారు వచ్చి మాయింట విడిసిరి. ఆరోజు ఆదివార మగుటచేత, పతనాలయములో "ప్రవర్తనము" అను విషయమునుగుఱించి వారు ఉపన్యసించిరి.

౧౫-వ జూలయిని కామశాస్త్రిగారు జబ్బుగా నుండుటచే వారినిఁ జూడఁబోయితిని. "మహిమ్న" స్తోత్రములోని శ్లోకము లాయన చదివి యర్థము చెప్పిరి. బ్రాహ్మమతమందలి యేకేశ్వర ప్రార్థనము నివి పోలియుండెను.

౨౦-వ జూలయి తేదీని "విద్యార్థుల సాహితీసంఘు" సభకు నే నగ్రాసనాధిపతి నైతిని. నాటకవృత్తి గైకొనిన యువకుల దుర్నీతులనుగుఱించి ప్రస్తావవశమున నేను మాటాడితిని. ఈ ప్రాంతములు చూచిపోవుట కేతెంచిన ధన్వాడ అనంతముగా రా సభకు వచ్చి, నా యభిప్రాయములలో సత్యము గలదని నొక్కి చెప్పిరి. పిమ్మట నేను జాలసేపు వారితోఁ బ్రసంగించితిని. ఆరాత్రియే వారు మద్రాసు వెడలిపోయిరి.

౧-వ జూలయి నేను బుట్టినరోజు. నాఁటి దినచర్యయం దిటు లుండెను:—"ఈరోజుతో నావయస్సు ముప్పదిసంవత్సరములు. ఇంతకాలము నా కాయురారోగ్యముల నొసంగినందుకు, దైవమా, నీకు వందనములు! మనుజులు చెప్పు గొప్పసంగతులయొక్కయు చేయు ఘనకార్యములయుమాట యటుంచి, జీవించుటయే యొక విశేషముగదా! మనుష్యుఁడు తృణప్రాయుఁడు గాఁడు. నే ననుభవమునఁ గాంచిన మహావిషయముల కెల్ల దేవునికిఁ గృతజ్ఞుఁడను. నామనస్సు కొన్ని సుసంకల్పములకును, పెక్కు చెడుతలంపులకును దావలము. నాకు జీవితము తెంపులేని సముద్రమువలెఁ గానవచ్చుచు

న్నది ! దేవుఁడు న న్నాశీర్వదించి, నా కెక్కువ పవిత్రత యొసంగి, నేను సార్థక జీవితమును గడపునట్లను గ్రహించునుగాక!"

ఈసంవత్సరము జూలయినుండియు "జనానాపత్రిక"ను వీరభద్ర రావుగారి విద్యాసాగరముద్రాలయమునుండి తీసివైచి, మద్రాసు బ్రాహ్మ సమాజమువారి కార్యాలయమున నచ్చొత్తించుచువచ్చితిని. దీనికిఁ గారణము, రావుగారి ముద్రాలయము సరిగా పని చేయకపోవుటయే. ఆయన వ్యవహారపుఁజిక్కులలోఁ బడి, ముద్రాలయమును సరిగా నడుప నేరకుండెను.

జనానాపత్రికనుగూర్చిన పను లన్నియు సొంతముగ నేను జేయుచుండువాఁడను. నాభార్యయు, కొందఱు విద్యార్థులును పత్రికను చందాదారులకుఁ బంపు విషయమున సాయము చేయుచు వచ్చిరి. చాలినంతసొమ్ము పత్రికకు లేకుండుటచేత నిట్టిపనుల కొక పరిచారకుని నియమింప లేకుంటిని.

అగస్టునెలలో మూఁడుదినములు సెలవగుటచేత, సకుటుంబముగ నేను ఏలూరు పోయితిని. కొన్నిరోజుల వఱకును నాభార్య మాత్రము తిరిగి రాలేదు. అందువలన బెజవాడలో నేనే వంట చేసి కొనుచుండు వాఁడను. ఇంట రెండవభాగమున నొంటరిగ నుండు వీరభద్రరావుగారికిని స్వహస్తపాకమే ! ఆనెల ౨౩-వ తేదీని నేను మధ్యాహ్నమున బడికిఁ బోవుచు, దారిలో బందరు కాలువలోఁ బడి పోయిన స్త్రీ నొకతెను గట్టున కీడ్చుచుండు కొందఱిని జూచితిని. ఆత్మహత్య చేయవల దని వారించి యామెను మాయింటికిఁ గొనివచ్చి భోజన మిడితిని. గృహకల్లోలములవలన తాను ప్రాణహత్యకుఁ గడంగితినని యాస్త్రీ చెప్పెను. ఆస్త్రీ చీర నీటఁ దడియుటచేత,

నాభార్యకోక యొకటి యామెకుఁ గట్టనిచ్చితిని. నీటిగండము తప్పిన యాదీనకు శరణ మొసంగినందుకు నన్ను మిత్రు లభినందించిరి. అంత నింటి తలుపు తాళము వేసికొని, మిత్రుఁడు ముద్రాలయమునకును, నేను పాఠశాలకును వెడలిపోయితిమి.

ఆ సాయంకాలమున నేలూరు రెయిలు దిగివచ్చిన నాభార్య చూచుసరికి, మాయింటివాకిట పరస్త్రీయొకతె మసలుచుండుటయు, ఆమె తనచీరయే సింగారించుకొని యుండుటయును, ఆ గృహిణికి వెఱ్ఱి యనుమానములు గలిపించెనఁట! కొంతసేపటికి నేను రావుగారు నిలుసేని, ఆ స్త్రీ బంధువులకు వర్తమాన మంపితిమి. ఆ యువతి పుట్టినిల్లు రాజమండ్రి యనియు, ప్రవర్తనము మంచిది కాదనియు, భర్తతోఁ బోరాడి యానాఁడు పాఱిపోయివచ్చె ననియును వారు మాకుఁ జెప్పి, ఆమె నెట్లో భర్తృగృహముఁ జేర్చిరి.

౭-వ సెప్టెంబరున ఆదిపూడి సోమనాథరావుగారు బెజవాడ వచ్చి మాయింట నొకవారము నిలిచియుండిరి. ఆపురమందు కొన్ని హరికథలును, ప్రసంగములును వారు గావించిరి. సోమనాథరావుగారి యుపన్యాసములు జనరంజకములుగ నుండెను. ప్రేక్షకులు వచ్చినను రాకున్నను నియమితసమయమునకె సరిగాఁ దమప్రసంగమును ప్రారంభించి, ఒకగంట మాటాడి యాయన కూర్చుండును! ఈ కట్టుఁబాటువలన సభ్యులు సమయమునకే వచ్చి యాసక్తితో వినుచుండువారు. ఆయన హరికథలు, క్రొత్తపద్ధతి ననుసరించి, సంస్కారమునకు సుముఖములుగనుండి, ప్రేక్షకుల కమితప్రమోదమునుగొలుపుచుండెడివి.

ఆరోజులలో నాకు నుండెడిదగ్గు మండుచుండెడిది. మిత్రులు డాక్టరు వెంకటసుబ్బయ్యగారు నాహృదయము శ్వాసకోశములును

బాగుగఁ బరీక్షించి, అం వేలోపము లేదనియు, కంఠర సంబంధమగు వాతమే బాధకుఁ గారణము కావచ్చు ననియును జెప్పిరి. నే నధికముగఁ బరిశ్రమము చేయుచు, నా వ్యాధిని గుఱించి పలుమాఱు తలపోయుచుండుటచేతనే నామంటలు హెచ్చుచుండవచ్చు నని కూడ వారి యభిప్రాయము!

## ౨౨. "హిందూ సుందరీమణులు"

౧౯౦౦ సం. సెప్టెంబరు మధ్యమున "హిందూ సుందరీమణుల చరిత్రముల" రెండవ భాగమును బూర్తిచేసితిని. దీనికిని మొదటిభాగమునకును గొంత భేదము లేకపోలేదు. కావున దీని పీఠికలో నే నిట్లు వ్రాసితిని:—"ఇందలి కథలలోఁ గొన్నింటిని గుఱించి యొకటిరెండు సంగతులు చెప్పవలసియున్నది. సత్యభామచరిత్ర నీ గ్రంథమున నేల చేర్చితి వని కొందఱు స్నేహితులు నన్నడిగిరి. సత్యభామ గయ్యాళి యనియు, ఆమెచరిత్ర మంతగా నీతిదాయకము గాదనియు, వారల తలంపు. ఇది సరియైన యూహ కాదు. సీత, ద్రౌపది మొదలగు వనితల సుగుణములు శ్లాఘాపాత్రములే యైనను, వీరి చరిత్రములొకరీతిని బ్రాఁతపడిన గుణవర్ణనములతో నిండియుండి, నవీనుల కంతగా రుచింపకున్నవి. పతిభక్తియే వీరికిఁ గల గొప్పసుగుణము. ధైర్యసాహసాదు లంతగ వీరియందుఁ గానిపింపకున్నవి. ఇట్టిస్త్రీల చరిత్రములు చదివిచదివి, సత్యభామకథ చేతఁబట్టినవారి కింపగు భేదము గానఁబడును. నిర్మలప్రవర్తనమునం దితర ముదితలకు సత్య యావంతయుఁ దీసిపోక, వారియందుఁ గానరాని ధైర్యాది నూతనసుగుణములు దాల్చి, హిందూవనితల యభ్యున్నతిని గాంక్షించెడివారల కానంద మొసంగుచున్నది! మనదేశమునందు

భార్యయనునది భర్తవినోదార్థ మేర్పడిన కందుక విశేష మనియె భావించుచున్నారు గాని, ఆమెయును బురుషునివలెనే స్వబుద్ధి విని యోగించి, స్వతంత్రత నూని, ధైర్యసాహసాదులు గలిగి, ఘనకార్యములు నిర్వర్తించి, కృతకృత్య కావలెనని యెవరు నంతగఁ దలంచు చుండుట లేదు! ఈ సుగుణములు దాల్చి, మగనిపరిచారికవలె మాత్రమె చరింపక, చెల్లింపవలసిన యధికారము చెల్లింపుచు, చేయవలసిన ఘనకార్యములు చేయుచు, తన ప్రజ్ఞాచాతుర్యములు మెఱయు నట్లుగ మెలంగినది పూర్వకాలస్త్రీలలో సత్యభామ యొకతెయే! పత్నీధర్మ మెప్పటికిని పతి ననుసరించుటయే యని తలంచెడి మన దేశమున, ప్రజ్ఞయు, స్వతంత్ర బుద్ధియుఁ గలిగి సంచరించెడి సత్యభామవంటి చానలు జాణలని ప్రతీతి గలుగుటయం దేమియాశ్చర్యము?

"ఈ గ్రంథమునఁ జేర్పఁబడిన యింకొకకథనుగూర్చి కూడ కొంత చెప్పవలయును. మొదటినుండియు సత్ప్రవర్తనగల స్త్రీయే సుగుణవతి గాని, ఒకప్పుడు ప్రమాదవశమున తప్పు చేసి పిదప పరితపించి సన్మార్గముఁ జొచ్చిన వనిత మంచిదికాదని మన దేశమునఁ బలువుర తలంపు. ఇది సరికాదు. ఇందలి 'కాంచనమాలిని' మొదట నాటవెలఁదియె యైనను, పిమ్మట గాఢానుతాపమున సన్మార్గ మవలంబించెను. ఇట్టి మానినులును మన మన్ననలకుఁ బాత్రలే."

మద్రాసునందలి "సంఘసంస్కారిణీ" పత్రిక నాపుస్తకమును విమర్శించుచు నిట్లు వ్రాసెను:—"ఈ గ్రంథకర్త తెలుఁగు జనానా పత్రికను బ్రచురించియు, సద్గ్రంథములు ప్రకటించియు, ప్రస్తుత పరిస్థితుల వైపరీత్యమున నజ్ఞాన తిమిరమున మునింగిన స్త్రీజాతి నుద్ధరింపఁ బ్రయత్నించుచున్నాఁడు. ఇట్టి పుస్తకముల మూలమున

## ౭౨. “హిందూ సుందరీమణులు”

స్త్రీలకు ప్రమోదముఁ గలిపింప వీరియుద్యమము. ఎక్కువఁ బరిశ్రమించి, పురాణములందుండిన యుత్తమస్త్రీల చరిత్రములు వీరు తెలుఁగున రచించి ప్రకటించిరి. ప్రాచీనప్రకృతభామినుల సుగుణములతో విలసిల్లు సత్యభామకు స్వానుభవసాహాయ్యమున ద్రౌపది చేసిన యమూల్యోపదేశములు, ఈకాలపుఁ బుణ్యాంగన లనుసరింప యోగ్యముగ నున్నవి. ధనాశచేఁ దన మానము నమ్ముకొని తుద కిదృష్టవశమున పరితాపము నొంది నూతనజీవనమున విరాజిల్లెడి కాంచనమాలినికథవలన, ఎంత దుస్థితికి వచ్చినయింతియైన నధైర్యపడక పూనికతోఁ శీలసౌష్ఠవముఁ బడసినచో' బూజనీయ యగు ననుట స్పష్టము. * * *.”

జనానాపత్రిక కొంతకాలమునుండి ముప్పదిరెండు పుటలు గల పుస్తకరూపము దాల్చెను. కావున నెలనెలయును సామాన్యవ్యాసము లేకాక, యేదో యొకపుస్తకభాగముకూడ నందుఁ బ్రచురింపవలసి వచ్చెను. కొంతకాలముక్రిందట హిందూపత్రిక కొక యాంగ్లస్త్రీ “ఇంగ్లీషువారి సంసారపద్ధతు” లను గుఱించి వ్రాసిన వినోదకరములగు వ్యాసములు నేను జదివియుంటిని. ఇపు డొకవిద్యార్థి చేతిలో నీ వ్యాసము లన్నియుఁ గూర్చిన పుస్తక మొకటి చూచితిని. గ్రంథకర్త్రి మైసూరు స్త్రీవిద్యాలయ ప్రథమోపాధ్యాయిని యగు రిడ్సుడేలుకన్యక యని నా కపుడు తెలిసెను. ఈపుస్తకము నాంధ్రీకరించి ‘జనానాపత్రిక’ లోఁ బ్రచురింప ననుజ్ఞ నీయుఁడని యామెకు ౧౭-వ సెప్టెంబరున వ్రాయఁగా, అందుల కామె యిష్టపడెను.

౧౯-వ సెప్టెంబరు దినచర్యయం దిట్లు గలదు:—“పాపహేయపుఁ దలంపులు నన్ను సదా వేధించుచున్నవె! చెన్నరాజ

ధానియందు ఆస్తిక మతప్రచారకుఁడవు కమ్మని నాకు నిన్న కొందఱు మిత్రులు వ్రాసిరి. ఆహా, ఈ పదవికి నే నెంతయు ననర్హుఁడనుగఁదా! పాపి యగువాఁడు తోడిపాపుల కెట్లు తోడునీడ కాఁగలఁడు? నా కీగౌరవము ముమ్మాటికిని వలదు! నాకు పాప మాలిన్యములయందే యనురక్తి!"

నా కీమధ్య లభించిన మార్టినో రచనములు నే నిపుడు తఱచుగఁ జదువుచుంటిని. అప్పుడప్పుడు ఆంధ్రసాహిత్య గ్రంథములు చదివి సతికి వినిపించి యర్థము చెప్పుచుండువాఁడను.

30-వ సెప్టెంబరు ఆదివారము మధ్యాహ్నమున నేను గదిలోఁ జదువుకొనుచుండఁగా పొరుగుననుండి కేకలు వినఁబడెను. నేను వాకిటికి వచ్చి చూడఁగా, మా జామచెట్టుమూల నొకముసలివాఁడు దాఁగియుండెను. వానిచేతిలో కంచుగిన్నె యొకటి యుండెను! నా ప్రశ్నలకు వాఁ డేమియు ప్రత్యుత్తర మీయక, దిగాలుపడి చూచెను. ఇంతలో జనులు మా యావరణములోనికి వచ్చి యామనుష్యునిఁ బట్టుకొనిరి. పాప మాముసలివాని మొగము కడు దీనముగ నుండెను. గిన్నె దొరకెను గాన, వానిని వదలివేయుఁ డని నే నంటిని. ప్రజలు వానిని బోనీయక పోలీసు స్టేషనుకుఁ గొనిపోయిరి. పిమ్మట నొకరక్షకభటుఁడు వచ్చి దండనాధిపునెదుట నేను సాక్ష్య మీయవలయు నని చెప్పి, నా పేరు వ్రాసికొని పోయెను. మఱునాఁడు నేను న్యాయస్థానమునకుఁ బోయియుంటినిగాని, నాసాక్ష్యము గైకొనకయే యధికారి దొంగకు మూఁడునెలల ఖైదుశిక్ష విధించెను. ఈచోరీ విషయమున నన్ను బో నెక్కించి నాచే సాక్ష్యము పుచ్చుకొని, నాకు శ్రమయు నవమానము గలిగింపఁ దాను సమ్మతింపకుంటి నని న్యాయాధికారి యనునప్పుడు, నేను మరియాద కాయనకు వందనము

లిడినను, న్యాయసభలో సత్యము పలుకుట నీచమా యని యాశ్చర్య పడితిని.

వీరభద్రరావుగారు బెజవాడనుండి వెడలిపోయిన పిమ్మట, మాయింట నొక వైదిక బ్రాహ్మణ కుటుంబమును రెండవభాగమున నుంచితిమి. ఆ పెద్దయావరణమున నే మొంటరిగ మసలుటయు, ఆ చిన్నయింట మాతోఁగలసి వేఱొకరు కాఁపురము చేయుటయును గూడఁ గష్టమే!

నాకు గుండెదగ్గఱ మంట యనుదినమును గనఁబడుచుండెను. కోకో గాని తమిదయంబలి గాని పుచ్చుకొని చూడు మని వైద్యుఁడు చెప్పఁగా, నే నట్లు చేసితిని గాని లాభము లేకపోయెను. పాఠశాలలో పని యెక్కువ యగుటయే దీనికిఁ గారణ మని నేను నమ్మితిని. ఇది యొకటియే గాక, పత్రికలకు వ్రాయుట, సభలు సమావేశములు సమకూర్చుట, గృహచ్ఛిద్రములను గుటుంబ ఋణములను గూర్చి సదా తలపోయుట,—మున్నగు పను లన్నిటివలనను నా దేహపటుత్వము తగ్గుటయే దీనికిఁ గారణము కావచ్చును.

నే నిపుడు “ఇంగ్లీషువారి సంసారపద్ధతులు” తెలుఁగుచేసి, యీ సంవత్సరము అక్టోబరునుండియు “జనానాపత్రిక” లోఁ బ్రచురింపసాగితిని. పత్రికలో వ్రాసినభాగముల ప్రతులు పుస్తకరూపమున ప్రత్యేకముగఁ గొన్ని తీయించుచు వచ్చితిని. ఈవిధముగ నాపుస్తకమంతయు ‘జనానాపత్రిక’ యొనిమిదవ సంపుటాంతమున, అనఁగా ౧౯౦౧ సం. జూను నెల పత్రిక సంచికతోఁ బూర్తిపఱచితిని. తెలుఁగుపద్యములు వ్రాయు నభ్యాసము నాకు లేదు. కావున మాతృకలో నుల్లేఖింపఁబడిన కెన్నిసను మున్నగు నాంగ్లకవులపద్యముల

భావము నేను జెప్పఁగా, నామిత్రులు కామశాస్త్రిగారు చక్కని తెలుఁగు పద్యములు రచించి నా కిచ్చుచు వచ్చిరి. అవి నేను బుస్తకమునఁ జేర్చితిని.

## ౪౩. చీఁకటివెన్నెలలు!

నేను మాతండ్రిగారి యాబ్దికమునకై అక్టోబరు చివరభాగమున రాజమండ్రి వెళ్లినపుడు, సంసారమును బెజవాడకుఁ దరలించుటను గుఱించి మా తమ్మునితో మరల ముచ్చటించితిని. అందఱము నొకచోటనె యుండినఁగాని మా రాబడి యెంత హెచ్చినను, మేము సొమ్ము కూడఁబెట్టలేమని గ్రహించితిమి కాని, మాచెల్లెలు కనకమ్మ పురుడు రెండునెలలలో రావచ్చును గావున, మావాండ్రము రాజమండ్రి యిపుడు విడుచుటకు వలనుపడకుండెను. అందుచేత వర్తమానమున మా సమష్టికాఁపురపు సంగతి కట్టిపెట్టితిమి.

౩౦-వ అక్టోబరు వార్తాపత్రికలలో మోక్షమూలరు పండితుఁడు పరమపదముఁ జెందెనని యుండెను. ఆ మహామహుఁడు హిందూమతగ్రంథ ప్రచురణమునకై చేసిన యపార పరిశ్రమము కడు శ్లాఘనీయమైనది. అకాలమున దొరతనమువారు రాజమండ్రి కళాశాలను మూసివేతురనియును, ఒక క్రైస్తవ సంఘమువారు దానిని గైకొని నడుపుదు రనియును వదంతులు ప్రబలెను. ఇవి యందఱికిని విషాదమును గలిగించెను. అంతట ప్రభుత్వమువారు తమ మనస్సును మానుకొనినట్లు విని సంతోషించితిమి.

రచనావిషయమున నొకపనితో రెండుఫలితము లొనఁగూర్ప నేను బ్రయత్నించుచు వచ్చితిని. ౧౧-వ నవంబరున నాగుండెమంట లొకింత చల్లార్చుకొనుటకో యనునట్టుగ, "వెన్నెల"ను గుఱించి

## ౭3. చీకటి వెన్నెలలు!

యొక తెలుఁగువ్యాసము వ్రాసి, ఆనాఁడు జరిగిన ప్రార్థనసమాజసభలో ధర్మోపన్యాసముగ దానిని జదివితిని. అదియే యానెల 'జనానా పత్రిక' లో నొక వ్యాసముగఁ బ్రకటిత మయ్యెను. భారతమందలి "శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులన్" అను పద్యము నేను ఉల్లేఖించి యిట్లు వ్రాసితిని:—"తెల్లవెన్నెల యను మహాసముద్రమున మునింగియున్న పదార్థసమూహమును జూచితిమా, మనస్సు ఆనందపరవశమై, చిత్రచిత్రమగు నూహలకును తలంపులకును జన్మభూమి యగుచుండును! వెన్నెలరాత్రులందు సముద్రమును జూచి వినోదింపని కన్నులు గన్నులు కావు.

"చంద్రుఁడు వెన్నెలయును లేకుండినచో, భూలోక సౌందర్యమును, మనుజుని సౌఖ్యరాశియును మిగుల కొఱఁతపడియె యుండును! * * * దేవతలలోని మువ్వురు సుందరాంగులలోను జంద్రుఁ డొకఁడు. ఆతఁడు విష్ణుని యెడమకన్ను, శివునితలపువ్వు. చంద్రుఁడు కవులకల్పతరువు * * సౌందర్యవతి చంద్రముఖి యగు చున్నది. లావణ్యవతుల నవ్వును వెన్నెలతోఁ బోల్చుచున్నాము. * * వెన్నెలవలెనే యిహలోకసౌఖ్య మస్థిరము. ఎన్నఁడు నస్తమింపని చంద్రుని, నెప్పుడును సమసిపోని చంద్రికను మనము వీక్షింపఁగోరెద మేని, పరమాత్ముఁడను మహాచంద్రునే మనము గాంక్షింపవలెను. ఆ మహామహునియెడ భక్తిప్రేమములు పెంపొందించుకొనుటకే, వెన్నెలవంటి సౌందర్య పదార్థములు మనకుఁ బ్రసాదింపఁబడి యున్నవి!"

పై వ్రాఁతయందలి తుదివాక్యములు పత్రికా వ్యాసమును ధర్మోపన్యాసముగ మార్చివేయుచున్నవి!

౧౯౦౦-వ సంవత్సరాంతమున మరల ప్రాథమికపరీక్షలు, నాయఁడుగారియొక్కయు వారియనుచరులయు స్నేహసహవాసములును! ఇప్పటి ప్రధానోపాధ్యాయులు కల్యాణరామయ్యారుగారు, నామీఁద దయగలిగి, ఆపరీక్షలు చేయుటకు వలసినప్పుడు నన్నుఁ బోనిచ్చెడివారు. ౨౭-వ నవంబరు తేదీని నేను బండిమీఁద వుయ్యూరు పయనము చేసితిని. ౨౯-వ తేదీని నాయఁడుగారు నేనును బరీక్షలలో నుండఁగ, మాతమ్ముఁడు బెజవాడ కిచ్చినతంతి నా కిచటఁ జేరెను. మాతల్లికి నిన్న మరల మూర్ఛలు ప్రబలముగ వచ్చెనని యందలి దుఃఖవార్త! పరీక్షలో నేఁ జేయవలసినపని వేగమే పూర్తిపఱచి, పగలు ౧౨ గంటలకు బండిమీఁదఁ దిరిగి బయలుదేఱి, సాయంకాలమునకు బెజవాడ చేరితిని. అంత రాజమంద్రి తంతి నిచ్చి, తల్లికి నెమ్మది పడెనని తెలిసికొని, మనశ్శాంతి నొందితిని.

అంత తిరువూరు మున్నగు ప్రదేశములలో జరిగిన పరీక్షలలో నాయఁడు గారికి నేను సహాయకునిగ నుంటిని. రాఁబోవు సంవత్సరమున ననంతముగారు మరల నీపాఠశాలకు వచ్చుట కేర్పాటయ్యెను.

౧౪-వ డిశెంబరున మాచెల్లెలు కనకమ్మ సుఖప్రసవమై, కూఁతుని గనియెనని విని సంతోషించితిమి. ఆనెల ౨౫-వ తేదీని మేము రాజమంద్రి వెళ్లి, చెల్లెలిని పిల్లను జూచితిమి. శిశువు మిగుల బలహీనగ నుండెను. మోగల్లులో మాతమ్ముని భార్య ప్రసవించె ననియు, కుమారుఁడు కలిగె ననియును మఱునాఁడు మాకుఁ దెలిసి, మేమమితానంద భరితుల మయితిమి.

డిశెంబరు ౩౦-వ తేదీని మధ్యాహ్నమున తమ్ముఁడు నేనును వీధి చావడిలోఁ గూర్చుండి, యిన్నాళ్లీ శ్వరుఁడు మరల మాకు

సుఖదినము లొసంగెనే యని సంతోషమున ననుకొను చుంటిమి. మా మాటలను వెక్కిరించుటకో యన, అనిమేషముననే మాపెరటి లోనుండి కేకలు నేడ్పులును వినవచ్చెను! పొరుగింటికిఁ బోయి వచ్చుచు, పెరటిలోని మాపెద్దబావిగట్టు దాటఁబోయి, మాపినతల్లి యాకస్మికముగ నీటిలోఁ బడిపోయెను! వెంటనే మేము త్రాళ్లను గడలును వేయించితిమి. లాభము లేకపోయెను. అంతట పొరుగున నుండు నొక యువకుఁడును, నూతమ్ముఁడు సూర్యనారాయణయును నూతిలో నుఱికిరి. కాని, వీ రామెను వెలికిఁ దీయునప్పటికే యామె ప్రాణము లెగిరిపోయెను! ఆమెకు మరల నూపిరి వచ్చుటకై యెన్నియో సాధనములు చేసితిమి. వేఁడిమి గలుగుటకై పాదములకు నరచేతులకును కర్పూరతైలము రాచితిమి. ప్రాణము రాలేదు. ఆరాత్రి యంతయు మే మామెశవము గనిపెట్టుకొనియుంటిమి. పాపము, మాముసలిముత్తవతల్లి మాతోడనే యుండెను. ఆమె దుఃఖ సముద్రమున మునిఁగిపోయెను! వెనువెంటనే మా మేనమామలకు వేలివెన్ను తంతి నిచ్చితిమి. కూలివాని నంపితిమి. కాని, బంధువు లెవరును సకాలమున రాలేకుండుటవలన, మఱునాఁడు మేమే యామెకు దహనాదికర్మలు జరిపితిమి.

## ౨౮. "మహాలక్ష్మి మరణము"

౧౯౦౦ డిశెంబరు 30-వ తేదీని మరణించిన మాపినతల్లి, నాకంటె నాలుగైదుసంవత్సరములు మాత్రమే పెద్దది యగుటచేత, చిన్ననాఁడు వేలివెన్నులో నాకు సావాసురాలుగ నుండెడిది. బాల్యమున మాయుభయులకును మాతాతగారు పద్యములు లెక్కలును జెప్పుచుండువారు. దురదృష్టవశమున నీమెకు మంచి

వివాహసంబంధము దొరక లేదు. వరునికి, ఆస్తిగాని విద్యగాని యంతగ లేవు. యౌవనమున దుర్వృత్తులలోఁ జేరి యాతఁడు తన స్వల్పభూవసతి కొల్లగొట్టెను. భార్యాభర్తలంత స్వగ్రామము విడువ వలసినవా రయిరి. మా పినతండ్రి యనేకగ్రామములలో బడులు నెల కొల్పి, కొన్ని నెల లచటనుండి, తన కచట బాగుగ జరుగుచుండ లే దని యసంతృప్తి నొంది, మఱియొక ప్రదేశమున కేగుచుండువాఁడు! ఇవ్విధమున ననేకగ్రామములు తిరిగినను, ఆయనపరిస్థితు లెంతమాత్ర మును జక్కపడ లేదు! అప్పుడప్పుడు వా రిరువురును రాజమండ్రి వచ్చి కొంతకాలము మాతోఁ గడపి, మరల నెచటికైన వెడలిపోవుచుండు వారు.

నేను వారిసాహాయ్యమునకై కొంతకాలము నెలకుఁ గొంచెము సొమ్ము పంపుచుండు వాఁడను. వా రెటులో తమకు లభించిన కొలఁది యాదాయముతో కాలము గడపుకొనుచువచ్చిరి.

ఇటు లుండఁగా, మాచెల్లెలి ప్రసవసమయమున సాయము చేయుటకై మాపినతల్లి రాజమండ్రి వచ్చియుండెను. ఇంకఁ గొలఁది దినములు జీవించి యుండినచో, ఆమె తనభర్తయుండు గ్రామము నకు వెడలిపోయెడిదియే. కాని, యీశ్వరోద్దేశము వేఱుగ నుండెను! ౧౯౦౧-వ సంవత్సరము జనవరి జనానాపత్రికలో నేను వ్రాసిన "మహాలక్ష్మిమరణము" అను వ్యాసము, మాపినతల్లిని గుఱించినదియే. దానిలో నిటు లుండెను :—

'మంచివారికి మరణము ముందు' అను విదేశీయపుసామె తయు, 'సుకృతీ గతాయుః' అను స్వదేశలోకోక్తియు నొక యర్థ మునే యిచ్చుచున్నవి. * * *

## ౭౭. “మహాలక్ష్మి మరణము”

“ఈమధ్య స్వర్గస్థురాలైన శ్రీమతి మహాలక్ష్మి హిందూ సద్వనితలలో నొకతె. * * * చనిపోవునంతకు నీమెకుఁగల బాధలు పలువురి కంతగాఁ దెలియవు. ఈమె హృదయము సముద్రమువలె గంభీరమైన దని చెప్పవచ్చును. * *

“దేశాచారముచొప్పున నీమెను బాల్యప్రాయముననే యొక యువకుని కిచ్చి వివాహము చేసిరి. ఆచిన్నవాని విద్యాభివృద్ధి కెన్ని ప్రయత్నములు జరిగినను, తుద కతనికిఁ జదువు లభింపలేదు * * కొంతకాలమునకు మహాలక్ష్మి పతితోఁ గాఁపురము చేయ నారంభింపఁగా, వాని యవగుణము లామెకు బోధపడెను! * * ఆతని దుస్స్వభావము దుస్సహవాసములమూలమున మఱింత విజృంభించెను. సతిసుగుణము లాతనిమనస్సును ద్రిప్పఁజాలకపోయెను. దుశ్చేష్టలవలనను దుస్సాంగత్యమువలనను అతఁడు తన శరీర సౌష్ఠవమును గోలుపోయి నిరుపేద యయ్యెను. * * మహాలక్ష్మి భర్తయెడఁ గొంచెమైనను కోపద్వేషములు వహింపక, అఱుగఁదీసినకొలఁది సువాసన నీను చందనమువలె బాధించు పతియెడ నమితదయతో నొప్పియుండెను.

“మహాలక్ష్మి తన భర్తదుర్నయములను గుఱించి చుట్టములతోఁగాని చెలికత్తెలతోఁగాని ప్రస్తావింపదు. * * తన్నాతఁడు ప్రియురాలని భావింపకున్నను, వానికి హితబోధనము చేయుచు, వాని శ్రేయస్సునే కోరుచుండును. ఇదియే కదా నిజమైన పాతివ్రత్యము!

“మహాలక్ష్మి యిపు డీలోకము విడిచిపోయెను. ఎవని లోపములు గప్పిపుచ్చవలె నని యాసుదతి యహర్నిశము ప్రయత్నించెనో, అట్టి భర్తను వీడి తానే ముందుగ పరలోకప్రాప్తిఁ

జెందెను. * * ఈమానినివలె ప్రశాంతియు నిర్మలప్రేమము నల వఱుచుకొనిన సతీమతల్లులు స్వర్గలోకసుఖముల నందుటకు సందియము లేదు!"

ఈ 'జనానాపత్రిక' సంచికయే యింక రెండు మరణములు ప్రస్తావించెను. విక్టోరియా మహారాణిగారు జనవరినెల ౨౨-వ తేదీని స్వర్గస్థు లయిరి. ఆనెలలోనే బొంబాయి ఉన్నతన్యాయస్థానమున న్యాయాధిపతులును దేశప్రముఖులును నగు రానడీగారు కీర్తిశేషు లయిరి.

మా పినతల్లియుత్తరక్రియలు రాజమంద్రిలో మాయింటనే జరిగెను. తనచెల్లెలు చనిపోయిన యాఅపవాదు మాతల్లికి ప్రబల మగు మూర్ఛలు గానఁబడెను. అందువలనఁ గొన్నిదినములకుఁ గాని యామెకు శక్తియు స్పృహయు రాకుండెను. కర్మాంతరము లైన పిమ్మట బంధువులు వెడలిపోయిరి. తనభార్యనగల సంగతి తేల్చి నచోఁ దాను బోయివచ్చెద నని మాపినతండ్రి మాతో ననినపుడు నా కెంతో కోపము వచ్చినను, పిదప పరితాపము కలిగెను. తన భార్య కొంచెమునగలును జేత వేయించుకొని యాయన మన్యముల లోనికి వెడలిపోయి మరల మాకంటఁ బడలేదు!. కొంతకాలమునకుఁ బిమ్మట మన్యములందెచటనో యాయన చనిపోయె నని వారి బంధు వులు చెప్పిరి.

నాతమ్ముఁడు వెంకటరామయ్య తిరిగి న్యాయశాస్త్రపరీక్షకు చెన్నపురి పోవలసివచ్చెను గావున, అతఁడు తిరిగి వచ్చువఱకును రాజమంద్రిలోని మాతల్లిసంరక్షణమునకై నాభార్య నచట నుంచి, నే నొకఁడనే ౧౯౦౧ జనవరిలో బెజవాడ వచ్చితిని. తమ్ముఁడు

కృష్ణమూర్తి ప్రథమశాస్త్రపరీక్షలో తప్పెను. అతని చదువు సాములకీతి నా కేమియుఁ దృప్తికరముగ లేదు. ౨౬-వ తేదీని అనంతముగారు బళ్లారినుండి బెజవాడకు వచ్చిరి. మే మందఱము రెయిలుదగ్గఱ వారిని గలసికొని పాఠశాలలో వారికొక విజ్ఞాపనము సమర్పించితిమి. మావిద్యాలయమున నలుగురు ప్రవేశ పరీక్షలో గెలుపొందిరి. తమ్ముఁడు సూర్యనారాయణ యాపరీక్ష నిచ్చెనని విని యానందభరితుఁడ నయితిని.

నా కిపుడు మరల గుండెమంటలు ప్రబల మయ్యెను. నేనే వంట చేసికొనుచువచ్చుటచేత, భోజనసౌకర్యము లేదు. అందువలన నా దేహమున నిస్సత్తువ యేర్పడెను. మా తమ్ముఁడు మద్రాసులో పరీక్ష నిచ్చి రాజమండ్రికి మరలివచ్చుటచేత, నాభార్య ౧౧-వ ఫిబ్రవరిని బెజవాడ తిరిగివచ్చెను.

## ౨౫. " చిత్రకథామంజరి "

నేను దొరతనమువారి కొలువులోఁ జేర నిపు డాశింపఁ జొచ్చితిని! ఫిబ్రవరి ౨౫-వ తేదీని నాకు స్కాటుదొరగారు వ్రాసిన జాబులో, నేను డైరక్టరుగారి కర్జీ పెట్టుకొనినచో, తాము చేయవలసినసాయము తాము చేతు మని యుండెను. మఱునాఁడు వీరేశలింగముగారియొద్దనుండికూడ లేఖ వచ్చెను. స్కాటుదొరగారి సాయన చూడఁబోఁగా, రాజమండ్రికళాశాలలో నొక తాత్కాలికో ద్యోగము చేయ నాకు సమ్మతమా యని దొరగా రడిగిరఁట. వెంటనే నే నొకయర్జీ నంపి, నా కీవిషయమున సాయము చేయుఁడని యుభయులను గోరితిని. ఈయూరు విడిచి రాజమండ్రి వెడలి పోవ మాయిద్దఱికి నిష్టమే.

ఈ సమయమున మాతమ్ముఁడు సూర్యనారాయణకు వివాహ సంబంధములు కొన్ని వచ్చెను. అతనికిఁ గట్నము లిచ్చెద మని పలువురు భ్రమపెట్టునప్పుడు, ఋణబాధతో నుండు మా కాతని పెండ్లి యెడఁ గొంత సుముఖత్వము గలుగుచువచ్చెను. కాని, మే మీవిషయమున నేనిర్ధారణమునకును రాఁజాల కుంటిమి.

"అక్కఱ కల్పనకు జనని" అను నొక లోకోక్తి యాంగ్లమునఁ గలదు. "జనానాపత్రిక" కు నెలనెలయును నేను పెక్కు వ్యాసములు వ్రాయవలసివచ్చెను. ఏదైన పుస్తక మారంభించి వ్రాయుచున్నచో, పత్రికకుఁ దగినంత మేఁత దొరకునని నే నిదివఱకు "హిందూసుందరీమణుల" రెండుభాగములును వ్రాసితినిగదా. ఇపుడు కొంతకాలమునుండి "ఇంగ్లీషువారి సంసారపద్ధతులు" కూడ తెలుఁగు చేసి పత్రికలోఁ బ్రచురించుచున్నాఁడను. కాని, యీపుస్తకములు వ్రాయుటలో నాస్వకపోలశక్తి యంతగ వ్యక్తమగుటలేదు. పద్యరూపమున నుండు పురాణకథలు గద్యమున లిఖించుటయందుఁగాని, యాంగ్లేయ పుస్తకము నొకటి యాంధ్రమున కనువదించుటయందుఁ గాని, స్వతంత్రరచనమున కవకాశ మేమిగలదు? సొంతకథ లల్ల నా కిపుడు కుతూహలము పొడమెను. ౧౯౦౧ మార్చినెల 'జనానా పత్రిక'లో "బాలాంబరాణి" యను నొక కథ వ్రాసి ప్రచురించితిని. దీని నాలుప్రకరణములుగఁ జేసి, ప్రతిప్రకరణమునకు మకుటముగ నొకపద్యము నుల్లేఖించితిని. ఇదియొక విషాదాంతకథ. కొండవీటి రెడ్లనాఁటి కథగా దీని నేఁ జెప్పినను, చరిత్రాంశము లిం దేమియుఁ గానరావు. మఱుసటినెల పత్రికలో నింతె పరిమాణముగల "శారద" యనునొక సంతోషాంతకథను వ్రాసితిని. ఇట్లే తక్కినకథలును వ్రాసి, యీకథాసముదాయమునకు వీరేశలింగముగారి "నీతికథా

మంజరి"ని బోలిన " చిత్రకథామంజరి " యను పేరిడితిని. ఈకథలలో మిగుల దీర్ఘమగునది " కృష్ణవేణి. " ఇది కొంతవఱకు చరిత్రాత్మకమగు కథ యనవచ్చును. ఇటీవల చదివిన "కృష్ణామండల చరిత్రము" నుండి కొన్ని చిన్నయంశముల నాధారముగఁ గొని నే నీకథ నల్లితిని. ఇది నా కెంతో ప్రియమైనది. ఈ పుస్తకము మొదటి కూర్పులో చిత్రకథలు గానివికూడ కొన్ని చేర్పఁబడినవి. "నూర్జిహాను" "గాబ్రియేలు సోదరి"యును చారిత్రకగాథలే. 'ఉత్తమపురుషము' ను చిన్నకథ యనుటకంటె వ్యాస మనియే చెప్పనగును!

మే మిటీవల బెజవాడలోఁ గొనినగేదెను కాయుటకు పొరుగునను౦డు నొకబాలకుని నియమించితిమి. వాని యజాగ్రతచే నొకనాఁడది తప్పిపోయెను. దానిని వెదకుటకు వాని తలిదండ్రులు చూపిన యశ్రద్ధనుబట్టి వారల దుర్మంత్రములవలననే యీమోసము జరిగెనని మాకుఁ దోఁచెను. చుట్టుపట్టులగ్రామము లన్నియు నేను గాలించి వచ్చితిని. లాభము లేకపోయెను. పోలీసువారి వారింపులైన గమనింపక యాపిల్లవానితల్లి మమ్మూరక తిట్టిపోయసాగెను! అంత పిల్లవానిమీఁదను వానితండ్రిమీఁదను మోసమునకు నే నభియోగము తెచ్చితిని. సబుమేజిస్ట్రేటు విచారణచేసి, పిల్లవానిని శిక్షించెను. కాని, పై న్యాయాధిపతి వానిశిక్షను రద్దుపఱిచెను.

ఇటీవల చనిపోయిన రానడిగారి సంగ్రహచరిత్రమును నే నాంగ్లమున వ్రాసి యొక బెజవాడసభలోఁ జదివి, " సంఘసంస్కారిణీ " పత్రికలోఁ బ్రచురించితిని. ఇంగ్లీషున " భీష్ము "ని గుఱించి యొకవ్యాసము వ్రాసి, రాజమహేంద్రవర ప్రార్థనసమాజవార్షికసభలోఁ జదివించితిని అదియు " సంఘసంస్కారిణీ " పత్రికలో ముద్రితమయ్యెను.

మూఁడేండ్లక్రిందట నే యల్. టి. పరీక్షలో విజయ మంది నను, పట్టభద్రులసభ కిదివఱకు నేను వెళ్లియుండలేదు. ౧౯౦౧ మార్చి ౨౬-వ తేదీని నే నాసభకుఁ బోవుటకు మద్రాసు బయలు దేఱితిని. బండిలో నరసింహరాయఁడుగారు మున్నగు మిత్రులు కానఁబడిరి. చెన్నపురిలో స్నేహితుఁడు కొల్లిపర సీతారామయ్య గారియింట నేను బసచేసి, పరశువాక మేగి, వీరేశలింగము బుచ్చ య్యపంతులుగార్లను జూచితిని. మద్రాసు స్టాండర్డు పత్రికా సంపా దకీయ వర్గములోని బి. వరదాచార్యులుగారిని సందర్శించితిని. ఆయన మరల నన్నాపత్రికకు బెజవాడ యుపవిలేఖకునిగ నుండుఁ డని కోరి, దినపత్రిక నంపుచువచ్చిరి. స్కాటుదొరను జూచితిని గాని యాయన నా కేమియు సాయము చేతునన లేదు.

మేరీకారిల్లయి వ్రాసిన "వెండెట్టా", "మైటీ ఆటమ్" అను నవలలను ఏప్రిలు నెలలోఁ జదివితిని. "సైతానువెతల" వలెనే 'వెండె ట్టా'యును మిగుల మనోహరమగు విషాదాంత కథయే.

అంత మాపాఠశాలకు సెలవు లగుటచేత, మేయి ౫-వ తేదీని బయలుదేఱి, ఏలూరుమీఁదుగ రాజమంద్రి వెడలిపోయితిమి. రాజమంద్రి స్టేషను నుండియే యత్తయు భార్యయు కాకినాడ పోయిరి. మాతల్లియు తమ్ములును నత మిమ్మాచర్య చిన్న ఫుచ్చె నని తల పోసిరి!

## ౪౮. వీరేశలింగముగారి సాయము

మా చెల్లెలికూఁతుని బారసాల ౯-వ మే తేదీని జరుగఁగా, పిల్లను దీసికొని తల్లిదండ్రులు అత్తమూరు మఱునాఁడె వెడలి పోయిరి. మా తమ్మునిభార్యను, పిల్లవానిని మోగల్లునుండి తీసికొని

రావలెనని నేను మా తమ్ముఁడును ౧౨-వ తేదీని రాజమంద్రినుండి బయలుదేఱి, మఱునాఁటి ప్రొద్దున్న మోగల్లు చేరితిమి. అందఱు నచట సేమమె. పిల్లవాఁడు బాగుగనే యుండెను గాని, వట్టి బలహీనుఁడు. మావాండ్రను దీసికొనిపోయెద మని మే మనఁగా, మేము బారసాలను వైభవముగ నచటఁ జరిపినఁ గాని తల్లిని పిల్లవాని నిపుడు పంప వలనుపడదనియు, లేనిచో రాఁబోవునెలలో మా యింటికే వారిని మేము తోడుకొనివచ్చి బారసాల చేసికొనవచ్చుననియు, నరసయ్యగారు చెప్పివేసిరి! కోపస్వభావుఁడగు మాబావ షరతులకు మే మంగీకరించి మరలి వచ్చితిమి.

అంతట సోదరుల మిద్దఱమును రాజమంద్రి వెంటనే విడిచి, వేలివెన్నుమార్గమున గోటేరు పోయి, మా ఋణదాతదర్శనముఁ జేసికొని, తణుకు వచ్చితిమి. అచట నొక యున్నతపాఠశాలను నెలకొల్పు ప్రయత్నములు జరుగుచుండెను. నన్ను దానికి ప్రధానోపాధ్యాయునిగ నుండుఁడని పలువురు కోరిరి. కాని, తగినంత స్థిరత్వము లేని పాఠశాలలోఁ బ్రవేశింప నా కిష్టము లేదు.

ఆ సంవత్సరమున గోదావరి మండలసభలు అమలాపురమున జరుగవలసి యుండెను. నన్నాసభలకు స్నేహితు లాహ్వానించిరి. సాంబశివరావు కామేశ్వరరావుగార్లతోఁ గలసి నేను ౨౬-వ మేయి తేదీని అమలాపురము బయలుదేఱితిని. మండల రాజకీయసభకుఁ బోయి, "స్టాండర్డు" పత్రిక యుపవిలేఖకునిగ వార్తలు వ్రాసి యా పత్రిక కంపితిని. ౨౮-వ తేదీని సంఘసంస్కరణసభ జరిగెను. దానికి గోటేటి శివరావుగా రధ్యక్షులు. 'వేశ్యాజననిషేధము' 'వితంతువివాహప్రోత్సాహము' లను గుఱించిన తీర్మానములు నేను ప్రతిపాదించితిని. గోదావరిమండలస్థాయిసంఘములో నన్నొకసభ్యు

నిగఁ జేరు మని యెంద ఱెంతగఁ జెప్పినను నేను సమ్మతింప లేదు! వేలుమండలమున నివసించు నా కీ మండలసమాజసభ్యత్వము బరువులచే టని నేఁ దలంచితిని. దీనికి నన్నుఁ గొందఱు నిందించిరి. మఱునాఁడు విద్యావిషయక సభ జరిగెను. ౩౦-వ తేదీని మే మందఱము బయలు దేఱి రాజమంద్రి వెడలివచ్చితిమి.

౧-వ జూను తేదీని నేను మా బంధువులను జూచుటకు కాకినాడ పోయితిని. నా కచట నొక వైద్యునితోఁ బరిచయము కలుగఁగా, తల్లికిని భార్యకును వారియొద్దఁ గొంతమందు పుచ్చు కొంటిని. అచట నున్న దినములలో 'రాజాగారి కళాశాల'లో నొక యుద్యోగము ఖాళీయగుననియు, నా కది లభింపఁగల దనియు మిత్రులు చెప్పిరి. ౨౦-వ తేదీని మరల మేము బెజవాడ ప్రవేశించి తిమి.

సంఘసంస్కరణోద్యమ ప్రచారమునకై నేను గొందఱు మిత్రులతోఁ గలసి, ౬-వ జూలయిని బాపట్ల బయలుదేఱితిని. మార్గ మధ్యమున మమ్ముఁ గొందఱు మిత్రులు గలసికొనిరి. మే మందఱము నచట నుపాధ్యాయులగు బొప్పూడి వెంకటప్పయ్యగారియింట బస చేసితిమి. డిస్ట్రిక్టుమునసబుగారు బహిరంగసభ కధ్యక్షులు. విన్నకోట కోదండరామయ్య రాజగోపాలరావుగార్లు ప్రారంభించిన చర్చలో మే మందఱమును పాల్గొంటిమి.

పూర్వము పాఠశాలకార్యక్రమము సాగించుటలో అనంతము గారికి సామాన్యముగ నేను సహాయము చేయుచుండువాఁడను. ఇపు డాయన, సాంబమూర్తిగారు మున్నగు క్రైస్తవ బోధకుల సలహా పుచ్చుకొనుచు, వారల చేతనే కాలనిర్ణయపట్టిక మున్నగునవి

సిద్ధము చేయించుట, నాకును తక్కిన యుపాధ్యాయులకును నస మ్మతముగ నుండెను. పాఠశాలలో జరుగుచుండెడి దుర్న్యయములను గుఱించి నే నొక పెద్దయుత్తరము వ్రాసి, అనంతముగారికి ౧౮-వ జూలయిని బంపితిని. ఆరోజునను మఱునాఁడును జబ్బుగా నుండుట చేత నే నింటనే యుంటిని. మిత్రులతోఁ గలసి యొకసాయంకాల మున ననంతముగారు నన్నుఁ జూడవచ్చి, కాలనిర్ణయ పట్టికను నన్నుఁ దయారుచేయు మనిరి. నే నందుకు సమ్మతింపనందున, సరియైన యేర్పాటులు జరుగకుండుటకు నేనే కారణముగదా యని వారనిరి! కాని, యందఱియెదుటను నేను నిజము విప్పిచెప్ప సాహసింప కుంటిని.

క్రొత్తయేర్పాటులచొప్పున పాఠశాలలో నాకుఁ బని హెచ్చి తీఱిక తక్కువ యయ్యెను. నా దేహమున నిటీవల సరిగా నుండుటలేదు. సంవత్సరముల కొలఁది వార్తాపత్రికల పనులు చేయు టకు నే నెంతయు విసిగియుంటిని. ౧౯౦౧-వ సంవత్సరము జూను 'జనానాపత్రిక'లో స్వవిషయము అను శీర్షిక క్రింద నే నిట్లు వ్రాసి తిని:—"ఈ పత్రికతో మా 'జనానాపత్రిక' కెనిమిది సంవత్సరములు గడచినవి. జూలయి నెలలో ౯-వ సంవత్సరము ప్రవేశ మగును. * * * ఇంగ్లీషుమాసపత్రిక లెంత చక్కఁగ నుండునో చూడుఁడు! వేల కొలఁది చందాదారు లుండుటచేత నే యాపత్రికలు చౌకగ నమ్మఁబడు చున్నవి. అందలి విషయములు బొమ్మలును రమ్యముగ నుండును. మనదేశమం దన్ననో, పత్రికాధిపతి తన తీఱికకాలమును, సొమ్మును పత్రిక కుచితముగ నీయవలసినదే! పత్రికకు వ్యాసములు వార్తలు మున్నగునవి ముఖ్యముగ నాతఁడే వ్రాయవలయును. ఇతరు లతనికి సాయము చేయరు! పత్రికలను చందాదారుల కంపుట, ఉత్తర ప్రత్యుత్తరములు నడుపుట, సొమ్ము వసూలు చేయుట, మొదలగు

పత్రికపను లన్నియు నాతనిమీఁదనే పడును! కావున పత్రికాసంపాదకత్వము సంతోషజనకము గాక, యతని కొక శిక్షగా నగుచున్నది!

"ఇట్టి బానిసపనుల కీ జనానాపత్రికాధిపతియు లోనై యున్నాఁడని వేఱె చెప్పనక్కఱలేదు! ఎల్లకాలము నేకరీతిని కష్టపడుటకు మానవప్రకృతి యోరువఁ జాలదు! * * * కాఁబట్టి మా కీ సత్కార్యమున సహాయము చేయుఁడని యార్యులను విద్యాభిలాషులను వేఁడుచున్నాము."

ఇపుడు చెన్నపురిలో ముద్రాలయమును నెలకొల్పి జరుపుచుండు వీరేశలింగము పంతులుగారిని, "జనానాపత్రిక" ముద్రణాదికార్యకలాపమును గైకొనుఁడని కోరుచును, నేను పత్రికాసంపాదకునిగ నుందునని చెప్పుచును నే నొక లేఖ వ్రాసితిని. ఆయన దీనికి సమ్మతించి, తాము స్థాపింపనున్న యొక వార్తాపత్రికకు ఆంగ్ల వ్యాసములు వ్రాయుఁడని జూలయి ౨౨-వ తేదీని నాకు లేఖనంపిరి. మఱునాఁడే వారికి వందనము లర్పించుచు నేను ప్రత్యుత్తర మిచ్చితిని. కాని, వెనువెంటనే బ్రాహ్మసమాజమువారి ముద్రాలయమునుండి నా పత్రికను దీసివేయలేకయు, పాఠశాలలోని పనితొందరవలనను, నే నొక నెల యాలసించి, అగస్టు ౨౩-వ తేదీని పంతులుగారి కీ విషయమున జాబు వ్రాసితిని. దీనికి పంతులుగారు ౨౫-వ అగస్టున పెద్ద ప్రత్యుత్తర మిచ్చిరి. నేను జేసిన యాలస్యమునకు నామీఁద వారి కాగ్రహము జనించెను. వా రిపుడైనను మా పత్రికకు సాయము చేయ సిద్ధముగ నుంటి మనుటచేత, నేను సెప్టెంబరుసంచిక మొదలు మాపత్రికను వారి కొప్పగింప నిశ్చయించుకొని, ౩౦-వ అగస్టున మొదటివ్యాసము వ్రాసి వారి కంపితిని.

## ౪౬. వీరేశలింగముగారి సాయము

౧౯౦౧ సెప్టెంబరునుండియు "జనానాపత్రిక" వీరేశలింగముగారి 'చింతామణిముద్రాలయము'న నచ్చొత్తింపఁబడెను. సెప్టెంబరు పత్రికలో నే నిట్లు వ్రాసితిని:—"తెలుఁగుజనానాపత్రిక' విషయమై మేము పడుచుండు కష్టములు చూచి స్త్రీవిద్యాభిమానులలో నగ్రగణ్యులగు శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు మా పత్రికను నడుపుభారము కొంత తాము వహించెద మని దయతో వాగ్దానము చేసియున్నారు. ఈ సాహాయ్యమునకు వారి కెంతయు కృతజ్ఞులము. ముందునుండి మా పత్రిక వారి ముద్రాక్షరశాలలో ముద్రితమై చెన్నపురినుండి ప్రకటింపఁబడును. చందాధనము చెన్నపురికిని, వ్యాసములు మున్నగునవి బెజవాడకును, బంపవలయును. * * *

"* * * శ్రీ పంతులుగారు మా పత్రికను చౌకగనే ముద్రింపించెదమని సెలవిచ్చిరి. పత్రికాప్రకటనము, చందాలవసూలు, మున్నగు కష్టకార్యము లన్నియు నుచితముగఁ జేయ పంతులుగా రంగీకరించిరి. వీరి యౌదార్యమునకు వందనములు చేయుచున్నాము. * *

"శ్రీ వీరేశలింగముగారి యాదరణమున నీపత్రిక వర్ధిల్లఁగలదని యెంచుచున్నాము."

మొదటినెలనుండియే వీరేశలింగముగారు మా పత్రికకుఁ దాము వ్యాసములుకూడ వ్రాయుచువచ్చిరి. సెప్టెంబరు అక్టోబరు సంచికలయందలి "శ్రీ అలెగ్జాండ్రామహారాజ్ఞి చరిత్ర" యు అక్టోబరు సంచికలోని "ఉత్తమమాత" యును, వీరు వ్రాసినవియే. ఈ సాయమే కాక, తమయొద్దనుండు ప్రతిమల దిమ్మెలు మా పత్రిక యుపయోగమునకు వీ రొసంగుచుండెడివారు.

## ౪౭. ఉద్యోగప్రయత్నము

శ్రీ వీరేశలింగముగారి సాయమున "జనానాపత్రికా" ప్రచురణ భారము నాబుజములనుండి చాలవఱకు తొలఁగిపోయెను. అనంతముగారే మరల బెజవాడపాఠశాలకు ప్రధానోపాధ్యాయులుగను, అధికారులుగను వచ్చినను, ఈమాఱు వారి పరిపాలనము నా కంతగ నచ్చలేదు. ఆయన పేరు చెప్పి పెద్దయుపాధ్యాయులమీఁద చిన్నవార లధికారము చెల్లించుట కడు దుస్సహముగ నుండెను! నాయెడ ననంతముగారి వైఖరి యిట్లు మాఱిపోవుట చూడఁగా, నే నీపాఠశాలలో నుండుట వారి కిష్టము లేకుండునట్లు తోఁచెను! కావున నే నీసంవత్సరాంతమున వేఱుపాఠశాలకుఁ బోయి, స్వగౌరవరక్షణము చేసికొనుట కర్తవ్యముగఁ గానిపించెను. అంత మానిన న్యాయశాస్త్రపుఁజదువులు మరల నేను విప్పితిని. వెనుకటిచుఱుకుఁదనము లేకున్నను, ఒకరీతిని నే నాపుస్తకములు తిరుగవేసితిని

మాతల్లికిఁ దఱచుగ వ్యాధి వచ్చుచుండుటవలనఁగూడ నా మనస్తాప మతిశయించెను. ౪-వ సెప్టెంబరున నా తమ్మునియొద్దనుండి వచ్చినయుత్తరములో, ఇటీవల చేసిన జబ్బులో నీరసముచేత ధృతిచెడి యామె యేడ్చెనని యుండెను!

అప్పుడప్పుడు నేను సమావేశపఱుచు సభలు మున్నుగునవి నామనస్సున కొకింత యుపశమనము గావించెను. ౭-వ సెప్టెంబరున ముగ్గురు స్నేహితులము మరల బాపట్లకు దండయాత్ర సాగించితిమి. మిత్రులు విన్నకోట కోదండరామయ్యగారు సంస్కారపక్షమువారి వాదమును వ్యక్తపఱచిరి. పూర్వాచారపరుల పక్షమున నూజివీడు వాస్తవ్యులగు సూర్యనారాయణశాస్త్రిగారు, ప్రసంగించుచు, పూర్వ

## ౪౭. ఉద్యోగప్రయత్నము

స్మృతికర్తలకు వితంతూద్వాహము లంగీకారమే కాని, పరాశరునికి మాత్ర మది యసమ్మత మని నుడివిరి. మఱియెవరును బ్రసంగింపకయె యధ్యక్షులు సభ విరమించి మా కాశాభంగ మొనరించిరి!

౧౯౦౧ సం॥ ౯-వ సెప్టెంబరు వార్తాపత్రికలలో నెల్లూరు నందలి వెంకటగిరి రాజాగారి పాఠశాలకు ప్రథమోపాధ్యాయుఁడు కావలె నను ప్రకటనము గలదు. నేను దరఖాస్తు నంపితిని. నన్ను గుఱించి సిఫారసు చేయుఁడని యొకరిద్దఱు నెల్లూరుమిత్రులకు నేను వ్రాసినను, నా కీయుద్యోగ మగునని యాశ లేదు.

మేము బెజవాడలో నివసించు బంగాళా నిశ్శబ్దమగు ప్రదేశ మందలి తోఁటలో నుండెను. చుట్టుపట్టులఁ జేరువ నిండ్లేవియు లేవు. సమీపమున నుండునవి క్రైస్తవమహమ్మదీయుల గోరీలదొడ్లు మాత్రమే! పాఠశాలలోఁ బను లుండియు, బహిరంగసభలలోఁ బాల్గొనుచును, రాత్రులు నే నింటి కాలస్యముగ వచ్చునపు డెల్ల, ఒంటరిగ నింట నుండు నాభార్య దిగులుపడుచుండెడిది. ౧౧-వ సెప్టెంబరు రాత్రి నే నాలస్యముగ నిలు సేరునప్పటికి నాభార్య విలపించుచుండెను. ఈ యిల్లు విడిచి యింకొక ప్రదేశమునకుఁ బోవుట యుక్త మని నా కంత తోఁచెను.

బాలికాపాఠశాలల పరీక్షాధికారి స్వామిరావుగారు ౨౨-వ సెప్టెంబరున నా కగపడి, 'జనానాపత్రిక' లో మతవిషయక చర్చలు జరుగుచున్న వని పెద్దపరీక్షాధికారిణి కారుదొరసానిగారి యభిప్రాయ మని నాకుఁ జెప్పిరి. నే నేమిచేయను? తెలుఁగు తెలియని యీ యధికారి ప్రముఖులు 'జనానాపత్రిక' ను గుఱించి పట్టి యపోహములు పడుచున్నారు! కొలఁదిరోజులలో నే నాకాం

తను బెజవాడలోఁ గలసికొని మాటాడఁగా, నిజము తెలిసికొని యామె నాపత్రికదెస మరల సుముఖి యయ్యెను!

౧౭-వ అక్టోబరున నేను భార్యయు రాజమంద్రి వెళ్లి మావాంఢ్రను జూచితిమి. మా తమ్మునికుమారుఁడు నరసింహము, చెల్లెలికూఁతురు నరసమ్మయును మంచి యారోగ్యము లేకయుండిరి. కుటుంబ మంతయు బెజవాడ వచ్చినచో నందఱమును గలసి హాయిగ నుందు మని నేను మా తమ్మునికి బోధించితిని.

మఱునాఁటి "మద్రాసుస్టాండర్డు" పత్రికలో పర్లాకిమిడి కళాశాలలోని యుపాధ్యాయుఁ డొకఁడు నెల్లూరు వెళ్లిపోయె నని యుండుటచూచి, నా కా యుద్యోగము లభింపఁ బ్రయత్నింపుఁ డని మిత్రులు రాజగురువు పైడిగంటము కృష్ణారావుగార్లకు వ్రాసితిని. మే మంత బంధుదర్శనార్థమై కాకినాడ వెళ్లితిమి. నా కీ పర్లాకిమిడి యుద్యోగమునుగూర్చి సాయము చేయుఁడని స్కాటుదొరగారికి వ్రాసి, పర్లాకిమిడి కళాశాలాధికారికి దరఖాస్తు నంపితిని. పాఠశాలల పరీక్షాధికారినుండి సిఫారసు తీసికొని, యది పర్లాకిమిడి పంపితిని.

నేను బెజవాడకు ౯-వ అక్టోబరున తిరిగివచ్చితిని. అచట నాకు వెంకటరత్నమునాయఁడు గారు కానిపించి, తమ తమ్ముని భార్య చనిపోయె నను దుఃఖవార్త చెవిని వేసిరి. ఇపు డీ యన్న దమ్ము లిరువురును కళత్రవిహీను లయిరని వగచితిని. ఆసాయంకాలము నేను బసకు వచ్చుచుండఁగా, దారిలో నొకచోట విపద్దశనుండు నొక మనుజుని దీనాలాపములు వినవచ్చెను! నే నచటికిఁ బోయి చూడఁగా, ఒక యూరపియను వలంటీరు తన చాకలివాఁడు సరిగా

బట్ట లుదుక లేదని కోపించి, వానిని మోదుచుండెను! నే నడ్డుపడి, వానికి బుద్ధిచెప్పెద నని పలికి, చాకలిని విడిపించితిని.

నే నిపుడు పర్లాకిమిడి యుద్యోగమునకై గట్టిప్రయత్నము చేసితిని. అనంతముగారు తాము దయతో సిఫారసు చేయుటయేకాక, మద్రాసు సందలి తమతోడియల్లునికి నన్నుగుఱించి వ్రాసి, నాకుఁ దోడు పడుఁ డని వారిని గోరిరి. క్లార్కు పాలుదొరలను, నాగోజీ రావు పంతులుగారిని, నా కీ యుద్యోగవిషయమై సాయముచేయుఁ డని నేను వేఁడితిని.

## ౨౮. తమ్మునివ్యాధి

నే నీమాఱు బెజవాడ యొంటరిగ వచ్చుటచేత, గోపాలమను విద్యార్థి యువకుఁడు నా కీదినములలో వంట చేసిపెట్టుచుండువాఁడు. అతనిది నెల్లూరువంట. వంటకము లన్నియు జిహ్వకు మందులవలెఁ దగులుచుండెను! ఎటులో చేదు మ్రింగునట్లు నే నన్నము దినుచు, దినములు పుచ్చుచుంటిని.

విద్యార్థులు, తమ “ప్రసంగసమాజ” వార్షికోత్సవ సమయమున నన్నొక యుపన్యాస మీయు మని కోరిరి. “బోధకుల విధులు” అను నొక యాంగ్లవ్యాసము వ్రాసి, 3-వ అక్టోబరున సమాజసభలోఁ జదివితిని. విద్యార్థులు నుపాధ్యాయులు నది మెచ్చుకొనిరి. “సంఘసంస్కారిణీ” పత్రికలో నది ప్రకటిత మయ్యెను.

రెండవ నవంబరున రాజమంద్రినుండి వచ్చిన యుత్తరములో, తమ్ముఁడు సూర్యనారాయణకు ఎక్కువగ జ్వరము వచ్చె ననియు, నన్ను తత్క్షణమే రమ్మనియు నుండెను. ఆ సాయంకాలమునకు రాజ

మంద్రి చేరితిని. సూర్యనారాయణకు జ్వరము కొంత తగ్గెనని చెప్పిరి గాని, యింకను తీవ్రముగనే యుండెను. నారాకవలన వాని కెంతో ధైర్యము కలిగెను. తనకు గుంటూరుచెప్పులజోడు తెచ్చిపెట్టు మని వాఁడు ప్రాధేయపడెను. ఒక క్రొత్తపంచెయు గొడుగును నే నీయఁగా, వాఁ డెంతో సంతోషించెను. "అయ్యో నాదారిద్ర్య మెంత దుఃఖభాజనము! తండ్రికి జీవితకాలమున సౌకర్యము లొనఁ గూర్పనైతిని. ఇపుడు నా తోఁ బుట్టినవానికోరికలు చెల్లింప నేర కున్నాను!" అని నేను లోలోన వగచితిని. త్వరలో నేను మరల వచ్చెద నని తమ్ముని సమాధానపఱచి, ౪-వ నవంబరున నేను బెజవాడ వెడలిపోయితిని. తమ ప్రియశిష్యుఁడు సూర్యనారాయణ జబ్బుపడె నని విని, నా యుపాధ్యాయమిత్రు లందఱు బెజవాడలో ఖిన్నులైరి.

బెజవాడలో ౧౮,౧౯ నవంబరున చట్టనిర్మాణసభల కెన్నికలు జరిగెను. పురపాలకసంఘముల తరఫున కృత్తివెంటి పేర్రాజు పంతులుగారును, స్థానికసంఘములపక్షమున జంబులింగమొదలియారు గారును నియమింపఁబడిరి. నాతోడి బోధకుఁడు కల్యాణరామయ్యరు గారు మెయిలుపత్రికకును, నేను స్టాండర్డుపత్రికకును ప్రతినిధులమై సభలలోనికి వెళ్లి, సమాచారములు వ్రాసి పత్రికల కంపితిమి.

నేను జేసిన కృషిఫలితముగ, పర్లాకిమిడి కళాశాలాధికారి యగు మెయిలరు దొరనుండి నాకొక జాబు వచ్చెను. తమ విద్యాశాలలోని క్రిందియుపాధ్యాయులకు క్రమముగ పైయుద్యోగము లిచ్చెద మనియు, అందువలన నాకు డెబ్బదిరూపాయల పనిమాత్ర మీయఁగలమనియు వారు వ్రాసిరి. ఇచటనే ౪౫ రూపాయిలు జీతము గలనాకు ౬౦ రూపాయిలపని యిచ్చెద మనుట నిరుత్సాహకర

మయ్యెను, నాసంగతి యాకళాశాలాధికారి తలపెట్టినందుకే నేను సంతోషించితిని! కొలఁది నెలలలో నా కిచట నే ౫౦ రూపాయిల జీత మిచ్చెదరు గాన, నాకుఁ దగినవేతన మొసఁగినచో, పర్లాకిమిడి వచ్చెదనని నేను మఱునాఁడే యామ్యుద్యోగియునికి ప్రత్యుత్తరము వ్రాసితిని.

నే నిదివఱకే భీష్మునిగుఱించి యాంగ్లవ్యాస మొకటి వ్రాసి ప్రచురించితిని. ఇపుడు కార్లయిలుని "శూరుల" వంటిపుస్తకము నాంగ్లమున రచియింపఁబూని, "ప్రహ్లాదుఁడు — దేవుని ప్రియభక్తుఁడు", "అర్జునుఁడు — సాధకుఁడు" అను శీర్షికలతో నేను గొన్ని వ్యాసములను వ్రాయనెంచితిని.

౨౩-వ నవంబరు దినచర్యలో నిట్లు గలదు:— "గతరాత్రి భార్యయు నేనును పర్లాకిమిడి యుద్యోగము నాకుఁ గావచ్చునని యెంచి, భావి విషయములను గుఱించి తలపోసితిమి. 'ఎపిక్టిటసు' చదివి, యందలి రమ్యములగు కథపట్టు లామెకు బోధపఱిచితిని. * * నేఁడు మరల గృహకల్లోలము! అనుతాపలేశ మెఱుంగని గర్వాణియగు సతితో సంసార మెట్లు పొసంగును?"

౮-వ డిసెంబరున బంగాళావాస్తవ్యులు విపినచంద్రపాలు గారు మద్రాసునుండి వచ్చి నా కతిథులయిరి. వారికిఁ గావలసిన సౌకర్యములు నే నొనఁగూర్పలేకుంటిని. "కాఫీ" మేము చేయలేక పోయితిమి. కాఫీ చేయనేరని కుటుంబపు జీవితము వ్యర్థమని వారు చెప్పివేసిరి! ఆసాయంకాలము వా రొకయుపన్యాస మిచ్చి, మఱునాఁడు వెడలిపోయిరి.

౧౫-వ డిసెంబరునాఁటికి పాఠశాలపనియు, ప్రాథమికపరీక్షుపనియుఁ బూర్తియయ్యెను. తమ్ముఁడు సూర్యనారాయణ జ్వరము

తిరుగఁబెట్టెనని యా రోజుననే నాకు జాబు వచ్చినను, వెంటనే బయలుదేఱలేకపోయితిని. బెజవాడలో వ్రాఁతపని పూర్తిపఱుచుకొని, ౨౧-వ తేదీని ఏలూరు వెళ్లితిని. పర్లాకిమిడినుండి మద్రాసు తిరిగిపోవుచుండు పాలుపేటరుపిళ్లగారిని నేను రెయిలుస్టేషనులోఁ గలసికొంటిని. పర్లాకిమిడి పనికి ఇద్దఱు యం. యే. లును, పెక్కుమంది యితరులును దరఖాస్తు పెట్టిరనియును, నాకది లభింపవచ్చుననియును వారు చెప్పిరి. మా పెదతండ్రి కుమారుఁడు పట్టాభిరామయ్య చనిపోయెనను దుఃఖవార్త ౨౨-వ తేదీ సాయంకాలమున నేలూరులో నాకుఁ దెలిసెను. మఱునాఁడు ప్రొద్దుననే యుభయులమును రాజమండ్రి బయలుదేఱితిమి.

## ౮౯. సూర్యనారాయణుని నిర్యాణము

౧౯౦౧ డిసెంబరు ౨౩-వ తేది సాయంకాలమునకు రాజమండ్రిలో దిగి మేమింటికిఁ బోవునప్పటికి,సూర్యనారాయణుఁడు మిక్కిలి జబ్బుగా నుండెను. గత రాత్రియే వానికి సంధిగుణము ప్రవేశించెనని చెప్పి వెంకటరామయ్య విలపించెను. రోగి నన్నుఁ జూచి మిగుల సంతోషపడెను. నే నేమి క్రొత్తవస్తువులు తెచ్చితినో చూపుమని వాఁడు నన్నడిగెను. 'నాకు జందురుచెప్పులు తెచ్చిపెట్టితివా?' యని వాఁడడుగునపుడు, లే దని చెప్పుటకు నేను మిగుల నొచ్చుకొంటిని. వైద్యుఁడు కోటయ్యనాయఁడుగారిని దీసికొనివచ్చి చూపించితిమి. రెండు శ్వాసకోశములును బంధించె ననియు, సన్నిపాతము ప్రబలె ననియును, ఆయన చెప్పివేసిరి. మేము క్రమముగ మందు లిచ్చుచు రాత్రి జాగరము చేసితిమి. మఱునాఁటికి వానివ్యాధి ముదిరెను. శ్లేష్మప్రకోపమువలన రోగి యొత్తిగిలలేకుండెను! ఊపిరి పీల్చుట కష్టమయ్యెను. అంత దేశీయవైద్యు నొక

నిని పెట్టితిమి. అతని మందులును శ్లేష్మము నరికట్టలేకపోయెను. సంధి విజృంభించి, రోగిదేహము వణఁకెను. రాత్రి ౧౧ గంటలకు మా తమ్ముఁడు మృత్యువువాతఁ బడిపోయెను !

మా చిన్నితమ్ముఁడు మరణమొందె నని మేము నమ్మలేకపోయితిమి ! ఆ ముద్దుమోము, దృఢకాయము, ఉన్నతాకారము, నయవినయములు, అసమానబుద్ధి వికాసమును, తలపోసి తలపోసి మేము విలపించితిమి !

మాకు ప్రపంచ మంతయు నంధకారబంధుర మయ్యెను ! మే మిట్టి దుఃఖావస్థ నెపుడు ననుభవింపలేదు. 3 సంవత్సరముల క్రిందట మరణము నందిన మాతండ్రియు, గత సంవత్సరమం దీదినములందు కాలగతినొందిన మాపినతల్లియు, కొంతకాలము జీవించిన యనుభవశాలురు. ఇపుడు చనిపోయిన మా తమ్ముఁడు వట్టి పసరిక పిందెయే ! ముద్దుమాటలు, కొంటెతనఁపుఁ జేష్టలును,—వీని నింకను సరిగా వీడనేలేదు ! అట్టి పిల్లవానికి సంభవించిన యకాలమరణమునకై మే మమితముగ వెతనొందితిమి. ఈ పాపిష్ఠరాజమహేంద్రవరపట్టణ మిఁక వదలిపెట్టి, బెజవాడవంటి క్రొత్తప్రదేశమునకు సంసారము తరలించుట మంచి దని మే మందఱము తలంచితిమి. 'జనానాపత్రిక' ౧౯౦౭ సంవత్సరము జనవరిసంచికలో మాతమ్మునిగూర్చి నే నిట్లు వ్రాసితిని:—"ఈ పత్రికాధిపతి కనిష్ఠసోదరుఁడగు సూర్యనారాయణ యను ౧౭ సం|| వయస్సుగల చిన్నవాఁడు గత డిసెంబరు ౨౪-వ తేదీని జ్వరపీడితుఁడై లోకాంతరగతుఁడయ్యె నని తెలుపుట కెంతయు విచారకరముగ నున్నది. ఈతఁడు 'జనానాపత్రిక' కు వ్యాసములు వ్రాయుచువచ్చెను. విద్యాధికతచేతను, బుద్ధి తీక్ష్ణతముచేతను, వినయాది సద్గుణములచేతను శోభిల్లు

మండెడి యీబాలుని యకాలమరణము మిగుల దుస్సహముగ నున్నది. దయామయుఁడగు భగవంతుఁ డీతనియాత్మకు శాంతి నొసంగుఁగాక !"

సూర్యనారాయణకు గణితశాస్త్రమునం దసమానప్రజ్ఞ గలదు. నాయొద్ద కొన్నిసంవత్సరముల క్రిందట బెజవాడ పాఠశాలలో ౪-వ ఫారములో వీఁడు చదువుచుండునపుడు, తరగతిలో నే నెంత చిక్కులెక్క లిచ్చినను, అందఱికంటె మున్ముందుగనే లెక్కచేసి, ముసిముసినవ్వులు నవ్వుచు, నాయొద్దకు వచ్చుచుండువాఁడు! అతఁడు ప్రవేశపరీక్షనిచ్చి రాజమండ్రికళాశాలలో ప్రథమశాస్త్రతరగతిలో ౧౯౦౧-వ సంవత్సరమునఁ జదివెను. గణితశాస్త్రమునం దితనికిఁ గల సమర్థతను గనిపెట్టి, అధ్యాపకులు వీనియం దధికానురాగము గలిగియుండిరి. కళాశాలలోఁ దానొకసంవత్సరమే చదివినను, ఈతఁడు గణితశాస్త్రపుస్తకము లందలి చిక్కులెక్కలు పెక్కులు చేసి తనపుస్తకమున నెక్కించి యుంచుకొనెను! ఈతని యకాలమరణము ఉపాధ్యాయులకు, సహపాఠీయులకును గడు విషాదకరముగ నుండెను. ఇటీవల నింట చిన్నపను లన్నియు నీతఁడే చేయుచుండువాఁడు. ఈతని నయవినయములు దలఁచుకొనినప్పుడు, మా కందఱికిని గుండె నీరైపోవుచుండెను! మా సోదరుల కెవరికిని బ్రాప్తింపని యున్నతవిద్య నీతనికిఁ జెప్పించి ముందు మంచిస్థితి కీతనిఁ గొనిరావలెనని మే మనుకొనెడివారము. ఇపుడు మాయాశ లన్నియు నీటఁగలసెను! మాతల్లి కీపిల్లవాని మరణము కడు దుస్సహ మయ్యెను. అందఱము నీ దుర్భరవిషాద మనుభవింపవలసినవార మైతిమి!

## ౪౦. సందిగ్ధావస్థ!

కాఱుమబ్బులు క్రమ్మిన యాకసమం దొకప్రక్క మేఘము తొలఁగిపోయి, సూర్యకిరణ ప్రసార మొకింత కలిగినట్లు, ఈ దుఃఖసమయమున మా కొక సంతోషవార్త వినవచ్చెను! నాకు దొరతనమువారికొలువులో నుద్యోగ మయ్యె ననియు, నరసారావుపేటలో సహాయపరీక్షాధికారిగ నియమింపఁబడితి ననియు నొక స్నేహితుఁడు చెప్పెను. దీనినిగుఱించి విచారింపఁగా, ఇది సత్య మని తేలెను! మరల మేము తల లెత్తుకొనసాగితిమి. అందఱము నరసారావుపేట పోవుట యుక్త మనుకొంటిమి. ప్రస్తుతమున నే నీపనిలోఁ బ్రవేశించినచో, కళాశాలలో నాకుఁ బిమ్మట మంచియుద్యోగ మిప్పింతు నని స్కాటుదొర వ్రాసి, మాతమ్ముఁడు చనిపోయినందుకు తన విచారమును దెల్పెను.

నా కీసమయమునందే, పర్లాకిమిడి కళాశాలలో నూఱురూపాయిల వేతనముమీఁద ప్రకృతిశాస్త్రోపన్యాసకపదవి నిచ్చితిమని, యా కళాశాలాధికారి మెయిలరుదొర వ్రాసెను! నేను బెజవాడ పాఠశాలలోనే యుండినయెడల నెక్కువజీత మిప్పించెద మని అనంతముగారు వ్రాసిరి! ఇట్లే మూఁడు ఉద్యోగములలో నేది శ్రేష్ఠమో నిర్ణయించుకొనుట మాకుఁ గష్టముగఁ దోఁచెను!

ప్రభుత్వమువారి కొలువులోఁ బ్రవేశించుటకు వైద్యుని సర్టిఫికెటు కావలయును. కొంతకాలమునుండి దేహస్వస్థత లేని నా కాసర్టిఫికటు దొరకునో లేదో ముందు చూచుకొనుట మంచిదని నాకును తమ్ముఁడు వెంకటరామయ్యకును దోఁచెను. ఇపు డది యవసరము లేదని పరీక్షాధికారియగు విలియమ్సు పిళ్లెగారు చెప్పినను, ఎందుకైన

మంచిదని వారియొద్దనుండి యుత్తరము పుచ్చుకొని, నేను గుంటూరు పోయి, యచటి వైద్యాధికారితోఁ బరిచయము గలిగింపుఁ డని నామిత్రులు వెంకటకృష్ణయ్యనాయఁడు గారిని గోరితిని. కాని, వారికిని వైద్యాధికారియగు తమ్మనసింగుగారికిని మిత్రభావము లేకుండుటచేత, నా కీసాయము గలుగలేదు. వైద్యుఁడు నన్నుఁ బరీక్షించి, నాయందు హృద్రోగ చిహ్నములు గాన్పించెననియు, దొరతనమువారి కొలువులోఁ బ్రవేశింపవలదనియుఁ జెప్పిరి! ఐనను నన్ను బాగుగఁ బరీక్షించి, నిజమంతయు వ్రాసివేయుఁడని వైద్యుని నేను గోరితిని! పర్యవసాన మేమన, నేను ప్రభుత్వోద్యోగమున కనర్హుఁడ నని వైద్యుఁడు వ్రాసివేసెను!

నాయఁడుగారికిని మ్మనసింగుగారికినిత గల వైమనస్యములే నాదురదృష్టమునకుఁ గారణ మయ్యె నని పలువురు తలంచిరి! నే నంత గుంటూరు నుండియే ౧౧-వ జనవరిని రెండు తంతుల నంపితిని. ఒకటి పరీక్షాధికారికి,—నాకు వైద్యుఁడు కావలసిన సర్టిఫికెటు నీయలే దనియు, రెండవది పర్లాకిమిడి కళాశాలాధికారికి,—నేను వారి కళాశాలలో నుద్యోగము స్వీకరించితి ననియును. మఱునాఁడు ఉదయముననే నేను బెజవాడ వచ్చితిని. నా యలౌకిక చర్య కందఱు నాశ్చర్యపడిరి. దొరతనము వారికొలువు చేర నిశ్చయించుకొనినవాఁడు, వైద్యునియొద్దకు పాడి చేతులతోఁ బోవుటకు వారు నవ్విరి!

నాకు పర్లాకిమిడి యుద్యోగ మిచ్చితి మని తంతి యింకను రాలేదు. పెద్ద పరీక్షాధికారిని జూచి, వారిసాయమున నెటులో దొరతనమువారికొలువున నుద్యోగము సంపాదింపవలె నని యెంచి, ఆయన మకాముచేసియుండు నెల్లూరుపురమునకు నే నంతట వెళ్లితిని



౧౯౦౧. రాయసం రత్నమ్మ, వెంకటశివుడు.

## ౫౦. సందిగ్ధావస్థ!

అప్పటి కప్పుడే యాయన మద్రాసు పోయెనని యచటఁ దెలిసెను. పూర్వము నాకు సైదాపేట కళాశాలలో సహపాఠియైన సంతాన రామయ్యంగారు, పర్లాకిమిడి కళాశాల వదలి యిపుడు నెల్లూరుపాఠశాలలో ప్రథమోపాధ్యాయు లయిరి. ఈయన నాకు నెల్లూరులోఁ గానఁబడి, నేను పర్లాకిమిడిలోని యుద్యోగము స్వీకరించుట యుక్త మని సలహా నిచ్చిరి.

అంతట నేను మద్రాసు పోయి, విలియమ్సు పిళ్లగారిని స్కాటుదొరగారిని మఱికొందఱిని సందర్శించితిని. జరిగినదానికి వా రేమియును జేయఁజాలమనిరి. వీరేశలింగము గారితోను బుచ్చయ్య పంతులుగారితోను మాట్లాడితిని. ఇంతలో బెజవాడ వచ్చిన మాతమ్ముఁడు వెంకటరామయ్య నాకు మద్రాసునకు తంతి నిచ్చెను. నాకు పర్లాకిమిడి యుద్యోగమయ్యెననియు ఫిబ్రవరి ప్రారంభముననే నే నాకళాశాల చేరవలయు ననియును, అం దుండెను! తల తడివిచూచుకొని, నే నంత బెజవాడ మరలివచ్చితిని.

ఇంకను నాకు దొరతనమువారి కొలువు విషయమై విరక్తి కలుగలేదు! పైయధికారి యేమియుత్తర మిచ్చునో చూత మని వారికి తంతి నంపితిని. తుదకు ౨౪-వ జనవరిరాత్రి వారియొద్దనుండి ప్రత్యుత్తరము వచ్చెను. నా కిచ్చినపని రద్దుచేసితి మనియు, పర్లాకిమిడి యుద్యోగము నన్నుఁ జేకొను మనియు నాకు వారు తెలియఁ బఱచిరి! అందుచేత నేను దొరతనమువారి కొలువునం దాశ మాని వేసి, బెజవాడయుద్యోగము విరమించుకొని, పర్లాకిమిడి పోవుటకు నిర్ధారణ చేసికొంటిని.

## ౫౧. నూతనోద్యోగము

౧౯౦౫-వ సంవత్సరము జనవరి ౨౮-వ తేదీని నాకు బెజవాడ పాఠశాలాభవనమున విద్యార్థులు నుపాధ్యాయులును గలసి వీడ్కో లొసంగిరి. అపుడు వారు సమర్పించిన విజ్ఞాపనపత్రమునందు, ఈ పాఠశాలలో నీ యెనిమిది సంవత్సరములనుండియు నందఱి మెప్పు నొందునట్టుగ నా విధ్యుక్తములు నెరవేర్చితి ననియును, విద్యార్థుల యవినీతి నడంచుటయందు నే నమితశ్రద్ధ వహించితి ననియు, బోధనమూలముగను సాహితీసంఘముల చర్చలలోఁ బాల్గొనుచును విద్యార్థుల మనోవికాసమునకు నే నధికప్రోత్సాహము గలిగించితి ననియు, విద్యార్థులతోఁ గలసి మెలసి యాటలాడుచు వారికి దేహారోగ్యభాగ్యము గలిగించితి ననియును వారు చెప్పిరి. నా కాసమయమున నొక వెండిగడియారముకూడ బహుమాన మీయఁబడెను.

ఇంతకాలమునుండియు బోధకునిగ నుండిన యీపాఠశాలను, ఈ నగరమును, విడిచిపోవ నా కమితసంతాపకరముగ నుండెను. ఆరాత్రి యధిక భావోద్రేకమున నాకంటికిఁ గూర్కు రానెలేదు! ఇటీవల సంభవించిన నాకనిష్ఠసోదరుని మృతి, దొరతనమువారి యుద్యోగవిషయమై నే పడినయలజడి, నూతనోద్యోగమునందు నాకుఁ గలుగనున్న కష్టసుఖములు,—వీనియన్నిటినిగుఱించియుఁ దలపోయుచు, నే నారాత్రి జాగరము చేసితిని! మఱునాఁడు ప్రొద్దుననే లేచి భార్యాసమేతముగ నేను రెయిలులోఁ గూర్చుంటిని. మాకు వీడ్కో లొసంగుటకు నుపాధ్యాయులు, విద్యార్థులు ననేకులు రెయిలుదగ్గఱకు వచ్చిరి. వారియొద్ద సెలవు గైకొని మే మంత రెయిలులో బయలుదేఱితిమి. మధ్యను ఏలూరులో నొకరోజు నిలిచి,

## ౫౧. నూతనోద్యోగము

మందు పుచ్చుకొనుటకై సతి నచట నుంచి, నేను రాజమంద్రి వెడలి పోయితిని.

నేను రాజమంద్రి చేరునప్పటికి నాకొక యుత్తర మచటికి వచ్చియుండెను! నా పూర్వమిత్రుఁడును పర్లాకిమిడి కళాశాలలో నుపాధ్యాయుఁడును నగు శ్రీ జంధ్యాల సుందరరామయ్యగా రది వ్రాసిరి. నాకు పర్లాకిమిడియుద్యోగ మిచ్చిన మెయిలరుదొర మరణావస్థలో నుండె ననియు, అతఁడు చనిపోయినచో కళాశాల దుస్థితికి రావచ్చు ననియును, నామిత్రుఁడు తెలిపెను! నే నెచటికిఁ బోఁదలచినను, దురదృష్టదేవత ముందడుగు వేయుచుండునట్లు కానఁబడెను.

నే నిపు డిచ్చినతంతి నందుకొని, తనయుత్తరము నాకుఁ జేరువఱకు నిచటనే నిలిచియుండుఁ డనియు, తాను బయలుదేఱుచున్నా ననియును, సుందరరామయ్యగారు రాజమంద్రికి మాఱుతంతినిచ్చిరి. కావున నింకను నాసందిగ్ధావస్థ తొలఁగనేలేదు! ఆయన వ్రాసిన యుత్తరము నా కాలస్యముగఁ జేరెను. అందులో, మెయిలరుదొర చనిపోయె ననియు, నేను బాగుగ నాలోచించి మఱి రావలె ననియును మాత్రమే యుండెను! ఇదివఱకు దొరతనమువారిపని పోయి, యిపుడు పర్లాకిమిడియుద్యోగఁపు సంగతి యిట్లు కాఁగా, ఎప్పటి బెజవాడయుద్యోగమే నాకు తుదకు గతి యగునట్లు తోఁచెను! కాని, వదలివేసిన పనికొఱకు కాశించుట యగౌరవ మని మాకుఁ గానఁబడెను. దైవముమీఁద భారము వేసి, ముందుచూపు చూచి, పర్లాకిమిడికిఁ జనుటకే నేను నిర్ధారణచేసికొంటిని. పర్లాకిమిడి మన్య ప్రదేశ మనుట యసత్య మని యాప్రాంతములందు పనిచేసి వచ్చిన మిత్రుఁడు నరసింహరాయఁడుగారు నొక్కి చెప్పిరి. కావున నేను మాతమ్ముఁడు

వెంకటరామయ్యతోఁ గూడి క్రొత్త ప్రదేశమునకు వెంటనే బయలు దేఱితిని.

రాత్రి నౌపడా రెయిలుస్టేషనులో మేము సుందరరామయ్య గారిని గలసికొని మాట్లాడితిమి. వెంటనే యుపద్రవ మేమియుఁ గలుగకపోయినను, కళాశాలాపరిస్థితులు వెనుకటివలె నుండవేమో యని ప్రజలు భయపడుచుండి రని యాయన చెప్పిరి.

అంత ౨-వ ఫిబ్రవరి యాదివారమునాఁడు మేము పర్లాకిమిడి చేరితిమి. మిత్రుఁడు పైడిగంటము కృష్ణారావుగారియింట మేము విడిసితిమి. స్నేహితులు, నితరులును పెక్కండ్రు మమ్ముఁ జూడవచ్చిరి. మే మొంటరిగ వచ్చుటచేత, కళాశాలా భోజనవసతిగృహము మేడగది నా విడిది యయ్యెను. ౩-వ ఫిబ్రవరి సోమవారమున నేను కళాశాలకుఁ బోయి, నా క్రొత్తయుద్యోగమునఁ జేరితిని.

---

# ఆత్మచరిత్రము



## తృతీయభాగము : ఉపన్యాసకదశ

### ౧. పర్లాకిమిడిలో ప్రథమదినములు

౧౯౦౭-వ సంవత్సరము ఫిబ్రవరి ప్రారంభమున నేను పర్లాకిమిడి ప్రవేశించుటతోనె నాజీవితమున నూతన దశాప్రారంభమయ్యెనని చెప్పనగును. నేనిదివఱకు సంవత్సరముల కొలఁది పాఠశాలలలో నుపాధ్యాయత్వము సాగించి యలసితిని. బెజవాడపురమను వేడిమంగలమున నేండ్లకొలఁది వేఁగితిని! వత్సరముల తరబడిని పత్రికాధిపతినై, చందాదారులతో నుత్తరప్రత్యుత్తరములు జరిపి డస్సిపోయితిని. ఇప్పుడీ పనులన్నిటిలో నాకుఁ గొంతవిరామము గలిగెను! ఇంతటినుండి నేను కళాశాలలో నుపన్యాసకుఁడనైతిని. పెద్దతరగతులకు నున్నతవిద్య బోధింపనా నాకిన్నాళ్లకవకాశము కలిగెను. మనసు వచ్చినట్టుగ కళాశాల తరగతులకు నాయభిమానవిద్యను నేనిఁక బోధింపవచ్చును. ఈపర్లాకిమిడిపట్టణమున పెద్దరాజమార్గము చివర దట్టముగ పచ్చని పొదలల్లుకొనిన యున్నతపర్వతము గలదు. రెండవ కొనయందు దర్శనీయమగు తటాకముగలదు. ఏ నడివేసఁగినో తక్క సామాన్యముగఁ గాలమిచట సౌమ్యముగనుండును. కొన్నిమాసముల నుండి "జనానాపత్రిక" సంబంధమగు చిన్నపనులన్నియు మద్రాసు

న నే జరుగుచుండెను. కావున నేను పర్లాకిమిడియం దడుగిడుట యే నూతన సౌఖ్యలోకమునో జొచ్చుటవలె నాకుఁ దోఁచెను! రెయిలు బండి పట్టణము సమీపించుచుండఁగనే, కొండ క్రింద చెట్లగుబురుల మధ్య గృహశిఖరములు గానవచ్చి, ఇచ్చటియిండ్లు ప్రకృతికాంతతో దాగుడుమూతలాడుచున్నవా యనునట్లు తోఁచెను! చల్లని పిల్ల వాయువులు ప్రసరించు "సీతసాగరము" శీతసాగరమనియే భ్రమ నొందితిని! ఇచటిజనుల వేషభాషాచారములు క్రొత్తలుగనుండి, మనస్సునకు వింతయగు నానందము గొలిపెను. నేనీ నూతన దేశమున, నూతనోద్యోగమునఁ బ్రవేశించి, నూతనవిద్య గఱపుచు, నూత నాశయముల మదిని నిలుపఁజొచ్చితిని!

వచ్చిన క్రొత్తఱికమున రెండుదినములు పైడిగంటమువారు నాకును తమ్మునికిని నాతిథ్య మొసఁగిరి. అంత కళాశాల కంటియుండు భోజనవసతిగృహమున భుజించుచు, అచటి మేడమీఁదిగదిలో బస చేసితిమి. కళాశాలాధ్యక్షులగు మంగు శ్రీనివాసరావుగారిని, మఱికొందఱు బోధకులను నేను జూచితిని. నే నిచటి కళాశాలలోని ప్రథమశాస్త్ర తరగతులలో 'శారీరశాస్త్రమును', ప్రవేశపరీక్షతరగతులలో నాంగ్ల సాహిత్యమును బోధింపవలయును. కళాశాలకు రెండుదినములు వెళ్లి నాపనులు చూచుకొంటిని. ఇంతలో జ్వరము రక్తగ్రహణియును నన్ను బాధించెను. అందుచేత సెలవు పుచ్చుకొని యింటనే యుండ వలసినవాఁడ నైతిని. చుట్టును అడవి పెరిఁగియుండుటచేత, పట్టణము లోనికి రాత్రులు చిఱుతపులులు వచ్చుచుండు నని జనులు చెప్పిరి. ఒకనాఁడు పట్టపగలే పెద్ద చిఱుతపులియొకటి మాదాపున నుండు నొక యింటఁ బ్రవేశించెను! ఆ యింటియాఁడుది చొరవతోఁ దలుపుమూసి, బయట గొళ్లెము పెట్టి, కేకలు వేసెను. చుట్టుపట్టులనుండి జనులు వచ్చి,

రాజుగారికి వార్త నంపిరి. అపు డాపూరియింటి కప్పు కొంత తొలఁగించి, పైనుండి తుపాకి పేల్చి, రాజుగారు పులిని జంపివేసిరి! నే నీపురమునఁ బాదము పెట్టఁగనే నన్ను వ్యాధి వేధించుటయు, ఇచట నటవీమృగములు బాహాటముగ సంచారముచేయుటయుఁ జూడఁగా, ఇందలి నివాసము నాకు బొత్తిగ సరిపడకుండునట్లు తోఁచెను! కావున నిచ్చటినుండి మొదటనే ధైర్యముతో వెనుకంజ వేయుట కర్తవ్యము కాదా యని తమ్ముఁడు నేనును దలపోసితిమి! కాని సాధకుఁడగు పాత్రుఁడను పేరుగల యోఢ్రవైద్యుఁడు నాకు మంచిమం దిచ్చి, వ్యాధినివారణముఁ జేసెను. అంతట తమ్ముఁడు నన్నిక్కడ విడిచి రాజమంద్రి వెడలిపోయెను.

కళాశాలలో నే జెప్పవలసిన చదువు నా కమితప్రియమైనది. 'శారీరశాస్త్రము' కొంత క్రొత్తవిషయమైనను, పరిశ్రమముచేసి, మంచిపుస్తకములు చదివి, అందుఁ గావలసిన పరిజ్ఞాన మలవఱుచుకొంటిని. ఆంగ్లసాహిత్యము నాకుఁ గొట్టినపిండియే. పరీక్షకుఁబోవు తరగతికావిషయము బోధించుటయందు నా కమితాసక్తి. పాఠశాలలోనివారు నాకు వేగమే మిత్రులైరి. అధ్యక్షుఁడు శ్రీనివాసరావుగారు సాధుపుంగవుఁడు. ఈయన సహాయాధ్యాపకుల జోలికేమియుఁ బోక, స్వేచ్ఛానందములతో వారిపనులు వారిని జేయనిచ్చుచుండువారు. పై యధికారియం దట్టి సుగుణ మమూల్యమని నేను గ్రహించితిని. శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారు తమ యభిమానవిద్యయగు చరిత్రమున మిన్నలు. రాజకుమారుల గురువులును, కళాశాల తరగతులలో నాంగ్లోపన్యాసకులు నగు కాండ్లరుదొర మితభాషియగు సుజనుఁడు. స్నేహపాత్రులును విద్యాశాలలో బ్రకృతిశాస్త్రోపాధ్యాయులునునగు శ్రీసుందరరామయ్యగారిదివఱకే రాజ

మంద్రికళాశాలలో నాకుఁ బరిచితులు. శ్రీయుతులు వేమూరి నారాయణమూర్తి, రాంపల్లి వెంకయ్యగార్లు గోదావరిమండల వాస్తవ్యులేయగుటచే, త్వరలో నాకు స్నేహితులైరి. ఓఢ్రబోధకులగు శ్రీగంతాయతుగారు, తక్కిన యుపాధ్యాయులును, శీఘ్రమె నాకుఁ బరిచితులైరి. నా తరగతులలోని శిష్యులకు నాకును వేవేగమే స్నేహ సౌహార్దము లేర్పడెను. ప్రతితరగతిలోను ఓఢ్రులు పలువురుండుట చేత, వారిస్వభావాదులు గుర్తెఱుఁగుటకు నా కవకాశము కల్గెను. వారందఱికిని తెలుఁగు బాగుగఁ దెలియుటచేత, బోధనావిషయమగు కష్టము లెవ్వియు నాకుఁ గానఁబడలేదు.

పర్లాకిమిడిలో 'ప్రార్థనసమాజ' మదివఱకే యేర్పడి యుండెను. ఇతరచోట్లవలెనే యిచ్చటను సభ్యులలోఁ బలువురు విద్యార్థులు. అక్కడకుఁ బోయినప్పటినుండియు సమాజప్రార్థనము జరుపుటను గుఱించి నే నెక్కువశ్రద్ధ వహించువాఁడను. సామాన్యముగ నేనే ప్రార్థన జరిపి, యేదో విషయమును గుఱించి ధర్మోపన్యాసము చేయుచుండువాఁడను. ఆ ప్రదేశమునకు నేను క్రొత్తవాఁడ నగుటచేత, నాపలుకులు వినుట కనేకులు వచ్చి, నా కెంతోయుత్సాహము గలిగించుచుండిరి. కాని నే నీప్రదేశమునకు వచ్చినప్పటి నుండియును, ఇదివఱకు సమాజనాయకులుగ నుండిన సుందర రామయ్యగారు మందిరమున నడుగిడకుండుట నా కెంతయు నిరుత్సాహకరముగ నుండెను.

అనుదినమును షికారు పోవుచుండుట నా కభ్యాసము. ఇట్టి వ్యాయామమున కీపట్టణము మిగుల ననువుగ నుండెను. నిశ్శబ్దములగు ప్రదేశములు, దర్శనీయములగు నడవిచెట్లు, కొండలు, కనుమలు, సెలయేళ్లును నాకుఁ జిత్తాకర్షకములుగ నుండెను! ఒకొక్కప్పుడు రెండు

పూఁటలును నే నీవిహారనిమగ్నుఁడనై యుండు వాఁడను. ఐన నా వాహ్యాళి చీఁకటి పడకుండఁగనే పరిసమాప్తి కావలయును! పట్టణమున కన్ని ప్రక్కలను నడవులు గలవు. ఒక దిక్కున చింతతోపులును, ఒక ప్రక్క నడవిపందులును, వేఱొకదెస నెలుగుగొడ్డును గ్రుమ్మరుచుండు నని వదంతి! అన్నివైపులను సర్పములు సమృద్ధి!

నేను వచ్చిన యొకనెలకు బ్రాహ్మసామాజికులగు చండీచరణు సేనుగారు బంగాళమునుండి వచ్చిరి. ౭-వ మార్చిని జరిగిన బహిరంగ సభలో "ప్రజలఋణము తీర్చు టెట్లు?" అను విషయమును గుఱించి సేనుగారు ప్రసంగించిరి. సభకు నే నగ్రాసనాధిపతిని. రాజావారి తమ్ములు వచ్చి యుండిరి. ఇదివఱకే వారిని కోటలో సందర్శించితిని. నాలుగు దినముల పిమ్మట సేనుగారు వెడలిపోయిరి.

ఇటీవల మద్రాసువెళ్లినపుడు, వీరేశలింగముగారితో సంభాషణ సందర్భమున వారి జీవితకథ నాంగ్లమున వ్రాయుదునని నేనంటిని. దీని కొకవిధమున వారు సమ్మతించిరి. తాము 'స్వీయచరిత్రము' వ్రాయుటయుక్తమాయని వారడుగఁగా, అదిమంచిదనిచెప్పి, నేను వారినిఁ బ్రోత్సహించితిని. ఆపుస్తకమున ముద్రింపఁబడిన కాగితము లెప్పటివప్పుడు నాకు వారు పంపెదమనిరి. వారి జీవితచరిత్ర మిట్లు రెండువిధముల వేగమే ప్రచురింపఁబడఁగలదని నేను సంతసించితిని. కాని, క్రొత్తప్రదేశమందలి కార్యకలాపము వలన నాకంతగ తీఱిక లేకపోయినను, ఏప్రిలు "జనానాపత్రిక" లోను, "సంఘసంస్కారిణీ" పత్రికయందును నేను పంతులుగారి చరిత్రమును నాంగ్లమున రచింతునని ప్రకటించి, అవ్విధముననైన నాగ్రంథప్రారంభము కాఁగలదని యూహించితిని.

నేను కళాశాల ప్రవేశించిన క్రొత్తటికమున నొకనాఁడు ప్రథమశాస్త్ర పరీక్షతరగతిలో నొక పిల్లవాఁడు దుమదుమలాడు మొగమునఁ గూర్చుండుట చూచి, కారణమేమని నేనడిగితిని. కోపో ద్రేకమున నాతఁడు ప్రత్యుత్తర మీయఁబోఁగా, కోపము విద్యార్థుల కనర్థదాయకమని నేనంటిని. ఆతని వైఖరి నాకు బాగుగఁ గానఁబడ లేదు. తనను గొప్పవానిగ భావించి గురువు గౌరవింప వలెనని యాతని కోరిక యని వానిమాటలవలనఁ దేలెను. తానెంత తెలివిగలవాఁడై నను, గురు వాతనిని శిష్యునిగనే పరిగణించునని నేను జెప్పివేసితిని. పిమ్మటాతఁడు నాయొద్దకువచ్చి, తనతప్పు సైరింపుఁడని వేఁడెను. తరగతిలోఁ జేసిన నేరమునకు తరగతిలోనే తాను క్షమాపణ వేఁడి నచో నేను క్షమింతునని చెప్పివేసితిని. దీనికాతఁడు సమ్మతింపలేదు. కావున నేనీసంగతి కళాశాలాధ్యక్షునికి నివేదింపఁగా, విద్యాలయము నకు రెండుదినము లాతఁడు రాకుండునట్లుగ వానికి శిక్షవేసిరి. పిమ్మట నెపుడును విద్యార్థులతో నాకు సంఘర్షణము గలుగలేదు.

౨౧-వ మార్చిని నా భార్య పర్లాకిమిడి వచ్చునని తెలిసి, నేను నాపడావెళ్లి కనిపెట్టుకొని యుంటిని. ఆరాత్రి మెయిలుమీఁద తమ్ముఁడు కృష్ణయ్య వదినను గొనివచ్చెను. మఱునాఁడు మువ్వుర మును రెయిలుమీఁద పర్లాకిమిడి వచ్చితిమి. వెంకయ్యగారియింట నొక భాగమున మేము కొన్నిదినములు గడిపి, రాజవీథిలో నుండు వేఱొక పూరియింటిలోనికి వెడలిపోయితిమి.

ఈ క్రొత్తప్రదేశమునకు వచ్చినదిమొదలు నా చిరకాలా భ్యాసములలోఁ గొన్నిటియందు మార్పు గలిగెను. వీనిలో ముఖ్యమైనది దినచర్య పుస్తకములను గుఱించినది. కళాశాల తరగతులలోని బోధ నకై యధికముగఁ బరిశ్రమించుటచేత నాదినచర్యను పుస్తకములందు

సరిగా లిఖింప మానివేసితిని. తీఱికసమయములం దొకింత వ్రాయుచు పిమ్మట కొంతకాలమునకు దినచర్య పుస్తకముల నుంచుటయే విరమించివేసితిని. కళాశాలను వేసవి సెలవులకు ౨-వ మేయి తేదీని మూసిరి. పుస్తకములు, విలువగల సామానులు నొక మిత్రునింట వేసి మేము కాకినాడ బయలుదేఱితిమి.

## ౨. క్రొత్తప్రదేశము

౧౯౦౨-వ సంవత్సరము వేసంగిలోఁ గొన్నిదినములు మాబావమఱఁది వెంకటరత్నముగారియింట నేను గడపితిని. ఇపు డాతఁడు కాకినాడలో కలెక్టరు కచేరిలో గుమాస్తాగా నుండెను. మాయప్పు త్వరలోఁ దీర్చివేయుట యుక్తమని నా కాతఁడు బోధించెను.

మేయి నెలలో చివరభాగమున నేను రాజమండ్రి వెళ్లితిని. మా రాజమండ్రి నివేశనస్థలములు అమ్మివేసి ఋణములు తీర్చుట మంచిదని నేను సోదరులకుఁ జెప్పితిని. ఈ విషయమున పెద్దతమ్మునికి నాకు నభిప్రాయభేదమేర్పడెను.

ఈ సెలవులలో నేను జదివిన పుస్తకములలో ఫ్రెంచిరచయిత వ్రాసిన "స్త్రీరాజ్ఞి" అను పుస్తక మెన్నఁదగినది. నానాదేశపు స్త్రీల లక్షణము లాతఁడు వర్ణించి, తాను బరిణయము కాంక్షించినచో, సుదతులందఱి సౌందర్యమును దాల్చిన స్త్రీ పుడమినుండుట యసంభవము గాన, తాను బహుభార్యాత్వమున కొడంబడెద నని నుడివెను. దీనిలోనుండి గైకొనిన "గాబ్రియలు సోదరి" వృత్తాంతమును జనానాపత్రికలోఁ బ్రచురించితిని.

ఆత్మ చరిత్రము

నేను పర్లాకిమిడి వచ్చినప్పటినుండియు, 'జనానాపత్రిక' కు నేనును, మాతమ్ముఁడు వెంకటరామయ్యయును సంపాదకులముగ నుంటిమి. అదివఱలో 'సత్యసంవర్ధని'కి పత్రికాధిపతిగ నుండినహేతువున, అతఁడు మంచివ్యాసములు వ్రాయుచు, ఈపత్రికను రాజమంద్రిలో నడపుచువచ్చెను. ఆ సంవత్సరము మేయినెల సంచిక మొదట ప్రచురించిన "జానకమ్మ" కథ అతఁడు వ్రాసినదియే. ౨౦-వ జూను తేదీని నేను, భార్యయును పర్లాకిమిడికి బయలుదేఱితిమి. మార్గమధ్యమున సింహాచలమున మఱునాఁడు ప్రొద్దున దిగి, ఆలయము చూచి, పిమ్మట పర్లాకిమిడి వెడలిపోయితిమి. ఈమాఱు రాజవీధిలో కళాశాలకు సమీపముననుండు మేడ భాగమున మేము ప్రవేశించితిమి. ఈక్రొత్తయిల్లు మాకన్నిరీతుల ననుకూలముగ నుండెను. కళాశాలకుఁ జేరువ నీ విశాలమగు గృహమున నివసించుటచేత మా కెంతో హాయిగనుండెను.

ఎట్లో శ్రమపడి పొదుపుగ గడుపుకొని, శీఘ్రమే ఋణవిముక్తుల మగుటకు దంపతులము గట్టిపట్టుపట్టితిమి. పర్లాకిమిడిలో ధాన్యము, కాయగూరలు, కట్టెపుల్లలు మున్నగునవి మిగుల చౌక. కావున వెనుకటి కంటె నిపుడు నాచేత సొమ్ము మిగులుచుండెను.

నే నిపుడును, 'జనానాపత్రిక' తోఁబాటు నితరపత్రికలకును వ్యాసములు వ్రాయుచువచ్చితిని. ఈ ఫిబ్రవరిలో చనిపోయిన మన్నవ బుచ్చయ్యపంతులుగారిని గుఱించి మార్చి జనానా పత్రికలోఁ గొంత ప్రస్తావించి, "సంఘసంస్కారిణీ" పత్రికకొక యాంగ్లవ్యాసము వ్రాసితిని. అది గాటుగనుండెను. దానినిగుఱించియు, చనిపోయిన మాతమ్మునిగూర్చియు ప్రస్తావించుచు మిత్రుఁడు వెంకటరత్నము

## ౨. క్రొత్తప్రదేశము

నాయఁడుగారు నా కాదినములలో వ్రాసినయుత్తర మిందు ప్రచురించుచున్నాఁడను:—

మహబూబు విద్యాలయము

సికిందరాబాదు

౨౨-౪-౧౯౦౨

"భ్రాతృవరా!

* * * పరలోకప్రాప్తిఁజెందిన సోదరుని యకాలమరణము, జీవించియున్న మనబోంట్లకు హృదయనిర్భేదకము. కోఱగాని బ్రతుకు ప్రమిద యడుగువఱకును గాలువత్తివలె చిరకాల ముండును. పవిత్రాత్ములు మాత్రము ముందు వెడలిపోయెదరు. ఇట్లు తలంచుకొన్ననే మనము కొంత యుపశమనము గాంతుము. లేకున్న, లోకమంతయు నవయోమయమును, హృదయము తాప పరిపీడితమును నగును. ఒకకంట నీరు విడుచుచునే, మనము నిశ్వాసమునఁ బాటుపడుచు, దైవముమీఁద భారమువేసి, ధైర్యమున పనులు నెరవేర్చుకొనవలయును.

"మీకు లభించిన పరీక్షాధికారి పదవి తొలఁగిపోయె నని వింటిని. మీ కారోగ్యము సరిగా నున్నచో, దీనికై నాకంతగ విచారము లేదు. మీజీవితధర్మము బాలురకు ప్రబోధము కలిగించుటయే కాని, పరీక్షించుట కాదని మీరు ఊరడిల్లవలయును. మీకు వలసిన శక్తి సౌభాగ్యములు పరమేశ్వరుఁ డొసంగుఁగాక!

"బుచ్చయ్యపంతులుగారిని గుఱించి మీరు "సంఘసంస్కారిణీ" పత్రికకు వ్రాసిన వ్యాసము మద్రాసు బ్రాహ్మసామాజికులలోఁ గొందఱికిఁ గడుపుమంట కలిగించెను. కాని మీవ్రాఁత సత్యమునకు దూరముగా దని నావిశ్వాసము.

"ప్రేమాస్పదులగు వీరేశలింగము పంతులుగారి చరిత్రము మీరు శీఘ్రముగఁ బ్రచురించెదరని విని సంతసించితిని. **. ఈవిషయమున మీకుఁ గావలసిన సాయము సంతోషపూర్వకముగఁ జేయుదును. * * *

ర. వెంకటరత్నము."

నేను మద్రాసు స్టాండర్డుపత్రికకు పలుమాఱు వ్రాయుచుంటిని. స్థానికవార్తలు వ్రాయ నాయభ్యాసముకాదు. "గంజాము, విశాఖపట్టణమండలముల వింతలు" అను శీర్షికతో నప్పుడప్పుడు నేను వ్రాయు సంగతులు మిత్రులు శ్రీ గిడుగురామమూర్తిపంతులుగారు వినోదమునఁ జదివి నన్నభినందించుచుండువారు. గంజాము మండలము వారికి మనుష్యులయందు కంటె దున్నపోతులను బెంచుటయం దెక్కువ శ్రద్ధయనియు, చిన్న వెండిబేడకాసు లాప్రాంతమునఁ జెల్లవనియు, కాళ్లు పట్టించుకొనుట వారి కభ్యాసమనియు, ఓఢ్రులు రాత్రులందొడలికి నూనిరాచి పసుపుఁబూసికొని వేకువనే చెఱువులో స్నానము చేయుదురనియు పత్రికకు వ్రాయుచుండువాఁడను.

ఇచటి హీనజాతులలోనివారు కొందఱు పాటుపడుటమాని, వీథులలోని యెంగిలాకులు నాకుచు కాలక్షేపముఁజేయుట నాకు విషాదము గలిగించెను. ౨౦-వ జూలయి ఆదివారము ప్రార్థన సమాజ సమావేశమున నేను "సోమరితనము"ను గుఱించి ధర్మప్రసంగము చేయుచు, ఇట్టి సోమరుల నీచకృత్యములను గర్హించితిని. ఓఢ్రసమాజములలోఁగూడ మాటాడుటకు నా కాహ్వానము వచ్చెడిది. సాంఘిక సమస్యలనుగూర్చి సంభాషించుట నా కెంతో ముచ్చట. ఆపట్టణ మండలి బహిరంగ సభలు సామాన్యముగ మాకళాశాలా భవనముననే జరుగుచుండెడివి. ప్రసంగింపు మనియో, అగ్రాసనమలంకరింపు మనియో

౧౯౦౨. ఎడమనుండి కుడివైపునకు: ౧ పంక్తి. రాయసం వెంకటశివుడు, వెంకటరామయ్య, కృష్ణమూర్తి, కాళ్లకూరి నారాయణమూర్తి. ౨ పంక్తి. కామేశ్వరమ్మ, రత్నమ్మ, రత్నమ్మ నరసింహములు, మహాలక్ష్మి, కనకమ్మ నరసమ్మయును. 3 పంక్తి. సీతమ్మ, ఆమె తల్లి కామమ్మ.

పలుమాఱునాకుఁ బిలుపు వచ్చుచుండెడిది. కావున నిచటికి వచ్చినది మొదలు వ్రాయుటయందేకాక మాటాడుటకును నాకుఁ బ్రోత్సాహము కలుగుచుండెను. ఓఢ్రదేశము వచ్చినను వారి భాష నేర్చుకొన నాకభిలాష యేమియు లేదు. ఇచటి జనులకందఱికిని తెలుఁగు బాగుగ వచ్చుటయే దీనికొక కారణము. ఎన్ని దేశములు గ్రుమ్మరినను, ఆంధ్రవ్యక్తి సామాన్యముగ కుమ్మరపురుగువలె నన్యభాషాపంకిలమేమియు నంటించుకొనకయే తిరుగుచుండును.

ఈపురమందలి బాలికా పాఠశాలలను బరీక్షించుట కిచటికి విచ్చేసిన ఒకన్యతో నేను బరిచయము కలుగఁజేసికొంటిని. ఆమె మంచి విద్యావతి. నాయందును, 'జనానా పత్రిక' యందును ఆమెకు సుహృద్భావ మేర్పడెను.

సెప్టెంబరు నెలలో నే నొకసారి గోదావరిజిల్లా వెళ్లితిని. గోటేటి రామభద్రరాజు గారికి మేము మరల పత్రము వ్రాసి యిచ్చితిమి. కుటుంబమును స్థానము తప్పించినఁగాని మాస్థితిగతులు చక్కఁబడవని మేము నమ్మితిమి. కావున త్వరలో రాజమంద్రి నివేశన మమ్మివేసి, క్రొత్తగ మునసబుకోర్టు పెట్టిన భీమవరమునకు మాతమ్ముఁడు వెంకటరామయ్య వెళ్లునట్లును, తనచదువు తేలువఱకును కృష్ణయ్య యొక్కఁడే రాజమంద్రిలో నివసించునట్లును, మే మేర్పఱుచుకొంటిమి. మాతల్లి నాతో ౬-వ సెప్టెంబరున పర్లాకిమిడి చూచి పోవుటకు బయలుదేఱెను.

మఱునాఁడు మేము పర్లాకిమిడి చేరితిమి. తెక్కలి వాస్తవ్యులగు కల్యాపాండాగారను వైద్యశిఖామణి మాముగ్గురకు మందిచ్చుటకు సమ్మతించిరి. నాకు జీతము సంవత్సరమున కైదురూపాయిల

వృద్ధిమీఁద ౧౨౦ రూపాయిలవఱకు నేర్పాటయ్యెనని విని సంతోషించితిమి. ఎన్ని సంవత్సరములకైన నూఱురూపాయిలుకాని బెజవాడ పాఠశాలలోని పనికంటె నిచటి యుద్యోగమే మేలని మే మానంద మందితిమి.

## 3. పరిస్థితులలోని మార్పు

౨౦-వ సెప్టెంబరున మాతమ్మునియొద్దనుండి వచ్చిన యుత్తరములో, అత్తవారియింట మాచిన్న చెల్లెలు కామేశ్వరమ్మ జబ్బుపడెనని యుండెను. మఱునాఁటిజాబు రోగి మఱపు చెఱపు మాటలాడుచుండెనని తెలిపెను. ౨౪-వ తేదీని వచ్చిన లేఖనుబట్టి, చెల్లెలింకను వ్యాధిపీడితయని తెలిసెను. తాను వెడలిపోయెదనని మాతల్లి యంతట పట్టుపట్టెను. ఒకవిద్యార్థి నామెకుఁదోడిచ్చి, మఱునాఁటిరెయిలుమీఁద మాతల్లిని అట్లపాడు పంపివేసితిని. తొందరపనులచే నేను వెళ్ల లేకపోయినను, నామనస్సు మాచెల్లెలిమీఁదనే యుండెను. కొలఁది నెలల క్రిందటనే మేము మా ముద్దులతమ్ముని఩ గోలుపోయితిమిగదా! ఇంతలో నింకొక యుపద్రవము మమ్ము తఱుముకొనివచ్చుటకు నేను భీతిల్లితిని.

కొద్దిరోజులలోనే మాచెల్లెలికి వ్యాధి ప్రబలెనని తెలియుటచేత నేను గోదావరిజిల్లాకు బయలుదేరిపోయితిని. నేను వెళ్లి చూచునప్పటికి రోగి చాల బలహీనస్థితిలో నుండెను. మాతల్లి, తమ్ములు, కొందఱు బంధువులును, అట్లపాడు వచ్చియుండిరి. ఒకమంగలి వైద్యము చేయుచుండెను. ఎన్ని దినములకును జ్వరము తగ్గదయ్యెను. లంకణములు కట్టుటవలన రోగి మిగుల బలహీనయయ్యెను. మేమంత నొక యాలోచన చేసితిమి. మా తమ్ములకుఁ బరిచయముగల పట్నాయకు

అనునొక యోగ్యుడైన వైద్యుడు రాజమండ్రిలో గలడు. అతఁడు మంచి సాధకుఁడని తెలిసెను. తమ్ముఁడు కృష్ణయ్య యాయన నిచటికిఁ గొని వచ్చెను. ఆయన మంచి నాడీనిదాన మెఱిఁగిన వైద్యుఁడు. జ్వరము దిగపోకుండినను రోగి కాహారమిచ్చుచుండవలెనని యాయన చెప్పి, గోధుమగంజి పోయించెను; మందు మార్చివైచెను. కొన్నిరోజులకు జ్వరము నిమ్మళించెను. అంత నచటినుండి మాచెల్లెలిని మేము రాజమండ్రి తీసికొనివచ్చితిమి. ఆవైద్యుని యౌషధములవలన నామెకు దేహమున నారోగ్యముగలిగి క్రమముగ బలముపట్టెను.

కొద్దినెలలక్రిందట మా రాజమండ్రినివేశన మొకటి యమ్మివైచితిమి. ఇపుడు రెండవదియు నమ్మఁజూపితిమి. నేనంత కాకినాడమీఁదుగ పర్లాకిమిడి వెడలితిని. మాయత్తగారు తమకూఁతును జూచివచ్చుటకై నాతో బయలుదేఱిరి. వైద్యుని సలహానను సరించి, యౌషధసేవకై నాభార్యను ౧౦-వ నవంబరున తల్లితో మెక్కాలి పంపివేసితిని. నేను కళాశాలా భోజనవసతిగృహమున మరలఁ బ్రవేశించితిని. ఆరోజులలో మావిద్యాలయమును తనిఖీచేయవచ్చిన విలియమ్సుపిళ్లగారు నాతరగతులు పరీక్షించి, నాపని మిగుల బాగుగ నుండెనని మెచ్చుకొనిరి. బెజవాడకంటె పర్లాకిమిడియు, అందలి పాఠశాలకంటె నిందలి విద్యాలయమును మంచిస్థితిలోనుండెనను వారి యభిప్రాయమున సత్యము లేకపోలేదు. ఈవిద్యాశాలలో విద్యార్థుల సంఖ్యయు, వారి పరిశ్రమాధులును చక్కఁగ నుండెను.

ఆసమయమున "లోపభూయిష్ఠుఁడగు ప్రధానోపాధ్యాయుఁడు" అను నాంగ్లవ్యాసము నొకటి వ్రాసి, నేనది చదివెదననియు, సభకు వారు అధ్యక్షులుగ నుండవలెననియు, పిళ్లగారిని నేను గోరితిని. నా యుపన్యాసము వ్యక్తిదూషణముల కెడమిచ్చునను నపోహలు గలుగు

నని యాయన వారించినందున నేనది పత్రిక కంపివైచితిని. "ప్రధానోపాధ్యాయుఁడు, ఆతని సహాయకులు" అను మకుటముతో నావ్యాసము "సంఘసంస్కారిణీ" పత్రికలో ముద్రితమయ్యెను. దానిలో వ్యక్తిదూషణము లెవ్వియును లేవు. అనేక పాఠశాలలందలి యుపాధ్యాయులలోఁ గక్షలుగలవనియు, సామాన్యముగ ప్రధానోపాధ్యాయుఁడు ఆతని సహాయకులును పరస్పర శత్రువులుగ నుందురనియును, ఇది విద్యాలయమందలి క్రమశిక్షణమునకును జ్ఞానప్రబోధమునకును భంగకరమనియును నాయభిప్రాయము. విద్యాలయములు శాంతినిలయములుగ నుండిననే, అచటివిద్యార్థులకు విద్యావినయము లబ్బును గాన, ప్రధానోపాధ్యాయుఁడు తన సహాయకులను స్నేహభావమునఁ జూడవలెననియు, ఉపాధ్యాయులలో సోదరసామరస్య మున్నఁగాని విద్యాసంస్థ యేదేశమునఁగాని జయప్రదముగ సాగదనియును నేను వ్రాసితిని.

౧౯౧౨ ఫిబ్రవరినుండియే నేను "హిందూసుందరీమణుల చరిత్రము"ల మూఁడవభాగ మారంభించితిని. దీనిలో మొదటికథ 'లీలావతి'. చివరదియగు 'విశాల' ఆ డిశంబరు సంచికలో వ్రాసి, మూఁడవ భాగమును ముగించితిని. పదునొకండు కథలున్న యీభాగము మొదటి రెండింటికంటెను మిగుల చిన్నది. ఇట్లు ౧౯౦౨-వ సంవత్సరాంతమునకు నా తెలుఁగుపుస్తకము లాఱును సిద్ధమయ్యెను. స్త్రీలకుఁ జదువుకొనుట కంతగ పుస్తకములు లేని యాకాలమున నీపుస్తకములు స్త్రీలోకమున కత్యంతోపయుక్తములుగ నుండెడివి.

౧౯౦౨-వ సంవత్సరము డిశెంబరు సెలవులలో నేను రాజమంద్రి వెళ్లి, మాతల్లిని, సోదరులను జూచితిని. మద్రాసునుండి మాబావమఱఁది వెంకటరత్న మప్పుడేవచ్చెను. రాజమంద్రిలోని మా రెం

డవ నివేశనముకూడ నమ్మివేయుటకు మే మేర్పఱుచుకొంటిమి. మా తమ్ముఁడు రాజమంద్రినుండి సకుటుంబముగ భీమవరము వెళ్లుటకు సంసిద్ధమయ్యెను. ప్రథమశాస్త్రపరీక్షలో గెలుపొందినను లేకున్నను కృష్ణయ్య యుద్యోగమునఁ బ్రవేశింపవలసినదెయని నేను జెప్పివేసితిని. ౧౯౦౩ జనవరి ౫-వ తేదీని పర్లాకిమిడికి బయలుదేఱితిని.

ఢిల్లీ దర్బారు సందర్శించి వచ్చిన పర్లాకిమిడి రాజావారికి సుస్వాగత మొసంగుటకు ౭-వ జనవరిని ఉపాధ్యాయుల మందఱము రెయిలునొద్దకుఁ బోయితిమి. ౧౦-వ జనవరిని కళాశాలాంధ్రోపధ్యాయులగు మత్స వెంకటకవిగారు కీర్తిశేషులైరి.

అంత మా వాండ్రు టెక్కలినుండి పర్లాకిమిడి వచ్చివేసిరి. పాండ్యాగారి మందువలన నాభార్య కేమియు లాభము గలుగలేదు.

మాకళాశాలలో ప్రథమశాస్త్ర పరీక్షకుఁ బోయిన ౧౯ లోను ౧౧ విద్యార్థులును, ప్రవేశపరీక్షలో ౨౧-కి ౧౨ విద్యార్థులును జయమందినట్లు తెలిసి మిగుల సంతోషించితిమి. మాతమ్ముఁడు రాజమంద్రిలోని రెండవస్థలమమ్మివేసి కొంతయప్పు తీర్చివేసెనని తెలియవచ్చెను. ఇంకను గొంతయప్పు మిగిలియేయుండెను. ఇది యెట్లు తీఱునాయని యాలోచించితిమి. ప్రథమ శాస్త్రపరీక్షయందు కృష్ణయ్య జయమందుట సంతోషకరమగు వార్త. బి. ఏ. పరీక్షకు తాను జదివెదనని యాతఁడు వ్రాసెనుగాని, ఇంకఁ జదువు విరమించి, యుద్యోగ ప్రయత్నము చేయుమని నేను జెప్పితిని. బోధకవృత్తిలోఁ బ్రవేశించుటకై యాతఁడంత రాజమంద్రిలోని బోధనాభ్యసనకళాశాలలోఁ జేరెను.

౨౯-వ జనవరిని రాజాగారి చెల్లెలగు జలాంత్రరాణిగారు చనిపోయిరని తెలిసి విషాదమందితిమి. మఱునాఁడు ఉపాధ్యాయుల

మందఱమును కోటలోనికిఁబోయి, రాజాగారిని వారిసోదరుని బరామర్శించితిమి. మేము క్రిందనిలుచుండి, పాన్పుమీఁద నాసీనులగు రాజులను సందర్శించితిమి. వారు మౌనము వహించియుండిరి. వారికి సంభవించిన విపత్తును గుఱించి మాలోనొకరు ప్రస్తావింపఁగా, ఇంకొకరు ప్రత్యుత్తర మిచ్చుచువచ్చిరి. మాలోమాకే యీ సంభాషణ జరిగిన పిమ్మట, మేము సెలవు గైకొంటిమి. ఓఢ్ర ప్రభువుల మరియాద లివియని నాకుఁ దెలిసెను. పిమ్మటఁ గొంతకాలమునకు యువరాజుగారు చనిపోయినప్పుడు, మే మిట్లే ప్రభుపరామర్శ చేసి వచ్చితిమి. ఎవరుగాని యనుశ్రుతమగు నాచారము నతిక్రమింపఁ జాలరు!

నేను విద్యగఱపిన తరగతులు బహిరంగపరీక్షలలోను కళాశాలపరీక్షలలోను బాగుగ జయమందుటచేత, అచటి యేర్పాటు ననుసరించి, నాజీత మైదురూపాయిలు హెచ్చుచేయఁబడెను.

మాతమ్ముఁడు వెంకటరామయ్య కొలఁదికాలములోనే రాజమండ్రినుండి వెడలిపోవఁదలంచినందున, ౧౯౦౨ సెప్టెంబరునుండియు జనానా పత్రికకు నేనొక్కఁడనే సంపాదకుఁడగనుంటిని. నాకోరిక మీఁద పర్లాకిమిడి విద్యాలయమందలి బోధకులు కొందఱు నాపత్రికకు వ్యాసములు తఱచుగ వ్రాయుచుండువారు. వారిలో ముఖ్యులు ఇవటూరి కనకాచలముగారు.

## ౮. సుఖదినములు

౧౯౦౩-వ సంవత్సరారంభమున మా తమ్ముఁడు వెంకటరామయ్య సకుటుంబముగ రాజమండ్రినుండి భీమవరము వెడలిపోయెను. అచట కొలఁదికాలము క్రిందటనే క్రొత్తగ మునసబు

కోర్టు పెట్టిరి. అతనిచేతఁ బనియుఁ బణమునంతఁ బుష్కలముగఁ గానఁ బడెను. ఆ వేసవికాలమున నేను మాతమ్ముఁడును తణుకు తాలూకా వెళ్లి, మా కక్కడ మిగిలియుండిన భూములను రేలంగియిల్లును అమ్మివైచి, గోపేటిరాజుగారి యప్పు తీర్చివేసితిమి. ఆ స్తియంతయు విక్రయించివేసినను మూఁడువేలరూపాయిల యప్పు మాకు మిగిలియుండెను.

ఆ వేసవిని నా కింకొక చిన్న యుద్యోగము లభించెను. పర్లాకిమిడి కళాశాలలో విద్య నేర్చుకొనుటకై, విశాఖపట్టణమండలమందలి పార్వతీపురమునుండి బెల్గాము మైనరు జమీందారు లిరువురును తమ తల్లిగారితోఁగూడి పర్లాకిమిడి వచ్చిరి. ఆ జమీందారులకు సంరక్షకునిగను, ఉపాధ్యాయునిగను నెల కిరువది రూపాయిల జీతముమీఁద దొరతనమువారు నన్ను నియమించిరి. నా క్రొత్తపని మొదట కష్టముగఁ గానిపించినను, రాజకుమారులు బుద్ధిమంతు లగుటచేతను, వారి జనని యగు రాణి సోదరునివలె నన్ను భావించి మన్నించుటచేతను, నా కేమియు నొత్తిడి కలుఁగలేదు. సత్పురుషులగు నీ రాజకుమారుల సావాసము నాకు శ్రేయోదాయక మయ్యెను. వా రిపుడు పెద్దవారలు సుగుణోపేతులునై, సంస్థానమును గడు సమగ్రతతో సొంతముగఁ బరిపాలించుచు, ప్రతిభావంతు లగుట నా కెంతయు ముదావహముగ నున్నది.

నేను మాతమ్ముఁడును పట్టుపట్టి, యేఁడాది తిరుగకుండగనే ఋణశేషమును దీర్చివైచితిమి. నెలకు సుమా రిన్నూఱురూపాయిలాతఁడును, నూఱు నేనును మా రాఁబడిలో మిగిల్చి, అప్పునంతయు నిచ్చి వేసి, కృతకృత్యుల మయితిమి.

అప్పు తీఱిపోయిననాఁటనుండియు మాకు శిరమునుండి గొప్ప భారము తొలఁగిపోయినటు లయ్యెను. అంతకుఁ బూర్వము కష్ట భూయిష్ఠముగఁ దోఁచిన లోకయాత్ర మరల సుఖప్రదమును, ధర్మ నిర్వహణమున కనుకూలమును నయ్యెను. ఇపుడు మా కుటుంబమునకు బాధాకరములగు ఋణము లేకాక, విశేషవ్యయముకూడ లేకుండెను. ౧౯౦౩-వ సంవత్సరాంతమున కృష్ణమూర్తి బోధనాభ్యసన కళాశాల విడిచి, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు భీమవరమున నూతనముగ స్థాపించిన విద్యాలయమున బోధకుఁ డయ్యెను. ఇట్లు మాసోదరుల మెవరి కుటుంబపోషణమువారు జరుపుకొనుటకు వలయు సమర్థత గాంచి, కాలక్రమమున ధనమును, భూవసతిని సంపాదించు కొనఁగలిగితిమి.

నేను పర్లాకిమిడిలోఁ గడపినదినములు నా జీవితమందెల్ల సుఖతమకాల మని చెప్పవచ్చును. ప్రాఁతబాధలు మఱచిపోయి, క్రొత్త ప్రదేశమున మంచి యుద్యోగమందిన నాకు, మనస్సున నూతనాశయము లిగురొత్తుచుండెను. అపుడు నావయస్సు ౩౨-౩౪-వ సంవత్సరముల మధ్యకాలము. కనుల కింపగు ప్రకృతిదృశ్యములు తండోపతండములుగ నా పురపరిసరముల నుండెను. కాలు సాగునట్టుగ నే నెంత దూరమైనను వాహ్యాళి కేగవచ్చును. రమ్యములగు పొదలు చెట్లును, మధుర రుతములు చేయు వివిధజాతుల పక్షులును, అనుదినమును నా కగఁబడెడి సామాన్యదృశ్యములే. చుట్టు నుండువారందఱు నావలెనే యాంధ్రులుగాక, భిన్నవేషభాషాచారములతో నొప్పెడి యోఢ్రజనులు. వీరుకాక, పర్వతప్రాంతములనుండి కూరగాయలు కట్టెపుల్లలును గొనివచ్చి చౌకగ నమ్మెడి సవరనాంధ్ర యమాయిక ప్రవర్తన మాశ్చర్యము గొలుపుచుండెను. ఇటు లనేక కారణముల వలన నా కీప్రదేశమందలి నివాస మత్యంతహర్ష దాయక మయ్యెను.

## ౪. సుఖదినములు

కాని, తాత్కాలికానంద మొకటియే నిరతము మన జీవితమును నడుపుచుండెడి శక్తివిశేషము కాదు. నాకిపుడు బాగుగ జరిగిపోవుచుండుట వాస్తవమె కాని, ముందెపుడును నే నీ మాఱుమూలదూర ప్రదేశమందలి చిన్న కళాశాల నంటిపట్టుకొని యుండవలసినదేనా? నా సోదరులు బంధువులు నుండు గోదావరి మండల మిచటికి వందల కొలఁది మైళ్లదూరమున నున్నది. సంవత్సరమునకు రెండు మూఁడు మాఱులు నేను స్వస్థలమునకుఁ బోయి వచ్చుచున్నచో, "లంక మేఁత, రేవుటియీఁత" యనునట్లు నాసొమ్ము రెయిళ్లపాలు కావలసినదే! ఇటీవల రెండు మూఁడుసారులు నే నిచట మన్యపుజ్వరమువలన బాధపడితిని. ఎల్లప్పుడు న న్నీప్రదేశ మాకర్షించు నమటకు, ఇది నాజన్మస్థల మైనఁగాదు! ఇదిగాక, నాకు లభించినతోడనె మటుమాయమైన దొరతనమువారి కొలువునుగూర్చి యింకను నామనస్సు మెర మెరలాడుచుండెను. దానికొఱకు మరల మరల నే నిటీవల ప్రయత్నించినను, నా కృషి సఫలము కాలేదు. ఇటు లుండఁగా, ఒక విజయనగరపు మిత్రుఁడు, అచటి మహారాజావారి కళాశాలలో నాంగ్లోపన్యాసక పదవి ఖాళీ యయ్యె నని యొకనాఁడు నాకుఁ జెప్పెను. విజయనగరము స్వదేశము గాకున్నను, పర్లాకిమిడికంటె దానికిఁ జేరువతావెగదా. నేనంత నొక దరఖాస్తునంపి, సిఫారసు చేయుఁడని పరీక్షాధికారికి వ్రాసితిని. ఎవరి మొగమెఱుకయు లేని విజయనగరమున నాకే లాభమును గలుగు నని నే నాశింపలేదు.

జూలయినెలలో నొకనాఁటి రాత్రి నాకొక తంతి వచ్చెను. అది విజయనగరము కళాశాలాధ్యక్షునియొద్దనుండియే. నాకుఁ దమ కళాశాలలో ప్రథమ సహాయోపన్యాసకపదవిని ౧౧౦ రూపాయిల జీతముమీఁద నిచ్చితిమని యందుండెను. పర్లాకిమిడి కళాశాల

రెండవతరగతి కళాశాలయె. విజయనగరమునందలిది మొదటితరగతి కళాశాల. అచటి కళాశాలతరగతులందే నేను బోధింపవలయును. ఇది నాకెంతయు సంతోషదాయకము గు కార్యము. కాని, విజయనగరమున జీతముమాత్రము తక్కువగ నుండెను. కావున హెచ్చుజీతమిచ్చిన నే నాయుద్యోగముఁ జేకొందునని విజయనగరమునకు తంతి నిచ్చితిని. ఆయుద్యోగమునకుండు నత్యధికమగు జీతము ౧౨౦ రూపాయిలు నిపుడే యిచ్చితి మని నాకు మాఱుతంతి వచ్చెను. కావున నే నాయుద్యోగమును స్వీకరించితిని.

ఆగష్టునెల మధ్యనే నేను పర్లాకిమిడి విడిచి, విజయనగరము పోవలయును. నా ప్రయాణవార్త పర్లాకిమిడి విద్యార్థుల కమితవిషాదము గలిగించెను. ఇటీవలనే నే నిచ్చటివిద్యార్థులలో " సంఘపారిశుద్ధ్య సమాజము " నొకటి నెలకొల్పితిని. పొగాకు, మద్యపానము మున్నగు నుద్రేకజనకపదార్థములు దరికిఁ జేరనీయక, మనోవాక్కాయ కర్మలయందు పవిత్రత దాల్చియుండవలె నను నియమమును ప్రతిసభ్యుఁడును పూనవలెను. ఈ ప్రదేశమున సామాన్యముగ పెద్దలు పిన్నలును పొగాకు " కిల్లీలు " సదా నమలుచుందురు. అట్టి యభ్యాసము నరికట్టుట దుర్ఘటము. ఐనను, నా ప్రోత్సాహమున త్వరితకాలముననే విద్యార్థు లనేకు లీ సమాజమునఁ జేరిరి. ఉపాధ్యాయులును గొందఱు పొగాకు విసర్జించివేసిరి. దినమున కొక చుట్టమాత్రమే తా మిపుడుపయోగించుచుంటిమని గిడుగు రామమూర్తిపంతులుగారు నాకుఁ జెప్పిరి. ఎపుడును దౌడను కిల్లీ నుంచుకొనెడి యలవాటుగల కళాశాలాధ్యక్షులు శ్రీనివాసరావుగారు, కిల్లీ యిపుడు పూర్తిగ విసర్జించి, దంతములతీపు శమించుటకై కిల్లీకి మాఱుగ సొంటికొమ్మును బుగ్గను బెట్టుకొనిరి.

## ౫. "జనానా పత్రిక"

ఇట్టి ప్రదేశమును ప్రచారమును విడనాడుట నాకు మిగుల కష్టముగ నుండెను. తెలుఁగువారితో పోటీపడి యోఢ్రవిద్యార్థులు నాకు గౌరవపూర్వకముగ వీడ్కోలొసంగిరి. విద్యార్థులు మూఁడు నాలుగు విజ్ఞాపనపత్రములును, ఒక బంగారు పతకమును సమర్పించిరి. నన్ను గుఱించి వారు నాలుగుభాషలలోను సిద్ధపఱచి చదివిన పద్యములకు నాకన్నులు చెమ్మగిల్లెను. అత్తయింటికిఁ బోవు క్రొత్తకోడలివలె కన్నీటిధారతో పర్లాకిమిడి మిత్రమండలిని వీడి, నేను విజయనగరము వెడలి పోయితిని.

పర్లాకిమిడి మిత్రులు నాబోధనాకౌశలమును, శీలప్రవర్తనములను మెచ్చుకొని, నా కాసమయమునఁ జేసిన గొప్ప సత్కార మెన్నటికిని మఱచిపోఁజాలను. వీడ్కోలు సమయమున నామిత్రులును కళాశాలా పండితులు నగు శ్రీ బంకుపల్లి మల్లయ్యశాస్త్రులుగారు చదివిన పత్రములోని యీక్రింది పద్యము, నా శీలవర్ణన విషయమున నతిశయోక్తియయ్యును, నాయాదర్శములను బట్టి స్వభావోక్తియు, రుచిరాలంకారభూయిష్ఠమునై నా లేఁత హృదయమున కమితామోదము గలిగించెను—

"చ. కటువగు మాట లెప్పుడు ముఖంబున వెల్వడ వెంచిచూడఁ, ద
క్కొటి వ్యసనమ్ములందగులు గానము విద్యలయందె గాక, వేం
కటశివుఁ జూచి నేర్చుకొనగాఁ దగు కాలము వమ్ము సేయకుం
డుట, దయకోపముం దన కనుంగవనే తగ నిల్పెడున్ దఱిన్!"

## ౫. "జనానాపత్రిక"

నాకు విజయనగరమందలి యుద్యోగమగుట నామిత్రులకు, సోదరులకును నాశ్చర్య ప్రమోదములు గలిగించెను. దీనిని గుఱించి

నా ప్రయత్నముల సంగతి వారికేమియుఁ దెలియకుండఁగనె, ఈ యుద్యోగమై నేను విజయనగరము వెళ్లుచున్నానని వారు వినిరి. ౧౪-౮-౧౯౦౪ తేదీని మాతమ్ముఁడు కృష్ణమూర్తి నాకు వ్రాసిన లేఖలో, "నీకు విజయనగరమున నుద్యోగమయినదని వినుటకు నేనమి తానంద మందితిని. ఇంతత్వరలో నీకిట్టి భాగ్యము గలుగునని యెవరము నమకొనలేదు. ఇపుడు నీకు దొరతనమువారి కొలువు సులభముగ లభించును. క్షేమముగ నీ వీపాటికి విజయనగరము ప్రవేశమైతివని యెంచెదను. * * *" అని యుండెను. ఆనెల ౧౦-వ తేదీని వెంకటరామయ్య యిట్లు వ్రాసెను:—"నీ ౮-వ తేదీ యుత్తరము మమ్మం దఱి నాశ్చర్యమగ్నులఁ జేసినది. మహారాజావారి కళాశాలలో నీ కీయుద్యోగము లభించినందుకు మేమందఱము సంతసమందుచున్నాము. ఈమార్పు రెండువిధముల మంచిది. నీవు నూఱు మైళ్లుదగ్గఱ పడితివి. నీ కున్నతపదవి లభ్యమయ్యెను. లాభముతోపాటు నీ బాధ్యతయు పెరుఁగుచున్నది. బి. యె తరగతులకు తర్కము, యఫ్. యేకు ఆంగ్లము నుఁ జెప్పుట సులభము కాదు. * *" నా ప్రియ గురువులగు స్కాటు దొరగారు, "నీకు విజయనగరమున నుద్యోగమైనందుకు నాకెంతో సంతోషము. ఉన్నత పాఠశాలలోను, రెండవతరగతి కళాశాలలోను గల నానారీతులగు పనికంటె మొదటి తరగతి కళాశాలలో పనియె సంతోషకరము. నీపనిలో చాలభాగము బి. యే తరగతులతోనే యున్న దనుకొందును. నీయుపన్యాసములు సిద్ధము చేసికొనుట మొదట కొంచెము ప్రయాసకరమైనను, దారిని పడినపిమ్మట నీ కంతయు సులువగును. విజయనగరము కళాశాల స్థిరసంస్థయె. నీపని తృప్తికరమైనచో, కాలక్రమమున నీవా కళాశాలాధ్యక్షుకపదవి నందఁ గలవు, కావున నీకు దొరతనమువారికొలువు సమకూరకున్నను,

నీభవిష్యత్తున కేమియు వ్యాఘాతము రానేరదు. * * *" అని వ్రాసిరి.

'జనానాపత్రిక' ప్రచురణవిషయమై కూడ నాకు వెనుకటి కంటె నెక్కువ సదుపాయము గలిగెను. నేను విజయనగరము వచ్చిన మఱుసటి నెలనుండియె వీరేశలింగముగారు జనానాపత్రికాధిపతులలో నొకరైరి. ఆయన యిటీవలనే ప్రభుత్వమువారి కొలువునుండి విశ్రాంతి గైకొనిరి. నాతోఁగలసి స్త్రీవిద్యాభివృద్ధికొఱకై యేర్పడిన జనానా పత్రికకు సంపాదకునిగ నుందునని యాయన చెప్పినందున, నేనెంతో సంతోషమున దానికి సమ్మతించితిని. కావున ౧౯౦౮ సంవత్సరము సెప్టెంబరునుండియు 'జనానాపత్రిక' కిరువురము సంపాదకుల ముగనుంటిమి. ఆయన యాలోచన ననుసరించి, పత్రిక చందా రెండు రూపాయిలనుండి రూపాయికి తగ్గించితిని. ఇపు డాయన "భౌతిక భూగోళశాస్త్ర సంగ్రహము", "విదేశనారీమణుల చరిత్రము" లను 'జనానాపత్రిక' లోఁ బ్రచురింప మొదలిడిరి. పత్రికయెంతో శోభా యుక్తమయ్యెను. కాని, వీరేశలింగముగారి కలము ప్రహసనముల మీఁదికిఁ బరుగులెత్తుచుండెడిది! మాయిరువురి సంపాదకత్వమునను పత్రిక వెలువడ నారంభిమైన రెండవనెలలోనే, "సావిత్రీ సత్యవతీ సంభాషణము" అను స్త్రీవిద్యను గుఱించిన ప్రహసన మొకటి వారు వ్రాసిరి. దానిలో స్త్రీవిద్యావ్యాపనమును గుఱించి యిటీవల బయలు వెడలిన "సావిత్రీ" "హిందూసుందరుల" లోని వ్రాఁతలను గుఱించి యాక్షేపణము లుండెను. స్త్రీలపేరు పెట్టుకొని పురుషులు పత్రిక లలో వ్రాయుట యసమంజస మనియే వాని భావము. ఈవిషయమై రెండుమూఁడు సారులు నేనును నాపత్రికలో మొఱపెట్టితిని. కాని, యీమాటు ప్రహసనరూపమున బయలుదేఱిన పంతులుగారి తీవ్ర

ఖండనమునకుఁ గోపించి, యాపత్రికలలోని రచయితలు ప్రత్యుత్తరము లీయఁజొచ్చిరి. తోడి పత్రికలతో వివాదలు పెట్టుకొనుట నాపద్ధతి కాదు. సామమార్గముననే నాకార్యములు చక్కపెట్టుకొనుచువచ్చితిని. కాని, కోపస్వభావులగు పంతులుగారు నాతోఁగూడి వచ్చుటయే దుర్ఘటమైన యీ పత్రికాసమష్టిసంపాదకత్వప్రథమదశలోనే వారి కడ్డంకులు కలిగింప నేను వెఱచి, ఉదంతమునెట్లు పరిణమించునోయని తటస్థముగఁ జూచుచుంటిని.

మేము ౧౯౦౫-వ సం. వేసవిసెలవులు గడుపుటకు చల్లని సముద్రతీరపట్టణమగు భీమునిపట్టణముకు వెళ్లితిమి. అక్కడకు నాతమ్ముఁడు కృష్ణమూర్తి మాతల్లిని, వెంకటరామయ్యభార్యను, చెల్లెలు కనకమ్మను, తనభార్యను గొనివచ్చెను. మాకుటుంబములో నిపుడు పిల్లలు బయలుదేఱుచుండిరి. వెంకటరామయ్యకుమాళ్లిఱువురును, కనకమ్మపుత్రిక లిద్దఱును, కృష్ణమూర్తికొమార్తెయు నిపుడు మాతో నుండిరి. భీమునిపట్టణము మిగుల రమ్యమగు చిన్నపురము. రెండు ప్రక్కలను పట్టణమునంటి సముద్రము కలదు. సాయంకాలమునందు మే మందఱమును గలసి సముద్రతీరమున షికారుపోవుచుండువారము. మావలెనే యీచల్లనిప్రదేశమున దినములు గడుపుట కచటికేతెంచిన విజయనగరముకళాశాలాధ్యక్షులగు రామానుజాచార్యులుగారు తమ రెండవకొమార్తెతో నడచివచ్చుచు నిత్యమును మా కెదురుపడుచుండువారు. కొందఱిమిత్రులప్రోత్సాహమున భీమునిపట్టణములో జరిగిన బహిరంగసభలో స్త్రీవిద్యావ్యాపనమును గుఱించి నేనొక యుపన్యాసము చేసితిని. రామానుజాచార్యులుగారు అధ్యక్షులుగనుండి నాయభిప్రాయములను సమర్థించిరి.

## ౫. "జనానా పత్రిక"

ఆ సంవత్సరము డిసెంబరులో నేను రాజమండ్రి పోయి, అచట నిపుడు నివాస మేర్పఱచుకొనిన వీరేశలింగముపంతులుగారిని సందర్శించి, వారక్కడ నూతనముగ స్థాపించి జరుపుచుండు 'స్త్రీవిద్యాలయము'ను 'జనానాతరగతుల'ను జూచి సంతోషించి, వీనినిగుఱించి "నానాపత్రికలో వ్రాసితిని. ఆనెల ౧౫-వ తేదీని, విదుషీమణియు, అజబలాసచ్చరిత్రరత్నమాలా" గ్రంథకర్త్రియు, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి యక్కగారునునగు శ్రీమతి భండారు అచ్చమాంబ గారు లోకాంతరగతులైరి. ఆనెల జనానాపత్రికలో నామెనుగుఱించి యించుక ప్రస్తావించి, మఱుసటినెలలో సచిత్రవ్యాసమొకటి పంతులు గారు వ్రాసిరి.

వీరేశలింగముపంతులుగారి రచనా సామర్థ్యము లోకవిదితము. ఇట్టిప్రతిభావంతు లయ్యును, ఒక్కొక్కపుడు వారు చిన్నచిన్న సంగతులయందే పరులతో వాదమునకుఁ గాలు ద్రవ్వుచుండువారు. ౧౯౦౫ సం. ఏప్రిలు—మేయి "జనానాపత్రిక" సంచికలో, "జనానాపత్రిక—సావిత్రి" అనుశీర్షికతో మరల వెనుకటి విషయమును ప్రస్తావించి, వారిట్లు వ్రాసిరి:—"గత సంవత్సరము అక్టోబరు జనానాపత్రికలో ప్రకటింపఁబడిన 'సావిత్రీ సత్యవతీ సంభాషణము' పైని నవంబరు డిసెంబరు నెలల సావిత్రీ పత్రికలోఁ గొన్ని యపాత్రపు వ్రాఁతలు వ్రాయఁబడినవి. అవివేకుల దూషణములకు బదులు వ్రాయుట యుచితము కాదని భావించి, మే మావ్రాఁతల నుపేక్షించి యూరకుంటిమి. దురభిమానులైన మాప్రతిపక్షు లది మాయసమర్థతగా భావించి, యీనెల 'యార్యమతబోధిని' లో, 'మన్యము వెంకట సుబ్బమ్మగారిచ్చిన పత్రికకును, వేసిన పందెమునకును మాఱుపలుకఁ జాలక పంతులవారును తదనుచరులును, గతించినదానికి చింతిల్లుచు

నూఱకుండి'రని జయఘోషమిడుచున్నారు. ఆజయమును నీకే కైకొన నిండు. * * * " ఈవిధముగ పంతులుగారు మరల కత్తినూసి, ప్రతి పక్షులతోడి యుద్ధమునకు సన్నద్ధులైరి. శాంతముగఁ బనులు చక్క పెట్టుకొనుచు, పత్రికాపుత్రిక నెటులో పండ్రెండేండ్లవఱకును బెంచిన నేను, పంతులవారి శౌర్యోద్ధతివలన పత్రిక కేమిహాని వాటిల్లునో యని లోన భీతిల్లుచుంటిని.

ఈకారణమునఁ గాకపోయినను, వేఱొక కారణముచే 'జనానా పత్రికా' ప్రచురణమున కిపుడు వ్యాఘాతము సంభవించెను. శరీరాస్వస్థతవలనను, విద్యాలయాదిసంస్థలలో నిమగ్నులై యుండుటచేతను పంతులుగారు 'జనానాపత్రిక'ను ౧౯౦౫ సంవత్సరము జూలయి నుండియు తమ'చింతామణీముద్రాలయము'నఁ బ్రచురింప నుపేక్షించిరి. ఆఱునెలలవఱకును పత్రిక జరుగనేలేదు. ౧౩-వ సంపుటము ౧,౨ సంచికలను ౧౯౦౬-వ జనవరి—ఫిబ్రవరినెలలో, వెనుకటి మద్రాసు ఆల్బీనియనుముద్రాలయమున నేనంత ముద్రింపించితిని. అప్పటినుండి నేనే 'జనానాపత్రిక'ను నడిపితిని.

పత్రికాప్రకటనమునం దింకొకరి సాయము నే నేమాత్ర మపేక్షించినను, పత్రికకు ముప్పు వాటిల్లుచునేయుండెను. ఇపుడు పంతులువారియొద్దనుండి 'చింతామణి' ముద్రాలయమును గొని, రాజమండ్రిని దానిని జరుపుచుండెడి సత్యవోలు గున్నేశ్వరరావు గారితో 'జనానాపత్రిక' విషయమై నాకుఁ గలిగెడి యిక్కట్టులను గుఱించి ౧౯౦౬ అక్టోబరులో నేను బ్రస్తావింపఁగా, తాము సంతోషపూర్వకముగ నే తత్పత్రికకు యజమానులై, స్త్రీవిద్యాభివృద్ధికొఱ కేర్పడిన యీపత్రిక కాంధ్రదేశమున నత్యధిక ప్రచారము గలిగింతుమని చెప్పి, ఆ నవంబరునుండియు 'జనానాపత్రిక'ను

తమరే రాజమండ్రిలోఁ బ్రచురింప మొదలిడిరి. నేనుమాత్రము ఆపత్రికకు యథాప్రకారముగ సంపాదకునిగనుండి, వ్యాసముల నంపుచువచ్చితిని. కాని, నాకుఁ జెప్పకయే, తమ కుండెడి కొన్ని చిక్కులవలన, వారు ౧౯౦౭ జూలయినుండియు ఆపత్రిక ముద్రణమును విడిచిపెట్టిరి. కళాశాలలో పనియెక్కువయై, చికమకలు పడుచుండు నేను వెనువెంటనే పత్రికను వేఱొక ముద్రాలమున కంపనుపేక్షించితిని. అంత, కొలఁదిమాసములకు నేను విజయనగరమునుండి సంసారము తరలించుట వలన, 'జనానాపత్రికా' ప్రచురణ మంతటితో నిలిచిపోయెను. ఇట్లు ౧౨ సంవత్సరములు నాపోషణమునఁ బెరిఁగిన యాపత్రిక, పదునాలుగవయేట నకాలమరణమునకు లోనయ్యెను.

## ౬. విజయనగరనివాసము

మొత్తముమీఁద విజయనగరము కళాశాలలోని పని నాకెంతో హర్షదాయకముగ నుండెను. ఇపుడు నేను బోధింపవలసినవి కళాశాల శాఖలోని తరగతులు మాత్రమే. దినమునకు రెండుమూఁడు గంటలు మాత్రమే నేను పనిచేయవలసివచ్చెను. నాపనితీఱిన పిమ్మట నే నింటికిఁ బోయి హాయిగ విశ్రమింపవచ్చును. కాని, తీఱిక సమయమును నేను వ్యర్థపుచ్చువాఁడనుకాను. బోధింపవలసిన సంగతులు గ్రహించుటకై సదా నేను ఉద్గ్రంథపఠనము చేయువాఁడను. పట్టపరీక్ష తరగతికి బోధించుటకై తర్కశాస్త్రగ్రంథములు సమగ్రముగఁ జదువ నారంభించితిని. ఆంగ్లసాహిత్య బోధనమున కవసరమగు గ్రంథములును నేను పఠియించితిని. నూతనగ్రంథపఠనము నాకు నిత్యకర్మానుష్ఠానమే గాక, విశేష వ్యసనముకూడ నయ్యెను! ఆకళాశాల కంటియుండు పుస్తక భాండాగారము మిగుల గొప్పది. నాబో

ధనకార్యము పూర్తి పఱుచుకొని, నేను పుస్తకాగారమున పీఠమువేసి కూర్చుండువాఁడను. నా కన్నుల కిదివఱకుఁ గానరాని పుస్తకము లందుఁ జెక్కులు గలవు. అందలి విశేషములు గ్రోలుచుండుటయే నాకు ముఖ్యకాలక్షేపము. అచ్చటనుండి నాకుఁ గావలసిన పుస్తకములు గృహమునకుఁ గొనివచ్చి, అవి ముందువేసికొని యింటఁ గూర్చుండువాఁడను. ఈ క్రొత్తప్రదేశమున నా కెక్కువమంది పరిచితులు గా కుండుటయుఁ గూడ నాజ్ఞానాభివృద్ధికి మఱింత సహకారి యయ్యెను.

ఇట్లు, నాకు జ్ఞానసంపాద్యవిషయమునను, బోధనాసౌకర్యము లొనఁగూడుపట్లను ఇదివఱకుఁ జూచిన ప్రదేశము లన్నిటికంటెను విజయనగరమె యుత్తమముగ నుండినను, మఱియొకవిధమున నది యతినికృష్టమయ్యెను. ఇక్కడ దోమలబాధ విశేషము. సాయంకాలము చీఁకటిపడుటయే తడవుగ దోమలు తేనెటీగలవలె జుంజుమ్మని మూఁగుచుండును. పట్టణమునకును రెయిలుస్టేషనుకును మధ్య నుండు పెద్దచెఱువు దోమలకుఁ బుట్టినిల్లు. పురమునందలిమురికి కాలువలు దానికి రచ్చపట్టులు. ఏమాత్ర మలుకుడైనను నిద్రాభంగ మందుట సహజమైన నాకు, విజయనగరమున నొక్కొక్కప్పుడు రాత్రులు జాగారమే ప్రాప్తించుచు వచ్చెను. దోమతెర యీపురుగుల కడ్డముగాదు. తెరలోనుండి యెటులో లోనికిఁ దూఱినయొకటి రెండు దోమలు, తెల్లవాఱువఱకును సంగీతము వినిపించుచునే యుండును. ఇచటి దోమలు, నిద్రాసక్తులగు వారికి రాత్రి నిరతము చెవులలో మేలుకొలుపులు పాడుచు, ముక్కుపుటములలో నాట్యములు సల్పుచు, అఱికాళ్లకు గిలిగింతలు పెట్టుచు నుండును. ఈపీడ నుండి తప్పించుకొన నాకు తెఱువు వెఱవులు గానఁబడకుండెను.

అంతకంతకు నాకు మశకగానము సింహగర్జన మయ్యెను. ఈబాధ వలన నొక్కొకప్పుడు నాకు రాత్రి పగలును, పగలు రాత్రియును నగుచు వచ్చెను.

ఈ దోమల సంపర్కమునసే యీపుర మింతరోత గొలిపెడి రోగముల కావాసమయ్యె నని వైద్యు లనుచువచ్చిరి. కుష్ఠము, బూరకాలు, బృహద్బీజము మున్నగు వ్యాధులచేఁ బీడితులగు ననేకులు నిత్యము నాకనులఁ బడుచుండిరి. ఈ వ్యాధులనుండి తప్పించుకొనుటకు దోమకాటు పడకుండుటయు, మంచినీరు త్రావుటయు ముఖ్యసాధనము లని వైద్యులు చెప్పుచుండిరి. ఆకాలమున విజయనగరమునకు నీటివసతి లేదు. అచట మంచినీటికి చెఱువులే యాధారము. కాని, యాచెఱువునీరు అపరిశుద్ధముగ నుండెడిది. మంచినీళ్ల బావులు మిక్కిలి కొంచెము. అవి పట్టణమున కతిదూరమున నుండెడివి. అందువలన విజయనగరనివాసము మాకు దుస్సహ మయ్యెను.

కళాశాలలో నాకు స్నేహితు లేర్పడిరి. అధ్యక్షులగు రామానుజాచార్యులుగారు నాయెడ సదభిప్రాయు లై యుండిరి. కళాశాలలో నేను ప్రథమసహోపాధ్యాయుఁడ నగుటచేత, కాలనిర్ణయపట్టికలు వేయుపనియు, విద్యార్థుల యాటల యేర్పాటు చేయు పనియు నేను జూడవలసి వచ్చెను. అధ్యక్షులు, నేనును కళాశాల తరగతులకు ఆంగ్లభాషాధ్యాపకులము. కావునఁ దఱచుగ నే నాయనను గలసికొని మాటాడుచుండువాఁడను. ఆయనయు నూతన గ్రంథపఠనమునం దమితాసక్తి గలవారు. పుస్తకాగారమునకుఁ గ్రొత్త పుస్తకములను దెప్పించు విషయమున నేను జేసిన సూచన లాయన యంగీకరించువాఁడు. 'మనశ్శక్తి పరిశోధనాసమాజ' ప్రచురణములందు నేను జదివిన వినోదాంశము లాయనకుఁ జెప్పఁగా, యన

యాశ్చర్యమున విని, ఆ పుస్తకములు తానును జదివి, వానిలోని ఆ ముఖ్యాంశములు కోటలోని రాణి సర్కారువారి కెఱిఁగించుచుండు వాఁడు. సచ్ఛీలతా సుహృదయతల కామహాశయుఁ డీపట్టణమున నాదర్శప్రాయుఁ డగుటచేత, ఆయనతోడ సహవాస సంభాషణములు నాకెపు డానందసంధాయకము లయ్యెను.

నావలెనే సహోపన్యాసకులగు సీమనపల్లి రామయ్యగారికి నాకును వేగమె మనసు గలిసెను. ఆయన సరసుఁడు. హాస్యరసయుక్తములగుమాటలు చెప్పుటయందు మిగుల నేర్పరి. ప్రజలను గుఱించియు, పుస్తకములను గుఱించియు సారస్యములగు వ్యాఖ్యలు చేసి, సావాసులను సౌఖ్యాబ్ధి నోలలాడింపఁ గల సామర్థ్యము గలవాఁడు. కాని, తన కటువాక్యప్రయోగ మితరుల మనస్సులకు నొప్పి గలిగించె నని యాయన బాగుగ గుర్తెఱుఁగకుండెను. వాక్సంబంధమగు నజాగ్రత్త వలననే జనులలోఁ గొందఱితో నాయనకు వైరభావ మేర్పడెను.

కళాశాలలోని ముఖ్యోపన్యాసకు లగు వంగ మాధవరావు నాయఁడు, వి. వెంకటరాయశాస్త్రి, ఏచూరి నరసింహముపంతులు గార్లును నాకు శీఘ్రమె పరిచితులైరి. వీరిలో వెంకటరాయశాస్త్రి గారికిని నాకును సంబంధ మధికము. ఆయన తర్క మనశ్శాస్త్రము లందు ముఖ్యోపన్యాసకులు. తర్కమున నే నాయనకు సహాయకుఁడను. పాఠవిషయములను గుఱించియేగాక, నాకుఁ బ్రియములగు తత్త్వశాస్త్రవిషయములను గుఱించియు పలుమాఱు మేము సంభాషించుచుండువారము. ఆయన సాధుపురుషుఁడు; మితభాషి; వెనుకటి యధ్యక్షులగు చంద్రశేఖరశాస్త్రిగారికి దగ్గఱ బంధువు. కళాశాల లోని యున్నతపాఠశాలకు ప్రధానోపాధ్యాయుఁ డగు పిడపర్తి సూర్యనారాయణశాస్త్రిగారు నేనును కొంతకాలము కొత్తపేటలోఁ

జేరువనే నివసించుచుండువారము. పాఠశాలా విషయములను గురించి మేము మాటాడుకొనువారము.

ఆకాలమున కళాశాలలోని నాలుగు తరగతులు చిన్నవిగ నుండుటచేత మేడమీఁద గదులలోఁ గూడెడివి. విద్యార్థుల క్రీడలను గురించి రామానుజాచార్యులవారు మిగుల శ్రద్ధవహించుచు వచ్చిరి. కళాశాల కంటె విశాలస్థలము లేకుండుటచేత, మైదానమందలి 'అయోధ్యకుఁబోయి, విద్యార్థులు క్రికెటు, కాలిబంతి మున్నగు నాటలాడుకొనుచుండిరి. అందఱి విద్యార్థులచేతను ఆటలాడింప నధ్యక్షులకోరిక. కావున వంతులచొప్పున సహాయోపన్యాసకులు మువ్వురును విద్యార్థుల యాటలు తనిఖీచేయుచుండవలెను. కొంతకాలమునకు విద్యార్థులచే ననుదినమును వినోద పుస్తకపఠనముచేయింప నధ్యక్షులకుఁ గుతూహలము గలిగెను. ఇది నాకును సమ్మతమే. విద్యార్థులను ఉపాధ్యాయుల గదులలోనే కూర్చుండఁబెట్టి, వారలచే నచటనే పుస్తక పఠనము చేయించుట యుక్తమని యధికారికిఁ దోఁచెను. కావున నీపనియు మామీఁదనె పడెను. అందువలన పనియెక్కువయ్యె, అధ్యాపకులు విద్యార్థులును మూలుగసాగిరి. ఉపాధ్యాయుల నిర్బంధ సహవాస సాహాయ్యములు లేకయే, విద్యార్థులను వారిచదువు సాములు స్వేచ్ఛగ సాగించుకొననిచ్చినచో పరిస్థితులు బాగుపడునని యందఱు ననుకొనెడివారు. కాని, చదువు సాములు రెండింటిని విద్యార్థుల యిష్టమునకే వదలివేసినచో, వారవి బొత్తిగ వదలివేయుదురనియో యధ్యక్షులవారి భయము.

## 2. గుంటూరునందలియుద్యోగము

నేను విజయనగరమున మండు కాలమునందే, పర్లాకిమిడి విజయ నగరములలో నాశిష్యులగు శ్రీ బుఱ్ఱా శేషగిరిరావుగారి నాయకత్వమున 'ఆంధ్రవిద్యార్థుల' ప్రథమసమావేశము విజయనగరమున జరిగెను. ఇపుడు కాకినాడకళాశాలాధ్యక్షులగు వెంకటరత్నము నాయఁడుగారు సభ కధ్యక్షులు. ఈ సమావేశసందర్భమున విద్యార్థులలో నధికసంచలనము కలిగెను.

విద్యార్థులలో నధికసంచలనము కలిగిన యింకొకసందర్భమా నగరమునఁ గొలఁదికాలములోనే తటస్థించెను. బంగాళా దేశీయుఁడును, సుప్రసిద్ధవక్తయునగు విపినచంద్రపాలుగారు, ఈమాఱు రాజకీయోపన్యాసము లిచ్చుచు, నాంధ్రదేశసంచారము చేయుచు విజయనగర మేతెంచిరి. అచ్చటి పురపాలకోద్యానవనమునం దాయనగాటగు ప్రసంగములు కొన్ని జరిపిరి. దేశస్వాతంత్ర్యమును గూర్చియు, స్వదేశోద్యమమును గుఱించియు నుపన్యాసము లాయనచేసిరి. ఒకనాఁడు మైకేలుంద్రుఁడు కళాశాలా విద్యార్థులు భావోద్రేకమున బడిమొగవేసి, ప్రసంగమును వినుట కేగిరి. దీనికి వారలను శిక్షించు విషయమున రామానుజాచార్యులుగారు మిగుల జాగ్రత్తగ నుండి రని నే నాయనను కొన్ని దినముల పిమ్మట నభినందించితిని. పిమ్మట పాలుగారు రాజమండ్రి వెళ్లి యచట నుపన్యాసము లీయఁగా, రాజమండ్రి కళాశాలా విద్యార్థులు ఉద్రేకపూరితులై, 'వందేమాతర' చిహ్నములు గల బిళ్లలు టోపీలును ధరించి కళాశాల కేగినందుకై, ఆకళాశాలాధ్యక్షులగు మార్కు హంటరుగారు వారికి విధించిన కఠినశిక్షలవంటి కఠినపద్ధతులకుఁ గడంగక, మా కళాశాలాధ్యక్షులు సమబుద్ధి నూనుట చేతనే అచట నేమియు నుపద్రవములు వాటిల్లకుండెను.

## ౭. గుంటూరునందలి యుద్యోగము

కళాశాలలో పని నాకు బాగుగనుండినను, పట్టణనివాసమె నాకంతకంతకు దుస్సహమయ్యెను. వేసవికాలము సమీపించిన కొలఁది, నీటియెద్దడియు, దోమలబాధయు నధిక మగుచుండెను. ఈబాధ లెపుడు తీఱునా యని నేను వేచియుంటిని. నరసాపురమునను, పిఠాపురమునను పాఠశాలలలో ప్రథమోపాధ్యాయపదవి ఖాళీ పడిన దని తెలిసి, నేను దానికై ప్రయత్నింపవలె నని యెంచితిని. ప్రథమతరగతి కళాశాల విడిచి మరల పాఠశాల కేగుట, స్వర్గలోకసుఖములు విడనాడి, భూలోకనివాసమునకు దిగుటవలె నుండును. కాని, యీమార్ప్రదేశమందలి కష్టములకోర్చి గొప్పపదవి ననుభవించుట కంటె, స్వదేశమున సామాన్యస్థితినుండి సౌఖ్యమందుట మంచిదికదా. పిఠాపురము సంగతి యడుగఁగా, వెంకటరత్నమునాయఁడుగారు తమ కళాశాల కంటియుండు పాఠశాలలో ప్రథమోపాధ్యాయపదవిని గుఱించి మాటాడెదను రమ్మని. నాకు వ్రాసిరి. నే నంత. కాకినాడ పోయితిని. మాబావమఱఁది సకుటుంబముగ నచట నుండెను. మే మచటికి వచ్చుట, నా రందఱికిని సంతోషదాయక మని వారు చెప్పిరి. నాయఁడుగారిని గలసి మాటాడితిని. కాని, యిటీవల కళాశాల తరగతులకె బోధనను చేయుచు వచ్చిన నాకు పాఠశాలలో ప్రథమోపాధ్యాయపదవి నిచ్చుట కాయన కొంత యనుమానించెను. ఇట్టి పరిస్థితులలో స్థానము గదలుట యయుక్తమని నేను దలపోసి యూరకుంటిని.

నా మిత్రులును, గుంటూరుకళాశాలలో నుపన్యాసకులు నగు పసుపులేటి వెంకటకృష్ణయ్యనాయఁడుగా రిటీవల చనిపోయిరి. ఆయుద్యోగ మిపుడు ఖాళీయయ్యె నని విజయనగరము కళాశాలా విద్యార్థియు, నా కిటీవల పరిచితుఁడును నైన గుంటూరు వాస్త

వ్యుఁడు జొన్నవిత్తుల గురునాధముగారు నాతోఁ జెప్పి, విజయనగరమున దోమలబాధ యను నరకము ననుభవించెడివారికి గుంటూరు నివాసము స్వర్గలోక సదృశమని నుడివిరి. నేనంత గుంటూరు కళాశాలాధ్యక్షుఁడగు డాక్టరు ఊలుదొరగారి కొక యర్జీనంపి, సిఫారసు చేయుఁడని నామిత్రులగు శ్రీ అనంతముగారికి బెజవాడ వ్రాసితిని. కొద్ది రోజులలోనే నాకు జవాబు వచ్చెను. నాకు వెంకటకృష్ణయ్య నాయఁడుగారి యుద్యోగ మొసఁగెదమనియు, వారు చెప్పెడిపాఠము లన్నియు నేను జెప్పవలెననియు, జీతము ౧౨౫ రూపాయిలు మాత్రమె యిచ్చెదమనియు వారు వ్రాసిరి. ౧౯౦౭-వ సంవత్సరము శీతకాలపు సెలవులలో నేనును మాతమ్ముఁడు వెంకటరామయ్యయును, చూచివచ్చుటకై గుంటూరువచ్చి, ఊలుదొరగారితో మాటాడితిమి. కళాశాలలో నాకు ౧౩౦ రూపాయిల జీత మిచ్చుటకాయన యొప్పుకొనెను. ఆరోగ్యవిషయమున గుంటూరు చక్కఁగనుండినటుల మాకుఁ దోఁచెను. ఇపుడు మాతల్లికి సంజువ్యాధి పొడసూపెను. నరసాపురము కాపురమువచ్చిన నాసోదరులయొద్ద నామె నివసించుచుండెను. మామాట యటుంచి, తల్లి యారోగ్యమును గుఱించి శ్రద్ధ వహించుట యిపుడు నాముఖ్యవిధిగఁ దోఁచెను. సంజువ్యాధిరోగులకు గుంటూరు మంచిది. మాతల్లిని గుంటూరు కొనివచ్చి యిచట నామెకు దేహస్వాస్థ్యము గలిగించి, మేము హాయిగ నుండుట శ్రేయమని మాకుఁ దోఁచెను. కావున నేను గుంటూరియుద్యోగము స్వీకరించితిని. ఈ సంగతి విజయనగరము కళాశాలాధ్యక్షునితోఁ జెప్పుటకు వారియింటి కేగితిని. నేను మొదటితరగతి కళాశాల విడిచి, రెండవతరగతి కళాశాలకు వెళ్లుటయు, దోమలకును బూరకాళ్లకును భయపడి విజయనగరము వదలివేయుటయు ఆయన కమితాశ్చర్యము గొలిపెను.

## ౭. గుంటూరునందలి యుద్యోగము

నాయందు తమకు సదభిప్రాయము గలదనియు, నన్నున్నతదశకుఁ గొనివచ్చెద మనియు వారు చెప్పినను, నేను నా మనోనిశ్చయమును విడువలేదు. అందుచేత ౧౯౦౮-వ సంవత్సరారంభమున నేను విజయనగరము విడిచిపెట్టితిని.

నేను గుంటూరువచ్చు సరికి, నా బెజవాడ మిత్రుఁడును "దేశాభిమాని" పత్రికాధిపతియు నగు దేవగుప్తాపు శేషాచలపతిరావుగారు, క్రొత్తపేటలోఁ దమయింటికి సమీపముననుండు వేలమూరివారి యింటిలో నొకభాగమున నాకు బస కుదిర్చి యుంచిరి. గుంటూరు కళాశాలోపాధ్యాయులలోఁ గొందఱు నాకిదివఱకె స్నేహితులు. సుందరేశయ్యరు, కృష్ణమాచార్యులు, వెంకటరెడ్డిగార్లు నాకుఁ బరిచితులె. విజయనగరము వదలి గుంటూరు వచ్చుట, నాకు పరులయిల్లు వీడి స్వగృహమునఁ బ్రవేశించుటవలె నయ్యెను. ఇచ్చటి ప్రజలపద్ధతులు, ఆచారములు నాకుఁ జిరపరిచితములె.

కళాశాలయందలి పనియె నాకు మిగులఁ గష్టముగఁ దోఁచెను. ఇదివఱకీపాఠశాల బోధకులగు నా పూర్వికుల పాపపుణ్యముల ఫలము నే ననుభవింపవలసి వచ్చెను. ఈ విద్యాశాలలో వెనుక వెంకటకృష్ణయ్యనాయుఁడుగారిపని తెంపులేక యుండెను. కళాశాల తరగతులకు ఇంగ్లీషు, తెలుఁగు తర్జుమా, శారీరశాస్త్రము, ప్రాచీనదేశచరిత్రమును, ప్రవేశతరగతిలో నింగ్లీషును, ఆయన చెప్పుచుండువారు. సంచితకర్మ సంచయమువలె నివియన్నియు నా మెడకిపుడు చుట్టుకొనియెను. చరిత్రశాస్త్రమున పట్టపరీక్ష నిచ్చిన బోధకులు హిందువులలోను, క్రైస్తవులలోను పలువురున్నను, చరిత్ర మెఱుఁగని నేనే, కళాశాలతరగతుల కది బోధింపవలయును. దీనికిఁ గారణము నాపూర్వికుఁడట్లు చేసెను. కళాశాలాధ్యక్షులగు డాక్టరు ఊలుదొరగారు సత్య

సంధుఁడును, ఋషిసత్తముని బోలిన జితేంద్రియుఁడును. ఐనను, ఆయన న్యాయ మనుకొనిన పక్షమునుండి మనుష్యమాత్రు లెవరు నాయనను గదలుపలేరు.

ఇచటికి వచ్చునప్పటికి నాకు మరల ప్రార్థనసమాజాధ్వర్యము సిద్ధమయ్యెను. నేను భార్యయు బెజవాడలో నుండునపుడు, కృష్ణా, మండల సభా సందర్భమున, వెంకటరత్నము నాయఁడుగారు, నేను మిత్రులును సంస్కృతపాఠశాలలో సమావేశమై నెలకొల్పిన సమాజమె యిపుడు దినదినాభివృద్ధి గాంచుచుండెను. శ్రీయుతులు చల్లా శేషగిరిరావు, చిట్టి దుర్గయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణగార్లు దీని నిపుడు నడుపుచుండిరి. ఇపుడు నే నీబృందమునఁ జేరి పనులు సాగించితిని.

## ౮. జననీ సంస్మరణము

నేను గుంటూరు వచ్చిన కొలఁది దినములకే, మాతల్లికి వ్యాధి హెచ్చెనని తెలిసెను. ఆమెనిచటికిఁ దీసికొని వచ్చుట క్షేమకరము వలను పడకుండెను. ఆమెవ్యాధి ప్రకోపించెనని నాకొక నాఁడు తంతిరాఁగా, సకుటుంబముగ నేను నరసాపురము పోయితిని. నంజు ముదిరినను, మాయమ్మ స్పృహతో నుండెను. ఇంతదూరమున నుండు నేను, అవసానసమయమునఁ దన్ను వీక్షింప వేగముగ వచ్చినందు కామె యమితసంతోష మందెను. అంతకంత కామెవ్యాధి ప్రబలి, ౧౯౦౭ మార్చి ౧౫-వ తేది రాత్రికి ధాతువు క్షీణించెను. చివరనిమేషమువఱకును స్పృహగలిగి, సంతానమందఱును తన్నుఁ బరివేష్టించియుండఁగా, వారినిఁ జూచి సంతోషించుచు, భగవన్నామ సంకీర్తనముఁ జేసికొనుచు, తెల్లవాఱునప్పటికి మాయమ్మ పరలోకప్రాప్తిఁ జెందెను.

## ౮. జననీ సంస్మరణము

మా జనని మరణమును గుఱించి నే నారోజులలో వ్రాసియుంచు కొనిన యాంగ్లవ్యాసములోని ముఖ్యాంశము లిం దనువదించు చున్నాను:—

జీవితమునందువలెనే, మరణావస్థలోను, మా జనని వ్యక్తి విశేషమున నొప్పియుండెను. మా జనకునివలెఁ గాక యామె చివర నిమేషమువఱకును స్మృతితో నుండెను. ఇంతియకాదు. ప్రాణోత్క్రమణ సమయమున నా పుణ్యవతి శక్తియుక్తులు తీవ్రపటుత్వము దాల్చెను. తనజీవ మొగిరిపోవుచుండుట తెలిసియు, ఆమె యేమియు విచారము నొందదు. మరణవేదనలోఁ గొందఱు దైవమును దూఱెద రందురు. ఆమె యట్లు చేయలేదు. "నా కీవేదనను సంభవింపఁజేసిన దైవము, కావలసిన యోరిమికూడ నను గ్రహించెను సుమీ" అని నుడువునపుడు, ఆమెయాత్మ స్ఫటికాకృతిని దాల్చియుండెను.

మరణము తఱుముకొని వచ్చుచుండునపుడు, తనమంచము చుట్టును నిలుచుండిన కుమాళ్లను, కోమరితలను ఆపుణ్యవతి పలుమారు ప్రేమనఁ దేఱి పాఱి చూచెను. సోగకనులా సుదతివదనమునకుఁ గాంతి నిచ్చుచుండెడివి. ఇపు డామెముఖబింబము నంతటిని నిమురకను లాక్ర మించినట్లు తోఁచెను. దుఃఖపారవశ్య మందిన నే నామెశిరస్సును బట్టుకొని యుంటిని. స్వేచ్ఛయె యున్నచో, దుఃఖాతిరేకమున నేను నేలఁబడి పొరలెడివాఁడనే! కాని, యాత్మనిగ్రహము దాల్పవలసిన సమయమిది. నే నామె తొలిచూలి బిడ్డను. ఈ ప్రాముఖ్యమునకు సదృశ మగు బాధ్యతను మఱింత యోరిమితో నేను వహింపవలసి వచ్చెను. నేను దుఃఖావిష్టుఁడను కాఁగూడదు. మాతృప్రాణోత్క్రమణ పవిత్ర సమయమున చుట్టును శాంతినిగ్రహములు నెలకొల్పుభారము నామీఁద నున్నది.

అధిక జాగరూకతతో నీక్షించెడి మాతల్లి చక్షువులకు, మాకడ గొట్టుచెల్లెలి కనుంగవ చేర్పడిన బొమ్మకణములంత పొడగట్టి, బాలికదుఃఖమునకుఁ గారణమేమని యామెయడిగెను. తా నేడువలే దను చెల్లెలిమాటను గొంతసరిది, సంతోషమునసే యుంటిమని నేనంటిని. "మీసంతోషమునకుఁ గారణమే" మను జనని ప్రశ్నమునకు, "నీమంచమునఁబట్టి యుండుభాగ్యము మాకు దొరకినందుకు" అని నేను సమాధానము చెప్పితిని. తనకుఁ గోరిక లేమైనఁ గలవాయని మాతమ్ముఁడు కృష్ణయ్య యడుగఁగా, తనకేమియు వాంఛలు లేవని యామె చెప్పివేసెను. కోరికయే పునరావృత్తికి హేతువని నమ్మినది గావున, ఆవనిత వాంఛారహితత్వమున నుండెను. ఆసమయమున నాసుశీలయాత్మ దేవభావమునఁ దేజరిల్లెను. మితభాషిత్వ మామానినికి నైజగుణము. ఆమె నిశ్చలదైవభక్తిగల పుణ్యాంగనయని మాకుఁ దెలియునుగాని, తత్త్వవిషయములందు నట్టియజ్ఞానయనియే మేమనుకొనెడివారము. ఆతరుణమున మాత్రము, అట్లామె గానఁబడలేదు. మరణసమయానుగుణ్యముగు "ముప్పున కాలకింకరులు" అనుదాశరథీశతకములోని పద్యమును, మఱికొన్ని పద్యములు పాటలును ఆమె పాడి, హరినామస్మరణము చేసికొనసాగెను.

"దానధర్మము లేమైన చేసికొనెదివా?" అని మాలో నొకర మడుగఁగా, మా కిష్టమున్న నేదైనఁ జేయవచ్చునుగాని, తన కట్టివానితో జోక్యమిఁక లేదని యామె యనెను. భూలోకజీవితము విడనాడి వెడలిపోవు జీవుని దృష్టిని దానధర్మముల వైపునకైన మరలింపఁదగదని మాయమ్మ మమ్ము వారించెను. వెనుకటి నోములఫలితముగ, తన సంతతి బుద్ధిమంతులు, ప్రయోజకులునై, అవసానసమయమున నిట్లు తనను బరివేష్టించి యుండుటయే మహాసుకృతమని యా

సుగుణవతి యొంచెను. ఆమె కింతటితోనే సంతృప్తి! ఇంతకంటె నేమియు పుడమియందా పుణ్యవతి కక్కఱలేదు!

ఈసమయమున నాధర్మశీల యాలోచనలన్నియు దైవమును గుఱించినవియె. జీవితమునఁ దనకు పరమాప్తుఁడును, ఇపుడు పరమావధియు నైన పరమాత్మునిమీఁదికే మాతల్లి తనదృష్టి నిగిడ్చెను. ఆపద్బాంధవుఁడని దేవునిపాదకమలము లామె యిపుడాకస్మికముగ పట్టుకొనుచుండలేదు. భూలోకమునఁ దన విధ్యుక్తములను నెరవేర్చి, భవభారమున నలసినజీవి పరమాత్మను జేరునట్టుగ, నాపుణ్యవతి తన పాటలు పద్యములను పాడుకొనుచుండెను.

ఆవ్యక్తియొక్క ప్రశాంతమనస్సు, సమబుద్ధి, సమధిక భక్తియును, ఈ యంత్యరంగశోభను మఱింత వృద్ధిచేసెను. కాని, వెనువెంటనే మరణము సంభవింపలేదు. కనులుమోడ్చి యాకాంత భగవన్నామసంకీర్తనము చేసికొనుచుండెను. ఆమెచెవిలో నీశ్వరనామము మేము పలుకఁగా, 'నారాయణ' అని యామె మాఱుపలికెను. ఆసమయమున నామనస్సునఁదోఁచిన పాపపుఁదలంపు నొకటియిచటఁ జేర్కొనుచున్నాను. ఆమెమరణమునకు మంచి తరుణమిదియే గదా యని నే ననుకొంటిని. తనయుఁడనగు నేను తల్లిచావును గోరితినే యని నే నంత నొచ్చుకొంటిని.

నావలెనే మాతమ్ములును దలపోయసాగిరి. ఈశ్వరధ్యాననిమగ్నయై యుండునపు డీజీవికి మృత్యు వాసన్నమగుట పుణ్యము గదాయని మే మనుకొంటిమి. కాని, యామె యింకనొకరోజు జీవించునటులఁ దోఁచెను. ఇంతలో నామె నిద్దురపోవునటు లుండెను. కొలఁది నిముషములలోనే యొకటి రెండు మాఱులు దీర్ఘనిశ్వాసములు

గాఁవచ్చి, ఆమె మరణించెను. అవసానసమయమున నీశ్వర నామమును బట్టి యాంతపదముగఁగాక, ప్రాణపదముగ పవిత్రనామముగఁ జేకొని, జీవితమును విడనాడిన ధన్యజీవిత యీ సుదతియని మాకు స్పష్టమయ్యెను.

మాతలిదండ్రులకుఁగల తారతమ్య మిట సంగ్రహముగఁ దెలిపెదను. తండ్రి నిష్కపటుఁడు, హాస్యవచనధోరణిగల వాచాలుఁడు. తల్లియన్ననో, నిగ్రహనిపానములు గల మితభాషిణి. మాజనకుఁడు పొంగారెడి హృదయమున మమ్ముఁ బ్రేమించువాఁడు. మేము నటులే యాయనను బ్రేమించువారము. కాని, యెక్కువ చనవున నొక్కొక్కప్పుడు మే మాయనను జులుకనగఁ జూచుచుండువారము. మాతల్లిపట్ల యట్లుగాదు. ఆమెయెడ మాకుఁ గల ప్రేమ భయభక్తులతోఁ గూడియుండునది. ఆమె మాకెంత ప్రేమాస్పదయైనను, మే మామెతోఁ గోఁతికొమ్మచ్చియాట లాడరాదు. అడ్డు వచ్చిన చెట్లచేమల నెల్లను తనప్రవాహ వేగమునఁ గొట్టివేయునట్టి పర్వతప్రాంతమందలి సెలయేరువంటిది మాజనకుని ప్రేమము. ప్రేమయం దాయనహృదయ మిచ్చెడివాఁడు. పిల్లల కెవరికైన తీవ్రవ్యాధి సోఁకినచో, శిశువువలె విలపించి, వలసినచో తనయసువుల నర్పింపఁ జూచుచుండువాఁడు. బాలికవలె జాలిగుండెగలవాఁడు. స్వచ్ఛమును, స్పష్టమును నైన యనురాగము చూపుచుండువాఁడు. మా కెఱుకఁబడనిలోపము లాయనయందు లేనే లేవు. ఆయన వైపరీత్యములు వైకల్యములును ప్రస్తావించి, మే మెత్తిపొడుచుచుండువారము.

కాని, మాతల్లివిషయ మట్టిది గాదు. ఆమె నిశ్చలబుద్ధియగు ధైర్యవతి. ఆమెకును సుహృదయము లేకపోలేదు. ఐనను, మాతండ్రికిఁ గల భావసంపదయు, భావవైపరీత్యములును గూడ నామె

యొద్దలేవు. మితభాషిణియగు మాతల్లి భావవిస్ఫురణ చేయనొల్లని స్వభావము గలది. చిన్ననాఁడు రాజమండ్రిలో నేను నా పెద్ద తమ్ముఁడును ఆమెశిక్షణ ననుభవించినవారమె. ఆమెమాట జవ దాఁటఁగూడనిది. ఆమెగృహపరిపాలనము భయంకరము గాకున్నను, క్రమశిక్షణముతోఁ గూడుకొనినదియె. ఆమెబుజ్జగింపులు నధికాగ్రహ, మును గూడ మే మెఱుంగము. మాచిన్ననాఁడా మెయాజ్ఞల కింత కాఠిన్య ముండుటకుఁ గారణము, మాతండ్రి యింటిపట్టున నుండక, గృహయాజమాన్య మా మెమీఁదఁ బడుటయె. మొదట నిటులుండి నను, పిల్లలెక్కువయైన కొలఁది, మాతల్లికాఠిన్యము సడలెను. ఆమె బలహీన. ఒక్కతెయె యింటిపనులన్నియును నెరవేర్చుకొన వలసివచ్చెను. పిల్లలము మేమామెకుఁ గొంత దోడ్పడుచుండువారము. కాని, గృహకృత్యభారమును, పసివారలతోడి బాధలును, ఆమె మనస్సును మిగులఁ గలఁత నొందించెను. సమష్టికుటుంబమునకు స్వతస్సి ద్ధమగు గృహచ్ఛిద్రములు, తరువాతకాలమునందు సంసారమందలి యైక్యమునకు భంగము గలిగించెను. దీర్ఘవ్యాధియు మాతల్లి మనో వ్యాకులతను హెచ్చించెను. ఇంట నిటీవల సంభవించిన మరణములు కూడ దీనికిఁ గారణభూతమయ్యెను.

ఏది యెటు లుండినను, మాజనని స్వభావ సిద్ధగుణములు శాంతత, ఓరిమి, మితభాషిత్వమును. దైవభక్తియందువలెనే ప్రేమ విషయమునందును, ఆమానిని ప్రశాంత గాంభీర్యములతో నొప్పెడిది. విశాలమగు గోదావరీనదీప్రవాహమువలె నామె ప్రేమగుణము గంభీర మగనుండి, కంటువడని గమనమున సాగిపోవుచుండెడిది. మాజనని ప్రేమము, ఆవిశ్వజననిప్రేమమువలెనే సమత్వ సర్వాంతర్యామిత్వ ములతో మాకుఁ బ్రసరించెడిది. పిల్లలమగు మా శ్రేయస్సుకొఱకును,

మావిద్యాభివృద్ధికొఱకును మాతల్లి సదా పాటుపడెను. ఆపదయందు ధైర్యము, సంపదయం దణకువయును విడువక, ఆయిల్లాలు సంసార యాత్ర సలిపెను. ఇట్టి సుగుణాన్వితయగు జనని గర్భవాసమున నుద్భ వించుట మహాభాగ్యముగదా! దయామయుఁడగు భగవంతుఁడు మాజననీ జనకుల కాత్మశాంతి యొసంగి, వారిసుగుణములు వంశమున నిలుచునటు లనుగ్రహించుఁగాక !

## ౯. నూతనపరిస్థితులు

నేను గుంటూరు వచ్చుటకుఁ బూర్వమే "జనానాపత్రికా" ప్రకటనము నిలిచిపోయెను. పత్రికాధిపత్యమును, పుస్తకముల స్వామ్యమును, వెనుక గున్నేశ్వరరావుగారి కిచ్చివేసితిని. ఇపు డవి తిరిగి వారి నుండి నేను గైకొంటిని. కాని, పత్రికను పునరుద్ధారణము చేయ నెన్నిమాఱులు నేను సంకల్పించినను, ఆకార్యము కొనసాగలేదు. గుంటూరు కళాశాలలో పని యెక్కువగ నుండుటచే మరల పత్రికను నెలకొల్పుటకు నేను వెఱచితిని. సంవత్సరములనుండి జరుగు సంస్థకొక సారియంత రాయమేమైన సంభవించెనా, దానిని బునరుద్ధరించుట కన్నియు ప్రతిబంధములే యగుచుండును. వ్రాయు నభ్యాసము నాకు క్రమక్రమముగ తగ్గిపోవుటచేత, పత్రికాప్రకటనము కష్టముగఁ దోఁచి, దానియం దనిష్టము గలిగెను. ఆపత్రిక కాకపోయిన వేఱొ కటి నెలకొల్పరాదాయని మిత్రు లనిరి. ఒకానొకసమయమున మరల పత్రిక నొకటి స్థాపింప నెంచి, పత్రికకు మంచిపేరు కుదుర్పుఁ డని తోడి యుపాధ్యాయ మిత్రులగు వంగిపురపు కృష్ణమాచార్యులుగారి నడిగితిని. నాకు స్ఫురించిన "విద్యావిలాసిని" అను పేరు మంచిదని యాచార్యులవారు సమర్థించిరి. "సత్యసంవర్ధని" ని యేల పునరుద్ధ



౧౯౦౮. ఎడమనుండి కుడివైపునకు: ౧ పంక్తి. రాయసం కృష్ణమూర్తి, వెంకటశివుడు, వెంకటరామయ్య.
౨ పంక్తి. సుభద్ర, మహాలక్ష్మి కనకమ్మయు, రత్నమ్మ, రత్నమ్మ సీతమ్మయు, నరసింహము.
3 పంక్తి. సుబ్బారాయుడు, సీతమ్మ, సూర్యనారాయణ.

రింపరా దని నాకంతఁ దోఁచెను. ఒక పర్యాయము విరమించిన పత్రికను మరల జరుపుట అశుభసూచకముగఁ గానఁబడెను! వీని యన్నిటి పర్యవసానము, మరల నే నే పత్రికను నెలకొల్ప కుండుటయే! పత్రికాస్థాపనమును గూర్చి తగినంత నిశ్చయోత్సాహము లుండెనేని, తీఱిక లేకుండుట, మంచిపేరు దొరకకుండుట మున్నగు సాకు లెన్నియు నడ్డుపడెడివి కావు.

నాచేత ప్రత్యేకపత్రిక యొకటి లేకున్నను, ఇతర పత్రికలకు వ్రాయుచునే వచ్చితిని. "మద్రాసు స్టాండర్డు" "సంఘసంస్కారిణీ" పత్రికలకు నేనపుడపుడు వ్రాయుచుండువాఁడను. ఆంధ్రపత్రికసంవత్సరాదిసంచికకు వ్యాసమేదియైన వ్రాయుఁడని, పూర్వము 'జనానాపత్రిక'ను జరుపుచుండెడి శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారియొద్ద నుండి వచ్చినపిలుపు నాదరించుచుండువాఁడను. ఇట్లు నేను వ్రాఁత బొత్తిగ మఱచిపోకుండ నేదో యొకటి గోఁకుచు వచ్చితిని గాని, ఈకాలమున మొత్తముమీఁద నాకలము ప్రసుప్తపట్టి యుండె ననియే చెప్పవలెను.

గుంటూరు వచ్చిన మొదటిదినములలో నావ్రాఁత యిట్లు తగ్గిపోయినను, తక్కిన కర్మకాండ కేమియు వ్యాఘాతము గలుగలేదు. ప్రార్థనసమాజప్రచారము సంగతి యిదివఱకే ప్రస్తావించితిని. 'మంగల వానిని జూచి యొద్దుకుంటె' ననునట్టుగ, గత సంవత్సరమున నేనుండు విజయనగరమున "విద్యార్థిసమావేశము" జరిగెను గాన, ఈసారి నేనుండు గుంటూరునం దద్దానిద్వితీయ సమావేశము జరుప నిచటి విద్యార్థులు సంకల్పించుకొనిరి! ఈసభను జరుపుటకై, గుంటూరు కళాశాల పురవిద్యాలయములం దుండు విద్యార్థులోక సమాజముగ నేర్పడి, తమలోఁ గొందఱిని, పట్టణప్రముఖులలోఁ గొందఱిని, "ఆహ్వాన

సంఘము" గ నేర్పఱిచిరి. ఈ సభాకార్యక్రమమును క్రమముగ జరిపించు భారమును పురపాఠశాలాధికారియగు ఏకా రామయ్యగారి మీఁదను, నామీఁదను వేసిరి. శ్రీ పత్రి శ్రీనివాసరావుగారు సభకధ్యక్షులైరి. ఆంధ్రమండలములనుండి విద్యార్థిప్రతినిధులు పలువురు విచ్చేసిరి. వక్తలలో ప్రముఖులు బందరు వంగవోలు కళాశాలాధ్యక్షులు. సభ జయప్రదముగ జరిగెను.

౧౯౦౩-౪ సంవత్సరములకే మా కుటుంబ పూర్వఋణములన్నియుఁ దీఱిపోయెను. అంతటినుండియు మువ్వురు సోదరులమును సంపాదించిన ధనమును గొంత నిలువచేసికొనుచు వచ్చితిమి. ౧౯౦౫-వ సంవత్సరారంభమున మాత లోకాంతరగతయైన పిదప, సోదరుల మిఁక వేఱుపడుట యావశ్యకమని నేను మాతమ్ములతో గట్టిగఁ జెప్పితిని. జననీజనకులు కీర్తిశేషులగుటయె సమష్టికుటుంబ సూత్రమునకు విచ్ఛేదము గలుగుటగదా! ఇపుడు సోదరులమెవరికుటుంబ పోషణము వారలము చేసికొనుచున్నారము. వారివారి యగత్యములను బట్టియు, ప్రజ్ఞానైపుణ్యములను బట్టియు ధననిక్షేపణ కార్యము జరుగఁగలదు. ఎల్లకాలమును సోదరులందఱును గలసియుండు మనుకొనుట వెఱ్ఱిపని. దీనివలన నన్నదమ్ములలో నైకమత్యమునకు మాఱుగా ద్వేషభావ మేర్పడవచ్చును. కావున ముందును సోదరులందఱమును సమరసభావమున మెలఁగఁగోరితిమేని, యీసమయముననే విడిపోవుట యుక్తమని నేను నొక్కిచెప్పితిని. అప్పటికప్పుడే తమ్ముఁడు వెంకటరామయ్య సుమారైదు వేల రూపాయిల విలువగల స్థిరాస్తిని సంపాదించెను. ఇంకఁగొంతకాలము గలసియుండి, ఆస్తినింకను బెంపొందించిన పిమ్మట, వేఱుపడుట యుక్తమని యాతని యభిప్రాయము. కాని, యిది యిఁకఁ బొసఁగదని నేను జెప్పి, కాల

విలంబన మయ్యెనేని, భూవసతికి మాఱుగా గృహకల్లోలములు పెచ్చుపెరుఁగునని నేను హెచ్చరించుటచేత, ౧౯౦౮-వ సంవత్సర మధ్యమున సోదరులము వేఱుపడితిమి. నేను జెప్పినచొప్పననే, మేము వేఱుపడిన పిమ్మట, సోదరులలో వైమనస్యములకు మాఱుగా స్నేహభావ మతిశయించెను. దైవానుగ్రహమున వేఱువేఱుగ మంచియాస్తిని సంపాదించుకొనఁగలిగితిమి. చీఁకటి రాత్రుల వెనుక వెన్నెల రేలు వచ్చెడి విధమునను, వేసవి యెండల పిమ్మట తొలకరి వానలు గురి యుచందమునను, వెనుకటి యార్థికదుర్దశ తొలఁగిపోయి, మాసంసార పరిస్థితు లంతటినుండియు మిగుల తృప్తికరముగ నుండెను.

౧౯౦౮-వ సంవత్సరాంతమున రాజమంద్రి పురమందిరమున జరిగిన వీరేశలింగ పుస్తకాలయ వార్షికసభకు నన్నధ్యక్షునిగఁ గోరిరి. నేనపుడు రాజమంద్రి పోయి, పురమందిరమున వీరేశలింగముపంతులు గారిని, రాజ్యలక్ష్మమ్మగారిని సందర్శించితిని. వారిరువురు నపుడు పరిపూర్ణారోగ్య మనుభవించుచుండిరి.

## ౧౦. వెంకటరత్నమునాయఁడుగారు

౧౮౯౧-వ సంవత్సరమున మొదట మద్రాసులో కలసికొని నప్పటినుండియు, వెంకటరత్నమునాయఁడుగారికిని నాకును మనసు గలిసిన మైత్రి యేర్పడెను. నాప్రియగురువులగు వీరేశలింగము పంతులుగారికిని, ప్రియమిత్రులగు కనకరాజు గంగరాజుగార్లకును నే నెఱిఁగింపనొల్లని సందేహములను రహస్యములను, నాయఁడు గారికి నేను జెప్పి, వారియోజనలను సమాధానములను స్వీకరించు చుండువాఁడను. మతవిషయములందు నాకు వారిసహవాస సంభాషణముల వలనఁ గలిగిన లాభ మింకొకరి మూలమునఁ గలుగలేదని చెప్ప,

వచ్చును. వారికిఁ బ్రియరచయితలగు కార్లయిలు, ఇమర్సను మార్టినోల గ్రంథములు నాకును మంచి ప్రబోధము గావించెను. నాయఁడు గారిని గురువుగఁ బూజించి, సోదరునిగఁ బ్రేమించితిని. ఆదినములలో పలుమారు వారితో, "బెజవాడ, బందరు రాజమంద్రీలకు మధ్యగా నున్నది సుమండీ!" యనుచుండు నామాటల కర్థము, నా యభిప్రాయములు నభిరుచులును వీరేశలింగము వెంకటరత్నమునాయఁడుగార్ల మన స్తత్త్వములకు మధ్యస్థముగను, సమన్వయాభిప్రాయముగను నుండు ననియే! కాకినాడ కళాశాలాధ్యక్షపదవి ఖాళి యైనప్పుడు, ఆపనికి నాయఁడుగారిని దరఖాస్తు చేయుఁడని ముందుగ నేనె కోరితిని. ఆకళాశాలాపాలక సంఘమువారు వెనుకటి యధ్యక్షుని కన్యాయము చేయుటవలన, తా మాపనికిఁ బ్రయత్నింప నొల్లమని నాయఁడు గారు ప్రత్యుత్తర మీయఁగా, నేను వారితో వాదించి, దరఖాస్తు చేయునట్లు వారి నొడంబఱిచితిని. అంతట రాజమంద్రిలో నున్న వీరేశలింగము పంతులుగారికి వ్రాసి, వారు కాకినాడపోయి, కళాశాలాధికారులతో నాయఁడుగారిని గుఱించి చెప్పుఁడని వారిని వేఁడితిని. నే నాదినములలో విజయనగరమందలి కళాశాలలో నుంటిని. నాయఁడుగారికి కాకినాడ యుద్యోగమునట కై గట్టి ప్రయత్నములు చేయుఁడని యచటి మిత్రులకును వ్రాసితిని. అచటి విద్యాధికులలో పెక్కండ్రకు, పోటీదారులగు వి. యస్. శ్రీనివాసశాస్త్రి గారియెడఁ గాక, నాయఁడుగారియందె యభిమానము గలదు. ఎట్టకేలకు నాయఁడుగారి కీయుద్యోగమైన దని విని, నే నత్యానందభరితుఁడ నైతిని.

నాయఁడుగారు కాకినాడకు వచ్చినప్పటినుండియు, అచటి మాయుభయుల మిత్రులును నన్ను విజయనగరమునుండి కాకినాడకు

తరలి రమ్మని ప్రోత్సహించుచు వచ్చిరి. నారాక శ్రేయోదాయకమని నాయుఁడు గా రెంచినచో, ఆయనయే దానిని గుఱించి ప్రశంసింతురని నేను సమాధానమిచ్చి యూరకుండువాఁడను. ఇటు లుండఁగా, విజయనగరనివాసమునందు నా కంతకంతకు విసుగుపుట్టి, ఆరోగ్యప్రదమగు గోదావరీమండలప్రాంతములకు రాఁగోరితిని. కనీస మే యున్నత పాఠశాలలోనైన ప్రథమోపాధ్యాయపదవిని స్వీకరించుటకు సంసిద్ధముగ నుంటిని. ఇటులుండఁగా, తమ పాఠశాలలో ప్రథమోపాధ్యాయునిపని ఖాళీ యయ్యెననియు, దానిని గుఱించి నాతో మాటాడెదమనియు నాయుఁడుగారు ౧౯౦౭ ఫిబ్రవరి ౭-వ తేదీని నా లేఖకుఁ బ్రత్యుత్తరము వ్రాసిరి. వారు కోరినట్లు నేను వచ్చి మాటాడితిని. కాని, వారిసంభాషణధోరణిని బట్టి నా కా యుద్యోగ మీయ వారి కిష్టము లేనట్లు గ్రహించితిని. మఱుసటి సంవత్సరారంభమున నేను గుంటూరు కళాశాలకు వచ్చివేసితిని.

ఇటీవల వీరేశలింగముపంతులుగారు రాజమండ్రిలో "హితకారిణీ పాఠశాలను" ను నెలకొల్పి, దాని నభివృద్ధిపఱిచిరి. ఇప్పు డా యాస్తిక పాఠశాలకు ప్రథమోపాధ్యాయుఁడు గావలసివచ్చెను. పూర్వమున, ఆస్తిక పాఠశాలా స్థాపనమునుగూర్చి వీరేశలింగము గారును, శిష్యులమగు మేమును ఎంతో యాత్రపడితిమి. కాని, పరిస్థితుల వైపరీత్యమువలన నాకాలమం దాసంస్థ యేర్పడలేదు. ఇపుడు పంతులుగారిచే స్థాపితమైన విద్యాశాల దినదినాభివృద్ధి నొందుట విని మిగుల సంతసించితిని.

౧౯౦౮ నవంబరులో నీ పాఠశాలవిషయమై నాయుఁడుగారి యొద్దనుండి నా కొక జాబు వచ్చెను. అం దిటు లుండెను:—

నాయీ "చేటభారతము"నకు నాయఁడుగారినుండి ప్రత్యుత్తరము రాలేదు. నాకిపుడు గుంటూరు కళాశాలలో హాయిగనుండినను, రాజమండ్రిలో బ్రాహ్మసమాజ సంస్థలోఁ బనిచేయ నామనస్సు ఉఱ్ఱూతలూఁగుచుండెను. కాని, రాజమండ్రి కేగిన ప్రతిష్ఠాభంగమగునని యొకమూలభయము! సిగ్గుకోరికల మధ్యనూఁగులాడుచుండు నేనెటులూరకుందును? కావున, నాయఁడుగారికి ౯-౧౨-౦౮ తేదీని నేనింకొక లేఖ వ్రాసితిని. దీనికిని వారియొద్దనుండిగాని, వీరేశలింగము పంతులుగారి యొద్దనుండిగాని నాకు జాబు రానేలేదు! ఆపాఠశాలకు వేఱొక ప్రధానోపాధ్యాయుఁడు నియమింపఁబడెనని నా కంత దెలిసెను.

ఇది జరిగిన కొన్నినెలలకు నేను వీరేశలింగముగారిని గలసికొనినపుడు, ఈసంగతిని గుఱించి ప్రస్తావనరాఁగా, ఆస్తిక పాఠశాలలో నుద్యోగముచేయ నాకిష్టములేనట్లు నాయఁడుగారు తమకుఁ జెప్పివేసిరనియు, అందుచేతనే తాము మఱియొకరిని నియమించితిమనియును వారనిరి. తమతోఁగలసి యేదేనిధర్మ సంస్థలో నిపుడు పనిచేయఁ దలంచుకొంటినని నేను వ్రాసినయుత్తరమున కాయన, ౯-౧-౦౯ తేదీని ప్రత్యుత్తరమిచ్చుచు, జరిగినది మఱచిపోయి రానున్న దానిని గుఱించి యోజింపుమనియు, నేనుగూడ రాజమండ్రి వచ్చివేసినచో నేదోయుద్యోగమునఁ బ్రవేశింపవచ్చుననియును వారు వ్రాసిరి.

ఇది జరిగిన మఱుసటిసంవత్సరమున నాయఁడుగారియొద్దనుండి నా కొకజాబు వచ్చెను. దాని నిందుఁ బొందుపఱుచుచున్నాను:—

## ౧౦. వెంకటరత్నమునాయఁడుగారు

కాకినాడ,
౧౦-౪-౧౯౧౦.
తెలుఁగు సంవత్సరాది.

"భ్రాతృవరా!

మనకుఁ బ్రియ మగు నీ సంవత్సరాదిపండుగనాఁడు, వెనుకటి సంగతులు మఱచిపోయి, ముందు మరల నన్ను మీ ప్రేమ కాస్పదుని గాఁ జేయరా? ఇపుడు, నే నే సమాధానము నీయను! ఏసాకును జెప్పను! క్షమాపణమే నేను వేఁడుచున్నాను!

"ఆకాశము అంధకారబంధురమైనను, గృహములోపల ప్రకాశముగనే యున్నదినుఁడీ!

ర. వెంకటరత్నము"

దీనికి నా ప్రత్యుత్తరమిది:—

గుంటూరు
౧౪-౪-౧౯౧౦

"ప్రియమైననాయఁడుగారికి,

మీ యుత్తరము చేరినది. ప్రేమపూర్వకముగ మీరు చాఁపిన కరమును సంతోషపూర్వకముగ నేను గ్రహించుచున్నాఁడను. * * * కాని, మీరే నన్ను క్షమింపవలెను. మీ యీకడపటి యుత్తరమును నా వెనుకటిచర్యలను విమర్శించిచూడఁగా, మొదటినుండియు నాదే తప్పిదమని నేను గ్రహించుచున్నాను. అహంభావపూరితునికి న్యాయవిచక్షణ మసాధ్యము. అత్యాశాపీడితుఁడనై నే నిదివఱకు వ్యవహరించినట్లు నాకిపుడు ద్యోతక మగుచున్నది. నాకు తగినశాస్తి జరిగినది.

"జరిగినది జరుగనిండు. నలువది సంవత్సరములప్రాయము దాఁటి, ఒకరికొకరు న్యాయముగ దూరమున నున్న మనబోటి యిరువురు మనుష్యులు, ఒండొరులను కుమ్మరికొనక, కనీసము క్రొత్తవారు మెలంగెడి రీతినైన నింక మర్యాదతో సంచరించుట కభ్యంతర ముండఁగూడదు. నే నెట్టి తులువనైనను, ఇంకముందు మనోవాక్కర్మలయందు నిగ్రహము పూనియుందు ననియును, మీయొక్కయు, నితరుల యొక్కయు చిత్తశాంతిని తొలఁగింప కుందుననియును నమ్మించుచున్నాను.

రా. వెం. శి."

## ౧౧. ఉద్యోగప్రయత్నములు.

నేను గుంటూరు కళాశాలలో నాపనులు సక్రమముగ నెరవేర్చుచుంటిని. అధ్యక్షులగు డాక్టరు ఊలుదొరగారు నాయందు ప్రేమగౌరవములు చూపుచుండెడివారు. విద్యాబోధనమునందును కళాశాలా పరిపాలనమునందును, వారి సమర్థత నా కంతగ నచ్చకున్నను, సత్యసంధత న్యాయవిచక్షణ విధి కార్యనిర్వహణములందా యన యుత్తమోత్తముఁడని, నేనెకాదు, చూచినవారందఱును విశ్వసించియుండిరి. ఆయన మునిసత్తమునివంటి పవిత్రవర్తనమున నొప్పువాఁడు. అట్టి సుజనుఁ డేమత మవలంబించినను, ఏసంఘమున నుండినను, ఆయాసంస్థలకు వన్నెయు వాసియుఁ గలుగవలసినదే! ఆయనమంత్రులగు నొకరిద్దఱు బోధకులు తమదుర్మంత్రముల నాయన కుపదేశించి, ఆయనను పెద్దవారలను ద్రొక్కించెడివారు. ఇది చూచి నాకు విచారము కలిగెడిది. కాని, యితరుల కార్యములలో జోక్యము కలిగించుకొనక, నాపనులు చక్కపెట్టుకొనుటయే నీమముగఁ జేసికొని నేనె

వరతోను, ముఖ్యముగ నధ్యక్షునితోను, తగవులు పెట్టుకొనువాఁడను గాను. సామాన్యముగ నిట్టి తటస్థభావ మవలంబించియె నేను మన శ్శాంతి ననుభవించుచుండువాఁడను.

నాచెల్లెండ్రు కనకమ్మ కామేశ్వరమ్మలు గుంటూరువచ్చి, నాయొద్దఁ గొంతకాలము నివసించి వెడలిపోయిరి. ఇటీవలనే కామే శ్వరమ్మకు విశ్వనాథ మను పుత్రుఁడును, కనకమ్మకు జనార్దనమను పిల్లవాఁడును గలిగిరి. ఇదివఱకు కనకమ్మకు నరసమ్మ సీతమ్మలను కొమార్తెలు గలరు.

౧౯౦౮-వ సంవత్సరము డిసెంబరునెలలో చెన్నపురిని దేశీయ మహాసభ జరిగెను. నేన చటికేఁ బోలేదు. తమ్ముఁడు వెంకట్రామయ్య ఆనెలచివరను గుంటూరువచ్చి, తన వైద్యమునకు మద్రాసు నన్ను రమ్మనఁగా, మే మిరువురము నచటికి వెళ్లి, కొన్ని దినములుండి, మరలి వచ్చితిమి. చెన్నపురి వైద్యమువలన నతని కేమియు మేలు కలుగలేదు. తనకు లేనిపోని జబ్బు లున్నవని యాతఁ డనుమానపడుచుండునట్లు తోఁచెను.

౧౯౦౯-వ సంవత్సర ప్రారంభమున గుంటూరులో దేవ గుప్తాపు శేషాచలపతిరావుగారియింట జరిగిన వితంతువివాహమునకు మేము దంపతులము పోయి తాంబూలము స్వీకరింపఁగా, పొరుగున నుండిన పూర్వాచారపరుఁడగు న్యాయవాదియొకఁడు మాయింటి కెవ్వరును భోజనమునకు రాకుండఁజేయఁ బ్రయత్నించెను. కాని, మాయింట జరిగిన యొక శుభకార్యసందర్భమున ననేకులు వచ్చి భుజించిరి. ఆన్యాయవాదియు, ననుచరులును తమపంతము నెగ్గకుండుటకు విషాదమందిరి.

౧౮౯౮-వ సంవత్సరమున దొరతనము వారి తెలుఁగు ట్రాన్సులేటరగు సమర్థి రంగయ్య సెట్టిగారు రైలుప్రమాదమున మరణింపఁగా, ఆయుద్యోగము ఖాళీ యయ్యెను. నన్నా పనికి దరఖాస్తు చేయుఁడని మిత్రులు ప్రోత్సహించుటచేత, జులై నెలలో నేను అర్జీ నంపితిని. కళాశాలాధ్యక్షులు ఊల్ దొరగారును, పరీక్షాధికారులు గరికిపాటి సుబ్బారాయఁడు శాస్త్రిగారును నాకు గట్టి సిఫారసులు చేసిరి. వీరేశలింగముగారును, కిడాంబి రామానుజాచార్యులుగారును నన్ను గుఱించి సర్టిఫికేటు లొసంగిరి.

అంత కొన్ని నెలలకు దరఖాస్తుదారులలో నెల్లమిత్రుఁడు కనకరాజునుగూర్చియు, నన్నుగుఱించియు దొరతనమువారు సదభిప్రాయులై యుండిరనియును, ఈతరుణమున నుదకమండలము వెళ్లి స్వయముగ నధికారులఁ జూచినచో నాకు లాభము గలుగుననియును స్నేహితులు చెప్పుటచేత, నేను గుంటూరునుండి బయలుదేఱితిని. నే నిదివఱకెపుడును నీలగిరులు చూచియుండలేదు. ఇపుడు శీతకాలము సమీపించుటచేత, నేనచటనుండిన రెండు మూఁడు దినములును రాత్రులందు ఉదకమండలము ఉదకమండలమె యయ్యెను. అచ్చటి గొప్ప యుద్యోగస్థులకు నేను సిఫారసు ఉత్తరములు పట్టుకొని వెళ్లితిని. తక్కినవారినిగూడఁ జూచితిని. వారందఱు సుహృద్భావముఁ జూపిరి. అందఱికంటె నెక్కువగ శ్రీ గాలట్టీదొరగారు మనసిచ్చి నాతో మాటాడిరి. ఆయన దొరతనమువారికి 'అండరుసెక్రటరీ'. ఆయన నాతో నాంధ్రసారస్వతమును గూర్చి ముచ్చటించి, నన్నుగుఱించియు కనకరాజునుగూర్చియుఁ దమకు సదభిప్రాయము కలదని చెప్పిరి. నేను మంచి జీతము తెచ్చుకొని కళాశాలలో గొప్పయుద్యోగము చేయుచుండఁగా, నామిత్రుఁడు కనకరాజు అంగవైకల్యమునొంది న్యాయ

వాదివృత్తిని ఏలూరున 'గాలి' జీవనము చేయుచుండెను గావున, అతనికే యీయుద్యోగ మగుట శ్రేయము కదా యని వారు నాతో ననిరి. నాస్నేహితుని కీయుద్యోగము లభించుట నాకు నభిమత మే యని నేను జెప్పివేసితిని. అంత కనకరాజునకే యుద్యోగ మయ్యెనని కొలఁదిరోజులకె తెలిసెను.

౧౯౧౦-వ సంవత్సరము మేనెలలో గుంటూరున జరిగిన మండల సంఘ సంస్కారణసభకు శ్రీ వింజమూరి భావనాచార్యులు గారు అగ్రాసనాధిపతులు. నేను ఆహ్వాన సంఘాధ్యక్షుఁడను. పండ్రెండు సంవత్సరముల క్రిందట నీ పురమున జరిగిన మండల సంఘసంస్కారణ సభలో వితంతూద్వాహమును గూర్చిన తీర్మానము ప్రజాసమ్మతము గాకుండుటయును, అతి బాల్యవివాహనిషేధమును గుఱించిన తీర్మానమున కంతరాయము గలుగ సిద్ధమగుటయుఁ దలపోసినచో, ఇంత స్వల్పకాలమున నీ మండలమందలి సాంఘిక వాతావరణము సంస్కారణానుకూలముగ మాఱుటకు నే నెంతయు సంతసించితిని.

రాఁబోవు సంవత్సరప్రారంభమున గుంటూరున "విద్యావిషయక ప్రదర్శనము" జరిపింప నొక సమాజము ౧౯౧౦-వ సంవత్సరమున స్థాపిత మయ్యెను. దానికి పాఠశాలా పరీక్షాధికారులగు సుబ్బరాయశాస్త్రిగారు అధ్యక్షులు. ముగ్గురు కార్యదర్శులలో నే నొకఁడను. కార్యభారము తొలఁగించుకొన నే నెంత మొదట వాంఛించినను, అందఱికంటె నెక్కువగ నేనే పరిశ్రమింపవలసివచ్చెను.

కురుపాంరాజాగారగు శ్రీ వీరభద్రరాజాగారికి ఆంతరంగిక కార్యదర్శి కావలె నని తెలిసి నే నాయుద్యోగమునకుఁ బ్రయత్నించితిని. నే నాడిసెంబరులో మాతమ్మునితో వాల్తేరు వెళ్లి, రాజావారి

వర్ణనము చేసితిని. వారి యాంతరంగిక కార్యదర్శియె చట్టనిర్మాణ సభలో సభ్యులగు రాజాగారికిఁ గావలసినపనులు, సంస్థానపుఁబనులు తదితర విధులను చేయవలెననిరి. జీతము నూటయేఁబది రూపాయలు తమతో నింగ్లండు పోవలెననియుఁ జెప్పిరి. ఇంతవఱకును విద్యాబోధకవృత్తిని ఋజుమార్గముః నుండిన నేనిపుడీ క్రొత్త యుద్యోగమునఁ జేరుట యుక్తము కాదని, మార్గమధ్యమునఁ గాకినాడలో నాయఁడుగారు మాకు నచ్చఁజెప్పిరి. కావున నేను మనసు మార్చుకొంటిని.

౧౯౧౧ జనవరినెల తుదిని గుంటూరులో "విద్యావిషయక సభలు" జరిగెను. పలుచోట్లనుండి విద్యార్థులుచేసిన వస్తువులు తెప్పించి, వానిని కళాశాలా భవనమునఁ బ్రదర్శించితిమి. సభలకుఁదగిన యేర్పాటు లన్నియుఁ జేసితిమి. రెండవ సర్కిలులోని కృష్ణ, గుంటూరు, నెల్లూరు మండలములనుండి వచ్చిన నూఱులకొలఁది బోధకులకు వసతిగృహము లేర్పాటు చేసితిమి. ప్రదర్శనమునకు వచ్చెడి యుపాధ్యాయులకు భోజనసౌకర్యమును జేయుటకు పాలకసంఘమువారు మొదట సమ్మతింపలేదు. ఇట్టి సౌకర్యము లున్నఁగాని సభ జయప్రదముగ జరుగదని ఏకారామయ్యగారు నేనును గట్టిపట్టు పట్టుటచేత, మాపంతము నెగ్గెను. కాని యీభోజనసదుపాయము గలిగించు భారము మా యిరువురిమీఁదను బడెను. రామయ్యపంతులుగారు సాహసముగలవాఁడు. గొప్పసమావేశములకుఁ దగిన యేర్పాటులు చేయుటయం దాయన సమర్థుఁడు. అంత మావిధులను మేము సక్రమముగఁ జెల్లించితిమి.

౧౯౧౧ జనవరి ౨౪ నుండి ౨౭వ తేదీవఱకును బహిరంగ సభలు, ప్రదర్శనమును జరిగెను. సమర్థులయినవారు సభలలో నుప

న్యాసకులుగను, అధ్యక్షకులుగను నుండిరి. విద్యాశాఖ డైరక్టరు స్టోను దొరగారు ప్రదర్శనము నారంభించిరి. సుబ్బారాయుడుశాస్త్రిగారు స్వాగతోపన్యాస మిచ్చిరి. "పాఠశాలలోని పని-తలిదండ్రులు" ను గూర్చి నేనొక యాంధ్రవ్యాసమును రచించి చదివితిని.

## ౧౨. చెల్లెలి మరణము

౧౯౧౧-వ సంవత్సరమున కళాశాలలో విద్యాబోధనమునకంటె నితర వ్యాసంగములే నా కెక్కువ భారమయ్యెను. విద్యావిషయక సభలనుగుఱించి యిదివఱకె ప్రస్తావించితిని. ఆ జన వరిలో సభలు ప్రదర్శనములు జరిగినేగాని, ప్రదర్శనమునకు సంబంధించిన పను లెన్నియో మిగిలియుండెను. ఆ సంవత్సరపు "ఆంధ్ర పత్రిక: ఉగాదిసంచిక"లో "ఉత్తమబోధక లక్షణము" లను గూర్చి నేనొక వ్యాసమును వ్రాసితిని. ఈశ్వరముఖముఁ జూచియు పార మార్థిక చింతతోడను, ఉపాధ్యాయ ధర్మనిర్వహణమునకుఁ గడఁగిన బోధకుఁడె బోధకుఁ డనియు, అట్టి గురుముఖమున శిష్యునికి లభించిన విద్యయే విద్యయనియును, గురువు విద్యాపారంగతుఁడు గావలె ననియు, విద్యాబోధనమువలని ముఖ్యప్రయోజనము విద్యార్థికి జ్ఞానము నకంటె నయసంపద సమకూర్చుటయే యనియు, మంచి యుపాధ్యా యుఁడు మానుషస్వభావమును గ్రహించి శిష్యుని మనఃకుసుమమునకు వికసనము గలిగించి, శ్రీ కృష్ణుఁడు అర్జునుని పట్ల మెలంగినట్లు మెలం గుననియును నేను వ్రాసితిని.

ఆ సంవత్సరము ౧౬ ఏప్రిలున, నరసాపురమున జరిగిన "కృష్ణా గుంటూరుమండల సంఘసంస్కరణసభ"కు నన్ను గ్రాసనాధిపతిగాఁ గోరు

కొనిరి. గుంటూరునుండి శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు నాతో నరసాపురము విచ్చేసిరి. జబ్బుగా నుండుటచేత కొండ వేంకటప్పయ్య గారు రాలేకపోయిరి. నే నాసమయమున నిచ్చిన యుపన్యాసము నందు, సంఘసంస్కరణములను గుఱించి మన దేశీయులకుఁ గల విపరీతాభిప్రాయములు ముందుగ విమర్శించితిని: జుట్టును బొట్టును లేకయుండుటయు, అనాచారవంతు లగుటయు, ప్రాచీనసదాచార ములను నిరసించుటయు సంఘసంస్కారిధర్మము లని కొందఱు భ్రమపడుచున్నారు! ఏ సాంఘికాచారప్రభావమున సంఘమునందు నయసంపదయు, సభ్యున్నతియు భంగ మొందెనో, ఏయాచారముల ననుసరించి హిందువులు నాగరికతయందు వెనుకఁబడిరో, అట్టిపద్ధతు లను ఆచారములనే మనము సంస్కరింపవలెను. సంస్కరించుట యనఁగా బాగుపఱచుటయే కాని పాడుచేయుట గాదు. మన దేశ మున కిప్పుడు కావలసిన సంస్కరణములు ముఖ్యముగ విద్యావిషయక ములు, వివాహవిషయకములును. జను లందఱును వ్రాయను జదువను నేర్చినఁగాని, ఏ దేశమునకును నిజమగు మేలు గలుగ నేరదు. వివాహ సంస్కరణములలో, ముందుగ నతిబాల్యవివాహములు నిషేధించి, యుక్తవయస్సు వచ్చిన యువతీయువకులకే వివాహములు జరుపవలె ననియు, దురాచారభూయిష్ఠ మని హిందూ సంఘమును విసర్జించి యన్యమతస్వీకారము చేయుట దేశభక్తుల ధర్మము గాదనియును,— నేను జెప్పితిని.

ఈ యేప్రిలుమాసాంతమున మాయమ్మమ్మ వేలివెన్నులో ననాయాసమరణ మందెను. చనిపోవునప్పటి కామెకు సుమారు ౯౦ సంవత్సరముల వయస్సు. చిరకాలజీవియగు నీ పుణ్యవతి తుదిదినముల వఱకును ఆరోగ్యభాగ్య మనుభవించెను. చివర రెండుమూఁడేండ్లు

## ౧౨. చెల్లెలి మరణము

మాత్రము మాయమ్మమ్మను అంధత్వబధిరత్వములు బాధించెను. మా తల్లి చనిపోయినపిమ్మట నీ యిల్లాలికి దుఃఖ మధికమై, ఆమెను జూచుటకు మనుమల మెవరమైన వేలివెన్ను వెళ్లినపుడు, మమ్ముఁ జేరఁబిలిచి, "నాయనా! నీవు చాలాచదువుకొన్నావు. నాకు చావే లాగున వచ్చునోచెప్పవా?" యని యాదీన యడిగి, కంట నీరుపెట్టుకొనియెడిది. శాంతమూర్తియు, సుస్వభావయునగు నీ సుదతి మనుమలమగు మమ్ము ప్రాణతుల్యులగఁ జూచుకొనియెడిది.

ఆసంవత్సరము సెప్టెంబరునెలలో మాచిన్నచెల్లెలు కామేశ్వరమ్మ పురుడుపోసికొనుటకు గుంటూరు వచ్చెను. వెనుక సన్నిపాత జ్వరము వచ్చినప్పటినుండియు కొంత చిక్కియుండినను, ఈసమయమున నామె సామాన్యారోగ్యము గలిగియేయుండెను. అక్టోబరు తుది రోజులలో కామేశ్వరమ్మకుఁ గొంచెము జ్వరమువచ్చెను. జ్వరములోనే నొప్పులు ప్రారంభమయ్యెను. ఆమె ప్రసవ మగుట దుస్తర మని తోఁచఁగనే, 30-వ తేదీ రాత్రి వైద్యురాలగు కుగ్లరు దొరసానిని బిలువఁగా, రోగి నామె తనవైద్యాలయమునకుఁ గొనిపోయెను. ఒక గంటలోనే కామేశ్వరమ్మ ప్రసవమయ్యెను. ఎన్నిసాధనములు చేసిన పిమ్మటనోగాని యపుడు జనించిన శిశు వేడువలేదు. పిల్లవానిమాట యెటు లుండినను, తల్లినిగురించి భయపడ నక్కఱలేదని దొరసాని చెప్పెను. కాని, యొకరోజులోనే పరిస్థితులు తాఱుమాఱయ్యెను. 31-వ తేదీని మధ్యాహ్నమున మాచెల్లెలికిఁ జాల జబ్బుచేసెనని మాకింటికి వర్తమానము వచ్చెను. మే మందఱమును పోయి చూచితిమి. రోగి స్పృహలేక పడియుండి, వేదనపడుచు, రాత్రి పదిగంటలకు కాలధర్మము నొందెను.

మేము దుఃఖసాగరమున మునిఁగిపోయితిమి. కొన్ని సంవత్సరములనుండి దుఃఖమును మఱచియుండిన మాకు మరల కష్టదశ సంప్రాప్తమయ్యెను. మాయందఱిలోను మిగుల చిన్నదియు, మితభాషిణియు, వినయాది సుగుణభూషితయు నగు మా చెల్లెలికి యకాల మరణము సంప్రాప్తమగునని కలనైన ననుకొన్నలేదు. ఇపుడు జనించిన పిల్లవాఁడుకాక యామెకు విశ్వనాథమను నింకొక కుమారుఁడుగలఁడు. మాతంతి నందుకొని గుంటూరువచ్చిన కామేశ్వరమ్మభర్త దహనాది కర్మలు జరిపి, పెద్దపిల్లవానినిఁ దనవెంటఁ దీసికొని, స్వగ్రామము వెడలిపోయెను. ఒకమూల మా చెల్లెలి చావునకు విలపించుచుండు మేము, ఆమె విడిచిపోయిన యర్భకునిఁ బెంచవలసివచ్చెను. పిల్లవాని ప్రాణమునుగుఱించి యాశ యంతగలేక, పుట్టిన పదిదినములవఱకును వానిని వైద్యాలయముననే యుంచి, పిమ్మట మాయింటికిఁ గొనివచ్చితిమి.

వైద్యశాలలో నున్నదినములలో పలుమాఱు శిశువు సొమ్మసిల్లుచువచ్చెను. మాయింటికిఁ గొనివచ్చినప్పుడు వాఁడు ప్రాణములేనట్టుగనుండెను. వానినిఁ బోషించుభారము మామీఁదనె పడెను. వలసినప్పుడు చనుబాలు వానికి దొరకుట దుస్తరముగ నుండెను. పగలు రాత్రులును దాదులనుబెట్టి, శిశువునకుఁ బాలిప్పించుచువచ్చితిమి.

పిల్లవాని పోషణమును గుఱించి రాత్రులు సరిగా నిద్రలేకపోవుటచే నాభార్యకు 'కామిలా' వ్యాధి సోఁకెను. ఆమె యందువలన కొన్ని దినములు కుగ్లరువైద్యాలయములో నుండవలసివచ్చెను. ఆరోజులలోనే పసివానికిని జబ్బుచేయుటవలన వానినిఁగూడ నా వైద్యశాలకే చేర్చితిమి. అంత స్వాస్థ్యముగలిగి, ఫిబ్రవరి ౧౫-వ తేదీని వారిరువురు నిలుసేరిరి. ఇంతవఱకును మాకు సాయముచేసిన పెద్ద

# ౧౨. చెల్లెలి మరణము

చెల్లెలు కనకమ్మ, తనముగ్గురు పిల్లలతో, ౨౩-వ తేదీని అత్తవారింటికి వెడలిపోయెను.

మేము పడరానిపాట్లుపడి, పిల్లవానిని పెంచుచుంటిమి. తేయుంబవల్ల పాలిచ్చుట కొక పాలదాదిని బెట్టితిమి. స్వతస్సిద్ధముగ బలహీనుఁడగు పిల్లవాఁడు, పలుమాఱు వ్యాధిపీడితుఁడగుచువచ్చెను. అందువలన మే మిరువురము నమితముగ నలజడికిఁ బాల్పడితిమి. ౧౯౧౨ ఫిబ్రవరి మార్చి నెలలలో మరల శిశువునకు జబ్బుచేయుటచే, కుగ్లరు వైద్యాలయమునకు వానిని గొనిపోయితిమి. కుగ్లరుదొరసాని వాని రోగనివారణమును గుఱించి యెంతయో శ్రమపడెను. వ్యాధి నివారణము తన కిఁక సాధ్యము కాదని యామె యొకనాఁడు చెప్పివేయఁగా, మిత్రులయాలోచనలచొప్పున నాయుర్వేదవైద్యవేత్త రాఘవాచార్యులుగారిని దీసికొనిపోయి పిల్లవానిని జూపించితిమి. వైద్యము చేయుట కాయన యొప్పుకొనఁగా, పిల్లవాని నింటికిఁ గొనివచ్చితిమి. ఆయన మంచి మందిచ్చి యొకటి రెండు దినములలోనే జ్వరమును, వమనములను గట్టించెను. ఆయుర్వేదవైద్యమునం దిట్టి సూక్ష్మప్రక్రియ లుండుటకు డాక్టరు కుగ్లరు ఆశ్చర్యమందెను. పిల్లవానికిఁ గృత్రిమాహారము లెవ్వియు సరిపడవయ్యెను, తేప తేపకును మానిసిపాలు పితికించి పోయుఁడనియును క్రొత్తవైద్యుఁడు విధించుటచేత, తేయుంబవల్ల మే మెంతయో శ్రమపడి శిశుపోషణము జరిపితిమి. అంతట పిల్లవానికి నింపాదించెను.

ఆ వేసవి సెలవులలో పిల్లవానిని జల్లగ నుండు నర్సాపురము కొనిపోవుద మను నుద్దేశముతో నేలూరునకును మేము వెళ్లి, అక్కడ మా తోడియల్లుఁడు వెంకటరత్నముగారియింట నొకటి రెండు దినములు నిలిచితిమి. ఇంతలో పిల్లవానికి మరల జబ్బుచేసెను.

ఎండ లతి తీవ్రముగ నుండుటచేతను, మంచి పాలదాది యేలూరులో కుదురుటచేతను, మేమచటనే యొక నెల యుంటిమి. పిమ్మట నరసాపురమున నొక నెల గడపి, జూను నెల తుదిని గుంటూరు వచ్చితిమి. ఒకసంవత్సరము దాటినఁగాని పిల్లవాఁడు మెడలు నిలుపనేలేదు. తెలివితేటలందుమాత్రము వాఁడు దినదినాభివృద్ధి నొందుచుండెను.

ఈ వేసవికాలమున నిడదవోలులో మహాసభ లెన్నియో కూడెను. చెల్లెలు చనిపోయినప్పటినుండియు సభలు, సమావేశములును నా కేమియు రుచింపకుండినను, సంఘసంస్కరణసభలో శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు చేసిన యాంగ్లోపన్యాసమును తెలుఁగు చేసి చెప్పితిని. సభలకు విచ్చేసిన ప్రాఁతమిత్రు లనేకులు నాకుఁ గానఁబడిరి. శ్రీయుత కొండ వెంకటప్పయ్యగారు తామిటీవల కొనిన వేటపాలెముతోఁటలో "శారదానికేతన" మను పేర నొక స్త్రీ గురుకులాశ్రమమును స్థాపించుటనుగుఱించి స్నేహితులతో నపుడు మాటాడిరి. స్త్రీవిద్యాభివృద్ధికై చాలకాలము పరిశ్రమచేసిన నేనె యీ స్త్రీసంస్థను జరుపుట యుక్తమని పలువురనిరి. ఒక సంవత్సరము గుంటూరికళాశాలలో సెలవు పుచ్చుకొని, జీతము గైకొనక యీ యువతీ విద్యాలయమును నడపుదు ననియు, అప్పటి ఫలితములను జూచి నాముందరి ప్రణాళిక నేర్పఱుచుకొందు ననియును నేను ప్రత్యుత్తర మిచ్చితిని. తోడనే యొకసారిగ నేను నాయుద్యోగమును విరమించుకొని, "శారదానికేతన" యాజమాన్యమును స్వీకరింపవలె నని నామిత్రు లనిరి. నే నట్లు చేయఁజాల నని చెప్పివేసితిని.

ఇంతలో మా కింకొకకష్టము సంప్రాప్త మయ్యెను! చనిపోయిన మాచెల్లెలి పెద్దపిల్లవాఁడు, ఆసంవత్సరము జూలై నెలలో నాకే

స్మికముగ మృతినొందెనని తెలిసెను. వీఁడు మొదటినుండియు నారోగ్యవంతుఁడె. తల్లిచనిపోయినపుడు, తండ్రి వానిని స్వగ్రామము నకుఁ గొనిపోయెను. ఇటీవల నేనచటికిఁ బోయి చూచినపుడు, వాఁడు చక్కఁగ నుండెను. వీని చావు మమ్మందఱిని దుఃఖపరవశులఁ జేసెను. ఆకష్టసమయమున మాతమ్ముఁడు, చెల్లెలును నా కిట్లు వ్రాసిరి :

౯ ఆగష్టు ౧౯౧౨, శుక్రవారము, అర్తమూరు.

“ అన్నయ్యా,

౫-వ తేదీని నీవువ్రాసిన కార్డు చూచి దుఃఖసముద్రములో మునిఁగితిని. కాని మనవంటి నిర్భాగ్యులకు విచారించుటకూడ చాల సిగ్గు. మనచెల్లెలు ధన్యురాలని యిపుడు తలంచితిని. ఇదివఱకు జరిగిన దానికి విచారించనా, దీనికి విచారించనా ? ముందుకూడ ఇట్టిబాధలే అనుభవింతుము.

“ చంటిపిల్లవాడుకూడ మనకు ఋణసంబంధమె అని తలంచెదను. అయినను మన మేమిచేయగలము ? సౌ. పెద్దవదెన నీవును చాలప్రేమచేత విధికార్యము నెరవేర్చుకొనుచున్నారు. దైవాధీనము తెలియదు....అన్నయ్యా, ధైర్యముగా ఉండు. మనకును ఇక్కడ శాశ్వతంలేదు...నీమనస్సును పాడుచేసుకోవద్దు.

పులుగుర్తు కనకమ్మ ”

నరసాపురము, ౭-౮-౧౨.

“ అన్నయ్యకు,

మనచెల్లెలు కామేశ్వరమ్మ పెద్దకుమారుడు విశ్వనాధము చనిపోయెనని తెలుపు అట్లపాడు ఉత్తరము చదువగానె, నామనసు నీరైపోయెను ! కొన్నినెలల క్రిందట నేనాగ్రామము వెళ్లినప్పుడు,

మనమేనల్లుడు నన్ను వదలనే లేదు! నాతో నర్సాపురం వచ్చెద నన్నాడు—పాపము వానితల్లి గుంటూరునుండి తిరిగి యెప్పుడో అల్లు పొడు వచ్చునను ఆశ పెట్టి, యింటిలోనివారు వానిని మరిపించుచుండిరి. ......వాడును వాని తమ్ముడును మనతోనుండి, విద్యాబుద్ధులు నేర్చి, ముందు మన కానందము కలుగజేతురను ఆశతో నుంటిమి! చిన్న పిల్లవాడు-క్షేమమా?—

రా. కృష్ణమూర్తి"

## ౧౩. కలకత్తానివాసము

"గుంటూరు విద్యావిషయక ప్రదర్శనము" ౧౯౧౧ జనవరి నెలలోనె పూర్తియయ్యెను గాని, దాని సంబంధమగు పను లెన్నియో యింకొకసంవత్సరమువఱకును సాగుచునే యుండెను. ప్రదర్శనమున కనుపఁబడిన వస్తువు లెవరివి వారికిఁ బంపవలసివచ్చెను. లెక్కలన్నియు సరిచూపించి, నివేదిక వ్రాసి, యచ్చొత్తించవలసి వచ్చెను. ఈలోపుగ కార్యదర్శులలో నిద్దఱు గుంటూరునుండి వెడలి పోవుటచేత, కార్యభార మంతయు నాశిరముననే పడెను. ఆ పను లన్నియు నేను సమగ్రముగ నెఱవేర్చి, తుది బహిరంగసభను జరిపించి, ఈయవలసినవారికి బహుమతు లిప్పించి, కార్యనిర్వాహకసంఘమువారి యనుమతి ననుసరించి మిగిలినసొమ్మును, కాకితములును పాఠశాలా పరీక్షాధికారి కార్యస్థానమున కంపివేసితిని.

౧౯౧౩-వ సంవత్సరారంభమున గుంటూరుకళాశాలోపాధ్యాయులలోఁ గొన్ని మార్పులు గలిగెను. అధిపతి కేండ్లనుండి విరామ మెఱుఁగక పనిచేసిన డాక్టరు ఊలుదొరగారు అమెరికాపోయి

వచ్చుటకు సంకల్పించుకొనిరి. వారిస్థానమున ప్రకృతిశాస్త్రోపన్యాసకులగు స్ట్రాంగుదొరగారు రక్షణ్యత్నుల్లయిరి. కళాశాల తరగతులకు స్టోలుదొరయు, నేనును ఆంగ్లసాహిత్యమును బోధించువారము. ఆయన పరదేశమునకుండుకాలమున నింగ్లీషునకు నన్ను ప్రధానోపన్యాసకునిగఁ జేయుదు రనుకొంటిని. అట్లుగాక, యీ యుద్యోగమునకుఁ దాత్కాలికముగ నొక క్రొత్తదొరను గొనివచ్చెదరని నాకుఁ దెలిసెను. ఆంగ్లసాహిత్యబోధనమున నాకెంత యనుభవ నైపుణ్యము లున్నను, యమ్. యే. పరీక్షలో నేను జయమందినఁగాని వృత్తివిషయమున నాకెక్క నభివృద్ధి గలుగదని గ్రహించి, యాపరీక్షకు దీక్షతోఁ జదువ నుద్యుక్తుఁడ నయితిని. పూర్వము విజయనగరమున నాకు శిష్యుఁడును ఇపుడు కొంతకాలమునుండి యీ గుంటూరు పాఠశాలలో బోధకుఁడునునైన భమిడిపాటి బంగారయ్య, తానును, తన స్నేహితుఁడగు మండవిల్లి సత్యనారాయణయును, ౧౯౧౩ జూలైనుండి కలకత్తా పోయి, అచట యమ్. యే. పరీక్షకుఁ జదువ నుద్దేశించితిమని చెప్పి, నన్ను కలకత్తా కాహ్వానించిరి. బి యే. పరీక్షనిచ్చినప్పటినుండియు నేను యమ్. యే. పరీక్షకుఁ బోవ వాంఛించియుంటిని. కాని బోధనాకార్యనిమగ్నుఁడనై యుండినపు డాపెద్దపరీక్షకుఁ జదివి, యందు విజయము గాంచుట దుస్సాధ్యమని తోఁచెను. కావున, నా మిత్రులును, ప్రస్తుతమున కాకినాడకళాశాలలో నుపన్యాసకులునగు శ్రీ వేమూరి రామకృష్ణారావుగారివలెనే నేనును రెండు సంవత్సరములు కళాశాలలో సెలవు పుచ్చుకొని కలకత్తా పోయి, అచటి యే కళాశాలలోనైనఁ జదివినచో, నేనును బరీక్షలో నుత్తీర్ణుఁడనై, ఉద్యోగవిషయమున మంచిలాభము నొందఁగలనని యనుకొంటిని. ఆసంవత్సరము వేసవి సెలవులకు ముందుగ కలకత్తాలో విద్య ముగించు

కొని బందరువచ్చిన రామకృష్ణారావుగారిని నేను గలసికొని మాటా డఁగా, కలకత్తాలోఁ జదువుమని నన్ను వారు ప్రోత్సహించిరి.

కాని, నిరతము వ్యాధిగ్రస్తుఁ డగు మాయర్భకుని, నా భార్యను గుంటూరులో విడిచిపెట్టి నే నెట్లు దూరదేశము పోయి చదువు సాగింపఁగలను ? ఈ రెండు వత్సరములును కలత్తాలో నుండి చదువుకొనుటకు వలసిన సొమ్మెట్లు నాకు సమకూరును ? ఈ సమస్యలు నే నిపుడు పరిష్కరించుకొనవలెను. భార్యను పిల్ల వానిని నాతో కలకత్తా యేల గొనిపోఁగూడ దని నే నంత నాలోచించితిని. అందువలన నచట నాకు వ్యయ మధిక మగుట స్పష్టమె కాని, లేనిచో నాకు భోజనసౌకర్యము గలిగి పిల్ల వానిని గూర్చిన యాందోళనము తొలఁగదు గదా! బంగాళాదేశము ఆయుర్వేదవైద్యశాస్త్రజ్ఞుల కాటపట్టు. వారి సాయమున పిల్లవాఁడు పరిపూర్ణారోగ్యవంతుఁడు కావచ్చును. ఈ కళాశాలాధికారులు నా చదువునకుఁ గొంత సొమ్మిచ్చెదమని చెప్పిరి. కావున నేనుకలకత్తా ప్రయాణమున కాయితపడితిని. పూర్వము విజయనగరమున నా శిష్యుఁడై, ఇపుడు తర్కమునందు యమ్. ఏ. పరీక్షలో జయమందిన శ్రీ జయంతి సత్యనారాయణమూర్తిగారు నాకు బదులుగ నీ కళాశాలలో నీ రెండు సంవత్సరములు పనిచేయ సమ్మతించిరి.

౧౯౧౩ వేసంగిని, కుటుంబసహితముగ నరసాపురము పోయి, అచట మా తమ్ముఁడు కృష్ణమూర్తియింట నివసించితిని. అచట నుండు నపుడు పిల్లవాఁడు బాగుగనే యుండెను. కాని, యచటనుండి బయలుదేఱు సమయమున వానికి వ్యాధి యారంభముకాఁగా మార్గ మందలి ధవళేశ్వరమున మా తోడియల్లుఁడు పోడూరి కృష్ణమూర్తి గారి యింటఁ గొన్ని దినములు నివసించి, పిల్లవానికిఁ గొంచెము నిమ్మ

ళించినపిదప గుంటూరు వచ్చితిమి. డాక్టరు కుగ్లరు పిల్లవానికి మందిచ్చి వ్యాధినివారణఁ జేసి, నేను కలకత్తాప్రయాణము విరమింప నక్కఱ లే దని చెప్పెను. కళాశాలలో నాకు రెండు సంవత్సరములు జీతము మట్టనిపద్ధతిని సెలవిచ్చిరి. మా తమ్ముఁడు వెంకటరామయ్య నా చదువునకుఁ గావలసిన సొమ్ము ఒసఁగెద ననెను. అందువలన ౧౯౧౩ జూను ౨౦-వ తేదీని నేను కలకత్తా వెడలిపోయితిని. భార్యయు, పిల్లవాఁడును మా బావమఱఁది యుద్యోగస్థలమగు హామణ్జు వెడలిపోయిరి.

నేను కలకత్తా చేరునప్పటికి నా పూర్వశిష్యులు బంగారయ్య సత్యనారాయణగార్లు, హారిసను రోడ్డున నుండు నొక మేడగది పుచ్చుకొని, నన్నచటి కాహ్వానించిరి. మేము ముగ్వుర మా గదిలో నివసించితిమి. ఆ మేడభాగమున తక్కిన గదులలోఁ గూడ నాంధ్ర యువకులె యుండిరి. వీరందఱును ఒక మోఢ్రబ్రాహ్మణునిచే మేడమీఁద వంట చేయించుకొని భుజించువారు. వీరిలో పెక్కండ్రు నా పూర్వశిష్యులె. వీ రంద ఱు నా కిపుడు సహవాసులైరి. నేను దొరతనమువారి రాజధానీ కళాశాలలోఁ జేరితిని. మా తరగతిలో నలువదిమంది విద్యార్థులు గలరు. వీరందఱిలో వయసున నేనె పెద్దవాఁడను.

ఇరువదియేండ్లు ఉపాధ్యాయునిగ నుండి నలువదియేండ్లు దాఁటిన నేను, పరదేశమున మరల పుస్తకములు చేతఁబట్టి, నాకంటెఁ జిన్నవార లగు గురువులయొద్ద శుశ్రూష చేయుటకై యనుదినమును విద్యాశాలకుఁ బోయి వచ్చుచుండుట మొదట కడు దుస్సహముగ నుండెను. దీనికిఁ దోడు మా భోజనశాలలోని భోజనము నాకంతగ సరిపడ లేదు. గోదావరిమండలమున మాఱుమూల నుండు నొక

కు గ్రామమున భార్యయుఁ, బసివాఁడును నెటు లుండిరో యని సదా డెందమున నలజడిగ నుండెడిది. కాని, పరిచితులు మిత్రులు నగు నాంధ్రులు నన్నుఁ బరివేష్టించియుండుటచేత, నే నెటులో యా మూఁడు నెలలును పరదేశమునఁ గడపి, దుర్గపూజ సెలవులకు గోదావరిజిల్లా వెడలివచ్చితిని.

ఆ దసరా సెలవులలో పాముఱ్ఱులో నివసించి, అక్టోబరు నెలలో భార్యను, పిల్లవానిని దీసికొని కొంత సామగ్రితో నేను కలకత్తా పోయిచేరితిని. బంగారయ్యయును సకుటుంబముగ నిపుడు కలకత్తా వచ్చుటచేత, మే మిరువురమును ముక్తారామబాబువీథిలో నొక చిన్న యింట బసచేసితిమి. ఈమాఱు నామనస్సునకుఁ గొంత నెమ్మది గలిగెను. వైద్యులకుఁ బిల్లవానినిఁ జూపించి, వారిచే మందు లిప్పించితిని. మాతమ్ముఁడు వెంకటరామయ్య మమ్ముఁ జూచిపోవుటకు ౧౯౧౮-వ సంవత్సరారంభమున కలకత్తావచ్చి, ఆవేసవిని భీమవరమునకు మ మ్మాహ్వానించెను.

౧౯౧౮ వేసవి మేము భీమవరమునఁ గడిపితిమి. మాతమ్ముఁ డపు డారంభించిన నూతన గృహనిర్మాణమున నే నాతనికి సాయము చేసితిని. ఒకచేతఁ బుస్తకమును, ఒకచేతఁ బిల్లవానిని దీసికొని, కనులు పనివారలమీఁద నుంచి, నే నా సెలవుదినములు గడపితిని. సెలవులు ముగియునప్పటి కిల్లు దాదాపుగఁ బూర్తియయ్యెను కాని, తుది దినములలో మాకుఁ గొంత మనశ్శాంతి తొలఁగిపోయెను. వెంకటరామయ్య మూఁడవకుమారుఁడు సూర్యనారాయణ కపుడు ఐదారేండ్ల వయస్సు. వాఁడు బాల్యచాపల్యమున నెండలో నల్లరిగఁ దిరుగుచు, కనఁబడినకాయకసరులు నములుచుండుటచేత, వాంతులు విరేచనములును వాని నమితముగ బాధించెను. వానివ్యాధినివారణము

మిగుల కష్టసాధ్యమయ్యెను. నెమ్మదిపడినపిమ్మటకూడ వాఁడతి నీరసస్థితిలోనుండెను. ఇంతలో మేము పెంచెడి యర్భకునికిని జబ్బుచేసెను. వానికిఁ గొంత నెమ్మది కలుఁగఁగనే మేము కలకత్తా ప్రయాణమైతిమి.

ఆ జూలయినెల జరిగినపిమ్మట పిల్లవానికి కలకత్తాలోఁ జాల జబ్బుచేసెను. కొన్నిదినములవఱకు వానిప్రాణములమీఁది యాస వదలుకొంటిమి. కాని, యొకకవిరాజుయొక్కయు నాకు మిత్రులైన డాక్టరుప్రాణకృష్ణాచార్యులవారియు సాయమువలన, వాని కారోగ్యము కలిగెను.

ఆ సంవత్సరము దుర్గపూజ సెలవులలో మేము మువ్వురము కాశి, గయ, ప్రయాగక్షేత్రములు సందర్శించి వచ్చితిమి. గయలో కర్మకాండ ముగించి, బుద్ధగయ చూచితిమి. బుద్ధభగవానుఁడు తపస్సు చేసికొనిన మఱ్ఱిచెట్టునీడనె యానాఁడు నాచదువును, మాపిల్లవాని సాపాటును జరిగెను. బౌద్ధదేవాలయము హిందూధర్మకర్తల పరిపాలనమందుండుటయు, దేవళముచుట్టును హిందూవిగ్రహాదులు వెలయుటయు నాకమితాశ్చర్యమును గొలిపెను. అచ్చటినుండి మేము కాశివెళ్లి యొకవారము నిలిచితిమి. ఒక మణికర్ణికాఘట్టమునొద్ద స్నానముతోనే నేను సంతృప్తుఁడనైతిని. పుణ్యక్షేత్ర సందర్శనమునకంటె నాకు పరీక్షావిజయమె మోక్షదాయకముగఁ దోఁచెను! కలకత్తాలోకంటె కాశిలో నా కెక్కువగ దక్షిణదేశపుఁ బోలికలు గానవచ్చెను. ఇచట దాక్షిణాత్యు లనేకులు గలరు. ఒకనాఁడు మేము వ్యాసకాశి పోయి, రాజుగారిభవనమును జూచివచ్చితిమి. దీని కేమి గాని, కాశిలో కోఁతులబాధ యమితముగఁ గానవచ్చెను. అచట నరులమీఁద వానరులె యధికారము చెల్లించున ట్లగపడెను. ఒక

నాఁడు మేడ డాబామీఁద నేను గూర్చుండి చదువుకొనుచుండఁగా, భార్య నాచెంత నెండవేసిన చీరను కోఁతియొకటి మెల్లగఁ బట్టుకొని పాఱిపోయెను. తనకు లాభములేని పనులలోఁ బ్రసక్తి ప్రమోదములు గలిపించుకొనుట యనుదుర్గుణము, నరునిఁజూచి వానరముగ్రహించెనా, వానరమునుండి నరునికి సంక్రమించెనా యని నే నాశ్చర్యమందితిని!

కాశినుండి మేము ప్రయాగ వెళ్లితిమి. గంగాయమునా సంగమ ప్రదేశ మత్యంత రమణీయముగ నుండెను. అచట మిగుల పెద్ద తాఁబేళ్లను జూచి యాశ్చర్య మందితిమి. ఆ పురమందలి యాంధ్రప్రముఖు లగు శ్రీ చింతామణిగారి నొకనాఁడు సందర్శించి వచ్చితిని. వారు నాకు మద్రాసులో పరిచితులు. తమిళులు మున్నగు పొరుగు జనులతో నాంధ్రులు పోటీచేసి గౌరవస్థానము గడించుట కర్తవ్య మని వారు చెప్పిరి. మే మంతట గృహోన్ముఖుల మైతిమి. దీపావళినాఁడు మేము తిరుగుపయనము చేసితిమి. రాత్రి యంతయు పంజాబుమెయిలు వాయువేగమునఁ బరుగులెత్తెను. దారిపొడుగునను దీపములచే నలంకృతముగాని రెయిలు స్టేషనుగాని, పట్టణపక్కణములు గాని మాకుఁ గానుపింపలేదు. దీపావళి హిందూజాతికంతకును ప్రధానమైన పండుగయని మా కానాఁడు దృగ్గోచర మయ్యెను!

౧౯౧౨ ఫిబ్రవరిమాసాంతమునకె నా కళాశాల చదువు సంపూర్తి యయ్యెను. సకుటుంబముగ నే నంత గుంటూరువచ్చివేసితిని. నా పుస్తకములు సామానులును వేసియుంచు కొట్టు తాళము తీసి చూడఁగా, ఒక బీరువా చదలు పట్టిపోయెను. విలువగల నా వెనుకటి రచనముల వ్రాఁతప్రతులు, పత్రికా సంపుటములు కొన్నియును చదపురుగుల కాహార మయ్యెను.

తాత్కాలికముగ మే మొక యింటిభాగమునఁ గాఁపురముంటిమి. నేను కళాశాల చేరి నా పనులు చూచుకొనుచువచ్చితిని. వేసవి సెలవు లీయఁగనె మేము వెలిచేరు వెళ్లితిమి. అచట మా యత్త మామలు, బావమఱఁది కుటుంబమువారు నుండిరి. మా బావమఱఁది పెద్దకొమార్తె చంద్రమతిని మామఱఁదలు చామాలమ్మ కుమారుఁడు కృష్ణారావునకుఁ బెండ్లిచేయ నిశ్చయ మయ్యెను. ఆలగ్నమునకే మా తమ్ముఁడు కృష్ణమూర్తి పెద్ద కొమార్తె సీతమ్మవివాహముకూడ జరుగ వలసియుండెను. నే నీ పెండ్లి వేడుకలలోఁ బడిపోయితినేని, నా చదువు వెనుకఁబడునని భయపడి, జూను నెల తుదినే నేనొక్కఁడను కలకత్తా వెడలిపోయి, అక్కడ ద్రావిడ భోజనశాలాధికారి శ్రీనివాస అయ్యరున కతిథినై, ఆదాత యిడిన గదిలోఁ జదువు సాగించితిని. మిత్రుఁడు బంగారయ్య చెంతయింట సకుటుంబముగ నుండెను. నే నతి దీక్షతోఁ జదివి, పరీక్ష కేగితిని. పరీక్ష పూర్తియైనతోడనే నేను గుంటూరు వచ్చి కళాశాలలో ప్రవేశించితిని.

## ౧౪. "చన్నపురి చక్షువులకు బంగాళాపద్ధతులు"

నేను కలకత్తాలో నుండినకాలమున నాకు "మద్రాసు స్టాండర్డు" దినపత్రిక వచ్చుచునేయుండెను. అక్కడ విద్యార్థిగ నుండి ప్రాఁతవడిన కలకత్తావార్తల నంపుటకంటె, చెన్నపురి రాజధాని వాఁడనగు నాకన్నుల కచట నగఁబడిన వింతలు వ్రాయుట సమంజసముగఁ దోఁచి, "చన్నపురి చక్షువులకు బంగాళాపద్ధతులు" అను శీర్షికతో నప్పుడప్పుడు వినోదకరములగు సంగతులు వ్రాయుచుండువాఁడను. ఈమకుటముక్రింద వ్రాసిన వ్యాసములలో, "మాతృభాషా ప్రయోగము" అనునది మొదటిది కాకపోయినను, మొదటివాని

లోనిది. అది నేను కలకత్తా చేరిన కొలఁదిదినములకే వ్రాసితిని. చెన్న రాజధానిలో సామాన్యముగ నే బహిరంగసభ జరిగినను, ఆంగ్ల భాష లోనే చర్యయు ప్రసంగములు జరుగుననియు, బంగాళములో నట్లు గాక బంగాళా భాషలోనే కార్యక్రమమంతయు నడచుననియును, నేను వ్రాసితిని. అన్యదేశీయుఁడవగు నీవు బంగాళములో నేసభకైనఁ జనినచో, గంటలకొలఁది నీ కొక ముక్కయైనను దెలియని బంగాళ భాషలోనే యుపన్యాసములు జరుగుచుండుటఁ గాంతువు. నీ వెఱిఁగిన యింగ్లీషుమాట లేమైన వినవచ్చునేమో యని నీ వాసక్తితో నాల కింతువుగాని, ప్రసంగములన్నియు శుద్ధ దేశభాషలోనే సాగిపోవును ! మన తెలుఁగు దేశమునవలె నింగ్లీషుపదములు వారి మాతృభాషా ప్రసంగ ముల మధ్యనుండి దొరలుచుండవు. ఇంక విద్యార్థులు విద్యాధికులును, తమయింట మాటాడుకొనునపుడు దేశభాషనే వాడుదురు. ఉత్తర ప్రత్యుత్తరములన్నియు బంగాళా భాషలోనే నడుచుచుండును. ఒక వేళ వారొక యాంగ్లపదమే యుపయోగింపవలసివచ్చినచో, దాని కెంతో నేర్పుతో బంగాళీప్రత్యయముచేర్చి, తాము సృష్టించిన నూతన పదమును వాడెదరు. అచట నాంగ్లవిద్యనేర్చిన విద్యాధికులు, గంటల కొలఁది తమ యుపన్యాసములందు సామాన్యముగ సంకరమేమియు లేని బంగాళీపదములె ప్రయోగించి, తమ భాషాభిమానమును నిలువఁ బెట్టుకొనుచున్నారు. కావుననె హిందూదేశభాషలలోనెల్ల బంగాళీ భాషలోనె మంచి నవీన సాహిత్యగ్రంథములు గానవచ్చుచున్నవి.

౧౯౧౩ సెప్టెంబరు ౨౬-వ తేదీ పత్రికలో నేను "ప్రకటన" లను గుఱించి వ్రాసితిని. ఏ జాతియొక్క స్వభావమైనను, పెద్ద సంగతులలోనెగాక చిన్నవానియందును ప్రకటీకృతమగుచుండును. నాగరక ప్రపంచమునకు ప్రకటనము ప్రాణసదృశము. పత్రికలు పుస్తక

ములు బహిరంగప్రసంగములును వెలువరింపని యేజాతిరహస్య లక్షణములుగాని ప్రకటనములవలన బహిర్గత మగుచుండును! బంగాళావారి ప్రకటనలకుఁగొన్ని మచ్చులిచ్చెదను: కలకత్తా వీధులలో నడచిపోయెడి నీకన్నుల కొకసందులో, "రాధా పుస్తకాగారము", "వినయ విద్యా సంస్థ" అనుగది ముందలి బల్లలమీఁది యక్షరములు గోచరమగును. ఈ పుస్తకాలయ రహస్య మేమియో తెలియునా? అది వట్టి పుస్తకముల యంగడియె! ఆ విద్యాసంస్థ యొకచిన్నపాఠశాలయె! ఇంక వివాహప్రకటనములు విశేషముగ నుండును. పంజాబుదేశీయునిగాని, బీహారు వానినిఁగాని పరిణయ మగుటకు బంగాళావనిత యొర్తు కావలయును. ఆమె కులగోత్రములతోడి ప్రసక్తియె లేదు. ఒక వర్తకసంఘమువారి సరకుల విక్రయమును ప్రోత్సహింప నొక యాంగ్ల సుందరి కావలయును! ఇంకొక యంగడికి జవ్వనియు లావణ్యవతియు నగు స్త్రీ యుద్యోగి కావలయును! సరకుల నాణెమును జూచికాదు కాతాదారులు వచ్చుట, సుందరుల వదనబింబముల నవలోకించుటకె!

౨౫ - అక్టోబరున వ్రాసిన వ్యాసమున "బంగాళా బాబూ" లను గుఱించి ప్రసంగించితిని. దాక్షిణాత్యులకు, "బాబూ" అను పదమునకుఁ గల యర్థము పూర్తిగ గ్రాహ్యము గాదు. అఱవ వారిలో 'అయ్యరు' 'అయ్యంగారి' వలెను, తెలుఁగువారిలో 'పంతులు' 'శాస్త్రులు' వలెను, 'బాబూ' అనునది గౌరవవాచకపదము. కాని, యిట్టి మన ద్రావిడపదముల కేదో యొక జాతిమతములు గల పురుషుఁ డని యర్థము. 'బాబూ' అనునది యట్లుగాక, బంగాళీయుల కందఱికి ననువర్తించు గౌరవపదము 'గారు', 'అవర్గలు' అనునవి పదాంతములందుండు గౌరవార్థసూచకమగు వర్ణములె గాని, 'బాబూ' వలె ప్రత్యేకపదములు గావు. ఇంక, వేషములో,

దక్షిణాదివారికిని బంగాళావారికిని జాల భేదము గలదు. దక్షిణదేశమునఁ బురుషులకు సామాన్యముగ జుట్టు బొట్టు లుండును. బంగాళా పురుషులలోమాత్ర మీ రెండు చిహ్నములును లోపించియుండును. దీనికిఁ గారణముగ నిచటివా రొక గాథ చెప్పుదురు. పూర్వ మొక మహమ్మదీయ ప్రభువు జుట్టుబొట్టులు గల హిందువులకు పన్ను గట్టఁగా, అవి రెండును దీసివైచి, జను లీ పన్నునుండి సులభముగఁ దప్పించుకొనిరఁట! కాళ్లకు బూట్సుజోడు, నిడుపగుదోవతి, కమ్మీజు, గడ్డము, కత్తిరింపు జుట్టు, ఇవియె బంగాళా బాబుయొక్క 'ముస్తాబు'!

౧౯౧౮ ఫిబ్రవరి ౨౭-వ తేదీని నేను "బంగాళీపడతి" నిట్లు చిత్రించితిని. స్త్రీచక్షువులు స్త్రీ సౌందర్యమును బాగుగఁ బరిశీలించి విమర్శింపఁగలవు. నవభారత యువకుల హృదయములు చూఱకొను మహాసౌందర్యరాశి బంగాళీకామినియె యని నేఁ జెప్ప సాహసించువాఁడనుకాను. ఇతర రాష్ట్రీయాంగనలవలెనే బంగాళీ సుందరియు నుండును. రాణివాసమువలన బంగాళీ కన్యక యించుక పాలిపోయినట్టుగఁగూడఁ గానవచ్చును. ఈసుందరాంగులకుఁగల తనుకాంతి, కనులతీరు, వదనలావణ్యమును, కావేరీ గోదావరీనదీతీరముల కమలాక్షులయందును, మలయాళపు మచ్చెకంటులయందును గానవగును. ఇట్లయ్యును, బంగాళీయువతులందు, తక్కిన వనితలయందుఁ గానరాని కొంత వింత సౌకుమార్యము గానఁబడియెడిని. జ్ఞానాధికత, భావసంపద, ధారణాశక్తులతోఁ గూడుకొనిన సౌందర్య మామెది. బంగాళీయువతి లావణ్యమంతయు జ్ఞానసంబంధమగునదియె. వట్టి శరీర సౌకుమార్యమున చెన్నపురి చెలులామెను మించిన మించవచ్చును.

## ౧౪. "చెన్నపురి చక్షువులకు బంగాళాపద్ధతులు"

తన యున్నతవిద్యకుఁ దోడుగ బంగాళీకన్య, దేహసౌందర్యము నభివృద్ధి పొందించు రహస్యముల నెఱింగియున్నది. కురులు దిద్దుకొనుట యందు బంగాళీసుందరి యసమాన. దక్షిణాదితరుణులవలెఁగాక యిచటి పూఁబోఁణులు కేశములు వెనుకకు దువ్వుకొందురు. కొందఱి శిరోజములు వెనుకకు వ్రేలాడుచుండును. కొందఱికొప్పుల నిత్తడిదువ్వెన గూర్పఁబడి, కనకపుఁ గిరీటమువలెఁ గాంతి లీనుచుండును. మద్రాసు మగువలకంటె నిచటి సుదతులు సౌందర్యరహస్యమును బాగుగ గుర్తెఱిఁగిరనుట కొకగుర్తు, వీరంతగ నొడలిమీఁదను, కొప్పులోను నగ లలంకరించుకొనకపోవుటయె. ఇచట ప్రాచీనాచారము లనుసరింపని సుందరులు సామాన్యముగ నుదుట కాశ్మీరతిలక మిడరు. కొందఱి మేలిముసుఁగునఁ గొన్ని చిన్ని యాభరణములు మెఱయుచుండును.

పూర్వాచారపరాయణయగు బంగాళీభామిని బట్టకట్టు అంత బాగుగనుండదు. ఆమె ధరించు చిన్నచీరలోఁ జాలభాగము మేలిముసుఁగునకె సరిపోవుటచేత, శరీరమునకు మంచి మఱుఁగు గలుగకున్నది. ఇంక రవిక లేనె లేదు. కాని, నవనాగరకతచేఁ జెన్నొందు వంగవనితలు వన్నెవన్నెలవలువ లలంకరించుకొందురు. మద్రాసు ప్రాంతములందలి గొప్పయింటి క్రైస్తవకాంతలు వేసికొనునట్లు వీరు దుస్తులు ధరింతురు. కాని, యచ్చటి చానలకు చీరల సొగసు బాగుగఁ దెలిసియున్నది కాన, విదేశపు లంగాలకుఁగల వికృతరూపమును వీరు చక్కఁగ సరచి, మఱి వానిని గుట్టుచున్నారు. రంగు గుడ్డలు, మజ్లిను పట్టువస్త్రములును వీరు ఉపయోగింతురు. తమ చీర కొనలకు చిన్నసగలు సింగారించుకొందురు.

౧౯౧౪-వ సంవత్సరారంభమున కలకత్తా నగరమున జరిగిన బ్రాహ్మసమాజమువారి వివిధశాఖల మాఘోత్సవ వార్షికసభలు నేను

సందర్శించితిని. ఆదిబ్రాహ్మసమాజమువారి పెద్ద సభకు కుటుంబ సహితముగ నేను బోయితిని. ఆ సమయమున శ్రీ రవీంద్రనాథ తాకూరు కవి గొప్ప ప్రసంగము చేసెను. వారి సోదరు లిరువురును గూడ నా సభలో పాల్గొనిరి. నేను ఆ ఫిబ్రవరి ౬-౧౭-వ తేదీల స్టాండర్డు పత్రికలలో, "బ్రాహ్మసమాజము" ను గుఱించిన వ్యాస ములు వ్రాసితిని. బంగాళీయములో బ్రాహ్మసమాజము మూఁడుశాఖలై యున్నది. "ఆది బ్రాహ్మసమాజము" న కిప్పుడు తాగూరువంశము వారె పట్టుఁగొమ్మ! మహర్షి దేవేంద్రనాథతాగూరుగారును, వారి తనయులును బ్రాహ్మసమాజము నుద్ధరించిన మహనీయులు. తాగూరు వంశము ప్రతిభాశాలుల వంశము. బ్రాహ్మసమాజస్థాపకు లగు రాజారామమోహనరాయల పిమ్మట, ఆసమాజమును భరతదేశ మునఁ బునరుద్ధరించినవారు దేవేంద్రనాథతాగూరుగారు. తమ యపార దైవభక్తిప్రభావమువలన వీరు 'మహర్షి' యను గౌరవ నామ మును గాంచిరి. వీరి కుమారరత్నమె ప్రస్తుతమున భారతదేశ కవి సార్వభౌము లగు రవీంద్రనాథ తాగూరుగారు. కవులు లేని మత సంస్థ యభ్యున్నతి గాంచనేరదు. భారత కవిపుంగవు లగు రవీం ద్రుఁడు బ్రాహ్మసమాజకవియె. వీరి సోదరులగు ద్విజేంద్ర సత్యేంద్ర నాథులును మహిమాన్వితులె.

బ్రాహ్మసమాజస్థాపకులలో మూఁడవవాఁడగు కేశవచంద్రసేనుల వారు బ్రాహ్మమతమునకు సాంఘికత్వమును నెలకొల్పి, బ్రాహ్మ సమాజము నొక సంఘముగ స్థాపించినవారు. వీరు తమ గురువులగు దేవేంద్రనాథునుండి చీలిపోయి, "నవవిధాన సమాజము" నేర్పఱచిరి. ఈ సమాజములో నుండు కేశవచంద్రుని సహచరులు భగవద్ధ్యాన పరాయణు లని పేరు వడసిరి.

# ౧౮. "చెన్నపురి చక్షువులకు బంగాళాపద్ధతులు"

మూఁడవ శాఖ యగు "సాధారణ బ్రాహ్మసమాజము" నకు పండిత శివనాథ శాస్త్రిగారును, వారి యనుచరులును స్థాపకులు. "ఆదిబ్రాహ్మసమాజము" ప్రాచీన సంప్రదాయములకును, "నవవిధానసమాజము" భావవైశాల్యమునకును ప్రఖ్యాతినొందెను. తక్కిన రెండు శాఖలకంటెను, ఈశాఖ యధిక సంఖ్యాకు లగు సభ్యులతో నలరారుచున్నది.

నేనంతట బ్రాహ్మసమాజమువారి మాఘోత్సవములను దర్శించితిని. శాక్తేయ చైతన్యవైష్ణవమతములలోనుండి బంగాళములో ప్రభవించిన బ్రాహ్మమతమునకు, ప్రాచీనమతములలో నుత్తమధర్మములంతట సంక్రమింపఁగా, దేశారిష్టకములగు విగ్రహారాధన, జాతివిభేదములు, రాణివాసము మున్నగు నాచారములతో నది పోరుసాగించెను. కాని, బ్రాహ్మమతము సాధించిన మేలంతయు బ్రాహ్మసమాజము వారె యనుభవించుచుండుటలేదు. ఆ సమాజములోకంటె వెలుపలనే యెక్కువమంది బ్రాహ్మమతస్థులు గల రనవచ్చును. హిందూమతము నచ్చకుండెడి వందలకొలఁది యువకులకు, ప్రతియాదివారమును జరుగు బ్రాహ్మసమాజారాధనయె యాదరువగుచున్నది. సాంఘిక విషయములందుఁగూడ బ్రాహ్మసమాజము జనుల కాదర్శమయ్యెను. కాని, యిది కారణముగ బ్రాహ్మమతస్థుఁడు విఱ్ఱవీఁగుటలేదు. ఆతనిలోపము లాతనికి బాగుగ గ్రాహ్యమె. ఏమికారణముననో కాని, ప్రస్తుతమున సమాజమందలి యువకుల కనేకులకు బ్రాహ్మమతమం దంతగ నభిమానము లేకున్నది. ఇదిగాక, బ్రాహ్మమతమునకు మాతృమతమునందంతగ భక్తిలేనట్టుగ నున్నది. ఇదివఱకే శాఖలక్రిందను, జాతుల క్రిందను చీలిపోయిన హిందూసంఘమున కీక్రొత్తశాఖయగు బ్రాహ్మసమాజమువలనఁగూడ చెడుగురాదని యెవరు చెప్పఁగలరు? భోజనాది

యాచారములందు బ్రాహ్మసమాజమువారేతిన్నని త్రోవత్రొక్కి, దేశోద్ధరణమునకుఁ దోడుపడిరి? పూర్వమందు బౌద్ధమతమువలె ప్రస్తుతమున బ్రాహ్మమతము జంతుహింసనరికట్టనేల ప్రయత్నింపరాదు?

నేను కలకత్తా కాలేజీవీధి చౌకునందు షికారుచేయునప్పుడు, నాకుఁ బరిచితులగు బ్రాహ్మసమాజమిత్రులు కొందఱు సామాన్యముగ నగపడుచుండువారు. వీరిలో "అభినవపత్రికా" ధిపతులగు రామానంద చాటర్జీగారొకరు. వీరు మద్రాసు స్టాండర్డుపత్రిక చదువుచుండువారు కావున, అందలి "చన్నపురి చక్షువులకు బంగాళాపద్ధతులు" అను వ్యాసములు వ్రాయువా రెవరో తెలియునా యని యప్పుడపుడు నన్నడుగుచువచ్చిరి. ఉపవిలేఖకుల గుట్టు బయలుపెట్టుట వట్టి యలౌకికకృత్యము గాన, నిజము చెప్పుటకును, అనృతమాడుటకును వలనుపడక, నేను, "ఆరచయిత మోముచూడ నాకును గుతూహలమె" అని పలికి, తప్పించుకొనువాఁడను. ఈ మద్రాసురచయిత, బంగాళాజనుల సమాచారములు బాగుగఁదెలియక, వైరభావమున వారల నెగితాళి చేయుచుండెనని చాటర్జీగా రనుచుండువారు. "బ్రాహ్మసమాజము" ను గూర్చిన నా మొదటి వ్యాసములు చదివిన యాయన యొకనాఁడు, "ఈ వ్రాఁతకాఁడు తప్పక బ్రాహ్మసామాజికుఁడె!" యని నాతోఁ జెప్పినను, అందునుగూర్చిన తక్కిన వ్యాసములు చదివి, "ఈ సాహసికుఁడు బ్రాహ్మసమాజములోఁగూడ నేరములు వెదకుచున్నాఁడె!" అని మొఱపెట్టెను!

## ౧౫. సభలు, సమావేశములు.

నేను కలకత్తాలో నిటీవల పరీక్షకుఁ జదువుచుండునపుడు, మా పిల్లవానికి వెలిచేరులో జబ్బు చేసె నని నాకు జాబు వచ్చి, మిక్కిలి

యాందోళన మందితిని. నెమ్మది పడుచుండె నని తెలియుటచేతఁ
గొంత యూరడిల్లి, యెటులో పరీక్షకుఁ బోయితిని. పరీక్షానంతర
మున నేను సరాసరిని గుంటూరున కేతెంచిన కొన్ని దినములకు, పిల్ల
వానిని దీసికొని నాభార్య వచ్చెను. వాండ్రను గలసికొనుటకు నేను
రెయిలునొద్దకుఁ బోయి, పెట్టెలోని కెక్కి చూడఁగా, పిల్లవాఁడు
నన్నానవాలుపట్టి, "నీవు అన్నవు. నాతో చెప్పకుండా తాతత్తా
(కలకత్తా) వెళ్లిపోయావా? అని నామీఁద నిష్ఠురపడెను! పోల్చ
లేనిరీతిని బలహీనుఁ డయ్యెను. వెలిచేరులో నుండునపుడు, వానికి
మరల దేహము పొంగి జ్వరమువచ్చెను. అప్పటినుండియు వానికప్పుడ
ప్పుడు ఉష్ణము తగులుచుండుటవలన, మధ్యఁ గలిగెడికొంచెము సత్తు
వయుఁ బోవుచుండెడిది! ఆతని బ్రదుకంతయు వ్యాధితోడి పెద్ద
పోరాటము!

సెప్టెంబరు నెలలో నాపరీక్షాఫలితము తెలిసెను. నేను కృతా
ర్థుఁడ నైతి నని మిత్రులు తంతు లంపిరి. స్నేహితులు బంగారయ్య
సత్యనారాయణగార్లును జయమందిరి. బంగారయ్య యమ్. యె
పరీక్షలో కలకత్తా విశ్వవిద్యాలయమున నాంగ్లమున మొదటితర
గతిలో మొదటివాఁడుగ నుత్తీర్ణుఁ డయ్యె నని విని సంతోషించితిని.
సత్యనారాయణయు నేనును మూఁడవతరగతిలో జయమందితిమి. ఆ
తరగతిలో నాకు లభించినస్థాన మధికమైనదియె. వయసు మీఱిన
పిదప, దూరదేశముపోయి, వ్యయప్రయాసలకు లోనై, తుదకు పరా
జయ మందిన యపకీర్తిపాలుగాక, ఏదోరీతిని గెలుపొందుటకె నేను
సంతోషించితిని! నా నూటయేఁబది రూపాయిల లోపుజీత మిపు
డొక్కమాఱుగ రెండువంద లగుటయేకాక, సంవత్సరమునకుఁ బది
రూపాయిల వృద్ధితో దాని పరిమితి మున్నూఱు రూపాయిలని

యిప్పుడు నిర్మిత మయ్యెను. కళాశాలలో నన్నాంగ్ల శాఖకు ముఖ్యో పన్యాసకునిగను, నా బదలీదారగు సత్యనారాయణమూర్తిగారిని తర్కశాస్త్రోపన్యాసకునిగను జేసిరి.

౧౯౧౫-వ సంవత్సరము తుదిభాగమున మేము క్రొత్తపేట వదలి, అరండలుపేటలో న్యాపతి హనుమంతరావుగారి చిన్నయింటఁ బ్రవేశించితిమి. ఈ పేటలోని యిండ్లు విశాలస్థలములందు దూర దూరముగఁ గట్టఁబడుటచేత మిగుల వాసయోగ్యముగ నుండెను. హనుమంతరావుగారు నాకుఁ జిరపరిచితులగు సాధుపురుషులు. వారి యింటి దాపుననే కొండ వెంకటప్పయ్యగారు బస చేసియుండిరి. చాల కాలమునుండి నాకు వీరును స్నేహితులె. మేము ముప్పూరము తఱచుగఁ గలసికొని మాటాడుకొనుచుండువారము. ౧౯౧౩-వ సంవత్సరమునుండి యు వెంకటప్పయ్యగారు చాల రాబడి గల తమ న్యాయవాదివృత్తిని వదలివైచి, దేశసేవాపరాయణు లయిరి. హనుమంతరావుగారు న్యాయవాది యుద్యోగము విరమింపకున్నను, దేశహితైకకార్యనిమగ్నులై యుండిరి. వారిపుడు గుంటూరు పురపాలక సంఘాధ్యక్షులుగ నుండి, తమవృత్తియందుకంటె పరోపకారకార్యములందె యెక్కువ శ్రద్ధ వహించియుండిరి.

స్త్రీవిద్యాభివృద్ధికై ప్రత్యేకపాఠశాల యొకటి నెలకొల్ప వలెనని కొంతకాలమునుండి వెంకటప్పయ్యగారు మిత్రులు నేనును ఆలోచించుచుంటిమి. కొన్నివత్సరముల క్రిందటనే గోమనుకెతోలిక మతసంఘమువారు వేటపాలెము విడువనెంచి, అందలి తమతోఁటయు భవనములను అమ్మఁజూపఁగా, వెంకటప్పయ్యగారవి చౌకగాఁ గొనిరి. ఇపుడీవేటపాలెపుతోఁటలో "శారదా నికేతనము" అను పేరుతో మహిళావిద్యాలయ మొకటి స్థాపింప సంకల్పుగా రుప్ప

మించిరి. ఆగృహములను దమవశముచేసినచో, తమసంఘమువారు వానియందు ఆదర్శప్రాయమగు నొక స్త్రీపాఠశాల నెలకొల్పెదరని పెన్నెంటుకన్యయు, ఆమె యేర్పఱిచిన "హిందూవివాహ సంస్కరణసంఘము" వారును అభిప్రాయపడిరి. ఇది నాకు రుచింపలేదు. వెంకటప్పయ్యగారు నాతో నేకీభవించిరి. ఆగృహములందొక యువతీ గురుకులము స్థాపించి జరుపుభారము వెంకటప్పయ్యగారె వహించుట కర్తవ్యమని మిత్రు లభిప్రాయపడిరి.

బెజవాడ ప్రార్థనసమాజమువారికిఁ గొంతస్థలము నీయుఁడని "రామమోహనపుస్తకాగార" స్థాపకులలో నొకరును, బెజవాడలో నాపూర్వశిష్యులునగు పాటిబండ సుబ్రహ్మణ్యముగారు భాండాగారసమాజమువారి నడిగిరి. ప్రార్థనసమాజోపయోగార్థమై కొంత స్థలము ప్రత్యేకించుట న్యాయ్యమని నేనును జెప్పితిని. అంతఁ గొంత స్థలము ప్రార్థనసమాజమున కొసఁగఁబడెను. దీనినిగుఱించి ధర్మకర్త సుబ్రహ్మణ్యముగారు దస్తావేజు వ్రాసియిచ్చిరి.

ఇపుడు "గుంటూరు ప్రార్థన సమాజము"నకుఁ గూడ నొకమందిర మేర్పాటుచేయుటకై నాప్రోత్సాహమునఁ బ్రయత్నములు సాగెను. మద్ది రాధాకృష్ణయ్యగారు కొంత విరాళ మొసంగెద మనిరి. నేనును పెద్ద మొత్తమీయ నెంచితిని. గతవత్సరమున కలకత్తాలో సాధారణ బ్రాహ్మసమాజసాధనాశ్రమమున సకుటుంబముగ నివసించి మత విద్య నేర్చిన గుంటూరుమండల వాస్తవ్యులు పాలపర్తి నరసింహముగారిపుడు గుంటూరు తిరిగి వచ్చిరి. వారిని గుంటూరు ప్రార్థనసమాజ ప్రచారకునిగ నియమించి, వారిపోషణమునకుఁ జందాలు వేసికొని కొంత గౌరవవేతన మీయ మేమేర్పాటు చేసితిమి.

౧౯౧౭ మార్చి నెలలో అరండలుపేట మునిసిపలు ఎన్నికలలో వెంకటప్పయ్యగారిని అభ్యర్థిగ నిలువుఁడని మిత్రులు కోరఁగా, వారు సమ్మతించిరి. ఆ యుద్యోగ మాయనకు లభించుటకై మిత్రులము పని చేసితిమి. మార్చి తుదిని జరిగిన యెన్నికలలో వెంకటప్పయ్యగారు సభ్యులైరి.

ఏప్రిలు నెల ౨-వ తేదీని "యువజన సాహితీసంఘము" వారి యాజమాన్యమున పురపాఠశాలలో నొక బహిరంగసభ జరిగెను. అపుడె బారిష్టరు పరీక్షనిచ్చి స్వదేశము తిరిగివచ్చిన శ్రీ ఉన్నవ లక్ష్మీ నారాయణగారు సభ కగ్రాసనాధిపులు. నేను "బంగాళావారి యాచారములను" గురించి యాంధ్రమున నొక యుపన్యాస మిచ్చితిని. ఆంధ్రులకును బంగాళీయులకును గల తారతమ్యములు హాస్యరస యుక్తముగ నే నిట్లు వర్ణించి చెప్పితిని:— తెలుఁగువారల రుచులలో పులుసు కారములు ప్రధానములు. బంగాళావారికి తీపి ప్రియము. ఆంధ్రుఁ డనుదినము తిను మిరెపుకాయలు చింతపండును బంగాళీయునికి మాసమునకైన నక్కఱలేదు! వారు నేయి వేసికొనరు. అగ్రవర్ణములవారును మత్స్యభుక్కులె. నే నొకసారి కొందఱు తెలుఁగునేస్తులతోఁగలసి యొక బంగాళావారియింట విందు గుడిచితిని. అందఱు ముగించునప్పటికైన నా భోజనప్రారంభము కాలేదు. విస్తరిలో నుండు వస్తువు లెవ్వియు నా నోటికిఁ బోకుండెను. మనకు వెలగపండు ప్రియము, బంగాళీయులకు మారెడిపండు. వారికిఁ బ్రీతి వేఁప, మనకు కటివేఁప. గుమ్మడికాయ మనము వండుకొందుము, వారు దాని తీగ కూర చేసికొందురు. శుక్లపక్షముతో తెలుఁగువారికిని, కృష్ణపక్షముతో బంగాళీయులకును మాసారంభ మగుచున్నది. మనపాఠశాలలలో నున్నత మగు తరగతి యాఱవది; వారి దేశమున పెద్దది మొదటి

తరగతి. పెద్దవస్త్రములను ధరించువారు తెలుఁగువారలలో నాఁడు వారును, బంగాళావారిలో మగవారును. అక్కడ పుణ్యాంగనలు రంగుచీరలె ధరింతురు. తెల్లని కోకలు గట్టువా రా దేశమున వెల యాండ్రు. కాని, మనకును వారికిని సామాన్యగుణములును లేక పోలేదు. హిందూశాస్త్రపద్ధతులు, సంప్రదాయములును హిందువు లందఱికిని ముఖ్యములే.

గుంటూరిలో డిప్యూటి కలక్టరుపదవి నందిన శ్రీ జయంతి రామయ్యపంతులుగారి ప్రోత్సాహమున మే మిపు డానగరమున “ఆంధ్రసాహిత్యపరిషత్తు” సభ జరుపఁదలంచితిమి. ౧౮-వ మార్చిని నా యధ్యక్షతక్రింద జరిగిన బహిరంగసభలో, సమ్మానసభ యొకటి యేర్పడెను. కొండ వెంకటప్పయ్యగారి నధ్యక్షులుగను, ఉలుగుండము రంగారావుగారిని నన్ను ను కార్యదర్శులగను నెన్నుకొనిరి. మే మంత చందాలు పోగుచేసి, సభలకుఁ గావలసిన వసతులు గలిపించితిమి.

ప్రతినిధులకు పురవిద్యాలయమున విడిదిలు భోజనములు నేర్పాటు చేసితిమి. విద్యార్థుల స్వచ్ఛందసేవాదళము మంచి సాయము చేసెను. ఏప్రిలు ౨౨-౨౩-వ తేదీలందు కళాశాలాభవన మున బహిరంగ సభలు జరిగెను. బొద్దనాయకూరు జమీందారులు అధ్యక్షులు. వేదము వేంకటరాయశాస్త్రిగారు, రాజా మంత్రి ప్రెగడ భుజంగరావుగారు మున్నగు ప్రముఖులు విచ్చేసిరి. సభలు జయప్రదముగ జరిగెను.

## ౧౬. ‘ అబ్బాపు ’ మరణము

గుంటూరు సభలు ముగియఁగనే మా పిల్లవానిని, ఇక్కడఁ జదువు చుండు మా తమ్ముని కుమారుఁడు నరసింహమును దీసి

కొని, మేము భీమవరము వెళ్లితిమి. అచట నరసింహామున కుపనయనము జరిగెను. మా రెండవతమ్ముని జూచుట కంతట మేము నరసాపురము పోయితిమి. గన్నవరమున నుండు మా రెండవ మఱఁదలి కుమారుఁడు రామచంద్రరావున కంతట పెండ్లి యగు నని తెలిసి, మే మచటి కేగి, పెండ్లివారితో ర్యాలి తరలి వెళ్లితిమి. పెండ్లిలో మా పిల్లవానికి మరల జబ్బుచేసెను. అదివఱకు తోడిపిల్లలతోఁ గూడి యాడుకొనుచుండు మాపసివాఁ డంతట మంచ మెక్కెను. వానికి జ్వరము వచ్చి యొడ లుబ్బి, శ్వాస పుట్టెను. పెండ్లియైన తోడనే మేము గన్నవరము మరలి వచ్చితిమి. జూను రెండవ తేదీ సాయంకాలమున పిల్లవాఁడు కనులు తేలవైచెను. అరగంటలో వాని ప్రాణము లెగిరిపోయెను.

మా దంపతుల కిరువురకును మితిలేని దుఃఖము సంప్రాప్త మయ్యెను. లోక మంధకార బంధుర మయ్యెను. సంతానప్రాప్తి లేకున్నను మనసు నెటులో సరిపెట్టుకొని దినములు గడపుమాకు, దైవమీ పిల్లవాఁడను నెరను జూపించి, లేనిపోని యాసలు గలిపించి, యీ బాలకుని గుఱించి శ్రమపడునట్లు చేసి, తుదకు బాల్యముననె వాని యసువులఁ గొనిపోయి, మమ్మీదుఃఖవార్ధినిఁ బడఁద్రోచె నని మేము వగచితిమి. తీఱని విచారమునకు నేను లోనయితిని. అనుంగు చెల్లెలినేగాక యామె సంతతి నంతనుగూడ నంత మందించినవిధి నాథుని విపరీతపుఁ జేఁతలకు నేను వెత నొందితిని. లోకమున నావంటి దురదృష్టవంతులు లేరనుట స్పష్టము.

ఆరోజులలో రేయింబవళ్లు పిల్లవానినిగుఱించియే నేను దల పోయుచుండువాఁడను. ఐదవసంవత్సరము జరుగుచుండు నీ యర్భకునికి ఆజన్మరోగకారణమున తగిన శరీరదార్ఢ్యము గలుగనేలేదు!

# ౧౬. ‘అబ్బాపు’ మరణము

వాఁడు నిలుచుండుటగాని, నడచుటగాని, కనీసము సరిగాఁ గూర్చుండుటగాని లేదు; దేఁకుచుండువాఁడు. పెద్దతల, దొప్ప చెవులు, శుష్కించిన దేహమును గలిగియుండువాఁడు. ఐనను, వయస్సునకుఁ దగిన తెలివితేటలు వానికి లేకపోలేదు. నాభార్యను “అమ్మా” యనియును, నన్ను “అన్నా” యనియును బిలుచుచు, పెంపుడుతల్లి మీఁద వాఁ డమితానురాగము గాంచియుండువాఁడు. నామీఁద వాని కెంత ప్రేమ మున్నను, “అన్నపైయన్న!” అని పలుకుచుఁ బరియాచకమున నన్ను నిరసించుచుండువాఁడు! తల్లి దేవుఁడు దేవునరుఁగునందును, తనదేవుఁడు తన చిన్ని తాటియాకుల పెట్టెలోనునుండెనుగాని, అన్నకుమాత్రము దేవుఁ డెచటను లేఁడని యాకుఱ్ఱఁడు పలికి నన్నుఁ బరిహసించువాఁడు.

ఈయర్భకునికి మేము పేరైనఁబెట్టలేను. ఏమిపేరుపెట్టను? ఏమని పేరుపెట్టము? పుట్టిననాఁడే కన్నతల్లిని గోలుపోయిన దురదృష్టునకు ముద్దులు ముచ్చటలు నెట్లు జరుగును? బారసాలలు, పండుగులు నెట్లు కొనసాగును? వీనిని తల్లి పేరుతోనే పిలువుఁడని మా తమ్ముఁడు వెంకటరామయ్య చెప్పుచుండువాఁడు. బాలకుఁ డింట నాడుకొనుచుండునపుడు, ఏవో ముద్దుపేళ్లు పెట్టి తల్లియు నేనును వానిని బిలుచుచుండువారము. కాని, యెప్పటికప్పుడు బ్రదుకె యస్థిరముగఁ గానఁబడెడివానికి నేపేరు పెట్టుటకును మాకు మనసొప్పకుండెను. వీనిపేరేమి యని మమ్మెవరైన నడిగినపుడు, పెద్దవాఁడై వానిపేరు వాఁడె పెట్టుకొనునని మే మనుచుండువారము. మాటలు వచ్చినపిదప, చెలికాండ్రతో మాటాడుచు, వీఁడు తనపేరు “అబ్బాపు” అని చెప్పుకొనుచుండువాఁడు! ఆ పేరుతోనే తోడిపసివారలు వానిని సంబోధించుచుండువారు. తన కెందఱు పిల్లలని యెవరైన నడిగి

నపుడు, "ఇద్దఱు అబ్బాయిలు, ఒక అమ్మాయి!" అని వాఁడు చెప్పి, తన చిన్నపెట్టెలోనుండు మూఁడు బొమ్మలను జూపించుచుండు వాఁడు!

లోకమును వట్టికలఁ జేసి, మమ్ము దుఃఖతోయములఁ ద్రోచి వైచి, యిపు డీపిల్లవాఁడు వెడలిపోయెను! ఊరక యుండువార లకు పుత్రమోహమును గలిపించి, వెనువెంటనె యాశాభంగము గావించి, వీఁడు దాఁటిపోయెను! వీనిని గుఱించి తలపోయునపుడు, నాతల దిర్దిర తిరిగిపోవు చుండెను! లోక మంధకారబంధుర మగు చుండెను! ఎంత బలహీనుఁడైనను, ఇంతలో వాఁడు చనిపోవు నని నేనే ననుకొనలేదు! ఏచికిత్సలో చేసి, ఏసాధనములో గలిపించి, మెల్లగ వాని శరీరమున జవచేరు ప్రయత్నములు చేయుచుంటిమి. ఎటులో మృత్యువును మఱపించి వాఁడు పెద్దవాఁడైనచో వానికి సత్తువ గలుగు నని మే మాసపడుచుంటిమి. సంతానము లేని లోప మును దీర్చుటకె దైవము వీనిని మాకుఁ బ్రసాదించె నని తలంప సాగితిమి. వీఁడు పెద్దవాఁడై, విద్యాబుద్ధులు నేరిచి, పిల్లలతండ్రియై, కనినవారికిని పెంచినవారికిని గొమరుఁడై వారి వంశములు తరింప చేయు ననుకొంటిమి! కాని, వీని బాల్యమరణముచే నాయాశ లన్నియు నీటఁ గలసిపోయెను! నా మనస్సు శోకదందహ్యమాన మయ్యెను. జీవితము దుఃఖభాజన మయ్యెను!

'అబ్బాయి' మృతినొందిన పెక్కేండ్ల వఱకును, నేను వానిని దలంచుకొని దుఃఖింపని దినము లేకుండెను. నా మనస్సు పిల్లవాని వైపునకు సదా గడియారమువలె ములుసూపుచుండెను. పగలు వ్యర్థమైపోయిన యాశలు, రాత్రులు స్వప్నరూపము దాల్చి నా మనస్సును జీకాకుపఱుచుచుండెను. పసివాని ముద్దుపలుకులు నా

చెవులకు సదా వినవచ్చుచునే యుండెను. నాయాత్మ కంధత్వము గ్రమ్మెను! ఐహికాముష్మికము లేక సారహీనములుగఁ దోఁచెను! నిస్సారముగను, అతి దుర్భరముగను నుండిన యీ హేయఁపు బ్రదుకు నంతమొందింప నే విషద్రావకమైనఁ ద్రావ నేను గాంక్షించుచుంటిని! కాని, పాపపు బ్రాణమును మఱింత పాపమార్గమునఁ బాపుకొనుటకు నామన సొప్పకుండెను.

నాకోరికమీఁద నాశిష్యుఁడగు చామర్తి రాజశేఖరము, నా మనస్సంతృప్తికొఱకే క్రింది పద్యముల నాదినములలో నాకు రచియించి యిచ్చెను. ఇది నెపముగా నాపాపము వానికిని సోఁకెనా యనునట్లుగ నీ యువకుఁడు, ఇరువదిసంవత్సరముల లేఁబ్రాయము ననె తానును మృత్యువు నోటఁబడిపోయెను—

ఉ. అల్లన నమ్మయంచు మఱి
యన్న యటంచును మమ్ముఁ బిల్చి యు
ద్యల్లలితంబుగాఁ బలువి
ధంబుల క్రీడలు సల్పుచున్న మా
యుల్లము పల్లవించు జిగి
యొప్పెడి నీయెలనవ్వు లెల్ల జా
బిల్లి వెలుంగు వెల్లికల
వెల్లువల న్మఱపించుచుండెడిన్.

చ. జననమునాది నీబ్రదుకు
సంశయమయ్యె ననుక్షణంబు నీ
జనని కషాయ మొండొదవఁ
జాలదుగా యని నమ్మియుండు మా

మనసున నున్న యాశలటు
మాయములయ్యె విధిక్రమానువ
ర్తనమున మందభాగ్యమునఁ
దల్లికిఁ బాసిన బిడ్డ వైతిగా!

ఉ. ఒక్కొకవేళఁ బల్కు సమ
యోచిత వాక్యము లాలకించి నీ
చెక్కిలిదోయి ముద్దుగొని
చింతను బాసి ప్రమోద మందుచో
నెక్కడలేని నీదు బల
హీనపుఁ బుట్టువు నెంచినంత నే
దక్కుదువో యటంచు మదిఁ
దత్తరపాటు ఘటిల్లు నక్కటా!

## ౧౭. దుఃఖోపశమన ప్రయత్నములు (౧)

పిల్లవాఁడు చనిపోయిన వెంటనే మేము మా బావమఱఁదితోఁ గూడి, వారి స్వగ్రామ మగు వెలిచేరు వచ్చి యచ్చటఁ గొన్నిరోజు లుంటిమి. బాలకుని మరణవార్త వినిన మాతమ్ముఁడు వెంకటరామయ్య, తన కప్పుడె గుంటూరినుండి వచ్చిన పిల్లవాని ఛాయాపటపుఁ బ్రతులు నాకుఁ బంపెను. వెనుక కొన్ని నెలల క్రిందట నాపరిచితు లొకరు గుంటూరిలో మాయింటికి వచ్చి, మా పిల్లవానిని గుర్చీమీఁదఁ గూర్చుండఁ బెట్టి, వాని ఛాయాపటము తీసిరి. దాని ప్రతులు సిద్ధముచేసి పిమ్మట నాకుఁ బంపెద మని యాయన చెప్పిరి. కాని, నే నాసంగతియె మఱచిపోయితిని. నాఁడామిత్రుఁడు దైవికముగ పటము తీసి యుండనిచో మా యర్భ

## ౧౭. దుఃఖోపశమన ప్రయత్నములు (౧)

కుని యాకారము బాహ్యప్రపంచమున రూపు మాసిపోయెడిదియె! ఇపు డామిత్రుఁడు చేసిన సాయమునకు నే నమితకృతజ్ఞుఁడనై, యనుదినమును బాలకుని పటము చూచుకొని కాలక్షేపము చేయుచుంటిని. దీనివలన నా దుఃఖమునకు శమనోద్రేకములు రెండును గలుగుచు వచ్చెను.

మేము వెలిచేరులో నుండునపుడు మాతమ్ము లచటికి వచ్చి, మ మ్మోదార్చిరి. తాను రాఁజాలనందుకుఁ జింతిల్లుచు, తన సంతాపము తెలుపుచు మా చెల్లెలు లేఖ వ్రాసెను. నా మేనమామలు మున్నగు బంధువులు సానుభూతిని దెలిపిరి. ప్రస్తుతము కన్నులకు మఱుఁగై యున్నను, కొన్ని దినములైన పిమ్మట పిల్లవాఁ డెచటి నుండియో తిరిగివచ్చు నని నేను భ్రమపడుచుండువాఁడను. ఇపు డేమిచేయుటకును, ఎచట నిలుచుటకును నాకుఁ గోఁపకుండెను. కావున నింకను సెలవుదినము లుండినను, మే మాయెండలలోనే గుంటూరు వెడలివచ్చితిమి. ఆ కష్టకాలమున మమ్ముఁ గనిపెట్టుటకై మా యత్తగారు మాతో వచ్చి గుంటూరిలోఁ గొన్నిదినము లుండిరి.

గుంటూరులో మేము నివసించు నింట నెచటఁ జూచినను, పిల్లవాని యాటవస్తువులె కానవచ్చెను. అవి కంటఁబడునపుడు, మాకు దుఃఖము పొంగి వచ్చుచుండెడిది. బాలకుని విహారమునకై నేను కలకత్తానుండి ప్రత్యేకముగఁ దెప్పించిన త్రోపుడు బండిని బాలరోగుల కుపయోగింపుఁ డని కుగ్లరు వైద్యాలయమునకుఁ బంపి వేసితిని. బాలకుని దుస్తులు నలంకారములును నాభార్య పరుల కిచ్చి వేసెను. కనుల కగపడకున్నను నా మనోనేత్రము ముందట మాపసివాని రూపము తాండవించుచునే యుండెను. ఇది కారణముగ నాకున్మాదము గలిగినఁ గలుగవచ్చు నని నే ననుకొంటిని.

నా కాసమయమున దుఃఖోపశమనము గావింపఁ బ్రయత్నించిన మిత్రులలో శ్రీ కొండ వెంకటప్పయ్య న్యాపతి హనుమంతరావు గార్లు ముఖ్యులు. పొరుగుననుండు వీరు సదా నా సేమము గనిపెట్టుచు, నా దృష్టిని దుఃఖవిషయమునుండి మరలింప నుద్యమించుచుండిరి.

కొలఁది దినములలో కళాశాల తీసిరి. నాయొద్దనుండి చదువుకొనుటకై మా పెద్ద మేనమామ రెండవకుమారుఁడు సూర్యనారాయణ వచ్చి, కళాశాలలో మొదటితరగతిలోఁ జేరెను. నా బావమఱఁది పెద్దకుమారుఁడు నరసింహము వచ్చి చిన్నపాఠశాల చేరెను. ఇపుడు విద్యాశాలలోని పనులవలన నాదుఃఖమునకుఁ గొంత విరామము గలిగెను. అనుదినము నొంటరిగఁ జాలదూరము నడచిపోయి, ప్రకృతి దృశ్యములు చూచుచుఁ బ్రొద్దుపుచ్చుచుండువాఁడను. కాని, తప్పించుకొన నేనెన్ని యుపాయములు చేసినను, దుఃఖము నాహృదయమును జలగవలె నంటిపట్టియుండెను. మనస్సె దుఃఖవిషయము దెసకుఁ బరుగులెత్తునపుడు, విచారమును బాఱఁద్రోల నెట్లు సాధ్యమగును? మనస్సున కేదేని వ్యాపృతి గలిపించుటకై, నా ప్రాఁత దినచర్య పుస్తకములు నేను తిరుగవేయఁజొచ్చితిని. ఇది నెపముగా, బాల్యము నుండియు నేను వ్రాసియుంచిన దినచర్య పుస్తకము లామూలాగ్రముగ నే నాదినములలోఁ జదివి, మరల నేను భూతకాలమున జీవించునట్టుగ భ్రమించి దుఃఖపుఁబట్టును గొంత సడలింప యత్నించితిని.

నా చెల్లెలియొక్కయు, దాని సంతతియొక్కయు మరణవిషయమును తేపతేపకు నాకు స్ఫురింపఁజేసి, జీవితమును దుర్భరముగఁ దోఁపించుచుండెడి యీ గుంటూరుపురమునుండి వెడలిపోయి, ఏ క్రొత్తదేశమునకైన నేగి, క్రొత్తయుద్యోగమునఁ బ్రవేశించినచో, నాకుఁ గొంత దుఃఖోపశమనముఁ గలుగవచ్చునని నమ్మితిని. అంతియ

## ౧౭. దుఃఖోపశమన ప్రయత్నములు (౧)

కాని నా కీకాలమున గుంటూరునఁగాని, యిందలి యుద్యోగస్థానమునఁగాని కలిగిన ప్రత్యేక కష్టనష్టము లెవ్వియును లేవు.

ఇటీవలఁ గొన్నియేండ్లనుండి గుంటూరు కళాశాలాధ్యక్షులుగ నుండిన స్ట్రాకుదొరగారు స్వదేశసందర్శనార్థ మేగు సందర్భమున నాయన కొక వీడుకోలుపత్రము సమర్పింప నుపాధ్యాయులము నిశ్చయించుకొంటిమి. ఆ విజ్ఞాపనమును నన్నే సిద్ధము చేయుమని మిత్రులు కోరిరి. ౧౩-వ జూలయిని స్ట్రాకు దంపతులకు మేము వీడుకోలొసంగితిమి. నూతనాధ్యక్షుఁడగు రూప్లేదొరగారు కొంత కఠినుఁడనుకొంటిమి. కాని, ఆయనతో నేను రెండు మూఁడుసారులు ప్రసంగింపఁగా, ఆయనయు మనసిచ్చి మాటాడి, సహోధ్యాపకులందు సానుభూతి గనఁబఱచిరి. సేలము కళాశాల కధ్యక్షుఁడు కావలసివచ్చె నని తెలిసి నే నాయుద్యోగమునకు దరఖాస్తు చేయఁగోరఁగా, నాయర్జీని రూప్లేదొరగారు తమ సిఫారసుతో నంపిరి. మిత్రుల యాలోచనల చొప్పున నే నంత చెన్నపురికేగి, చెన్నాప్రెగడ భానుమూర్తిగారి ద్వారా కొంత ప్రయత్నము చేసివచ్చితిని.

ఇటీవల కొన్నినెలలనుండి బెజవాడలో నుపాధ్యాయుఁడుగ నుండిన బంగారయ్య నన్నుఁ జూచుటకు ౫-వ ఆగష్టున గుంటూరు వచ్చి తన సమాచారములు తెలిపెను. లాహూరు నగరమున నాతని కిటీవల దయాళసింగు కళాశాలలో ముఖ్యాంగ్లోపన్యాసక పదవి యొసగఁబడినను అది స్వీకరింపక, ఆపురమునందె దయానంద వేద కళాశాలలో నధ్యాపకోద్యోగమును అతఁడు ౨౫౦ రూపాయిల వేతనముమీఁదఁ జేకొనెను.

ఆనెల ౧౫-వ తేదీని గుంటూరు వచ్చిన బ్రాహ్మమత ప్రచారకుఁడు హేమచంద్రసర్కారుగారు కొన్నిదినము లచట నుండిరి. వారొకనాఁడు నాతో సంభాషించుచు, ఆస్తికమతసంస్థయగు దయాళ్‌సింగు కళాశాలలోని యుద్యోగము నేను గైకొందునాయని యడిగి, నాసమ్మతిమీఁద పంజాబులోని తమ మిత్రులకు నన్నుఁగూర్చి వ్రాసిరి. సర్కారుగారు మున్నుగ మిత్రుల సాహాయ్యమున నా కిపుడు లాహూరు ప్రాంతములందుఁ గొందఱు పరిచితులయిరి.

ఇపుడు సేలము లాహూరు కళాశాలలందలి యుద్యోగప్రయత్నముల యలజడిలో నాదుఃఖము కొంత మఱుఁగుపడెను. ౧౫-వ అక్టోబరున సేలము పురపాలకాధ్యక్షునియొద్దనుండి నాకొక లేఖ వచ్చెను. నన్నును, మఱికొందఱు దరఖాస్తుదార్లను, చెన్నపురి రాజధానీ కళాశాలలో సమావేశమగు కొందఱు పెద్దమనుష్యులయొద్దకు రమ్మని వారు కోరిరి. ఇంతలో నేను పంజాబునందలి యుద్యోగమును ౨౫౦ రూపాయిల జీతముమీఁద స్వీకరింతునాయని యా కళాశాల కార్యదర్శి నన్నడిగెను. ఆజీతము నాకు సరిపడలేదు. లాహూరు మిత్రు లొకరు నాకు జాబు వ్రాసి, వెంకటరత్నమునాయఁడుగారు నన్ను లాహూరుపదవికి సిఫారసు చేసినచో, నాకు లాభము కలుగునని చెప్పిరి. ఆ నవంబరు ౧౭-౧౮ తేదీలలో బందరులో జరిగిన బ్రాహ్మ సమ్మేళనమునకు గుంటూరు మిత్రులతో నేను బోయి, నాయఁడుగారిని జూచి మాటాడితిని. ఆయన నన్నుగుఱించి సిఫారసు చేసిరి.

౨౩-వ తేదీని నేను చెన్నపురి కేగితిని. సేలము కళాశాలోద్యోగమునకై ప్రయత్నించెడి మఱియిద్దఱు అభ్యర్థులు నా కగఁబడిరి. వారిలో నొకరు విజయనగరకళాశాలలో నాతోడిసహాయాధ్యాపకు

లగు సుబ్బరాయభట్టుగారు. ఆయన కే యుద్యోగ మగునని నేనును, నాకె యగునని యాయనయును అనుకొంటిమి. కాని మా యిద్దఱకును గాక, మా యుభయులకంటెను వేతనానుభవములందు వెనుకఁబడి యుండు నొక తమిళబోధకుని కీ యుద్యోగ మొసంగఁబడెను.

చెన్నపురిలోనుండు రెండుదినములలోను నేను రెండుపనులు పెట్టుకొంటిని. నా పూర్వవిద్యార్థియగు నొక పెద్దమనుష్యుఁడు పిల్లలతల్లియగు తన సతిని విసర్జించి యొంటరిగ మద్రాసున నుద్యోగము చేయుచుండెను. నా పూర్వశిష్యులయిన యా సుదతి సోదరుల కోరిక ననుసరించి నే నిపుడు నాయనుంగుశిష్యునితో సంధిమాటలు జరిపితిని. ఈవిషయమునఁ దప్పంతయు తన సతిదె యని యాతఁడు చెప్పి, సామమార్గమున కంగీకరింపక, భావోద్రేకమున నా మ్రోల విలపించెను. నే నాతనిని వదలివేసి, రెండవసంగతి చూచుకొనుటకుఁ బోయితిని. రెండవ మిత్రుఁడును నా పూర్వశిష్యవర్గములోనివాఁడె. కోపమున భర్తను వీడిన యొకవిదుషీమణికి, భార్యను వీడిన యీ విద్యాధికుఁ డాతిథ్య మిచ్చుచుండెను. ఇది పాడిగాదని వారలకు నేను హితముచెప్పి, యాకారణమున నాయువతీయువకుల దూషణోక్తులకు గుఱియై, మోమున ముసుఁగువైచికొని, యింటికి వెడలివచ్చితిని!

ఇంతలో లాహూరు ఉద్యోగమును గుఱించి నాకు జాబులు వచ్చియుండెను. ఆయుద్యోగమును గుఱించి వచ్చిన దరఖాస్తులు విమర్శించుట కొక యుపసంఘమును కళాశాలాపాలకు లేర్పఱిచి రనియు, ఆ చిన్నసంఘమువారు అందఱిలోను నన్నును, కలకత్తా విశ్వవిద్యాలయములో మొదటితరగతిని మొదటివాఁడుగ జయమందిన యొక యువకుని నెన్నిరనియును తెలిసెను. కావున మా కిరువురికి

నిపుడు పోటీపడెను. పరీక్షావిజయ విషయమున వన్నుమించిన బంగాళీయువకునికంటె నధికానుభవముగల నాకే యాయుద్యోగమగునని యిపుడు లాహూరునగరము పోయి తన యుద్యోగమునఁ బ్రవేశించిన బంగారయ్య వ్రాసెను. ఎట్టకేలకు నెలకు ౨౭౫ రూపాయిల జీతము మీఁద నా కాయుద్యోగ మిచ్చిరి. వెంటనె వచ్చి పనిలోఁ బ్రవేశింపుఁడని యిపుడు పరిచితుఁడైన యచటి కళాశాలాధ్యక్షుఁడు యస్. శి. రాయిగారు నన్నుఁ గోరిరి. నాకు లాహూరుపరిస్థితులు కళాశాలా వ్యవహారములును బాగుగఁ దెలియకుండుటవలన, ఆవిషయమై సవిస్తరముగ నుత్తరము వ్రాయుమని బంగారయ్య నిదివఱకె వేఁడితిని. నా కాతఁడీ ప్రత్యుత్తర మిచ్చెను:—

లాహూరు, ౨౧-౧౨-౧౯౧౧.

" ప్రియమిత్రమా,

* * * *

" మీరు ప్రశ్నలు తరుచుగ అడుగుచున్నను, సంధిగ్ధములుగా జవాబులువ్రాసి, కాలక్షేపము చేసియున్నాను. ఊరకుండుటకు వీలు లేనందున జవాబు వ్రాయుచున్నాను.

" ఇచట జీతము వృద్ధి అంటే యేమిటో బాగా తెలిసినట్లు కనబడదు. ప్రతి సంవత్సరాంతమున ఉపాధ్యాయుల జీతములు హెచ్చింపబడవు. ఎంతజీతముపైని ఎవరిని తీసికొనివచ్చెదరో, మామూలుగా ఆజీతముమీదనే వాని నుంచెదరు!

* * * *

" ఉపాధ్యాయుడు గొప్పవాడని విద్యార్థుల మూలముగా తెలియవలెను. విద్యార్థులు ఎంతచెపితే అంత అధికారులు మ్మెదరు!

* * * *

"దయాళసింగు కాలేజీకి ధనము బాగానున్నది. లాహూరు కాలేజీలలో నిదియె మిగుల ధనవంతమైనది.

"నే నున్నానను ధైర్యముతో మీరు రావలె ననుకొనుచున్నారు......సాధ్యమైనంత త్వరలో నేను మనవైపు రావలెనని యున్నది. ఇక్కడ శీతలము ఉష్ణము అతి విశేషము. కూరలు మంచివి దొరకవు. చచ్చు బెండకాయలు, బటాణీలు, గోబీపువ్వు, కందచేమలును తప్ప మరేమి దొరకవు. నేయి అతిప్రియము. నోట బెట్ట నసహ్యము! పాలుమాత్రము చౌక. నీటివసతి బాగా లేదు... ప్రశస్తమైన గుంటూరుపని వదలి, ఇంతదూరము మీ వయస్సులో వచ్చుట అసమంజసము...భి. బంగారయ్య."

మిత్రుని యుత్తరమువలన నా సంశయవిచ్ఛేద మయ్యెను. మేము స్థానము వీడుట నాభార్య కసమ్మతము. మమ్ముఁజూచిపోవుట కిపుడు గుంటూరువచ్చిన మాతమ్ముఁడు వెంకటరామయ్యకూడ నిష్ట పడలేదు. పర్యవసానము, నా కీయుద్యోగ మక్కఱలేదని మాఱు తంతి నిచ్చివేసి, తమ కిచ్చినశ్రమకు మన్నింపుడని యాచటి మిత్రులకు వ్రాసివైచితిని. లాహూరు ఉద్యోగమునకై నేను జేసిన కృషి యంతయు నిట్లు వృథాప్రయాస మయ్యెను!

## ౧౮. దుఃఖోపశమన ప్రయత్నములు (౨)

౧౯౧౬-వ సంవత్సరము డిశంబరు ౩౧-వ తేదీ దినచర్యయందు నే నిట్లు వ్రాసితిని:—"ప్రార్థన సమాజమున నేను ఉపాసనను జరిపితిని. ప్రార్థనచేయుటకు మిగుల లజ్జ నొందితిని. చిన్నపిల్లవాని మరణమునకుఁ బిమ్మట దేవు నారాధించుట కిదియె

మొదటిమాట. విపత్తు సంభవించినప్పటినుండియు దేవునిమీఁద నేను నమ్మకట్టియున్నాఁడను. ఈసంవత్సర కార్యక్రమమును విమర్శించుకొని, ఆర్థికజ్ఞానారోగ్యముల విషయమై నేను వెనుకటికంటె సుస్థితి నున్నను, నైతికాత్మీయ విషయములం దభివృద్ధి గాంచనట్టుగఁ దెలిసికొన్నాను. ఈసంవత్సరమున జీవితమున నెప్పుడు నెఱుఁగని విధమున నామనస్సు సంక్షోభించెను. గత జూను నెలలో సంభవించిన మాపిల్లవాని మృత్యువు సంసారజీవితమును నాకు విషప్రాయముగఁ జేసి, దేవునికి నాకు నెడఁబాటు గావించెను. ఈ విషమస్థితినుండి నన్నుఁ దప్పింపఁగలది మృత్యు వొకటియే.”

మఱునాఁటి (౧-౧-౧౯౧౭) దినచర్యయం దిట్లు గలదు:—
“ఈసంవత్సరాదిని గత యుగాదితోఁ బోల్చితిని. మా పిల్లవాఁడు అప్పుడె పొంగుపడి నెమ్మదినందెను. అప్పుడు నాపరిచితులగు దొరలకు సంతోషమున క్రిస్మసు బహుమతు లంపితిని. ఇప్పుడో నాకనుఁగవను గాఢ చీఁకటులు గప్పియున్నవి! జీవితఫలము నాకేమియుఁ గానరాకున్నది. మృత్యువె నాకు దుఃఖోపశాంతి గావింపఁ గలదు. లాహూరు కళాశాలోద్యోగము వలదనుట పెద్దపొఱపాటె. అచటి కేగినచో నా కీపాటికిఁ గొంత యుపశమనము గలిగియుండెడిది. . . నే నీమధ్య చెన్నపురి కేగి, తనకు హితవు బోధించినందుకు, నా పూర్వ శిష్యుఁడు నన్నుదూఱి, నాకు చెడుగారోపించుచున్నాఁడు! ఇతరుల తప్పు దిద్దఁజూచువారికి ప్రతిఫల మిదియె! తన సతిని బరిత్యజించి, పరవనిత నింటఁ జేర్చినందు కాతని కనుతాపమె లేదు!”

నా ప్రాఁతదినచర్య పుస్తకములు తిరుగవేయుచుండుటవలన విచారభారము కొంత తొలఁగిపోవుచుండెడిది. భూతకాలవిషయములను

దలపోయుచు, ఆసుదినములందలి నాయాశలు, ఊహలును మననము చేసికొనుచు, వర్తమానమందలి విషాదముల నొక్కింత విస్మరించుచుండువాఁడను.

౨౨-వ జనవరిని, ఇరుగుపొరుగులందు మృత్యుదేవత మాకుఁ బొడగట్టెను. చిరకాలమునుండి కొండ వెంకటప్పయ్యగారి యింట మిగుల నమ్మకముగనుండిన చెన్నకృష్ణమ్మయను వంటబ్రాహ్మణుఁడు, ఉత్తర హిందూదేశ మేగిన యజమానునిఁ గాంచ మిగులఁ బరితపించి, ప్రాణములు విడిచెను. మఱునాఁడే వెంకటప్పయ్యగారిలు సేరి, ఇంతకాలమును దమకుఁ బరిచర్యలు సల్పిన సజ్జనునికిఁ దనకును తుదిమాపులు లేకపోవుటకు మిగుల విషాదమందిరి. గోవిందరాజుల శ్రీనివాసరావుగారి పెద్దకొమార్తె బాలప్రాయముననె హృద్రోగపీడితయై, వైద్యులు తన కేమియు నుపశమనము గావింపలేకపోవుటచేత, నారాయణ స్మరణము చేసికొనుచు, ప్రాణములు విడిచెను.

న్యాపతి హనుమంతరావుగారును, ఆయన యన్నయును తమ చెల్లెలిని జూచుటకై ౧౯౧౭ సం. జనవరి ౧౧-వ తేదీని కాకినాడ బయలుదేఱఁగా, అచటనే యుండిన మాచెల్లెలిని జూచివచ్చుటకై నేనును వారితోఁ బయనమైతిని. మార్గమధ్యమున రాజమండ్రిలో న్యాపతి సుబ్బారావుపంతులుగారియింట మఱునాఁడు మేము నిలిచి, ఆరాత్రికి కాకినాడ చేరితిమి. మఱునాఁటి యుదయమున మాచెల్లెలిని జూచితిని. మాచిన్నచెల్లెలిని, దానిపిల్లలను నిర్దయత్వమున మృత్యుదేవత నోట వైచుకొనిపోయినందుకు మేము విలపించితిమి. కాకినాడలో వెంకటరత్నమునాయఁడు, పెద్దింబరాజు, కొండయ్యశాస్త్రిగార్లు మున్నగు మిత్రులను, పిఠాపురము రాజాగారు జరుపుచుండెడి యనాథశరణాలయమును సందర్శించితిమి.

నేను తిరిగివచ్చిన కొలఁదిదినములకే పిఠాపురవాస్తవ్యులును, సుప్రసిద్ధకవులు నగు ఉమ్రా అలీషాగారు గుంటూరను గొప్ప ప్రసంగము గావించిరి. ఆసభకు నే నధ్యక్షత వహించి, పూర్వమందు హిందూమహమ్మదీయులకు వైషమ్యము లుండినను, సోదరతుల్యులుగ నొకరి నొకరు ప్రేమించి మెలఁగవలసిన శుభసమయ మిపు డాసన్నమయ్యెనని నుడివితిని. ౨౦-వ జనవరిని పాలపర్తి నరసింహముగారు, "బ్రాహ్మధర్మాశయముల" ను గుఱించి యుపన్యాస మిచ్చిరి. ఆ సమయమున నధ్యక్షత వహించిన నేను, హిందూ బ్రాహ్మమతములను బోల్చి, బ్రాహ్మసామాజికుల ప్రస్తుతపరిస్థితులను విమర్శించితిని. బంగాళములో బ్రాహ్మసమాజమువారు మాంసాహారవిసర్జనము చేయఁ జాలకుండి రనియు, యువకులలోఁ బలువురు నిర్మలప్రవర్తనముపట్ల నిర్లక్ష్యము వహించి రనియు, ఆంధ్రబ్రాహ్మసామాజికులును గొందఱు తమవిధులు బాగుగ నుత్తెఱుఁగకున్నా రనియును జెప్పివేసితిని. బ్రాహ్మసమాజ వార్షికోత్సవ పవిత్రసమయమందలి నాయప్రస్తుతపుఁ బ్రసంగమునకు నరసింహముగారు నొచ్చుకొనిరి. నాకుఁ దోఁచిన నిజము పలుకుటయె ధర్మమని నే ననుకొంటిని.

"లండనునగర మనశ్శక్తి విమర్శనాసమాజము" న వెనుక నేను చిరకాలము సభ్యుఁడనుగ నుండి, వారి గ్రంథములందలి వినోదకర విషయములు గ్రహించుచుండువాఁడను. ఇపుడు నే నట్టి పుస్తక మేదైనఁ జదివి, ఆత్మోపశాంతి గాంచ నెంచి, యిటీవల లాడ్జిమహాశయుఁడు ప్రచురించిన "రెయిమండు" అను పుస్తకమును తెప్పించి చదివితిని. ఆగ్రంథకర్త కుమారుఁడు రెయిమండు గత జర్మను యుద్ధములో నాకస్మికముగఁ జనిపోయెను. కుమారుని యాత్మ తండ్రితోఁ దన వృత్తాంతము చెప్ప ననేకప్రయత్నములు చేసెనని యిటీవలఁ

గనుఁగొనిరి. నే నీపుస్తకమును మిగుల వినోదమునఁ జదివి స్నేహితులకు, సోదరులకును జదువనిచ్చితిని.

ఫిబ్రవరి ౧౭-వ తేదీని "రామమోహన ధర్మపుస్తకభాండాగారము" న "శిశుశాఖ" నేర్పఱుచుటకై బెజవాడ కేగితిని. ౨౬-వ తేదీని మా కళాశాలలో పెద్దతరగతివారు కళాశాలాధ్యక్షునికి నుపన్యాసకులకును వీడుకోలువిందొనర్చిరి. ఆసభలో బోధకులు బోధితులు నొండొరులనుగూర్చి శ్లాఘనప్రసంగములతోఁ గాలక్షేపము చేసిరి. ఆసమయమున వినువారలతలలు వాఁచునట్టుగ విద్యార్థుల మెప్పువడసినవారము, సత్యనారాయణమూర్తియు నేనును.

ఇటీవల యూరపుఖండమేగి తిరిగివచ్చిన నాపూర్వ శిష్యుఁడు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు విదేశమునందలి తమ యనుభవములను గుఱించి ౮-వ మార్చిని మాయింట ముచ్చటించిరి. పెక్కులు వినోదాంశము లాతఁడు ప్రస్తావించెను.

దుఃఖోపహతులమగు మేము, వెనుకటివలెఁగాక, యీవేసవిని గుంటూరిలోనె గడుపవలెనని నిశ్చయించుకొంటిమి.

మైసూరు విశ్వవిద్యాలయములో నాంగ్లోపన్యాసకపదవి ఖాళియయ్యెనని తెలిసి, నేను దరఖాస్తు నంపితిని. కొందఱు స్నేహితులతోఁగలసి నేనంత మద్రాసుపోయి, మైసూరు ఉద్యోగవిషయమున నాకు సాయముగలుగుటకై శ్రీయుతులు నాగేశ్వరరావుగారు భానుమూర్తిగారు మున్నగు మిత్రులద్వారా ప్రయత్నములు చేసితిని. కొన్ని సిఫారసు ఉత్తరములు గైకొని, ౧౬-వ తేదీని నేను బెంగుళూరు పోయితిని. బసవంగుడిలో "అనాథశరణాలయము" ను నడుపుచుండు పరిచితులు వెంకటవరదయ్యంగారు నా కాతిథ్యమొసంగిరి. అచటనే

వేసవిని గడపవచ్చిన కందుకూరి వీరేశలింగముపంతులుగారిని జూచి, వారివలన నొక యుత్తరము పుచ్చుకొని, ౧౫-వ తేదీని నేను మైసూరునగరము చేరితిని. మైసూరువారు మైసూరుబోధకులకె ప్రోత్సాహము గలిగింపఁబూనిరి గాన, అచట నా కేమియు లాభము గలుగలేదు. మైసూరుకంటె బెంగుళూరె యారోగ్యప్రదముగఁ గాని పించెను. కాని, యీ సంవత్సరమున బెంగుళూరికంటె గుంటూరె చల్లగ నుండునట్లు తోఁచెను.

నేను గుంటూరు తిరిగివచ్చిన మఱునాఁడె మాచిన్నపిల్లవాని స్మారకదినము. వానినిగుఱించి తలపోయుచు మేము సంతాపజలధిని మునిఁగిపోయితిమి. నన్నోదార్చుటకై హనుమంతరావుగారు నాఁడు తమ ప్రయాణమును మానుకొనిరి. దుఃఖపరవశుఁడనగు నన్నాయన కలక్టరు కచేరీలో శిరస్తాదారగు మిత్రులు పడ్లమూడి బ్రహ్మయ్య పంతులువారియొద్దకుఁ గొనిపోయిరి. వారు నాకు హితోపదేశము చేసిరి. పిల్లవాని జ్ఞాపకార్థముగ బీదలకు అన్నదానము చేసితిమి.

ఆ నెల ౨౯-౩౦ తేదీలలో రేపల్లెలో గుంటూరు మండల సభలు జరిగెను. నేను సంఘసంస్కరణసభలోఁ గొంత పాల్గొంటిని. ఆసభకు ఉన్నవ లక్ష్మీనారాయణగా రధ్యక్షులు. పూర్వము దక్షిణ హిందూదేశమున శైవమతవ్యాపనము చేసిన బసవేశ్వరునికాలము నుండియు ఆంధ్రులు సంఘసంస్కరణాభిముఖులని వీరు చెప్పిరి. మెయి ౩౧-వ తేదీని కొండ వెంకటప్పయ్యగారు నెల్లూరిలో జరుగు ఆంధ్రరాష్ట్రీయసభలకు సకుటుంబముగ బయలుదేఱుచు, మాదంపతు లిద్దఱి నాహ్వానింపఁగా, మేమును నెల్లూరికిఁ బయనమయితిమి.

## ౧౯. నివేశనస్థల సంపాదనము

నెల్లూరిలో హనుమంతరావుగారు మున్నగు మిత్రులతోఁగలసి నేను వెంకటప్పయ్యగారి విడిదిలో బసచేసితిని. వెంకటప్పయ్యగారు మహాసభకధ్యక్షులు. ఒంగోలు వెంకటరంగయ్యగారు ఆహ్వానసంఘాధ్యక్షులు. వారియింటికిఁ జేరువనే మాబస. సభలో వెంకటప్పయ్యగారికిని ఆమంచర్ల కృష్ణారావుగారికిని అభిప్రాయభేదములు కలిగెను. కాని మూఁడవనాఁడు, అందఱును మిత్రులయిరి. సభలు జయప్రదముగ జరిగెను. సంఘసంస్కరణసభకు చిలకమర్తి లక్ష్మీనరసింహముగా రధ్యక్షులు.

ఆ జూను ౧౦-వ తేదీని వెంకటరత్నము నాయఁడుగారు నాకొక జాబు వ్రాసిరి. ఆయన ప్రవేశపరీక్షాధిపసంఘసభ్యులు. క్రొత్తగ మూఁడుసంవత్సరములు ఆంధ్రపరీక్షాధికారిపదవి ఖాళీ కాఁగా, అది నా కొసఁగుఁడని డైరక్టరుగారికిఁ దాము సిఫారసు చేసితిమని వారు వ్రాసిరి. ఎదురుచూడని యీమేలునకు నే నానందమంది, నాయఁడుగారికి నాకృతజ్ఞతను దెలిపితిని.

ఆంధ్రపత్రికాకార్యస్థానమున మిత్రులు శ్రీ చల్లా శేషగిరిరావుగారికి సంపాదకపదవి లభించినందుకు, "గుంటూరు యువజన సాహితీ సమాజము"వా రొక యభినందనసభ ౧౫-వ తేదీని గావించిరి. శేషగిరిరావుగారు శాంతస్వభావులైనను, వలసినపట్టులం దాయన కలమునకుఁ గఱకుఁదనము గలుగుచుండుట నే నెఱుఁగుదు నని పలికి, ఇట్టివారికి నుద్యోగ మిచ్చినందుకు నాగేశ్వరరావుగారి నభినందించితిని. మఱునాఁడే శేషగిరిరావుగారికి రెయిలునొద్ద మేము వీడ్కోలొసంగితిమి.

౧౪-వ తేదీని కూచిపూడిలో జరిగిన గ్రంథాలయసభకు నేనును, రాజకీయసభకు వెంకటప్పయ్యగారును అధ్యక్షులము. ఆనిబిసంటమ్మగారిని దొరతనమువారు నిర్బంధించిరని యీనాఁడే పత్రికలు తెలిపెను. ఆమె కీశిక్ష గలుగుటకు ప్రజలు మిగుల సంక్షోభించిరి.

ఆ నెల ౨౬-వ తేదీని వెంకటప్పయ్యగారు నాతో మాటాడుచు, బ్రాడీపేటలోని తమస్థలమునకుఁ జేరువనె నాకొక స్థలము బేరము చేయుచుంటిమనియు, అది తప్పక నేను గొనవలెననియుఁ జెప్పిరి. కాని నాకది యిష్టము లేదు. ౨౮-వ తేదీని మిత్రులు వల్లభజ్యోస్యుల కామేశ్వరరావుగారు మమ్మిరువురను గలసికొని, ఆస్థలము తమ యల్లునిదనియు, ౧౨౦౦ రూపాయిలకు నాకది కుదిర్చెదమనియుఁ జెప్పిరి. నాభార్య దీనికి సమ్మతించెను. వెంటనే లోగిలి కట్టినను గట్టకున్నను, ఆస్థలము నేను బుచ్చుకొనుట యుక్తమని వెంకటప్పయ్యగారు మున్నగు మిత్రులు గట్టిగఁ జెప్పిరి. స్థలము కొనుటకు నే నంతట సమ్మతించితిని.

జూలై 3-వ తేదీ కళాశాల తెఱచు దినమైనను, అప్పుడె కీర్తిశేషులైన దాదాభాయి నవరోజీగారి గౌరవార్థమై యానాఁడు సెలవీయఁబడెను. ప్రవేశపరీక్షకు ముఖ్యపరీక్షాధికారిపదవి నా కొసఁగితిమని డైరక్టరుగారినుండి నాకు లేఖవచ్చెను. నామనస్సునకీ క్రొత్తవిషయము కొంత వ్యాపృతిఁ గలిగించెను. నే నిపుడీయ వలసిన ప్రశ్నపత్రమును గుఱించియు, దీనికి సంబంధించిన యితర విషయములను గుఱించియు నాలోచనలతో నామనస్సు దుఃఖము బారినుండి కొంత తప్పించుకొనెను.

ఇపుడు నాకుఁగలిగిన క్రొత్తపని యిది యొకటియే కాదు. కళాశాలాధ్యక్షులు, పుస్తక భాండాగారమునకు నన్ను ముఖ్యాధి

కారిగఁజేసి, అందలి కార్యక్రమము సరిగజరుపుటకై ప్రత్యేకముగ నొక గుమాస్తాను, జవానును నియమింతుమని చెప్పిరి.

బ్రాడీపేటలోని స్థలము కొనుటకు నిశ్చయించితిని గాన, కొంతసొమ్ము వెంటఁదీసికొని, నేను కామేశ్వరరావుగారితో బందరు వెళ్లితిని. సుమా రరయకరము పరిమితి గల గుంటూరిలోని తమ స్థలమును చిట్టా సుందరరామయ్యగారు నాకు విక్రయించి, ముందుగ నేనూరు రూపాయిలు నాయొద్దనుండి పుచ్చుకొని, నాకు దస్తా వేజు వ్రాసియిచ్చిరి. ఇది జరిగిన రెండుమూఁడు దినములకు వెంక టప్పయ్యగారు నాదగ్గఱకు వచ్చి, తమయింటి కలపకు తాము రాజమంద్రి పోవుచుంటిమని చెప్పి, కలపకొనుట కిదె తరుణము గావున నాయింటి సామానుకొనుటకై నన్ను రాజమంద్రి యాహ్వా నించిరి. స్థలము కొనుట కెట్టులో నేను సమ్మతించితినికాని, యింత యవ్యవధానముగ నే నీ పురమున నిల్లుకట్ట నాకు మనసొప్పుట లేదని నేను ప్రత్యుత్తరమిచ్చితిని. అందువలనఁ బంతులుగా రొకరె రాజ మంద్రిపోయి, తమ యింటికిఁ గావలసిన కలప తెచ్చుకొనిరి.

ఆ జూలై నెల తుది దినములందు గుంటూరు క్రైస్తవ మత వ్యాపనాసంఘురతోత్సవము జరిగెను. కళాశాలాధ్యాపకులు విద్యార్థులును గలసి యూరేగి, అతివైభవమున నుత్సవములు జరిపిరి. కాని, నామనస్సు వానియందు లేదు. పడిన చిన్నవలునునకుఁ గనులు మెరమెరలాడునట్లు, నా చిన్నపిల్లవానిమరణసంస్మరణమున మాటిమాటికి నాహృదయము వ్యాకులత నొందుచుండెను.

మామామగారికి జబ్బుచేసెననియు, మఱఁదలు లక్ష్మమ్మకుఁ గురుపువేసెననియుఁ దెలిసి నాభార్య ౨౯ జులయిని కట్టుంగ

వెడలిపోయెను. ఇపుడు నే నింట నొక్కఁడనే యుంటిని. నరసింహము సూర్యనారాయణ రామచంద్రరావులు విద్యార్థిశ్రేణినుండు పట్టిపిల్లలు! నామనస్సును వేధించు దుఃఖము వారి కేమి తెలియును?

ఆగష్టు ౪-వ తేదీని మిగిలిన సొమ్మిచ్చి, సుందరరామయ్యగారిచే నేను దస్తావేజు రిజిష్టరి చేయించుకొంటిని. ఇపుడు నాస్థలము కొలిపించి, దానికి దిమ్మెలు వేయించి, పలుమా రా ప్రదేశమును జూచుటకై బ్రాడీపేట పోయి వచ్చుచుండువాఁడను. నామనస్సున కిపు డేర్పడిన నూతనాకర్షములలో నిదియొకటి.

ఇంతలో దేశమున రాజకీయపరిస్థితులు తీవ్ర మయ్యెను. బిసంటమ్మగారికి విధించిన శిక్షకొఱకు సర్ యస్. సుబ్రహ్మణ్యయ్యరుగారు దొరతనమువారిమీఁద నలిగి, తమకు వా రదివఱ కొసఁగిన గౌరవపట్టమును వారి కంపివేసిరి. దేశనాయకులలోఁ బలువురు ప్రభుత్వమువారిని నిరసించిరి. ఇట్టివారిలో వెంకటప్పయ్యగారొకరు. వీరికిఁగూడ నిట్టిశిక్షయె గలుగునని మిత్రుల మనుకొనుచుండువారము.

సెప్టెంబరు ౨౦-వ తేదీని నాకు వచ్చిన యుత్తరములో మాయత్తగారు ధవళేశ్వరమునఁ జనిపోయిరని యుండెను! నెల క్రిందట నేను మామామగారిని జూచుటకు వెలిచేరు వెళ్లియుండినపుడు, భర్తకుఁ బరిచర్యలు చేయుచు నామె యచటనే యుండెను. ఇపుడు మామామగారికిఁ గొంచెము శరీరమున నెమ్మదిగనుండెను గాని, కొలఁదిరోజుల క్రిందటనె యాయనతల్లి కట్టుంగలోఁ జనిపోయెను. ఒక నెలలోనె యత్త కోడండ్రు పరలోకప్రాప్తిఁ జెందిరి. శాంతమూర్తియగు మాయత్తగారి యాకస్మికమరణమునకు విషాదమందితిని.

# ౧౯. నివేశనస్థల సంపాదనము

గుంటూరు ప్రార్థనసమాజమునకు మందిరనిర్మాణము చేయుటకు మే మెంత ప్రయత్నించితిమి. స్థలసంపాదనావిషయమున నా కిపుడు కొంత చొరవ గలిగి, ౨౯-వ సెప్టెంబరున సామవేదము నరసింహాచార్యులుగారియొద్ద ౪౧౨ గజముల స్థలము నేను కొంటిని. నే నంతట వెలిచేరు వెళ్లి బంధువులను పరామర్శించితిని. కాకినాడ పోయి మాచెల్లెలిని, కొంచెము జబ్బుగనుండు మామేనకోడలిని జూచివచ్చితిని. కొంత విశ్రాంతి గలుగుటకై మామామగారిని గుంటూరు కొనివచ్చితిమి. కొలఁదికాలము క్రిందటనె వ్యాధిగ్రస్తుఁడై, నాసములోనె మాతృపత్నీ వియోగములు సంప్రాప్తమయిన మా మామగారిశరీరము రక్తవిహీనమయ్యెను. ఆయనకు గుంటూరినివాసము ఆరోగ్యప్రదము కాఁగలదని నమ్మితిమి.

దుఃఖములో దుఃఖము సంప్రాప్తమగుచుండును. అధిక విద్యాపరిశ్రమముఁ జేసి, విదేశమున గొప్పయుద్యోగము సంపాదించిన నామిత్రుఁడు బంగారయ్య యిటీవల చనిపోయెనని అక్టోబరు ౧౧-వ తేదీని నాకుఁ దెలిసెను! పాపము, అతనితలిదండ్రు లింకను జీవించియుండిరి. వారికి బంగారయ్య యొకఁడె కుమారుఁడు! తనవిద్యకై యిటీవల బంగారయ్య చేసిన ఋణములైన నింకను తీరలేదు! భార్య సుగుణవతి యగు నిల్లాలు. ఇద్దఱుముగ్గురు చిన్నపిల్లలు కలరు. లాహూరు దూరప్రదేశమని యెంచి, యతఁ డిటీవల బంగాళాలోని రంగపూరు కళాశాలలో నుపన్యాసకుఁ డయ్యెను. అచటనె మన్యపుజ్వరము సోఁకి, యతని యసువులఁ గొనిపోయెను! ఆహా! అకాలబాల్యమరణములు చూచిచూచి నాకనులు కాయలు కాచిపోవుచున్నవి!

ప్రస్తుతదేశపరిస్థితులను గూర్చి యాలోచించుటకు ప్రత్యేక మండలసభ యొకటి గుంటూరిలో నవంబరు ౨౫-వ తేదీని జరిగెను.

దానికి న్యాపతి హనుమంతరావుగా రధ్యక్షులు. డిశెంబరు మొదటి వారములో వెంకటప్పయ్యగారి కుటుంబమున నందఱును మిక్కిలి యలజడికిలోనయిరి. వెంకటప్పయ్యగారి పెద్దయల్లుఁడు, అక్కయు బావయు భార్యయు వలదని వారించుచుండినను వినక, సింగరాయ కొండదేవళములో రెండవ పెండ్లి చేసికొనెను !

## ౨౦. శుభాశుభములు

౧౯౧౫-వ సంవత్సరము జనవరి ౫-వ తేదీని గుంటూరు పురపాలకాధ్యక్షుని యెన్నిక జరిగెను. వెనుకటి యధ్యక్షు లగు న్యాపతి హనుమంతరావుగా రొకరును, పి. యతిరాజులు నాయఁడుగా రొకరును ఈ యుద్యోగమున కభ్యర్థులు. హనుమంతరావుగారు శక్తివంచన లేక, తమవృత్తిపనులును, తుదకుఁ దమయారోగ్యము నైనను జూచుకొనక, ప్రజాసేవ లొనరించినవారు. ఐనను, పురపాలకసంఘసభ్యులలోఁ బలువుర కాయనయందు సదభిప్రాయము లేదు. ఈసమయమునఁ దమయభ్యర్థిత్వము విరమింపుఁడని వెంకటప్పయ్యగారును, నేనును హెచ్చరించినను పంతులుగారు విన లేదు. అంత జరిగిన యెన్నికలలో పంతులుగారు పరాజితులైరి. తమ యధికారకాలమున నమితముగ శ్రమపడి, ఇపు డాశాభంగము గాంచిన పంతులుగారికి, దేహమున నష్ట మధికమై, ఆనెల చివర దినములలో పెద్దజ్వరము సోఁకెను. కొన్నిరోజుల కాయనకు స్వస్థత కలిగినను, చాలకాలమునకుఁగాని శరీరమునకు మరల సత్తువ చేరు కొనలేదు.

ఫిబ్రవరి మూఁడవతేదీని గుంటూరు కళాశాలలోఁ జిరకాలము బోధకుఁడుగ నుండిన వంగిపురము కృష్ణమాచార్యులుగారు పరలో

ప్రాప్తిఁ జెందిరి. వీరు సంస్కృతాంధ్రసాహిత్యములందును, గణిత శాస్త్రమందును ప్రతిభావంతులు; వినయాది సుగుణభూషితులు. ఇట్లయ్యును, తమప్రజ్ఞకుఁ దగిన యౌన్నత్యమును విద్యాశాలలోఁ బడయఁజాలకుండిరి. ఇటీవలనె వీరికిఁ గళాశాలతరగతులలో నాంధ్రరచనోపాధ్యాయపదవి యొసంగుఁడని అధ్యక్షులకు నేను సిఫారసు చేసితిని. కాని, యీపని యయిన కొలఁదికాలమునకే వీరికి మృత్యువాసన్నమయ్యెను! వృద్ధురాలగు వీరి జనని యింకను జీవించియే యుండెను! ఆనెల తొమ్మిదవతేదీని వీరి గౌరవార్థమై జరిగిన బహిరంగసభకు నేనే యధ్యక్షత వహించితిని. ఈయన జ్ఞాపకార్థమై యేదేని శాశ్వతకార్య మొకటి చేయఁ బౌరులు సమకట్టిరి. ఈయనస్థానమున, నాయాలోచన ననుసరించి, కళాశాలా పూర్వవిద్యార్థి కొలచలమ కృష్ణసోమయాజులుగారు నియమింపఁబడిరి.

ఈ నెల ౨౦-వ తేదీని మాచెల్లెలి రెండవకూఁతురు సీతమ్మ వివాహమును, కుమారుఁడు జనార్దనుని యుపనయనమును కాకినాడ దగ్గఱ సర్పవరములో జరిగెను. ఆసమయమున నాఁడువారు పిల్లలు కూడరాఁగా ముప్పురన్నదమ్ములమును అచ్చటకు వెళ్లితిమి.

చనిపోయిన చెల్లెలు కామేశ్వరమ్మభర్త పింగళి సూర్యనారాయణ మరణించెనను దుఃఖవార్త మార్చి ౬-వ తేదీని మాకు వినవచ్చెను. ఈతని కిటీవల ద్వితీయవివాహము జరిగి, ఒక కొమార్తెయు నొక కుమారుఁడును గలిగిరి. నిడదవోలు ప్యాక్టరీకంపెనీలో గుమాస్తాగానుండి యభివృద్ధి నొందుచుండెడి యీతని కిపుడు మరణ మాసన్నమయ్యెను! మాచెల్లెలికుటుంబ మిట్లు సమూలముగ నాశన మగుట కడు దుస్సహముగ నుండెను!

ఈ మార్చి నెల తుదిని మాతమ్ముఁడు వెంకటరామయ్య జ్యేష్ఠపుత్రుఁడు నరసింహమూర్తి వివాహము రాజమండ్రిలో జరిగెను. మండలన్యాయసభలో పెద్దయుద్యోగి యగు పోడూరి వెంకయ్యగారి పెద్దచెల్లెలు సూర్యకాంతమును వీని కిచ్చిరి. మా కొక పెద్ద భవనము విడిద యయ్యెను. రాజమండ్రిమిత్రులు పలువురా సందర్భమున మా కగపడిరి. వివాహదినములలో నొకనాఁడు వీరేశలింగము పంతులుగారు మావిడిదకు విచ్చేసిరి. అపుడు వారితోఁ జాలసేపు మాటలాడితిమి. మరల వారి "హితకారిణీ పాఠశాల" లో ప్రథమోపాధ్యాయపదవి ఖాళీ యయ్యెను. ఈతరుణమందైన రాజమండ్రి రావలెనని నే నాలోచించితిని. కాని, యిపుడు కళాశాలలో ప్రథమోపన్యాసకపదవిలో నుండి, కొలఁదికాలములో నధ్యక్షపదవిని అధికవేతనమును నందనుండు నేను, రాజమండ్రియందలి యీ చిన్న పనికివచ్చుట తగదని వీరేశలింగముగారి యొక్కయు, మిత్రులు పాపయ్య సాంబశివరావుగార్ల యొక్కయు నభిప్రాయము. ఆపాఠశాలలో నిదివఱకు ద్వితీయోపాధ్యాయుఁడును, పర్లాకిమిడిలో నాపూర్వశిష్యుఁడును నగు జయంతి గంగన్నగారి కీ యుద్యోగ మపుడీయఁబడెను.

ఏప్రిల్ ౨౯-వ తేదీని "ఆస్తిక పుస్తకాలయ" ప్రవేశ మహోత్సవమునకు రమ్మని రాజమండ్రినుండి నాకు పిలుపువచ్చెను. పనితొందరవలన రాలేనని వీరేశలింగముపంతులు పాపయ్యగార్లకు నేను వ్రాసి, నాయొద్దనుండు "మనశ్శక్తి విమర్శనా సంఘము" వారి ప్రచురణము లన్నియును అట్టలు గట్టించి నూతనపుస్తకాలయమున నుంచుఁడని రాజమండ్రి పంపించితిని.

ఆ మేనెల ౫-వ తేదినాఁటికి పరీక్షాపత్రములు దిద్దుపని ముగించితిని. ఈ రెండు మూఁడునెలలును నేను పరీక్షా కార్యదీక్ష

నుంటిని. విశ్రాంతితోనుండు నా మనస్సు నిపుడు మరల విచారము ముట్టడించెను! కార్యనిమగ్నత నుండిననే గాని, నాహృదయము దుఃఖకూపమున మునుఁగి సిద్ధమగుచుండెను! ఇటీవల కొనినస్థలములో మేమొక కుటీరమేర్పఱుప వచ్చుననియు, కనీసము చుట్టు గోడలైనఁ బెట్టింప వచ్చుననియు, భార్య నాకు బోధించెను. నా మనస్సున కే పనియందు నిష్టము లేకుండెను!

ఈమాఱు ఆంధ్రరాష్ట్రీయసభలు కడపలో జరుగు నని తెలిసెను. మిత్రులు హనుమంతరావు వేంకటప్పయ్యగార్లు నన్నచటికిఁ గొనిపోయిరి. కడప మిగుల వెనుకఁబడియుండు ప్రదేశమువలెఁ దోఁచెను. ఉత్తరాదియాంధ్రులకును, అచటి తెలుఁగువారికిని వేషభాషాచారము లందు మిగుల వ్యత్యాసము గానఁబడెను. జూన్ ౧-వ తేదీని సభలు పూర్తికాఁగా మిత్రులతో నేనచటినుండి బయలుదేఱితిని. ఆరాత్రి మేము పండుకొనిన రైలుగదిలోని కొక యన్యుఁడు రెండవజామున వచ్చి కూర్చుండెను. పైబల్ల మీఁదఁ బండుకొనిన నేను వానిని గనిపెట్టుచునే కను లట్టె మూసితిని! ఇంతలో పెద్దశబ్దము వినుపింపఁగా నేను లేచి చూచు సరికి, ఆ మనుష్యుఁ డదృశ్యమయ్యెను! తోడనే మిత్రులను లేపి, వారి కీసంగతి చెప్పి, సామానులు సరిచూచుకొమ్మని హెచ్చరించితిని. పాపము హనుమంతరావుగారి పెట్టె పోయెను! ఆయన సొమ్ము, బట్టలు, టిక్కెట్టుకూడ నందే యుండెను! గుంటకల్లులో మే మీసంగతి పోలీసువారికి జెప్పితిమి. ఆస్తి దొరకలేదు.

ఈ సంవత్సరము గుంటూరు మండల సభలు సత్తెనపల్లిలో జరిగెను. నన్ను గ్రంథాలయసభ కధ్యక్షునిగ నెన్నుకొనిరి. సత్తెనపల్లి పరిశుభ్రమగు చిన్నపట్టణము. అచట ౫,౬,౭ తేదీలలో సభలు

జరిగెను. గ్రంథాలయసభలో, గ్రంథాలయోద్యమమును గుఱించి యధ్యక్షోపన్యాసమును జదివితిని. సాంఘికసభలో స్త్రీవిద్యను గూర్చి తీర్మానమును నేను బ్రతిపాదించితిని. అచట నేలకొల్పఁబడిన "మండల సంఘ సంస్కరణ సమాజము" నకు నన్నధ్యక్షుని గను, న్యాపతి నారాయణరావుగారిని కార్యదర్శిగను నెన్నుకొనిరి.

నేను గుంటూరుచేరిన మఱునాఁడే (౧౦-వ జూన్) మాపిల్లవాని స్మారకదినము! అకాలమరణ మందిన యర్భకునిస్మృతికై నేను విలపించితిని. నాదుఃఖమునకు మేరలేకుండెను. నాఁడే మామఱఁదలు లక్ష్మమ్మ చిన్నకొమరిత చనిపోయెనను దుఃఖవార్త తెలిసెను.

ఈ సంవత్సరము వేసవియందుకూడ గోదావరీమండల సంచారము మానుకొని, మేము గుంటూరియందె నివసించితిమి. సూర్యనారాయణ ప్రథమశాస్త్రపరీక్షయందు జయమంది, ఉన్నతవిద్యకై రాజమండ్రి వెడలిపోయెను. మాబావమఱఁది వెంకటరత్న మిపుడు స్వల్పమగు నుపకారవేతనముమీఁద నుద్యోగము చాలించుకొనెను.

## ౨౧. గృహాశంకుస్థాపనము

పాపము బంగారయ్య తనవిద్యనుగుఱించి చేసిన చిల్లరయప్పులింకను తీఱనెలేదు! గుంటూరిలో వెంకటప్పయ్యగారికిని, మఱికొందఱికి నాతఁడు కొంత బాకీపడియుండెను. అతని బావమఱఁది నాకుఁ గొంత సామ్మంపఁగా, ఋణదాతలతో నేను మాటాడి, వారిబాకీసొమ్ము తగ్గించి పుచ్చుకొనునటు లొడఁబఱిచితిని. అల్పజ్ఞులగు మర్త్యుల మనోరథములిట్లె సఫలమగుచుండును!

## ౨౧. గృహ శంకుస్థాపనము

అగస్టునెల మధ్య ప్రత్యేకాంధ్ర రాష్ట్రీయసభలు గుంటూరు పురమున జరిగెను. ఉత్సాహపూరితుఁడనై కొన్నిసభలకు నేను బోయితిని. ఆదినములందు గుంటూరునందు విషజ్వరములు ప్రకోపించి యుండెను. ౨౨-వ తేదీని నేనును మఱునాఁడు భార్యయు, పిమ్మట నరసింహ రామచంద్రులును, జ్వరపీడితుల మైతిమి. ఇంట మేము నలుగురమును మంచ మెక్కి యుండునప్పుడు, వేదయవ్వ యొకతె వంట చేసిపెట్టి, మాకు సాయముచేసెను. ౨౫-వ తేదీని మాతమ్ముఁడు వెంకటరామయ్య గుంటూరు వచ్చి మమ్ముఁ జూచి పోయెను.

సెప్టెంబరు ౭-వ తేదీని జరిగిన మాయత్తగారి సాంవత్సరిక సందర్భమున వెలిచేరులో బంధువులు సమావేశమైరి. నేను నచటికి బోయితిని. ఆసమయమున మామఱఁదలు చామాలమ్మయు, ఆమె యిద్దఱు కూఁతులును విషజ్వరమునకు లోనయిరి. మాబావమఱఁది వెంకటరత్నమిపుడు కడియము తాణాదారుగ నుండెను. ఒక డింగీ కుదిర్చి, ఆతనికుటుంబమును సామానులను మేము వెంటఁ గొని, ౧౨-వ తేదీని కడియము చేరితిమి. ౧౪-వ తేదీని నేను వెంకటరత్నమును రాజమండ్రివెళ్లి, ఆనందాశ్రమమున వీరేశలింగము గారి దర్శనముఁ జేసితిమి. ఆయన యారోగ్యవంతులుగనే యుండిరి. మఱునాఁడు నేను గుంటూరు వచ్చితిని.

అక్టోబరు మొదటిభాగమున, ఇరుగుపొరుగున నుండు స్నేహితులకుఁ గష్టములు సంభవించెను. ఉన్నవ లక్ష్మీనారాయణగారి భార్య లక్ష్మీబాయమ్మగారికి మూర్ఛలు వచ్చుచుండెను. వైద్యులు రాఘవాచార్యులుగారిని బిలిపించితిమి. కొలఁది కాలమున కామెకు నెమ్మది గలిగెను. సత్తిరాజు కామేశ్వరరావుగారి భార్యయు

శాయన్న పంతులుగారి రెండవ కొమార్తెయును జనిపోయిరని తెలిసి మిగుల విచారము నొందితిమి.

బ్రాడీపేటస్థలమున నేను జిన్నయిల్లు కట్టుట యుక్తమని నాకిప్పటికి నచ్చెను. అక్టోబరు ౧౫-వ తేదీని వెంకటప్పయ్యగారు మా నూతనగృహస్వరూపము కాకితమున గీచినాకుఁ జూపించిరి. మఱునాఁడె మాయింటికి శంకుస్థాపనము జరిగెను. ఇంటికిఁ గావల సిన రాలు తెప్పించుటకును, బావి త్రవ్వించుటకును నే నంత ప్రయత్న ములు చేసితిని. ఇంతలో విషజ్వరములు మఱింత ప్రబలుట చేత గుంటూరుకళాశాల పదిదినములు మూసివేయఁబడెను. తననగలు కొన్ని యమ్మివేసి, భార్య నాచేతికి వేయిరూపాయి లిచ్చుటచేత, ప్రస్తుత మున వంటయిల్లు ప్రహరి గోడయును గట్టుటకు నేను బూనుకొంటిని.

నవంబరు ప్రారంభదినములలో గుంటూరుపురమున దివ్యజ్ఞాన సమాజసభలుజరిగెను. ఎంతో శ్రమపడి న్యాపతి హనుమంతరావుగారు కట్టించిన దివ్యజ్ఞానసమాజభవనమునకు అనిబిసంటమ్మగారు ప్రవేశ మహోత్సవము సలిపిరి. ఆసందర్భమున నిచ్చిన యుపన్యాసములను బట్టి యానారీమణి శక్తిస్వరూపిణివలెఁ గానవచ్చెను.

టర్కీ ఆస్ట్రియాదేశములు మిత్రమండలిచేఁ బరాజిత మ య్యె నని ౫-వ తేదీని వార్త తెలిసెను.

ఈ సంవత్సరమున రాజమంద్రిలో నైనను మంచిశేఁకు చౌకగ దొరకదని మిత్రులు చెప్పిరి. కావున ప్రస్తుత మొక వంట యిల్లే యేర్పఱచుట మంచిదని నాకుఁ దోఁచెను. ఇపుడు బావి త్రవ్వుపని ప్రారంభమయ్యెను. రాలు మొదలగు పరికరములు వచ్చు చుండెను. ఈసమయమున మాస్థలమునకుఁ జేరువున నివసించుట

## ౨౧. గృహ శంకుస్థాపనము

యుక్తమని తోఁచి, నవంబరు ౨౮-వ తేదీని మేము అరండలుపేట వదలి, బ్రాడీపేటలోని గడియారమువారియింటఁ బ్రవేశించితిమి.

గత సంవత్సరమునవలెనే యీ యేటఁగూడ గుంటూరిలో బొబ్బలరోగము వ్యాపించెను. ప్రాఁతగుంటూరు, అగ్రహారము, అరండలుపేటలలో క్రమక్రమముగ నీవ్యాధి యల్లుకొనియెను. కావున మేము స్థలము మార్చుట శ్రేయస్కర మయ్యెను. ౬-వ తేదీని ప్రహరిగోడ పునాదు లారంభించితిమి. అపుడె మా బావమఱఁది పంపిన యంటుమామిడి మొలకలు పెరటిలో పాతించితిమి.

బ్రాహ్మమతప్రచారమునకై గుంటూరి కేతెంచినమిత్రులు పాలావజ్ఝల లక్ష్మీనారాయణగారు, నాబాల్యస్నేహితుఁడగు కొండయ్యశాస్త్రి మూఁడునెలలక్రింద చనిపోయెనను వార్త చెప్పి నాకమిత విషాదమును గలిపించిరి. పిఠాపురము దివానుగారగు మొక్కపాటి సుబ్బారాయఁడుగారు దివంగతులయిరని ౨౫-వ తేదీని నాకుఁ దెలిసెను. నాకు వీరితో నంతగఁ బరిచయము లేకుండినను, వీరు ఉదారస్వభావులనిమాత్రము తెలియును. చిలుకూరి వీరభద్రరావుగారి "ఆంధ్రులచరిత్ర" ప్రకటనమునకు సహాయము చేయుఁడని నేను గోరఁగా, వెనువెంటనే యొక నూఱురూపాయిలు వీరు వీరభద్రరావుగారి కంపిరి. ఆకాలముననే వీరభద్రరావుగారిని బెజవాడయందలి యొక లక్షాధికారియొద్దకు నేను గొనిపోఁగా ఒకరూకయైనను ఆయన వలన లభింపదయ్యెను! కొలఁదికాలములోనె యాలక్షాధికారి మృతి నందెను. ఆయన ధనరాసులు భస్మీపటలము లయిపోయెను! ఆహా! తమ యసువులు నైశ్వర్యములును ప్రపంచమున స్థిరసంస్థలని మురిసి మనుజు లెట్లు మోసపోవుచున్నారు!

## ౨౨. గృహప్రవేశము

౧౯౧౯-వ సంవత్సరమందలి తొలినెలలలో నాచేతులకుఁ బని పూర్తిగఁ దగిలియుండెను. కళాశాలలో విద్యబోధించు రెండుమూఁడు గంటలు తప్ప, దినమంతయు నింటిపనిచేయు వడ్రంగులు, బేలుదార్లు మున్నగు వారలతోఁ బ్రొద్దుపుచ్చుచుండువాఁడను. మార్చి మధ్యభాగమున మాగృహప్రవేశము జరిగెను. ఆ సమయమున సోదరీసోదరులు మఱఁదండ్రు, పిల్లలు మున్నగు బంధుజనులు వచ్చి, మా కానందము గలిగించిరి. ఆ సందర్భమున పురమందలి స్నేహితులకు విం దొనర్చితిమి. నూతనగృహము చొచ్చిన మాకు నూతనలోకవిలోకనము చేయునటు లయ్యెను!

అంత కొంతకాలమువఱకును నా సంపాదించిన ద్రవ్యము గృహనిర్మాణమునకె వినియోగ మగుచుండెను. అప్పుమాత్రము చేయక, కుటుంబపోషణమునకు వలసినసొమ్ము పోఁగా మిగిలిన యాదాయ మంతయు నింటికట్టునకె వ్యయము చేయుచుంటిని. కళాశాలాధ్యక్షుఁడగు రూల్లెదొరగారు గంభీరస్వభావుఁడు, మితభాషియు నయ్యును, దయార్ద్రహృదయుఁడగు సరసుఁడు. వలసినపుడు నా కాయన కొంచెముసొమ్ము ముందుగ నిచ్చుచుండువాఁడు. కావున నే నప్పుల మునుఁగక, ఆదాయమునకు మించని వ్యయమె చేయుచు, మెలఁకువతో గృహనిర్మాణకార్యము సాగించితిని.

౧౯-వ సంవత్సరమందలి నా ప్రవేశపరీక్షాపత్రము వెనుకటి సంవత్సరపుఁ బ్రశ్నపత్రమువలెనె యుండెను. విద్యార్థుల తెలివితేటలు, పరిశ్రమాదులు నద్దానివలన బాగుగఁ బరిశోధింపఁ

బడుచుండెనని లోకు లనుచుండిరి. ఈ పరీక్షవలన సంవత్సరమున కేనూఱురూపాయిలు నాకు వచ్చుచుండెను. గృహనిర్మాణమున కీసొమ్మంతో సహాయకారి యయ్యెను.

ఈ సంవత్సరమందలి వేసవియు మేము గుంటూరనే కడపితిమి. ఈమాఱు మండలసభలు దాచేపల్లిలో జరిగెను. రాజకీయ సభకు శ్రీ చల్లా శేషగిరిరావుగా రధ్యక్షులు. స్థాయి సంఘమునకు నధ్యక్షుఁడనగు నేను సంఘసంస్కరణసభలో పాల్గొంటిని. దాచేపల్లిలోని నాగులేఱు, నాపరాలు, తమలపాకుఁదోఁటలును దర్శనీయములుగ నుండెను. భావికాలపు చిత్రకథారచనమున కీప్రదేశమును రంగస్థలముఁ జేయ సంకల్పించుకొంటిని.

గృహప్రవేశసమయమునకు మా మామగారు గుంటూరు రాలేదు. అప్పు డాయన కడియములో వ్యాధిగ్రస్తులయి యుండిరి. ఒకటి రెండు మాసములలోనె యాయన పరలోకప్రాప్తిఁ జెందిరి. పరీక్షల తొందరలో నుండినను నే నాయనను తుది దినములలోఁ జూడఁబోయితిని. నారాక కాయన మిక్కిలి సంతోషించి, నాసోదరుని పుత్రు నొకనిని నన్ను దత్తుచేసికొను మనియు, తనకుమారునితో వియ్యమందు మనియు నాకు హితబోధనముఁ జేసిరి. ఆదినములలోనె నాకళాశాలామిత్రులు పువ్వాడ వెంకటరెడ్డిగారును చనిపోయిరి.

శ్రీకొండ వెంకటప్పయ్యగారు చెన్నపురి శాసననిర్మాణసభ కభ్యర్థులుగ నిలువ నుద్దేశించి, వోటర్లను దర్శించుటకై గోదావరిజిల్లా కేగుచు, నన్నుఁ దమతో రమ్మనిరి. కావున నే నావేసవి సెలవులలో వారితో కాకినాడ, రామచంద్రపురము, అమలాపురము తాలూకాలు సంచారము చేసితిని. అమలాపురమున నుండఁగా

ఆయనకు జబ్బుచేసెను. కొంతనెమ్మది పడినపిదప, నే నాయనను విడిచి, అమలాపురము రాజమంద్రి తాలూకాలలో కొన్నిగ్రామములు పోయి, పంతులుగారినిమిత్తమై కృషి సలిపి, గుంటూరు తిరిగివచ్చితిని. వెంకటప్పయ్యాగా రంతట చట్టనిర్మాణసభ్యులుగ నెన్నుకొనఁబడిరి.

గృహప్రవేశ మైతి మనుమాటయే కాని, మా ప్రహరిగోడయు, నింటికిటికీల తలుపులు మున్నగునవి యెన్నో యింకను పూర్తి కాలేదు. అందువలన పిమ్మట కొన్నినెలలవఱకు నింటిపనినుండి మాకు విరామము కలుగదయ్యెను.

౧౯౧౯ మెయి ౨౭-వ తేదీని ఆంధ్రదేశ నాయకమణి యగు కందుకూరి వీరేశలింగముపంతులుగారు మద్రాసునఁ గాలధర్మమునొందిరి. వారి గౌరవార్థమై గుంటూరిలో నంతట జరిగిన సభలలో నేను పాల్గొని, దేశోద్ధరణమునకై పంతులుగారు చేసిన కార్యముల నగ్గడించితిని. "హితకారిణీసమాజము" వారు జూలై నెలలో రాజమంద్రిలో పంతులుగారిగౌరవార్థమై జరిపినసమావేశములకు నేను బోయితిని. ఆమహామహుఁడు తలపెట్టిన సత్కార్యములు కొనసాగించుటయె యాయన నుచితరీతిని గౌరవించుట యని నేను చెప్పితిని.

ఆగష్టునెలలో బెజవాడలో జరిగిన "సహకార సంఘ" సభలకు నేను బోయియుండునపుడు, "హిందూదేశసేవక" సమాజసభ్యులగు శ్రీ వెంకటసుబ్బయ్యగారు నాకుఁ బరిచితులయిరి. వారి యొక్కయు, వెంకటప్పయ్యగారియొక్కయు కోరిక ననుసరించి నేను వీరేశలింగముపంతులుగారినిగూర్చి యొకయాంగ్లవ్యాసము వ్రాసి,

పైసమాజమువారి "హిందూదేశసేవికా" పత్రికలోఁ బ్రచురించితిని. నావ్యాసము ఆపత్రిక ఆగష్టు ౨౮-వ తేదీ పత్రికయందును, మఱుసటి వారపత్రికయందును బ్రకటింపఁబడెను.

నా యాంగ్లవ్యాసమునందలి ముఖ్యాంశము లిందుఁ బొందు పఱుచుచున్నాఁడను:—"ఆధునికాంధ్రజనులలో నగ్రస్థాన మలంకరించి, అర్ధశతాబ్దకాలము దేశసేవ లొనరించి ధన్యులైన పంతులు గారు మేధావంతులు, కార్యశూరులు, సాహిత్య విశారదులు, సంఘ సంస్కార వేత్తలును. వితంతువివాహ సంస్కరణమును ఆంధ్రావనిని ప్రప్రథమమున నెలకొల్పిన ధైర్యశాలులు. తన కెన్ని కష్టము లాపాదిల్లినను పట్టినప్రతిన విడువక, ఆంధ్రజనుల హృదయ సీమల యందు సంస్కరణాభిమానబీజముల నాఁటిన మహనీయులు. నవీనాంధ్రవాఙ్మయమున కీతఁడు సృష్టికర్త. సాంఘికవిషయములం దీతఁడు సాధింపని సంస్కరణవిశేషము లేనేలేదు. ఆంధ్రదేశ మాతకు వీరిరచనములు, వీరి సౌశీల్యసచ్చారిత్రములును వెనలేని భూషణములు."

గుంటూరు ప్రార్థనసమాజమున కని నేను కొనిన వెనుకటి స్థలమున కంటియున్న స్థలము నొకదానిని డిశెంబరులో కొంటిని. ఇట్లు నేను ఒకవేయిరూపాయిలు కర్చుపెట్టితిని. దీనికై మిత్రులు కొందఱు చందాలిచ్చిరి. కాని, యామొత్తములు మిగుల స్వల్పము గుటచేత, అంత వ్యయమును నేనె వహింపఁబూని, ఎవరిచ్చినసొమ్ము వారి కిచ్చివేసితిని.

మా నూతనగృహమునఁ జేరియుండు విశాలమగు పెరటిలో నీసంవత్సరమున వివిధజాతుల దోసకాయలు కాచినవి. అవి మే మను

బడెను. గుంటూరు కళాశాలలో నే నిచ్చవచ్చినంతకాలము నిలువ వచ్చును. నాజీతముకూడ ప్రోత్సాహకరముగనే యుండెను. కాని, యీ క్రైస్తవ విద్యాలయమున నాబోటి హిందువున కెన్నఁడు నధ్యక్షకపదవి సమకూరుట యసంభవము. అందువలననె కదా నేను కొంతకాలముక్రిందట సేలము కళాశాలాధ్యక్షపదవికై ప్రయత్నించితిని. మున్నూఱు మొదలు నన్నూఱు రూపాయిలవఱకును జీతముగల యీ నెల్లూరు కళాశాలాధ్యక్షకోద్యోగమునకుఁ బ్రయత్నింపవలె నని నాకుఁదోఁచెను. నా కిదివఱకు విద్యాలయములందును, కళాశాలలలోనుగల పెక్కేండ్లయనుభవమునుబట్టి నా కీనూతనపదవి లభింపఁ గలదని మిత్రులు ప్రోత్సహించిరి. నాదరఖాస్తును స్టాక్సుదొరగారి సిఫారసుతో నంపివేసితిని. నెల్లూరు విద్యాలయ పాలక వర్గసభ్యులకు మిత్రులచే నన్నుగుఱించి యుత్తరములు వ్రాయించితిని. మిత్రులు నూతనబంధువులునగు శ్రీపోడూరి వెంకయ్యగారీసమయమున నెల్లూరు జిల్లాకోర్టులో నుద్యోగిగ నుండిరి. నన్నుగుఱించి నెల్లూరు ప్రముఖులకు ఆయన గట్టిసిఫారసుచేసిరి. అంతట, నెల్లూరు వాస్తవ్యులును, విజయనగర కళాశాలలో నుపన్యాసకులు నగు శ్రీమామిడిపూడి వెంకటరంగయ్యగారి కాయుద్యోగమీయఁబడెను. కాని, తమకీ యుద్యోగ మక్కఱలేదని వెంకటరంగయ్యగారు చెప్పివేయుటచేత, ఆపని మరల ఖాళీయయ్యెను. ఈమాఱు నేను గట్టిప్రయత్నము చేసితిని. ఆ యేప్రిలు నెలలో ప్రవేశపరీక్షాధికారుల సభకు నేను మద్రాసు పోయివచ్చుచు నొకదినము నెల్లూరిలో నిలిచి, ఆకళాశాలా పాలకవర్గ సభ్యుల దర్శనము చేసివచ్చితిని. ఈ మాఱు ఆసభవారి కను లిద్దఱిమీఁదఁ బడినట్లు నాకుఁ దెలియవచ్చెను. ఇదివఱ కాపాఠశాలలో ప్రథమోపాధ్యాయులుగ నుండు సంతానరామయ్యంగారికిఁ

గాని, నాకుఁగాని యీయుద్యోగము లభింపవచ్చునని తెలిసెను. నా పూర్వసహపాఠియగు నయ్యంగారు అనుభవశాలులగు ప్రతిభావంతులె కాని, యాయన యమ్. ఏ. పరీక్ష నీయకుండుటయు, కళాశాలలోఁ ఏగినంత నవీనానుభవము లేకుండుటయు వారిలోపములుగ నెన్నఁబడియెను. వీరియందుఁ గొందఱు సభ్యులకు సదభిప్రాయము లేదనికూడఁ దెలిసెను. ఐనను, నెల్లూరిలో నిల్లు కట్టి చిరకాలమచటనె నివసించిన యయ్యంగారికె యీ యుద్యోగము కావచ్చునని నే ననుకొంటిని.

ఇంతలో వేసవిసెలవులకు మేము భీమవరము వెడలిపోయితిమి. మాతమ్ముఁడు వెంకటరామయ్య కొమార్తె సీతమ్మ కపుడు వివాహము జరిగెను. ఏలూరునివాసియు, పట్టపరీక్షలో జయమందిన యువకుఁడునగు బొమ్మిరెడ్డిపల్లి రాజగోపాలరావు వరుఁడు. నెల్లూరి యుద్యోగము నాకు లభించెనని పెండ్లిమూఁడవనాఁడు నాకు తంతి వచ్చెను. ఈ సంతోషవార్త వివాహసందర్భమందలి మాయానందము నినుమడింపఁజేసెను. పెండ్లి ముగిసినవెంటనే మేము గుంటూరు తిరిగి వచ్చితిమి. స్థిరమగు గుంటూరి కళాశాలలో నున్నతపదవి నంది, యిటీవలనే యిట స్థిరనివాస మేర్పఱుచుకొనిన నేను, అంత సుస్థిరము కాని నూతనోద్యోగమున కంజవేయుట యసమంజసమేమో యని సందియ మందితిని. కనీసము కొన్ని వత్సరములైన నాకీనెల్లూరియందలి నూతనోద్యోగము స్థిరమని వాగ్దానము పడయుఁడని మిత్రులు కొందఱనిరి. కాని, యిట్టి నూతనసంస్థల స్థిరత్వమును గూర్చి యెవరు బాధ్యత వహింతురు? స్వయంకృషి మీఁదను, కరుణానిధియగు దేవదేవుని యనుగ్రహముమీఁదను భారము వైచి, నేనీ నూతనోద్యోగస్వీకారము చేసితిని. జూను నెలారంభమున నె

నెల్లూరు రమ్మని యాకళాశాలకార్యదర్శి నన్నుఁ గోరిరి. గుంటూరి కళాశాలాధ్యక్షులు నాకోరికమీఁద నెలవులలోనె సంతోషపూర్వకముగ నాకు వీడుకోలొసంగిరి. అంత ౩౦-వ మేయి తేదీని నేను గుంటూరునుండి బయలుదేఱితిని.

౧౯౨౦-సం. జూను మొదటి తేదీని నేను నా నెల్లూరి యుద్యోగమునఁ బ్రవేశించితిని. ఈజూను నెలలోనె కళాశాల నెలకొల్పుటకు వలయుపను లెన్నియో నేను చేయింపవలసివచ్చెను. కావున కళాశాలకు సమీపముననుండు నొక గృహమును బుచ్చుకొని మరల గుంటూరు వెళ్లి, వస్తువులు సరదుకొని, ధర్మగృహనిర్మాణకార్యము పాలపర్తి నరసింహముగారి కొప్పగించి, ౯-వ జూనున సకుటుంబముగ నెల్లూరికిఁ బయనమైతిని. మేము నెల్లూరిలో బసచేసిన యిల్లు వండువారి వీధిలోని మహాదేవమొదలియారుగారి మేడ. ఆయనయు, వారిభార్య ఉన్నామలమ్మగారును సజ్జనులె, సాత్త్వికస్వభావులును. నెల్లూరిలో నివసించినంతకాలమును మేము వారి యింటనే విడిసియుంటిమి. ఆయిల్లు చిరకాలముక్రిందటఁ గట్టఁబడినను, బలిష్ఠముగను 'నాళ్లి' నడుమను నుండుటచేత, చోరభయ మెఱుఁగక, మే మందు శాంతచిత్తమునఁ గాలము గడపితిమి.

కళాశాలకుఁ గావలసిన సామానులన్నియు నేనిపుడు చేయించితిని. పుస్తకములు సమకూర్చితిని. భాండాగారమునకు కొనిన పుస్తకములు బీరువాలలో సరదించితిని. రాజాగారి పాఠశాలాభవనమున దక్షిణమువైపున నున్న మేడలో కళాశాలతరగతులు జరుపుచుండుట కేర్పఱచితిమి.

జూలై ౨-వ తేదీని శ్రీ వెంకటగిరి మహారాజాగారు కళాశాల తరగతికి ప్రారంభోత్సవము జరిపిరి.

# ౨౩. నెల్లూరు కళాశాల

రాజాగారి పాఠశాలలో ప్రథమోపాధ్యాయులగు సంతాన రామయ్యంగారు తమకుఁ గళాశాలాధ్యక్షపదవి చేకూరకుండుట కాగ్రహించి, వేసవి సెలవులలోఁ దమపదవికి రాజీనామా నిచ్చిరి. నే నీ కళాశాల ప్రవేశించినతోడనె నా పూర్వమిత్రులు, ననుభవశాలులునగు నయ్యంగా రిట్టు లావిద్యాశాలను విడనాడుట నాకు బొత్తిగ నిష్టములేదు. తమ రాజీనామాను ఉపసంహరింపుఁడని అయ్యంగారికి నేను హితోపదేశము చేసితిని. కళాశాలాపరిపాలకవర్గములో నధ్యక్షునికివలెనే తనకును స్థానమిచ్చి, పాఠశాలశాఖాపరిపాలనమునఁ దనకు సర్వాధికార మొసఁగినచో, తాను పాఠశాలను విడువనని యయ్యంగా రంత చెప్పిరి. నాయోజనమీఁద వారికోరికను పాలకవర్గమువారు మన్నించిరి. కావున సంతానరామయ్యంగారు పాఠశాలలోనే యుండిరి.

౧౯౨౦ జులై నెల యారంభమునుండియు కళాశాల తరగతిలోనిపని సక్రమముగ జరుగుచువచ్చెను. ఆ సంవత్సరమునందు పదునెనమండ్రు విద్యార్థులుండిరి. ప్రకృతిశాస్త్రముబోధింప మేము పూనుకొనలేదు. కావున, విద్యార్థు లందఱును మూఁడవ శాఖలోనే చేరి చదివిరి. కళాశాల కిపుడు నాతో నలుగురె యుపన్యాసకులు. కాజ శివరామకృష్ణారావుగారు చరిత్రయు, రాఘవన్ గారు తర్కమును, దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు తెలుఁగును, నేను ఆంగ్లమును బోధించు చుంటిమి. మొదటి సంవత్సరమున నంతగఁ బని లేకుండుటచేత, ఇంగ్లీషున నాకు శివరామకృష్ణారావుగారు సాయము చేయుచువచ్చిరి.

నాతమ్ముఁడు వెంకటరామయ్య పెద్దకుమారుఁడు నరసింహమూర్తి నెల్లూరు వచ్చి మావిద్యాశాలలో ప్రవేశపరీక్షతరగతిలోఁ

జేరి చదివెను. నా బావమఱఁది వెంకటరత్నము కొడుకులు నరసింహము బుచ్చిరామయ్యలు చిన్నతరగతులలోఁ జేరిరి.

ఇదివఱకు దొరతనమువారి కొలువులో తెలుఁగు ట్రాన్స్లేటరుపదవిలో నుండిన మిత్రుఁడు గోటేటి కనకరాజు కొంత కాలము క్రిందట పక్షవాతరోగమునకు లోనై, పని పోఁగొట్టుకొని స్వస్థలమగు పాలకొల్లు చేరెను. తాను వెతలఁ బెట్టిన రెండవసతియె యిపుడాతనికి గతియయ్యెను! కాలవైపరీత్య మిటు లుండును. ఈతనికి నే నప్పుడప్పుడు కొంచెముగ సొమ్మంపుచు సాయము చేయుచుండు వాఁడను.

## ౨౮. నెల్లూరునివాసము: రెండవవత్సరము

నేను గుంటూరు కళాశాలయం దుండిన చివర తైదేండ్లును, నెలనెలయును నాజీతములో రూపాయి కొక యణావంతున కళాశాల 'సహాయకనిధి' లో నిలువచేసికొని యుండువాఁడను. ఇటు లైదుసంవత్సరములు సొమ్ము పెరిఁగిన హేతువున, ౧౯౨౦-వ సంవత్సరము జులై నెలలో నేనచటి యుద్యోగమును విరమించిన సమయమున వడ్డితోఁ గలసిన నా సొమ్ము మొత్త మంత మొత్తమును కళాశాలాధికారులు తాము జేర్చి, ౧౭౩౦ రూపాయిలు నా కప్పడొసంగిరి.

౧౯౨౦-వ సంవత్సరము తుదిభాగమున నాకు నెల్లూరుకళాశాలలోని యొక యుపాధ్యాయునితోఁ గొంత సంఘర్షణము గలిగెను. అనుభవశాలియైనను, ఆయన యుచితజ్ఞత గలిగి మెలఁగ నేర్చినవాఁడు కాఁడు. సమయపాలనవిషయమై యశ్రద్ధ వహించి యుండెడివాఁడు. దీనిని గుఱించి పలుమాఱు నే నాయనను హెచ్చ

రించినను లాభము లేకుండెను. నవంబరునెలలో నొకనాఁ డాయన కళాశాల కాలస్యముగ వచ్చి, తాను సకాలముననె వచ్చితి నని చెప్పి, తన సత్యసంధత విషయమై సందియ మందితి నని నామీఁదనె యలుకఁ జెందెను! ఆయనతీరు నాకేమియు బాగుగఁ గనఁబడక, దీనినిగుఱించి తగిన చర్య కై కొనుఁడని విద్యాలయపాలకవర్గము వారికి విజ్ఞాపన మంపితిని. వా రెటులో మాకు తాత్కాలికసమాధానము కుదిర్చిరి. కాని, పిమ్మట నైనను ఆయన తనలోపములను సవరించుకొన కుండెను.

ఆ డిశంబరు చివరరోజులలో మా చెల్లెలితోను, ఆమె పిల్లలతోను గలసి తిరుపతియాత్ర చేయ మేము సంకల్పించుకొంటిమి. కాని, ఆరోజులలో జరిగెడి నెల్లూరు “మండలప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల” ప్రథమసమావేశమునకు నన్నధ్యక్షత వహింపుఁడని యేతత్సామాజికకార్యదర్శులు కోరుటచేత, యాత్రకు మా యాఁడువాండ్రను పిల్లలను బంపివైచి, నేను పురమున నిలిచి సభాకార్యక్రమము జరిపించితిని. “ఉపాధ్యాయగౌరవపరిరక్షణ” మను శీర్షికగల యుపన్యాసము నే నాసందర్భమునఁ జదివితిని. దానిసార మే మనఁగా, “ప్రాథమికవిద్య జాత్యభివృద్ధికి మూలాధారము. ప్రాథమికపాఠశాలలలో రెండు తరగతులు గలవు. దేశీయపద్ధతుల ననుసరించి పూర్వపురీతిని విద్య నేర్పెడి బడులు మొదటిజాతిలోనివి. ఈ తరగతి విద్యాలయ కార్యక్రమమునఁ గొన్ని మార్పులతో, నూతనోపకరణముల సాహాయ్యమున విద్యాబోధనము నెఱపెడివియె రెండవతరగతి విద్యాలయములు. ఈ పాఠశాలలలో బోధకుని కనేక కష్టములు గలవు. అతనికి తగిన జీతము లేదు. బోధనాభ్యాసనపాఠశాలలో నతఁడు మొదటఁ గడపవలసిన కాలపరిమితి

యిటీవల సంవత్సరమునుండి రెండు సంవత్సరములు పొడిగింపఁబడినది. బోధకులకు పరీక్షాధికారులకును వైషమ్యములు గానవచ్చుచున్నవి. దేశభాష తెలిసినవారే కాక, ఆభాష మాతృభాషగాఁగల స్వదేశీయులును పరీక్షాధికారు లగుట ముఖ్యము."

నిరుడు శీతకాలమున నేను "కమలాక్షి" యను చిన్న నవలను గుంటూరునందు రచించితిని. ఇపు డది యీశీతకాలపు సెలవులలోఁ జదివి, దానిలోఁ గొన్ని మార్పులు చేసి, నామిత్రులును, కళాశాలలో నాంధ్రపండితులును నగు శ్రీ సుబ్రహ్మణ్యశర్మగారికిఁ జూపితిని. అది ప్రచురించుటకు యోగ్యముగ నుండె నని వా రభిప్రాయపడిరి.

మా కళాశాలా విద్యార్థులకు శరీరవ్యాయామ మేమియు లేకుండుటకు నేను వగచితిని. అనుదినమును డంబెల్సుతో కసరతు చేయుఁడని నేను నావిద్యార్థులకు బోధించి, కొన్ని దినములు వారిచే నావ్యాయామము చేయించితిని. కొన్ని దినములవఱకును వా రుత్సాహకము చేసి, పిదప మెల్ల మెల్లగ దానిని మానివేసిరి.

ఒకనాఁడు కళాశాలాపఠనాలయపుగదిలో విద్యార్థులకేకలు విని, నేను వారిని వారించితిని. అంతట నొక విద్యార్థి ప్రేరేపణమునఁ దక్కినవారిలోఁ గొందఱు నాతరగతిలోనికిఁ గొన్నిరోజులవఱకును రాకుండ సమ్మె కట్టిరి. పిమ్మట నేను తరగతిలో వారితో మాటాడి సమ్మెలో నుండువారిని క్షమించితిని. అంత పరిస్థితులు యథాప్రకారముగ నడువఁ జొచ్చెను.

౧౯౨౨ సం. ఫిబ్రవరి మాసమధ్యమున "యూనివర్సిటీ కమీషను" వారు మా కళాశాలను సందర్శింప వచ్చిరి. ఇంక ముందు కళాశాలలో తెలుఁగునకుఁ దోడుగ ఉర్దు, అఱవము,

సంస్కృతమును ప్రారంభింతు మని మేము చెప్పితిమి. వారు దీని కంగీకరించిరి.

ఆఫిబ్రవరినెల తుదికి మూఁడునెలల జీతములు మాకళాశాలలో బోధకుల కీయవలసి యుండెను. ముందుకూడ నిటులె యుండునేమో యని నేను భీతిల్లితిని.

మార్చినెల చివరరోజులలో కొందఱు స్నేహితులతోఁ గలసి నేను గుడ్లూరు పోయితిని. శర్మగారు ఎత్తా ప్రెగడను గుఱించి యుపన్యాసము చేసిరి. నేనుగూడ మాటాడితిని.

హరిద్వారమునుండి వచ్చిన గోపాలదాసు బ్రహ్మచారియను సాధువు నా కొకనాఁడు నెల్లూరను గనఁబడి, నాచేత నొక కాకితములో చదరపుగడులు గీయించి, ఆగడులలోఁ నా పుట్టిన సంవత్సరము, మాసము, దినము, మున్నగునవి నేను రహస్యముగ వ్రాసి, ఆకాకితమును మడిచి నాజేబులో నుంచుకొమ్మని చెప్పెను. అంత నా కాకితములోని సంగతులు క్రమము తప్పక యతఁడు చెప్పఁగా, పదునాఱు అంశములలోను పదునాలుగు సరిగ నుండెను! తన రెండు పొరపాటులును ప్రమాదమునఁ గలిగినవెయని యతఁడు వాక్రుచ్చెను. దీనినిబట్టి యతఁడు పరులయూహలు సరిగ గ్రహింపఁ గలవాఁ డనుకొంటిని. భవిష్యత్తును గూర్చి యాయన చెప్పిన జోస్యములో నేమాత్రమును సత్యము లేకుండెను.

కావలి కొక జ్యోతిష్కుఁడు వచ్చెనని తెలిసి, ౨-వ యేప్రిలున శర్మగారు, నేను నచటికి కేగితిమి. మఱునాఁ డాయన నింకొక గ్రామమునఁ గలసికొంటిమి. నేను కాకితముమీఁద వ్రాసికొని జేబులో నుంచుకొనిన యిరువది ప్రశ్నలను వెంటవెంటనే యాయన

యొక పలకమీఁద వ్రాసి చూపించెను! ఇది నా కాశ్చర్యము గొలిపెను. కాని, వాని కాయన యిచ్చిన ప్రత్యుత్తరములలో ననేకములుమాత్రము సరిగ లేవు.

మహాత్మాగాంధిగారు ౭-వ తేదీని నెల్లూరు దయచేసిరి. కళాశాలా క్రీడారంగమునందలి మైదానమున గొప్ప బహిరంగసభ జరిగెను. ఆయనకు రెండు స్వాగతపత్రములు నెల్లూరిపౌరులు నివేదించిరి. పలువురు సొమ్ము నగలును విరాళ మిచ్చిరి. ఆ సందర్భమున వచ్చిన కొండ వెంకటప్పయ్యగారు మాయింట బసచేసిరి.

౮-వ యేప్రిలునఁ గూడిన కళాశాలాపరిపాలకవర్గసభలో నెనుకటి యుపాధ్యాయుని లోపములను గూర్చి నేను జెప్పితిని. కార్యదర్శి నరసింహాచార్యులుగారు నా వాక్యములు బలపఱిచిరి. మా కిద్దఱికి నిఁక పొసఁగ దని సభ్యులు గ్రహించి, ఆయనను కళాశాల వీడుఁ డని చెప్పివేయుటకు తీర్మానము చేసిరి. అబోధకుని యవస్థకు నేను మిగుల చింతిల్లినను, ముందు కళాశాలలో పని క్రమముగ జరుగఁగల దని యాశించితిని.

వేసవి సెలవులు గడప నేను గుంటూరు వెడలిపోయిన కొలఁదిదినములకె నాకు నెల్లూరునుండి జాబు వచ్చెను. ఆ యుపాధ్యాయుఁడు జరిగినదానికి విచారించుచుండి రనియు, ఆయనను కళాశాలలో నుంచుట కోడఁబడుఁ డనియు, నా పూర్వసహపాఠియు నిపుడు నెల్లూరులో సబు జడ్జియు నగు సోమంచి నీలకంఠముగారు నాకు వ్రాసిరి. గుంటూరిలోని నా పూర్వమిత్రులు జంధ్యాల నాగభూషణముగారుకూడ నిటులే నన్నుఁ గోరిరి. కావున మొదట నా కిష్టము లేకుండినను, పిమ్మట నా యుపాధ్యాయుని కళాశాలలో నుంచవచ్చు నని కార్యదర్శికి నేను వ్రాసివేసితిని.

## ౨౮. నెల్లూరునివాసము : రెండవవత్సరము

గుంటూరిలో నేను వెనుకఁగట్టిన యింటికి వసారా దింపి, యిల్లు పూర్తిపఱిచితిని. మందిరముకూడ సిద్ధమయ్యెను.

గుంటూరులో "మండలప్రాథమిక విద్యాబోధకుల" సమావేశ సందర్భమున నేను ౧౫-వ మేయిని అధ్యక్షత వహించితిని. నా ప్రారంభోపన్యాసమున, బోధకవృత్తి గౌరవనీయమైన దని చెప్పి, సందర్భానుసారముగ గాంధిమహాత్ముని సహాయ నిరాకరణోద్యమమును గూర్చి యుపాధ్యాయుని కర్తవ్యము తెలియఁబఱిచితిని. సభ జయప్రదముగ జరిగెను. జీతములు సరిగా నీయకుండుటచేత తాము ఉద్యోగములు వదలుకొందు మని బోధకులు అదివఱకు చేసికొనిన తీర్మానము నా సలహో ననుసరించి విరమింపఁబడెను.

ఈ దినములలోనె మిత్రులు వెంకటప్పయ్యగారి రెండవ కొమార్తె పార్వతమ్మవివాహము జరిగెను. మా తమ్ముఁడు వెంకటరామయ్యద్వితీయపుత్రుఁడు సుబ్బారాయనికి, అతని మేనమామ మంత్రిరావు వెంకటరత్నముగారి పుత్రిక లక్ష్మీకాంతమ్మనను తణుకులో వివాహము జరిగెను. ఆ ముహూర్తముననె మా పెదతండ్రికుమారుఁడు వీరభద్రుని జ్యేష్ఠపుత్రుఁడు సాంబశివరావునకు వంగూరి శంకరముగారి పెద్దకొమార్తె మాచరమ్మనిచ్చి పెండ్లి చేసిరి.

౧౯౨౧-వ సంవత్సరము జులై నుండియు మా కళాశాలలో ప్రకృతి గణితశాస్త్రములు నేర్పుట కేర్పాటు లయ్యెను. నా మఱఁదలు లక్ష్మమ్మ రెండవకుమారుఁడు పోడూరి నారాయణరావు నెల్లూరు కళాశాలలో రెండవతరగతిలోఁ జేరి యిపుడు చదివెను. నా పెద్దమఱఁదలు శ్యామాలమ్మ పెద్దయల్లుఁడు ర్యాలి శేషగిరిరావు, ఇదివఱకు ఏలూరు పాఠశాలలో నుపాధ్యాయుఁడుగనుండి, యిపుడు నెల్లూరు పాఠశాలలోఁ జేరి, తన భార్య రామమ్మతో వచ్చియుండెను.

౨౧-వ సం. ఆగష్టునెలలో శ్రీ వెంకటగిరి రాజాగారి జ్యేష్ఠపుత్రుఁడు శ్రీ కుమారరాజావారి వివాహ మహోత్సవమునకుఁ బిలుపురాఁగా, కొందఱు మిత్రులతోఁ గూడి నేను వెంకటగిరిపోయి, దివాను రాజాచారిగారియింట విడిసి యుంటిని.

ఆనెల చివరభాగమున మోపాడు ప్రాజెక్టులోనుండి నీటివసతి యేర్పడిన భూములు కొన్ని వేలమునకు రాఁగా, నేను చింతలదేవి పోయి, ౩౧ ఎకరములభూమి కొంటిని. నాలుగైను వత్సరములలో నీభూమినంతను మాగాణిక్రింద మార్పించి, ఎక్కువలాభము నందఁగల నని నే నాశించితిని.

గాంధిమహాత్ముని ప్రేరణమువలన నిపుడారంభమైన సహాయ నిరాకరణోద్యమమునఁ జేరుటకై మా కళాశాలా విద్యార్థులలో నధికసంచలనము గలిగెను. ఇట్టి రాజకార్యవిషయములలో జోక్యము గలుగఁ జేసికొనవల దని నేను నా విద్యార్థులకు గట్టిగ బోధించితిని.

ఆదసరా సెలవులలో మేము గుంటూరు పోయి, జబ్బుగనుండిన మా తోడియల్లుఁడు సత్తిరాజు వెంకటరత్నమును జూచుటకు ఏలూరు వెళ్లితిమి. మా రెండవతోడియల్లుఁడు పోపూరి కృష్ణమూర్తిగారు కూడ నాసమయమున సకుటుంబముగ నేలూరు వచ్చిరి. అక్టోబరు ౯-వ తేదీని వెంకటరత్నము చనిపోయెను. ఇతఁడు ప్రవేశపరీక్షవఱకు మాత్రమె చదివి, జీవితకాల మంతయు నేఁబది యఱువది రూపాయిల జీతము గల మాధ్యమిక పాఠశాలలో బోధకుఁడుగ నుండి నను, స్వయంకృషివలనను, పొదుపరితనముచేతను కొంతసో ధనమును, పలుకుబడిని సంపాదించి, ఏలూరిలోనే తన జీవితమంతయుఁ గడపెను. ఇతఁడు చనిపోయిన మఱునాఁడె వైద్యపరీక్షకై యితని

కుమారుఁడు కృష్ణారావు చెన్నపురికిఁ బ్రయాణము గట్టెను, ఆ పరీక్షలో నతని కపుడు జయము గలిగెను.

మా చెల్లెలి రెండవకొమార్తె సీతమ్మ ప్రసవముకాలేక బాధ నొందుచున్న దని నాకు డిశెంబరు ౫-వ తేదీని కాకినాడనుండి తంతి వచ్చెను. నేను మఱునాఁటి రెయిలుమీఁద కాకినాడ చేరునప్పటికె సీతమ్మ సుఖప్రసవ మయ్యెననియు, మగపిల్లవాఁడు కలిగెననియును నాకుఁ దెలిసెను. వారిని గుఱించి కొన్ని యేర్పాటులు చేసి, నేను నెల్లూరు వచ్చివేసితిని.

డిసెంబరు సెలవులలో పోడూరి వెంకయ్యగారి రెండవ చెల్లెలి పెండ్లి, నెల్లూరిలో మాయింటనె జరిగెను. ఆ వివాహసందర్భ మార్థమై వచ్చిన మా తమ్ముఁడు వెంకటరామయ్య, భార్య, పిల్లలును మాతోఁ గలసి మద్రాసు వచ్చిరి. ఆనగరమున వినోదములు చూచుచుఁ గొన్ని దినములు గడపి, మేమంత గుంటూరు వెడలి పోయితిమి.

## ౨౭ కథావిరచనము

౧౯౨౨-వ సంవత్సరము ఫిబ్రవరి ౧౨-వ తేదీని మాతమ్ముఁడు కృష్ణమూర్తియొద్దనుండి నాకు తంతిరాఁగా, నేను మఱునాఁడు కొండపల్లి పయనమయితిని. కొండపల్లికిఁ జేరువనుండు వెలిగలేటిలో కృష్ణమూర్తి పెద్దయల్లునికి మిగుల జబ్బుగనుండెననియె యావార్త. కాని, నేనచటికిఁబోవునప్పటికె యా యువకుఁడు చనిపోయెననియు, అతనికుటుంబము, మాతమ్ములు, ఆఁడువాండ్రును వారిగ్రామము జగన్నాథపురము వెడలిపోయిరనియు నేను వింటిని. చనిపోయిన

ద్రతీరమునఁ గల కొండలవంటి యిసుకదిబ్బలమీఁద నుండి క్రిందికి దొరలుచు మే మమితానంద మందితిమి. మధ్యాహ్నసమయమున మే మొక దోనెలో బకింగుహాము కాలువమీఁద పయనము చేసి, ఆ ప్రాంతమందు పొట్టి యడవియావు లుండెనని విని, వానిని జూచుటకై వనమునఁ దిరిగితిమి. కాని యానాఁడు మాకంటి కా జంతువు లగఁబడలేదు.

ఈ సంవత్సరమున మా తమ్ముఁడు వెంకటరామయ్య మూఁడవ కుమారుఁడు సూర్యనారాయణ వివాహము జరిగెను. మా బావ మఱఁది వెలిచేటి వెంకటరత్నము రెండవ కొమార్తె మాలతి నిచ్చి వీనికిఁ బెండ్లి చేసిరి. పెండ్లి నిడదవోలు సత్రములో జరిగెను.

మా తమ్ముఁడు వెంకటరామయ్య నాకు మంచిభూములు కొనిపెట్టుచు వచ్చెను. ఏలూరులోని రామా ముద్రాక్షర శాలాధికారి ఈదర వెంకటరావుగారు, తమ ముద్రాలయమున నా తెలుఁగు పుస్తకములు పునర్ముద్రణము చేయించెద నని కొంతకాలము నుండి నాకుఁ జెప్పుచు వచ్చెను. ౧౯౩౬-వ సంవత్సరము డిశంబరు నెలలో "హిందూ సుందరీమణుల చరిత్రములు" ప్రథమ ద్వితీయ భాగముల పుస్తకముల మూఁడవ కూర్పు నాకొఱకు వారు ముద్రించిరి

ఆ నెలలోనే కాకినాడ నగరమున దేశీయమహాసభ జరిగెను. మిత్రులు కొండ వెంకటప్పయ్యగారు ఆహ్వానసంఘాధ్యక్షు లగుట చేత సకుటుంబముగ నే నా మహాసభ కేగుటకుఁ బ్రోత్సాహము గలిగెను. అద్దెకు మేము కాకినాడ గాంధీనగరమునఁ బుచ్చుకొనిన కుటీరములో మా తమ్ములు, వారి పిల్లలు, ఇంకఁ బలువురు బంధుమిత్రులును విడిసియుండిరి. ఆదినములలోనె శ్రీ కాశీనాథుని నాగేశ్వర

రావుగారి "భారతీ" పత్రిక వెలువడెను. "చెల్లనునియాత్ర" అను శీర్షికతో నేను చెన్నపురి "స్వరాజ్య" పత్రికలో మహాసభకు సంబంధించిన యాంగ్లవ్యాసములు కొన్ని కథారూపమున వ్రాసితిని. దేశీయమహాసభా సందర్భమున నా కన్నుల నమితముగ నాకర్షించిన మహాపురుషుల జంటలు రెండు గలవు. వీరు వరుసఁగా, తండ్రి కొడుకులగు మోతీలాలు నెహ్రూ జవహరిలాలు నెహ్రూలును, అన్నదమ్ములగు విటల్భాయి పటేలు వల్లభాయి పటేలును. ఈజంటలలో నొకరి కొకరికిఁ గల తారతమ్యములను నేను వర్ణించితిని.

౧౯౨౮-వ సంవత్సరమున నేను చెన్నపురి విశ్వవిద్యాలయపు సెనెటులో సభ్యుఁడ నైతిని. ఆ యేప్రిలు నెలలో రామా ముద్రాలయమున నా "హిందూసుందరీమణుల" మూఁడవ భాగము ముద్రింపఁబడియెను. ఇట్లే ముద్రాలయమున నా "హిందూసుందరుల" మూఁడు భాగముల పుస్తకములును పునర్ముద్రితము లయ్యెను.

మొదటి కూర్పు పుస్తకములవలెనే యీ క్రొత్తకూర్పు "హిందూసుందరీమణుల చరిత్రములును" మా జనని కివ్విధమునఁ గృతి యిచ్చితిని:—

సీ. తనభక్తి కలరి మజ్జనకుండు శ్రీ సుబ్బ
రాయఁ డనూన హర్షమునఁ దేల
తిన యపారంబగు దయకు న్రశాంతంబు
తనయులు మిగుల సంతసము నొంద
తనసుశీలత బంధుజనుల యుల్లంబుల
లలితమా నానందలహరి ముంప
తనపూతచరితంబు జనకతనూజాది
వనితల వృత్తంబు ననుకరింప

తే. జీవయాత్రసలిపి జీవితేశ్వరువెంటా
దివికి నరిగినట్టి భువననుతకు
సీతమాంబికకును మాతల్లి కీకృతి
నంకితం బొనర్తు నధికభక్తి.

ఈ సంవత్సరారంభమునుండి నేను తెలుఁగు పత్రికలకు విరివిగ వ్యాసములు వ్రాయ నారంభించితిని. నే నీ ౧౯-౧౬-వ సంవత్సరమున "భారతీ" పత్రికకు వ్రాసిన కథలు, "మాణిక్యము", "మాలతి", "నాగరాజు," "కొఱవిదయ్యమును". ఈ కడపటి రెండింటిలోను, చిన్ననాఁడు నే వినినట్టియు, దేశమున వ్యాపించినట్టియు గాథ లాధారముగఁ జేకొని కథ యల్లితిని. కాని, మాలతీ మాణిక్యముల లోని కథ యామూలాగ్రముగ నా సొంతమె. కథాసందర్భమున దేశీయసాంప్రదాయములను నేను బ్రదర్శింప యత్నించితిని. నవీనాంధ్రదేశమున విద్యాధికుల హృదయసీమల మొలక లెత్తుచుండెడి యాశయములను నే నిందుఁ గనఁబఱిచితిని. అనగత్యమగు నీతిబోధనముతోఁ జదువరులను విసివింపక, వారలకు వినోద మొనఁగూర్పుటయె నేను ముఖ్యాశయముగఁ జేసికొంటిని. ఐనను, కొందఱు రచయితల వలె దుర్నీతి కెడమిచ్చెడి యంశములు వర్ణించెడి మాయాకథ లల్లుట నాకు రుచింపదు. చదువరుల మనస్సులకు కథాసంవిధానమందలి వినోదముతోఁబాటు సుగుణజాలమందును, ఉన్నతాశయము లందును నభిరుచి గలిగింపవలె ననియె నా యాశయము.

ఈ కథలు నేను వ్రాయునపుడు, వానిని నా మిత్రులును, నెల్లూరు కళాశాలలో నుపన్యాసకులునగు శ్రీయుతులు గుఱ్ఱం సుబ్బరామయ్య, దుర్భా సుబ్రహ్మణ్యశర్మగార్లకుఁ జూపించి, భావవిస్ఫురణ భాషాసౌష్ఠవములందు వానిలోఁ గల లోపములను

సంస్కరించుచుండువాఁడను. అన్ని విధము లగు సొంపులతో నలరారెడి కథా భూషణమును భాషాయోష కర్పించుటయే నా మహాశయము. కథ ననేకమాఱులు నేను జదువుకొని, దానియందేమాత్రమగు లోపము గానిపించినను, అది దిద్దక పత్రికలోఁ బ్రచురణకై ప్రతి నంపువాఁడను కాను.

౧౯౦౧-వ సంవత్సరముననే "చిత్రకథామంజరి" అను శీర్షికతో నే నొక కథాపుస్తకమును బ్రచురించియుంటిని. దీనిలో కల్పితకథలు గాని "సూర్జహాను" మున్నగు రచనములు కొన్ని గలవు. ఇపుడు వానిని దీసివైచి, వానికి బదులుగ నే నిటీవల "భారతి" మున్నగు పత్రికలలో వ్రాసిన స్వకపోలకల్పితము లగు 'గౌతమి' 'మాణిక్యము,' 'మాలతి' మున్నగు కథలు కొన్ని చేర్చి, 'చిత్రకథామంజరి' రెండవ కూర్పును, ఏలూరు రామా ముద్రాలయమునఁ బ్రచురించితిని.

ఈ "చిత్రకథామంజరి" ప్రథమభాగమందలి కథలలో నేది యత్యుత్తమ మైనదో నిర్ధారణచేయు పట్ల మిత్రులకు నాకును గొంత యభిప్రాయభేదము గలిగెను. కథావైచిత్ర్యమున "కృష్ణవేణి" తమకు హృద్యముగ నున్న దనియు, దానిని నాటకముగఁ వ్రాయఁ దా నొకానొకపు డెంచితి మనియు, ఆపుస్తకమును కళాశాల తరగతిలో పిమ్మట బోధించిన దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు నాకుఁ జెప్పిరి. "శారద" చక్కగ నున్నదని యా కథ చదివిన యొక రిద్దఱు చిన్నిబాలికలు నాతో ననిరి. 'గౌతమి' బాగుగ నున్న దని యొకరును, 'మాలతి' 'నిశ్చల'లు మంచివని మఱి యొకరును నభిప్రాయ మందిరి. కన్నవారికి సంతతి యందఱి యందును సమానప్రేమమె. ఐనను నా కేకారణముననో "మాణి

క్యము" నం దభిమానము మెండు. అది యిందలి కథలలోనె కాదు, నేను వ్రాసిన కథ లన్నిటిలోను నుద్రిక్తభావవర్ణన విషయమున ప్రథమగణ్య మని భావించువాఁడను.

ఈ "చిత్రకథామంజరి" ప్రథమభాగమును నా గురువర్యు లగు వీరేశలింగముపంతులుగారికిఁ గృతి యిచ్చుట యుక్త మని తలంచి, యీ క్రింది పద్యమున వారి కది యంకితము చేసితిని.

తే. "గద్య తిక్కన సంఘసంస్కర్త ఘనుఁడు
కోవిదుఁడు రావుబహద్దరు గురువు మాకు
కందుకూరి వీరేశలింగ కవిమణికి
నంకిత మొనర్తు నీగ్రంథ మధికభక్తి."

ఈ పుస్తకము ముద్రణాలయమునుండి వెలువడఁగనే, మిత్రులు శ్రీ గిడుగు రామమూర్తిగారి కొక ప్రతి నంపితిని. అది చదివి వా రానందించి, కొలఁది కాలములోనే సమావేశమైన చెన్నపురి విశ్వవిద్యాలయాంధ్ర పాఠ్యపుస్తక నిర్ణయసభిలో దానినిగుఱించి చెప్పిరి. ఆ తరుణముననె సభాధ్యక్షులు వెంకటరంగారావుగారు నా "హిందూసుందరీమణులచరిత్రము" ల ౧,౨ భాగములను గుఱించి ప్రస్తావించిరఁట. కావున ౧౮౭౭-౮ సంవత్సర మందలి ఇంటరు మీడియేటు పరీక్షకీ మూఁడుపుస్తకములును పాఠ్యగ్రంథములుగ నియమింపఁబడెను. విశ్వవిద్యాలయ పాఠ్యగ్రంథ నిర్ణయసభవారి యనుగ్రహ మెపుడును జవిచూడని నన్నీ యెదురుచూడని మేలమితా నందభరితునిఁగఁ జేసెను.

## ౨౬. శుభాశుభములు

౧౯౨౫-వ సంవత్సరాంతమున మద్రాసు అడియారులో జరిగిన యొక సభాసందర్భమున నేను శ్రీదేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారితోఁ గలసి మాటాడుచు, నేను వ్రాసియుంచిన "కమలాక్షి" నవలను దాము ప్రకటింతురా యని యడిగితిని. వారు బాగుగ నాలోచించి, తా మిటీవల క్రొత్తరకఁపుఁ బుస్తకములు ప్రకటింప యోజించుచుంటిమి గాన, ఆ గ్రంథమాల కేపేరు పెట్టుట యుక్తమో చెప్పుమని నన్నడిగిరి. దానికి "నాగేశ్వర గ్రంథమాల" యని గాని, "ఆంధ్రగ్రంథమాల" యని గాని పేరు పెట్టుఁ డని నే నంటిని. వారి కోరికమీఁద "కమలాక్షి" ప్రతిని వారి కంపితిని. "ఆంధ్రగ్రంథమాల"కుఁ 'గమలాక్షి'యె ప్రథమపుష్ప మైనను, ఆ సమయమునకె సిద్ధమైన మఱికొన్ని పుస్తకము లుండుటచేత, నా పుస్తక మాగ్రంథమాలలో చతుర్థకుసుమ మయ్యెను.

ఈ పుస్తకములో వలసిన మార్పులు చేయుటయందు నాకు శ్రీ దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారు ముఖ్యముగఁ దోడుపడిరి. ఇది మాప్రియజనకున కీక్రింది పద్యమునఁ గృతియిచ్చితిని.

తే. "అర్మిలిని బ్రోచి మమ్ము విద్యావివేక<br>
వినయవంతులఁ జేసి, సద్వృత్తి నిలిపి,<br>
స్వర్గ్నితినిగన్న మాకూర్మి జనకుని కిది<br>
అంకిత మొనర్తు సుబ్బరాయాఖ్యునకును."

౧౯౨౬-వ సంవత్సరము ఏప్రిలులో ముద్రిత మయిన యాపుస్తకపుఁ బ్రతులు నాకు నరసాపురమున నా తమ్ముఁడు కృష్ణ

మూర్తి తృతీయ పుత్రిక కామేశ్వరమ్మ వివాహసమయమున నందినవి. ఆ వివాహమునకు సకుటుంబముగ నేను గుంటూరునుండి యాత్ర చేసివిని వచ్చియుంటిని. అదివఱకుఁ గొలఁది దినముల క్రిందటనే గుంటూరు కృష్ణామండలములలో ప్రబలమగు గాలివాన వీచి, జనులకును జంతుజాలమునకును జాల నష్టము గలిగించెను. ఈ తుపానునాధారము చేసికొని, "గాలివాన" అను శీర్షికతో నే నొక కథను గల్పించి, కృష్ణాపత్రికలోఁ బ్రచురించితిని.

ఆ మెయినెలలో రామాముద్రాలయమున నా "ఇంగ్లీషువారి సంసారపద్ధతులు" పునర్ముద్రిత మయ్యెను. చిరకాలము క్రిందట నేను 'సత్యసంవర్ధని,' 'జనానాపత్రికల'కు వ్రాసిన చిన్నవ్యాసములును, ఇటీవల నప్పు డప్పుడు బహిరంగ సభలలోను సమావేశములలోను జదివిన యుపన్యాసములును, శిథిల మగుచుండెడి ప్రాఁత పత్రికలనుండి తీసి యిపుడు "వ్యాసావళి" యను పేరిట రామాముద్రాలయమున కచ్చున కంపితిని. ఈ పుస్తకము రెండుభాగముల యచ్చు చిత్తులను దిద్దుపట్ల శ్రీ మున్నంగి లక్ష్మీనరసింహ శర్మగారు నాకుఁ దోడుపడిరి. సామాన్యముగ నా పుస్తకముల తుది యచ్చు చిత్తులు నేనె దిద్దుకొనినఁ గాని నాకు సంతృప్తి గలుగదు. ఐనను, సెలవుదినములలో నే నొకచోట నుండక తిరుగుచుండుటవలన, ముద్రణసౌకర్యమునకై రామాముద్రాలయమువారీ ప్రత్యేక మగు నేర్పాటు చేసిరి. ౧౯౧౫-వ సంవత్సరము జూను నెలలో "వ్యాసావళి" మొదటి భాగమును, మఱుసటి సంవత్సరము ఏప్రిలులో రెండవ భాగమును బ్రచుర మయ్యెను.

౧౯౧౫-వ సంవత్సరమున వేసవితుదిని మా తమ్ముఁడు వెంకటరామయ్య, వ్యాధిగ్రస్తయగు తనభార్య రత్నమ్మను నెల్లూరు

కొని వచ్చెను. అచటఁ గొన్నిదినము లుంచి, మే మామె నంత చెన్నపురికిఁ దీసికొనిపోయి, రాజధానీవైద్యాలయమున నుంచి, మాల్కముసను వైద్యునిచే మం దిప్పించితిమి. ఆ పురమున నొకనెల యుండిన పిమ్మట, కొంత స్వస్థపడిన తన సతిని మా తమ్ముఁడు భీమవరము తరలించెను.

నేను చిరకాలముక్రిందట ఓరియంటలు భీమాకంపెనీలో భీమా చేయించిన యొక పాలిసీసొమ్ము వేయి రూపాయిలు నా కీ యాగష్టునెలలో వచ్చెను. ఇంతకాలము నేను జీవింతు ననియు, జీవితకాలములోనే నే నీ పైక మందుకొనుభాగ్యము గాంతు ననియును, భీమా చేసిన ముప్పది సంవత్సరములక్రిందట నేను గల నైన ననుకొన లేదు! ముప్పది సంవత్సరముల క్రిందటికంటె నేమి కారణముననో నే నిటీవలనే మంచి దేహారోగ్యము గాంచియుంటిని. దేహారోగ్య మెటులుండినను, ఆర్థికవిషయమున వెనుకటికంటె నిపుడు నాపరిస్థితులు బాగుగ నుండెను.

కొంతకాలము క్రిందటినుండి నెల్లూరు మండల వైద్యాధికారిగ నుండి, నా కనేకసందర్భములందు సాయపడి, మా యింటనే జరుగుచుండు "ప్రార్థనసమాజ" సభలలో ప్రాముఖ్యము వహించి, న్యాయమూర్తియు ధర్మశీలుఁడు నని నెల్లూరుమండల వాస్తవ్యులచేఁ బొగడ్తల నందిన కెప్టెను యస్. కె. పిళ్లెగా రిపుడు బదిలీయై వెడలిపోవు సందర్భమున, వారి గౌరవార్థమై యీ యగష్టునెలలో మా యింట నొక విందు గావించి, ఆయనయందు నాకుఁ గల భక్తి ప్రేమములను గొంత వెలిపుచ్చితిని.

ఈ దసరా సమయమున జరిగిన ఇంటరుమీడియేటు విశ్వ విద్యాలయపుఁబరీక్షలో నా కెంతో తోడుపడి, చిరకాల మీ

# ఆత్మచరిత్రము

నెల్లూరు విద్యాలయమున మొదటి గుమాస్తాగా నుండిన శ్రీ కృష్ణయ్య గారు రాచకురుపువలనఁ జనిపోవుటకు మిగుల విషాద మందితిని.

ఈ పరీక్షా దినములలో నా మనస్సున నొక కథ సంకల్పిత మయ్యెను. అది లిఖించుట కైన నాకీ పరీక్షతొందరలో వ్యవధానము లేకుండినను, ఎటులో తీఱిక చేసికొని, మూఁడు నాలుగు దినములలో నద్దానిని బూర్తి పఱిచితిని. ఇది "రాజేశ్వరి" నవల. మఱుసటి సంవత్సరము దీనిని నెల్లూరులోఁ బ్రచురించితిని.

౧౮౯౬-వ సంవత్సరము జనవరి మాసారంభమున "మండల విద్యాబోధకసమాజ" సమావేశము జరిగెను. ఆ సందర్భమున విద్యార్థుల క్రీడావిశేషములును జరిగెను. ఆ సభలలో జరిగిన చర్చలలో నేను గొంత పాల్గొంటిని.

నే నిదివఱకు కావలి గ్రామములోఁ గొనిన భూమి కంటె యుండు సుమారు అయిదు యకరముల భూమి యమ్మకమునకు రాఁగా, మూఁడువేల రూపాయిలకుఁ బైగా వెచ్చించి యది నే నిపుడు కొంటిని.

మఱుసటి నెలలో మా పినతండ్రి నాగరాజుగారి భార్య వియ్యమ్మగారు కానూరులోఁ జనిపోయిరి. మా పినతండ్రిని చిన్న నాఁడు దాయాదులలో నొకరు పెంచుకొనిరి. వివాహితుఁ డైన పిదప యౌవనముననే యాయన మా తండ్రితోపాటు కర్నూలు ప్రాంతములకుఁ బోయి, అచట లోకాంతరగతులయిరి. ఆయన యాస్తిని చిరకాలము వియ్యమ్మగా రనుభవించి యిపుడు చనిపోయిరి. మేమె వారి ముఖ్య వారసులము. పురుషవారసు లందఱిలోను పెద్దవాఁడ నగుటచేత నేనె యామె యపరకర్మలు నెల్లూరులో.

నిపుడు జరిగించితిని. బ్రదికియుండు కాలమున నామె మాయం దంతగ ననురాగము లేక, తన మేనకోడలియొద్ద నివసించి, వారి కుటుంబమును బోషించుచువచ్చెడిది. వియ్యమ్మగా రెవరిని దత్తు చేసికొనక చనిపోయినను, మేనకోడలును ఆమె భర్తయును దమ కుమారుని వియ్యమ్మ పెంచుకొనె నని ప్రతీతి కల్పించి, ఆమె భూములను స్వాధీనపఱచుకొనుటచేత, సోదరులము మువ్వురమును మా పెత్తండ్రుల కుమాళ్లు మువ్వురనుగూడి, వారలమీఁద వ్యాజ్యము వేసితిమి. నేను మా సోదరులతో నీ తరుణమున రేలంగి వెళ్లి రాజీ విషయమై చేసిన కృషి విఫలమగుటచేత, న్యాయస్థానమున కేగ వలసి వచ్చెను.

నా భార్యయు, ఆమెయన్నయును తమచెల్లెలి కుమారుఁడు కృష్ణారావిపుడు ఉద్యోగము చేయు శ్రీహరికోటగ్రామము పోయి, అచటఁ గొన్ని దినములు నివసించి వచ్చుటచేత, వారిరువురకు నంతట మన్యపుజ్వరము సోఁకి, కొంతకాలము వారిని బీడించెను. నాకును రమ్మని యాహ్వానము వచ్చినను, కళాశాలాకార్యములు నెపముగఁ జేసికొని, నే నీవ్యాధిబారినుండి తప్పించుకొంటిని.

మామఱఁదలు చెన్నపురిప్రయాణము గట్టి వచ్చినను, ఆమె హృద్రోగము నెమ్మదిపడలేదు. అంతకంతకు వ్యాధి ముదిరి, యామె యా మేనెలలో భీమవరమున లోకాంతరగతయయ్యెను. మరణసమయమునఁ దన మువ్వురు పుత్రులు పుత్రికయును జెంతనుండుటవలన నామె కొంత చిత్తశాంతి నందినను, కనిపెంచి విద్యాబుద్ధులు నేర్పిన తన తనయుల యభ్యున్నతిని గనులారఁ గాంచ నోఁచికొననైతినని యామె కొంత వ్యాకులతఁ జెందెను. ఇఁక నడివయస్సున ప్రియపత్నీ వియోగము సంభవించి, కుటుంబపరిపోషణాభారమంతయు శిరమునఁబడిన

మా సోదరుఁడు వెంకటరామయ్య తాను తీవ్రదుఃఖావేశపరవశుఁడయ్యెను, సుతులకు ధైర్యముచెప్పు బాధ్యత వహింపవలసివచ్చి, ఎంతయో యోరిమి దాల్చి, సంసారకార్యములు చక్క పెట్టుకొనవలసి వచ్చెను.

ఆకష్టసమయమున మాతమ్మునిచెంత నేను లేను. మఱందలికి వ్యాధి ప్రకోపించెనను తంత్రీవార్త నందుకొని, కొలఁది నెలల క్రిందటనె ప్రసవమైన వారిపెద్దకోడలిని శిశువును మేము ఉభయులము వెంటఁదీసికొని, నెల్లూరునుండి బయలుదేఱి భీమవరము చేరునప్పటికె, మాకు దుఃఖవార్త తెలియవచ్చెను. ఇది జరిగిన యొకటి రెండు నెలలలోనె వెంకటరామయ్య కుమార్తె చిన్న శిశువు, ఆయేఁట వేడిగాడుపులకు తాళలేక చనిపోయెను. వేసవి తుదిదినములలో మాతమ్ముఁడు నేను జెన్నపురి పోయితిమి. అచ్చటి నేత్రవైద్యుఁడాతని కనులు పరీక్షించి, వానికి సులోచనము లిచ్చెను. ఇవి పెట్టుకొనుటవలన మాతమ్మునికిఁ జూపు చక్కపడెను.

ఈ సంవత్సర మధ్యమున నా "వ్యాసావళి" రెండవభాగము ఏలూరులో ముద్రింపఁబడెను. ఈ రెండుపుస్తకములలోను, నే నిదివఱకు నా పత్రికలలో వ్రాసిన మంచి వ్యాసములె కాక, 'ఆంధ్రపత్రిక' సంవత్సరాది సంచికలందును, ఇతర పత్రికలందును ముద్రణమయిన నా వ్యాసోపన్యాసములలో ముఖ్యమగు నవియును, ప్రకటింపఁబడియెను. నా వ్యాసములలో నెల్ల 'పుత్రలాలన' 'పతివిలాసిని' 'ఉత్తర గోగ్రహణము' 'అత్తకోడండ్రపొత్తు' ముఖ్యములు. మా తమ్ముఁడు వెంకటరామయ్య వ్రాసిన "జంతుకోటి ప్రాణరక్షణోపాయముల" నాలుగు భాగములును, జంతుస్వభావ చారిత్రక వినోదవిషయములతోఁ గూడుకొని యున్నవి. నాయుప

న్యాసములలో, "ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుఁడు," "వీరేశ లింగముపంతులుగారు" ను ముఖ్యములు, భావ విస్ఫురణమునందును భాషా సౌష్ఠవమునందును నా శైలి కిటీవలఁ గలిగిన పరిణామ మీ కడపటి యుపన్యాసమునఁ గాన నగును.

ఈ సంవత్సరమున దసరా సెలవులలో నొక పరిచితునితోఁ గూడి నేను నెల్లూరు మండల దక్షిణ దిగ్భాగమందలి గ్రామములు కొన్ని చూచివచ్చితిని. చెంగల్పట్టు జిల్లాకుఁ జేరిన గ్రామమైన ఈగాయవారిపాలెపుఁ బ్రజలు తెలుఁగువారె. వీరిలో రాజులు ప్రముఖులు. అచట ఆంధ్ర వైష్ణవబ్రాహ్మణులును గలరు. చుట్టు పట్టుల గ్రామములలోఁగూడ నాంధ్రులు గాన వచ్చిరి. ఒక గ్రామ జమీందారు తెలుఁగు బ్రాహ్మణుఁడె.

ఈ సంవత్సరము నూతనముగ బెజవాడలో స్థాపింపఁబడిన "ఆంధ్ర విశ్వవిద్యాలయ" ప్రథమసభ సెప్టెంబరు ౯-వ తేదిని జరిగెను. కళాశాలాధ్యక్షుఁడ నగుటచేత నద్దాని సభ్యులలోనే నొకఁడను. ఆ సందర్భమున నేను బెజవాడ పోయి వెనుక నచట నుద్యోగమున నుండు కాలమునాఁటి స్నేహితులను గొందఱిని జూచితిని. ధన్వాడ అనంతముగారు, వారి పెద్ద కుమారుఁడు డాక్టరు రామచంద్రరావుగారును నా కాసభలోఁ గాన వచ్చిరి.

అక్టోబరు నెల సెలవులలో నేను గోదావరిజిల్లా పోయి, నరసాపురము భీమవరము గ్రామములలో నుండు సోదరులను తక్కిన బంధువులను జూచితిని. నా భార్యకు మిగుల జబ్బుగ నుండె నని నా కాదినములలో నెల్లూరునుండి తంతి వచ్చుటచే సంధఱము నలజడి నొందితిమి. తమ్ముఁడు వెంకటరామయ్య, చెల్లెలు కన

కమ్మయును నాతో నపుడు బయలుదేఱి నెల్లూరు వచ్చిరి. మన్యపు జ్వరము మరల తగులుటచేత నాభార్య మిగుల బలహీన యయ్యెనే గాని, ప్రబలమగు వ్యాధి కామె లోను గాలేదని వైద్యుఁడు మాతులుల్లాగారు చెప్పిరి!

గతసంవత్సరము నేను వ్రాసిన "రాజేశ్వరి" డిసెంబరు నెలలో నెల్లూరునందలి ఆంధ్రరంజనీముద్రాలయమునఁ బ్రచురమయ్యెను. ఇది 'కమలాక్షి' కంటెను జిన్నదగు నవల. వీరేశలింగముపంతులనాఁటి రాజమహేంద్రవరపరిస్థితులు చిత్రించుటయె దీని ముఖ్యోద్దేశము. కథాసంవిధానమందును, రచనాప్రణాళికయందును మంచిమార్పులు కొన్ని సూచించి, యీ గ్రంథమునకు రుచిరత నాపాదించిన మదీయమిత్రులు, విమర్శనకళాకుశలులు, బ్ర. శ్రీ. పండిత దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతు లాచరించితిని.

ఈపుస్తకప్రారంభపుఁ బుటలలో మా చెల్లెలు కామేశ్వరమ్మ ఛాయాపటమును ముద్రించి, ఆమె కీ కథ నిట్లు కృతి యిచ్చితిని:—

తే. గీ. "మాకుఁ గడగొట్టు చెలియలై మహి జనించి
వరగుణంబులఁ జెలువారి పరువమునన
శిశులతో భర్తతో దివిఁ జేరినసతి
కిత్తు నీకృతిఁ బ్రీతిఁ గామేశ్వరికిని"

నెల్లూరు దండువారి వీధిలో మా బస కెదురుగ నొక ప్రాఁత యింట దోరనాల కనకమ్మయను పేద ముసలి వైశ్యవితంతు వుండెడిది. ఆమెకుఁ గల యేకపుత్రికయు, మనుమరాలు నామె కన్నుల యెదుటనే చనిపోయిరి. ఈమె యనుదినమును జాలసేపు మాయిం

టికి వచ్చి కూర్చుండుచు, నా భార్యతో ముచ్చటించుచు, కాలము గడుపు చుండెడిది. ఆమెకుఁ జేతనైనంత సాయము చేయుచుండు వారము. ౧౯౨౫-వ సంవత్సరాంతమున నామె కాలధర్మము నొందెను. చనిపోవునపు డామె కొంచెము సొమ్ము నాభార్యచేతి కిచ్చి, దానితోఁ దన పేరిట నే ధర్మకార్యమైన సెలకొల్పుఁ డని కోరెను. కావున ౧౯౨౬-వ సంవత్సరము అక్టోబరు నెలలో ఆమె పేర ట్రంకు రోడ్డుమీఁద పశువులు నీరు త్రావుట కనువగు నీటితొట్టి నొకటి పురపాలకసంఘము వారిచేఁ గట్టించి, అద్దాని ముఖఫలకముమీఁద "దోరనాల కనకమ్మధర్మము" అని వ్రాయించితిని. ఆ డిశెంబరు నెలలో మా తమ్ముఁడు కృష్ణమూర్తి సకుటుంబముగ చెన్నపురి పోవుచు, మార్గమధ్యమున నెల్లూరునఁ గొన్ని దినములు నిలిచెను. అంత మా చెల్లెలితోఁ గలసి వా రందఱును చెన్నపురి వెళ్లిరి. న్యాయవాదిపరీక్షలో మొదటితరగతిని మా తమ్ముఁ డపుడు జయ మందెను. సెలవులలో మేము గుంటూరు వెళ్లి వచ్చితిమి.

## ౨౭ నెల్లూరు గాలివాన

నూతనముగ స్థాపిత మయిన కళాశాలలలో నా కిపుడు పూర్తిగఁ బను లున్నను, ఎటులో తీఱిక చేసికొని, కథలు వ్యాసములును వ్రాయుచువచ్చితిని. నాకు వలసినంత వ్యవధానము లేకుండుటయే యీకాలమున నేను చిన్నకథ లల్లుట కొకకారణము. చిన్నకథలని నేను వానిరచనమున నశ్రద్ధఁ జూపువాఁడనుకాను. కథాచమత్కృతి యందుఁగాని, శైలిసొబగునఁగాని యేలోపము గనఁబడినను, దానిని దొలఁగించువఱకును, నాకుఁ దోఁచెడిదికాదు! మొదటిప్రతి వ్రాసిన కొన్నిదినములకుఁగాని నాకథ సిద్ధమయ్యెడిదికాదు. కథ సెన్నిమాఱులో

నేజదివి, వ్రాసినశుద్ధప్రతులను నేను దిద్దుకొనుచు మిత్రులకుఁజూపి దిద్దించుచు, ఇట్లు కథ ననుపుదేలువఱకును దానిని సవరించుచునే యుండెడివాఁడను. చిన్నకథకైన నేనిట్లు పెద్దపాటుపడుచుండువాఁడను. రచయితను వానిమిత్రులనే రంజింపఁజేయనేరని రచనము, పత్రికలలోఁ బ్రచురమై, రచ్చకెక్కి, బాధ్యతారహితులగు పాఠకుల తలల కెటు లెక్కఁగలదు? పత్రికలోఁగాని పుస్తకరూపమునఁగాని ప్రచురమగు రచనము నాసొంతసొత్తు కాదనియు, జనరంజకమగు భావతోను భావములతోను విలసిల్లవలెననియు నామతము. పెద్దలకుఁ జిన్నలకు, విద్యావంతులకు విద్యారహితులకు నందఱకును హృద్యమగు కథాసంవిధానమునఁ జెలంగి, పెటుకు పేలవములుగాని లలితపదములతోఁగూర్చిన కథయె కథయని యెంచువాఁడను. వాడుకభాష యనియును, గ్రంథస్థభాషయనియును భేదములు భాషపట్ల నంతగఁ గలిపించుకొనువాఁడను కాను. కాని, పలికెడిపలుకుకంటె వ్రాసెడి వ్రాఁత చిరస్థాయి గావున, అద్దాని యాకారమును జిత్రించువిషయమున రచయిత తగిన జాగరూకత వహింపవలెను. వ్యాకరణ సూత్రము లుల్లంఘించుటయు, శ్రుతి కటుప్రయోగము చేయుటయు వ్రాయస కానియందు పెద్దలోపములు. మన జీవిత పద్ధతివలన లోకమందలి నైతికస్థితికిని, మనరచనవలన భాషానైర్మల్యమునకును గళంక మాపాదిల్లకుండ మెలంగుట మానవధర్మమని నేను విశ్వసించువాఁడను. ఈ ప్రణాళిక ననుసరించియె నే నెప్పుడును రచనమునకుఁ దొడంగువాఁడను. నా నియమములకు వ్యాఘాతము గలుగకుండ నాకు సాయ మొసంగిన మిత్రబృందమునకు నే నెప్పుడును కృతజ్ఞుఁడను.

౧౯౧౪-వ సంవత్సరారంభమున నా "చిత్రకథామంజరి" రెండవ భాగము మద్రాసున ముద్రిత మయ్యెను. వీనిలోని కొన్నియు

స్వతంత్రకథలె. ఒకటి ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలోను, మిగిలినవి భారతి, దీనబంధు, పుష్కరిణి, కృష్ణా పత్రికలలోను, ఇదివఱకె ప్రచురింపఁబడెను. ఇదివఱకు నేను హాస్యరసకల్పనతో కథా రచనము చేయలేదు. ఈ పుస్తకములోని 'గణేశను,' 'బ్రహ్మానందము' నను కథలు హాస్యరసయుతములు. ఈ విషయమై నా ప్రయత్న మెంతవఱకు సఫలమయ్యెనో చదువరులె నిర్ణయింపఁగలరు. 'గోపాలము,' 'రావి యూరాటము,' 'బిల్ల గన్నేరు పూవు' లలో కరుణారసమె ప్రధానము. 'బ్రహ్మానందము,' 'దేవయ్యశోధన' లలో ప్రకృతమున మనదేశమును గలంచెడి బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్యను జిత్రించితిని. హిందూ ముస్లిము సమ్మేళనమును సూచించునది 'మంతాజముత్యము' కాకినాడ యందలి దేశీయ మహాసభ మిషగాఁ గొని యల్లిన ప్రేమకథ 'పార్వతి యనుతాపము'. కేవలము స్వవినోదమునకె కల్పించుకొనిన చిన్ని కథ 'కళ్యాణి.'

మొదటి భాగమునందలి కథల వలెనే యివియును వేఱు వేఱు లక్షణములు దాల్చియున్నవి. 'బిల్ల గన్నేరుపూవు' క్రొత్తరకపు విషాద కథ యని కొందఱు మిత్రుల మతము. 'పులివాన' తుదిని సూచితమైన దండకవిలెను దనకుఁ జూపెదరా యని యొకనాఁ డొక క్రొత్తమనుజుఁడు నెల్లూరులో మాయింటికి వచ్చి యడిగెను! ఇట్టి కోరికనె తెలియఁ బఱచుచు నా మిత్రులు రా. స్వా. గిడుగు రామమూర్తి పంతులుగారు నా కొక లేఖ వ్రాసిరి! కథా చమత్కృతిచే చదువరులను మోసగించుటయె రచయిత ముఖ్యోద్దేశము గావున, "మిమ్మును మోసగించిన నా గెలుపునకు సంతసించితి నని" స్నేహితులు రామమూర్తిగారికి నేను బ్రత్యుత్తర మిచ్చితిని.

దేవయ్యశోధనను' వ్రాసి, బ్రాహ్మణ బ్రాహ్మణేతరకక్షు లనెడి కందురీఁగల గుమిని గదల్చుచుంటి నని నామిత్రులు కొందఱు భయపడిరి! కాని, ఆ కథయందును 'బ్రహ్మానందము' నందును వారి సందియములకు వలయు సమాధానము గలదు. సద్భావము గల రచయిత యెన్నఁడును పక్షపాతబుద్ధి వహింపఁడు. లోకవిశేషము లందలి సత్యమును బ్రదర్శించుటయే యతని పని కాని, క్షణభంగురమగు జాతి మతవైషమ్యములతో నతనికి జోక్యము లేదు. "పార్వతి యనుతాపము" రచనాచమత్కృతియందును, భాషాసౌష్ఠవము చేతను, నా రచనము లన్నిటిలోను మిన్నయని నా యనుంగుమిత్రు లిరువురి యభిప్రాయము.

"ప్రేమాతిశయమునఁ బెంచిన మమ్ము
దుఃఖవారిధియందుఁ ద్రోచి తానైదు
వత్సరంబులకె జీవము వాసి దివికిఁ
జనిన మా చిన్నిపాపని కిది యిడుదు".

ఇటు లనుచు నేను, "ఎవ్వని యకాలమరణమువలన జనించిన యపారదుఃఖము నుపశమింపఁజేసికొన నాచేత నీకథలు కల్పితము లయ్యెనో, ఎవ్వాని జీవితస్మరణయే యిప్పటి వల నాచే విరచితములగు 'ట్రికథలకు సందర్భములు వెలయించెనో, అకాలమృత్యువు నాతఁబడిన యా మాగారాపు చిన్నిమేనల్లుని కీకథలపాత్ర మంకిత మొనర్చి యొకింత మనస్సంతుష్టిఁ గాంచుచున్నాఁడను" అని యీపుస్తక పీఠికయందు వ్రాసితిని.

కొలఁదికాలములోనే మే మీనగరమును విడువ నున్నారమని యెఱింగి నేను, మేము నివసించెడి దండువారివీధిలో నాభార్య కోరిక

మీఁద నామె పేరిట నొక నీటికొళాయి స్తంభము కట్టించితిని. "రాయసం రత్నమ్మగారిధర్మము" అని యందలి ముఖఫలకముమీఁదఁ జిత్రింపఁబడియెను.

ఈ సంవత్సరము మార్చి నెలలో మా మేనల్లుఁడు బుచ్చిరామయ్యకు సన్నిపాతజ్వరమువచ్చి మూఁడువారములు వేధించెను. వ్యాధి యింటిలోని యితరపిల్లలకు సోఁకకుండ మేము జాగ్రతపడితిమి. దంపతుల మిరువురమును రాత్రులు నిద్దుర గట్టిపెట్టి, రోగికిఁ బరిచర్యలు చేసితిమి. దైవానుగ్రహమునను, ఋషిసదృశ శీలుఁడగు శ్రీమాతులుల్లా వైద్యశిఖామణి వైద్యప్రభావమునను రోగి యొక నెలలోనె పరిపూర్ణారోగ్యవంతుఁ డయ్యెను.

ఇదివఱకు ఆంధ్రమండలములలో బ్రాహ్మమతప్రచారము సలిపి, నేత్రావరోగము గలిగి యిపుడు మంచమెక్కిన హేమచంద్ర సర్కారుగారి సంరక్షణమునకై నేను గొంత ధనసాహాయ్యము చేసితిని. నా మిత్రులు, కవిపుంగవులునగు బ్ర. శ్రీ. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి షష్టిపూర్తి సందర్భమున వెలువడిన వారి సంపూర్ణగ్రంథావళికి నా శక్తికొలఁదిని తోడుపడి, సంతుష్టహృదయుఁడ నైతిని.

ఆ సంవత్సరము వేసవి నెలవులలో వెలిచేరులో మా బావమఱఁదియింట జరిగిన రెండు శుభకార్యములలో నొకటి, జబ్బుపడి లేచిన బుచ్చిరామయ్య కుపనయనమహోత్సవము. అతనిని మరల సంపూర్ణారోగ్యవంతునిగఁ జేసి, తలిదండ్రుల కొప్పగింపఁ గలిగినందుకు మేముభయులము ముద మందితిమి. ఆ వేసవిని నా భార్య, కొండ వేంకటప్పయ్యగారి పత్నీపుత్రికలతో బెంగుళూరు

వెళ్లి, ఆ చల్లని ప్రదేశమున కాలము గడిపెను. నేను మా తమ్ముని తోను, అతని పిల్లలతోను భీమవరమునందుండి, అచట మా సోదరులము గట్టుచుండు క్రొత్తయింటి పనులు పూర్తి చేయించుచుంటిని. ఆ సంవత్సరము విజయదశమిపండుగనాఁడు ఆ గృహప్రవేశ మహోత్సవము జరిగెను.

ఆంధ్రవిశ్వవిద్యాలయమువారిపుడు తమపరీక్షలు చేయఁదొడంగి, ఇంటరుమీడియేటుపరీక్షలో నాంగ్లసాహిత్యమున నన్నొక ముఖ్యపరీక్షకునిగ నియమించిరి.

ఆ సంవత్సరము అక్టోబరు నెల చివరభాగమున నెల్లూరులో పెద్దతుపాను సంభవించెను. మేముండెడి యింటిసామానుకొట్టులో నింటనుండు చిన్న పెద్దలందఱమును ఆరాత్రి తల దాఁచుకొంటిమి. మా మఱఁదలు చామాలమ్మ కుమారుని కడపటిపిల్లవాఁడు, కొన్ని నెలలవాఁడు, వానియక్క బిడ్డయును, తల్లియును, మాతోనె యుండిరి. గాలితాఁకుడున కింటిపెంకులు దొరలిపడుచుండెను. దూరపుచెట్ల కొమ్మ లెగిరివచ్చి గుమ్మములయొద్ద పడుచుండెను.

పదినిముషముల కొకమాఱు గాలి హెచ్చుచు, బందిపోటు దొంగలగుమివలె తలుపులు గుభేలున గొట్టుచుండెను! ఆరాత్రి మేము జీవింతుమని తోఁపలేదు. తెల్లవాఱునప్పటికి పురమంతయు మోడుపడిన వృక్షమువలెఁ దోఁచెను. ఎచటఁ జూచినను పడిపోయిన గోడలు, కూలిపోయినచెట్లు, రాలినకొమ్మలు రెమ్మలును! ఈ గాలివానను వర్ణించుచు "ముద్దుకృష్ణ" అను నొక కథను వ్రాసి, "భారతి" కంపితిని. దీనిలో ప్రకృతి వైపరీత్యమునకుఁ బలిగా మనుజుల ప్రేమము వర్ణింపఁబడియెను.

## ౯౭. నెల్లూరు గాలివాన

ఈ గాలివానవలన నెల్లూరుపురము పాడుపడెను. మా కళాశాల కమితనష్టము వాటిల్లెను. చుట్టుపట్టులనుండి యిండ్లు వాకిండ్లు పోయినవారంద్రఱు తండోపతండములుగ వచ్చి, కళాశాల నసారాలలో నివసించిరి. కొన్నిదినములవఱకును వా రెచటికిని గదలనేరకుండిరి. వారు వెడలిపోయినపిమ్మట, ఎంత పరిశుభ్రపఱిచినను, అడుగుపెట్టుట కాప్రదేశ మయోగ్యముగ నుండెను. ఇంతలో జనసమ్మర్దముచేత పట్టణమున విశూచియారంభ మయ్యెను. ఏవీథులలోని చెత్త చెదారము లందె నిలిచి యుండెను. పురపాలకసంఘమువారి పరిచారకులు తమ పనులు మానివేసిరి. పట్టణము బొత్తిగ వాసయోగ్యము గాకుండెను.

కొన్నిదినము లపుడు కళాశాల మూసివేసి, మేము గుంటూరు ఏలూరు పురములు వెడలిపోయితిమి. చుట్టుపట్టుల కళాశాలలలోని విద్యార్థులు కొంద ఱపుడు, గుంటూరు కళాశాల కేతెంచి, ఆటలలోను, నుపన్యాసములలోను నొండొరులతో పోటీలు సలిపిరి. గుంటూరుకళాశాలలో ఉపన్యాసముల పోటీలు జరుపు సంఘమునకు నే నధ్యక్షునిగ నియమింపఁబడితిని. అపుడు రాజమంద్రి కళాశాలా విద్యార్థులు గెలుపొందిరి. వారలలో మా తమ్మునికుమారుఁడు సూర్యనారాయణ యొకఁడు.

ఆ సంవత్సరము నవంబరు తుదివారమందు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు కేంద్రస్థానము నిశ్చయించువిషయమున మద్రాసు శాసననిర్మాణసభయెదుట సాక్ష్య మిచ్చుటకుఁ గొందఱు కోరఁబడిరి. వారిలో నే నొకఁడను. రాజమంద్రినగరమె యీ గొప్పగౌరవమునకుఁ దగియున్నదని నేను గట్టిగఁ జెప్పితిని. కొందఱు బెజవాడ యనియు, కొందఱు విశాఖపట్టణము, అనంతపురమునియుఁ జెప్పిరి.

# ఆత్మచరిత్రము

నెల్లూరుమండలమున గాలివానకు నిస్సహాయు లయిన పిల్లలను సంరక్షించుటకై శరణాలయ మొకటి స్థాపింప నెంచి, మిత్రులము కొందఱము ఇసకా చెంచయ్య, జానకీబాయిగార్ల ద్వారా ధర్మసంస్థ నొకటి యారంభించితిమి. పాప మీ యిసకాదంపతులు శ్రమయనక, దిక్కు లేని పసిపిల్లలకు భోజనాదిసౌకర్యము లొనఁగూర్చిరి. అంత నీసంస్థ నుద్ధరింప పురప్రముఖు లొక సమాజము క్రింద నేర్పడిరి.

౬-వ డిసెంబరున ఆంధ్రవిశ్వవిద్యాలయసభ సమావేశమై, పరీక్ష నిచ్చినవారలకు పట్టము లొసంగిరి. శ్రీ గవర్నరుగా రధ్యక్షులు. శ్రీ రఘుపతి వెంకటరత్నమునాయఁడుగారికి డాక్టరుబిరుదము నొసఁగుడని బందరు నోబిలుకళాశాలాధ్యక్షుఁడు జానుస్టను దొర యాంగ్లమునను, వేదము వెంకటరాయశాస్త్రిలుగారికి "కళాప్రపూర్ణ" అను బిరుద మీయుఁడని యాంధ్రమున నేనును ఆసమయమున నుపన్యాసములు చేసితిమి.

ఆ డిశెంబరునెలలో నేనును కొందఱు నెల్లూరుమిత్రులును, మేము నూతనముగ నెలకొల్పిన శరణాలయములో దీనబాలురను బాలికలను జేర్పించుటకై చుట్టుపట్టుల గ్రామములకుఁ బోయివచ్చితిమి. ఇట్లు శరణాలయమున సుమా రిరువదిపిల్లలు చేరిరి.

డిశెంబరు చివరభాగమున మద్రాసులో దేశీయమహాసభ జరిగెను. దీనితోఁబాటు సంఘసంస్కరణసభలు మున్నగునవికూడ జరిగెను. నేను భార్యయు, తమ్ముఁడు వెంకటరామయ్య, మఱఁదలు శ్యామలాంబయు చెన్నపురి పోయితిమి. దేశీయసభలో సభ్యురాలగు చామాలమ్మ కొకకుటీర మీయఁబడెను. అందు మేము వంటచేసికొని భుజించి నివసించితిమి. కాంగ్రెసులో పరిపూర్ణస్వాతంత్ర్యమును సూచించిన తీర్మాన మామోదింపఁబడెను.

## ౨౮. ఉద్యోగవిరామము

౧౯౨౮-వ సంవత్సర ప్రారంభమున గూడూరులో మండల విద్యాశాలలకు సంబంధించిన యాటలపోటీలు జరిగెను. ఆసమయమున నేను గూడూరు వెళ్లి, మాపిల్లలకుఁ బ్రోత్సాహము గలిగించితిని.

నేను గుంటూరుకళాశాల వీడి నెల్లూరునకు వచ్చునపుడే, యిచట నైదువత్సరములు మాత్రమె యుండి యంతట నుద్యోగవిరామముచేతు నని మనస్సున సంకల్పించుకొంటిని. నెల్లూరుపురమున కళాశాలను నెలకొల్పి, దాని నభివృద్ధికిఁ గొనివచ్చుట మిగుల ప్రయాసకరకార్య మయ్యెను. ౧౯౨౦-వ సంవత్సరమధ్యమున పదునెనిమిది బాలురతో నారంభమయిన కళాశాల, ౧౯౨౮-వ సంవత్సరమున సుమారు ౨౦౦ విద్యార్థులతో విరాజిల్లుచుండెను. ప్రతిసంవత్సరమున పెక్కండ్రు ఇంటరుమీడియేటు పరీక్షలో గెలుపొందుటయెగాక, వీరిలోఁ గొందఱు మొదటితరగతిలోఁ గూడఁ గృతార్థు లగుచువచ్చిరి. బోధకులును తగిన నైపుణ్యానుభవములు గలవారలే.

విద్యాబోధనమందు కళాశాలాపరిస్థితు లిట్లు ప్రోత్సాహకరముగ నుండినను, ఆర్థికవిషయముమాత్రము మిక్కిలి యసంతృప్తికరముగ నుండెను. కళాశాలకగు వ్యయములో విద్యార్థులజీతములు పోఁగా, మిగిలినదానిలో కొంత దొరతనమువారును, తక్కినది కళాశాలాధిపతులగు శ్రీ వెంకటగిరిరాజావారును వహింపవలయును. కళాశాల కేటేటఁ గావలసిన పుస్తకపరికరాదుల కగు వ్యయములో సగము దొరతనమువారును, మిగిలినది రాజాగారు నీయవలయును.

ఇట్లు క్రమముగ జరిగిననేకాని, కళాశాలలోని పని సరిగా నడువ నేరదు. దొరతనమువా రిచ్చు ధనము సంవత్సరాంతమునఁగాని రాదు. రాజాగారి పెట్టుబడి మాత్రము నెలనెలయును సరిగ వచ్చినఁగాని, ఉపాధ్యాయులకు నెలజీతములు సక్రమముగ ముట్టవు. జీతములు సరిగా లభింపని యుపాధ్యాయులచేతను సేవకులచేతను పనులు గైకొనుట సులభముగాదు. మే మెన్నిమాఱులు మొఱలిడినను, సకాలమున నుపాధ్యాయులకు జీతము లందఁజేయు విషయమై కళాశాలా పాలకవర్గమువారును, శ్రీ రాజాగారును నుపేక్షచేయుచునేవచ్చిరి.

ఇదిగాక, కళాశాలను శాశ్వతసంస్థగ నిలుపఁగోరితిరేని, దానికి వలయు మూలధనము నొసంగుఁడనియు, అందు బి. యే. తరగతులు కూడఁ జేర్పించుఁడనియును, శ్రీరాజావారికిఁ బలుమాఱు మనవిచేసితిమి. ఇవి రెండును తమకు సమ్మతమె యని శ్రీరాజాగారు పలుమాఱు సెలవిచ్చినను, ఆప్రకార మమలుమాత్ర మెప్పటికిని జరుగ దయ్యెను. ఈ రెండుమార్పులును గలిగి కళాశాలకు స్థిరత్వ మేర్పడెనను సువార్త వినినవెంటనే యుద్యోగవిరామము చేయ నేనిటీవల నిశ్చయించుకొంటిని. నేను సంవత్సరము లిట్లు లెక్కపెట్టుకొనుచుండినను, కళాశాల యార్థికపరిస్థితులలోమాత్రము మార్పేమియుఁ గలుగలేదు! కళాశాలకు స్థిరత్వ మేర్పడిన శుభవార్త విని యుద్యోగము మానుకొను భాగ్యము నాకిఁక లభింపనట్టు స్పష్టమయ్యెను. ఇచట వచ్చెడి జీతము మీఁదనే యాధారపడవలసిన యవశ్యత నాకిపుడు లేకుండెను. నేనిదివఱకు సంపాదించిన భూములమీఁద సంవత్సరమునకు వేయిరూపాయిలకుఁ దక్కువగాని యాదాయము వచ్చుచుండెను. నివసించుటకు గుంటూరు భీమవరముపట్టణములలో విశాలగృహములు గలవు. వయస్సుమరలి, శక్తులుడిగిపోవుచున్న మేము ధనకాంక్షచే నింకను పర

## ౨౮. ఉద్యోగవిరామము

దేశప్రవాసము చేయుట యుక్తముగాదని నాభార్య పలుమాఱు నన్ను హెచ్చరించెను. నాశక్తియుక్తుల నిఁక గ్రంథరచనాది దేశహితైక కార్యములకు వినియోగించుట కర్తవ్యమనియు, కనీసము హాయిగ నేను విశ్రాంతి ననుభవింపవలసినతరుణ మిపుడు వచ్చెననియును నేను దలపోసితిని. కావున ౧౯౨౮-వ సంవత్సరము ఫిబ్రవరినెలలో నా పనికి రాజీనామా నిచ్చితినను కాకితమును కళాశాల కార్యదర్శి శ్రీ నరసింహాచార్యులుగారిచేత వేసితిని. ఇట్లు చేయవలదనియు, కనీసమిఁక రెండుమూఁడు సంవత్సరములు నేను కృషిచేసినచో కళాశాలా పరిస్థితులు చక్కపడుననియు ఆయన నొక్కిచెప్పెను. నేనందులకియ్యకొనలేదు. పిమ్మట జరిగిన పాలకవర్గమువారి సభలోఁగూడ సభికు లిదేయభిప్రాయమును వెలువరించిరి. ఉద్యోగవిరామమె నాకు వాంఛనీయమని నేను గట్టిగఁ జెప్పితిని. పాలకవర్గమువా రంత దీనికి సమ్మతించి, నేను కళాశాలకుఁ జేసిన కృషి నభినందించుచు, తీర్మానము చేసికొనిరి. అంతట మెయి ౧-వ తేదీని నేను కళాశాలాధ్యక్షతాభారమును కార్యదర్శి కొప్పగించి, నాసామానులు పుస్తకములును రెయిలులో పంపివైచి, సకుటుంబముగ గుంటూరునకు బయలుదేఱితిని.

జూలై నెలలో నేను మరల నెల్లూరు సందర్శించితిని. అపుడు సెలవులలో జీతము గైకొనుట, కళాశాలాధికారు లిడు విందు నారగించుట, విద్యార్థు లొసఁగిన విజ్ఞాపనపత్రిక నందుకొనుటయును, నేను జరిపిన కార్యప్రణాళిక. ఎనిమిది వత్సరము లీ పురమున నివసించి, కన్నబిడ్డనువలెఁ గడు క్షేమమున నీ కళాశాలను పెంచి, ఇపుడు నేను విశ్రాంతిని గైకొంటిని. నా శిరమునుండి హిమాలయ పర్వతమును బోలిన యొక మహాభారము తొలఁగిపోయెను!

# ఆత్మచరిత్రము

దైవానుగ్రహమున ముప్పదిరెండు సంవత్సరములు ఉపాధ్యాయునిగ నుండి, న్యాయపథము వీడక నా విధ్యుక్తములు నెరవేర్చి, ఇంత కాలమునకు విశ్రాంతి గైకొంటినని నే నమితానందభరితుండ నయితిని. నన్నూరు రూపాయిల మాసవేతనముతోఁ గూడిన కళాశాలాధిపత్యము, ఆయున్నతపదవి కనుబంధములగు నుపవేతనములు గౌరవోద్యోగము లన్నియు నంతరించెనని నామనస్సునకిపుడానంతయు వంత లేదు! రణరంగమునఁ బోరుసల్పి వచ్చిన సైనికుని వలెను, రంగస్థలమున నాట్యము ముగించిన పాత్రవలెను, నావిద్యాబోధకవృత్తి కార్యకలాప మింతటితో సంతృప్తికరముగ సమాప్తి చేసితినని నే నానందించితిని. నావిధ్యుక్తములు నే నెట్లు నెరవేర్చితినో నే జెప్పుటకంటె, నావిద్యాబోధనలాభ మందిన శిష్యసముదాయమును, నిరతము నాక్రియాకలాపమునకు సాక్షిభూతులుగ నుండిన సోదర బోధకవర్గమును ప్రస్తావించుట కర్హులు. దైవముఖముఁ జూచియె నాపనులు నెరవేర్చితి నని నావిశ్వాసము. నా విద్యా విషయకమగు కృషి యీశ్వరార్పితమగుఁగాక!

స్వాగతపత్రికలు, వీడుకోలు వాక్యములును, భావోద్రేకపూరితము లగుటంజేసి, యుత్ప్రేక్షా ద్యలంకార భూయిష్ఠములుగ నుండును. ఐనను, ప్రయాణికుని కింటివారి సాగనంపుఁ బలుకులు పలుమారు జ్ఞప్తికి వచ్చి యాత్రయం దుత్తేజకములుగ నుండును. నా నెల్లూరు విద్యార్థులు వీడుకోలుపుసందర్భమునఁ జదివిన పత్రముల లోని వాక్యములును, పద్యములును నా కీ సమయమున స్ఫురణకు వచ్చుచున్నవి. పాగడ్తల కన్నివిధములను నేఁ కొ దూరస్థుఁడను గావలసినవాఁడ నయ్యును, వారి పలుకులఁ గొన్నియిట నుదాహరించిన నాయహంభావత్వమును జదువరులు మన్నింతురు గాక!

## ౨౮. ఉద్యోగవిరామము

"* * ఈ చిన్న సంస్థను (కళాశాలను) బ్రోచుటకై మీరు శక్తి వంచనలేకుండఁ బాటుపడితిరి. మీ వివేకదాక్షిణ్యములచే మాభక్తిప్రేమములు మీరు వడసిరని చెప్పుటలో నతిశయోక్తి లేదు. మీ సునిశితబోధనము, మీ సులభసరళప్రసంగములు, మీ సరసవచోధోరణియు మే మెన్నఁడును మఱువఁజాలము. * * మీ నిరాడంబర నియమబద్ధ జీవితము, విధ్యుక్తములందు మీరు కనఁబఱచిన సద్భావసదుత్సాహములును మా కాదర్శప్రాయము లయినవి. మీ రిపుడీ కర్మకాండ విడిచి, మహాజ్ఞానులరీతిని సాంఘిక సాహిత్యవిషయములందుఁ బాల్గొనుటకును, ఈశ్వరధ్యాన తత్పరు లగుటకును, విశ్రాంతిని గైకొనుచున్నారు. * * మీకుఁ జిరాయురైశ్వర్యములును, ఉత్తమోద్యమములందు విజయమును, బ్రసాదింప దేవ దేవుని సవినయముగఁ బ్రార్థించుచున్నారము."

సీ. "నీయుజ్జనపుటింపు నీభాషణముసొంపు
ప్రియమార నెటు విస్మరింతుమయ్య
నీక్షమాతిశయంబు నీశాంతభావంబు
ప్రియమార నెటు విస్మరింతుమయ్య
నీధర్మనిరతియు నీశిష్య సంప్రీతి
ప్రియమార నెటు విస్మరింతుమయ్య
నీబోధమహిమంబు నీన్యాయ హితదృష్టి
ప్రియమార నెటు విస్మరింతుమయ్య
ఎట్టివేళల కినుక యింతేని లేక
మాదోసంగుల క్షమియించి మమ్ముఁ బ్రోచు
వరగురుని నిన్ను మే మెట్లు మఱతుమయ్య?
రాయసము వెంకటశివుఁడ రమ్యయశుఁడ!

---

# ఆత్మచరిత్రము

## చతుర్థభాగము : విశ్రాంతిదశ

---

### ౧. తొలిదినములు

నేను విశ్రాంతి గైకొనుటకుఁ గొంత ముందుగా శ్రీమతి కమలా భాయి ఛట్టోపాధ్యాయగారు నెల్లూరుపురమునకు విచ్చేసిరి. ఆమె మా మేడమీఁదనే విడిసియుండిరి. ఆమె యుపన్యాసము వినుటకుఁ గళాశాలాభవనమునఁ గూడిన మహాసభకు నే నగ్రాసనాధిపతిని. కమలాభాయి తీవ్రమగు వక్త్రియని నే నాసమయమున గ్రహించితిని.

మేము గుంటూరు ప్రవేశించిన దినములలోనె బెజవాడలో నతివైభవమున శ్రీ దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి భవనమున వారి ప్రియపుత్రిక వివాహమహోత్సవము జరిగెను. నా కాహ్వానము వచ్చుటచేత, అచటి కొకనాఁడు పోయి, విందారగించి, పంతులుగారి నభినందించి వచ్చితిని. దినమున కెన్నిసారులో బంతులు తీర్చి వారి పెండ్లిపందిరిలో నతిథులు భుజించుచువచ్చిరి. నాతోఁ గూర్చుండువారె వేయిమంది యుందురు. మా కాసమయమున వడ్డింపఁబడిన పిండివంటలకు మితిలేదు. సాయంకాలము సంగీత సభలు జరిగెను. నాగేశ్వరరావుగారి పేరు దేశమున వితరణమునకుఁ బర్యాయపద మయ్యెను.

ఆ వేసంగిని మేము భీమవరమున మా తమ్ముని యింటఁ గడపితిమి. అపుడు గుంటూరులో కొన్ని మహాసభలు జరిగెను. గ్రంథాలయసభకు శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగా రధ్యక్షులు; పంచమోద్యమమును గూర్చిన మహాసభకు నే నధ్యక్షుఁడను. సభలు ముగిసిన పిదప భానుమూర్తిగారితోఁ గలసి ఏలూరుమార్గమున నేను భీమవరము వచ్చితిని.

౧౯౩౦-వ సంవత్సరము వేసవిని మా తమ్ముని పుత్రులలో నరసింహము సూర్యనారాయణలు బి. యె. పరీక్షలోను, సుబ్బారాయఁడు ఇంటరుమీడియెటు పరీక్షయందును గృతార్థులయిరి. మొదటి యిరువురును బి. యలు. నకును, మూఁడవవాఁడు బి. యె. పరీక్షకును జదువ నిశ్చితమగుటచేత, వారిని మద్రాసుకొనిపోయి, కళాశాలలలోఁ జేర్పింపుఁడని నాతమ్ముఁడు నన్నుఁగోరెను. మేమంతబయలుదేఱితిమి. రెయిలులో మేనల్లుఁడు జనార్దనము మమ్ముఁగలసెను. వానికిని వెలిచేటి నరసింహమునకును యల్. యం. పి. తరగతిలో నాప్రయత్నముచేఁ బ్రవేశము దొరకుటచేత, అతఁడును మాతో నే మద్రాసు బయలు దేఱెను. రెయిలులో స్నేహితు లనేకులు గానవచ్చిరి.

చెన్నపురి లాయోలాకళాశాలలో సుబ్బారాయని, న్యాయ శాస్త్ర కళాశాలలో వాని సోదరులను, రాయపురము వైద్యాలయమున జనార్దనమును బ్రవేశపెట్టి, లాయోలాకళాశాల కంటియుండు భోజనవసతిగృహమున తమ్ముని కుమారులు ముగ్గురకు భోజనవసతిని గలిగించి, నేను నెల్లూరు వెడలివచ్చితిని.

బంధువులగు పోడూరు వెంకయ్యగా రిపుడు నెల్లూరులో జడ్జి కోర్టు శిరస్తాదారు. వారియింట నే నిపుడు బసచేసితిని. కళాశాలాధి

కారులు నాకపుడు విందొనర్చిరి. విద్యార్థులు వినతిపత్రము సమర్పించిరి. నే నంత గుంటూరునకు బయలుదేఱఁగా, రెయిలులో సుబ్బారాయఁడు నా కగఁబడెను. అతనికి లాయొలా కళాశాలలోఁ జదువును, వాని సోదరుల కందలివసతిగృహమున భోజనాదికమును సరిపడకపోవుట చేత, మువ్వురు నాచోటు విడిచిపెట్టిరి. సోదరు లిద్దఱు వేఱు బస లోనికిఁ బోఁగా, సుబ్బారాయఁడు తనకుఁ బ్రియమగు రాజమంద్రి కళాశాలలోనే జదువ నిశ్చయించి యిపుడు ప్రయాణమయ్యెను. గుంటూరులో మే మొకనాఁ డాఁగితిమి. అతనిని రాజమంద్రి యంపి, నేను భీమవరము వచ్చితిని.

భీమవరములోఁ గొన్ని దినములకు వెంకటరామయ్య కొమార్తె సీతమ్మ సుఖప్రసవమై మగపిల్లవానిని గనెను. పాప మీమెకదివఱకుఁ గలిగిన యిద్దఱు పిల్లలును కొంతకాలముక్రిందట చనిపోయిరి. కొన్ని దినము లచట మేము నిలిచి, పిమ్మట గుంటూరు వెడలివచ్చితిమి.

కళాశాలలోనియుద్యోగమును నే నింతటినుండి విరమించుకొనినను, పిమ్మట రెండువత్సరములవఱకును నేను ఇంటరుమీడియేటు పరీక్షాధికారిగనే యుంటిని. అందుచేత నాచేతికిఁ గొంతపనియును, జేబులో కొంత డబ్బును గనఁబడుచుండెను.

ఈయుద్యోగవిరామము చేసినను, నా కొకొక్కప్పుడు మనశ్శాంతి యంతగ లేకుండెను. నేను గుంటూరులోఁ గట్టించిన "శాంతినిలయ"మను ధర్మాలయము అన్ని విధములగు సభలకు నుపయోగింపవలె నని నేను నిశ్చయించుటచేత, గుంటూరుప్రార్థనసమాజమువా రలుకఁజెంది, అందు తమ సభలు జరుపమని సమ్మెకట్టిరి! "శాంతినిలయమం" తఁ గొంతకాల మూరకయే యుండెను. వార్తాపత్రికలు పెట్టి యందుఁ జదువుకొనుచుందు మని యొక సమాజమువా రనుటచేత, వారి కందుఁ

ప్రవేశము గలిగించితిని. కాని, కొంతకాలమున కాసంస్థ నిలిచి పోయెను. గుంటూరు "యువజనసాహితీసంఘము" వా రంత "శాంతి నిలయము" లోఁ దమ పుస్తకభాండాగారమును బెట్టుకొనుటకు నే నంగీకరించితిని. నేను నెల్లూరున నుండు చివరకాలమంతయు నేతత్సమాజమువారె "శాంతినిలయము" నుపయోగించుచు వచ్చిరి.

నే నిపుడు విశ్రాంతి గైకొనుటకై గుంటూరు వచ్చి చూచు నపుడు, "శాంతినిలయమును" ఏతత్సమాజమువారు వాడుకొనక, ఎపుడును తాళము వేసియె యుంచుచు వచ్చిరి! స్థలము విశాలమైనను, అందుఁ గట్టఁబడిన యిల్లు చిన్న దగుటచేత, అది యే పెద్దసభలకును బనికిరానట్టు నాకిపుడు స్పష్టమయ్యెను. ఇపు డది పెంపుచేయుటకు నాయొద్ద ధనములేదు. ఎందునకును కొఱగాని యిట్టి ధర్మశాల నుంచుటకంటె, దీనిని విక్రయించి యాధనమును "ఆంధ్రవిశ్వ విద్యాలయము" వారి కొసంగినచో, దానిమీఁద వచ్చువడ్డితో వారు పేదవిద్యార్థులకు సంవత్సరవేతనము లిచ్చుచు, ధర్మము నిట్లు శాశ్వతసంస్థగ నడుపఁ గలరని మిత్రులు కొండ వెంకటప్పయ్యగారు నేనును దలంచితిమి. ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులతో నేనీ విషయ మున నుత్తరప్రత్యుత్తరములు సాగించితిని.

ఈ సంగతి నేను "యువజనసాహితీసంఘము" వారి యుద్యోగులు కొందఱితోఁ జెప్పి వేసి, మందిరమును త్వరలో ఖాళీ చేయుఁడని కోరితిని. వారికిఁ దమ సంస్థను నడపుకొనుటయం దాసక్తి లేదుగాని, నా సంకల్పమునకు విఘాతము గలిగించుటకు వలయు శక్తి యుక్తులుమాత్రము లేకపోలేదు! నా సొంతయుపయోగము నకై నే నీ మందిర మమ్మివేయ నెంచితినని వారు ప్రతీతి కలిగించి,

ఎటులైన నీ ధర్మమును దమపురమునకె దక్కునట్లు చేయఁగోరి, వా రెంతకాలమునకును మందిరమును ఖాళీ చేయకుండిరి! నేను మందిరమునకు ధర్మకర్తనని యొప్పుకొనినచోఁ దాము వెడలిపోయెద మని వా రిపుడు వర్తమానమంపిరి! నే నేమిచేయుదును? వారిమీఁద నే నిపు డభియోగము తెచ్చుట కొకవేయిరూపాయిలు కావలయునని న్యాయవాదులు చెప్పిరి! కావున నెటులైన వారి నచటినుండి యంపి వేసి, "శాంతి నిలయమును" పురధర్మకార్యములకు బాహాటముగ వినియోగింపఁగోరి, నేను వారికోరికచొప్పున నే చేసితిని. ౧౮-౧-౩౯వ తేదీని "శాంతినిలయము"ను గూర్చి నే నొక దస్తావేజు వ్రాసి రిజిష్టరి చేయించితిని. నా జీవితకాలమున నే నొక్కఁడను, పిమ్మట పురప్రముఖులలో ముగ్గురును, దానికి ధర్మకర్తలుగ నుందురనియు, ఆ గృహము నిరర్థకమగునపుడు దాని నమ్మివైచి, ఆధనముతో నీ ధర్మమును బోలిన వేఱొకదైన ధర్మమును జరుపవలెననియును నేను విధించితిని. అంత "సాహితీసంఘము" వారు తమ సామానుల నచటినుండి తీసికొనిపోయిరి. కొలఁదికాలమునకె యీ సంఘ మంతరించెను! అప్పటినుండియు మందిరము నా యధీనమందె యున్నది. బహిరంగసభలు, ముఖ్యముగ స్త్రీల సమావేశములు నచట బాహాటముగ జరుపవచ్చును.

౧౯౩౯ డిశెంబరులో నేను వెంకటరామయ్యయును నెల్లూరు వెళ్లి, ప్రసవమై వ్యాధిగ్రస్తయైన యాతని పెద్దకోడలు సూర్య కాంతమ్మను జూచి వచ్చితిమి. ఆమెకుఁ ద్వరలోనె దేహస్వాస్థ్యము గలిగెను. అపుడు జనించిన యర్భకుని సంరక్షణమును గుఱించి వెంకయ్యగారును, వారి సతీమణియును మిగుల పాటుపడిరి.

కళాశాల విడిచిన కొన్ని నెలలకు నాకచటినుండి సుమారు ౧౩౦౦ రూపాయిల యుపకారవేతన మీయఁబడెను. రెండుసంవత్సరముల క్రిందటనే "రక్షకనిధి" యీ కళాశాలలో నేర్పడుట నాకింత చిన్న మొత్తము లభించుటకుఁ గారణ మయ్యెను.

కొంతకాలమునుండి నాకనులు జబ్బుగ నుండెను. ఎన్నిసారులు సులోచనములు మార్చుకొనినను, నాకు లాభము గలుగకుండెను. ౧౯౦౭-వ సం. డిసెంబరు తుదిదినములలో నేను చెన్నపురి పోయి, వైద్యాధికారి ముత్తయ్యగారికిఁ గనులు చూపించితిని. కనులలో పొరలు పెరుగుచుండె నని యాయన చెప్పి, క్రొత్త సులోచనము లిచ్చెను.

## ౨. నూతనపరిస్థితులు

మా పెద్దమేనత్త భద్రమ్మగారి మనుమఁడును, మా తమ్ముఁడు వెంకటరామయ్య బావమఱఁదియు, మా కాబాల్యస్నేహితుఁడును నగు మంత్రిరావు వెంకటరత్నమున కారోగ్యము చెడె నని తెలిసి, నేను ౧౯౦౮-వ సంవత్సరప్రారంభమున భీమవరము వెళ్లి, అచటినుండి తణుకు పోయితిని. మా తమ్ముఁ డచటనే కొన్నిదినములనుండి రోగిని గనిపెట్టుకొని యుండెను. ఆ ఫిబ్రవరినెలలోనె వెంకటరత్నము చనిపోయెను. పాప మతఁడు తనతోడియల్లుని కుమారుని దత్తత చేసికొని యొక సంవత్సరమైనఁ గాలేదు. మంచిభూవసతియు, ధనగృహాదులును గలవాఁ డయ్యును, వీని ననుభవింపక, నడివయస్సు ననె యాతఁడు మృత్యువు వాతఁబడెను!

## ౨. నూతన పరిస్థితులు

రాజమండ్రి బోధనాభ్యసనకళాశాల ప్రాంత విద్యార్థుల సమావేశసమయమున నేనధ్యక్షత వహించితిని. ఆ యేప్రిలు నెలలో వియ్యమ్మగారి భూములవిషయమై మేమిదివఱకు వేసిన వ్యాజ్యెము నరసాపుర న్యాయస్థానమున మా పక్షమయ్యెను. అంతట న్యాయాధిపతి తీర్పునుబట్టి, యీ వేసఁగిని రేలంగి వరిపండుభూములు మేము స్వాధీనపఱుచుకొని, క్రొత్తకవుల్లిచ్చితిమి. మాచిన్ననాఁడు మాయను భవమునుండి తొలఁగిపోయిన భూములు మరల నర్ధశతాబ్దము పిమ్మట నిపుడు మావశమయ్యెను!

౨౯-వ సంవత్సరము వేసంగిని మేము భీమవరములో మా క్రొత్తయింట నివసించితిమి. నా భార్యయు నాచెల్లెలు నంతట గుంటూరు పోయిరి. నేను పొలములపని చూచుకొనుచు భీమవరములోనె యుంటిని. భీమవరముప్రాంతములభూములకు తఱచుగ పాటిమట్టివేయవలసియుండుటచేత నప్పుడు చాలధనము వెచ్చించి, నేను పాటిపెరడు నొకటి యాగ్రామమునఁ గొంటిని. వేసవి తుదిని నేను మరల గుంటూరువచ్చితిని. ఇంటి మరమ్మతులు చేయించుకొనుచును, విశ్వవిద్యాలయపరీక్షాకార్యములు చేసికొనుచును, నేను కాలముగడిపితిని. తీఱికసమయముల నేను చిన్నకథలు వ్రాయుచుంటిని. మా గుంటూరు గృహమునకు ముందు చప్టానొకటి కట్టించితిని. దీనివలన మాయింటి విరివి, సౌందర్యమును హెచ్చెను. పాదులు మొలకలును బెట్టుటచేత, పెరడు దర్శనీయముగ నుండెను. ఇంటి ముందరిబాట మరమ్మతు చేయించి, దాని కిరుకెలంకులను ముండ్లతీగలు వేయించుటచేత, పశువులు ప్రవేశించుటకుఁ గొంత యాటంకము కలిగెను.

౧౯౨౯-వ సంవత్సరము డిశంబరు నెలలో మా పెదతండ్రి కుమారుఁడు వీరభద్రుని మూఁడవకుమారుఁడు గంగన్న పెండ్లికై

యేలూరు వెళ్లితిమి. అచటినుండి మేము వెలిచేరువెళ్లి, మా బాప మఱఁది రెండవకుమారుఁడు బుచ్చిరామయ్య వివాహమునకు పడవ మీఁద ఆలమూరు వెళ్లితిమి. పెండ్లి లగ్నసమయమునందె యజీర్ణ ప్రకోపముచేత తలతిరిగి నేను క్రిందఁబడిపోయితిని! ఐన నొక నిముస మునకే నాకు స్పృహవచ్చెను. ఆ పెండ్లిలో కొందఱు ప్రాఁత నేస్తుల దర్శనము నాకు సంప్రాప్త మయ్యెను.

౧౯౩౦-వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో నాకు నెల్లూరు కళా శాలాధ్యక్షులగు శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారినుండి యాహ్వా నము వచ్చెను. ఆ కళాశాలా విద్యార్థి సంఘమువారి వార్షికసభకు నే నధ్యక్షత వహించితిని. నెల్లూరులోని మిత్రులను తోడి యుపాధ్యా యులను జూచి సంతోషమందితిని.

ఈ సంవత్సరము మార్చిలో మా చెల్లెలి కుమారుఁడు జనా ర్దనమునకు మా తమ్ముఁడు కృష్ణమూర్తి నాలుగవకొమార్తె మాణిక్యాంబ నిచ్చి పెండ్లి చేసిరి. ఆ సమయముననే కృష్ణమూర్తికుమారుఁడు బాలసూ ర్యునికి నుపనయనముకూడ జరిగెను.

౧౨-వ యేప్రిలు తేదీని కొల్లూరులో పాఠశాలావిద్యార్థి సంఘమువారి వార్షిక సభకు నన్నగ్రాసనాధిపతిగఁ గోరిరి. విద్యా బోధకుల ముఖ్యవిధులను గుఱించి నేనా సమయమునఁ బ్రసంగించితిని.

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారితో మాటాడుచు, నే నొక మాసపత్రిక ప్రకటింప నుద్దేశించుకొంటినని చెప్పఁగా అట్లు చేయుటకంటె, తమపత్రికలగు భారతి ఆంధ్రపత్రికలలో నే నెన్ని కథావ్యాసములనైన వ్రాయవచ్చునని వారు పలికిరి. అందువలన నే నప్పటినుండి కొన్ని నెలలు ఆంధ్రపత్రికకుఁ గథలు వ్రాయుచువచ్చితిని



౧౯౩౦. ఎడమనుండి కుడివైపునకు: ౧ పంక్తి. రాయసం సుబ్బారాయుడు, నరసింహము, వెంకటశివుడు, వెంకటరామయ్య, మేనల్లుడు రామునితో సూర్యనారాయణ.

౨ పంక్తి. లక్ష్మీకాంతము, రత్నమాల వెంకటశివుడులతో సూర్యకాంతము, కనకమ్మ, సీతమ్మ, మాలతి.

'మురళీధరరావు,' 'జానకీబాయి,' 'మయూరశాస్త్రి' మున్నగు. కథలు నే నప్పుడు వ్రాసినవియె.

ఆ వేసవి ప్రారంభము నుండియే, మరల దేశమున 'సహాయ నిరాకరణోద్యమము' ప్రారంభ మయ్యెను. గాంధీమహాత్ముఁడు దండి యాత్రకు వెళ్లి, 'లవణ సత్యాగ్రహము' నకు దిగుటయె తడవుగా, దేశమందలి ప్రముఖులు మరల కారాగార బంధితులుకాఁ జొచ్చిరి. ముఖ్యపట్టణములలో "శాంతిసైన్యముల" శిబిరము వెలసెను. ౧౯-వ ఏప్రిలున మిత్రులు శ్రీ కొండ వెంకటప్పయ్య గారు రక్షకశాఖవారిచే అమ్మనబ్రోలు గొనిపోఁబడిరి. నేను వెంటనే వారి యల్లునితోఁ గలసి రెయిలెక్కి యాగ్రామమేగి, న్యాయసభ లోనికిఁ బోయితిని. అపుడె న్యాయాధికారి వెంకటప్పయ్యగారికొక వత్సరము కఠినశిక్ష నొసఁగిరి. ఒకటి రెండు గంటలు వెంకటప్పయ్య గారితో నేను మాటాడి, గుంటూరు వెడలివచ్చితిని. ఆంధ్రప్రముఖులు శ్రీయుతులు టంగుటూరి ప్రకాశము, నాగేశ్వరరావు, సీతారామ శాస్త్రిగార్లు మున్నగువారు సంతోషమునఁ గారాగారముల కేగిరి. మా చెల్లెలు కనకమ్మ నరసాపురములోను, మఱఁదలు శ్యామలాంబ ఏలూరులోను, సత్యాగ్రహసంస్థలో తీవ్రముగఁ బనిచేసిరి. ఆవేసవిలో నేను భీమవరములోనుంటిని. నాభార్య బెంగుళూరున కేగెను.

౧౯౩౦ వేసవిలో మాతమ్మునికుమాళ్లు ముగ్గురు నపుడు ప్రబలి యుండు సత్యాగ్రహమున దిగవలెనని మిక్కిలి ప్రయత్నించిరి. సూర్యనారాయణ భీమవరమునందలి స్వైచ్ఛికసైనికదళమునకుఁ గొన్ని దినములు కవాదుచెప్పెను. నేనును వెంకటరామయ్యయును వీంద్రుడును, మాచెల్లెలిని, సత్యాగ్రహముతో జోక్యము కలిగించుకొనవలదని హెచ్చరించితిమి.

మా మేనల్లుని పెండ్లినిగుఱించి మా చెల్లెలు చేసిన యప్పు నేనిపుడు తీర్చి వేసితిని. ఇంతలో ధాన్యపుధర యాకస్మికముగ తగ్గిపోవుటచేత, ఆర్థికకష్టములకులోనగు నేను, అనుకొనినట్టుగ వెంటనే మాచెల్లెలి కింకను ధనసాహాయ్యముఁ జేయలేక పోయితిని.

౧౯౩౦ వేసవి చివరను సూర్యనారాయణయు నేనును మాయత్తవారియూరగు వెలిచేరు పయనమయితిమి. మా మేనమామ వెంకయ్యగారు క్రిందటిదినమె వేలివెన్నులో నాకస్మికమరణము నొందిరని దారిలో నిడదవోలులో మాకు దుఃఖవార్త తెలియుటచేత, మేమపుడు వేలివెన్ను వెళ్లితిమి. మా మేనమామ చిన్ననాఁటి నుండి మా సోదరుల నెంతో ప్రేమతోఁ జూచి, మా విద్యాభివృద్ధికిఁ దోడుపడిరి. చాలకాలము జీవించి, యిపు డనాయాస మరణమునొందిన వెంకయ్యగారు ధన్యజీవితుఁడు. రెండునెలలక్రిందటనె యీయన తన రెండవకుమారునికి వివాహము చేసిరి. నాయాలోచన ననుసరించి యీయన పెద్దకుమారుఁడు రాజమంద్రిలో రెండుసంవత్సరములు బోధనాభ్యసనము చేసి, యిటీవలనె విద్యాబోధకుఁ డయ్యెను

మేమంత వెలిచేరు నడిచి వెళ్లితిమి. మా బావమఱఁది కుటుంబమువారినందఱిని జూచి, సూర్యనారాయణుని భార్య మాలతిని మా వెంటఁ బెట్టుకొని, రాజమంద్రిమీఁదుగ మేము భీమవరము చేరితిమి.

నేను మరల జులై నెలలో గుంటూరు వెడలిపోయితిని. నా భార్య యీ లోపుగ బెంగుళూరునుండి వచ్చెను. ఉన్నవ దంపతులు సత్యాగ్రహమునఁ బాల్గొని కారాగారమున కేగుటచేత, వారుజరుపు "శారదానికేతన" పాలకవర్గములో నే నొకఁడనయితిని. కాని, వారివలె మే మెవరమును పనిచేయఁ జాలకుంటిమి. సెప్టెంబరులో

## ౨. నూతన పరిస్థితులు

నేను "శారదానికేతన" పరిపాలకులలో నింకొకరగు మంత్రిప్రెగడ సాంబశివరావు గారును చందాలకై నూజివీడు వెళ్లితిమి. అచ్చటి శ్రీ వల్లూరు రాజాగారు కొంత ధనసాహాయ్యము చేయుదుమని చెప్పిరి. నాప్రాంత నేస్తులగు మరంగంటి కృష్ణమయ్యంగారి యింట మేము బసచేసితిమి. బాల్యస్నేహితులు మద్దిరాల రామారావు గారిని గూడఁ జూచితిమి.

వయోవృద్ధులగు మా పెద్దమేనమామ సుబ్బయ్యగారిని జూచుటకై నేనంత ఏలూరు వెళ్లితిని. తొంబది సంవత్సరముల ప్రాయము గల యాయనను కనులు పొరలు తీయించుకొమ్మని నేను ప్రోత్సహించినందుకు మా మేనత్త నవ్వెను. అంత నొక నెలలోనే యాయన చనిపోయెను. ఆయన కర్మాంతరములకు నేను వెంకటరామయ్యయును ఏలూరు పోయివచ్చితిమి. మా మేనమామలలో సుబ్బయ్యగారతిశాంతచిత్తులు; ఎంతో యోరిమిగల వారు. ముప్పది సంవత్సరముల వయస్సుననుండునపు డీయన కొకపసిబాలిక నిచ్చి పెండ్లి చేసిరి. శాంతస్వభావమునకును, ఋజువర్తనమునకును ఈయన తార్కాణమని చెప్పవచ్చును. సంతతి విషయమునఁగూడ నీయన మిక్కిలి యదృష్టవంతుఁడు. వీరికి నలుగురు కుమాళ్లును, ముగ్గురు కొమార్తెలును. అందఱును బుద్ధిమంతులు.

ఈ సంవత్సరము అక్టోబరులో మా తమ్ముని కుమారుఁడు నరసింహము బి. యల్. పరీక్షనిచ్చి, చెన్నపురినుండివచ్చి, సతీసుతులతో గుంటూరులో మాయింటఁ గొన్నిరోజులుండి, మా కానందము గలిగించెను. ఆతనిపిల్లవానిని నాపేరుతోనే బిలుచుచుండిరి. వానికి నూతమ్ముని దగ్గఱ వలెనే నాయొద్దను మిక్కిలి చనవు కుదిరెను. వానికి

భయము చెప్పటకై నేను 'బూచి' వానిని బిలిచినపుడు బూచివాని కిచ్చివేసెదనని నన్నే వాఁడు బెదరించుచుండెను!

నరసింహము గుంటూరున నుండుదినములలో నేను నా ప్రాఁత దినచర్యపుస్తకములు తిరుగవేయఁజొచ్చితిని. జీర్ణమైపోవుచుండెడి యాపుస్తకములలోని ముఖ్యాంశములు కొన్ని యొకకాకితమున లిఖి యించితిని. నా కళాశాలావిద్యాభ్యాసకాలమున వీరేశలింగము పంతులుగారితో ముఖ్యముగ నేను ప్రొద్దుపుచ్చుచుండుటచేత, ఆ కాలపు దినచర్య పుస్తకములు పంతులుగారిని గూర్చిన సంగతులతో నిండియుండెను. నేనేల యీ సందర్భమున వీరేశలింగముగారిసంగ్రహచరిత్రము వ్రాయఁగూడ దని ప్రశ్నించుకొంటిని. వారిచరిత్ర రచనమునకుఁ గడంగు మని నరసింహము నన్నుఁ బ్రోత్సాహపఱిచెను.

అది కారణముగ నేను పట్టుదలతో పంతులుగారి చరిత్రము వ్రాయఁజొచ్చితిని. పంతులుగారు నాకు వ్రాసినజాబులు, మే మిరువురమును గలసి ప్రచురించిన 'సత్యసంవర్ధని,' 'జనానాపత్రిక' ల వెనుకటి సంపుటములును నాయొద్దఁ గలవు. "వీరేశలింగసంస్మృతి" నే నంత వ్రాయఁ దొడంగితిని.

ఇంతలో నపుడె కారాగార విముక్తులయిన శ్రీ నాగేశ్వర రావుగారిని నేను బెజవాడ పోయి యొకనాఁడు చూచి, ప్రసంగ సందర్భమున, నేను వ్రాయుచుండు "వీరేశలింగసంస్మృతి" ని వారి "భారతీ" పత్రికాముఖమున మాసమాసమును బ్రకటింతురా యని యడిగితిని. వేఱె పుస్తకరూపముననే దానిని బ్రకటింతు మని వారు ప్రత్యుత్తర మిచ్చిరి. అందువలన వేవేగముగ నా పుస్తకమును వ్రాయఁ బూనితిని.

# 3. అకాలమరణము

మా తమ్ముఁడు వెంకటరామయ్య కుమాళ్లు ముగ్గురిలోను సూర్య నారాయణ కనిష్ఠుఁడు, మేధావంతుఁడును. అతనికిఁ గొన్ని సంవత్సరములనుండి యేమికారణముచేతనో కాని దేహము పాలి పోవుచువచ్చెను. ఇపుడు ౧౯౩౦-వ అక్టోబరులో చెన్నపురిలో బి. యల్. పరీక్షనిచ్చి, అన్నతోఁ దాను గుంటూరు రాక, సరాసరిగ భీమవరమె వెడలిపోయెను. అతనికి లోకాక తగిలి దేహస్వాస్థ్యము తప్పుచుండెనని మా తమ్ముఁడు వ్రాయుటచేత, నే నా డిసెంబరు తుదిని భీమవరము వెళ్లితిని. వెళ్లిన మఱునాఁడె నేను కుముదవల్లిలో వీరేశలింగవర్ధంతి సమయమున నధ్యక్షత వహించితిని. వీరేశలింగము గారివలె మనమును కార్యశూరులమై, దేశోద్ధరణమునకుఁ గడంగవలె నని నేను వక్కాణించితిని.

భీమవరము వైద్యాలయమున సూర్యనారాయణ యపుడు 'కొంకిపురుగు' జబ్బునకు మందు పుచ్చుకొనుచుండెను. ఇంతలో వానికి సంజుగుణముకూడఁ గనఁబడుటచేత, మే మింగ్లీషు చికిత్స మానిపించి, ఆయుర్వేదవైద్యము చేయించితిమి. నరసాపురపు వైద్యులగు రౌతుల గోపాలముగారు భీమవరము వచ్చి చూచి, రోగిని నరసాపురము కొనిరమ్మనిరి. మే మంత జనవరి తుదిని సూర్య నారాయణుని దీసికొని, నరసాపురమున మా తమ్ముఁడు కృష్ణమూర్తి యింటఁ బ్రవేశించితిమి. నా భార్య, సూర్యనారాయణుని యత్త గారును కూడ నరసాపురము వచ్చిరి. చూచుచుండఁగనే యా యువ కుని రోగ మతిశయించెను. ఏమందును కాని వానికి లాభకారి కాలేదు.

అంత ౭-వ ఫిబ్రవరి రాత్రికి స్పృహతప్పి, మఱునాఁడు సాయంకాలము నాలుగుగంటల కాతఁడు జీవములు కోలుపోయెను!

మరల మాకుటుంబమునకు తీఱని దుఃఖము వాటిల్లెను. పూర్వకాలమున రాజమంద్రిలో చావుమీఁద చావువచ్చి, మాసోదరులలో కనిష్ఠుఁడును కుశాగ్రబుద్ధియునగు సూర్యనారాయణ యస్తమించెను. ఇపుడు ముప్పదిసంవత్సరములకుఁబిమ్మట మరల మా కుటుంబమున నకాలఘోరమరణ మొకటి సంభవించెను. చనిపోయిన కడగొట్టు తమ్మునిమీఁది ప్రేమమున, వానినిఁ గొన్నియంశములందుఁ బోలిన తన మూఁడవ కుమారునికిని మాతమ్ముఁడు సూర్యనారాయణయనియె పేరిడెను.

బి. యల్. పరీక్షలో నిపుడె యీ సూర్యనారాయణ జయమందెను. వీనిని పెంపుచేసికొమ్మని మాతమ్ముఁ డెన్నిసారులో సూచించినను, దురదృష్టవంతులమగు మాయింటఁబడినచో వీని కెట్టి యనర్థము వాటిల్లునోయనుభయమున మేము ఉపేక్షించితిమి. నా భార్య పట్టుపట్టి, తనయన్న రెండవకూఁతురు మాలతి నిటీవల వీనికిఁ బెండ్లిచేయించెను. వీరివలన ముందెల్లరకు విశేషసౌఖ్యము చేకూరఁ గలదనియు, వారియభివృద్ధిఁగాంచి సంతోషింపవచ్చుననియును, మేము ఉవ్విళ్లూరుచుండువారము. కాని, పర్యవసాన మిటులయ్యెను!

కర్మాంతరము లయినపిదప భీమవరము వచ్చితిమి. అచటినుండి నేను గుంటూరు వచ్చివేసితిని. నేనిదివఱకు సిద్ధపఱిచిన "వీరేశలింగ సంస్మృతి"ని నాగేశ్వరరావుగారి ముద్రాలయమున నచ్చువేయుటకుఁ దీఱదని వారు వ్రాసిరి కావున, నే నీపుస్తకమును గుంటూరు చంద్రికా ముద్రాలయమున నచ్చొత్తించితిని. ఈ చిన్నపుస్తకమును నిపుడె

దివంగతుఁడయిన మా సూర్యనారాయణుని కంకితముచేసి, యొకింత దుఃఖోపశాంతి గాంచితిని. పుస్తకముఖపత్రమున వీరేశలింగముగారి ఛాయాపటముతోఁబాటు సూర్యనారాయణుని చిత్రమును ముద్రిత మయ్యెను. అందలి కృతిపద్యము లిచటఁ బొందుపఱుచుచున్నాఁడను.

ఆ–వె. "కాశిచేరి గంగఁ గాంచనియాత్రయు
మోక్షఁబెంచి ఫలము తాఁకనికృషి
అయ్యొ, వ్యర్థమయ్యె నల్పాయువుంజేసి
నీదు విద్య సుగుణ నికరమయ్యొ!

క. కొనుమా యంకితమిది మన
యనురాగ శ్రీకొకింత యంకితముసుమీ,
తునుమాడి భూనిగళములఁ
గనుమా పరమాత్మ పద సుఖమ్ముల సూరీ!"

నా బాల్యస్నేహితులు, కవిపుంగవులునగు శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహముగా రీపుస్తకమునకుఁ దొలిపలుకు వ్రాసిరి.

ఎట్టకేల కీపుస్తకము ముద్రాలయమునుండి వెలువడుటకు నేను సంతోషించుచుండఁగా, మా చెల్లెలు కనకమ్మకు నంజు కనఁబడెనని మా తమ్ముఁడు ఏప్రిలునెలలో నాకు భీమవరమునుండి వ్రాసెను. కావున నే నామెను జూచుటకు భీమవరము వెళ్లితిని. దైవానుగ్రహమున నామెకు నానాట స్వస్థపడెను.

౧౯౩౧ ఏప్రిలునెలలో "పశ్చిమ గోదావరీమండల యున్నత పాఠశాలల బోధకులసమాజ" వార్షిక సభ ఉండిలో జరిగెను. ఆసభకు నే నధ్యక్షత వహించితిని.

ఆ వేసవిలో నా భీమవరము తాలూకా భూములు మూఁడింటిలో పాటిమన్ను పోయించి, వానిని బలపఱిచితిని. దీనికి చాలసొమ్ము వ్యయమైనను, ఆ భూములలో ముందు మంచిపంట పండఁగలదని నాయాశయము.

దుర్దశనొంది పుట్టినింట నుండు మాలతిని జూచివచ్చుటకై సుబ్బారాయనితోనే నీ వేసవి తుదిని వెలిచేరు పయనమైతిని. మార్గమధ్యమున నరసాపురములో మేము రెండుగోజులు నిలిచి, అచటనిటీవల ప్రసవించిన మా తమ్ముఁడు కృష్ణమూర్తి మూఁడవకొమార్తె కామేశ్వరమ్మను, ఆమె చిన్నితనయుని జూచితిమి. అచటనుండి మేము వెలిచేరు బయలువెడలితిమి. గత సంవత్సర మీరోజులలో సూర్యనారాయణయు నేనును వెలిచేరు ప్రయాణముచేసిన దినములసంగతి తలంపునకు వచ్చి, మేము శోకించితిమి. మమ్మఁ జూచి మాలతి మిగుల విచారించెను. నాభార్య యిక్కడ కిటీవలనే వచ్చి, మాలతిని గుంటూరు కాహ్వానించెనఁట. దానిచెల్లెలు అచ్చమాంబ నాయొద్దనే యుండి యదివఱకు చదువుచుండెను. తప్పక గుంటూరు రమ్మని నేనును మాలతి నడిగితిని. మే మంత భీమవరము వెడలిపోయితిమి.

ఈ వేసవిలో భీమవరములోఁ బ్రసవమైన మాచెల్లెలి రెండవ కొమార్తె సీతమ్మయు దానిపిల్లలును, అక్క వరసమ్మయు దాని కుమారుఁడును, వేసవితుదిని తమతమ తావులకు వెడలిపోయిరి.

వేసవిచివర ౨౮-వ జూను తేదీని నేనును భీమవరమునుండి బయలుదేఱితిని. దారిలో కైకలూరులో నేనొకరోజు నిలిచి, మఱఁదలి కుమారుఁడు కృష్ణారావును అతనిభార్యను పిల్లలను జూచితిని. మఱునాఁడు వెలిచేటి నారాయణతో బయలుదేఱి గుంటూరు చేరితిని.

## 3. అకాలమరణము

కాల్ధరి భూమిలో నైదుయకరములు నే నీ సంవత్సరము ఫాలికి కవులిచ్చుటచేత, ౧౯౩౧-వ సంవత్సరము చివర భాగమున రెండు మూఁడు సారులు నేను గుంటూరునుండి బయలుదేఱి యాగ్రామము నకుఁ బోవలసి వచ్చెను. కాని, ఆ భూమిలోని ఫలసాయము నా పయనపు కర్చులకె సరిపోయెను! అర్థికసంబంధ మగు చిక్కులు దేశ మం దంతట నలమికొనెను. ఇంటి వ్యయము కొంత తగ్గింప నేను బ్రయత్నించి, సంవత్సరముల నుండి తెప్పించుచుండెడి వార్తాపత్రికలను నే నిపుడు నిలిపివేసితిని.

ఇపుడు గుంటూరునకు వచ్చిన మాలతి "శారదానికేతనము"నఁ జేరి చదువుచు, తన దుఃఖమును గొంత మఱపునకుఁ దెచ్చుకొనుచుండెను. ఆ సంవత్స రాంశమున నా భార్యయు మాలతియును "అఖిలభారత మహిళాసభలు" చూచి వచ్చుటకై చెన్నపురి పోయిరి.

౧౯౩౨-వ సంవత్స రారంభమున, గాంధిమహాత్ముఁడు సీమ నుండి వచ్చిన తోడనే, మరల "సత్యాగ్రహోద్యమము" దేశమున బ్రారంభ మయ్యెను. శ్రీ నాగేశ్వరరావుగారు మున్నగు నాంధ్ర ప్రముఖులు మరల కారాగృహముల కేగిరి.

"వీరేశలింగసంస్మృతి" రచియించుసందర్భమున నేను తిరుగ వేసిన నాపూర్వదినచర్యపుస్తకములు, పూర్వపత్రికలు, వ్యాసోపన్యాసములును సాయముచేసికొని, నేను ౧౯౩౧-వ సం. సెప్టెంబరు అక్టోబరు నెలలలో నా "ఆత్మచరిత్రము" ను వ్రాయఁదొడంగితిని. అంతికంతకు నాకు దృష్టిమాంద్యము హెచ్చుచుండుటవలన, ఈరచనాకార్యము తృప్తికరముగ సాగలేదు. ఐనను, అక్టోబరు నెలలో నేను

భీమవరము వెళ్లినప్పటికి నాచరిత్రమునందలి ప్రథమభాగము శుద్ధప్రతి వ్రాసి, భీమవరము నరసాపురముల కదితీసికొనిపోయి, నాసోదరీసోదరులకును, ఒకరిద్దఱు మిత్రులకు నది చదువనిచ్చితిని. అంత నా నవంబరు డిసెంబరు నెలలలో మిగిలిన మూఁడుభాగములును బూర్తిపఱిచితిని. వాని శుద్ధప్రతిని వ్రాయుటకే నా కెంతో ప్రయాసకలిగెను.

౧౯౩౨ వేసవిని దంపతుల మిరువురమును భీమవరములో నుంటిమి. మాతమ్ముఁడు వెంకటరామయ్య కుటుంబమును మేమును గలసి మాక్రొత్తయింట నివసించితిమి. ఇంటఁ గొన్ని మరమ్మతులు చేయించితిమి. నాభూముల శిస్తులు పోగుచేయుచును, భూముల వమరకపఱుచుచును, నేను వేసవిని భీమవరప్రాంతములందుఁ గడపితిని.

ఇటీవలనే ఢిల్లీలోజరిగెడి దేశీయమహాసభ కేగుటకుఁ బ్రయత్నించుటవలన నానగరమునఁ గారాగారబంధితులై విడువఁబడియు, మరల జూను నెలలో గుంటూరులో రక్షకభటులచే బంధితులయిన కొండ వెంకటప్పయ్యగారి దేహారోగ్యవిషయమై యాయనబంధువులు మిత్రులును మిగుల నలజడిపడిరి. వెంకటప్పయ్యగారిభార్యకును దేహములో రుగ్ణత హెచ్చెనని మాకుఁ దెలియవచ్చెను.

## ౮. హరిజనోద్యమము

౧౯౩౧-వ సంవత్సరమధ్యమున నేను రచించి ప్రచురించిన "వీరేశలింగసంస్మృతి" ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి ప్రాపుగాంచ నేరకున్నను, చెన్నపురి సర్వకళాశాలవారి యాదరణ భాగ్యమును గొంత చవిచూచెను. ౧౯౩౮-వ సంవత్సరమందలి యింటరు మీడియేటుపరీక్ష కాంధ్రమున నీపుస్తక మొక్క పఠనీయ

గ్రంథముగ నియమింపఁబడెను. కాని, చెన్నపురి విశ్వవిద్యాలయమున నాంధ్రవిద్యార్థులు మిక్కిలి తక్కువగ నుండుటచేత నాపుస్తక ప్రతులు కొలఁదిమాత్రమె యమ్ముడువోయెను.

౧౯౩౭ జులై మొదటితేదీని నా తమ్ముఁడు వెంకటరామయ్యయు, నరసింహము, నాపత్నియు వెంటరాఁగా, నేను గోదావరి పుష్కరమునకై రాజమంద్రి పోయి నదీస్నానముచేసితిని. జనసమ్మర్దము విశేషముగ నుండెడి యా పట్టణమున నుండుట కిష్టము లేక, ఆరాత్రియె మరల మేము భీమవరము వచ్చితిమి. పారిశ్రామిక ప్రదర్శనోత్సవ సందర్భమున రాజమంద్రిలో కోటిలింగములయొద్ద జరిగిన బహిరంగసభకు మేము పోయి, పలువురు ప్రాఁతనేస్తులను జూచితిమి. నాభార్య తన చెల్లెండ్రపిల్లలను జూచుటకై కొవ్వూరులో దిగెను.

ఇటీవల నొకసంవత్సరము చదువు నిలిపివేసిన జనార్దనము మరల నిపుడు వైద్యవిద్యకొఱకు చెన్నపురి కేగెను. బి. యలు. పరీక్ష పూర్తిచేయుటకు నరసింహమును, యఫ్. యలు పరీక్ష తరగతిలో ప్రవేశించుటకు సుబ్బారాయఁడును చెన్నపురికి వెళ్లిరి. నేను జులై ౧౭-వ తేదీని గుంటూరు వచ్చితిని. తన వృత్తి పనులతోపాటు కుటుంబపరిపోషణకార్యము నెఱపుచు తమ్ముఁడు వెంకటరామయ్య భీమవరములో నిలిచియుండెను.

ఈ మాఱు చదువుటకై నారాయణ యొక్కఁడు మాత్రమె గుంటూరు వచ్చెను. వానితోఁబుట్టువు లిరువురును రాలేదు. మాలతి చదువు మాట మఱచిపోయి, పుట్టినింట తన దుర్దశను జ్ఞప్తికిఁదెచ్చుకొని మరల వనటఁ జెందుచుండెనని మేమును, నా తమ్ములును దలంచి, ఆమెనుగుఱించి ఖేదపడితిమి.

కొలఁది మాసముల క్రిందటనే యొకపుత్రుని గోలుపోయి తాను జబ్బుపడి యిపుడె స్వస్థతఁ జెందుచుండు మఱఁదలు చామాలమ్మ రెండవకూఁతురు చంద్రమతి తన చిన్నకుమాళ్లను వెంటఁబెట్టుకొని, గుంటూరువచ్చి, అగష్టునెలలో కొన్నిదినములు మాతోనుండెను. కాని, యధికవర్షములచేతనో మఱి యేకారణమువలననో యామెకును, రెండవ పిల్లవానికిని జ్వరము దగ్గును కలిగి, మిగుల బాధపడిరి. చేరువనుండు నొక వైద్యుని సాయమువలన వారికి స్వస్థత కలిగెను.

మా మఱఁదలు చామాలమ్మ అగష్టు ౯-వ తేదీని వెల్లూరు కారాగృహమునుండి విడుదలయై, గుంటూరువచ్చి మాతోఁ గొన్ని దినములుండెను. కన్ననూరు వెల్లూరు కారాగృహములలో రాజకీయ ఖైదీలగు స్త్రీలు బాలికలు నెట్లు కాలము గడుపుచుండిరో యామె చెప్పెను. మిక్కిలి లేఁతవయస్సునందు స్త్రీలు సయితము తమ కష్టములను బొత్తిగ లెక్కసేయక, స్వదేశోద్ధరణమునుగుఱించి కారాగారముల కేగుచుండిరని యామె చెప్పెను.

మా పెరఁటిలో నిపుడు యానాదుల కుటుంబము కాపురముండెను. వాండ్రకు మేమిచ్చెడిది నెలకు నాలుగు రూపాయిలె యయ్యెను, వారుండుటవలన మాకు మిగులసౌఖ్యము గలిగెను.

ఈ సెప్టెంబరు ౧౦-వ తేదీని నేను గుంటూరుమండలబోధక సమాజమువారి సంవత్సరోత్సవసందర్భమున "బోధకుల ప్రస్తుతకాల సమస్యలు" అను శీర్షికతో నొక యాంగ్లవ్యాసము వ్రాసి చదివితిని. మనదేశమున స్థానికప్రభుత్వసంస్థలు రాజకీయవిషయములందెకాక, విద్యావిషయములందును దేశమునఁ దసంతృప్తిని గలిగించుచున్నవని నేను జెప్పితిని.

పనియుండునపుడే, మనకు మఱింత పనిగలుగుచుండును. ఆ నెల తుది దినమున గుడివాడలో జరిగిన "కృష్ణామండల బోధక సమాజ" వార్షికసభకు నాకంత సాహ్వానము వచ్చెను. నేనచటి కేగి, నా పూర్వశిష్యులగు శ్రీ ఉప్పులూరి ఆదినారాయణమూర్తిగారి యింట బసచేసితిని. "విద్యాబోధకులకుఁ గొన్ని హితవచనములు" అను మకుటముతో నే నొక యాంగ్లవ్యాసము వ్రాసి, ఆసందర్భమునఁ జదివితిని.

ఇది జరిగిన కొలఁది దినములకే నా కింకొక దిశనుండి పిలుపు వచ్చెను. వేటపాలెమునందలి "సారస్వతనికేతనపు జయంత్యోత్సవ సమయమున నన్నుగ్రాసనాధిపత్యము వహింపుఁడని, ధర్మకర్తయగు శ్రీ. ఊ. వెం. శ్రేష్ఠిగారు కోరిరి. అంతియ కాక, యా సమయమున స్త్రీలసభ యొకటి జరుగుచుగాను, దానికిఁగూడ నన్నే యేర్పాటులు చేయుఁడనిరి. కాఁబట్టి దసరా పండుగరోజున (౯-౧౦-౩౭ ఆది వారము) నా భార్యయు, కొండ వెంకటప్పయ్యగారి రెండవ కొమార్తె పార్వతమ్మయును గలసిరాఁగా, నేను వేటపాలెము వెళ్లితిని. "ప్రస్తుత హిందూసంఘ పరిస్థితులు" అను నొక యాంధ్రవ్యాసము వ్రాసి, నేనా దినమున సభలోఁ జదివితిని. మఱునాఁటి స్త్రీలసభలో నాతో గుంటూరునుండి వచ్చిన యిరువురు స్త్రీరత్నములును నుప న్యాసము లిచ్చిరి. ౧౧ వ తేదీని మే మందఱమును బాపట్లవచ్చి, బంధువగు సత్తిరాజు గామచంద్రరావుగారియింట బసచేసితిమి. స్త్రీలకొక యుపన్యాసమీయుఁడని శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు కోరఁగా, "స్త్రీహితైషిణీ మండలి" సమాజసభలో "స్త్రీల ప్రస్తుతవిధులు" అను విషయమును గుఱించి నేను ప్రసంగించితిని. ఆ రాత్రి రెయిలులో బయలుదేఱి, మేము గుంటూరు తిరిగి వచ్చితిమి.

పై సభలలో నేను "అస్పృశ్యతానివారణము"ను గుఱించి నొక్కి చెప్పితిని. దీనికిఁ గారణము లేకపోలేదు. బ్రిటిషుదొరతనము వారు నూతనరాజ్యాంగసంస్కారణములందు అస్పృశ్యులకు ప్రత్యేక నియోజకవర్గము లేర్పఱుచుటవలన, ఇదివఱకు సాంఘికముగ జరిగిన కీడునకుఁ దోడుగ, ముందునుండి రాజకీయముగఁగూడ నస్పృశ్యులకనర్థము గలుగుననియు, వారు హిందూసంఘమునుండి శాశ్వతముగ విడిపోవుదురనియును దలంచి, యీ యనర్థము హిందూదేశమునకు వాటిల్లకుండుటకై తాను ప్రాయోపవేశము చేతునని గాంధిమహాత్ముఁడు యరవాడ చెరసాలలో సెప్టెంబరు ౨౦-వ తేదీనుండి నిరాహారదీక్ష నారంభించెను. గాంధిమహాత్ముని నిరాహారదీక్ష దేశము నంతటిని కలవరపఱిచెను. దేశమునందంతటను మహాసభలు జరిగి, తీర్మానములు గావింపఁబడెను. పునహాలో జరిగిన రాజీవలన నీవిషయమున దొరతనమువారు తమ నిర్ధారణమును గొంతవఱకుపసంహరించుకొనిరి. గాంధిమహాత్ముఁడు ౭-వ దినమున ఆహారము స్వీకరించెను. దేశమంతయు నంతట శాంతినొందెను.

ఆ సెప్టెంబరు ౨౦-వ తేదీని దేశములో ననేకప్రదేశములందు వలెనే మాయింటఁగూడ మేము ముగ్గురమును ఉపవాసముచేసితిమి. నాకు పిలుపురాఁగా పురమందిరమున నస్పృశ్యతానివారణమును గుఱించి జరిగిన మిత్రులసభకు నేను బోయితిని. నాఁటిసభకు నేనధ్యక్షుఁడనయితిని. అస్పృశ్యత తొలఁగిపోవుటకై పంచములతోఁ గలసి భజనలు ప్రార్థనలు నూరేగింపులును జరుగుట యావశ్యమని మేము నిశ్చయించుకొంటిమి.

ఆమఱునాఁడె యువకులగు మా మిత్రులు కొందఱు పంచములను దీసికొని, అరండలుపేట బ్రాడీపేటలలోఁగల సర్కారుబావులను

వారలచే తాకించిరి. కొన్నిగృహముల కంటియుండు నూతులుకూడ యజమానుల యంగీకారముచే పంచములు స్పృశించిరి. మాబావికిఁ గూడ నీభాగ్యము పట్టెను!

ఆమఱునాఁడు గుంటూరు మైదానమున జరిగిన "అస్పృశ్యతా నివారణసభ" కనేకులు వచ్చిరి. నన్ను మరల నగ్రాసనాసీనునిఁ జేసిరి. ఈ సంస్కరణమునుగుఱించి ప్రస్తుతప్రసంగతులు నేను విరళముగఁ జెప్పితిని. ఈరెండుదినములును నిరశనవ్రతము సలుపుచుండు ఉన్నవ లక్ష్మీనారాయణగారు తీవ్రముగ మాటాడిరి. సభికులు మిక్కిలి యుత్సాహముతో నుండిరి.

ఇంకఁ గొన్నిదినములపిమ్మట "పురపాలకపుస్తకాలయము" న జరిగిన సభలో "గుంటూరుమండల హరిజనసేవాసమితి" యేర్పడెను. ఈ సమితికి నన్ను అధ్యక్షునిగను, శ్రీయుత కొల్లి సత్యనారాయణ మల్లాది యజ్ఞనారాయణశాస్త్రిగార్లను కార్యదర్శులగను నియమించిరి. అప్పటినుండియు మాసంఘ యాజమాన్యమున జరిగిన బహిరంగసభలలో నేను అస్పృశ్యతానివారణమును గూర్చి తఱచుగ మాట్లాడుచు వచ్చితిని.

అక్టోబరు ౯-వ తేదీని బెజవాడలో శ్రీ న్యాపతి సుబ్బారావుగారి యాధిపత్యమున జరిగిన మహాసభలో "ఆంధ్రహరిజనసేవాసంఘసమితి" నెలకొల్పఁబడెను. దానికి దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు అధ్యక్షులుగను, మాగంటి బాపినీడుగారు మున్నగు ముగ్గురు కార్యదర్శులుగను ఏర్పడిరి. కార్యనిర్వాహకసభలో సభ్యునిగను, సమితిప్రచారకులలో నొకనినిగను నన్ను గోరుకొనిరి.

౧౭-వ అక్టోబరున నేను కూచిపూడి గ్రామము వెళ్లి, అచట నెలకొల్పఁబడిన "సేవాసమితి" సభ కగ్రాసనాధిపత్యము వహించితిని. నాతో శ్రీ మాగంటి బాపినీడుగారుకూడ నుండిరి. మే మాదినముననే సాయంత్రము తెనాలిలో నొక బహిరంగసభలో నుపన్యసించితిమి.

అక్టోబరు ౩౦-వ తేదీని శ్రీ న్యాపతి సుబ్బారావుగారు రాజమంద్రిలో తమయింట నొక సభగావించిరి. నాకుఁ బిలుపురాఁగా నే నచటికేగితిని. హిందూ మతోద్ధరణము జరుపుటకు దేశములోఁ గొందఱు యువకులను మతప్రచారకులనుగ సిద్ధముచేయుటకై యొక యాశ్రమమును రాజమంద్రిలో స్థాపింప వలెనని పంతులుగారి యుద్దేశము. అందు గౌరవబోధకులుగను, వ్యవహారకర్తలుగను నుండుఁడని నన్నును, శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారిని వారు కోరిరి. మేము సమ్మతించితిమి. ఈ యుద్యమ నిర్వహణమునకు పంతులుగారు తమతోఁట నిచ్చెదమనియు, వలసిన సొమ్మునకై తిరిగెదమనియుఁ జెప్పిరి. వారు ౧౦ వేలకు తక్కువగాకుండ నిలువ ధనము నిచ్చినచో, త్వరలో నిట్టి సంస్థ యేర్పడఁ గలదని నేను జెప్పివేసితిని.

రాజమంద్రినుండి నేను భీమవరము నరసాపురములు వెళ్లి, తమ్ములను, తక్కిన వారలను జూచి, తిరిగి ౭-వ నవంబరుకు గుంటూరు వచ్చితిని.

౧౨-౧౩ తేదీలలో జరిగిన "అఖిల ఆంధ్రరాష్ట్రీయ మహిళా సభకు" ప్రతినిధిగా నా భార్య రాజమంద్రి వెళ్లి, అక్కడనుండి నపుట్టినిల్లగు వెలిచేరు పోయి, ౧౮-వ తేదీకి గుంటూరు వచ్చెను ఆమెతో మాలతియును, మా బావమఱఁది యిద్దఱు కోడండ్రును. గుంటూరు వచ్చిరి.

# ౮. హరిజనోద్యమము

నేను నవంబరు ౧౫ వ తేదీని బెజవాడవెళ్లి, అక్కడనుండి శ్రీ నాగేశ్వరరావుపంతులుగారితో ఏలూరుపోయితిని. బెజవాడకు ౧౯-వ తేదీ యుదయమునకు వచ్చిన ఆంధ్రవిశ్వవిద్యాలయ వైసు చాన్సెలరుగారగు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారితోఁ గలసి మాట్లాడితిని. ఏలూరులో "ఆంధ్ర హరిజన సేవాసమితి" వారి కార్య నిర్వాహకసభకుఁ బోయితిని. ఆసాయంకాలము ఏలూరులో జరిగిన బహిరంగసభలో మిత్రులతో నేనును "అస్పృశ్యతానివారణమును" గుఱించి యుపన్యసించితిని.

శ్రీ నాగేశ్వరరావుగారు నా "ఆత్మచరిత్రమును" తమ యాంధ్రగ్రంథమాలా కుసుమములో నొకటిగా స్వీకరించి ముద్రింతు మనిచెప్పిరి. వారికోరికమీఁద "ఆంధ్రపత్రిక" కు క్రొత్తవ్యాసములు వ్రాయుదునని పలికితిని.

"నా పూర్వపరిచితులు" అను శీర్షికతో నే నంతట కొన్ని వ్యాసములు "ఆంధ్రపత్రిక"కు వ్రాయ నిశ్చయించుకొని, వేదము వెంకటాచలయ్య, మన్నవబుచ్చయ్యపంతులు మున్నగువారల సంగ్రహ జీవితములు వ్రాసి, ఆంధ్రపత్రికలో ముద్రింపించితిని.

"ఆంధ్రహరిజనసేవాసమితి" ప్రచారకవర్గమునుండి పిలుపు రాఁగా, నేను నవంబరు ౨౪-వ తేదీని గుడివాడవెళ్లి, అచ్చట ౨౫-వ తేదీని, ఆ మఱునాఁడు బందరులోను, మూఁడవరోజున చవటపాలెము లోనుజరిగిన సభలలోఁ బాల్గొంటిని. ఇట్లు విశ్రాంతి ననుభవించుచుండు నేను, పరిస్థితులప్రభావమున వ్యాసములు వ్రాయుటకును, ఉపన్యా సము లిచ్చుటకును బూనుకొని, దేశాటనమునకుఁ గడంగితిని. ఇట్లే ఆడిశంబరు ౯-వ తేది మొదలు ౧౪ వఱకును నేను పై సమాజ ప్రచారకవర్గముతోఁగూడి విశాఖపట్టణము, చోడవరము, అనకా

పల్లి, విజయనగరము, శ్రీకాకుళము, ఛత్రపురము, బరంపురము, పర్లాకిమిడిపట్టణములకుఁ బోయి, అచట అస్పృశ్యతానివారణమును గురించి జరిగిన సభలలో పాల్గొంటిని. నే నిదివరకు కళాశాలాధ్యాపకుఁడనుగనుండిన పర్లాకిమిడి విజయనగరముపురములలోను, తదితర ప్రదేశములలోను ప్రాఁతస్నేహితులను, ప్రాఁత విద్యార్థులను జూచి మిగుల సంతోషించితిని.

డిసెంబరు ౨౮-వ తేదీని గుంటూరునకు "అఖిలభారత హరిజన సేవకసమాజము" వారి కార్యదర్శియగు అమృతలాలు ఠక్కరుగారు స్నేహితులతో గుంటూరువచ్చి యొకరోజు నిలిచియుండిరి. ఆ సమయమున మా తమ్ముఁడు వెంకటరామయ్యయును వచ్చెను.

అస్పృశ్యతానివారణోద్యమమును గురించి ప్రచారము చేయుట నా కిపుడు నిత్యవిధి యయ్యెను. జనవరి ౬-వ తేదీని నేను, నా పూర్వమిత్రులగు బంకుపల్లి మల్లయ్యశాస్త్రిలు గారితోఁ గలసి నరసారావుపేట వెళ్లి, అక్కడ సభచేసి వచ్చితిని. ౧౨-వ తేదీని కట్టెంపూడిలోను, చేరువనుండు తాళ్లపాలెము పంచమాశ్రమము నందును సభలు చేసితిమి. ఈ పంచమాశ్రమవాసులు శ్రీ బాపినీడు, రంగనాయకులు మున్నగు వారికిని నాకును ఫలాహారమిడిరి.

తమ్ముఁడు కృష్ణమూర్తికి జ్వరము వచ్చుచుండెనని తెలిసి, నేను ౧౯౩౩ సం. జనవరి ౧౬-వ తేదీని నరసాపురము వెళ్లితిని. అతనికి క్రమముగ నెమ్మదిపడఁగా, ఆ ప్రాంతములకు ప్రచారమునకు వచ్చిన శ్రీయుతులు నాగేశ్వరరావు, బాపినీడు, చెరుకువాడ వెంకట నరసింహముగార్లతోఁ గలసి, నరసాపురము, భీమవరము, వేండ్ర,

తణుకు మున్నగు ప్రదేశములుపోయి, అస్పృశ్యతానివారణమును గుఱించిన సభలలో పాల్గొని వచ్చితిని.

మరల పై ప్రచారకసంఘమువారితోఁ గూడి, ౬-వ ఫిబ్రవరిని మద్రాసు బయలుదేఱి, గుంటకల్లు, ఉరవకొండ, అనంతపురము, ధర్మవరము, మదనపల్లియును తిరిగితిని. పోవునపుడును వచ్చునపుడును చెన్నపురిలోని మా పిల్లవాండ్రను జూచితిని. నెల్లూరు, అల్లూరు, కావలిలోను, శ్రీ బాపినీడుగారితో సంచారముచేసి, నేను ౨౯-వ తేదీకి గుంటూరు వచ్చితిని. మార్చి ౧౦-వ తేదీని గుంటూరులో మా యింట జరిగిన “మండల హరిజన సేవాసమితి” మహాసభలో నూతన సంవత్సరమునకుఁ గ్రొత్తకార్య నిర్వాహకవర్గ మేర్పడెను. ఈ వేసవియందును, ముఖ్యముగ గాంధిమహాత్ముని యుపవాసకాలమందును, నేను భీమవరము ప్రాంతములందు హరిజనోద్యమ ప్రచారమును సలిపితిని.

---

# సింహావలోకనము

"కథ కంచికిఁ బోయె, మన మింటికి వచ్చు" సమయ మయినది. తెంపులేని యీ దీర్ఘవృత్తాంతము నోర్పుతో నూఁకొట్టిన పాఠకసుజనుల వీడ్కోలు నే నందవలయును. జీవితమందువలెనే నాజీవితచరిత్రమందును గల లోపములు వారిపు డెఱుఁగనివి లేవు. నాకు సాధ్యమయినరీతిని నా జీవితకథను జెప్పితిని. పాఠకు లిందలి మంచిని గ్రహించి, చెడు గున్న సైరింతురు గాక!

వయోవిద్యానుభవములతో నాగుణశీలముల కెట్టి పరిణామము గలిగెనో చదువరులు గమనించియున్నారు. అన్నిటికంటెను నామత విశ్వాసములందలి పరివర్తనమె మిగుల స్ఫుటముగఁ దోఁచును. బాల్య కాలమునందలి వైష్ణవక్రైస్తవవిశ్వాసములు యౌవనమున బ్రాహ్మ ప్రార్థనసమాజాదర్శరూపము దాల్చినను, పూర్వవాసనలు పిమ్మట పూర్తిగ వీడెనని కాని, పరిణామకార్య మింతలో నిలిచిపోయె నని కాని చెప్ప వలనుపడదు. లోకానుభవము హెచ్చినకొలఁది, బ్రాహ్మ మతోద్బోధకమగు పరిశుద్ధాస్తికాదర్శముల పోఁకడలు, బ్రాహ్మ సమాజమునందె కాక, మాతృసంఘమునందును నా కనులకు గోచ రించెను. ఇంతియ కాదు. కొన్ని సమయములందు క్రొత్తగ నెలసిన సమాజములలో నూతనాశయములు వేవేగమె వన్నెవాయుటయు, మాతృసంఘమె యుదారనవీనభావములతో భాసిల్లుటయు మనము గాంచుచున్నాము. కావుననే, హిందూమతముపట్ల యౌవనమున

నాకుఁ గలిగిన నిరసనము నానాట తొలఁగిపోయి, అందలి యుత్కృష్టాదర్శములు హృద్యము లయ్యెను. భగవంతునిప్రాఁపున సంసారయాత్రయందు ధన్యులు కాఁగోరువారు, నామరూపముల విషయమై లేనిపోని దురభిమానములకు లోనుగాక, సర్వమతధర్మ ములను సాధనములుగఁ జేకొని సత్యము గ్రహింపవచ్చు నని నేను దలంచితిని.

ఇరువదవ సంవత్సరమందువలెనే యిరువది దాటినప్పుడును, సంఘసంస్కరణము నా కభిమతవిషయమె. ఐనను, సంస్కరణాశయ ములు సాధనప్రణాళికలును కాలానుసారముగ మార్పులు చెందవలె ననియె నానమ్మకి. సాధ్యమగునంతవఱకు, ఉదారజాతీయాదర్శముల కును సాంప్రదాయములకును ననుగుణ్యములగు పద్ధతులె సంస్కర్త యవలంబించుట యుక్తమని నాకు నచ్చెను. స్త్రీపునర్వివాహము మొదటినుండియు నాయభిమానసంస్కరణము. కాని, యిందలి ప్రణా ళికలో స్వతస్సిద్ధమగు కష్టములు కొన్ని గలవు. వధూవరుల శీలప్రవ ర్తనములు మునుముందుగఁ గనిపెట్టు టసులభముకాదు. పెండ్లికాయిత మయిన స్త్రీపురుషుల పూర్వోత్తరములు యోగ్యతాయోగ్యతలును సమగ్రముగఁ దెలిసికొనక, ఒకరిగుణము లొకరు గ్రహింప వారికిఁ దగు నవకాశము లొసంగక, వేగిరపాటున సంస్కర్తలు వారికి వివాహ బంధ మొనఁగూర్చుటవలన, మన దేశమునందు పలుచోట్ల నీ సంస్క రణమున కపయశస్సును, వధూవరుల కసౌఖ్యమును బొటిల్లుచున్నవి. ఇట్టి లోపములు నివారించినయెడల, దేశాభ్యుదయమున కావశ్యక మయిన వితంతూద్వాహసంస్కరణము జనసమ్మత మగును. సామాన్య వివాహములవలెనే వితంతూద్వాహములును స్వగృహమున వధూవరుల

జననీజనకులు పరిపూర్ణామోదమున జరిపి, యీసంస్కారణమును జయప్రదముగఁ జేయవలసిన సమయము వచ్చినది.

హిందూసంఘశ్రేయోభివృద్ధికి హరిజనోద్ధరణ మత్యంతావశ్యకమని ప్రప్రథమమునుండియు నే నెంచువాఁడను. గాంధిమహాత్ముఁడు, మాలవ్యాపండితుఁడు, బిర్లామహాశయుఁడు మున్నగు దేశనాయకు లిటీవలఁ గావించిన ప్రబోధమహిమమున, భారతీయులహృదయములం దిపుడు ప్రబలసంచలనము గలిగెను. అస్పృశ్యతాభిమాన దాస్యము నుండి దేశమాత విముక్తినొందు విషయమున దేశారాధకులు సల్పు ప్రచారమున నేనును గొంత పాల్గొనుచు వచ్చితిని.

స్వకీయాచర్యానుసారణముతోపాటు పరుల విశ్వాసములపట్ల సహనగౌరవములు నే నలవఱచుకొంటిని. తాను హిందూమతానుగుణ్యమగు భక్తి గలిగి, సంఘసంస్కారణవిషయమున నానాట సానుభూతి గాంచి, నాభార్య తోడిస్త్రీల హృదయసీమల విశాలభావములు వెలయించుట కిటీవల కొంతకాలమునుండి కృషి సల్పుచుండెను.

విద్యాబోధకవృత్తిని గూర్చిన నా యభిప్రాయానుభవముల నించుక ప్రస్తావించెదను. చిన్ననాఁడు నే ననుకొనినట్టుగ పాఠశాలావరణమునకు వెలుపలి ప్రదేశము పాపభూమి కాదనియు, వ్యక్తులంగు పవిత్రత్వాపవిత్రత్వములు నియతములు కావనియు, సంకల్పశుద్ధియు సామాన్యముగ నేకార్యప్రాశస్త్యమునుగాని నిర్ణయించుననియు నా నాఁ నాకు నచ్చెను. లోకములోవలెనే బోధకలోకమందును మేకవన్నె పులులు లేకపోలేదు. కాని, పరుల సంకుచితాశయములు పామరకృత్యములు నొరవడిగఁ గైకొనవలదని సదా నేను మానసబోధ గావించుకొనువాఁడను. కీర్తిధనాదులనుపరమావధిగ నెంచక, వృత్తి నిర్వహణమె

ధర్మ నిర్వహణముగఁజేకొని మఱివిద్యాబోధనమొనరింపఁ బ్రయత్నించుచు వచ్చితిని. జ్ఞానస్వీకారమున నుత్తేజిత చేతస్కులగు శిష్యుల ముఖావలోకనము నిరతము నాకుఁ గనులపండువుగ నుండెడిది. కాని, యిది రానురాను క్రమశిక్షణధర్మనిర్వహణములకు భంగకరమగు సుఖలోలత్వవ్యసనముగఁ బరిణమించిన తరుణము వృత్తివిరామమున కదనని గ్రహించి, విశ్రాంతి చేకొంటిని.

కళాశాలాదినములనుండియు,సంతతకార్యనిమగ్నతకు నేనభ్యాసపడియుంటిని. నా గురువర్యులగు వీరేశలింగముపంతులుగారి సహవాససద్బోధనములుకూడ నా కీవిషయమున నమితసహకారు లయ్యెను. సోమరితనము వృథాకాలక్షేపము నా కాబాల్యశత్రువులు. చదువుచునో వ్రాయుచునో, వ్యాయామమందో, విద్యాపరిశ్రమమందో, కర్మకాండలోనో, జ్ఞానకాండలోనో, కాలము గడుపుట నా కభ్యాసమయ్యెను. ఇట్లు మెలంగుట నాకు శ్రేయస్కరము నారోగ్యప్రదము నయ్యెను. నా ప్రబలశత్రువులగు దుస్సంకల్పముల నరికట్టుటకును, సత్పథమున సాగిపోవుటకును నా కిదియె పరమసాధన మయ్యెను. ఇంతియకాదు. అంతకంత కీచిరకాలాభ్యాసము నుల్లంఘించుటయె నాకు బాధాకరమయ్యెను. కాలు కదపక, కలము సాగింపక, మనస్సు పరిశ్రమింపక యుండు నిర్బంధవిపరీతవిశ్రమ మెవరికైన శాంతి సౌఖ్యము లొనఁగూర్చినఁ గూర్చుఁగాక. నాకుమాత్ర మది కేవల దుర్భర దుస్థితియె!

దీనికి సంబంధించిన యింకొక సంగతి యిటఁ బ్రస్తావించెదను. చిన్ననాఁటనుండి నేఁటివఱకును ప్రతిదినము చాల దూరము షచేరము నకుఁ బోవుట నా యలవాటు. ఇది కాలుసాగుటకు గాలి పీల్చుటకు నేర్పడిన సాధకవిశేషమె కాదు. భవబాధ లొకింత మఱచి, మనస్సు

శాంతి వికాసము లందెడి పవిత్రసమయ మిది. ప్రకృతిసౌందర్యములఁ గ్రోలి, ఆత్మ పరమాత్మానుసంధాన మభిలషించెడి పుణ్యకాల మిది. రచనాప్రణాళికయు కథాసంవిధానమును మనమున నే నేర్పఱుచు కొను సుసమయ మిది. అధిక మనఃక్లేశమునఁ గాని, కార్యభారమునఁ గాని డస్సిన స్థూలసూక్ష్మశరీరములకు సంధ్యాసమయమందలి నాదీర్ఘ విహారములు పునరుజ్జీవన మొసంగుచుండెడివి.

ఇవ్విధమున నా జీవితము గడచిపోయెను. నాకన్నులకే మిగుల లోపభూయిష్ఠముగ నున్న యీ జీవితము, స్వచ్ఛమును నాదర్శ ప్రాయము నని నే నెట్లు మురియఁగలను? ఐన నీకథ యెవరి కేమాత్ర ముగ నుపకరించినను, నేను ధన్యుఁడను. ముందును దయామయుఁడగు పరాత్పరుని ప్రాఁపె జీవితయాత్రయందు నాకుఁ జేయూఁత యగుఁ గాత!

---

# ఆత్మచరిత్రము

## అనుబంధము ౧. పూర్వలేఖలు

---

### (౧)

రాజమండ్రి, ౧౮-౪-౧౮౯౫:—

ప్రియసోదరా,

దయగల మీ ౧౬-వ తేదీ యుత్తరమునకు వందనములు. నిజమె, నేనొక పక్షముదినములు జ్వరముతో బాధపడితిని. ఇపుడైనను పూర్తిగా నిమ్మళించలేదు.

ఈ సెలవులలో త్వరలో మీరును నాచెల్లెలుగారును ఇక్కడకు వచ్చెదరని వినుటకు సంతోషము. మీరు యమ్.యే. కు చదువుచున్నట్టు మీతమ్ముడుకూడా చెప్పినాడు. ఆరోగ్యము సరిగానున్న యెడల మీరు చదువవచ్చును. మీకప్పుడు మేలే కలుగును.

చెల్లెలి అనారోగ్యమును గురించి తెలిసి విచారించుచున్నాను. ఆమె యిచటికి వచ్చినపుడు మందిచ్చెదను.

* * * *

నాయప్పు తీర్చునందుకు విచారింపవద్దు. స్థితిగతులు బాగుపడినప్పుడు మీ రీయవచ్చును.

నాపిల్లల యారోగ్యమును గురించిన కుశలప్రశ్నములకు వందనములు. దైవానుగ్రహమువలన వారారోగ్యవంతులుగనే యున్నారు.

మీరిచటికి వచ్చినపుడు మంచిపుస్తకములు రెండిచ్చెద మని చెప్పినందుకు వందనములు. వానివల్ల లాభ మందగోరుచున్నాను. * * శ్రీ సుబ్బయ్య పాపయ్యగార్లు ఇక్కడనే యున్నారు.

—ప్రేమాన్వితుడు, త. రంగనాయకులు.

(౨)

రాజమండ్రి, ౧౬-౧-౧౯౫౬:—

ప్రియసోదరా,

నా సెలవును గురించి చిక్కులు వచ్చినవి. ఐనను భయము లేదు. శ్రీ ఇ. నరసింగరావుగారిపుడు గుంటూరులో లేరు. జబ్బుపడి పాలకొల్లులో నున్నారు. ౧౯-వ ఫిబ్రవరివరకు సెలవు తీసికొన్నారు. అప్పటివఱకు నేను వారియింట్లో నుండవచ్చు నని చెప్పుచున్నారు. ఈమధ్యగా నేనే నచటికి వెళ్లినట్లయితే, వేరొక యిల్లు మనమే కుదుర్చుకోవచ్చును. బహుశః నాకు సెలవుదొరకక, ఉద్యోగము పోవునేమో! ఏమైనను సరే, నాఆరోగ్యమునకై నేను గుంటూరు పోవలెను. అది ఆవశ్యకము. నన్నుగురించి రాష్ట్రీయ వైద్యాధికారితో ఉత్తర ప్రత్యుత్తరములు నడచుచున్నవి.

—స. మృత్యుంజయరావు.

(3)

శ్రీరాములు

రాజమండ్రి, ౧. అక్టోబరు ౧౯౫౬:—

చిరంజీవులయిన రాయసం వెంకటశివుడును సుబ్బారాయుడు చిరాయువులుగాను దీవిస్తిని. త. అంతా క్షేమం. యీ బ౫ ఆది

వారం మీ అప్ప తాళ్లపూడి వెళ్లి కృష్ణయ్యభార్యను తీసుకువచ్చి నది. యేలూరుసాహేబు రేయలీడ్రెస్సరుగారికిన్ని చూపించినాము. మహాజ్వరంచాత రక్తం తక్కువైనదని చెప్పినారు. * * బాల సూర్యోదయం మొదలయినవి యిప్పిస్తే ౨౦ రోజులలో నిమ్మళిస్తుంది. * * నీవు యెప్పుడు వచ్చేదిన్ని వ్రాయించవలెను.

—రా. సుబ్బారాయుడు.

(౪)

౬-౪-౧౯౦౧:—

మహారాజశ్రీ అన్నయ్యగారి సన్నిధికి, చెల్లెలు కనకమ్మ వందనములు. ఇక్కడ అంతా కులాసాగానే ఉన్నారు. మీరు నిన్నటి వరకు ఇక్కడకు వచ్చెదరని తలచితిమి. అట్లు జరిగినదికాదు. చిన్న అమ్మాయి వెనుకటివలె ఏడుపు మొదలైనవి మానుటయేకాక, ఆటలు, నవ్వును! ఉగ్గు మొదలగు చిన్నచిన్నమాటలను నేర్చి కొంచెము ధృఢపడినది. మీరును వదినగారును త్వరలోనే చూడ ప్రయత్నించెద రని తలచెదను. మీరు ఇక్కడకు వచ్చునప్పుడు, పిల్లకు ఒక కాసు ఒత్తులును, కాళ్లకు పెట్టుటకు గజ్జెలును, మా వదినగారితో చెప్పి చేయించ కోరెదను. తప్పకుండా చేయించకోరెదను. అప్ప ఇప్పుడు బాగానే ఉన్నది. చిత్తగించవలెను.

—కనకమ్మ.

(౫)

రాజమండ్రి, ౩-౮-౧౯౦౧:—

అన్నయ్యకు, ఇక్కడ అంతా క్షేమం. మనతల్లిని చెల్లెలిని ౨౬-వ జూనున వేలివెన్ను తీసికొని వెళ్లి, దిగబెట్టి, ౧-వ తేదీకి వచ్చి

తిని. వాళ్లను వెంకయ్యమామ ౫౹ తేదీకి తీసుకొని వచ్చును. ఏడు రూపాయిలకుపైగా కరీదు గల పుస్తకములు కావలసి, మద్రాసు వ్రాసితిని. పుస్తకములు వచ్చినవి కాని డబ్బులేదు. ఈరోజుననే స్వాజీతము పదిరూపాయిలు చెల్లించితిని. కాబట్టి నాపేర ఎనిమిది రూపాయిలు నీవు పంపవలెను. "ఆంధ్రకవులు" ౩-వ భాగము నాకు పంపవలెను. * * మన కనకమ్మ అత్తవారిలో నున్నది. మంత్రిరావు వెంకటరత్నము వచ్చినాడు కాని, చెల్లెలిని తీసికొని రాలేదు.

—రాయసం సూర్యనారాయణ.

(౬)

హిందూ సంఘసంస్కారిణి - బొంబాయి, ౫౹ నవంబరు ౧౯౧౧:—

ప్రియులగు వెంకటశివుడుగారికి, "ఉపాధ్యాయునివిధుల" ను గూర్చిన మీ వ్యాసము పంపినందుకు వందనములు. మీ వ్యాసము లన్నిటివలెనే యిదియును చక్కనిభావములతోను హితోపదేశముల తోను విలసిల్లుచున్నది. అది మీ కోరికచొప్పున మా పత్రికరాబోవు సంచికలలో ప్రచురింపబడును.

"హిందూసంఘ సంస్కారిణి"ని సుభించిన మీ యభినందన ములకు వందనములు. బొంబాయికి వచ్చినపిమ్మట మాపత్రిక చందా దారు లెక్కువయైరని వినుట మీకు సంతోషదాయకముగ నుండును. మీవంటి విలేఖకుల వ్యాసములుండినచో పత్రిక యింకను వృద్ధి నొందును. కావున మీరేమివ్రాసినను సంతోషింతును. చిన్నదని మీరు సందేహింపవలదు. ఒకి పేరా అయినను పంపవచ్చును.

వరదాచార్యులుగారిపుడిక్కడ లేరని చెప్పుటకు చింతిల్లుచున్నాను. క్షయవ్యాధివలన బాధపడుచుండుటచేత, ఇక్కడకు వచ్చినవెంటనే ఆయనను బొంబాయివిడిచిపొమ్మని వైద్యులు చెప్పివేసిరి. కొంతకాల మతడు బళ్లారిలోనుండి, యిపుడు చెన్నపురివెళ్లిపోయెనని వినుచున్నాను. కాబట్టి మామద్రాసు ప్రవాసకులసంఖ్య రెండుక్రింద తగ్గిపోయెను. గంటి లక్ష్మీనరసింహముగారు నేనును మాకార్యాలయమున నొకగదిలో నున్నాము. మీసందేశ మిపుడే యాయనకు దెలిపెదను. ఇంటియొద్దనుండు మిత్రులు మమ్ము మరచుపోవుదురేమోకాని, మేము వారినిమాత్రము మరచిపోవుటకు వీలులేదు.

—సుహృదుడు, కె. నటరాజను.

(౨)

బండోర, ౧౯-వ తేది నవంబరు, ౧౯౦౧:—

ప్రియమైన వెంకటశివుడుగారికి, మీరంపిన వ్యాసములకై వందనములు. ముందునుండి మీకు మాపత్రికప్రతులు రెండేసి పంపెదము. మీమిత్రుల కొకప్రతి మీరు పంపవచ్చును.

సర్కారులనుండి 'వార్తలు వ్యాఖ్యలు' ను క్రమముగా పంపుచుండుడని మిమ్ము గోరుచున్నాను. ఈపత్రిక కవియొక విశేషమయి, దాని యుపయోగమును హెచ్చింపగలవు.

విద్యాబోధకుని గుఱించిన మీవ్యాసము మిగుల చక్కగనున్నది. శైలి సొగసుగను, నిర్దుష్టముగను నున్నది. వాదన సహేతుకముగ నున్నది. ఎపుడును మీశ్రేయస్సు వినగోరు, మిత్రుడు.

—కె. నటరాజను.

(౮)

"బ్రహ్మకృపా హి కేవలం"

సికందరాబాదు, ౨౨-వ ఏప్రిలు ౧౯౦౫:—

* * * *

ప్రియసహోదరా, అతి బాల్యముననే కాలగతి నొందిన తమ్ముని (సూర్యనారాయణను) గుఱించి, బ్రదికియున్న మనకు వేదనయు, హృదయపరితాపమును! కొఱగానిదీపమె ప్రమిద యడుగు వఱకును కాలునట్లు కానబడును. కాని, అతనికిమాత్రము అది యింటికి దెసకు పయనమె! మంచి సువాసన లిచ్చు గులాబి, యజమాని పూజకై కోయబడినట్టులె! ఇట్టి తలంపునందె యోదార్పుగలదు. లేనిచో, యాలోచన కష్టమయమును, భావనకు బాధాకరమును, అన్నిటికి నాటంకమును! మనము శోకింపకుండ నుండలేము. దైవమును విశ్వసింపక తప్పదు. ఈశ్వరుఁడు మనకు శుభాశయములు పూరి గొల్పును గాక!

మీకు పరీక్షాధికారియుద్యోగము తప్పిపోయినది. దీనికి కారణము మీ శరీరాస్వస్థతమాత్రమె నావిచారము. బోధించుటయెగాని, పరిశోధించుట మీ విధ్యుక్తము గాదు. దయామయుఁడగు సర్వేశ్వరుడు మీకు చిరాయు వొసగి, ధర్మపథమున నడిపించుఁగాక!

"సంఘసంస్కారిణీ" పత్రికలో ముద్రితమయిన బుచ్చయ్యపంతులుగారిని గుఱించిన మీ లేఖ మద్రాసు సమాజసభ్యులలో గొందఱికి కష్టముగ నున్నది. కాని, మీవ్రాత సత్యమునుండి దూరస్థము గాదని నానమ్మిక.

త్వరలో మీరు ప్రేమాన్వితులగు శ్రీ వీరేశలింగము పంతులు గారి జీవితచరిత్రము ప్రచురింపనున్నారని వినుటకు సంతోషము. నాకు మూడుప్రతులు పంపగోరుచున్నాను. ఈవిషయమున మీకు గావలసిన సాయమును సంతోషపూర్వకముగ నేను జేసెదను. అది నాకు విధ్యుక్తము, గౌరవప్రదమును.

చెన్నపురి రాజధానిలోని ఆస్తిక మతప్రచారమునుగూర్చి మద్రాసు బ్రాహ్మసమాజమువారు ప్రచురించిన ప్రణాళికను మీరు చూచియే యుందురు. దానిని గురించి మీయభిప్రాయము విపులముగ వినగోరెదను. ఈవిషయమై కొంత పని జరుగవలెనని కోరుచున్నాను.

మీరంపిన 'మనస్తత్వపరిశోధకసంఘము' వారి ప్రచురణము లందుకొన్నాను. ఇప్పటికి ముందుగామాత్రము నా సగము చందా పంపలేనందుకు చింతిల్లుచున్నాను.

మాయమ్మ యథాప్రకారముగనె, మిగుల బలహీనగ మంచము నంటిపట్టుకొనియున్నది. దైవానుగ్రహమువలన మాయమ్మాయి బాగానే యున్నది.

—మీసోదరుడు, ర. వెంకటరత్నము.

(౯)

రాజ్యలక్ష్మీవిలాసము-పరశువాకము, మద్రాసు, ౨౫. మే. ౧౯౦౭:—

ప్రియులకు, సంఘ సంస్కరణ మహాసభాధ్యక్షక పదవి వలదని మొదట చెప్పివేసితిని స్నేహితులు పట్టు పట్టుటచేత, నాకు సందేహము లున్నను తుదకెటులో సమ్మతించితిని. ఇప్పుడైనను, ఈ గౌరవమునకు నే నర్హుడను గాననియే తలంచుచున్నాను. ఈ సభ జయప్రదముగ చేయవలసిన భారమంతయు దేశోద్ధారణమును గురించి

పాటుపడు మీబోటివారలమీదనే యున్నది. ఆ సమయమున మన మిత్రులు పలువురు వచ్చెదరని నమ్మెదను. నా చరిత్రము నాంగ్ల గ్రంథరూపమున మీరు ప్రచురింతురని "సంఘ సంస్కారిణీ పత్రిక" లో ప్రకటనయున్నది. మీకు గావలసిన పరికరము లున్నవా? నేను నా "స్వీయ చరిత్రము" న రెండు ప్రకరణములు వ్రాసితిని. ౪౦ పుటలు అయినవి. అవి మీకు బంపనా? మీ కళాశాల యెపుడు తీయుదురు?

—మిత్రులు, కం. వీరేశలింగము.

(౧౦)

మద్రాసు, ౨౮. జూలయి, ౧౯౧౫:—

ప్రియమిత్రులకు, మీరు పంపిన పదిరూపాయిలు చేరినవి. వందనములు. మీ ఆరోగ్యము సరిగా లేనందుకు విచారము. త్వరలో బాగుపడునని తలంచెదను. మీ స్థితిగతులు నాకు బాగా తెలిసియే యున్నవి. నాకు మీరు ధనసాహాయ్యము చేయగలరని నే ననుకొనుట లేదు. ఆ విషయమై నాచేత నైనంత నాకు నేనే చేసెదను. సహాయకుల కొఱతయే నన్ను బాధించుచున్నది. నా తదనంతరము వితంతు శరణాలయ మెట్లు జరుగునా యనియే విచారించుచున్నాను. నా బలహీనతను బట్టి చూడగా, త్వరలోనే నాకు మరణము సంభవించునని తలంపవలసియున్నది. అన్నిటియందును దైవ సహాయమునే నే నాశించుచున్నాను. ఎదురుచూడని దిక్కునుండి యీశ్వరానుగ్రహముచేతనే కార్యసాధకులును రాగలరు.

సౌ. సీతమ్మగారు రచించిన పుస్తక ప్రతి మీకు అందినదా? ఆరోగ్యమున కామె యిచ్చటనే యున్నది.

—కం. వీరేశలింగము.

(౧౧)

"బ్రహ్మకృపా హి కేవలం."

రాజమండ్రి, ౧౭-వ తేది డిశంబరు ౧౯౦౩

ప్రియసోదరులకు, మీరు ౯-వ తేదీని వ్రాసిన ప్రియమగు లేఖ అందినది. నా కథకు రాకపూర్వము, మిమ్ము్మను నేను అభినందింపవలసియున్నది. ఆస్తియంతయు విక్రయించి, ఎంతో శ్రమపడియును, మీరు ఋణవిముక్తులగుట సంతోషదాయకము. ఈసంగతి మీకును, మీ శ్రేయస్సును గోరు మిత్రబృందమునకును మనోధైర్యమును, చిత్తశాంతియును గలిగించుచున్నది. ధనికుఁ డగుట ప్రతివానికిని సాధ్యముగాదు. సామాన్యస్థితిలోనుండి తృప్తి నొందుటయే యుత్తమపద్ధతి యని పెద్ద లందురు.

* * * *

మన్యపుజ్వరముచేతను, అతిదారుణమువలనను దేహమునిండ కురుపులువేసి, ఒక సంవత్సరమునుండి నేను బాధపడుచున్నాను. * * ఐదునెలలవఱకును నేను మంచము నంటిపట్టుకొని, నాచేతులతో నేను అన్నముకలిపి తినలేకపోతిని! నాప్రాణముమీద మావాళ్లు ఆశ వదలివేసిరి * * జ్వరము కురుపులకుతోడు నంజుకూడా అంత కనబడినది. * ఇపు డింట్లో కొంచెము నడువగలను. ఈవైద్యమువలన నా కురుపులు మానినవి. ౨౭-వ తేదిని చెన్నపురిపోయి, రక్తపరీక్ష చేయించుకొనవలె నని యున్నది. ఆరోగ్యమున్న యెడల సంఘసంస్కరణసభకుఁ బోవలెను. సాధ్యమయినచో మీరును రావలెను.

—రెబ్బాప్రగడ పాపయ్య.

(౧౨)

పరశువాకము, మద్రాసు, ౨౨-వ తేది ఏప్రిలు ౧౯౦౮:—

ప్రియస్నేహితులకు, మీ ప్రేమపూర్వకమగు లేఖకును, పంపిన సొమ్మునకును, వందనములు.

౧. నాచరిత్రమును గురించి: కొలఁదికాలములోనె నాకు మృత్యువాసన్నమగునని నేను దలంచెదను. లాభకరమని యెంచినచో, మీరు నాజీవితచరిత్రము నామరణానంతరమె, వ్రాయవచ్చును. నేనింకను భూలోకమున చేయవలసిన పని యున్నదని తోఁచినతప్ప, కార్యపూర్తి చేసిన నన్ను దైవమిఁక పరలోకమునకుఁ గొనిపోవచ్చును. నేనింతకాలము జీవింతునని చిన్ననాఁ డనుకొనలేదు. నాకీచిరాయువొసంగినందు కీశ్వరునికి కృతజ్ఞుఁడను. నేను సందేహించుచున్నను, నా "స్వీయచరిత్రము" ను వ్రాయుఁడని పలువురు నన్ను గోరుచున్నారు. నేను మీకొకసారి వ్రాసినట్లుగా, ఈవిషయమై కృషి చేతునని నేనంటిని. నావాగ్దానము నేను చెల్లించుకొనవలెను. రాబోవు వేసవిసెలవులలో నా సంగ్రహజీవితచరిత్రను వ్రాసి, మీకుఁ బంపెదను. నేను దినచర్యపుస్తకము లుంచలేదు. కాఁబట్టి నేను వ్రాయుదానివలన, మీయుద్యమమునకుఁ గొంతలాభము గలుగవచ్చును. మీ రది చదివినపిమ్మట, మీ కింకను సంగతులు కావలసినచో, అప్పుడప్పుడు నాకు వ్రాయుచుండవచ్చును.

౨. మీ "జనానాపత్రిక" ను గురించి: వలసినచో, నాముద్రాలయమున దాని నచ్చొత్తించి, అచ్చుచిత్తులు దిద్ది పెట్టెదను. చందాదారులకుఁగూడ పంపెదను. మీరే పత్రికాధిపత్యము వహింపవలెను.

తీఱికయు, ఆరోగ్యము నున్నచో, అప్పుడప్పుడు నేనొకింత వ్రాయు చుందును. కాని యిది వాగ్దానముగా గైకొనగూడదు.

3. సారస్వతపత్రిక నొకటి నెలకొల్పవలెనను మీ సంకల్పము యోగ్యమయినదె. కాని, యిపుడు 3-౪ పత్రిక లటువంటివి గలవు. మీ ప్రయత్నము నెగ్గవలె ననినచో, అనేకవిషయములను గుఱించి స్వతంత్రములు నుపయుక్తములునగు వ్యాసములు ప్రచురించి, ప్రాచుర్యమున నున్న పత్రికలను మించవలెను. పత్రిక కే పేరైనను సరే. దానికి "చింతామణి" అను పేరైన పెట్టవచ్చును. దానిలోని వ్యాసములె యుద్బోధకములు జనరంజకములుగను నుండవలెను. ప్రస్తుతము నా కారోగ్యముగనే యున్నది కాని, ముం దెటులుండునో తెలియదు. ఈ సంవత్సరాంతమునకు నాయప్పులన్నియు తీర్చివేయఁ గోరుచున్నాను. అపుడు నేను ఉద్యోగవిరామము చేసి, ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికిఁ దోడ్పడవలెను. అపుడు మీరొక్కరుగాని, మనము ఉభయులము గాని, స్థాపించు పత్రికకు సరిగా నెల కొకటి రెండు వ్యాసములు నేను వ్రాయవాంఛించెదను. ప్రస్తుత మివి యన్నియు వట్టి కోరికలె! సఫలము కావచ్చును, కాక పోవచ్చును. ఆంగ్లమున నున్న "ఉత్తమరచయితలతోడి స్వల్పకాలక్షేపము" వంటి పుస్తకములు తెలుఁగులో కూడ నుండవలెను. తీఱిక యున్నప్పుడు దీనిని గుఱించి యాలోచింతము. మీకు ఱొమ్ముపట్టుట బాధగా నున్నందుకు విచారము. శీఘ్రమె మీకు బాధాశమనము గలుగవలెనని కోరెదను. దైవ మీకోరికను సఫలము చేయుగాక!

—కం. వీరేశలింగము.

## (౧౩)

## "బ్రహ్మకృపా హి కేవలం"

సికందరాబాదు, ౨౪-౮-౦౪:—

ప్రియసోదరా, "పెద్దగురువు" (వీరేశలింగముపంతులు) కూడ, దరఖాస్తు చేయు మని నాకు వ్రాసిరి. కావున, ఇష్ట మంతగ లేకయు, ముఖ్యముగ మిమ్మును వారిని సంతృప్తి పఱచుటకై, ఇపుడె నేను దరఖాస్తు నంపుచున్నాను. * *

—మిత్రుఁడు వ - వెంకటరత్నము.

## (౧౪)

రాజమండ్రి, 3-వ తేది, సెప్టెంబరు ౧౯౦౪:—

* ప్రియమిత్రమా, నేను కాకినాడ వెళ్లి, మన మిత్రుని (వెంకటరత్నమునాయుడుగారిని) గుఱించి శాయశక్తుల ప్రయత్నించితిని. నేనచటికిఁబోయిన పిమ్మట జరిగిన పాలకవర్గసభలో, సభికులలో ననేకులు మన స్నేహితుని కాయుద్యోగ మిప్పించుటకు సుముఖులుగ నున్నట్టు గానబడిరి. * * కాని, మన నేస్తునికి విరోధముగ గూడ చాలపని జరుగుచున్నది. తుదకు జయ మెట్లుండునో తెలియదు. పరాజితుల మైనచో, అది మనలోపముచేత కాదు.

—కం - వీరేశలింగము.

## (౧౫)

రాజమండ్రి, ౧౨-వ సెప్టెంబరు ౧౯౦౪:—

* * ప్రియమిత్రులకు, నేను చెన్నపురికి పోవులోపలగా మీ రొకసారి యిచటికి రావలయును. ఇక్కడ "స్త్రీప్రార్థనాసమాజము"

బాగుగ పని చేయుచున్నది. సగటున ౫౦ మంది స్త్రీలు సభకు వచ్చుచున్నారు. క్రొత్తగా కట్టబడిన సమాజమందిరము మీ రను కొనునంత చిన్నదికాదు. అది రెండస్తుల చక్కని మేడ. పై యంతస్తున సుమారు నూఱు స్త్రీలు కూర్చుండవచ్చును. ప్రారంభోత్సవదినమున నిన్నూఱునకు పైగా స్త్రీజనము వచ్చిరి. ఇచట నాభావికార్య క్రమము నేర్పఱచుకొనుచున్నాను. దైవానుగ్రహమువలన నాకృషి యిచట నుపయుక్తముగ నుండునని యాశించెదను.

—కం. వీరేశలింగము.

(౧౮)

సికందరాబాదు, ౨౯-వ అక్టోబరు ౧౯౦౪:—

ప్రియసోదరులకు, ఈశ్వరానుగ్రహమున, మీ యీ సోదరుడు కాకినాడవారి కంగీకృత మయ్యెనని రహస్యతంత్రీవార్తలు చెప్పుచున్నవి. ఈ మేలునకు దైవనామము కీర్తింపబడుగాక! ఇది యింకను రహస్య వార్తయె.

—సుహృదుడు, ర. వెంకటరత్నము.

(౧౯)

రాజమండ్రి, ౩౦-వ మార్చి, ౧౯౦౫:—

ప్రియమిత్రులకు, "జనానాపత్రికా" వ్యవహారములను గురించిన మీ జాబులకు ప్రత్యుత్తర మీయకుండుటకు మిగుల చింతిల్లుచున్నాను. ఈ యశ్రద్ధకు నేను నిందాపాత్రుడను. జరిగినదానికి క్షమింప వేడెదను. రెండునెలల పత్రికలు నొకమాఱుగా ముద్రించు నుద్దేశముతో రెండుసారులు నేను "చింతామణీ" కార్యస్థానమునకు

పోయితిని, అరవజనుసారులు గుమాస్తా నంపితిని. ముద్రిత మయిన కొన్ని కాకితములు కనబడుట లేదనియు, వానికై వెదకెద మనియు, అచ్చువేయువారు చెప్పుచువచ్చిరేగాని, ఫలితము లేకపొయ్యెను. మద్రాసులో పత్రిక నచ్చొత్తించుడని మీ కంతట వ్రాయ నెంచితిని. కాని, యింతలో నేను రోగపీడితుఁడనయితిని. నిస్సత్తువయు కీళ్ల పోటులును నన్ను బాధించెను. అప్పుడు మీ యుత్తరము నా కందినది. రోజునకు రోజు నా జబ్బు ముదిరెను. నా వ్యాధి ప్రబలమై, ఒక పక్షమునాళ్లకును నేను మంచము దిగలేను. నా తుదిదినము లివియే యని నే దలంచితిని. నాలుగైదు రోజులనుండి మాత్రము తోటలో నిటునటు తిరుగ గలుగు చున్నాను. ఇంకను బలహీనముగ నున్నను, దైవకృపవలన చాల నయముగ నున్నది. కడచిన ఆదివారమున "ప్రార్థన మందిరము"న కృతజ్ఞతాపూర్వకప్రార్థనము నేను జరిపితిని. వ్యాధిప్రకోపావస్థలో నేను బ్రాహ్మమతానుష్ఠానము గైకొంటిని.

* * క్రొత్తచందాదారులపట్టికయు సొమ్మును త్వరలో మీకు బంపెదను. నా యీగొప్పతప్పును సైరింపవలెను.

—కం. వీరేశలింగము.

(౧౮)

రాజమండ్రి, ౨౦-వ తేది మే, ౧౯౦౫:—

ప్రియమిత్రులకు, మీ బాబులకును, పంపిన సొమ్మునకును వందనములు. * * శ్రీ పి. రామచంద్రరావుగారు, వారి సతీమణి లక్ష్మీకాంతమ్మగారును నన్ను జూడవచ్చి, నాతోనే యున్నారు. వారు నా యాతిథ్యమున నున్నపుడు, వారి నొంటరిగ వదలి నే నెక్కడ

యస్థికలు సమాధిలో నిక్షేపించు కర్మకాండను జరిపెదము. మీ రాసమయమునకు రావలయును. నా దేహమున సరిగా లేదు. అందుచేత ఏప్రిలు మొదటిభాగముననే నేను బెంగుళూరు పోయెదను.

—కం. వీరేశలింగము.

(౨౨)

రాజమండ్రి, ౧౯-౩-౧౯౧౧:—

ప్రియస్నేహితా, మీ ప్రేమపూర్వక మగు లేఖ నందుకొన్నాను. మీ రంపిన విరాళ మందినదని నేను వ్రాయలేదా? పొరపాటు క్షమింపవలెను. నా "స్వీయచరిత్రము"ను గుఱించి మీకుఁగల సదభిప్రాయమునకు వందనములు. మీ పూర్వగురుమిత్రుని యెడగల యభిమానమె దీనికి గొంత కారణమయి యుండవచ్చును.

రాబోవు నెలలో నరసాపురమున జరుగు కృష్ణా-గుంటూరు మండల సంఘ సంస్కరణ సభకు మీ రధ్యక్షులుగ నెన్నుకొనబడి నందుకు సంతోషించు చున్నాను.

* * ౨౮-వ తేదీ శుక్రవారమునాఁడు బెంగుళూరు పోవు చున్నాను. మార్గమధ్యమున మద్రాసులో శ్రీ గోటేటి కనకరాజు గారి యింట రెండు మూఁడు దినము లాతిథ్య మనుభవింతును.

—కం. వీరేశలింగము.

(౨౩)

భీమవరము. ౧-౯-౧౪:—

అన్నయ్యకు, పనితొందరచేత, ఇదివఱకే వ్రాయలేకపోయితిని. గతించినదానికి వగచిన లాభము లేదు. లోకములో జీవితము

గడుపవచ్చును గాని, లోకవిషయములమీఁది మోహమునబడియుండ రాదు. మనవిధ్యుక్తముల నెఱవేర్చి, ఫలసిద్ధి దేవునికే వదలి వేయవలెను. అశాశ్వతమగు ప్రాపంచిక విషయములను బట్టుకొని ప్రాకులాడక, జ్ఞానియంతచ్చక్షువునువిప్పి, పరమాత్మనే సందర్శింప గోరుచుండును. * * * కావున, మనపిల్లవాని (అబ్బావుని) యకాలమరణమును మఱపుతెచ్చుకొని నీవు చిత్తశాంతితో నుండ వలయును. * * *

—రాయసం వెంకటరామయ్య.

(౨౭)

భీమవరము, ౭-౩-౩౧:—

అన్నయ్యాకు, మీ లేఖకు వెంటనే ప్రత్యుత్తర మీయజాల నందుకు క్షమింపవలెను.

మన కిటీమధ్యగలిగిన విపత్తును (మూఁడవ కుమారుఁడు సూర్య నారాయణుని మరణమును) గుర్తించలేనట్టుగ మొదటిదినములలో నాబుద్ధిని మాంద్యము గ్రమ్మివేసెను! ఆమాంద్యము విడిపోయినకొలఁది నాకిపుడు నాదురవస్థ స్ఫుటముగ గోచరించుచున్నది. జీవితము దుర్భ రముగ నున్నది. చనిపోయిన ప్రియపుత్రునికిఁ జేయవలసిన విధులు చేయక, వానిని మృత్యుదేవత కొప్పగించితినని పొక్కుచున్నాను. ఇంక పాపిష్ఠధనార్జనముచేయుట సిగ్గులచేటని నేను మొగము చాటు వేసి, యిల్లువిడువకున్నాను. నిండుజవ్వనమున నుండు నా ముద్దుల బాలకునిమీఁదికి విధినాథునికి చేతు లెట్లువచ్చెనో! నా యీఘోర పాపమునకు దైవ మీశిక్షనంపెనో గదా!

ఆపసివాని నగుమోము మరల నాకనులపండువు కాగలదా ?

మీరు నదెనయు, తమ్ముఁడు మఱదలును, ఇతరులును, ఆయరక్షకుని గుఱించి యెంత శ్రమనొందిరి! అన్నియు వృథయైపోయినవి. నేనెంత దురదృష్టవంతుఁడను!

*　　　*　　　*　　　*

అమ్మా, పాపము, మాలతి (కోడలు) సంగతియేమి? పలుమాఱు ఆమెనుగుఱించి నేను పలవించుచున్నాను! నావలెనే యామెయు దురదృష్టవంతురాలయ్యెను. నిరపరాధినియగు ఆబాలప్రార్థనలనైన పరమాత్మ్ముఁ డాలకింపలేదే!

—రా. వెంకటరామయ్య.

(౨౫)

వెల్లూరు చెఱసాల, ౧౯-౮-౩౨:—

మిత్రవర్యా, నమస్కారములు. * * ఇక్కడ వర్షములు కొద్దికొద్దిగ అప్పుడప్పుడు కురియుచున్నవి. సౌఖ్యముగను ఆరోగ్యముగను నున్నది. కాలము చక్కగనే గడచిపోవుచున్నది. ఏదియైన వ్రాయుటకు తగినంత యుత్సాహముగాని శక్తిగాని నాకు కనబడుటలేదు. ఏదియో చదువుచు కాలక్షేపము చేయుచున్నాను. ఇచ్చట అందఱును గ్రంథకాలక్షేపము చేయుచున్నారు. కొందరు గ్రంథరచనలును చేయుచున్నారు. ఇదియంతయు నొక్క విద్యార్థి కూటమువలె నున్నది. గొప్పవిద్యార్థి వసతిగృహమని చెప్పవచ్చును. అందరును చాలవఱకు కాలమేమియు వ్యర్థముచేయక, యేదియోనొక పరిశ్రమ చేయుచునే యున్నారు.

—కొండ వెంకటప్పయ్య.

## అనుబంధము : ౨. ఇతరుల దృష్టిపథము

### (౧)

దేశీయ మహాసభా మందహాసములు : గుంటూరు సూర్యనారాయణ ప్రణీతము. ప్రథమభాగము. పుటలు ౪౮-౮౯. విజయనగరము. ౧౯౨౦.

"నేను విజయనగరము కళాశాలలో ప్రథమశాస్త్ర పరీక్ష తరగతిలో నుండిన రెండు సంవత్సరములును తరగతిలో నేను వినిన యుపన్యాసములలో రాయసం వెంకటశివుడు గారు చేయుచుండినవె మిగుల నుపయుక్తము లయినను కాకున్నను, మిగుల హృద్యములుగ నుండెను. * * సామాన్యముగ నేను ఆంగ్లసాహిత్యమున తెలివిగల వాఁడనని యాయన యెఱిఁగియుండినను, నే నాయన కిష్టులలో నొకఁడనుగాను. వారుచేసిన కళాశాలా పరీక్షలలో నొక దానిలోతప్ప నన్నిటిలోను ఆంగ్లమున నా కెక్కువ గుణములు వచ్చెను. ఆయనకు హాస్యరసము మెండుగఁ గలదు. చిక్కులగు సందర్భములం దద్దాని నాయన వినియోగించెడివారు. ఆయన నైసర్గిక నిరాడంబరత్వము, గాంభీర్య రాహిత్యము, శిష్యుల శీల పరిశీలనా విషయమునఁ గల హృదయ వైశాల్యమును విద్యార్థులను రంజింపఁ జేసెను. ఆయన కళాశాలలో మిగుల జనరంజకుఁ డగు నుపన్యాసకుఁడు. మా కోరికమీఁద సాహితీసంఘ సభల కధ్యక్షత ననేకమాఱులు వహించిరి. శిష్యుల శీలప్రవర్తనముల మీఁద నెంతేని నైతిక శక్తి చూపుచుండువారు. ఇట్టి వారలనుండి సదా సదావేశమును నేను గ్రోలుచుండు వాఁడను. కళాశాలాధ్యాపక కార్యములు చక్కపెట్టుకొనుటయే కాక, మెల్లగను నిరాడంబరముగను ఆయన

శిష్యులలో ననేకులను తనచుట్టును జేరఁదీసి, వారికి ప్రార్థన సమాజ విధులను బోధించుచు, ఆదివారమున స్వగృహమున ప్రార్థనలు జరుపుచుండిరి."

(౨)

"గుంటూరు కళాశాలా విద్యార్థి":—౧౫ నవంబరు ౧౯౧౯. గోల్డుస్మితుని "పల్లెటూరి యుపాధ్యాయుఁడు." కే. వి. యస్. శాస్త్రి.

*　　*　　*　　*

"ఇట్టి పల్లెటూరి యుపాధ్యాయుని తా మెచటనైనఁ జూచితేమో విద్యార్థులు జ్ఞప్తికిఁ దెచ్చుకొనవలెను. అంత, వారి మనఃఫలకమున, పొడుగు పొట్టియును గానట్టియు, లావుసన్నముగానట్టియు, మధ్యస్థమయిన యాకార మొకటి గానవచ్చును. అతని దుస్తులు నిష్ఠాపూర్వకమగు శ్వేతవర్ణముగలవి. అతని శీలము విరుద్ధ గుణ సమ్మేళనము. ఆయన హృదయము దయావైశాల్యములు గలయది. కరుణాళువు. సంతోష ముప్పొంగుచుండువాఁడు. అంతులేని యాతని హాస్యరసము పొంగి పొరలుచుండును. ఆతని ప్రేమ గుణమునకు మితిలేదు. మఱి పెఱుఁగని జాగరూకతకును, సునిశితమగు పరిపాలనా శక్తికిని, ఆయన పేరువడసెను. విద్యార్థులకు భయంకరుఁడు, ఆనంద సంధాయకుఁడు కూడను! దయాక్రూరత్వము లతనిలో మిళిత మయియున్నవి. తీవ్రశిక్షకుఁడయ్యును, ఆతని తరగతి యెప్పుడును శబ్దరహితముగ నుండును. ఎవనిమీఁదనైన కోపము వచ్చెనా, పండ్లు కొఱుకుచు, "ఎవఁడురా వీఁడు!" అని గర్జించి, మేజా బల్లమీఁద గ్రుద్ది, అపరాధియగు విద్యార్థిని స్తంభింపఁ

జేయును. కాని, తోడనే యాయన యిరుప్రక్కలను ప్రక్కలు బద్దలగునట్లుగ విద్యార్థుల నవ్వు విన నగును. చేత గోడుగైన బెత్తమైన నున్నచో, అది యపు డెగురవలసినదె! మంచికో చెడ్డకో, ఆయనకోపము చివఱవఱకు కొనసాగవలసినదె. కాని స్నేహము ఆయన యనుగ్రహమునకె నీవు పాల్పడినచో, నీ కాతని స్నేహము, తలవని తోడ్పాటును ప్రాప్తింపఁ గలవు.

"ఆయనజ్ఞానము అపారగాంభీర్యము గలది. నిండుకుండ తొణకని రీతిని, యాయన పాండిత్యము ప్రకటనమును కోరదు. వలసినచో, గణగణమని మ్రోగు పెద్ద పదజాల మతని సొమ్ము! ఇవి యనుభవింపనోచుకొననివానికి, బల్లమీఁద పడెడి యాతని పిడికిలి చప్పుడు, అతని యభినయమును గనులు విప్పును! ఆయనకుఁ గల నటనాసామర్థ్య మపారము. దేవత దయ్యము, సాధుపుంగవుఁడు ఘోర కపటుఁడు, రాజు భిక్షువు, విద్యాధికుఁడు కటికపామరుఁడు, జ్ఞాని పిచ్చివాఁడు, కోప పరితాపానందములు,—ఇవి యన్నియు నొక నోటనే యాయన యద్భుతముగఁ బ్రదర్శింపఁ గలఁడు. ఇపుడైన మాతృకను కళాశాలా విద్యార్థి పోల్పఁగలిగెనా? లేనిచో, గోల్డుస్మిత్తునే సమాధినుండి గైకొని రావలెను!"

[కళాశాలా పఠన మందిరములో విద్యార్థులు ఉపాధ్యాయులను పరిహసించి వ్రాసెడి వ్రాత పత్రికలున్నవని నాకుఁ దెలిసి, అందు నే నొకనాఁడు పై పత్రికను జూచి యది దీసివైచి, ముందిట్టి పిచ్చివ్రాఁతలు వ్రాయవలదని విద్యార్థి బృందమును వారించితిని. తల్లిని కొట్టరా వసంతమనునట్లు, ఒక సీనియరు విద్యార్థి నన్నా పత్రికలోఁ జిత్రింప యత్నించెను.]

## అనుబంధము : 3. వంశవృక్షము

(౧)

- రాముడు (రామయ్య)
  - పద్మరాజు
    - వెంకటరాముడు
      - వెంకన్న
    - శివయ్య
    - * కృష్ణమ్మ
  - గంగరాజు
    - సుబ్బయ్య
      - నాగరాజు (దత్తుడు)
    - నాగరాజు
      - లక్ష్మీనారాయణ

(ఫ)


*కృష్ణమ్మ
గంగన్న
వెంకటరత్నము
భద్రమ్మ
శేషమ్మ
పద్మరాజు
*సుబ్బారాయుడు
వెంకమ్మ
నాగరాజు(దత్తత)
నరసింహము
రామమూర్తి
తమ్మిరాజు
సత్యవతి
శేషమ్మ
కనకమ్మ
నాగరాజు
పాలమ్మ
కృష్ణమూర్తి
పట్టాభిరామయ్య
రత్నమ్మ
చిట్టెమ్మ
వీరభద్రుడు
కృష్ణయ్య
సుబ్బమ్మ
సీతమ్మ
సుభద్ర
రామమ్మ
సీతమ్మ
సుబ్బమ్మ
సాంబశివరావు
నారాయణ
గంగన్న
అచ్చమ్మ